శ్రీ హయగ్రీవాయనమః

# శ్రీ శ్రీవత్సాంకమిశ్రవిరచిత

# పంచస్తవీ

## ద్వితీయ సంపుటము

( శ్రీ సుందరబాహు — శ్రీ వరదరాజ స్తవములు )



కవిశేఖర - మహోపాధ్యాయ - విద్యాలంకార - సాహిత్యరత్న

మధ్వాశ్రీ పళ్లెపూర్ణ ప్రజ్ఞాచార్య విరచిత

భావాదర్శనామకాంధ్ర వివరణ పద్యసహితము


దాసకుటీ

ప్రకాశితము

అంగలకుదురు

మూల్యము : 6-00

శ్రీ సుందరబాహు వరదరాజ స్తవములకుఁగూడ దిక్ప్రదర్శనముగా మనవి చేసికొందును. భగవత్కల్యాణ గుణానుభవమును జేయించుచు భగవత్పాదారవిందముల నచంచల భక్తిని గలిగించుటలో శ్రీకూరేశుల యైదు స్తవములు నద్వితీయములే యైనను ఈ స్తవద్వయమునకుఁ గల విశిష్టత యనన్యాదృశము. దీనియందుఁ గవితాసరస్వతి నిజరూప దర్శన మొసఁగుచున్నది. 'అన్యా దేవాస్య గాంభీర్య మన్యద్ధైర్యం మహీపతేః' అన్నట్లు వరదరాజ స్తవములోని ప్రపత్తి నిష్ఠకొక ప్రత్యేకత గలదు. ఈ స్తవములో 102 శ్లోకములు గలవు. పదిపది శ్లోకముల నొక్కొక్క వృత్తములోఁ జెప్పి సర్వవృత్తములలోను తన కవితాసరస్వతి నిరర్గళముగాఁ బ్రవహింపఁ గలదని యీ కవి యిందు విశదీకరించెను.

ఈ స్తవము మంత్రరత్నమునకు వివరణ మగుటచేఁ బంచ స్తవీమాలకు మణిపూస యగుచున్నది. ఈ విషయము నీ శ్లోకమునకు సంస్కృతమున వ్యాఖ్యాన మొనర్చిన శ్రీ శ్రీనివాసాచార్య విద్వన్మణులు శ్లోకావతారికలలో వివరించియే యున్నారు. దిక్ప్రదర్శనము. 'శ్రీనిధిమ్' అను 21 వ శ్లోకమున 'శ్రీనిధి' పదముచేత మంత్రరత్నస్థ మగు శ్రీమత్పదమును వ్యాఖ్యానించి నారాయణ పదైకదేశమగు నారపదమున కర్థముగా శ్రీ వరదరాజస్వామి నివాసమగు కరిగిరిని ప్రథమ దశకముచేత వర్ణించి నారాయణశబ్దము గుణప్రాచుర్యముచేత శ్రీ భగవానుని వరించినది గనుక ద్వితీయ దశకముచే శ్రీవారి

కల్యాణగుణముల వివరించి దివ్యవిగ్రహ యోగము సైతము నారాయణశబ్దమున కర్థ మగుటవలనను శరణశబ్దముచే నాక్షిప్త మగుటవలనను 33 శ్లోకములచేత నా మూర్ధపాదము శ్రీ స్వామి వారి దివ్యమంగళవిగ్రహ సౌందర్యము ననుభవించి దానితోఁ దనివి చనక విభవావతారములోని వైభవముల నాస్వాదించి యందును నరసింహావతారములోఁ బ్రహ్లాదుని యెడఁ జూపిన వాత్సల్యమునకు రామావతారములోఁ గోసలవాసుల యెడఁ బ్రదర్శించిన కృపకుఁ, గృష్ణావతారమున గోగోపబృందముల వెల్లివిరిసిన సౌశీల్య సౌలభ్యములకు, ముగ్ధులై స్వకీయకృపచే సాధురక్షణార్థము కృతావతారుఁడగు శ్రీ వరదరాజస్వామినే నారాయణశబ్దార్థముగాఁ బ్రతిపాదించి తదీయ చరణంబుల శరణుఁ జెందఁ దలఁచి 'అనుజ్ఞో రావణ స్త్వాహం తేన చాస్మ్యవమానితః త్యక్త్వా పుత్రాం శ్చ దారాం శ్చ రాఘవం శరణం గతః' అని చెప్పినట్లు తాను సమస్తదోష నిలయుఁడనని 18 శ్లోకములతోఁ దెలుపుకొని భగవద్దాస్యైకరసుండై తత్ప్రాప్తికి మంత్రరత్నోక్త ప్రకారము 'వరద! శరణ మి త్యహం త్వాం వృణే' వరద—82 'వరద మురుదయం గతిం త్వాం వృణే' వరద—83 అని శరణవరణ మొనర్చుటచేత నీ స్తవము పాఠకమహాశయులకుఁ బ్రపత్తివిద్యను బోధించుచుఁ దరణోపాయ మగుచున్నది. ఈ స్తవము వ్రాయునాఁటికి శ్రీ కూరేశులు పరిపక్వహృదయులై బ్రహ్మాది పదవులను గూడఁ దృణీకరించి భగవద్దాస్య మహారసజ్ఞులైరి. కనుఁడు.

శ్లో॥ భోగా ఇమే విధిశివాదిపదం చ కించ
స్వాత్మానుభూతి రితి యా కిల ముక్తి రుక్తా ।
సర్వం త దూషజలజోష మహం జుషేయ
హ స్త్యద్రినాథ ! తవ దాస్యమహారసజ్ఞః ॥ వరద—ు ౨।

చ॥ ధనకనకాది వస్తుసముదాయము నందనభూమి నప్సరోం
గనలను గూడుట బ్జభవకంతు విరోధి సురేంద్రపట్టముల్
గొనుటలు, స్వాత్మభోగమనుకొం చెపుముక్తి గిరీశ! యూష రా
వనిజల మట్ల యెంతును భవత్పదదాస్య మహారసజ్ఞతన్.

కనుకనే యీ స్తవమునందుఁ బలుచోట్ల 'ప్రసహ్యా మాం ప్రాపయ దాస్య మేవ తే'—93 'కదా విధాస్యే వరివస్యనం తవ'—91 అని మోక్షమునందు సైతము భగవద్దాస్యముననే ఆరాటపడిరి. ఇట్టి ముముక్షు మూర్ధన్యులగు శ్రీ కూరేశుల కవిత్వములో నా బోటిమూఢుఁడు గుణవిమర్శ మొనర్పఁ బూనుటకు 'న శ్వావలీఢ మపి తీర్థ మతీర్థ మాహు ర్నోదన్య తాఽపిచ శునా న చ లజ్జితవ్యమ్' అని శ్రీవా రొసఁగిన ధైర్యమే హేతువని విజ్ఞులకు విన్నవించుకొనుచు నాకుఁ దోఁచిన కొన్ని కవితాగుణముల నివేదించుకొందును.

3 శ్లో॥ 'సుసుందరభుజాహ్వాయం మధు నిపీయ మత్తా యథా' 'న సురాం పిబేత్' అని వేదము నిషేధించి యుండఁగా విజ్ఞులకు కూరేశు లిట మధుపానమును వర్ణించుటయెట్లు ? అని శంకింపరాదు. ఈ మధువు సుందరబాహుమూర్తియే కావునశిష్టులు గూడ దీనినిఁ గ్రోలవచ్చును.

12 శ్లో॥ వకుళధర సరస్వతీ— ముం దెన్నఁడో పుట్టఁబోవు శఠకోపమునుల ద్రావిడోపనిషత్తుల కిన్నరకాంతలు చాలు కరుగునట్లు గాన మొనర్చి రనుచోఁ గాలదోషము పట్టదా ? పట్టదు శఠకోపమునులు పుట్టి ద్రవిడోపనిషత్తును రచించిన తరువాత సుందరబాహుస్వామివారి సేవ కేతెంచిన కిన్నర కాంత లా యుపనిషత్తును భగవత్ప్రీతికి గాన మొనర్చి రన్న నేదోషమును లేదు.

14 శ్లో॥ పీతాంబరం వరద శీతల దృష్టిపాతం

ఉ॥ పచ్చనిపట్టు బట్ట...

ఏతచ్ఛ్లోక ప్రతిపాద్య దివ్యమంగళ విగ్రహమే శ్రీకూరేశుల యుపాస్యమూర్తిగా స్ఫురించు చున్నది.

17 శ్లో॥ పతిం విశ్వ స్యాత్మేశ్వర మితి— ఈ శ్లోకము వేద వాక్యములతో ఛందోబద్ధముగా నెంత హృద్యముగాఁ గూర్పఁ బడినదో తిలకింపుఁడు.

31 శ్లో॥ నిహీనో జాత్యా వా— ఈ శ్లోకమునఁ గూరేశుల యభిప్రాయములో నున్న జాతిహీనుఁడు వృత్తిహీనుఁడు, అజ్ఞుఁడును సుగ్రీవుఁడని తెలియనగును. నరజాతికంటె వానర జాతి హీనమేగదా! భ్రాతృభార్యాగామిని వృత్తిహీనుఁ డనుటకు నభ్యంతర మేమిగలదు. ఇట్టిపని కొడిగట్టినవాఁ డజ్ఞుఁడు గాక ప్రాజ్ఞుఁడగునా ? ఇట్టి హీనుఁడు సైతము శరణు

చొచ్చినచో 'భజంతం తం పశ్యే ద్భుజగపతినా తుల్య మపి యో' నివాసశయ్యా సనపాదుకాంశుకాది సర్వవిధ కైంకర్యముల కుపయోగపడు శేషునితో సమానునిగాఁ జూచునఁట. చూడలేదా సుందరబాహుస్వామి రాముఁడుగా నవతరించి నప్పుడు సుగ్రీవునితో 'త్వ మస్మాకం చతుర్ణాం వై భ్రాతా సుగ్రీవ! పంచమః' అనుటచేత శేషావతారముగాఁ బ్రసిద్ధుఁడగు లక్ష్మణునితోఁ దుల్యత్వము వర్ణింపఁబడుట సుగ్రీవు ననుగ్రహించుటే గదా! విశేషము శ్లోకవిశేషములందుఁ జూడనగును.

102 శ్లో॥ అనవాప్త మత్ర కిల— ఈ శ్లోకమున ముందు పుట్టఁబోవువారు శ్రీరామునిపై జేయఁబోవు 'గవ్యం దుగ్ధ మపాస్య పాస్యతి జనః కో వా యవాగూరసమ్' (రాముఁడు కోసల రాజ్యపట్టాభిషేకమును మానుకొని వనవాసమున కేఁగెనని యాక్షేపించుచు రాముఁడు దప్ప నెవఁడు గోక్షీరమును ద్రోసిరాజని గంజినీళ్ళను ద్రాగును) అను ప్రశ్నకు 'నా స్పృహిః కురుతే కావ్యమ్' అన్నట్లు త్రికాలవేదు లగు కూరేశులు చక్కఁగా సమాధాన మిచ్చిరి. శ్రీమన్నారాయణావతారుఁడ వగు శ్రీరామా! అవాప్త సమస్తకాముఁడ వగు నీకుఁ గోసల రాజ్య మొక గొప్పయా? అందువలననే నీచేత 'జగతి త్వయా తృణ మవైక్షి సుందర!' కోసలభూమి తృణముగాఁ జూడఁబడెను. ఈ సమాధానము కూరేశులు శ్రీరాము నవతారము గావునఁ దన హృదయమును వివరించెనా? అన్నట్లు హృద్య

ముగా నున్నది. ఈకవి యొక్కవర్ణనము నందుఁ బునరుక్తి నివారణార్థము కొంత నూతన విషయమును గూర్చి పాఠకుల హృదయము నాకర్షించును.

58 శ్లో॥ సుందర స్యకిల సుందర బాహోః' అని సుందర బాహు మూర్తి నడుము సమస్త జగములకు నివాస మయ్యు నెంతో సన్నగా నున్నది యని యట్లే వరదరాజస్వామి యుదరమును గూడ వర్ణించుచు— వరదరాజ స్తవము 49 శ్లో॥

'అండానాం త్వ్యుదర మామనంతి సంతః
స్థానం త ద్వరద! కథం ను కార్శ్య మస్య।
మాహాత్మ్యం స్వత ఇహ యేషు నూన మేషాం
బుద్ధి స్సాన్య మ్మహిమకరీ న సీంత రేషాక్'

అని యర్థాంత రన్యాసముతో సమర్థించుచు నవతాస్వాదన మొనర్చిరి. ఇట్లే సుందర — స్తవ — 68 'యో జాతక్రశిమా, అను శ్లోకమును, వరద — స్తవ — 61 'శంభో రంభోరుహాముఖ, అను శ్లోకమును పోల్చి చూడుఁడు. ఇట్టివి యనేకములు గలవు.

ఈ మహాకవి యుచితస్థానమున నలంకారములఁ బొందు పఱిచి సాలంకార మగు తనవాణి నలంకార ప్రియుఁడగు శ్రీమహావిష్ణువునకు సమర్పించుకొని ధన్యుఁ డాయెను.

1. అంజనం కరిగిరే రసి శృంగమ్— వరద—21 ఇంకలి యుపమనాస్వాదింపుఁడు.

2. పారిజాతవిటపా నభితో చూ — వరద—28

3. అంజనక్షితి భృతో యది — వరద — 30

ఇందలి యభూతోపమ లెంత హృద్యములుగా నున్నవో యరయునది.

4. పరభాగ మియా ద్రవే స్తమిస్రా - వరద - 31

ఇందలి శ్లేష గమనించునది.

5. కర్ణికా తవ కరీశ! కి మేషా- వరద- 27

ఇందలి చతుష్కోటిక సందేహాలంకారము శ్రీ వరద రాజస్వామి కర్ణాభరణ రామణీయకము నెంత హృద్యముగా వర్ణింపఁ దోడుపడినదో తిలకింపుఁడు. ఉత్తరో త్తర సందేహము నకే ప్రాబల్యము నొసఁగుట పరిపాటిగాఁ గానవచ్చును.

6. ఆశ్లేషేవరద! భుజా స్తవేందిరాయాః- వరద- 43

ఈ కవి సందేహాలంకారములోఁ జివర సందేహము నే నిర్ణయముగా సూచించును.

ఓ వరదరాజస్వామీ! నీకధిక మోదముగూర్చినది యిందిరా బాహుబంధనమా? (కౌఁగిలియా?) లేక రాసగోష్ఠిలో అభి మత గోపికా బాహుబంధనమా? అదియుఁ గానిచో పన్నను దొంగిలించితి వని యశోద యొనర్చిన దామబంధనమా? అను పై శ్లోకార్థమునందుఁ బరత్వసూచక మగు ఇందిరాలింగనము కంటె అతి ప్రణయసూచి యగు అభిమత గోపాంగనాలింగన మే ముదావహము, అంతకంటెఁ దననింద కోర్వని ప్రేమపాశబద్ధ యగు యశోదదామబంధమే సౌలభ్యసూచకము మాత్ర దేవతాభీష్ట సాధకము నగుటచేఁ జివరిసందేహమునందే యీ కవి తన మ్రొగ్గుదలను జూపుచున్నాఁడు. ఇట్టి

7. రింఖాతో వ్రజసదనాంగణేషు కిం తే

... ... ...

పాణీనాం వరద తవారుణత్వ మాసీత్ - వరద - 46 శ్లోకమునఁ గల యందమును సైత మనుభవింపవచ్చును. ఇట్లే పంచ స్తవీ మహోదధిని మథించినచో నెన్నియేని గుణరత్నములు బయలు పడును. విస్తరభీతిచే విరమించుచున్నాను.

8. 20 శ్లో॥ అనన్య దీనత్వమ్ — ఈ శ్లోకమునందలి వ్యాజస్తుత్యలంకారమున కెవరు శిరః కంప మొనర్పరు ?

9. నీలమేఘనిభ మంజనపుంజ
శ్యామకుంతల మనంతశయం త్వామ్ ।
అబ్జపాణిపద మంబుజనేత్రం
నేత్రసా త్కురు కరీశ ! సదా మే ॥

ఈ శ్లోకము కావ్యగుణములకుఁ బుట్టినిల్లై పాఠకుల మనస్సు నెంతయు నాకర్షించుచున్నది. 'అంజనపుంజ శ్యామకుంతలమ్' అబ్జపాణిమ్ — ఇత్యాదుల గాఢబంధరూపమగు నోజోగుణము, శ్లోక మంతట బహుపదము లేక పదము లట్లు భాసిల్లుటచే మసృణాత్మక మగు శ్లేషగుణము, ఆరంభించిన మార్గము నే తుదవఱకు నిర్వహించుటవలన మార్గాభేదరూప మగు సమతా గుణము, 'నేత్రసాత్ కురు కరీశ ! సదా మే' అని పృథక్పద ప్రయోగముచే మాధుర్యగుణము, ఝటితి త్యర్థ ప్రతిపత్తి కలిమిచే నర్థవ్యక్తి యను గుణము బంధ ముజ్జ్వలమై యొప్పుటచేఁ గాంతి యను గుణము కలిగి యుందలి పదరచన

మెంతయు విశిష్టమై యలరారు చున్నది. దీనినే కదా వామనాచార్యుఁడు 'రీతి రాత్మా కావ్యస్య' అని మెచ్చు కొనెను. ఇం దర్థగుణములు గూడఁ బుష్కలములుగాఁ గానవచ్చు చున్నవి. అర్థప్రౌఢి యలరారుటచే నోజము, అర్థస్ఫుటత యొప్పుటవలనఁ బ్రసాదగుణము, ఘటనావైచిత్రి వరలుటచే శ్లేషము, ఉక్తివైచిత్ర్య రూపమగు మాధుర్యము, భక్తిరస ముద్దీపించుటచేఁ గాంతి యను గుణము అంజనపుంజ, అంబుజనేత్రం నేత్రసాత్కురు- ఇత్యాదులందలి యనుప్రాసము, ఉపమాలంకారము, సమృద్ధిమద్వర్ణన రూపమగు నుదాత్తా లంకారమును పాఠకుల మనస్సును రంజింపఁ జేయుచున్నది. కనుకనే భగవద్రామానుజాచార్యుల వారీశ్లోకమును జదువు తతి శిష్యులగు కూరేశుల కన్నులను బరిశీలించి యేమి యిది. ఇంత మనోహర శ్లోకమును వినియు దయాళువగు వరదరాజ స్వామి నేత్రముల ననుగ్రహింప లేదే యన శ్రీవత్సచిహ్నులు దేవర వా రనుగ్రహించిరి కాని నేనే నాకు దర్శనములు (కనులు) వలదు. సదాదర్శనమును గటాక్షింపుఁ డని కోరు కొంటి నని రఁట. దీనినిబట్టి చూడ నీశ్లోకము భగవద్వ్యాఖ్యా కారులనే కాక శ్రీ వరదరాజస్వాములను సైతము మెప్పించి సదాదర్శనమును బడయఁ జేసిన దగుటచేఁ బంచస్తవికిఁ బ్రాణపద మనిన నతిశయోక్తి లేదు.

10. ఈ క్రింది ప్రయోగము లీకవివర్యునకుఁ బాణినీయ మునఁ గల బహుముఖపాండితికి నిదర్శనము లగుచున్నవి.

1. వష్టి మృష్టవరదం త మాశ్రయే– వరద–4
2. పారణీయతి వరప్రద! దృక్ష్మే– ,, 22
3. నేత్రసా త్కురు కరీశ! సదా మే– ,, 23
4. ఈశ! తే పిశునయన్ కిల మాలిః– ,, 25

సంవదేత– వాఙ్మనసయోః– ఉన్నసమ్– వ్యావక్రోశీ

ఇట్లీ పంచస్తవీ రత్నఖనిలోఁ బరిశీలించినకొలఁది నెన్నియో గుణరత్నములు బయలుపడుచునే యుండును. గ్రంథ విస్తర భీతిచే విరమించుచు నాయాంధ్రీకరణ శక్కి నొక్కింత ముచ్చటింతును.

నేను పూజ్యపాదులగు శ్రీ దాసశేషస్వామివారు నాకుఁ బ్రసాదించిన శ్రీ శ్రీనివాసాచార్య విద్వద్విరచిత వ్యాఖ్యానాను సార మీ పంచస్తవి నాంధ్రీకరించితిని. పద్యములను గూడఁ జాలవఱకు మూలానుసారముగనే వ్రాసితిని. కొన్నితావుల వ్యాససమాసరూపమున నుండును కొన్నిచోటుల వీలునుబట్టి సందర్భోచితములుగ నూతనములను వ్యాఖ్యాన స్థములను జేర్చితిని. మంచిచెడ్డల నిర్ణయింప సహృదయ హృదయములే కలవు,

శ్లో॥ అదీర్ఘ మప్రేమదుహాం తృణోజ్జ్వలం
వచోర మంతఃకరణస్య పశ్యతామ్।
అనుజ్ఝమజ్జం ను కథం నిదర్శనం
వనాద్రినాథస్య విశాలయోర్ దృశోః॥ సుందర–43

శ్లో॥ లక్ష్మ్యాః పదం కౌస్తుభ సంస్కృతం చ
శ్రీవత్సభూమి ర్వ్యమలం విశాలమ్ ।
విభాతి వక్షో వనమాల యాఢ్యం
వనాద్రినాథస్య సుసుందరస్య ॥ సం—58

ఈ శ్లోకమునకు నాపద్యము వ్యాసరూపమున నలంకారము లతో నొప్పుచున్నది. లక్ష్మ్యాః పదమ్— అనుదానికి

సీ॥ క్షీరాబ్ధిలో జనించిన సుందరికి రమా
లీలావతికి నేది కేళిగృహము

కౌస్తుభ సంస్కృతం చ— అనుదానికి
రాజిల్లు నే మందిరమున శాణోల్లీఢ

ఘనరత్నదీపమై కౌస్తుభంబు

వనమాల యాఢ్యమ్— అనుదానికి
ఎచ్చోట సింగార మినుమడించెడు వన
మాల యందాలయూయేల వోలె

శ్రీ వత్సభూమిః— అనుటకు
నాది యాతా వను శ్రీదేవి ముద్ర నా
శ్రీవత్స మెచ్చోటఁ జెన్ను మీఱు

గీ॥ అతి విశాలము నిర్మల మద్ద మట్లు
శ్రీవనాద్రీశు నిత్యలక్ష్మీయుతంబు
సుందరోరః స్థలంబులు జూడ వలయు
నన్నుఁ గావలె నొక వేయికన్నులైన.

అందమునకు మురిసి యొకచో వ్యాఖ్యానస్థ మగు శ్లోక మును గూడ ననువదించితిని.

త్రికుల విభుండు నిత్యమును
సేవ యొనర్పఁగ నొప్పు దేవతా
మకుటము కాననాచలము
మన్కిఁగ నుండుట భాగ్యమెంతయున్.

శ్లో - సుందరోరుభుజ - సుం - 110 పేజి 201

ఉ॥ అల్ల యశోద బిడ్డవయి
నవ్వెడు కాననశైలవల్లభా!
నల్లని గండుతుమ్మెదల
నై గనిగల్ గల ముంగురుల్ విరా
జిల్లెడు మోముతోడ వ్రజ
సీమల వెన్నల ప్రముచ్చిలించితో!
గొల్లమిటారి క్షత్రియల
కోమలమానసముల్ హరించితో!



శ్రీ హయగ్రీవాయ నమః

# ప్రా ర్థ నా ది క ము

ఉ॥ శ్రీ రమణీ కుచాద్రులకుఁ

జెన్నగు నీలమణీ విభూషణం

బై రహిఁ మించి మేనఁగన

కాంబరరోచులు మెర్పు లట్టు లిం

పార స్వభక్త చాతక చ

యంబులకున్ ముద మిచ్చుచున్ గృపా

పూర సువర్షి యౌ వరద

భూపమహాభ్రము నాశ్రయించెదన్.

శా॥ కాంచీపత్తన రామణీయకరమా

కాంచీస్థలీ శోభపై

మించం గోరిక, పొంచిచూడ విభవో

న్మీల త్స్వవైకుంఠ సా

మ్యాంచద్వారణ భూమి భృచ్ఛిఖర మ

ధ్యాసించు శృంగారి వీ

క్షించుం గావుత దేవరాజు కరుణన్

శ్రీదాసశేష ప్రభున్.

చ॥ దరి కరుదెంచి యద్దుటయె

దవ్వుగ నర్థుల కన్ని చేతులన్

# వి జ్ఞ ప్తి

శా॥ శ్రీవత్సాంక కవీంద్ర వాగమృతముం
జిందించు పంచ స్తవిన్
దేవా! తావకమా స్తవంబె మిగిలెన్
దీనిన్ గటాక్షింపుమా
భావాదర్శ మదాంధ్ర టిప్పణముతో
భాసిల్ల, నేతన్మహా
సేవన్ జేయఁగ దాస శేషులకు వా
సిన్ బాసఁ గావించితిన్.

చ॥ జర కడు హెచ్చె నబ్దములు
సప్తతికిన్ దరిదాపువచ్చె, జ
ర్జరిత మొనర్చె దేహము స
రాతు లటుల్ దయమాలి జాడ్యముల్
వరద! మహాప్రభూ! యెటు భ
వత్ స్తవమున్ వివరింపఁ జాలుదున్
కరిగిరినాథ! నీ కరుణ
కావలె నీవిఁ గృతార్థుఁ జేయఁగన్.

ఉ॥ పీఁపున లేచెఁ గు ర్పొకటి,
వెజ్జులు పే రిడినారు దీనికిన్
భూపులకున్ జనించు నొక
పుండనని, భీతిల నేల? పుట్టువా

రాపయి గిట్టువారె కద

యందఱు నీ స్తవగాంగవారితో

శ్రీపతి! నాదుభాగ్యమున

చేరని చో మదిలోఁ దపించెదన్.

ఉ॥ మున్నల కూరనాథకవి

ముఖ్యు స్తవంబున కాత్మ మెచ్చుచున్

గన్నులనిచ్చి తంట వినుఁ

గాంచ గురున్ దరిసింప దాసికిన్

బన్నగఁ జీక, తీయనగు

పద్యములన్ విరచింతుఁగా! ననున్

గ్రన్ననఁ జేయరా దాకా! ని

రామయుఁగాఁ గరిగిర్యధీశ్వరా!

క॥ తేలికయైన పరీక్షకుఁ

డాళుదునే కాని, దేవ! డానవసూనుం

బోలెఁ గరీంద్రునిఁ బోలెన్

గాలించినఁ దాళఁజాలఁ గరిగిరిపాలా!

చ॥ వరదుఁడ వౌటఁ గూర్చెదవు

వాంఛిత మీవని గోర్కినైన నే

నరుజు నొనర్పు నన్నుచు

నద్దుచునుంటేఁ బదేప దే ముఖం

బరుణము సేయఁబోకు, మిటు

లద్దు నితం పెలుఁగండు నాదు తోం

# స మ ర్ప ణ ము

మును కూరేశులు పల్కిరై దగు స్తన
మ్ముల్, యాత్రలో లబ్ధమ
య్యెను బృందావని దాస శేషున కెటో
యీ దివ్యకోశంబు, దీ
ని నిటుల్ వ్రాయఁగ నాకు నాజ్ఞ నొసఁగన్
నేఁ బూర్తి గావించితిన్
గొను మీ సత్కృతి నీకె యంకితము శ్రీ
కోదండరామప్రభూ !

శ్రీ శ్రీ శ్రీ



శ్రీ హయగ్రీవాయ నమః

## శ్రీ వత్సాంకమిశ్ర విరచిత పంచస్తవీ విరాజమానము

# సుందరబాహుస్తవము

### కవిశేఖర మధ్వశ్రీ పళ్ళెపూర్ణప్రజ్ఞాచార్యకృత భావాదర్శ రూపాంధ్ర వివరణ పద్య సహితము

అవతారిక :— శ్రీ భగవద్భాష్యకార పరమకృపాలబ్ధ తత్వజ్ఞానులును తదీయ పాదారవింద సేవైకధారకులు నగు శ్రీవత్సాంకమిశ్రులు పాషండ ప్రభువుచే నెడఁబాపఁ బడిన శ్రీరామానుజమునుల వియోగమును సహింపనివారై విభవావతార స్తవానంతర మర్చావతారస్తుతి ప్రస్తుతము కావున సమాశ్రితులకు సర్వాభీష్టముల ననుగ్రహించు వనగిరిమందిరుఁడగు సుందరబాహు దేవుని స్తుతింపఁ బోవుచు స్తవారంభము నందే భాష్యకారుల చరణ సరోజముల సందర్శనమునే స్తోత్రమునకు ఫలమునుగా సంకల్పించి సకలవేదాంత తత్వరాశిని ప్రకాశింపఁజేయ నారంభించు చున్నారు.

శ్లో॥ శ్రీమంతౌ హరిచరణౌ సమాశ్రితోఽహం<br>
శ్రీరామావరజ మునీంద్రలబ్ధబోధః ।<br>
నిర్భీక స్తత ఇహ సుందరోరుబాహుం<br>
స్తోష్యే తచ్చరణవిలోకనాభిలాషీ ॥ 1

ప్రతి :- శ్రీరామావరజ, మునీంద్ర, లబ్ధ, బోధః = శ్రీరామానుజయోగీంద్రుల వలనఁ బొందఁబడిన వేదాంతజ్ఞానము

గలవాఁడను గనుకనే, శ్రీమంతౌ = కాంతి మంతములగు, హరిచరణౌ = విష్ణుమూర్తి పాదములను, సమాశ్రితః = ఆశ్రయించినట్టియు, తతః = కనుకనే, ఇహ = ఇక్కడ, నిర్భయః = భయము లేనట్టియు, అహమ్ = నేను, తత్, చరణ, విలోకన, అభిలాషీ = శ్రీ రామానుజులవారి పాదపద్మదర్శనమును గోరుచు, సుందర, ఉరు, బాహుమ్ = అందములగు బలిసిన భుజములు గల సుందరబాహు దేవుని, స్తోష్యే = స్తుతింపఁబోవు చున్నాను.

విశేషములు :— 'సుందరోరు బాహుం । స్తోష్యే తచ్చరణ విలోకనాభిలాషీ'– శ్రీరామానుజుల పాదముల నవలోకింపఁ దలఁచినవాఁడనై సుందరబాహు దేవుని స్తుతింపఁ బోవుచున్నా నని భావము. ఉపసంహారమునందుఁ గూడ 'విజ్ఞాపనాను' (129) అను శ్లోకమున శ్రీరంగములో శ్రీరామానుజుల వశ్యుఁడనై యుండునట్లు ప్రార్థించి యున్నారు. శ్లోకాదియందు శ్రీ శబ్దప్రయోగముచే గ్రంథమునకు మంగళ మొనర్పఁబడెను. అహం సుందరోరుబాహుం స్తోష్యే— అని వస్తునిర్దేశరూపమగు మంగళము చేయఁబడె ననుకొన్నను సరిపోవును. 'ఆశీర్నమస్క్రియావస్తు నిర్దేశోవాపితన్ముఖమ్' అని యలంకారిక సూక్తి.

తా॥ శ్రీరామానుజ మునీంద్రులవలన వేదాంతజ్ఞానమును బడిసి శ్రీహరి చరణంబుల నాశ్రయించిన నేను నిర్భయుఁడనై శ్రీభాష్యకారుల పాదపద్మము నభిలషించుచు శ్రీసుందరబాహుదేవుని స్తుతింపఁ బోవుచున్నాను.

శా. శ్రీరామానుజ యోగిపుంగవ కృపా
శ్రీ ల్లబ్ధవేదాంత వి
ద్యారమ్యుండను శ్రీమ దచ్యుతపద
ద్వంద్వాశ్రితుండన్ భయ
ద్వారాత్యంతవిదూరుఁడన్ గుణలపా
దంబుల్ విలోకింపఁగా,
శూరున్ సుందరబాహునామధరు వి
ష్ణున్ స్తోత్రముం జేయుదున్.

అవతారిక :— శ్రీ సుందరబాహు విష్ణువు వెలెసే వనాద్రి నుండి ప్రాశమిన నూపురాపగయు నభీష్టవరముల నొసంగు నని యీ శ్లోకమునఁ జెప్పుచున్నారు.

శ్లో॥ సుందరాయతభుజం భజామహే
వృక్షషండమయ మద్రి మాశ్రితమ్ ।
యత్ర సుప్రథితనూపురాపగా
తీర్థ మర్థితఫలప్రదం విదుః ॥ 2

ప్రతి :— యత్ర = ఏ కొండయందు, సుప్రథిత, నూపురాపగా, తీర్థమ్ = మిక్కిలి ప్రసిద్ధమైన నూపురనదియొక్క తీర్థమును, అర్థిత, ఫలప్రదమ్ = కోరఁబడిన ఫలముల నొసంగు దానినిగా (సంతః = సజ్జనులు) విదుః = తెలిసికొను చున్నారో, (తమ్ = అటువంటి) వృక్షఖండ, మయమ్ = చెట్ల గుంపులతో నిండిన, అద్రిమ్ = కొండను, ఆశ్రితమ్ = ఆశ్రయించియున్న, సుందర, ఆయత, భుజమ్ = సుందరములును, దీర్ఘములును అగు భుజ

వెళ్ళుచుండునో యా వనాద్రి నాశ్రయించిన సుందరభుజుని భజించెదము.

మ. ఒకచోటన్ వడి నేగు మందగతితో
నొప్పారు నింకొక్కచో,
నొకచోఁ దాటిలు సుళ్ళువాఱు నొకచో
హోరెత్తుఁ గ్రక్కున్ నురుం
గొకచోఁ గ్రిందికి దూఁకు నందె యనుపే
రొప్పారునయ్యేఱు త్రా
వి కలున్ సుందరనామకంబు విపినో
ర్వీధ్రంబునన్ మత్తనాన్.

శ్లో॥ ఉదధిగమందరాద్రి మథి మంథనలబ్ధపయో
మధురరసేందిరాహ్వసుధ సుందరదోఃపరిఘమ్ ।
అశరణ మాదృశాత్మ శరణం శరణార్థిజన
ప్రవణధియం భజేమ తత ఖండమయాద్రిపతిమ్ ॥ 4

ప్రతి :— ఉదధి.........దోఃపరిఘమ్— ఉదధి=సముద్రమును, గ, పొందిన, (చొచ్చిన) మందర, అద్రి=మందరపర్వతమనెడు, మథి=కవ్వముచేత, మంథన=చిలుకుటచేత, లబ్ధ=పొందఁబడిన, పయః = పాలలోని, మధుర=తియ్యని, రస=రసము, ఇందిరా=లక్ష్మియను, ఆహ్వా=పేరుగల, సుధ = అమృతముగల, సుందర = అందములగు, దోఃపరిఘమ్ = పరిఘాయుధము (ఇనుపకట్లగుదియ) వంటి బాహువులు గలిగినట్టియు, అశరణ, మాదృశ, ఆత్మ, శరణమ్=దిక్కులేని మాబోటి చేతనులకు దిక్కైనట్టియు, శరణార్థి, జన, ప్రవణ,

ధియమ్=శరణుగోరు జనులయందు లగ్నమైనబుద్ధి గలట్టియు, తరుషండమయ, అద్రి, పతిమ్ = వనగిరినాథుఁడైన సుందర బాహుమూర్తిని, భజేమ=సేవించెదము గాక.

తా॥ క్షీరాబ్ధిలోఁ జొచ్చిన సుందర మనెడు కవ్వముచేత మథించుటవలన లబ్ధములైన పాలలోని మధురరసము లక్ష్మి పేరి సుధయుఁ గలిగి యందములగు పరిఘలఁ బోలిన బాహువులు గలవాఁడును దిక్కులేని మాబోటి చేతనులకు దిక్కైన వాఁడును, శరణాగతులయెడ నాదరము గలవాఁడునగు వనగిరి నాథుడైన (శ్రీ)సుందరబాహుమూర్తిని సేవింతుము గాక.

ఉ. ఎవ్వనిబాహుదండము ల
హీశుఁడు త్రాడుగ క్షీరవారిధిన్
గవ్వపుఁగొండతోఁ జిలికి
కమ్మనిదుగ్ధమునిగ్గు మేల్ సుధన్
బువ్వులుకానితల్లిఁ బువు
బోణిని జెందె ననాథనాథుఁడౌ
అవ్విభునిన్ భజించెద వ
నాద్రిపతిన్ శరణార్థి సన్మతిన్.

శ్లో॥ శశధరరింఖణాఢ్యశిఖ ముచ్ఛిఖగప్రకరం
తిమిరనిభప్రభూతతరుషండమయం భ్రమదమ్ ।
వనగిరి మావసంత ముపయామి హరిం శరణం
భిదురితసప్తలోకసువిశృంఖలశంఖరవమ్ ॥ 5

ప్రతి :— శశధర, రింఖణ, ఆఢ్య, శిఖమ్=చంద్రసంచారముతో నొప్పిదమైన శిఖాభాగము గలదియు, ఉత్,

శిఖర, ప్రకరమ్=ఎత్తైన శిఖరముల సమూహము గలదియు, తిమిర, నిభ, ప్రభూత, తరు, షండ, మండమ్=చీఁకటితో సమానమగు పలుచెట్లగములతో నిండినదియు, (కనుకనే) భ్రమ దమ్=భ్రమను గొల్పునదియు, చెట్లగుబురా! అని భ్రాంతిని గల్గించు నదియు, అగు, వనగిరిమ్=వనాద్రియందు, ఆవసంతమ్=నివసించు చున్నట్టియు, భిదురిత........రవమ్- భిదురిత=బ్రద్దలు చేయఁబడిన, సప్తలోక = ఏడులోకము లందును, సువిశృంఖల = అడ్డులేని, శంఖరవమ్ = పాంచజన్య మనుశంఖముయొక్క ధ్వనిగల, హరిమ్ = సుందరబాహు విష్ణువును, శరణమ్ = శరణును, ఉపయామి = పొందు చున్నాను.

విశేషములు:— తరుషండమయమ్- ఇచ్చట ప్రాచు ర్యార్థమున మయట్ప్రత్యయము. తరుసమూహప్రచుర మని యర్థము.

భ్రమదమ్—తరుషండప్రచుర మగుటచేత నిది చెట్లగుంపే కాని కొండగాదు అను భ్రాంతి నిచ్చునది. భిదురితసప్తలోక సువిశృంఖల శంఖరవమ్- సుందరబాహుదేవుని పాణితలమున నున్న పాంచజన్యము ధ్వనిచేతఁ దొలిమ్రోఁత వలన సప్త లోకస్థితములగు పదార్థములు భిన్నములైనవి, మలిమ్రోఁత వలన సప్తలోకములే భిన్నములైనవి. అని భేదము గ్రహింపఁ దగినది.

పూర్వశ్లోకము నందలి విశేషణములును, ఏతచ్ఛ్లోకము లోని విశేషణములును దివ్యప్రబంధాను సారముగా గ్రహింపఁ బడినవి.

తా॥ చంద్రసంచారముతో నొప్పుకొనలుగల ఉన్నతము లగు శిఖరసమూహములు గలదియు, చీఁకటులవంటి పలుచెట్ల గుబురులతో నిండినదియు, కనుకనే చెల్లుగుబురే కాని కొండ గాదనెడు భ్రాంతిని గలిగించునదియు, అగువనాద్రి యందు నివసించుచున్నట్టియు, బద్ధులైన సప్తలోకములందు నిరాఘాట సంచారము గల పాంచజన్యరవము గల (శ్రీ) సుందరబాహువిష్ణువును శరణుచొచ్చుచున్నాను.

శా. సంచారం బొనరించు దేనిశిఖలన్
జంద్రుండు, విష్ణ్వంఘ్రిఁ జుం
బించున్ దేనియభంగశృంగరమ, య
త్పృథ్వీజముల్ చీఁకటుల్
పెంచున్, దాదృశమా వనాద్రిఁ గల(శ్రీ)
విష్ణున్ భజింతున్ గరో
దంచద్యత్పటుపాంచజన్యరవముల్
ధారించు లోకమ్ములన్.

శ్లో॥ యత్తుంగశృంగవినిమంగి సురాంగనానాం
న్యస్తోర్ధ్వపుండ్రముఖమండన మండితానాం।
దర్పణ్యభూత్ ధృత మహాంకశశాంకపృష్ఠం
త బాహు సుందరభుజస్య మహాన్ వనాద్రిః ॥
(2)

ప్రతి :— ధృతమ్=(కొంచెము చిన్న శిఖరమున) ధరింపఁ
బడినదియు, అపాంక = కళంకము లేనట్టిదియు, శశాంక
పృష్ఠమ్=చంద్రుని వెనుక భాగము. లేదా— చంద్రుని చరమ
భాగము, న్యస్త, ఊర్ధ్వపుండ్ర, ముఖ, మండన, మండనా-
నామ్ = ఉంచుకొనఁబడిన యూర్ధ్వపుండ్ర మనెడు ముఖా-
లంకారముచేత నలంకృత లగు, యత్, తుంగ, శృంగ,
వినిషంగి, సురాంగనానామ్=దేనియొక్క యెత్తైన శిఖరము
నందుఁ గూర్చుండిన దేవతాకాంతలకు, దర్పణ్యభూత్ =
అద్దమాయెనో, తత్ = అటువంటిదియు, సుందరభుజస్య =
సుందరబాహుదేవునకు, ధామ = స్థానమగు, వనాద్రిః =
తరుషండ పర్వతము, మహాన్ = గొప్పది.

విశేషములు :— 'యత్తుంగశృంగ వినిషంగి సురాంగనా-
నామ్'— వనాద్రిసంబంధి యగు మహోన్నత శిఖరముపైఁ
గూర్చుండిన దేవకాంతలకు ముఖాలంకారమగు నూర్ధ్వ
పుండ్రమును ధరించుటకు ధృత, మపాంకశశాంకపృష్ఠము—
అంతకంటెఁ గ్రిందుగా నున్నప్పుడు పృష్ఠభాగ మగుటచే
నిష్కళంకమగు చంద్రుఁడు. దర్పణ్యభూత్ — దర్పణీ +
అభూత్ ఇది యేకపదము. అద్దమాయెనో! అని యర్థము.
మహాన్ వనాద్రిః— వనగిరి ఔన్నత్యము చేతను గొప్పది
మహిమచేతను గొప్పది యని భావము. దివ్యవైభవము గల
దని సారము.

తా॥ చంద్రుఁడు వనాద్రియొక్క క్రిందిశిఖరమునఁ బోవు చున్నప్పుడు నిష్కళంకమగు చంద్రుని పృష్ఠభాగముపై శిఖరమునఁ గూర్చుండి యూర్ధ్వపుండ్రమును ముఖాలంకారముగా ధరించు దేవతాంగనలకు నిర్మలమగు నద్దమువలె నుపయోగపడు చున్నది. సుందరబాహుదేవునకు స్థానమైన యావనిగిరి యౌన్నత్యము చేతను దివ్యవైభవము చేతను చాల గొప్పది.

ఉ. ఎం చొకయెత్తు శృంగమున
నిందునిభానన లైన దేవతా
సుందరు లూర్ధ్వపుండ్రముల
సొంపుగ మోముల దిద్దుకొంచు నా
క్రిందుగ నేఁగు చందురుని
పృష్ఠము నంకవిహీనదర్పణం
బుం దగఁ జేసికొందు రదె
పో! హరియున్కి వనాచలం బనన్.

శ్లో॥ యదీయశిఖరాగతాం శశికలాం తు శాఖామృగాః
నిరీక్ష్య హరశేఖరీభవన మాన్మృశంత స్తతః ।
స్పృశంతి నహి దేవతాంతర సమాశ్రి తేతి స్ఫుటం
స ఏవ సుమహోత్సవ్రజగిరి ర్గృహాం శ్రీపతేః ॥ 7

ప్రతి :— శాఖామృగాః, తు=కోతు లన్ననో, యదీయ, శిఖర, అగతామ్=ఏపర్వతసంబంధి యగు శిఖరము మీఁదికి వచ్చిన, శశికలామ్=చంద్రకళను, నిరీక్ష్య = చూచి, హర,

శేఖరీభవనమ్ = ఈశ్వరునకు శిరోఽలంకార మనుటను, అనుశంతః = విచారించుచున్నవిన్ను, తతః = ఆ కారణమువలన, దేవతాంతర, సమాశ్రితా = అన్యదేవుని ఆశ్రయించినది, ఇతి = అని న, స్పృశంతి, హి = తాకనైనను రావో, సః = అటువంటి, ఏషః = ఈ, సుమహాశాఖప్రవజనిరిః = మంచి మహావృక్షములగుంపు గల వనాద్రి, శ్రీపతేః = లక్ష్మీపతి యగు సుందరబాహుమూర్తికి, స్ఫుటమ్ = ప్రసిద్ధముగు, గృహమ్ = ఇల్లు. (ఆలయము).

విశేషములు :- శాఖామృగాః- అతిచపలము లని భావము. 'స్పృశంతి నహి దేవతాంతరసమాశ్రితా'- శశికల యాకర్షక మైనప్పటికిని, కోతులు చంచలప్రకృతి గల వైనప్పటికిని, అన్యదేవత యగు శివుని నాశ్రయించిన హేతువుచేత దానిని ముట్టలేదని చెప్పుటవలన నకొండపై నున్న కోతులు సైతము దేవతాంతర సంబంధి సంబంధము నొల్లని హరి పరాయణత్వము గలవని తేలును. ఇందులకు హేతువా వనాద్రియట్టి సుప్రసిద్ధ విష్ణుస్థల మగుటయే. ఈ విషయమును స్ఫుటం...గృహం శ్రీపతేః- అనుపదములు స్పష్టపఱుచు చున్నవి.

తా॥ కోతులు సైతము మా కొండశిఖరము మీఁదికి వచ్చిన శశికళను జూచి దానియందము నెంచి గ్రహింప వలెనని తలంచియు నది శివశిరోభూషణ మగుటచే దేవతాంతర మగు రుద్రు నాశ్రయించిన దని దానిని దాకనైనను లేదు. చపల

ప్రత్యక్షముగను కోతులే యిట్లు చేసినవనిన నా వనాద్రి సుప్ర సిద్ధమగు విష్ణుస్థలమని వెల్లడియగు చున్నది.

శా. ఆకొండం గపికాంతు మొచ్చశిఖరా
గ్రాయాత శీతాంశుహ్ర
ద్వ్యాకారన్ గళేc గాంచి శూలితలపూ
వంచుక విచారించి చేc
దాcకన్ పైపవు దేవతాంతరనిమ
క్తస్వాంతc గా నెంచి ల
క్ష్మీకాంతాలయ మావనాద్రి సుహరి
క్షేత్రంబులకా మిన్నగా!

శ్లో॥ సుందరదోస్త్విద్వ్యాజ్ఞా
లంభన కాతరవశానుయాయిని కరిణి ।
ప్రణయజకలహసమాధి
ర్యత్ర వనాద్రి స్స ఏవ సుందరదోష్ణః ॥ 8

ప్రతి :- యత్ర = ఏకొండయందు, కరిణి = అడవి యేనుcగు, సుందర......యాయిని- సుందరదోః = సుందర బాహు దేవుని యొక్క, దివ్య = దివ్యమగు (దాcటరాని) ఆజ్ఞా = ఆజ్ఞ యొక్క, లంభన = స్పర్శచేత, కాతర = భయస్వభావముగల, వశా = ఆcడేనుcగును, అనుయాయిని అనుసరించు చుండcగా, ప్రణయ, జ, కలహ, సమాధిః = ప్రేమవలనc బుట్టినకలహము నకు సమాధానము, (భవతి = అగు చున్నదో) సః = అటువంటి, ఏషః = ఈ, వనాద్రిః = వనగిరి, సుందరదోష్ణః = సుందర బాహు సంబంధియగు దివ్య నివాసము,

శ్లో॥ లక్ష్మ్యాః పదం కౌస్తుభ సంస్కృతం చ
శ్రీవత్సభూమిః స్వమలం విశాలమ్ ।
విభాతి వక్షో వనమాల శోభ్యం
వృషాద్రినాథస్య సుసుందరస్య ॥ సం—56

ఈ శ్లోకమునకు నాపద్యము వ్యాసరూపమున నలంకారము లతో నొప్పుచున్నది. లక్ష్మ్యాః పదమ్— అను దానికి

సీ॥ క్షీరాబ్ధిలో జనించిన సుందరికి రమా
లీలావతికి నీది కేళిగృహము

కౌస్తుభ సంస్కృతం చ— అను దానికి

రాజిల్లు నీ మందిరమున శోభిల్లెడి
ఘనరత్నదీపమై కౌస్తుభంబు

వనమాల శోభ్యమ్— అను దానికి

ఎదప్పైట సింగార మినుమడించెడు వన
మాల యందాలయూగేల వోలె

శ్రీవత్సభూమిః— అనుటకు

నాది యీతా వను శ్రీదేవి ముద్ర నా
శ్రీవత్స మెదప్పైటఁ జెన్ను మీఱు

గీ॥ అతి విశాలము నిర్మల మద్ద మట్లు
శ్రీవనాద్రీశు నిత్యలక్ష్మీయుతంబు
సుందరోరః స్థలంబులు జూడ వలయు
నన్నుఁ గావలె నాశ వేయికన్నులైన.

అందమునకు మురిసి యొకచో వ్యాఖ్యానస్థ మగు శ్లోకమును గూడ ననువదించితిని.

చ. సరసపుటల్క నొక్కవళ
సామజముం గికురించి పాఱ న
క్కరిపతి దాని వెంటఁ బడి
గాసిలు చుండ ననుగ్రహించి సుం
దరభుజుఁ డాజ్ఞ సేయ వెఱఁ
దత్క్షణ మాశరికోర్కెఁ దీర్చు నే
గిరిఁ గరికాంత యెంతు హరి
కిఁ నెల వాతరుఖండ శైలమున్.

శ్లో॥ స ఏష సౌందర్యనిధే ర్ధృతశ్రియో
వనాచలో నామ సుధామ యత్ర హి ।
భుజంగరాజస్య కులస్య గౌరవా
న్న ఖండితాః కుండలిన శ్శిఖండిభిః ॥ 9

ప్రతి :— యత్ర=ఏకొండయందు, కుండలినః = పాములు, భుజంగరాజస్య సర్పరాజగు శేషునియొక్క, కులస్య=కులము యొక్క, గౌరవాత్ = గౌరవమువలన, శిఖండిభిః=నెమిళ్ళ చేత, న ఖండితాః, హి=ఖండింపఁ బడవో, సః = అటువంటి, ఏషః=ఈ, వనాచలః, వనగిరి, సౌందర్యనిధేః=చక్కఁదనమున కిక్క యగు, ధృతశ్రియః = ధరింపఁబడిన లక్ష్మిగలవాడై ఆరూఢశ్రీ యను నామాంతరము గల శ్రీ సుందరబాహు దేవునకు, సుధామ, నామ = దివ్యస్థలమని ప్రసిద్ధి గన్నది.

విశేషములు :— సుధామ— దివ్యక్షేత్రము. ఈ దివ్యత్వమునే యుత్తరార్ధమున నిరూపించినారు. 'భుజంగరాజస్య ......శిఖండిభిః — భుజంగరాజకుల గౌరవమువలన నెమిళ్లు

సైత మచటిపాములను ఖండింప వనుటచేత సహజవైరము
గల వారికిఁగూడ నిర్వైరత్వమును జేకూర్చు మహిమ వృషా
నాద్రికిఁ గలదని దానిదివ్యత్వము చాటఁ బడినది. ధ్వన్యర్థః—
ఆరూఢశ్రీకి— సుందరబాహున కిది నామాంతరము.

తా॥ ఏకొండయందు నెమిళ్ళు సైతము భుజగరాజుల
గౌరవముచేత సర్పములను ఖండింపక సహజవిరోధమును గూడ
విడిచి వర్తించునో యట్టి మహిమము గల వృషగిరి
సౌందర్యనిధి యగు శ్రీ సుందరబాహుదేవునకు దివ్యనివాసము.

ఉ. కుండలిరాజవంశమునఁ
గొండొక గౌరవభావ మూంచి యు
క్కొండ నిసర్గవైరమును
గూడఁ ద్యజించి శిఖండికాండముల్
చెండవు పాపతండముల
శ్రీపతి కందము మేరకున్ మహీ
మండలి మేలిధామ మను
మన్నన గన్నవనాద్రి నెన్నదన్.

శ్లో॥ వృషగిరి రయ మచ్యుతస్య యస్మిన్
స్వమత మలంఘయితుం పరస్పరేభ్యః ।
ఖగపతిచరణా ఖగా శ్చపంతే
భుజగపతే ర్భుజగా శ్చ సర్వ ఏవ ॥ 10

ప్రతి:— యస్మిన్ = ఏ కొండయందు, స్వమతమ్ = స్వాభి
మత మగు ప్రతిజ్ఞను, అలంఘయితుమ్ = ఉల్లంఘింప కుండుట
కొఱకు, సర్వే = సమస్తములగు, ఖగాః = పక్షులు, ఖగపతి,

చరణౌ, ఏవ = పక్షులకుఁ బ్రభువగు గరుత్మంతుని పాదములనే, పరస్పరేభ్యః = ఒండొరులకొఱకు, శపంతే=ఒట్టు పెట్టుకొను చున్నవో, సర్వే=సమస్తములగు, భుజగాః, చ = పాములు గూడ, భుజగపతేః=పాఁపఱేఁడగు శేషునియొక్క, చరణౌ, ఏవ=పాదములనే, శపంతే=ఒట్టిడుకొనుచున్నవో, అయమ్ = ఇటువంటి, వృషగిరిః = వృషభ పర్వతము (వనగిరి) అచ్యుతస్య = సుందరబాహువిష్ణుమూర్తి సంబంధియగు దివ్య ధామము.

విశేషములు :- 'వృషగిరి రయ మచ్యుతస్య'– ప్రతిజ్ఞనుండి యెన్నఁడును చ్యుతుఁడు గాక సత్యప్రతిజ్ఞుఁడై 'అచ్యుతుఁడు' అన్నబిరుదు వహించిన శ్రీసుందరబాహు దివ్యధామ మగు వనాద్రి యిది అని భావము. భగవానుఁడు ప్రతిజ్ఞ నుల్లంఘింపఁ డనుటకు 'అ ప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే సలక్ష్మణామ్ । నహి ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః'

(శ్రీమద్రామాయణము)

సత్యప్రతిజ్ఞుఁ డగు సుందరబాహునకు నివాసమగుట చేతనే యీ వనాద్రియందుఁగల తిర్యక్కులగు పక్షులు పాములును ప్రతిజ్ఞాపాలనమున బద్ధశ్రద్ధములై యనుమానించువానికి నమ్మకము కలుగుటకుఁ దమ ప్రభువులగు గరుత్మంతుని పాదముల

యాన యనియు శేషునిపాదముల తోడనియు నొట్టిడుకొను చున్నవని యుత్తరార్ధమున వర్ణించుట యెంతయు నొప్పిదమై యున్నది.

తా॥ ఏ కొండయందుఁ బక్షులును బాములును సమప్రతిజ్ఞ నుల్లంఘింప మను విషయమునఁ బరస్పర విశ్వాసము కొఱకుఁ దమ ప్రభువులగు గరుడ శేషుల పాదములపై నొట్టుపెట్టు కొనునో, సత్యప్రతిజ్ఞుఁడై యచ్యుతుఁ డన్న బిరుదు వహించిన యట్టి శ్రీ సుందరబాహువునకు నిలయమైన దీవనాద్రి.

ఉ. పక్షులు పాములున్ బ్రతిన
పాలనపట్టున నెందు స్వీయమా
దీక్షను జాటఁగా ఖగప
తిప్రియపాదములున్ భుజంగమా
ధ్యక్షుపదంబు లొట్టిడునొ!
యట్టిది సుందర బాహుపుండరీ
కాక్షుని యునికి పట్టగు వ
నాద్రి వెలుంగు సుభద్రదాయి యై.

శ్లో॥ హరికుల మఖిలం హనూమదంఘ్రిం
స్వకులపజాంబవత స్తథైవ భల్లాః।
నిజకులపజటాయుష శ్చ గృధ్రాః
స్వకులపతే శ్చ గజా గజేంద్రనామ్నః॥ 11

ప్రతి :- (స్వమతమ్ = తమ కిష్టమగు ప్రతినను, అలంఘ యితుమ్ = దాఁటకుండుట కొఱకు, పరస్పరేభ్యః = ఒండొరుల

కొండకు, యస్మిన్ = ఏకొండయందు) హరికులమ్ = వానరసమూహము, అఖిలమ్ = అంతయు, హనూమత్, అంఘ్రిమ్ — హనుమంతుని పాదమును, తథా, ఏవ = అట్లే, భల్లాః - ఎలుఁగుబంట్లు, స్వకులపజాంబవతః = తమ కులప్రభువగు జాంబవంతునియొక్కయు, గృధ్రాః = గద్దలు, నిజ, కులప, జటాయుషః = తమకులస్వామి యగు జటాయువు యొక్కయు, గజాః = ఏనుఁగులు, స్వ, కుల, పతేః = తమ వంశమునకు రాజగు, గజేంద్రనామ్నః = గజేంద్రుఁడను నామముగలదాని యొక్కయు, (అంఘ్రిమ్ = పాదమును, శపంతే = ఒట్టిడుకొనుచున్నవో అయమ్ = ఇట్టి, వృషగిరిః = వృషభాచలము. (వనాద్రి) అచ్యుతస్య = సుందరబాహువిష్ణువునకు సంబంధి యగు దివ్యధామము.)

విశేషములు :— కుండలచిహ్నములోని పదము లన్నియుఁ బూర్వశ్లోకాను వృత్తములు. 10, 11, శ్లోకములచేత దివ్యస్థలమునకు భాగవతభక్తి సమృద్ధియు నొకలక్షణ మని సూచితమగుచున్నది.

తా॥ ఏ కొండయందుఁ బ్రతినచేయు సందర్భమునందు వానరకులము తమ మూలపురుషుఁడగు హనుమంతుని పాదములమీఁదను, భల్లూకములు తమకులము పెద్దయగు జాంబవంతుని చరణముల మీఁదను, గద్దలు తమ కొలముసామి యగు జటాయువు పదములమీఁదను, గజములు గజేంద్రుని కాళ్ళమీఁదను ఒట్టుపెట్టుకొనుచుఁ దమ భాగవతభక్తిని దెలుపు

చుండునో యట్టి యీ వనాద్రి శ్రీ సుందరబాహుమూర్తికి దివ్యనివాసము.

చ. హరికుల మంతయున్ హనును
దంష్ట్రులు, భల్లము లెల్ల జాంబవ
చ్చరణములున్ కోలంబునకు
సామి జటాయువు కాళ్లు గ్రద్దలున్
కరులు గజేంద్రు పాదములు,
గట్టిగ నొట్టెడు వేళలన్ బర
స్వరము వచించు నెందు వన
శైల మదే హరిదివ్యధామ మహా.

శ్లో॥ వకులధర సరస్వతీవిషక్త
స్వరరసభావయుతాసు కిన్నరీషు ।
ద్రవతి దృషదపి ప్రసక్తగానా
స్విహ వనశైలతటీషు సుందరస్య ॥ 12

ప్రతి :- వకుళ.........యుతాసు— వకుళధర = శఠకోప మునియొక్క, సరస్వతీ=వాక్కులగు ద్రవిడోపనిషత్తులయందు, విషక్త = లగ్నములై యున్న, స్వర = నిషాదాదిస్వరముల తోను, రస=శృంగారాది రసములతోను, భావ = రత్యాది స్థాయిభావములతోను, యుతాసు=కూడినవారై, కిన్నరీషు= కిన్నరాంగనలు, ప్రసక్త, గానాసు = ప్రారంభింపఁబడిన గానము గలవారు కాఁగా, సుందరస్య = సుందరబాహు విష్ణువుయొక్క, ఇహ = ఈ, వన, శైల, తటీషు = వనాద్రి

చరియలయందు, దృషత్, అపి = రాయి సైతము, ద్రవతి = కరఁగిపోవు చున్నది.

విశేషములు :- ప్రసక్తగానాసు— కిన్నరాంగనలు స్వరస్వభావోన్మేషపూర్వకముగా ద్రవిడోపనిషద్గానమునకుఁ బ్రారంభింపఁగా నని భావము. ద్రవతి దృషదపి— సంగీతమునకు రాళ్ళు కరఁగునని కవులు వర్ణింతురు, 'రహిఁ వృట్ట జంత్రగాత్రముల రాల్ గరఁగించు విమలగాంధర్వంబు విద్య మాకు

(ఆంధ్ర కవితా పితామహుఁడు)

అచటి కిన్నరాంగనలకుఁ గూడ ననన్యాదృశ మగునట్టి ద్రవిడోపనిషదనుభవము వర్ణింపఁ బడుటచేత దివ్యస్థలము జ్ఞానమును గూడఁ బ్రసాదించు నని చెప్పఁబడి నట్లయ్యెను.

తా॥ శ్రీశఠకోపమునులచేతఁ బ్రణీతములైన ద్రవిడోపనిషత్తులను స్వరరసభావయుక్తముగాఁ గిన్నరకాంతలు పాడు చుండఁగా సుందరబాహునివాసమగు వనశైలము సంబంధులగు తటములందు రాలు సైతము కరఁగి పోయెను.

ఉ. శ్రీశఠకోపనామముని
సింహముఖాబ్జమరంద మాధురీ
పేశలభావముల్ రసగ
భీరము సుస్వరశోభి ద్రావిడో
ద్ఘోషముఁ గిన్నరాంగనలు
కుతుకముల్ సవరించి పాడఁగా
శ్రీశనివాసభూ వనగి
రీశతటీశిలలున్ ద్రవించెడిన్.

శ్లో॥ భృంగి గాయతి హంసతాలనిభృతం తత్ పుష్ణతీ కోకిలా
ప్యుద్గాయత్యథ వల్లితల్లజముఖా దాస్రం మధు స్యందతే ।
నిష్పంద స్తిమితాః కురంగతతయః శీతం శిలాసైకతం
సాయాహ్నే కిల యత్ర సుందరభుజ స్తస్మిన్ వనక్ష్మాధరే ॥ 13

ప్రతి :- యత్ర = ఎచ్చట, సుందరభుజః = సుందరబాహు స్వామి, తిష్ఠతి = ఉండునో, తస్మిన్ = ఆ, వనక్ష్మాధరే = వనాద్రి యందు, సాయాహ్నే = సాయంకాలమునందు, హంస, తాల, నిభృతమ్ = హంసలయొక్క పాదతాళములతోడ నిండుగా, భృంగీ = ఆడుతుమ్మెద, గాయతి = గానముచేయును, తత్ = ఆగానమును, పుష్ణతీ = పోషించుచు, కోకిలా, అపి = ఆడు కోయిలయు, ఉద్గాయతి = బిగ్గరగా గానముచేయును, అథ = వాని గానానంతరము, వల్లి, తల్లజ, ముఖాత్ = శ్రేష్ఠమగు తీగెల కొననుండి, మధు = తేనియ నెడి, అస్రము = కన్నీరు, స్యందతే, స్రవించును, కురంగ, తతయః = లేడిగుంపులు, నిష్పంద, స్తిమితాః = కదలనివియు నిశ్చలములును (భవంతి = అగుచున్నవి), శిలాసైకతమ్ = రాయియు ఇసుకతిన్నెయు, శీతమ్ = చల్లనిది. (భవతి, కిల = అగు నట.)

విశేషములు :- పూర్వశ్లోకమున 'కిన్నరీషు' అనియు, ఈ శ్లోకమున 'భృంగీ,' 'కోకిలా' అనియు స్త్రీలింగ శబ్దములను గ్రహించుట గానమున స్త్రీకంఠస్వారస్యద్యోతనమున కని యెఱుంగ వలెను.

హంసతాలనిభృతమ్— భృంగాంగనా గానమునకు హంస గతి తాళమువలె నొప్పి నిండుతనమును గూర్చుచున్నదని

భావము. పూర్వశ్లోకమునఁ గిన్నరాంగనలు ద్రావిడప్రబంధ మునే గానము చేసినట్లు చెప్పఁబడి యుండుటవలన నిచ్చటఁ గూడ భృంగీకోకిలలు దానినే (దివ్యప్రబంధమునే) గానము చేసినవని కవి యాశయము. హంసస్వనము గూడఁ దాళస్వనము ననుకరించుచున్న వని కొందఱు చెప్పుదురు. నిష్పంద స్తిమితాః— నిష్పందశబ్దముచేతఁ గరచరణాది చలనరాహిత్యము, స్తిమితశబ్దముచేత నయనాది స్పందనరాహిత్యము చెప్పఁబడు చున్నవి. శీతం శిలాసైకతమ్— శిలాసైకతములు సైతము చల్లనైనవి యనుటచేత గానసౌభాగ్యము వెల్లడియగుచున్నది. ఇట్లు సాయంకాలమున ద్రావిడప్రబంధపఠన వర్ణనముచేత నిది దివ్యస్థల మని చాటఁబడినది.

తా॥ (శ్రీ) సుందరబాహుస్వామి సాయంకాలమున నెం దుండునో! యావనాద్రియందు దినదినము సేవాకాలము జరుగును. భృంగాంగన హంసగతు లనెడు తాళస్వనములతో దివ్యప్రబంధమును మధురముగాఁ బాడును. దానికిఁ బోషకముగా నాఁడు కోయిలయు బిగ్గఱగాఁ గంఠమెత్తి గానము చేయును. ఈ గానమును వినుటచేత వల్లీమతల్లులు తేనెపేర నానందబాష్పముల విడుచును. లేండ్లగుంపులు కదలక మెదలక నిలఁబడి పోవును. శిలలు సైకతములును గానరసముచేతఁ జల్లపడిపోవును.

శా. సాయంవేళ వనాద్రి సుందరభుజా
స్థానంబునన్ హంసతా

ఛాయామంబుగ భృంగి పాడ శ్రవణా
హ్లాదంబుగా ద్రావిడా
మ్నాయంబున్ శికి యాలపించు ప్రతిరొబుల్
మధ్వాస్రువుల్ గాఱుచున్
హాయిన్ తేశ్శృగముల్ వినున్ జలువలౌ
న్నాస్సైకతంబుల్ శిలల్.

అవతారిక :- ఈమీఁద నేచాంతో "దివిప్రద్రియమగో" స్తుతిం పఁ దలఁచినవారై స్వరూపముకంటెను దివ్యమంగళ విగ్రహము శుభాశ్రయ మగుటచేతఁ దద్వైశిష్ట్యము ననుసంధించు చున్నారు.

శ్లో॥ పీతాంబరం వరదశీతల దృష్టిపాత
మాజానులంబిభుజ మాయతకర్ణపాశమ్ ।
శ్రీమన్మహావనగిరీంద్ర నివాసదీక్షం
లక్ష్మీధరం కిమపి వస్తు మమావిరస్తు ॥ 14

ప్రతి :- పీత, అంబరమ్=పచ్చని పట్టువస్త్రము గలట్టియు, వరద, శీతల, దృష్టిపాతమ్=ఆశ్రితులకు వరముల నిచ్చునదియు, చల్లనిదియు, అగు కటాక్షము గలట్టియు, ఆజాను, లంబి, భుజమ్ = పిక్కలవఱకు వ్రేలాడు బాహువులు గలట్టియు, ఆయత, కర్ణపాశమ్=విశాలములగు శ్రేష్ఠములైన చెవులు గలట్టియు, శ్రీమత్, మహత్, వనగిరీంద్ర, నివాస దీక్షను= శ్రీ గలదియు, గొప్పదియునగు వనగిరిరాజమునందు, నివ సించుటయందు దీక్షగలట్టియు, లక్ష్మీధరమ్ = వక్షస్థలము నందు లక్ష్మిని దాల్చినట్టియు, కిమపి=అనిర్వాచ్యమైనట్టియు,

వస్తు = సుందరబాహురూపముతో నున్న పరబ్రహ్మవస్తువు, మమ = నాకు, ఆవిరస్తు = సాక్షాత్కారయోగ్య మగుఁగాక.

విశేషములు :— వైకుంఠ స్తవములోని 5 వ శ్లోకమే తృతీయపాదము మార్పుతో నిందు 14వ శ్లోకముగాఁ గూర్పఁబడినది. దివ్యమంగళ విగ్రహావర్ణనము సర్వత్ర ఏకరూపమే గదా!

పీతాంబరమ్— 'మహారజతం వాసః' అని చెప్పబడునట్లు కనకాంబరముగలది అని యర్థము. ఆజానులంబి భుజమ్— 'ఆయతా శ్చ సువృత్తా శ్చ బాహవః పరిఘోపమాః' అని శ్రీమద్రామాయణమునఁ జెప్పఁబడినట్లు సువృత్తస్థితాయత భుజములు గలది యని భావము. 'కిమపి వస్తు మ మావిరస్తు'— 'న తే రూపం నచాకారో నాయుధాని నచాస్పదమ్। తథాపి పురుషాకారో భక్తానాం త్వంప్రకాశ్యసే' అన్నట్లు వాఙ్మనసాగమ్య లావణ్యాది విశిష్టవస్తువుగా గోచరించుఁగాక.

తా॥ పీతాంబరము గలదియు, వరముల నొసఁగు చల్లని కటాక్షము గలదియు, ఆజానుబాహువులు గలదియు, ఆయతములును ప్రశస్తములు నగు కర్ణములు గలదియు, శ్రీమద్వనాద్రినివాసదీక్ష గలదియు, వక్షఃస్థలమున లక్ష్మి గలదియు, నగు నొకానొకవస్తువు నాకంటికి గోచరించుఁ గాక.

ఉ. పచ్చనిపట్టుబట్ట నిజ
భర్తలపైఁ గడుఁ జిల్లిన వగా
లిచ్చెడుచూపు చూపుఁ గని
యించెడు వీనులు గానుఁబుగ్గ్రమున్
మచ్చిక సేయుబాహులు స
న్మారమణీయ మురమ్ము గాంచనా
త్యుచ్చశిలోచ్చయం బిలు గ
నొప్పెడువస్తువు గొల్గ నామదిన్.

శ్లో॥ జనిజీవనాప్యయవిముక్తయో యతో
జగతా మితి శ్రుతిశిరస్సు గీయతే।
త దిదం సమస్తదురితైకభేషజం
వనశైలసంభవ మహం భజే మహః॥ 15

ప్రతి :- జగతామ్ = లోకములకు, జని, జీవన, అప్యయ, విముక్తయః=సృష్టి, స్థితి, సంహార, సంసారబంధ విమోచనములు, యతః= దేనివలన, (భవంతి= అగుచున్నవి) ఇతి= అని, శ్రుతిశిరస్సు = వేదాంతములందు, గీయతే= గానము చేయఁబడుచున్నదో, సమస్త, దురిత, ఏక, భేషజమ్=సమస్తపాపములకు ఒకేమందైన, వనశైలసంభవమ్=వనాద్రిలో సిద్ధమగు, తత్ =ఆ, ఇదమ్=ఈ, మహః= తేజస్సును, అహమ్ = నేను, భజే = సేవించుచున్నాను.

విశేషములు :- జగతామ్— తిష్ఠంతి ఇతి, జగంతి— అను వ్యుత్పత్తిచేతఁ గదలక నిలుచుండునవి యను నర్థము వచ్చుట

చేత స్థావరము లనియు, గచ్ఛంతి, ఇతి, జగంతి— అను వ్యుత్పత్తిచేత సంచరించునవి యనునర్థ మేర్పడుటచేత జంగ మము లనియుఁ జెప్ప వలనుపడుటచే జగతామ్=స్థావరజంగ మాత్మకము లగు సకలలోకములకు అని నిష్కృష్టార్థము. 'జనిజీవనాప్యయవిముక్తయోాయతః'— 'శ్రుతిశిరస్సు గీయతే'— ఆ వేదాంతవాక్యము లివి, 'యతో వా ఇమాని భూతాని జాయంతే। యేన జాతాని జీవంతి। యత్ ప్రయంత్యభిసంవి శంతి। తద్విజిజ్ఞాసస్వ। తద్బ్రహ్మ' 'సర్వదురితైకభేషజమ్'— సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః—అన్నట్లు సర్వ దుష్కర్మనివర్తక మని భావము. వనశైల సంభవమ్— వనాద్రి ఔషధాలయములో నుద్భవ మైనది. తదిదం మహః— 'నారాయణపరో జ్యోతిః' అని పేరు వహించినదియు, చేరు వలోనున్న యీ తేజస్సును, అహం భజే— నేను సేవించు చున్నాను భక్తిప్రపత్తు లనెడు ననుపానములతో నని భావము.

జగజ్జన్మాదికారణ మగు పరబ్రహ్మము సకల ముముక్షు సమాశ్రయణీయము గావున నావరవస్తువు వనాద్రిలో సులభ ప్రాప్యము గాన భక్తులను సేవింపుఁడని హెచ్చరించు చున్నారు.

తా॥ స్థావరజంగమాత్మకము లగు సకలలోకములకు సృష్టి స్థితి సంహార సంసారవిమోచనము లే వెల్గువలనఁ గలుగునని వేదాంతములు ఘంటాపథముగా ఘోషించుచున్నవో సకల పాపములను బాప నేకైకౌషధమగు వనాద్రిసంభవమైన యీ వెల్గును నేను సేవించుచున్నాను.

శా. వేదాంతంబులు చాటు నేకముగ నే
వెల్గీజగా లెల్ల ను
త్పాదించున్ మఱి పెంచుఁ ద్రుంచు భవవి
ధ్వంసంబు గావించు నం
చాదిత్యం బఘశోషణౌషధముగా
ఖ్యాతం బరణ్యాచల
ప్రాదుర్భూతము తన్మహోమహము సం
భావించి సేవించెదన్.

శ్లో॥ సద్బ్రహ్మాత్మపదై స్త్రయీశిరసి యో నారాయణోక్త్యా తథా
వ్యాఖ్యాతో గతిసామ్యలబ్ధవిషయానన్యత్వబోధోజ్జ్వలైః ।
నిస్తుల్యాధిక మద్వితీయ మమృతం తం పుండరీకేక్షణం
ప్రారూఢశ్రియ మాశ్రయే వనగిరేః కుంజోదితం సుందరమ్ ॥ 19

ప్రతి :- త్రయీశిరసి = ఉపనిషత్తునందు (వేదాంతము నందు) గతి.........ఉజ్జ్వలైః- గతి = వాక్యగమనిక లందలి, సామ్య = పోలికచేత, లబ్ధ = పొందఁబడిన, విషయ, అనన్యత్వ = విషయైక్యముయొక్క, బోధ = జ్ఞానముచేత, ఉజ్జ్వలైః = ప్రకాశించుచున్న, సత్, బ్రహ్మ, ఆత్మ, పదైః = సత్తు, బ్రహ్మము, ఆత్మ, అను పదములచేత, (కారణముగాఁ బ్రతిపాదింపఁబడిన, యః = ఎవఁడు, తథా = అట్లు (దేవతా విశేష వాచియై) నారాయణ, ఉక్త్యా = నారాయణుఁడను శబ్దము చేత, వ్యాఖ్యాతః = నిర్ణయింపఁబడెనో, నిస్తుల్యాధికమ్ = తనతో సమానుఁడుగాని అధికుఁడుగాని లేనట్టియు, (కనుక నే)

అద్వితీయమ్=సాటివాఁడు లేనట్టియు, అమృతమ్=అమృతము వలె భోగ్యభూతుఁడైనట్టియు, పుండరీక+ఈక్షణమ్=తెల్లఁదామరలవంటి కన్నులుగలట్టియు, వనగిరేః=వనాద్రియొక్క, కుంజ, ఉదితమ్=పొదరింటిలో ఆవిర్భవించినట్టియు, ఆరూఢ శ్రియమ్='ఆరూఢశ్రీ' అను నామాంతరముగల. తమ్=ఆ, సుందరమ్=సుందర బాహుస్వామిని, ఆశ్రయే=శరణుగా నాశ్రయించు చున్నాను.

విశేషములు :- 'గతిసామ్య.........ఉజ్జ్వలైః'—'స దేవ సౌమ్యేదమగ్ర ఆసీత్, బ్రహ్మ వా ఇద మేక మేవాగ్ర ఆసీత్, ఆత్మా వా ఇద మేక ఏవాగ్ర ఆసీత్' ఇత్యాది వాక్యములందు 'ఇద మగ్ర ఆసీత్' అను పోలికలతోఁ జేర్కొనఁబడి విష యైక్య జ్ఞానముతోఁ బ్రకాశించుచున్న. సత్, బ్రహ్మ, ఆత్మ, పదైః— మొదట సూక్ష్మవిభుసాధారణ్యముచేత సన్మాత్ర వాచకమగు 'సత్' శబ్దము— 'స దేవ సౌమ్యే ద మగ్ర ఆసీత్' అనుచోట వాడఁబడినది. తరువాత బ్రహ్మశబ్దము సూక్ష్మమునకుఁ గారణత్వమును నిరాకరించి చేతనాచేతన సాధారణముగా విభువస్తువునకుఁ గారణత్వమును చెప్పినది. ఆ తరువాత ఆత్మశబ్దముచేతనమాత్రవాచకమై యేదో యొక చేతనమునకుఁ గారణత్వమును బ్రతిపాదించుచున్నది. చివరకు 'ఏకో హ వై నారాయణ ఆసీత్ న బ్రహ్మ నేశానః' అను శ్రావునందలి నారాయణశబ్ద మాచేతనుఁడు నారాయణశబ్ద ముఖ్యవాచ్యుఁడగు భగవానుఁడు శ్రీమహావిష్ణువే జగజ్జ న్మాదికారణభూతుఁ డని నిర్ణయించు చున్నది. అని భావము.

నిస్తుల్యాధికమ్— 'న తత్సమ శ్చాభ్యధిక శ్చ దృశ్యతే' అను శ్రుతి యీ విషయమునఁ బ్రమాణము. అమృతోపమ— అమృతమువలె ననుభవింపఁ దగినవాఁడు భగవానుఁడు. 'రసో వై సః' అని శ్రుతి చాటును.

తా॥ వేదాంతశాస్త్రమునందు 'సదేవ సోమ్యేదమగ్ర ఆసీత్' ఇత్యాది వాక్యములలోని గమనికఁ బోలికను బట్టి యేక విషయకములుగాఁ గారణకోటిలోఁ జేర్పఁబడిన సత్, బ్రహ్మ, ఆత్మ, పదములచేత సామాన్యవిశేషన్యాయమునఁ గారణముఁగాఁ బ్రతిపాదింపఁ బడినది. కావున సముఁడు గాని యధికుఁడు గాని లేక యద్వితీయుఁడని పేరుచెందిన యమృతమువలె ననుభావ్యుఁడైన వనాద్రినికుంజములో వెలసిన పుండరీకాక్షుఁడగు సుందరబాహుస్వామిని నేను శరణముగా నాశ్రయించుచున్నాను.

శా. తత్తత్కారణవాక్యసామ్యగతి స
ద్బ్రహ్మాత్మశబ్దంబు లే
వేత్తన్ గర్తఁగఁ జెప్ప వేదశిర మా
వేల్పల్లనారాయణా
ఖ్యాత్తుండే జగదాదిమూల మగు న
య్యబ్జాక్షు నద్వంద్వు శ్రీ
చిత్తానందు వనాద్రికుంజసదనున్
సేవింతు నాసుందరున్.

శ్లో॥ 'పతిం విశ్వ స్యాత్మేశ్వర' మితి 'పరం బ్రహ్మ పురుషః
పరం జ్యోతి స్తత్త్వం పర' మితి చ 'నారాయణ' ఇతి ।
శ్రుతి ర్బ్రహ్మేశాదీన్ తదుదిత విభూతీం స్తు గృణతీ
యమాహారూఢశ్రీః స వనగిరిధామా విజయతే ॥ 17

ప్రతి :- శ్రుతిః = వేదము, బ్రహ్మ, ఈశ, ఆదీన్ = చతుర్ముఖబ్రహ్మ, ఈశ్వరుఁడు, మొదలుగాఁ గలవారిని, తత్, ఉదిత, విభూతీన్, తు = ఆనారాయణుని వలనఁ బుట్టినవైభవము గలవారినిగానే, గృణతీ = చెప్పుచు, యమ్ = ఏసుందరబాహుస్వామిని, 'పతింవిశ్వస్యాత్మేశ్వర' మితి = 'పతిం విశ్వస్యాత్మేశ్వర' మ్మనియు, 'పరం బ్రహ్మ' = 'నారాయణ పరం బ్రహ్మ' ఇతి, చ = అనియు 'పురుషః', ఇతి, చ = 'విశ్వ మేవేదం పురుషః' అనియు, పరం జ్యోతి స్తత్త్వం పర మితి చ నారాయణః ఇతి = 'నారాయణ పరంజ్యోతి స్తత్త్వం నారాయణః పరః' అనియు, ఆహ = చెప్పుచున్నదో, వనగిరిధామా = వనాద్రి నివాసముగాఁ గల, సః = ఆ, ఆరూఢశ్రీః 'ఆరూఢశ్రీ' అనునామాంతరము గల సుందరబాహువిష్ణువు, విజయతే = సర్వోత్కృష్టుఁడై వెలయుచున్నాఁడు.

విశేషములు :- ఈశ్లోకమున సుందరబాహువిష్ణువుయొక్క సర్వోత్కృష్టత్వమును శ్రుతివాక్యములచేత నిరూపించుచున్నారు. ఆ శ్రుతివాక్యముల యర్థమిట వ్రాయఁబడుచున్నది. 'శ్రుతి ర్బ్రహ్మేశాదీం స్తదుదితవిభూతీం స్తుగృణతీ'- బ్రహ్మేశానాదులు నారాయణుని వలనఁ బుట్టిరనుటకు విస్పష్టమైన శ్రుతి యేదనఁగా ? 'నారాయణా ద్బ్రహ్మ జాయతే'

అనునది దీనికర్థ మేమన— నారాయణాత్ =శ్రీమన్నా రాయణమూర్తి వలన, బ్రహ్మ=చతుర్ముఖబ్రహ్మ, జాయతే = పుట్టుచున్నాఁడు, నారాయణాత్ =శ్రీమన్నారాయణమూర్తి వలన, రుద్రః=రుద్రుఁడు, జాయతే=పుట్టుచున్నాఁడు. 'పతిం విశ్వస్యాత్మేశ్వరమ్'— విశ్వస్య = సమస్తప్రపంచమునకును, పతిమ్ = పాలకుఁడైనట్టియు, ఆత్మేశ్వరమ్=జీవాత్మలకును ప్రభువైనట్టియు, 'నారాయణపరం బ్రహ్మ' = శ్రీమన్నారాయణమూర్తియే పరబ్రహ్మము, 'విశ్వమే వేదం పురుషః' = ఈదృశ్యమానవిశ్వమే పురుషుఁడు. 'నారాయణపరో జ్యోతి స్తత్వం నారాయణః పరః'=నారాయణమూర్తియే పరమ జ్యోతి, నారాయణమూర్తియే పరమతత్వము. (విశ్వమే వేదం పురుషః— అనుచోట ఈ విశ్వమంతయు ఆ పురుషుని అధీన మని మాధ్వసంప్రదాయార్థము) విజయతే = సర్వదేవతో త్కర్షేణ వర్తతే— అందఱి దేవతలకంటె నధికుఁడై రాజిల్లు చున్నాఁడు. పరత్వశంకాస్పద భూతులగు బ్రహ్మరుద్రాదులకు సైతము విభూతి కారణమనుటచే శ్రీమన్నారాయణుని ఆధి క్యము స్పష్టమే కదా!

తా॥ బ్రహ్మరుద్రాదుల విభూతికి సైతము నారాయణ మూర్తి కారణమని 'పతిం విశ్వస్యాత్మేశ్వర' మిత్యాది వాక్యములచేత కీర్తించుచు శ్రుతియే వేల్పును సర్వోత్తముని గాఁ జేప్పెనో. 'ఆరూఢశ్రీ' అను నామాంతరము గల వనాద్రివాసి యా సుందరబాహుమూర్తి సర్వోత్కృష్టుఁడై వెలయు చున్నాఁడు.

మ. శ్రుతి యత్కీర్తిమహత్త్వ చాటునొ 'పరం
జ్యోతిః' 'పరంబ్రహ్మ' యన్
శతసంఖ్యాధిక వాక్పరంపరల నా
సర్వేశ్వరుండౌ రమా
పతి బ్రహ్మేశవిభూతి దాత పరదై
వం బౌక్కఁడే శ్రీవన
క్షితిభృచ్ఛృంగవిహారి సుందరభుజ
శ్రీదేవదేవుండె పో!

శ్లో॥ పృథివ్యాద్యాత్మాంతం నియమయతి య స్తత్త్వనికరం
తదంతర్యామీ తద్వపు రవిదిత స్తేన భగవాన్ ।
స ఏవ స్వైశ్వర్యం న విజహా దశేషం వనగిరిం
సమధ్యాసీనో నోవిశతు హృదయం సుందరభుజః ॥ 18

ప్రతి :— యః=ఏ, భగవాన్ = భగవంతుఁడు, పృథివీ, ఆది, ఆత్మ, అంతమ్=పృథివి మొదలుకొని ఆత్మ తుదిగాఁగల, తత్త్వనికరమ్ - తత్త్వసమూహమును, నియమయతి=నియమించుచున్నాఁడో, తత్, అంతః;యామీ=పృథివ్యాది ఆత్మపర్యంతముగల యాతత్త్వములకుఁ బ్రేరకుఁడై, తత్, వపుః = ఆతత్త్వములే శరీరముగాఁ గలవాఁడై, తేన = ఆతత్త్వసమూహముచేత, అవిదితః = తెలియఁ బడనివాఁడు, (భవతి=అగుచున్నాఁడో) అశేషమ్ = సమస్తమైన, స్వైశ్వర్యమ్=తనయైశ్వర్యమును, న,విజహాత్ = విడిచిపెట్టని వాఁడగుచునే, వనగిరిమ్=వనాద్రిని,

సమధ్యాసీనః = చక్కగా అధిష్ఠించి యున్నాఁడో, సః = ఆ, ఏషః = ఈ, సుందరభుజః = సుందబాహుస్వామి, నః = మా యొక్క, హృదయమ్=మనస్సును, విశతు = ప్రవేశించుఁ గాక.

విశేషములు :— పృథివ్యా ద్యాత్మాంతం నియమయతి— ఈ శ్లోకమునందు మొదటి రెండుపాదములందును అంతర్యామి బ్రహ్మణములోని యీవాక్యముల యర్థము వివరింపఁ బడినది.

'యః పృథివ్యాం తిష్ఠన్, పృథివ్యా అంతరో, యం పృథివీ న వేద, యస్య పృథివీశరీరం, యః పృథివీ మంతరో యమయతి. (ఎవఁడు పృథివిని జొచ్చి పృథివియందు నివసించుచున్నాఁడో, ఎవనిని పృథివి యెఱుఁగదో, ఎవనికిఁ బృథివి శరీరమో, ఎవఁడు పృథివికి అంతర్యామియై దానిని ప్రేరేపించునో,) అని యారంభించి 'య ఆత్మని తిష్ఠన్, ఆత్మనోం తరః, య మాత్మా న వేద, యస్యాత్మా శరీరం, య ఆత్మాన మంతరో యమయతి' (ఏ భగవానుఁడు ఆత్మను బ్రవేశించి యాత్మయందు వసించుచున్నాఁడో, ఆత్మ యెవని నెఱుఁగదో, ఆత్మ యెవనికి శరీరమో, ఏదేవుఁ డాత్మకు అంతర్యామియై ప్రేరేపించుచున్నాఁడో) అంతవఱకుఁ గల వాక్యముల తాత్పర్య మనుసంధించు కొనవలెను.

'నో విశతు హృదయం సుందరభుజః' సర్వాంతర్యామిత్వము స్వామికి సాధారణధర్మ మైనప్పటికిని ఆశ్రితానుగ్రహము కొఱకు దివ్యసుందరవిగ్రహముతో సుందరభుజ దేవుఁడు మా హృదయమున సన్నిధిచేయుఁ గాక యని భక్తుని ప్రార్థన.

తా॥ ఏ భగవానుఁడు పృథివి మొదలుకొని యాత్మ యంత ముగాఁ దత్త్వముల సృజించి వానిలోఁ జొచ్చి యవి శరీరములు గాఁ గలిగి వానికంతర్యామి యయ్యు వానికిఁ దెలియ శక్యము గాకున్నాఁడో యా భగవానుఁడు నిజవైభవముతో (శ్రీ) వనాద్రియందు వేంచేసి యున్నాఁడు. ఆ సుందరభుజస్వామి తన దివ్య విగ్రహముతో సర్వదా నా హృదయమునందు సన్నిధి చేయుఁ గాక.

ఉ. ఏభగవానుఁ డాదిగ మ
హీన్ దుది యాత్మగఁ గూర్చి తత్త్వముల్
శోభిలఁ దత్త్వవిష్టుఁ డగు
చున్ నియమించునో తద్వపుష్కుఁడై
స్వాభిమతంబు లేక తెలి
యం బడఁడో వనశైలవాసి యా
శోభనమూర్తి సుందర భు
జుండు మదంతరమందు వెల్గుతన్.

శ్లో॥ ప్రత్యగాత్మని కదాఽప్యసంభవ
ద్భూమభూమి మభివక్తి యం శ్రుతిః ।
తం వనాద్రినిలయం సుసుందరం
సుందరాయతభుజం భజామహే ॥ 19

ప్రతి :— యమ్ = ఏ వేల్పును, ప్రత్యగాత్మని = జీవాత్మ యందు, కదా, అపి = ఎన్నఁటికిని, (మోక్షదశయందు సైతము) అసంభవత్, భూమ, భూమిమ్ = సంభవింపని మహిమకు జన్మ స్థానమునుగా, శ్రుతిః = వేదము, అభివక్తి = అంతటను జెప్పు

చున్నదో, వనాద్రి, నిలయస్య = వనశైలము నివాసముగాఁగల, సుందర, ఆయత, భుజస్య = అందమైనను విశాలమైనను నగు బాహువులు గలవాఁడు గనుక నే, సుసుందరభుజస్య = సుందర భుజుఁడని పేరుగాంచిన, తస్య = ఆ వేల్పును, భజామహే = సేవించుచున్నాము.

విశేషములు :— ఈ శ్లోకము పూర్వార్ధమునఁ జెప్పఁబడిన విషయమున కనుగ్రాహకమైన ప్రమాణశ్రుతి. 'ఏష సర్వ భూతాంతరాత్మా అపహతపాప్మా, దివ్యో దేవ ఏకో నారా యణః' సర్వచేతనాచేతనాంతర్యామిగా నున్నప్పటికిని సర్వేశ్వ రుఁడు తత్తత్ప్రత్యగాత్మల యుండుండు దోషములతో లేశ మైనను సంబంధము లేక హేయప్రత్యనీక కల్యాణగుణైకతా నుండై పై శ్రుతి వర్ణించినప్రకారమే యుండును.

తా॥ జీవాత్మలయందు నెన్నఁటికిని సంభవింపని మహత్త్వ మునకుఁ బుట్టినిల్లని యే వేల్పును శ్రుతి ప్రతిపాదించుచున్నదో వనాద్రివాసియు సుందరదీర్ఘభుజుఁడు నగు నా సుందరబాహు దేవుని భజింతుము

ఉ. జీవునియందు మోక్షదశ
చేకుఱు కాలమునాఁటికే నసం
భావిత మైనదివ్యమహి
మంబునకున్ జనిభూమిగాఁగనే
దేవుఁ డయామతల్లి విను
తించునొ ! దీర్ఘసువృత్తదోర్యుగున్

శ్రీవనశైలవాసుని భ
జించెద సుందరబాహువిష్ణువున్.

శ్లో॥ వందేయ సుందరభుజం భుజగేంద్రభోగ
సక్తం మహావనగిరి ప్రణయప్రవీణమ్।
యం తం విదు ర్దహార మష్టగుణోపజష్ట
మాకాశ మౌపనిషదీషు సరస్వతీషు ॥ 20

ప్రతి :— యమ్=ఎవనిని, ఔపనిషదీషు = ఉపనిషత్సంబంధములగు, సరస్వతీషు = వాక్కులందు, అష్ట, గుణ, ఉపజుష్టమ్=అపహతపాప్మత్వము మొదలుగాఁగల యెనిమిది గుణములతోఁ గూడినట్టియు, దహరమ్=దహరనామకపుండరీకమునందు ఉన్నట్టియు, ఆకాశమ్=ఆకాశనామక పరమాత్మనుగా, (బ్రహ్మవిదః = బ్రహ్మవేత్తలు) విదుః = తెలిసికొనుచున్నారో, తమ్=అటువంటియు, భుజగేంద్ర, భోగ, సక్తమ్=శేషశరీరమునందుఁ బవ్వళించినట్టియు, మహా, వనగిరి, ప్రణయ, ప్రవీణమ్ = గొప్పదియగు వనాద్రి యందలి ప్రీతి విషయమున రసికుఁడైనట్టియు, సుందరభుజమ్ = సుందరబాహుస్వామిని, వందేయ = నమస్కరింతును గాక.

విశేషములు :— భుజగేంద్ర, భోగ, సక్తమ్ — శేషపర్యంకశాయి యని భావము. మహావనగిరి ప్రణయప్రవీణమ్— వనాద్రి భోగ్యతారసికుఁ డని తాత్పర్యము. ఈరెండు విశేషణములచేత 'ఏష నారాయణః శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః శేషపర్యంక ముత్సృజ్య హ్యాగతో మధురాపురీమ్' అన్నవిధముగా క్షీరాబ్ధినాథుఁడే వనాద్రినాథుఁడుగా వెలసినాఁడని పర్యవ

సించెను. 'అష్టగుణోపజుష్టను'— ఆకాశనామునకు పరమాత్మ యందుండు అష్టగుణము లెవ్వి యన? ఏష ఆత్మా అపహత పాప్మా విజరో విమృత్యుర్విశోకో విజిఘత్సోఽపిపాసః సత్య కామః సత్యసంకల్పః (ఉపనిషత్) 1. అపహతపాప్మత్వము = పాపములులేమి, 2. విజరత్వము = ముదిమి లేమి, 3. విమృ త్యుత = చావు లేమి, 4. విశోకత్వము = దుఃఖము లేమి, 5. విజిఘ త్సత్వము = ఆకలి లేమి, 6. అపిపాసత్వము = దప్పిక లేమి, 7. సత్యకామత్వము = యథార్థములగు కల్యాణగుణములు కలిమి, 8. సత్యసంకల్పత్వము = యథార్థమగు సంకల్పము కలిగియుండుట యనునవి.

ఆకాశమ్ — ఆ=సమంతాత్ కాశతే ఇతి ఆకాశః అనువ్యుత్పత్తిచేత నీ శబ్దము భగవద్వాచకమగు చున్నది. భగవానుఁడంతటఁ బ్రకాశించువాఁడే కదా!

తా॥ ఏ వేల్పును బ్రహ్మవేత్తలుపనిషద్వాక్యములు గోచ రించెడి యష్టగుణములతో నొప్పు దహరాకాశమునుగాఁ దెలియుదురో శేషపర్యంకశాయియు వనాద్రి సౌభాగ్యాను భవరసికుఁడు నగు నా సుందర బాహుమూర్తిని నమస్క రింతునుగాక.

ఉ. భోగికులాధి నాథుఁ డను
పువ్వుల సెజ్జఁ బరుండుసట్టి బల్
భోగి వనాద్రి సంపదను
భూతి రసజ్ఞుని వేని సర్వదా

ఆగమ సిద్ధమౌ దహర
మష్టగుణోజ్జ్వల మాకసంబుగా
యోగివరుల్ మదిం దలఁతు
రో! యలసుందర బాహు మ్రొక్కెదున్.

శ్లో. యత్ స్వాయత్తస్వరూప స్థితి కృతిక నిజేచ్ఛానియామ్యస్వశేషా
నంతాశేషప్రపంచ స్తత ఇహ చిదిహాచిద్వపుర్వాచి శబ్దైః।
విశ్వైశ్శబ్దైః ప్రవాచ్యో హతవృజినతయా నిత్యమేవానవద్య
స్తం వందే సుందరాహ్వాం వనగిరి నిలయం పుండరీకాయతాక్షమ్॥ 21

ప్రతి :— యత్ = ఎందువలన, స్వాయత్త........
...ప్రపంచః = స్వ, ఆయత్త = స్వాధీనములయిన, స్వరూప, స్థితి, కృతిక = స్వరూపము, స్థితి, ప్రవృత్తియుఁ గలిగినట్టియు, నిజ, ఇచ్ఛా, నియామ్య = స్వేచ్ఛచేత నియమింపఁదగినట్టియు, స్వశేష = తనకు దాసుఁడైనట్టియు, అనంత = అంతులేని, అశేష=సమస్తమగు, ప్రపంచః = ప్రపంచముగలవాఁడో, తతః = అందువలన, ఇహ = ఈ జగత్తునందు, అచిత్, వపుః, వాచి, శబ్దైః = అచిత్ (జడ) పరిణామములగు దేవ మనుష్యతిర్యగాది శరీరవాచి శబ్దములచేత, చిత్, ఇవ = చేతనుఁడు (జీవుఁడు) వలెనే విశ్వైః = సమస్తములగు శబ్దములచేత, ప్రవాచ్యః = ముఖ్యవృత్తిచేతఁ జెప్పఁదగినవాఁడును, హత, వృజిన, తయా = కొట్టివేయఁబడిన పాపములు గలవాఁడగుటచేత, నిత్యమ్ = ఎల్లప్పుడును, అనవద్యః, ఏవ = నిర్దోషుఁడుగనే, (భవతి = అగుచున్నాఁడో,) గిరివర,

నిలయమ్ = పర్వత శ్రేష్ఠమగు వనాద్రియే వాసముగాఁ గలట్టియు, పుండరీక, ఆయత, అక్షమ్ = తెల్ల దామరలవలె విశాలములగు కన్నులుగల, తమ్ = ఆ, సుందర, ఆహ్వాయమ్ = సుందర బాహువను పేరుగల వేల్పును, వందే = నమస్కరించుచున్నాను. (లేదా) స్తుతించుచున్నాను.

విశేషములు —......స్వశేష.........భగవానులగు భాష్యకారులు శేషశేషి భావము నిట్లు నిరూపించినారు 'పరగతాతిశయాధానేచ్ఛయా ఉపాదేయత్వ మేవ యస్య స్వరూపం స శేషః — పరః శేషీ — హాతవృజినతయా నిత్య మేవానవద్యః — హేయ ప్రత్యనీకుఁడే యని భావము. దీని భావమిది ప్రకృతి పరిణామ భూతములగు పంచ భూతములచేత నేర్పడిన దేవమనుష్యాది శరీరములను జెప్పు శబ్దములచేత 'పుమా న్న దేహో న నరో న తిర్యక్ స్థావరోఽపివా । జ్ఞానానందమయస్త్వాత్మా శేషో హి పరమాత్మనః' అన్నట్లు లాత్మాధారకత్వ, నియంతృత్వ శేషిత్వాదులచేత నీతఁడు దేవుఁడు మానవుఁడని చెప్పఁబడుచున్నాఁడు. ఇట్లు స్వాధీనత్రివిధచేతనా చేతన స్వరూపస్థితి ప్రవృత్తిభేదము వలనను నియంతృత్వము వలనను, శేషిత్వము వలనను, సకలచేతనా చేతనవాచి శబ్దములచేత 'తదేవానుప్రావిశత్, తదనుప్రవిశ్య, సచ్చత్యచ్చాభవత్, తదేవాగ్ని స్తద్వాయుః తత్సూర్య స్తదు చంద్రమాః, జ్యోతీంషి విష్ణు ర్భువనాని విష్ణు ర్వనాని విష్ణుర్గిరయో దిశశ్చ అని చెప్పిన విధముగా శ్రీమహావిష్ణువే పేర్కొనఁబడుచున్నాఁడు. జీవ

శరీర ప్రవేశమువలన స్వభావాన్యథాభావరూప జ్ఞానసంకోచ వికాసాది దోషములు సంభవించినను చేతనాచేతనాను ప్రవేశ ప్రసక్తతద్గతదోషసంస్పర్శ మేమాత్రము లేదు గనుక భగ వానుఁడు నిత్యనిరవద్యుఁడే యగును. ఇట్టి విశేషములన్నియు వనాద్రినిలయుఁడగు (శ్రీ) సుందరబాహువునందే కలిగి యుం డుటచే నా వేల్పే వందనీయుఁడని హృదయము.

తా॥ నిజేచ్ఛానియమ్యమును స్వశేషభూతము నగు నీవివిధ ప్రపంచమునకు సృష్టిస్థితిప్రవృత్త్యాదికము లెవనియధీనమున నున్నవో, అందువలననే యెవఁడచిద్వాపుర్వాచిశబ్దములచేతను అచిత్పరిణామదేవమనుష్యాది శరీరవాచి శబ్దములచేతను జీవునివలెఁ జేతనాచేతనవాచి సకల శబ్దములచేత ముఖ్య వాచ్యుఁడో, అపహతపాప్ముఁ డగుటచేత నిత్యనిరవద్యుఁడో! యట్టి పుండరీకాక్షుఁడును వనాద్రినిలయుఁడు నగు (శ్రీ) సుందర బాహుమూర్తిని నిరంతరము స్తుతించి నమస్కరింతును.

ఉ. ఈ వివిధప్రపంచమున
కేడ్గడ యాశ్రిత శేషియై యచి
ద్భావిత దేవతాదితను
వాచిపదంబుల జీవివోలె నే
దేవుఁడు సర్వవాక్సమభి
ధేయుఁడో! హేయగుణాతిదూరుఁడో!
యావనశైలవాసి జల
జాక్షుని సుందరబాహు ప్రొక్కెదన్.

(6)

శ్లో॥ గుణజం గుణినో హి మంగలత్వం
ప్రమితం ప్రత్యుత యత్స్వరూప మేత్య ।
త మనంతసుఖావబోధరూపం
విమలం సుందరబాహు మాశ్రయే ॥ 22

ప్రతి :— గుణినః = గుణవంతమగు వస్తువు యొక్క, మంగళత్వమ్ = శోభనత్వము, (శ్రేష్ఠత్వము) గుణజం, హి = గుణములవలన ఆవిర్భవించిన దని ప్రసిద్ధము గదా, (తత్ = అది) యత్, స్వరూపమ్ = ఏ భగవానుని సహజమైన హేయ ప్రత్యనీకకల్యాణగుణైకతాన మగు స్వరూపమును, ఏత్య = పొంది, ప్రత్యుత = వైపరీత్యముగా, (పై పెచ్చు) ప్రమితమ్ = (గుణములకు శ్రేష్ఠత్వము గుణ్యాధీనమని) నిర్ణయింపఁ బడెనో, తమ్ = అటువంటియు, అనంత, సుఖ, అవబోధ, రూపమ్ = అంతులేనిసుఖము జ్ఞానము స్వరూపముగాఁ గలట్టియు, విమలమ్ = నిర్మల మైనట్టియు, సుందరబాహుమ్ = సుందరబాహు స్వామిని, ఆశ్రయే = శరణు చొచ్చుచున్నాను. (ఆశ్రయించుచున్నాను.)

విశేషములు :— గుణజం గుణినో హి మంగళత్వమ్ — మణి, ద్యుమణి (సూర్యుఁడు) చందనము, చంపకము, అరవిందము మొదలుగాఁగల వస్తువులకు శ్రేష్ఠత్వము ప్రభ, ప్రసాదము, సౌరభ్యము మున్నగు గుణములచేత వచ్చుట లోక ప్రసిద్ధము. ఇట్లుండఁగా దీనికి విపరీతముగా, ప్రమితం ప్రత్యుత యత్స్వరూప మేత్య— శ్రీభగవానుని స్వాభావికమైన హేయ ప్రత్యనీకమును కల్యాణగుణైకతానము నగు స్వరూపమును

జెందుటచేత గుణములకు శ్రేష్ఠత్వము గలిగెనని శ్రుతులు చాటుచున్నవని భావము. ఆశ్రుతు లెవ్వి యన— 'సత్యస్య సత్యం, జ్యోతిషాం జ్యోతిః, పవిత్రాణాం పవిత్రం యో మంగ లానాం చ మంగలమ్' సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ, విజ్ఞాన మానందం బ్రహ్మ, అపహతపాప్మా విజరః ఇత్యాదులు.

తా॥ తేజస్సుచేత మణి దినమణులకును, కాంతిచేతఁ జంద్రు నకును, సౌగంధ్యముచేతఁ జందనచంపకారవిందాదులకును, గొప్పతనము గలిగి గుణవద్వస్తువునకుఁ గల్గిన గొప్పతనము గుణములవలన నని జగత్తులోఁ బ్రసిద్ధమైనది. దానికి విరుద్ధ ముగా శ్రుతిస్మృతులు గుణములకు గొప్పతనము హేయప్రత్య నీక కల్యాణగుణైకతాన మగు భగవత్స్వరూపము నాశ్ర యించుటచేత నని చాటుట గుణగౌరవము గుణ్యాధీన మని ఘంటాపథముగా ఘోషించుచున్నవో యట్టి దోషదూరుఁడును కల్యాణగుణనిలయుఁడును జ్ఞానానందస్వరూపుఁడు నగు శ్రీ సుందరబాహుస్వామిని శరణు చొచ్చెదను.

చ. గుణములచే మహత్త్వ మొనఁ
గూడును బో! గుణికోటికిన్ నభో
మణి ప్రభచేత శీతఘృణి
మంజులకాంతినిగాదె మిన్నధా
రుణిఁ దలఁకిందు దీనికి స్వ
రూపముగా నయి వేసికిన్ గుణాల్
గణుతి వహించె మొక్కెద న
ఖండుని సుందరబాహు నావిభున్.

శ్లో॥ అతిపతితావధిస్వ మహిమానుభవప్రభవత్
సుఖకృతనిస్తరంగజలధీయితనిత్యదశమ్ ।
ప్రతిభట మేవ హేయనికరస్య సదాఽప్రతిమం
హరి మిహ సుందరాహ్వ ముపయామి వనాద్రితటే ॥ 23

ప్రతి :— అతి.........నిత్యదశమ్— అతిపతిత=అతిక్రమింపఁబడిన, అవధి=హద్దుగల, స్వ=తన, మహిమ = వైభవముయొక్క, అనుభవ=అనుభవముచేత, ప్రభవత్ =పుట్టుచున్న, సుఖ=ఆనందముచేత, కృత చేయఁబడిన, నిస్తరంగ= అలలులేని, జలధీయిత=సముద్రమువలెనున్న, నిత్యదశమ్ = నిత్యదశ గలిగినట్టియు, సదా =ఎల్లప్పుడు, హేయనికరస్య = దోషసమూహమునకు, ప్రతిభటమ్ = ప్రతిద్వంద్వి యైనట్టియు (విరోధియైనట్టియు) అప్రతిమమ్ = సాటిలేనట్టియు, సుందరాహ్వామ్ = సుందరబాహు నామకుఁడగు, హరిమ్=(శ్రీ)మహావిష్ణువును, ఇహ = ఈ, వనాద్రితటే = వనశైలముచరియయందు, ఉపయామి = శరణు చొచ్చుచున్నాను.

విశేషములు :— భగవంతునకు నిత్యోదితదశ యనిఁయు, శాంతోదితదశ యనియు రెండుదశలు గలవు. వానిలో స్వవైభవానుభవదశను నిత్యోదితదశ యందురు. విభూత్యనుభవదశ శాంతోదితదశ. నిత్యోదితదశయే యీశ్లోకమున వివరింపఁబడినది. ఈ దశయందు భగవంతుఁడు తన్ను వాసుదేవునిగాఁ జింతించుకొనుచుఁ దచ్చింతనాజనితసుఖముచేత నిస్తరంగ మహోదధివలె నానందమయుఁడై యుండును.

తా॥ అవధిలేని స్వవైభవానుభవముచేత నుత్పన్నమగు సుఖముచేత నిస్తరంగమహోదధిసదృశ మగు నిత్యోదితదశ గలవాఁడై తమస్సునకుఁ దేజంబువలె హేయగుణనికరంబునకుఁ బ్రతిభటుండై యప్రతిమానుండై యుప్వవనాద్రితటవాసియగు శ్రీ సుందరబాహుమూర్తి నిట శరణు చొచ్చుచున్నాను.

ఉ. అంత విహీననైజ విభ
వానుభవప్రభవత్సుఖంబుచే
శాంతతరంగవారి నిధి
చందము నిత్యదశోపపన్నుఁడై
ఎంతయు హేయకోటి కెదు
రెత్తయి చీఁకటికిన్ వెలుం గటుల్
చింతకపాళిఁ దన్పువారి
శ్రీవనశైలగు నాశ్రయించెదన్.

శ్లో॥ సదాషాడ్గుణ్యాఖ్యైః పృథులబలవిజ్ఞానశకన
ప్రభావీర్యైశ్వర్యై రవధివిధురై రేధితదశమ్।
ద్రుమస్తోమక్ష్మాభృత్ పరిసరమహోద్యానముదితం
ప్రపద్యేఽధ్యారూఢ శ్రియ మిహ మహాం సుందరభుజమ్॥ 24

ప్రతి :— సదా = ఎల్లప్పుడు, షాడ్గుణ్య, ఆఖ్యైః = షడ్గుణముల నెడు పేరుగలిగినట్టియు, అవధి, విధురైః = హద్దు లేనట్టియు, పృథుల......శ్వర్యైః — పృథుల = గొప్ప, బల = బలముచేతను, విజ్ఞాన = విశేషజ్ఞానముచేతను, శకన = శక్తి చేతను, ప్రభా = కాంతిచేతను, వీర్య = వీర్యముచేతను, ఐశ్వర్యైః = ఐశ్వర్యముచేతను, ఏధితదశమ్ = వృద్ధి చెం

దింపఁ బడిన దశ గలిగినట్టియు, ద్రుమ ... ముదితమ్ — ద్రుమ = చెట్లయొక్క, స్తోమ = సమూహముతో (కూడిన) క్ష్మాభృత్ = కొండయొక్క (వనాదియొక్క) పరిసర = సమీపములోని, మహత్ = గొప్ప, ఉద్యాన = పూల తోఁటయందు, ముదితమ్ = ప్రీతిగల, అధ్యారూఢశ్రియమ్ = 'అధ్యారూఢశ్రీ' అను నామాంతరము గల, సుందరభుజమ్ = సుందర బాహుదేవుని, అహమ్ = నేను, ప్రపద్యే = శరణు చొచ్చు చున్నాను.

విశేషములు :— షాడ్గుణ్యాఖ్యైః — షడ్గుణము లని పేరు గలవి. అవి యే వనఁగా — బల విజ్ఞానశక్తి తేజోవీర్యైశ్వర్య ములు. పృథుల బల — ఇందలి 'పృథుల' శబ్ద విశేషణము చేతన నిష్ఠములగు పరిమిత జ్ఞాన శక్త్యాదుల వ్యావృత్తికొఱకు వేయఁ బడినది అవధివిధురైః — ఈ విశేషణము ఆనంద వల్లిలోఁ జెప్పఁ బడిన యానందగుణయత్తారాహిత్యము నే స్థాలీపులాకన్యాయముచేత సకలగుణ సముదాయమునకును సమానమని సూచించు చున్నది.

తా॥ ఎల్లప్పుడు షడ్గుణముల నెడు లోకోత్తరములు ఇయ త్తారహితములు నగు బలజ్ఞాన శక్తి తేజోవీర్యైశ్వర్యములతో అభివర్ధమానదశ గలిగినట్టియు, వనాద్రిపరసరమహోద్యాన మున నివసింపఁ బ్రీతి గలిగినట్టియు, 'ఆరూఢశ్రీ.' అను నా మాంతరముగల శ్రీ సుందర బాహుమూర్తిని శరణు చొచ్చు చున్నాను.

శా॥ ప్రౌఢజ్ఞానబలప్రభాశకనవీ
ర్యంబుల్ మహైశ్వర్య మన్
రూఢిన్ బొల్చెడుషడ్గుణంబుల సమా
రోహద్దశోపేతునిన్
గాఢోత్కంఠ భజింతు సుందరభుజున్
గంజాతపత్రాక్షు నా
రూఢశ్రీకు వనాద్రినిష్కుటవిహా
రున్ నీవె దిక్కం చెదన్.

అవతారిక :— పూర్వోక్త షాడ్గుణ్యపరిణామ వితతి రూపంబులగు సౌశీల్యాదులగు స్వరూప గుణములను, విగ్రహ గుణంబులగు సౌందర్యాదులు నిందు వర్ణింపఁబడుచున్నవి.

శ్లో॥ సౌశీల్యాశ్రిత వత్సలత్వమృదుతా సౌహార్దసామ్యార్జవై
ర్ధైర్య స్థైర్య సువీర్యశౌర్యకృతితా గాంభీర్యచాతుర్యకైః ।
సౌందర్యాన్విత సౌకుమార్యసమతా లావణ్యముఖ్యై ర్గుణై
ర్దేవః శ్రీతరుషండశైలనిలయో నిత్యం స్థితః సుందరః ॥ 25

ప్రతి :— సౌశీల్యా......ఆర్జవైః— సౌశీల్య = మంచి శీలముచేతను, ఆశ్రితవత్సలత్వ = ఆశ్రయించిన వారియెడఁ గల వాత్సల్యముచేతను, మృదుతా = మార్దవముచేతను, సౌహార్ద = స్నేహముచేతను, సామ్య = సమత్వముచేతనుఁ ఆర్జవైః = ఋజుభావముచేతను, ధైర్య......చాతుర్యకైః— ధైర్య = ధైర్యముచేతను, స్థైర్య = స్థైర్యముచేతను, సువీర్య = మంచి వీరత్వముచేతను, శౌర్య = శూరత్వముచేతను, కృతితా =

కృతకృత్యతచేతను, గాంభీర్య=లోతుతనముచేతను, చాతుర్యైః=చతురత్వముచేతను, సౌదర్యా.........ముఖ్యైః—సౌందర్య=చక్కఁదనముతో, అన్విత=కూడిన, సౌకుమార్య=సుకుమారత, సమతా = అవయవపరిమాణ సమత్వము, లావణ్య = కాంతివిశేషము, ముఖ్యైః = మొదలుగాఁగల, గుణైః=గుణములచేత, (ఉపలక్షితః = చూడఁబడినవాఁడై) దేవః=క్రీడాదిగుణవిశిష్టుఁడై, సుందరః=సుందరబాహుమూర్తి నిత్యమ్=ఎల్లప్పుడు, శ్రీతరుషండశైలనిలయః = శ్రీవనాద్రి నివాసుఁడై, స్థితః=ఉన్నాఁడు.

విశేషములు :— సౌశీల్యమ్ = మహతో మందైః స్సహ నీరంధ్రేణ సంశ్లేషః, గొప్పవానికిఁ గొంచెవారలతో నెడ తెగకుండఁ గలసి మెలసి యుండుట సౌశీల్యము, వాత్సల్యము = దోషములను లెక్కసేయని స్నేహవిశేషము, మృదుత = ఆశ్రితుల యెడఁబాటును సహింపలేని మెత్తదనము, సౌహార్దము = ఆశ్రితుఁడనియు అనాశ్రితుఁడనియు భేదము లేకుండ నెల్లవారిమేలు కోరుట, సామ్యము = కులము విద్య ప్రవర్తనమును జూడకయే యెల్లవారికి నాశ్రయణీయుఁడై యుండుట, ఆర్జవము = మనోవాక్కాయకర్మములందు నేక రూపముతో నుండుట, ధైర్యము=మిక్కిలిగా ననిష్టములు వచ్చినను గుండె చెదరకుండుట, స్థైర్యము=శరణాగత విషయమునఁ బురుషకారభూతురాలగు లక్ష్మీదేవి దోషోద్ఘాటన మొనర్చినను బ్రతిజ్ఞను బరిపాలించుట.

# సుందరబాహు స్తవము

(గతసంచిక తరువాయి)

వీర్యము = అతిదుష్కరమగు యుద్ధము నందును శ్రమఁ జెందకుండుట, శౌర్యము = తోడులేకున్నను అతిభయంకరము లగు వైరులలోనికిఁ జొచ్చుకొని పోవుశక్తి, కృతిత = కృత కృత్యత, గాంభీర్యము = తెలియ శక్యముగాని హృదయము గలిగి యుండుట, చాతుర్యము = ఇతరులకు శక్యములుకాని యెల్లపనులను సులువుగాఁజేయు నేర్పు, సౌందర్యము=దృష్టిని చిత్తమును ఆకర్షించునవయవశోభ, సౌకుమార్యము=పూవు కంటె నధికమగు మార్దవము, సమత = సాముద్రికశాస్త్రోక్త సమపరిమాణావయవ శాలిత్వము, లావణ్యము=సముదాయ శోభ, ఇట్లీశ్లోకము నందలి పదముల కర్థము నెఱుంగవలయును.

తా॥ క్రీడాదిగుణవిశిష్టుఁ డగు శ్రీసుందర బాహుమూర్తి సౌశీల్యవాత్సల్యమార్దవ సౌహార్దాది దివ్య స్వరూపగుణముల తోడను, సౌందర్య సౌకుమార్య సమతాలావణ్యాది దివ్య విగ్రహగుణములతోడను ఒప్పుచు ద్రుమషండమండితం బగు వనాద్రియందు నిత్యనివాస మొనర్చుచున్నాఁడు. ఆ దేవ దేవుని శరణు చొచ్చెదను.

శా. సౌశీల్యాశ్రితవత్సలత్వమృదుతా

సౌహార్ద సామార్జవ

శ్రీశూరత్వసువీర్య ధైర్యకృతితా
శ్రీనోరుగాంభీర్యల
శ్రీశోభిత్వనిజస్వరూపగుణరా
శిన్ మంజుతా సౌకుమా
ర్యాశేషాంగగుణాళి సుందరభుజుం
డాకొండపై నుండెడున్.

శ్లో॥ యే ష్వేకస్య గుణస్య విప్రుడపి వై లోకోత్తరం స్వాశ్రయం
కుర్యా త్తాదృశవైభవై రగణితై ర్నిస్సీమ భూమాన్వితైః ।
నిత్యై ర్దివ్యగుణై స్తతోఽధికశుభ త్వైకాస్పదాత్మాశ్రయై
రిద్ధం సుందరబాహు మస్మి శరణం యాతో వనాద్రీశ్వరమ్ ॥ 26

ప్రతి :— యేషు = ఏగుణములందు, ఏకస్య = ఒక, గుణస్య = గుణముయొక్క, విప్రుట్, అపి = బిందు వేసియు, స్వాశ్రయమ్ = తన కాధారమగు గుణిని, లోకోత్తరమ్ = సర్వాధికునిగా, కుర్యాత్ = చేయునో, తాదృశవైభవైః = అటువంటి వైభవములు గలిగినట్టియు, అగణితైః = లెక్క లేనట్టియు, నిస్సీమ, భూమ, అన్వితైః = హద్దులేని మహిమ లతోఁ గూడినట్టియు, నిత్యైః=నిత్యములైనట్టియు, తతో— ఆశ్రయైః— తతోఽధిక = అంతకంటెను (వెనుకఁ జెప్పఁబడిన దానికంటెను) అధికమైన, శుభత్వ= కా నాశ్రయము గాఁగల శుభత్వమునకు, ఏక = ముఖ్యముగా, ఆస్పద=ఆధారములైన,

# సుందరబాహుస్తవము

ఆత్మాశ్రయైః=దివ్యాత్మస్వరూపాధారములైన, దివ్యగుణైః=జ్ఞానశక్త్యాది పూర్వోక్తగుణములచేత, ఇద్ధమ్=ప్రకాశించుచున్న, వనాద్రీశ్వరమ్=వనాద్రినాథుఁడగు, సుందరబాహుమ్—సుందరబాహుదేవుని, శరణమ్=శరణును, యాతః = పొందినవాఁడను, అస్మి = అగుచున్నాను.

విశేషములు :— తాదృశవైభవైః— స్వాశ్రయమునకు లోకోత్తరత్వమును జేకూర్చు వైభవముగల, అస్మి శరణం యాతః— ఏతాదృశ కల్యాణగుణవిశిష్టుఁడగు సుందరబాహుస్వామినే శరణు చొచ్చఁదగినవాఁడు.

తా॥ ఏకల్యాణగుణములలో నొకగుణముయొక్క బిందువేనియు నిజాశ్రయమగు వ్యక్తిని లోకోత్తరునిగాఁ జేయునో, అట్టివైభవములు గలవియు అసంఖ్యాతములైనవియు నిరవధికములగు మహిమలు గలవియు నిత్యములైనవియుఁ బూర్వోక్త గుణములకంటె నత్యధికశుభాస్పదములైన దివ్యగుణములతోఁ బ్రకాశించు వనాద్రినాథుఁడగు శ్రీ సుందరబాహుమూర్తిని శరణు చొచ్చెదను.

శా. ఎం దేయొక్క గుణంబులోనియొక బా
ట్టైనిన్ నిజాధారభూ
తుం దాఁ జేయునొ సర్వలోకముల నా
థున్ దాదృశైశ్వర్యుని

ష్పందో క్త్యాధికమంగళాస్పదగుణా
సారోజ్జ్వలాంభోదమై
సందీపించు వనాద్రిసుందరభుజా!
చల్లార్పు నాతాపమున్.

శ్లో॥ సదా సమస్తం జగ దీక్షతే హి యః
ప్రత్యక్షదృష్ట్యా యుగప ద్భువా స్వతః।
స ఈదృశజ్ఞాననిధి ర్నిధి స్తు నః
సింహాద్రికుంజేషు చకాస్తి సుందరః॥ 27

ప్రతి:— యః = ఏ వేల్పు, సదా=ఎల్లప్పుడు, స్వతః = సహజమగు, యుగపత్, భువా=ఒకేమారు పుట్టిన, ప్రత్యక్ష దృష్ట్యా = ప్రత్యక్షజ్ఞానముచేత, సమస్తమ్ = సమస్తమగు, జగత్ =ప్రపంచమును, ఈక్షతే హి = చూచుచున్నాఁడో, ఈదృశ, జ్ఞాన, నిధిః=ఇటువంటి యుత్తమజ్ఞానమునకు గనియు, నః=మాయొక్క, నిధిః, తు=పెన్నిధియునగు, సః=ఆసుందర బాహుమూర్తి, సింహాద్రి కుంజేషు=వనాద్రిమీఁది పొదరిండ్ల యందు, చకాస్తి=ప్రకాశించు చున్నాఁడు.

విశేషములు :— ఈశ్లోకమునందలి 'యుగపద్భువా' అను పదము క్రమముగా సర్వసాక్షాత్కారకము లగు చేతన విశేషుఁ వ్యావృత్తికొఱకును, 'స్వతః' అనుపదము యోగిజన

వ్యావృత్తికొఱకును 'సదా' అను పదము ముక్తపురుష వ్యావృత్తికొఱకును నిబంధింపఁబడినవి. లేదా— 'సదా' అను ఒక పదముచేతనే యోగిముక్తజనవ్యావృత్తి సిద్ధించునుగాన 'స్వతః' అను పదము భగవత్సంకల్పాయత్తములగు సకల నిత్యజ్ఞానవ్యావృత్తిని జేయుచున్నది. 'స్వతః, యుగపద్భవా' అను రెండుపదములును 'నయనశ్రవణోద్భృశాగ్రహణోపి' అని చెప్పినప్రకారము తత్తద్విషయగ్రహణమునందుఁ బ్రతినియత కరణనియమాభావము కరణాపేక్ష లేకయే సాక్షాత్కార మును గర్భితములైన వని నుడువుచున్నవి. మొత్తముమీఁద ఈ శ్లోకములోని పై పదములు జ్ఞానమునకుఁ గావలసిన హంగుల నెల్ల వివరించుచున్నవి. ఇట్టి జ్ఞాననిధియగు సుందరబాహువు మాపాలిటి పెన్నిధియని సారాంశము. వనాద్రికే సింహాద్రి యనియు నామాంతరము.

తా॥ ఏ దేవదేవుఁడు సర్వదా యుగపదుద్భూత మగు సహజమైన దివ్యదృష్టిచేత సమస్త ప్రపంచమును నెదుటనున్న వస్తువును బోలెఁ జూచునో తాదృశదివ్యజ్ఞాననిధి యగు మా పాలిటి పెన్నిధియైన శ్రీసుందరబాహుమూర్తి వనాద్రి నికుంజములందుఁ బ్రకాశించు చున్నాఁడు.

ఉ. వేలుపు వేలుపౌ నెవఁడు
  విశ్వము సర్వము నొక్కమాఱెయు

న్మీలిత దివ్యదృష్టిని స
మీపపదార్థముఁబోలెఁ జూచునో
ఆలలితుండు సుందరభు
జాఖ్యుఁడు తాదృశచిత్పయోధి మా
పాలిటిపెన్నిధానము ద్రు
పర్వతకుంజములందు రాజిలున్.

అవతారిక :— ఇట్లు భగవానుని జ్ఞానమునకు వివిధచేతన వైలక్షణ్యమును నిరూపించి ఐశ్వర్యాది గుణపంచకమునకు జగత్కారణత్వాదుల కుపయుక్త విధముగా వైలక్షణ్యమును దిఙ్మాత్రముగాఁ బ్రదర్శించు చున్నారు.

శ్లో॥ ఐశ్వర్యతేజోబలవీర్యశక్తయః
కీదృగ్విధాః సుందరబాహుసంశ్రయాః ।
యోఽసౌ జగజ్జన్మలయస్థితిక్రియాః
సంకల్పతోఽల్పా దుపకల్పయ త్యజః ॥ 28

ప్రతి :— యః = ఏ, అసౌ = ఈ, అజః = జన్మరహితుఁడగు పరమాత్మ, అల్పాత్ = స్వల్పమగు, సంకల్పతః = సంకల్పము వలన, జగత్, జన్మ, లయ, స్థితి, క్రియాః = లోకముయొక్క సృష్టి సంహార రక్షణప్రవృత్తి నివృత్తిక్రియలను, ఉపకల్పయతి = చేయుచున్నాఁడో సుందరబాహు సంశ్రయాః = అట్టిసుందరబాహు వాశ్రయముగాఁ గల, ఐశ్వర్య, తేజః, బల,

వీర్య, శక్తయః ఐశ్వర్యము, తేజస్సు, బలము, వీర్యము, శక్తియు, కీదృగ్విధాః=ఇట్టివని చెప్పుటకు శక్యము గానివి.

విశేషములు :— ఏమహాత్ముని లవలేశమగు సంకల్పము వలన సకలజగత్ సృష్టిస్థితి సంహారాదులు ప్రవర్తిల్లుచున్నవో యామహనీయుఁడగు (శ్రీ) సుందరబాహుమూర్తి నవలంబించి యున్న యైశ్వర్యాదు లనన్యాదృశము లపరిచ్ఛిన్నంబులు నై యున్నవి.

తా॥ ఏదేవుఁడు స్వల్పసంకల్పముచేతను జగత్సృష్టి సంహార రక్షణ ప్రవృత్తినివృత్తుల నొనర్చునో యట్టిసుందరబాహువు నాశ్రయించియున్న యైశ్వర్యతేజోబల వీర్యశక్తులు లోకోత్తరము లైనవి.

ఉ. ఏ భగవానుఁ డల్ప మగు
నిచ్ఛనె సృష్టిలయావనాదికం
బీభువనాళి కెల్ల ఘటి
యించునో ! యట్టిమహాప్రభావతే
జోభరశాలి సుందరభు
జుండె నివాసముగాఁగఁ గల్గున
త్రాభవవీర్యశక్తిబల
భాగుణముల్ జగదప్రమేయముల్.

శ్లో॥ యత్ కల్పాయుతభోగతోఽపి కృశతాం యాయాన్న వా తత్ఫలం
యే ష్వేకస్య తథావిధై స్సతతజై రంహోభి రుత్సీమభిః।
అస్తాదా విహ సంసృతా వుపచితై శ్ఛన్నం సుసన్నం జనం
సన్నత్యా క్షమతే క్షణా ద్వనగిరి ప్రస్థప్రియ స్సుందరః॥ 29

ప్రతి :— యత్ = ఏపాపఫలము, కల్ప, అయుత, భోగ తః, అపి = పదివేలకల్పము లనుభవించినప్పటికిని, కార్శ్యమ్ = కృశత్వమును, యాయాత్, వా = పొందునో!, న వా = లేదో, (కొంచెమేనియుఁ దఱుఁగ దని నిర్ణయము) తత్ = అట్టి, ఫలమ్ = ఫలము, అంహస్సు = పాపములయందు (పాపములలో) ఏకస్య = ఒకదానిది, తథావిధైః = అట్టి వంటియు, సతతజైః = ఎడతెగకుండ అనుష్ఠింపఁ బడినట్టియు, ఉత్సీమభిః = హద్దుమీఱినట్టియు, అస్త + ఆదౌ = నశించిన మొదలు గలిగినట్టియు (అనాది యైనట్టియు) సంసృతౌ = సంసారమునందు, ఇహ = ఈ కర్మభూమియందు, ఉపచితైః = వృద్ధిపొందిపఁ బడినట్టియు, అంహోభిః = పాపములచేత, ఛన్నమ్ = కప్పివేయఁ బడినట్టియు, సుసన్నమ్ = మిక్కిలి వినాశ మును పొందినట్టియు, జనమ్ = ఒకసామాన్యనరుని, సన్నత్యా = నమస్కారమాత్రముచేత, క్షణాత్ = క్షణములో (అప్పుడే) వన, గిరి, ప్రస్థ, ప్రియః = వనాద్రిచఱియందుఁ బ్రేమగల, సుందరః = సుందరబాహుస్వామి, క్షమతే = క్షమించు చున్నాఁడు.

బడఁగా అదియే శరణాగతి యని భావించి శ్రీరాముఁ డెట్లు క్షమించి రక్షించెనో! అట్లే క్షమించి రక్షించు నని భావము.

మ. పదివేల్ కల్పములేన్ భుజింప నొకపా
పంపున్ ఫలం బేని త
గ్గదా! తాదృగ్వృజినంబులన్ జని జనిన్
గర్మావనిన్ జాలఁ బెం
పొదవన్ జేసెదు నాత్మఘాతుకుఁ డభ
వ్యుం డొక్కమాఱ్ మ్రొక్కఁ గా
చు దయన్ సుందరుఁ డల్లకాకదనుజున్
క్షోణీసుతేశుం డటుల్.

శ్లో|| యజ్జాతీయో యాదృశో యత్స్వభావః
పాదచ్ఛాయాసంశ్రితో యోఽపి కోఽపి ।
తజ్జాతీయ స్తాదృశ స్తత్స్వభావః
శ్లిష్య త్యేనం సుందరో వత్సలత్వాత్ ॥ 30

ప్రతి :— యత్, జాతీయః = ఎటువంటి జాతిగలవాఁడు, యాదృశః=ఎటువంటి యాచారము కలవాఁడు, యత్, స్వభావః=ఎటువంటి స్వభావము గలవాఁడు, యః, అపి, కః, అపి=ఎవ్వఁడేకాని, పాద, ఛాయా, సంశ్రితః=పాదముల నీడను ఆశ్రయించినవాఁడు, (భవతి = అగు చున్నాఁడో!)

ఏనమ్=ఈజనుని, సుందరః=సుందర బాహు దేవుఁడు, వత్సల త్వాత్ =వాత్సల్యము గలవాఁడగుటవలన, తత్, జాతీయః= అట్టిజాతి గలవాఁడును, తాదృశః = అట్టి యాచరముగల వాఁడును, తత్, స్వభావః=అట్టి స్వభావము గలవాఁడును, (సన్ =అగుచు) శ్లిష్యతి=ఆలింగనము చేసికొను చున్నాఁడు.

విశేషములు :— యజ్జాతీయః— దేవ, మనుష్య, తిర్య గాదిజాతులలో ఏజాతివాఁడైనను అని అర్థము. యాదృశః, యత్స్వభావః— భగవదాశ్రయమునకు జాతితో విద్యతో వృత్తముతో నపేక్ష లేక ఎవ్వఁడేనియు నర్హుఁడని భావము. వత్సలత్వాత్ — వత్సంలాలయతీతి=వత్సలా, అను వ్యుత్పత్తి చేత, అప్పుడే యీనినయావుదూడపైఁగల ప్రేమచేత దాని యొడలినిండ నంటుకొనియున్న హేయపదార్థ మగు మావిని (దోషమును) తననాలుకతో అమృతమునువలె నెట్లు భుజిం చునో యట్లే భగవంతుఁడు వనాద్రి సుందర బాహుమూర్తి ఆశ్రితులయందుఁగల దోషములను గుణములనుగా ననుభ వించు ప్రేమమయమూర్తి యని భావము. 'దోషో యద్యపి తస్య స్యాత్ సతా మేత దగర్హితమ్' అన్నట్లు సదోషులైనను ఆశ్రితులయందుఁ బ్రీతియుండుటవలనఁ దత్సమానజాత్యాచార శీలములు గలవాఁడై 'అహం వో బాంధవో జాతః,' ఆత్మా

నం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్' అని చెప్పినట్లు తత్తదాశ్రితానుగుణము లగు అభిజాత్యవిద్యావృత్తములతో నలరారుచు తత్సంశ్లేషభోగముల ననుభవించు చున్నాఁడు. పూర్వశ్లోకమున క్షాంతి యనఁగా- అపరాధసహిష్ణుత్వ మనియు, ఈ శ్లోకమున- వాత్సల్య మనఁగా- దోషములందు స్థితము భోగ్యతాబుద్ధి యనియు నిరూపింపఁ బడినది.

తా॥ ఏజాతివాఁడేకాని, ఎట్టియాచారములు గలవాఁడే కాని, ఎట్టి స్వభావముగలవాఁడే గాని అగుఁగాక వాఁ డెవఁ డైనను సరే. తన పాదసన్నిధానము నాశ్రయించిన యెడల నితనిని శ్రీ సుందరబాహుస్వామి వాత్సల్యమువలనఁ దత్స మానజాత్యాచార స్వభావములు గలవాఁడై తత్సంశ్లే షైక భోగు డగుచున్నాఁడు.

శా. యజ్జాతీయుఁడో! యాదృశాచరణుఁడో!
యచ్ఛీలుఁడో! యానుఁ గా
కజ్జాత్యాదుల నెన్నకుండ నె వనా
హార్యాధినాథుం డహా!
పజ్జం జేరినఁ జాలు వత్సలత పెం
పారంగ భోగించెడుఁ
దజ్జాతీయుఁడు తాదృగాచరణుఁడుఁ
దచ్ఛీలుఁడై యాశ్రితుఁ.

అవతారిక :— గొప్పవానికి అల్పులతోఁ గూడ (మందులతోఁ గూడ) నిరంతరము గలసి యుండుట యనెడు సౌశీల్యము సుందరభుజున కత్యంత మసదృశ మైనను మందుఁడనగు నా కా స్వామియే శరణమని యీ శ్లోకమునం దనుసంధిచుచున్నారు.

శ్లో॥ నిహీనో జాత్యా వా భృశ మకుశలై ర్వా స్వచరితైః
పుమాన్ నై యః కశ్చిత్ బహుతృణ మపి స్యా దగుణతః ।
భజంతం తం పశ్యేత్ భుజగపతినా తుల్య మపి యో
వనాద్రి ప్రస్థస్థః స మమ శరణం సుందరభుజః ॥ 13

ప్రతి :— భృశమ్ = మిక్కిలి, జాత్యా, వా = జాతిచేతఁగాని, అకుశలైః = అశుభములగు, స్వ, చరితైః, వా = తన నడతలచేతఁ గాని, నిహీనః = మిక్కిలి హీనుఁడగు, యః, కశ్చిత్, పుమాన్ = ఊరును పేరును లేని మనుష్యుఁడు అగుణతః, అపి = గుణములు లేకుండుటచే నైతము, బహుతృణమ్, అపి = అల్ప మగుగడ్డిపఱక వంటివాఁడు గూడ, స్యాత్ = అగుఁ గాక, భజంతమ్ = (తనను) సేవించుచున్న, తమ్ = అతనిని (జాత్యాదిహీనుని) యః = ఏ వేలుపు, భుజగపతినా, అపి = ఆదిశేషునితో నైతము, తుల్యమ్ = సమానునిగా, పశ్యేత్ = చూచునో, వనాద్రి ప్రస్థ, స్థః = వనగిరి సానువునందు వేంచేసియున్న, సః = ఆ, సుందరభుజః = సుందరబాహుస్వామి, మమ = నాకు, శరణమ్ = దిక్కు

విశేషములు :— బహుతృణమ్- ఈషత్, అసమాప్తం తృణమ్ = బహుతృణమ్- అల్పోపమ్యార్థమున 'బహుచ్' ప్రత్యయము వచ్చినది. భజంతం తం- పూర్వార్ధమునందత పైని పేర్కొన్నప్రకారముండినను ప్రస్తుతము 'మా మేకం శరణం వ్రజ' అన్నవిధముగా శరణు చొచ్చుచున్న జాతి, వృత్తి, చైతన్య, హీనుఁడగు ఆయనామకుని అని భావము. భుజగపతినా, అపి = 'నివాస శయ్యాసన పాదుకాంశుక' అని యారంభించి 'యథోచితం శేష ఇతీర్యతే జనైః' అని శేషత్వావధికిఁ జివరమెట్టుగాఁ జూపఁబడిన శేషునితో సయిరము సమముగాఁ జూచునో యనుటవలన 'త్వమస్మాకం చతుర్ణాం హి భ్రాతా సుగ్రీవ! పంచమః' అని శేషావతారముగాఁ బ్రసిద్ధుఁడగులక్ష్మణునితో సమానభోగునిగా సుగ్రీవు ననుగ్రహించుట యిందభిప్రేతమై యున్నది. ఈ శ్లోకమునఁ బేర్కొనఁబడిన జాతిహీనుఁడు, వృత్తహీనుఁడు, జ్ఞానహీనుఁడు,నగు 'యః కశ్చిత్ పుమాన్' ఊరు పేరు లేనియాతఁడు సుగ్రీవుఁడే యని కవియాశయమైనట్లు కన్పించుచున్నది. ఎట్లన?

'వానరాణాం నరాణాం చ కథ మాసీ త్సమాగమః' నీచమైన వానరజాతితో ఉత్కృష్టమైన నరజాతివారికి సహవాసమెట్లు ఘటిల్లెను? అనుటచేత వానరుఁడగు సుగ్రీవుఁడు జాతిహీనుఁడనుటయు. భ్రాతృ భార్యయగు తారతోనుండుటచేత వృత్త హీనుఁడనుటయు, ఈ వృత్తహైన్యమునకు హేతువజ్ఞానమగుటచేత జ్ఞానహీనుఁడనియు భావుకులకుఁదోఁచకపోదు.

కావున లోకోత్తరగుణోత్తరుఁడగు శ్రీరామునకు జాతివృత్త వివేకహీనుఁడగుటచే మందుఁడైన సుగ్రీవునితోడి నిరంధ్రమగు మైత్రి శ్రీరాముని సౌశీల్యమును జాటుచున్నది. అట్లే వనాద్రివాసుల ననుగ్రహించుచున్న సుందరబాహుమూర్తియు అని భావము.

తా॥ జాతిహీనుఁడు మంగళాచారశూన్యుఁడు వివేకరహితుఁడునై నామగ్రహణమునకును యోగ్యుఁడుగాని యెవఁడేని తన్ను భజించినయెడల వానిని వివేల్పు తన శేషత్వమునకుఁ బరాకాష్ఠయైన యాదిశేషునితోఁ దుల్యునిగాఁ గటాక్షించునో వనగిరి సానునివాసి యగు ఆ సుందరబాహుమూర్తి గో మందుఁడ నగు నాకుశరణము.

ఉ. జాతికిఁ దగ్గి పోవుత, ల
స త్తరవృత్తము లేక పోవుతన్
భూతలియందు జ్ఞానమునఁ
బోలక పోవుత గడ్డిపోచకే
నాతఁడు తన్ భజింప భుజ
గాధిపునట్లుగఁ జూచు నెవ్వఁ డా
స్ఫీతవనాద్రిసాను సర
సీరుహనేత్రుఁడె నాకుదిక్కుఁ కన్.

శ్లో॥ ఏకైకమంగళగుణానుభవాభినంద
మీదృక్త్వయా నితి చ సుందరదోష్ణి కృష్ణే ।
'తే యే శతం త్వితి నియంతు మనాః శ్రుతుస్త్రై
నైవ నైష వాఙ్మనసగోచర ఇత్యుదాహ ॥

ప్రతి :— సుందరదోష్ణి = సుందరబాహు వనెడు, కృష్ణే = (శ్రీ) కృష్ణునియందు, ఏక, ఏక, మంగళ, గుణ, అనుభవ, అభినందమ్ = ఒక్కొక్క కల్యాణగుణముయొక్క, అనుభవమువలనఁ గలిగిన యానందమును, ఈ దృక్ = ఇట్టువంటిది, ఇయాన్ = ఇంతపరిమాణము గలది, ఇతి, చ = అనియు, నియంతుమనాః =కొలుచుటకు మనస్సుగలదియై, 'తే యే శతంత్వి' తి=తే యే శతం మానుషా ఆనందాః అనెడు, శ్రుతిఃతు = వేదవాక్యమ్మనో, ఏషః = సుందరబాహుస్వామియొక్క ఒక్కొక్క కల్యాణగుణానుభవమువలనఁ గలిగెడి యానందము, వాక్, మనస, గోచరః = వాక్కులకు మనస్సునకును గోచరించెడిది, న + ఏవ = నైవ = కానే కాదు, ఇతి = అని, ఉదాహ = బిగ్గఱగాఁ జెప్పెను. హై = ఆశ్చర్యము.

విశేషములు :— నియంతుమనాః = కొలగారమునకుఁ బూనిన మనస్సు గలదియై అని భావము— ఉత్ + ఆహ = ఉదాహ = పెద్దగాఁ జెప్పెను. దగ్గఱనున్నవారికి దవ్వుననున్నవారి కందఱకు వినఁబడునట్లు అని 'ఉత్' అను ఉపసర్గ వలన ద్యోతక మగుచున్నది. 'సై షానందస్య మీమాంసా భవతి। యువా స్యాత్ సాధు యువాధ్యాయకః। ఆశిష్ఠో ద్రఢిష్ఠో బలిష్ఠః। త స్యేయం పృథివీ సర్వా విత్తస్య పూర్ణా స్యాత్। స ఏకో మానుష ఆనందః। తే యే శతం మానుషా ఆనందాః। స ఏకో మనుష్య గంధర్వాణా మానందః' అని

పైనిఁజెప్పిన క్రమముగా దేవగంధర్వపితృ చిరలోక లోక దేవా జానదేవ కర్మదేవేంద్ర బృహస్పతి పర్యంతము చెప్పి 'తే యే శతం ప్రజాపతే రానందాః। స ఏకో బ్రహ్మణ ఆనందః' అన్న తరువాత 'తే యే శతం బ్రహ్మణ ఆనందాః' అని చెప్పక 'యతో వాచో నివర్తంతే, అప్రాప్య మనసా సహ, ఆనందం బ్రహ్మణో విద్వాన్' అను శ్రుతియందు 'స ఏకో బ్రహ్మణ ఆనందః' అని ఏకశబ్దమును బ్రయోగించుట వలన ఏకైక గుణానుభవము వలనఁ గలిగెడి యానందమే యపరిచ్ఛిన్న మని శ్రుతిహృదయము.

తా॥ అసంఖ్యేయము లగు కల్యాణగుణములతోఁ గూడిన శ్రీ సుందరబాహు భగవాను నందలి ఏకైక కల్యాణగుణాను భవజనిత మగు నానందము ఇట్టిది, యింత ప్రమాణముగలది. యని కొలగార మొనర్పఁ దలచినదై 'తే యే శత' న్మనెడు శ్రుతి యీ యానందము మనస్సునకు వాక్కులకు నందని దని బిగ్గఱగాఁ జాటెనది. ఇది యత్యంత మాశ్చర్యకరము. సుందర బాహుస్వామియొక్క ఒక కల్యాణగుణానుభవ జన్యానందమే యపరిచ్ఛిన్న మనఁగా సకల కల్యాణగుణానుభూతి వలనఁ గలుగు నానందము నెవరు వర్ణింపఁగలరని భావము.

ఉ. సుందరబాహు కృష్ణు నెడ
శోభిలు సద్గుణ బృందమందు నే
మందు నొకొక్క దివ్య సుగు
ణానుభవంబునఁ గల్గుచున్న యా

నందము వేదమాత గణ
　　నం బొనరింపఁగఁబూని చేత కా
కందదు మాటకున్ మది క
　　టంచు నహా! వెనుకంజ వేయదే!

శ్లో॥ అబ్జపాద మరవిందలోచనం
　　పద్మపాణితల మంజనప్రభమ్ ॥
　　సుందరోరుభుజ మిందిరాపతిం
　　వందిషీయ వరదం వనాద్రిగమ్ ॥ 33

ప్రతి :— అబ్జ, పాదమ్ = పద్మములవంటి పాదములు గల వాఁడును, అరవింద, లోచనమ్ = కమలములవంటి కన్నులు గలవాఁడును, పద్మ, పాణి, తలమ్ = తామరలవంటి చేతులు గలవాఁడును, అంజన, ప్రభమ్ = కాటుక కాంతివంటి కాంతి గలవాఁడును, సుందర, ఉరు, భుజమ్ = అందము గలవియు, పెద్దవియు, అగు భుజములు గలవాఁడును, ఇందిరా, పతిమ్ = లక్ష్మీనాథుఁడును, వన, అద్రి, గమ్ = వనగిరియందు వేంచేసి యున్న వాఁడును, వరదమ్ = వరప్రదాతయునగు సుందర బాహుస్వామిని, వందిషీయ = నమస్కరింతును గాక.

విశేషములు :— వనాద్రిగం వరదమ్— ఇందు వనాద్రి నివాసమే వరప్రదానము నందు హేతువుగా సూచింపఁబడినది. శ్రీమంతు లేయంతఃపురములో నెక్కడనో యుండుటచే వారిసిరి యాచకుల కందుబాటులో నుండదు. ఈ శ్రీమంతుఁ డగు సుందరబాహు దేవుఁడు వనాద్రిశిఖరమున నుండుటచే

అందఱికిఁ గనఁబడుచు భక్తులకు అడ్డులేక దర్శనమిచ్చుచు వారుకోరిన వరములను గూడ నిచ్చునని భావము. సుందర రోరుభుజమ్— ఈ స్వామినామము సుందరబాహు వని యీపదము చాటుచున్నది. మఱియు సుందర, ఊరు, భుజమ్— అని పదచ్ఛేదము గావించుకొన్నయెడల అందములగు తొడలు భుజములును గలవాఁడని యర్థమిచ్చును. అప్పుడు శ్రీస్వామి వారి భుజములే కాక తొడలు గూడ సుందరములని మఱి యొక గుణానుభవముచేయ వీలగును. 'మధురాధిపతే రఖిలం మధురమ్' అని గదా ప్రాజ్ఞులసూక్తి.

అత్యంతభోగ్యవిగ్రహుఁడగు వనాద్రినాథుఁడే పరమై కాంతికులకు పాస్యమూర్తి యని భావము.

తా॥ పద్మములవంటి పాదములు, కమలములవంటి కన్నులు, తామరలవంటి చేతులు, కాటుకవంటి కాయకాంతి, సుంద రాజానుబాహువులు గలిగి లక్ష్మీదేవిచేత సైతము పతిగా వరింపఁబడిన వనాద్రివాసియు వరప్రదాతయు నగు సుందర బాహుస్వామిని వందన మొనర్తును.

గీ॥ కమలములఁ బోలుకరములు కాళ్ళు కనులు
గలుగుదొర నంజనప్రభాకలితకాయు
సిరి వలచువాని నందాలఁ జిందు బాహు
లలరువరదుని వనగిరినిలయుఁ గొలుతు.

అవతారిక :— దివ్యవిగ్రహ లావణ్యమునే ఇంకను వర్ణించుచున్నారు.

శ్లో॥ కనకమరకతాంజనద్రవాణాం
మథనసముత్థితసారమేలనోత్థమ్ ।
జయతి కిమపిరూప మస్య తేజో
వనగిరినందన సుందరోరుబాహోః ॥ 34

ప్రతి :— అస్య=ఈ, వన......బాహోః— వనగిరి= వనాద్రివాసు లగు జనులను, నందన=సంతోషపెట్టు, సుందర, ఉరు, బాహోః=అందములగు ఆజానుబాహువులుగల సుందర బాహుస్వామియొక్క, కనక, మరకత, అంజన, ద్రవాణామ్= (ప్రత్యేకము భిన్నభిన్న కాంతులుగల) బంగారము, మరకత మణులు, కాటుక, వీని రసములయొక్క, మథన, సముత్థిత, సార, మేలన, ఉత్థమ్=చిలుకుటచేతఁ బుట్టిన సారాంశము యొక్క కలయికచేతఁ గలిగిన, కిమపి, రూపమ్=అనిర్వాచ్య మగు స్వరూపముగల. తేజః=కాంతి, జయతి=సర్వోత్కృ ష్టమై ప్రకాశించుచున్నది.

విశేషములు :— 'వనగిరి నందన' అను చోట 'మంచాః క్రోశంతి' అను చోటునందు వలె తాస్థ్యలక్షణచేత వనగిరి వాసులని యర్థము చెప్పుకొనవలెను. కిమపిరూపమ్— ఇది యేకపదము. ఇట్టిది యని చెప్పుటకు శక్యముగాని రూపము గలది యని భావము. సారాంశ మేమన— ప్రత్యేక పాత్ర లందుఁ బ్రత్యేకముగా- కనకద్రవమును, మరకతద్రవమును, అంజనద్రవమును ఉంచి పెరుఁగును జిలికినట్లు చిలుకఁగా వెన్న వలెఁ దేలిన యాద్రవత్రయ సారాంశముల మూఁటిని మేళనము చేయఁగా నేర్పడిన పీత, హారిత, నీల, వర్ణాత్మకమగు మిళిత

సారాంశత్రయరూపమున ఇది బంగారు వన్నె, ఇది గరుడ పచ్చలవన్నె, ఇది కాటుకవన్నె, యని యెట్లు విడివిడిగాఁ దెలియ శక్యముగాదో యట్లే సుందరబాహుస్వామివారి విగ్రహ సముదాయశోభ విడిగాఁ దెలియ శక్యముగాక సర్వోత్కృష్టమై యున్నదని భావము.

తా॥ బంగారము గరుడపచ్చలు కాటుక వీని ద్రవములను వేఱువేఱు పాత్రములం దుంచి చిలుకఁగా నేర్పడిన సారాంశము లను మఱలఁ గలుపఁగా బొడఁగట్టు నచింత్యరూపము గల శ్రీ వనాద్రినివాసి యగు సుందరబాహుస్వామి వారి తేజస్సు సర్వోత్కృష్టమై వెలుఁగు చున్నది.

చ. కనక గరుత్మదశ్మ నవ
కజ్జల సుద్రవముల్ మథింప వ
చ్చిననికరంపుఁ జేటలను
జిల్కఁగ నొక్కెడ నుంచి వెండియున్
కనులను దన్పుతద్రుచిర
కాంతుల నేది యదీయమో! యెఱుం
గనియటు కాననాద్రిహరి
కాయమహోజ్జ్వలతేజ మొప్పెడిన్.

శ్లో॥ కిం ను స్వయం స్వాత్మవిభూషణం భవ
న్నసా వలంకార ఇతీరితో జనైః ।
వర్ధిష్ణుబాలద్రుమషండ మండితం
వనాచలం వా పరితః ప్రసాధయన్ ॥ 35

ప్రతి :— అసౌ = ఈసుందరబాహుస్వామి, స్వయమ్= తానే, స్వ, ఆత్మ, విభూషణమ్ = తన దివ్యవిగ్రహమునకు అలంకారము, భవన్=అగుచు, జనైః = (తన దివ్యవిగ్రహ మును బ్రత్యక్షముగాఁ జూచు) జనులచేత, అలంకారః ఇతి = అలంకారమని, ఈరితః, కింను=పలుకఁబడెనా ? వా=లేక, వర్ధిష్ణు, బాల, ద్రుమ, షండ, మండితమ్=వృద్ధి చెందుచున్న తరుణ వృక్షముల సమూహముచేత నలంకరింపఁబడిన, వనా చలం, పరితః = వనగిరిచుట్టు భాగమును, ప్రసాధయన్ = అలంకరించుచు, అలంకారః ఇతి= అలంకార మని, ఈరితః, కింను=పలుకఁబడెనా ?

విశేషములు :— (శ్రీ) సుందరబాహుస్వామి వారికి భక్త జనప్రసిద్ధ మగు 'అలంకార' నామము గలదు. ఆనామ మిందు వలన వచ్చియుండునా యని యీ శ్లోకమున నుత్ప్రేక్షింపఁ బడినది.

తా॥ ఈ సుందరబాహుస్వామి తానే తనదివ్య విగ్రహము నకు అలంకారమగుచు ప్రత్యక్షముగాఁ దన దివ్య విగ్రహ మును జూచు భక్తజనులచేత అలంకార నామమునఁ గొని యాడఁబడెనా ! లేక నానాఁడు సమృద్ధిగాఁ బెరుగుచున్న తరుణవృక్షములచేత శోభాయమానముగా నున్న వనాచలము నకు నలంకారముగా నుండుటవలన జనులచేత నలంకార నామమునఁ గొనియాడఁ బడెనా !

ఉ. సారసలోచనుండు వన
 శైలవిభుండు స్వమూర్తికిన్ ప్రభా
పూరిత దివ్యరత్నమయ
 భూషణమై ధరియించెనో! యలం
కారము పేరు, లేక తరు
 కాండసుమండితకాననాద్రిశృం
గారనిదానమండనము
 గాఁ దనరారి తదాఖ్యఁ గాంచెనో!

శ్లో॥ సుఖస్పర్శై ర్నిత్యైః కుసుమసుకుమారాంగ సుఖదైః
సుసౌగంధ్యై ర్దివ్యాభరణగణదివ్యాయుధ గణైః ।
అలంకారైస్సర్వై ర్నిగదిత మలంకార ఇతి యః
సమాఖ్యానం ధత్తే స వనగిరినాథో౽స్తు శరణమ్ ॥ 36

ప్రతి :— సుఖ, స్పర్శైః=సుఖమును గలిగించు స్పర్శగలిగి నట్టియు, (అతిసుకుమారము లైనట్టియు) సుసౌగంధ్యైః = మంచి సువాసన గలిగినట్టియు, (కనుక నే) కుసుమ, సుకుమార, అంగ, సుఖదైః = పూవులకంటె సుకుమారము లగు దివ్యావయవములకు సుఖము నిచ్చునట్టియు, నిత్యైః = (భగవద్విగ్రహమువలెనే తాము కూడ) నిత్యము లైనట్టియు, దివ్య, ఆభరణ, గణ, దివ్య, ఆయుధ, గణైః=దివ్యములగు నాభరణసమూహములు, దివ్యములైన యాయుధ సమూహము లనెడు, సర్వైః = సమస్తము లైన, అలంకారైః=స్వదివ్య విగ్రహము చేత, అలంకరించుకొనఁ దగిన సొమ్ములచేత, అలం

కారః, ఇతి=అలంకారమని, నిగదితమ్ = నిర్వచింపఁబడిన, సమాఖ్యానమ్=పేరును, యః=ఏ వేల్పు, ధత్తే = ధరించుచున్నాఁడో!, సః = ఆ, వనగిరినాథః = వనాద్రివిభుఁడగు సుందరబాహుస్వామి, (మమ = నాకు) శరణమ్ = దిక్కు, అస్తు=అగుఁగాక.

విశేషములు :— కుసుమసుకుమారాంగ సుఖదైః — పూవులకంటె మృదువులగు ఉత్తమాంగాది పాదారవింద పర్యంతములగు దివ్యావయవములకు మాలతీ మాలాదులవలె సుఖమును గలిగించునవి యని భావము. అలంకార్యైః సర్వైః— కిరీటాది దివ్యాభరణగణ రూపములును, సుదర్శన పాంచజన్యాది దివ్యాయుధ గణరూపములు నగు స్వదివ్య విగ్రహముచేత నలంకరించుకొనఁ దగిన సర్వభూషణములచేత నని తాత్పర్యము. శ్రీ విష్ణుపురాణమునందు అస్త్రభూషణాధ్యాయమున సకల తత్త్వములకు అస్త్రభూషణత్వము వివరింపఁబడినది. 'సర్వజ్ఞా సముచితశక్త్యయ స్స దైవ, త్వత్సే వాని యమజుష స్స్వదేకభోగాః। హేతీనా మధిపతయ స్సదా కిమేతాన్, శోభార్థం వరద! బిభర్షి హార్షతో వా' అని వరదరాజస్తవమునఁ జెప్పినట్లు సుదర్శనాద్యాయుధములకుఁ గూడ భూషణత్వము సర్వపూర్వాచార్య సమ్మతము. కనుక స్వవిగ్రహాలంకారములుగాఁ బ్రసిద్ధములగు ఆభరణములకు నాయుధములకును వివిధ శోభాసమగ్రమగు స్వవిగ్రహము వలన అతిశయశోభ యేర్పడుటచేత అలంకార్యత్వము తన

విగ్రహమునకు శోభను జేకూర్చుటవలన అలంకారత్వమును సిద్ధించుచున్న దని యాశయము.

తా॥ సుఖకరమగు స్పర్శగలవియు, మంచి సువాసన గలవియు, కుసుమసుకుమారము లగు ఉత్తమాంగాది పాదపర్యంతములగు తనదివ్యావయవములకు మాలతీ మాలాదులవలె సుఖమును గలిగించునవియు,నిత్యము లైనవియు, స్వవిగ్రహము చేత నలంకరించుకొనఁ దగినవియు, స్వమూర్తి కలంకారములుగా నున్నవియు అగు సమస్త కిరీటాది దివ్యాభరణముల చేతను, సమస్త సుదర్శనాది దివ్యాయుధముల చేతను నిర్వచింపఁబడిన'అలంకార'నామమును ఏ దేవదేవుఁడు ధరించునో యా వనగిరినాథుఁ డగు సుందరబాహుస్వామినాకు శరణ మగుఁ గాక.

మ. కరముల్ స్పర్శసుఖంబుతోఁ దనరి సౌ
గంధ్యంబు చెన్నారి పూ
సరముల్ వోలె స్వకోమలాంగములకున్
సౌఖ్యంబుఁ జేకూర్చు సు
స్థిరదివ్యాభరణాయుధాళిఁ దనుల
క్ష్మిన్ శోభిలన్ జేసి శ్రీ
కరుఁ డూనెన్ వనశైల వల్లభుఁ డలం
కారాఖ్య, దిక్ఖ్యాతుఁడే.

అవతారిక :— 'దివ్యాభరణగణ దివ్యాయుధ గణైః' అని పై శ్లోకమునఁ జెప్పఁబడిన యావర్గద్వయ మెట్టు లాభ

రణంబు లయ్యెనో యీ క్రింది శ్లోకద్వయముతో నిరూపించు చున్నారు.

శ్లో॥ మకుట మకుట మాలోత్తంస సచూడాలలామ
 స్వలకతిల కమాలాకుండలైః సోర్ధ్వపుండ్రైః ।
 మణివరవన మాలాహార కేయూరకంఠ్యైః
 తులసి కటక కాంచీనూపురాద్యైశ్చ భూషైః । 37

శ్లో॥ అసి జలజరథాంగైః శార్ఙ్గకౌమోదకీభ్యా
 మగణితగుణజాలై రాయుధై రప్యథాన్యైః ।
 సతతవితతశోభం పద్మనాభం వనాద్రే
 రుపవనసుఖలీలం సుందరం వందిషీయ ॥ 38

ప్రతి:— పై రెండు శ్లోకములకుఁ గలిపి యేకాన్వయము. దీనిని 'కులక' మందురు. మకుట.........కుండలైః — మకుట = కిరీటముచేతను, మకుటమాలా = కిరీటమునకుఁ జుట్టెడు రత్నమాలచేతను, లేదా పుష్పమాలచేతను, ఉత్తంస —కిరీటశిరోరత్నముచేతను, చూడాలలామ = ప్రశస్త మగు జుట్టుచేతను, (సు+అలక) స్వలక = మంచి ముంగురులచేతను, తిలకమాలా = నొసటికి అలంకార మగు ముత్యములు పొదిగిన బంగారు బొట్టులదండచేతను, కుండలైః = కర్ణాభరణములచేతను, స+ఊర్ధ్వపుండ్రైః = ఊర్ధ్వపుండ్రములతోఁ గూడిన, మణి.........కంఠ్యైః— మణివర = మణిశ్రేష్ఠ మగు కౌస్తుభముచేతను, వనమాలా = వనమాలచేతను, (పాదములవఱకు వ్రేలాడు వివిధపుష్పములు చేర్చికట్టినదండ) హార = ముత్యాల పేరులచేతను, కేయూర = భుజకీర్తులచేతను

కంఠ్యైః = కంఠాభరణములచేతను, తులసికటక, కాంచీ, నూపుర, ఆద్యైః,=తులసిమురుగులు, మొలత్రాడు, అందెలు, మొదలుగాఁగల, భూషైః, చ=అలంకారములచేతను, (ఇంత వఱకు మొదటి శ్లోకమునకు అర్థము).

అసి, జలజ, రథాంగైః=నందక, పాంచజన్య సుదర్శనము లనెడు ఖడ్గశంఖచక్రముల చేతను, శార్ఙ్గ, కౌమోదకీభ్యామ్ = ఆనామములుగల ధనుస్సుచేతను, గదచేతను, అథ=తరువాత, అన్యైః=ఇతరములగు, ఆయుధైః, అపి=ఆయుధముల చేతను, అగణిత, గుణ, జాలైః = లెక్కలేనన్ని గుణసమూహముల చేతను, సతత, వితత, శోభమ్=నిరంతరము వృద్ధిచేయఁబడిన సౌందర్యము గలిగినట్టియు, వనాద్రేః = వనగిరియొక్క, ఉప వన, సుఖ, లీలమ్ = ఉద్యానవనమునందు సుఖకరములగు క్రీడలుగల, సుందరమ్ = సుందరబాహుస్వామి యను, పద్మ నాభమ్ = (శ్రీ) మహావిష్ణువును, వందిషీయ = నమస్కరింతును గాక. (ఇది రెండవ శ్లోకమున కర్థము.)

విశేషములు :— 'భూషైః'— భూషాశబ్దమాకారాంత స్త్రీ లింగముగాఁ బ్రసిద్ధము— అప్పుడు భూషాభిః అని యుండును. ఈలింగవ్యత్యయము వ్యాకరణ నిపుణులచే విచారణీయము. కొందఱిది ఘఞంతరూపము పులింగముగా నిర్దుష్ట మందురు. అగణితగుణజాలైః=సర్వజ్ఞత్వ, సర్వశక్తిత్వాద్య నంతగుణగణములచేత, మఱియు - అగణిత గుణజాలైః =

అసంఖ్యాత గుణగణమునుగల, అని యర్థమును జెప్పికొని, దీనిని— 'అసి, జలజ, రథాంగైః శార్ఙ్గ, కౌమోదకీభ్యాస్సు' — అను వానినిగూడ విభక్తి విపరిణామముచేత విశేషణము చేసి కొనఁదగును. అన్యైః, ఆయుధైః = హల, ముసల, పరశు, ప్రభృతులచేత, శ్రీసుందరబాహుస్వామివారికి దివ్యాభరణధారణమువలెనే దివ్యాయుధధారణము సైతము తత్తద్దివ్యావయవములకు శోభాతిశయాధాయక మని భావము.

తా॥ కిరీటము, కిరీటమునకుఁ జుట్టును మణిమాల, కిరీటశిరోమణి, నెమలిపించెము (శ్లేష్మముగు చూడ) అందములగు ముంగురులు, నొసటికి, ఆభరణ మగు ముత్యాలు పొదగిన బంగారుబొట్లదండ, కర్ణాభరణములు, కౌస్తుభమణి, వనమాల, హారములు, భుజకీర్తులు, కంఠాభరణములు, తులసికటకములు, రత్నమేఖల, అందెలు, మొదలగు భూషణములచేతను, నందక పాంచజన్య సుదర్శనకౌమోదకీ శార్ఙ్గములచేతను, తదితరములగు హల ముసలపరశు ప్రభృతి దివ్యాయుధముల చేతను. సర్వజ్ఞత్వ, సర్వశక్తిత్వాద్యగణ్యగుణములచేతను, వర్ధమాన సౌందర్యవిశేషము గలట్టియు వనాచలోద్యానవీథుల లీలానందము ననుభవించుచున్న సుందరబాహు మహావిష్ణువునకు వందన మొనర్తును.

శా॥ రాజద్దివ్యకిరీటముల్ దదుపరి
ప్రత్యగ్రరత్నంబు వి
భ్రాజిష్ణూత్తమఫాలభూషణము హా
రంబుల్ శ్రవోఽలంకృతుల్

తేజఃపుంజము కౌస్తుభం బితరముల్
దీప్తోర్ధ్వపుండ్రంబులున్
రాజిల్లన్ వనశైల మేలుహారి నా
రాధింతు నెల్లప్పుడున్.

మ. ఘనకౌమోదకి పాంచజన్య మనుశం
ఖశ్రేష్ఠముఞ్ శ్రీసుద
ర్శన చక్రంబును నందకాసియును శా
ర్ఙ్గంబున్ దదన్యంబులౌ
అనవద్యాయుధముల్ ద్యుతుల్ పెనుప మే
లౌసద్గుణా లొప్పశ్రీ
వనశైలేంద్రవిహారి సుందరభుజుఞ్
వర్ణింతుఁ గేల్ మోడ్చుచుఞ్.

అవతారిక :— ఈమీఁద శ్రీ సుందరబాహుస్వామివారి కేశాదిపాదపర్యంతములగు నవయవములను ముప్పదియొక్క శ్లోకములతో వర్ణించు చున్నారు.

శ్లో॥ ఆజానజస్వగతబంధురగంధలుబ్ధ
భ్రామ్యద్విదగ్ధమధుపాళి సదేశకేశమ్।
విశ్వాధిరాజ్య పరిబర్హకిరీటరాజం
హైః సుందరస్య బత సుందర ముత్తమాంగమ్॥ 39

ప్రతి :— ఆజానజ......... కేశమ్— ఆజానజ=జన్మ సిద్ధమగు (సహజమైన) స్వగత = కేశములకుఁ జెందిన, బం

ధుర = దట్టమైన, లేదా - సమృద్ధమైన, గంధ=సువాసన యందు, లుబ్ధ=పేరాసగలవి గనుకనే. భ్రామ్యత్ = తిరుగు చున్న, విదగ్ధ=రసికములగు, మధుప = తుమ్మెదలయొక్క, ఆళి=పంక్తితో, సదేశ=సమానమగు, కేశమ్=కేశపాశము గలిగినట్టియు, విశ్వ, అధిరాజ్య, పరిబర్హ, కిరీటరాజమ్=సర్వే శ్వరత్వమునకు యోగ్యచిహ్నమగు శ్రేష్ఠమగు కిరీటము గలట్టియు, సుందరస్య=సుందరబాహుమూర్తియొక్క, ఉత్త మాంగమ్=శిరస్సు, సుందరమ్ = అందమైనది, హై, బత= ఔరౌర!

విశేషములు :— విశ్వాధిరాజ్యపరిబర్హకిరీటరాజమ్ — ఉభయవిభూతినిర్వహణలక్షణాతివిలక్షణ దివ్యకిరీటము గలవాఁ డని భావము. హై, బత— ఈ నిపాతద్వయము సుందర బాహుస్వామివారి విలక్షణకేశపాశయుత మగు నుత్తమాంగ మెంత అందముగానున్నది! అని యాశ్చర్యాతిశయమును దెలుపు చున్నది.

తా॥ సహజమయి సాంద్రమును సమృద్ధము నగు సుగంధము మీఁది పేరాసతో నటఁ దిరుగుచున్న రసికము లగు తుమ్మె దలతో సదృశ మైన (నల్లని) కేశపాశము గలిగి యుభయ విభూతులను నిర్వహింపఁదగిన సర్వేశ్వరత్వమునకుఁ జిహ్న మగు కిరీటరాజముతోఁ బ్రకాశించు శ్రీ సుందరబాహుస్వామి యుత్తమాంగ మెంత సుందరముగా నున్నది. ఆహాహా!

మ॥ తన నైసర్గికభవ్యబంధురసుగం
ధం బానఁగాఁ జుట్టుముూఁ
గిన చుట్టాలకుఁ దేంట్లకుం నిగనిగల్
గీలించు కైశ్యంబుతోఁ
తన లోకేశ్వరతాసుచిహ్న మగుహృ
ద్యవన్మా కిరీటమ్ముతోఁ
మననీయంబు వనాద్రిసుందరుని త
న్మౌళిం బ్రశంసించెదం.

శ్లో॥ అంధంతమ స్తిమిరనిర్మిత మే వ యత్ స్యాత్
తత్సారసాధిత సుతంత్వతి వృత్తవార్తమ్ ।
ఈశస్య కేశవగిరేరలకాలిజాలం
తత్తుల్య కుల్యమధుపాఢ్య మహావనస్య ॥ 40

ప్రతి:— తత్, తుల్య, కుల్య, మధుప, ఆఢ్య, మహత్, వనస్య=ఆముంగురులతో, సమానకులమునఁ బుట్టిన, తుమ్మెదలతో నొప్పుచున్న మహావనము గల, కేశవగిరేః=వనాద్రికి, ఈశస్య = నాథుఁడైనట్టి, సుందరబాహుస్వామియొక్క, అలక, అళి, జాలమ్ = తుమ్మెదలవంటి ముంగురులగుంపు, అను, యత్=ఏ, అంధమ్=గ్రుడ్డినిగాఁ జేయు, తమః = చీఁకటి గలదో, (తత్=అది) తిమిర, నిర్మితమ్, ఏవ=చీకఁటి చేత నిర్మింపఁబడినదే, స్యాత్ = అగును, (కనుకనే) తత్, సార, సాధిత, సుతంతు, అతివృత్త, వార్తమ్=తిమిరనిర్మితమగు అంధతమసముయొక్క సారముచేత నిర్మింపఁబడినయం

దములగు దారములను మించినసంగతి గలది, (భవతి = అగు చున్నది.)

విశేషములు :— తత్తుల్య కుల్యా మధుపాఢ్య మహావనస్య— ఇందలి తత్ —శబ్దము సుందరబాహుస్వామివారి యలకలను జెప్పును, అందుచేత సుందరబాహుస్వామి ముంగురులగుంపు తోడ సమానకాంతిగల తుమ్మెదలతో నిండిన పెద్దవనముగల యని యర్థ మేర్పడు చున్నది. కేశవగిరేః— కేశవుఁ డని సుందరభుజస్వామివారికి నామాంతరము. వారికి సంబంధించిన గిరి యనఁగా వనాద్రి అని భావము. తిమిరనిర్మిత మేవ— చీఁకటియే ఉపాదానకారణముగాఁ గలది. కవులు ముంగురు లకు సహజముగానే అంధకారము నుపమానముగాఁ జెప్పు దురు. ఈ శ్లోకమున చీఁకటిచేత నుద్భవింపఁ జేయఁబడిన గాఢాంధకార సారాంశమువలనఁ దీయఁబడిన సన్నని దారము లను మించియున్నవి దేవరవారి ముంగురు లని వర్ణించినందు వలన సుందరబాహుస్వాముల ముంగురులు మిక్కిలి నల్లగా నిగనిగ లాడుచున్న వని భావము.

తా॥ (శ్రీ) సుందరభుజస్వామివారి ముంగురులతో సమా నము లగు తుమ్మెదలతో నొప్పు మహావనముగల (శ్రీ)వనాద్రి కిఁ బ్రభువగు సుందరభుజస్వామియొక్క తుమ్మెదలను బోలు ముంగురులగుంపు అనెడు కటికిచీఁకటి యంధకారమే యుపా దానకారణముగాఁ గలది యయి యుండును. అందుచేతనే అంధకారసారాంశమువలనఁ దీయఁబడిన యుందములగు దార

ముల నతిక్రమించిన సౌందర్యవార్త గలదియై మిక్కిలి నల్లనై యలరారు చున్నది.

చ॥ వనగిరినాథు ముంగురుల
వంటి యళుల్ చెలరేఁగుకానలఁ
దనరెడుకొండ నేలుహరి
తద్భ్రమగోపమ కుంతలవ్రజం
బనునిబిడాంధకారము మ
హాతిమిరంబున నే జనించియుం
డును దిమిరంపుఁదేట జిగి
నూలు నిగన్నిగ లేపుఁ జూపెడిఁ.

అవతారిక :— ఈ శ్లోకమున సుందరబాహుస్వామివారి లలాటమును వర్ణించు చున్నారు.

శ్లో॥ జుష్టాష్టమీకజ్వలదిందుసన్నిభం
ధృతోర్ధ్వపుండ్రం విలసద్విశేషకమ్ ।
భ్రూమధ్య లలాటం విమలం విరాజతే
వనాద్రినాథస్య సముచ్ఛ్రితశ్రియః ॥ 41

ప్రతి :— సముచ్ఛ్రితశ్రియః = 'ఆరూఢశ్రీ' అను నామాంతరము గల, వనాద్రి, నాథస్య = వనగిరి ప్రభువగు శ్రీ సుందరబాహుస్వామియొక్క, జుష్ట, అష్టమీక, జ్వలత్, ఇందు, సన్నిభమ్ = సేవింపఁబడిన యష్టమీతిథి గలవాఁడును, ప్రకాశమానుఁడు నగు చంద్రునితో సమాన మయినట్టియు, ధృత, ఊర్ధ్వపుండ్రమ్ = ధరింపఁబడిన యూర్ధ్వపుండ్రములు

గలిగినట్టియు, విలసత్, విశేషకమ్ = ప్రకాశించుచున్న శ్రీ చూర్ణతిలకము గలిగినట్టియు, (లేదా) కస్తూరి తిలకము గలిగినట్టియు, విమలమ్=నిర్మలమైనట్టియు, లలాటము=నొసలు, భూమ్నా=తేజస్సుతో, విరాజతే=ప్రకాశించుచున్నది.

విశేషములు :— 'జుష్టా.....సన్నిభమ్— అనునది ప్రకాశమగు అర్ధచంద్రునితో సమానమని భావము. భూమ్నా=అధికముగా— తేజస్సుతో అని యర్థద్వయమును జెప్పికొన వచ్చును. విమలమ్— అను చోట 'విపులము' అను పాఠాంతరమున — విశాలము, అని అర్థము.

తా॥ ప్రకాశమానుఁడగు అష్టమీ చంద్రునితో (అర్ధచంద్రునితో) సమానమైనదియు, ఊర్ధ్వపుండ్రములు గలదియు, వానినడుమ శ్రీచూర్ణ (లేదా — కస్తూరి) తిలకము గలదియు, విశాలమును నిర్మలమును అయినదియు, నగు 'ఆగూఢశ్రీ' అను నామాంతరము గల వనాద్రినాథుఁడగు శ్రీ సుందరబాహుస్వామివారి నొసలు మిక్కిలి తేజస్సుతోఁ బ్రకాశించుచున్నది.

గీ॥ అష్టమీచంద్రువలెఁ గ్రాలునదియు, నూర్ధ్వ
పుండ్రములమధ్యఁ గస్తురిబొట్టు వెలయు
నదియు, వెడఁదయు నిర్మల మహా వనాద్రి
నాథునిటలమ్ము తేజస్సునన్ వెలుంగు.

అవతారిక :— ఈ శ్లోకమున స్వామివారి కనుబొమల జంటను వర్ణించు చున్నారు.

శ్లో॥ సుచారుచాపద్వయవిభ్రమం భ్రువో
ర్యుగం సునేత్రాహ్వసహస్రపత్రయోః।
ఉపాంతగం వా మధుపావళీయుగం
విరాజతే సుందరబాహుసంశ్రయమ్॥ 42

ప్రతి :— సుందర బాహు, సంశ్రయమ్=శ్రీసుందరబాహు స్వామిరే ఆశ్రయముగాఁ గలట్టియు, సుచారు, చాప, ద్వయ, విభ్రమమ్ = అతిసుందరమగు వింటిజంటయొక్క విలాసము వంటి విలాసము గలట్టియు, భ్రువోః = కనుబొమలయొక్క, యుగమ్=జంట, సునేత్ర, ఆహ్వా, సహస్రపత్రయోః=మంచి కన్నులనెడుపేరు గలతామర రేకులయొక్క, ఉపాంత, గమ్= సమీపమును బొంగియున్న, మధుప, ఆవలీ, యుగం, వా = తుమ్మెదబంతులజంట వలె, విరాజతే=మిక్కిలి ప్రకాశించు చున్నది.

విశేషములు :— ఈ శ్లోకమునందలి ఉపాంతగం వా— అనుచోట గల 'వా' అను శబ్దము 'ఇవ' అను నర్థమునఁ బ్రయుక్తమైనది. నేత్రములందు సహస్ర పత్రభ్రాంతిచేత మకరందపానాసక్తితో నేత్రప్రాంతముల బారుదీర్చిన భ్రమర పంక్తిద్వయమువలె శ్రీసుందరబాహుస్వామివారి కనుబొమల జంట ప్రకాశించు చున్నదని భావము.

తా॥ శ్రీ సుందరబాహుస్వామివారి కనుబొమల జంట యందమగు వింటిజంటయొక్క విలాసమువంటి విలాసముతో నొప్పుచు మనోహర నేత్రము లనెడు సహస్రపత్రముల సమీప

**కిమిడి**

వనపతిలేక బనపతిదీక్షాసి శాసనములో నతడు గెల్చిన దేశములలో నిది యొకటి. (శ. స. 997)

సీ. శ్రీ శకునేణ్డులు భూసతిపై శైల
నద్ధాబ్ధ భవసంఖ్యనొంది వేంగి
దేశంబు గిమిడియ గోసలగిడ్డిసింగి
దేశంబు ముటి యొడ్డదేశమనంగ
జనిన భూపాలురనని నోర్చె....

కిమిడియనునది నేటి ఒరిస్సారాష్ట్రములో గంజాముమండలములో నొక జమీందారీయైయున్నది. పెద్దకిమిడి, చిన్నకిమిడియని రెండు భాగములుగ విభజింపబడిన చిన్న విషయభాగము.
E. I Vol IV. No. 45.

**కిరణపురము**

చాళుక్యభీముని ధర్మవరము శాసనములో పండరంగని విజయధాటిని వర్ణించు సీసపద్యమునందలి ఎత్తుగీతలో నతడు కిరణపురమును గెల్చెనని వర్ణింపబడినది.

ఆ. కిరణపురము డహాలనిరుతంబు దహనాడు
నచలపురము సొచ్చెనచలితుండు
వల్లభుండు గుణకెనల్లుండు పంచిన
పండరంగు మారె పండరంగు.

ఈ పాండురంగని పై విజయము పూర్వచాళుక్యుల శాసనములలో సహితము పేర్కొనబడినది. ఈకిరణపురము మధ్యప్రదేశములోని బాలెఘాటు జిల్లాయందలి కిరణపురమను గ్రామము.

భారతి విభవ సం॥ చైత్రమాసము -ధర్మవరశాసనములు.
E. I. Vol IU. మల్లపదేవుని పిఠాపురశాసనము No. 33
E. I.. Vol IX. మొదటి అమ్మరాజు మలియంపూడి శాసనము. P. 47

ప్రభు వగుసుందరబాహుస్వామియొక్క,విశాలయోః=పెద్దవి యగు,దృశోః=కన్నులకు,కథం ను=ఎట్లు,నిదర్శనమ్=దృష్టాంతము.(భవేత్=అగును)కా దని భావము.

విశేషములు :— అప్రేమదుహామ్—ప్రేమను-అనఁగా స్నేహము,దానిని పితుకు నది,లేదా-నింపు నదిలేదా స్రవించు నది,ప్రేమదుహామ్-అగును. అట్టిది కా నిది, అప్రేమదుహామ్= స్నేహమును స్రవింపనిది,పద్మము కొంచెము పూఁదేనెను స్రవించునే కాని ప్రేమను స్రవింప దని భావము.క్షణోజ్జ్వలమ్-క్షణకాలము దాఁటినచోఁ బద్మము క్రమముగా వాడిపోవు నని భావము. అనుబ్జమ్—ఉబ్జ-ఆర్జవే;అనుధాతువునుండి యేర్పడినఁఉబ్జపదమునకు అర్జవ మని యర్థముఅదిలేనిది యనుబ్జము. పద్మము సూర్యోదయమున వికసించునట్లు చంద్రోదయమున వికసింపదు. అందుచేత ఋజుమార్గము లేనిది యగు చున్నది. విశాలయోః=దీర్ఘము లగు,అనఁగా-కర్ణాంతవిశ్రాంతము లని యభిప్రాయము.

తా॥ కర్ణాంత విశాలములును ఆశ్రితులయెడలఁ బ్రేమ పూరమును బ్రవహించునవియు, సదాఏకరూపమగు వికాసము గలవియు, చూచువారియంతఃకరణముల నాకర్షించునవియు నగు వనాద్రి నాథుఁడగు శ్రీసుందరబాహుస్వామియొక్క దివ్యనేత్రములకు గుంద్రనిదియుఁ గొంచెము పూఁదేనెను మాత్రమే స్రవించునదియు, పగలు వికసించి రాత్రి ముకుళించు నదియుఁ జూచువారిమదినంతగా నాకర్షింపలేనిదియు నై తన్నేత్ర

గుణములతో సరితూగలేని పద్మమెట్లు నిదర్శనము కాఁగలదు ? పద్మము శ్రీవారికన్నులకుఁ బోల్పఁగదగదని భావము.

మ. నిడువాల్ కాదఁట ప్రేమపూరమును జిం
దింపంగ లేదంట క్రే
ల్విడిలో వాడెడు నంట ద్రష్టృహృదయా
ళిఁ దాఁగ లేదంట శే
ముడుఁగం బాటెడు నంట పద్మ మది యే
మో యొప్పఁగా నీడు వ
చ్చెడు శ్రీసుందరబాహు నేత్రయుగళ
శ్రీ కాయతత్వాదులన్.

అవతారిక :— అలంకారనాముఁ డగు శ్రీ వనాద్రి నాథుఁడు అట్టి కన్నులతో నన్నుఁ గటాక్షించుఁ గాక యని ప్రార్థించు చున్నారు.

శ్లో॥ ప్రశ్చ్యోతత్ ప్రేమసారామృతరసచుళుకప్రక్రమప్రక్రియాభ్యాం
విక్షిప్తాలోకితోర్మి ప్రసరణముషితస్వాంత కాంతాజనాభ్యామ్ ।
విశ్వోత్పత్తి ప్రవృత్తి స్థితిలయకరణైః కాంత శాంత క్రియాభ్యాం
దేవోఽలంకారనామా వనగిరి నిలయో వీక్షతా మీక్షణాభ్యామ్॥ 44

ప్రతి :— వనగిరినిలయః=వనాద్రి నివాసియు, అలంకార నామా=అలంకార నామధేయుఁడును అగు, దేవః=సుందర బాహుదేవుఁడు, ప్రశ్చ్యోతత్ — — — ప్రక్రియాభ్యామ్— ప్రశ్చ్యోతత్=మిక్కిలి స్రవించుచున్న, ప్రేమ, సార=శ్రేష్ఠ మగు ప్రేమ యనెడు, అమృతరస = సుధారసము గల,

చుళుక=పుడిసిలియొక్క, ప్రక్రమ=విధమువంటి, ప్రక్రియాభ్యామ్=విధములు గలిగినట్టియు, విక్షిప్త......జనాభ్యామ్—విక్షిప్త=ప్రేరేపింపఁబడిన, ఆలోకిత = చూపుల నెడు, ఊర్మి=అలలయొక్క, ప్రసరణ = ప్రసారముచేత (వ్యాప్తిచేత, ముషిత=దొంగిలింపఁబడిన, స్వాంత=మనస్సుగల, కాంతాజనాభ్యామ్=స్త్రీజనము గలట్టియు, విశ్వ......క్రియాభ్యామ్—విశ్వ=సమస్త చేతనాచేతన సమూహముయొక్క, ఉత్పత్తి=పుట్టుకను, ప్రవృత్తి=ప్రవర్తనమును, స్థితి = పోషణమును, లయ = నాశనమును, కరణ = చేయుటయందు, ఏకాంత, శాంత, క్రియాభ్యామ్=మిక్కిలి శాంతవ్యాపారము గలట్టియు, ఈక్షణాభ్యామ్=కన్నులతో, వీక్షతామ్ =చూచుఁగాక.

విశేషార్థములు :— అమృతరసచుళుక......ఏకకరోదరపరిమాణమగు చుళకమును (పుడిసిలిని) దృష్టాంతమునుగాఁ జెప్పుట భక్తులు సుందరబాహుస్వామివారి నేత్రములనుండి స్యందించు ప్రేమరసామృతమును మెల్లమెల్లగాఁ దనివిదీర సుఖముగాఁ ద్రాగఁ గలరని సూచించునిమిత్తమని తెలియ నగును. విక్షిప్తా — — — జనాభ్యామ్— సుందరీజన మనోవిలాసశాలి మనోజ్ఞాలోకనములచేత నని భావము. విశ్వా — — — క్రియాభ్యామ్— సకలజగత్సృష్టిస్థితిప్రళయ విధానములందు మిక్కిలి ప్రవర్తమానము లగుచున్న— అని తాత్పర్యము. వీక్షతాన్— అనన్యలక్ష్యము లగు సమ

గ్రానుగ్రహముగల కటాక్షములకు నన్ను లక్ష్యమును జేయుఁ గాక అని యాశయము.

తా॥ వనగిరి నిత్యనివాసుఁడును, 'అలంకార' నామధేయుఁడును అగు శ్రీ సుందరబాహుస్వామి నిరంతరము స్యందించు చున్న ప్రేమసార మనెడు అమృతరసమునకుఁ జాలుకములవంటివియు, తరంగములఁ బోలినకటాక్షాలోకములచేత సుందరీ జనముల మనస్సుల నాకర్షించుచున్నవియు, సకలజగత్సృష్టి స్థితి ప్రళయవిధానములందుఁ బ్రశాంతవ్యాపారములు గలవియు నగు లోచనములతో నన్ను నిరంతరము కటాక్షించుఁ గాక.

శా॥ భూరిప్రేమ రసామృతం పుఁజాలుకం
బుల్, మంజులాలోకసం
చారాకృష్ట విలాసినీ జనమన
స్సర్వస్వకంబుల్, జగ
త్ప్రారంభస్థితి సంహృతీడ్యములు నే
త్రాల్ విప్పి నన్నాయలం
కారాఖ్యుం డగుకాననాద్రివారి శ్రీ
కంజాక్షుఁ డీక్షించుతన్.

అవతారిక :— ఈ శ్లోకమునందు శ్రీ సుందరబాహుస్వామి నాసాసౌందర్యమును వర్ణించు చున్నారు.

శ్లో॥ ప్రేమామృతౌఘపరివాహిమహాక్షిసింధు
మధ్యే ప్రబద్ధ సముదంచితసేతుకల్పా ।
ఋజ్వీ సుసుందరభుజస్య విభాతి నాసా
కల్పద్రుమాంకురనిభా వనశైలభర్తుః ॥

ప్రతి :— వన, శైల, భర్తుః = వనాద్రినాథుఁడగు సుందరబాహుస్వామియొక్క, ఋజ్వీ = వంకరటింకరలు లేక సరిగానున్నట్టియు, కల్పద్రుమ, అంకుర, నిభా=కల్పవృక్షము యొక్క, చిగురాకుతో సమానమైనట్టియు, నాసా=ముక్కు, ప్రేమ—మధ్యే—ప్రేమ=ప్రేమ మనెడు, అమృత+ఓఘ= అమృతప్రవాహమును పరివాహీ = ప్రవహింపఁజేయు, మహత్=పెద్ద, అక్షి=కన్నులనెడు, సింధు=సముద్రముల యొక్క, మధ్యే = నడుమ, ప్రబద్ధ, సముదంచిత, సేతు, కల్పా=కట్టఁబడినదియు, అత్యంతసంభావిత మైనదియు, నగు సేతువుతో సమానమైనది, భవతి = అగుచున్నది.

విశేషములు :— ఋజ్వీ = నిరంతరమను భవింపఁబడు చున్నను, ఎప్పటి కప్పుడు క్రొత్తదానివలె నగపించు ఏకరూప మగు శోభగలది.

ఈ శ్లోకములోని పూర్వార్థముయొక్క భావమిది. శ్రీ సుందరబాహుమూర్తి నేత్రశోభానుభవము కొఱకుఁ దిగి అందలి ప్రేమరసములో మునిఁగి పోవుటచే అవయవాంతర శోభానుభవమునకుఁ బోవ శక్తిలేని ప్రేక్షకుల కన్నులకు స్వామివారినాసిక సేతువువలె నావలియొడ్డుఁ జేరుటకు సాధన మగు చున్నది.

తా॥ ఎల్లప్పుడు ననుభవింపఁ బడుచున్నను శశ్వదేకప్రకార మగు నవనవశోభ గలదియు, కల్పవృక్షకిసలయము వలె మనో

హారమైనదియు నగు సుందరబాహుస్వామివారి నాసిక ప్రేమామృతపూరమును ప్రవహింపఁజేయు కన్నులనెడు సముద్రముల నడుమ బంధింపఁబడి యొప్పిదముగా నున్నసేతువువలెఁ బ్రకాశించు చున్నది.

చ. నిరుపమశోభ యెప్డు రమ
ణీయత నేకవిధాన నొప్ప స్వ
స్తరు నవపల్లవాకృతిఁ బ్ర
శస్తి వహించు వనాద్రివాసి సుం
దరభుజునాస ప్రేమరస
ధారలఁ బూర్ణము లైన నేత్రసా
గరముల నంతరాళమునఁ
గన్పడు నూతనసేతువో! యనఁగ.

అవతారిక :— ఈ శ్లోకమున శ్రీస్వామివారివదన సౌందర్యము ననుభవించు చున్నారు.

శ్లో॥ వ్యాభాషితాభ్యధికనందన భందనద్ధి
మందస్మితామృత పరిస్రవ సంస్తవార్హ్యమ్ ।
ఆ భాతి విద్రుమసమాధర మాస్య మస్య
దేవస్య సుందరభుజస్య వనాద్రి భర్తుః ॥ 46

ప్రతి :— వన, అద్రి, భర్తుః = వనగిరి నాథుఁడైన, సుందరభుజస్య = సుందరబాహుమూర్తియను, అస్య = ఈ, దేవస్య = స్వామియొక్క, వ్యాభా — — — ఆర్హ్యమ్— వ్యాభాషిత, అభ్యధిక, నందన, భందన, ఋద్ధి = మాటలాడునప్పు డత్యంతా

నందకరమును శుభదము నగు సమృద్ధి గల, మందస్మిత, అమృత, పరిస్రవ, సంస్తవ, ఆఢ్యమ్=చిఱునవ్వు అనెడు అమృతరసముయొక్క పరిచయముతో నొప్పునదియు, విద్రుమ, సమ, అధరమ్=పొగడముతో సమానమగు పెదవిగలదియు అగు, ఆస్యమ్=మొగము, ఆభాతి=ప్రకాశించు చున్నది.

విశేషములు :— ఇందలి పూర్వార్థము 'స్మితపూర్వాభి భాషిణమ్' అన్నట్లు శ్రీసుందరబాహుస్వామి ప్రియులతో మాటలాడు నప్పుడు శ్రీవారి ముఖమునం దానందకరమును శుభప్రదమునగు మందహాస సుధానిష్యంద పరిచయముతో నొప్పుశోభాతిశయమును జాటుచున్నది. మాటలాడు నపుడు దేవరవారి చిఱునవ్వు వెన్నెలలు గాయునెమ్మోము భక్తుల కత్యంతభోగ్యముగా నుండునని పిండితార్థము.

విద్రుమసమాధరమ్— సంభాషణసమయమునఁ బొగడము వంటివాతెఱ కెంజాయలతోఁ గూడిన స్వామివారి చిఱునవ్వే దేవరవారి మోమున కంతయు శోభ చేకూర్చు చున్నదని యాశయము.

తా॥ వనాద్రినాథుఁ డగు నీ శ్రీసుందర బాహుస్వామివారి ముఖము సంభాషణసమయమం దధికానందకరమును శుభ ప్రదమునగు సమృద్ధిగల మందహాసమను అమృతనిష్యంద ముతోఁ బుష్టిఁగాంచి పొగడమువంటి వాతెఱపొలుపుతో నెంతయుఁ బ్రకాశించు చున్నది

క. పలికెడు తటి నమృతంబుం
జిలుకుచు లేనవ్వు గాయఁ జిఱువెన్నెలలన్
తుల లేనిమోవి పగడపుఁ
దళుకులఁ గురియన్ వనాద్రిధవుమో మలరున్.

అవతారిక :— ఈ శ్లోకమునందు శ్రీవనాద్రినాథుని కపోల సౌభాగ్యము ననుభవించు చున్నారు

శ్లో॥ యశోదాంగుళ్యగ్రో న్నమితచుబుకాఘ్రాణముదితౌ
కపోలా వద్యాపి హ్యనుపరతతద్ధర్షగమకౌ ।
విరాజేతే విష్వగ్వితతసహకారాసవరస
ప్రమాద్య ద్భృంగాఢ్య ద్రుమవనగిరే స్సుందరహరేః ॥ 47

ప్రతి :— విష్వగ్వితత......గిరేః—విష్వక్=నలువైపుల, వితత=వ్యాపించిన, సహకార = తియ్యమామిడిపండ్లయొక్క, ఆసవ=ఆసవముయొక్క, రస=రసముచేత, ప్రమాద్యత్ = మదించుచున్న, భృంగ=తుమ్మెదలచేత, ఆఢ్య=ఒప్పుచున్న, ద్రుమ=చెట్లుగల, వనగిరేః=వనాద్రిగల, సుందరహరేః= సుందరభుజస్వామియొక్క, యశోదా......... ముదితౌ— యశోదా=యశోదాదేవియొక్క, అంగులి=వ్రేళ్ళయొక్క, అగ్ర=కొనలచేత, ఉన్నమిత=పైకెత్తబడిన, చిబుక= గడ్డముయొక్క, ఆఘ్రాణ = మూచూచుటచేత, ముదితౌ= సంతసించినవియు, (వికసించినవియు) అద్యాపి = నేఁటికిని, అనుపరత, తత్, హర్ష, గమకౌ = ముగియని యాసంతోష వికాసమును సూచించు నవియు, అగు, కపోలౌ=చెక్కిళ్ళు, విరాజేతే, మిక్కిలి ప్రకాశించుచున్నవి, హి=సత్యము.

విశేషములు :— యశోదా......ముదితౌ — యశోదా దేవి వాత్సల్యాతిశయముచేత శ్రీ బాలకృష్ణుని గడ్డమును తన వ్రేళ్ళకొనలతో నెత్తి పట్టి మూర్కొనఁగాఁ జెక్కిళ్ళ యందు సంతోషముచేత నొకవికాసము గలిగెనని భావము. అద్యాఽపి— ఇప్పటికిని— అనఁగాఁ జాలకాలము గతించి నప్పటికిని, సుందరభుజావతారమునఁ గూడ ఆసంతోష వికాస మనువర్తించుచునే యున్నదని యాశయము. 'హి' హి శబ్ద ప్రయోగమువలనఁ బూర్వోక్త సుందరభుజస్వామివారికపోల వికాసము శ్రీవారి సేవింపవచ్చిన భక్తులెల్లరకుఁ బ్రత్యక్షాను భావ్యమగు చున్నదని సుస్పష్ట మగుచున్నది.

తా॥ నలువైపుల విజృంభించిన తియ్యమామిళ్ళ యాసవ రసంబును గ్రోలి మదించిన తుమ్మెదలతో నొప్పు వృక్షములు గల వనాద్రికి నాథుఁడైన శ్రీ సుందరభుజస్వామియొక్క చెక్కిళ్ళు కృష్ణావతారమున యశోద వాత్సల్యాతిశయముచేత గడ్డమును బైకెత్తి ముద్దాడుటచేఁ గలిగిన వికాసముతో నేఁటికిని భక్తజనుల కనుభావ్యములై యలరారు చున్నవి.

ఉ. చిన్నతనాన గడ్డమును
జేఁ గొని నందునిరాణి ముద్దులన్
గొన్నది, తద్వికాస మొక
కొంచెముఁ దగ్గక విందు గూర్చెడున్

గన్నుల కిష్టు వ్యాప్తసహా
కార ఫలాసవమత్తభృంగ సం
పన్న వనాద్రి సుందర సు
బాహు మనోజ్ఞకపోల మండలిన్.

అవతారిక :— ఈ శ్లోకమునందు (శ్రీ)స్వామివారి కర్ణపాశ సౌందర్యమును వర్ణించుచున్నారు.

శ్లో॥ వ్యాలంబికుండల ముదగ్రసువర్ణపుష్ప
నిష్పన్నకల్పలతికాయమలానుకారమ్ ।
యత్కర్ణపాశయుగళం నిగడం ధియాం నః
సోఽయం సుసుందరభుజో వనశైలభూషా ॥ 49

ప్రతి :— వ్యాలంబి, కుండలమ్ = (మూపులమీఁద) వ్రేలాడుచున్న కర్ణాభరణములు గలదియు, ఉదగ్ర . . . . . . అనుకారమ్— ఉదగ్ర = ఉజ్జ్వలమగు, సువర్ణ = బంగారపు, పుష్ప = పుష్పములతో, సంపన్న = కూడిన, కల్పలతికా = కల్పలతల యొక్క, యమల = జంటయొక్క, అనుకారమ్ = పోలికగల, యత్, కర్ణపాశ, యుగళమ్ = ఏసుందరబాహుమూర్తి యొక్క ప్రశస్తములగు చెవులజంట, నః = మాయొక్క, ధియామ్ = బుద్ధులకు, నిగడమ్ = సంకెల,(భవతి = అగుచున్నదో) సః = అట్టి, అయమ్ = ఈ సుందరభుజః = సుందరబాహుస్వామి, వనశైల, భూషా = వనాద్రికి అలంకారమునంటివాఁడు.

విశేషములు :— 'యత్కర్ణపాశయుగళం నిగడం ధియాం నః' (శ్రీ) సుందరబాహుస్వామివారి కర్ణపాశయుగళము మిక్కిలి అందముగా నుండుటవలన మాబుద్ధులకుఁ దదితర దివ్యావయ

వానుభవంబు నొనర్ప సంకెలవలె నాటంకము గలిగించు చున్నది. లేదా— మాబుద్ధులను విషయాంతరానుభవము నకుఁ బోనీయక యరికట్టుచున్న దని భావము. అట్టి త్రిలోక సుందరుఁ డగు శ్రీ సుందరభుజస్వామి యీ వనాద్రి కొక యమూల్యాలంకారముగా నుండుట వనగిరి భాగ్యమని తాత్పర్యము.

తా॥ మూఁపులపై వ్రేలాడుచున్న కర్ణాభరణములు గల దియు, దేదీప్యమానము లగు బంగారు పువ్వులతోఁ గూడిన కల్పలతలజంటను బోలినదియు నగు శ్రీ సుందరబాహుస్వామి వారి ప్రశస్తములగు వీనులజంట మాబుద్ధుల ఇతర దివ్యావ యవసౌందర్యానుభవమునకుఁ గాని విషయాంతర సంచారము నకుఁ గాని పోనీయక సంకెలవలె నరికట్టు చున్నది. ఏతాదృశ కర్ణపాశసౌందర్యవిశిష్టుఁ డగు శ్రీ సుందరబాహుస్వామి వనాద్రి కొక దివ్యభూషణముగాఁ బ్రకాశించు చున్నాఁడు.

ఉ. మూఁపులపైని నాడునటు
ముచ్చటఁ గొల్పఁగఁ గుండలమ్ము లు
ద్దీపిత హేమపుష్పములు
తీర్చిన కల్పలతాద్వయం బటుల్
దాపున వెల్గుస్వామి చెవి
తమ్ములు సంకెల మాదుబుద్ధికిన్,
జూపరి దివ్యభూషణము
సుందరబాహువు కాననాద్రికిన్.

అవతారిక :— ఈ శ్లోకమున శ్రీస్వామి కంఠ సౌందర్యమును అనుభవించు చున్నారు.

శ్లో॥ సదంససంసంజిత కుంతలాంతికా
వతీర్ణకర్ణాభరణాఢ్య కంధరః
సుబంధురస్కంధ నిబంధనో యువా
సుసుందర స్సుందరదో ర్విజృంభతే ॥ 49

ప్రతి :— సదంస......కంధరః— సత్ = యోగ్యము లగు (అందము లైన) అంస = మూపులమీఁద, సంసంజిత = బాగుగా నంటుకొనియున్న, కుంతల = ముంగురులయొక్క, (చూర్ణకుంతలములయొక్క) అంతిక = సమీపమునందు, అవతీర్ణ = వ్రేలాడుచున్న, కర్ణాభరణ = కుండలములతోను, ఆఢ్య = ఒప్పుచున్న, కంధరః = కంఠముగల వాఁడును, సుబంధుర, స్కంధ, నిబంధనః = మిక్కిలి దృఢమగు మూపులయొక్క సంధి బంధములు గలవాఁడును, యువా = యౌవనసంపన్నుఁడును, సుందరదోః = సుందరములగు బాహువులు గలవాఁడును, అగు సుందరభుజస్వామి, సుసుందరః = మిక్కిలి సుందరుఁడగుచు, విజృంభతే = విజృంభించు చున్నాఁడు (చెలరేగు చున్నాఁడు.)

విశేషములు :— పూర్వార్థము భావమేమన ? మూపులఁ దాఁకుచున్న పిల్లజుట్టువఱకు వ్రేలాడు కర్ణాభరణములతో నలంకృతమగు కంఠము గలవాఁడు. యువా = బాల్యయౌవన సంధిలోని వాఁడని భావము.

తా॥ సుందరబాహుస్వామి యందమగు మూపుల నంటి యున్న పిల్లజుట్టు వఱకు వ్రేలాడుచున్న కుండలములతో సుందర

మగు కంఠము గలవాఁడును, దృఢములగు భుజశిరస్సుల సంధులు గలవాఁడును, బాల్యయౌవనముల సంధిలో నున్న వాఁడునై మిక్కిలి సుందర రూపముతో విజృంభించు చున్నాఁడు.

ఉ. మూఁపుల మూగి యెంతయును
ముచ్చటఁ గొల్పెడు పిల్లజుట్టు పెన్
దాపునఁ గుండలచ్ఛవుల
తాండవ మొప్పి సుసంధిబంధురం
బై పొలుపారఁ గంధరము
యౌవన నవ్య విలాసమంజులా
టోపముతో వనాచల కు
టుంబి సుసుందరుఁ డేపుఁ జూపెడున్.

శ్లో॥ వ్యూఢగూఢ భుజజత్రు ముల్లస
త్కంబు కంధరధరం ధరాధరమ్।
వృక్షషండమయ భూభృత స్తటే
సుందరాయత భుజం భజామహే ॥

ప్రతి :— వ్యూఢ, గూఢ, భుజ, జత్రుమ్=బలిసినవియు (భారమును సహించు నవియు) దాగినవియు (మాంసములో) అగు భుజములదగ్గఱ నున్న మెడయెముకలు గలవాఁడును, ఉల్లసత్, కంబు, కంధర, ధరమ్ = ప్రకాశించుచున్న శంఖము వంటి మెడకలవాఁడును, సర్వమును ధరించువాఁడును, వృక్ష, షండ, మయ, భూభృతః=చెట్లగుబురులతో నిండిన పర్వతము యొక్క, తటే=చఱియందు, ధరాధరమ్=భూమిని రక్షించు

చున్నవాఁడును, అగు, సుసుందర, ఆయత, భుజమ్=మిక్కిలి ఆందములును దీర్ఘములును అగు భుజములుగల సుందరబాహు స్వామిని, భజామహే=సేవించు చున్నాము.

విశేషములు :— ఉల్లసత్కంబు కంధరధరమ్— కంధరా శబ్దము స్త్రీలింగముగనుక— కంధరాధరమ్— అని యుండవలసి యున్నది. శ్రీ కూరేశులవారు అకారాంతముగాఁ బ్రయోగించుటంజేసి— 'కంధర' వఱకు బహువ్రీహి చేసికొని తరువాత 'ధర' శబ్దముతో విశేషణోభయ పదకర్మధారయ మొసర్పఁ బడినది. తదనుసారముగనే యర్థము వ్రాయఁబడినది. ధగాధరం వృక్షషంశమయ భూభృతః, తకే, ఇందలి 'మయట్' ప్రత్యయము ప్రాచుర్యార్థమున వచ్చినది. శ్రీ సుందరభుజస్వామి అందఱిని రక్షింప బద్ధకంకణుఁడై యున్నను మాబోంట్ల సంరక్షణ సౌలభ్యమునకై వనాద్రితటమున వేంచేసి యుండె నని యాశయము.

తా॥ బలిసి కండపట్టిన మెడమెముకలు గలిగి యందమగు శంఖమువంటి కంఠము గలిగి వనాద్రిసానుతలమునందు భక్త రక్షణ సౌలభ్యమునకు వేంచేసియున్న యాయతబాహు వగు శ్రీ సుందరభుజస్వామిని భజించుచున్నాము.

మ. బలసంపన్నము మాంసగర్భితము
శుంభజ్జత్రు దేశంబు ను
జ్జ్వలకంబూపమ భవ్యకంధరము భా
స్వద్దీర్ఘ బాహాద్వయం

బలరారన్ దరుషండ మండితవనా
హర్మ్యంబునం దొక్కచో
జెలువొప్పన్ నివసించు సుందరభుజున్
సేవింతు మశ్రాంతమున్

అవతారిక :— ఈ క్రింది నైదు శ్లోకములయందు (శ్రీ) సుందరబాహుస్వామి దివ్యభుజముల సౌందర్యము ననుభవించు చున్నారు.

శ్లో॥ మందరభ్రమణ విభ్రమోద్భటాః
సుందరస్య విలసంతి బాహవః ।
ఇందిరా సమభినంద భందనా
శ్చందనాగరు విలేపభూషితాః ॥ 51

ప్రతి :— మందర, భ్రమణ, విభ్రమ, ఉద్భటాః = మందర మనెడు కవ్వపుఁగొండను ద్రిప్పుటయందు ఉత్సాహము గల వియు, ఇందిరా, సమభినందన, భందనాః = లక్ష్మీదేవిని సంతోషపెట్టు విషయమున మంగళకరములును, (లేదా) సుఖ కరములును, చందన, అగరు, విలేప, భూషితాః = గంధము – అగరు – మైపూఁతలతో అలంకరింపఁ బడినవియు అగు, సుంద రస్య = సుందరబాహుమూర్తి వారి యొక్క, బాహవః = భుజములు, విలసంతి = మిక్కిలి ప్రకాశించుచున్నవి.

విశేషములు :— 'భందనాః' భది కల్యాణే – సుఖే చ – అను ధాతువువలన నేర్పడిన రూపము గాన – కల్యాణకర ములు లేదా సుఖకరములు– అని యర్థ మొసఁగును. క్షీరాబ్ధి

మథనకాలమునందే లక్ష్మీదేవి ఆవిర్భవించుటవలన సుందర భ్రమణ విలాసమహోత్సాహ మింది రానందావాప్తికి హేతువుగా వర్ణింపఁ బడినది.

తా॥ మందరాచలభ్రమణ విలాసోత్సాహంబులును ఇందిరానంద సమవాప్తి హేతువులును చందనాగరువిలేపనాలంకృతములు నగు సుందరబాహుస్వామి బాహువులు మఱిమఱి ప్రకాశించు చున్నవి.

గీ॥ మందరా ఘూర్ణన విలాసమంజులములు
ఇందిరా నందసమవాప్తి కందళములు
చందనాగరులిప్తముల్ సుందరభుజ
బాహుదండంబు లతిలోక మోహనములు.

శ్లో॥ జ్యాకిణాంక పరికర్మ ధర్మిణో
భాంతి సుందరభుజస్య బాహవః ।
పారిజాత విటపాయితర్ధయః
ప్రార్థితార్థ పరిదాన దీక్షితాః ॥ 52

ప్రతి :— జ్యా, కిణ, అంక, పరికర్మ, ధర్మిణః = వింటినారి వలనికాయ యనెడు గుర్తే అలంకార రూపమగు ధర్మముగాఁ గలవియు, ప్రార్థిత, అర్థ, పరిదాన, దీక్షితాః = (ఆశ్రితజనుల చేత) ప్రార్థింపఁ బడిన, పురుషార్థముల నొసంగుటయందు దీక్ష గలవియు, (కనుకనే) పారిజాత, విటపాయిత, ఋద్ధయః = పారిజాతపుఁ గొమ్మవంటి సమృద్ధి గలవియు, అగు, సుందర భుజస్య = సుందరబాహుస్వామియొక్క, బాహవః = భుజములు, భాంతి = ప్రకాశించు చున్నవి.

విశేషములు :— జ్యాకిణాంక......ధర్మిణః — జ్యాకిణ మనఁగా— ధనుస్సు నెక్కు-వెట్టి బాణమును సంధించు సమయమున వింటినారి దెబ్బచేత నేర్పడిన ముంజేతి యందలి వ్రణవిశేషము. ఇది మహావీరుల భుజమున కలంకారము. ఈ యలంకారము సుందరభుజస్వామివారిభుజము లన్నింటికిఁ బేర్కొ-నుట వలన నాస్వామి సవ్యసాచి యని స్పష్టమగు చున్నది. ఈవిశేషణము స్వామివారి శౌర్యమును జాటుచున్నది. ప్రార్థితా...... దీక్షితాః— ఆశ్రిత జనులకుఁ జతుర్విధ పురుషార్థముల నొసంగుటలో దీక్ష వహించిన వని భావము. ఈ విశేషణము స్వామివారి యౌదార్యవిశేష స్ఫోరకము. దీనివలన శౌర్యౌదార్యములే భుజములకు శోభాజనకము లనుట స్పష్టమగు చున్నది.

తా॥ వింటినారివలన నేర్పడిన కాయలే ఆభరణములుగాఁ గలిగి, ఆశ్రితుల యభీష్టము లొసంగుటకు దీక్షవహించి, పారిజాతశాఖాసమానసమృద్ధి చెన్నారి శ్రీ సుందరబాహు స్వామివారి దివ్యబాహువులు మిక్కిలి శోభిల్లుచున్నవి.

గీ. జ్యాకిణాంకాఢ్య వీరభూషల ధరించి
సంశ్రితేష్టార్థదాన దీక్షాయుతములు ।
పారిజాత ద్రుమవిటపశోభావహములు
సుందరుభుజార్గళమ్ము లానందదములు.

శ్లో॥ సాగరాంబరతమాలకానన
శ్యామలద్యుతయ ఉదారపీవరాః ।

శేషభోగ పరిభోగభాగిన
స్తన్నిభా వనగిరీశితు ర్భుజాః ॥ 53

ప్రతి :— సాగరా......బుద్ధయః— సాగర=సముద్రము వలెను, అంబర=ఆకాశమువలెను, తమాలకానన = చీఁకటి ప్రూఁకుల యడవివలెను, శ్యామల = నల్లని, బుద్ధయః= శోభాసమృద్ధి గలవియు, ఉదార, పీవరాః =దీర్ఘము లైనవియు, బలిష్ఠము లైనవియును, శేషభోగ, పరిభోగ, భాగినః= శేష శరీరరూపమగు శయ్యాసుఖము ననుభవించుటయందు భాగము (పాలు) గలవియు, తత్+నిభాః = ఆ శేషశరీరముతో సమా నము లైనవియునై, వన, గిరి, ఈశితుః=వనాద్రి నాథుఁడైన శ్రీ సుందరబాహుస్వామియొక్క, భుజాః = బాహువులు, (భాంతి = ప్రకాశించు చున్నవి.)

విశేషములు :— సాగర......బుద్ధయః— శ్రీ సుందర భుజస్వామివారి బాహువులకు సాగరములు, ఆకాశము, తమాలకాననము— ఈ మూఁడింటి నుపమానములుగాఁ జెప్పుట చేత మిక్కిలి శ్యామలతాశోభాసమృద్ధిగల్గి యున్నవని భావము ఈ సమాసములోని చివరది యగు 'బుద్ధి' పదము శోభాసమృద్ధి పరము. సాగరములు వివిధవర్ణములు గలవియైనను సామాన్య ముగా దానిరంగు కవిసమయమున నైల్యముగనే వర్ణింపఁబడు చున్నది. ఆకాశముగూడ 'నీలం నభః' ఇత్యాది ప్రతీతిచేత నల్లనిదిగానే కవులవ్యవహారములో గోచరించు చున్నది. తమాలకాననము నీలమే కదా!

'ఉత్తంసాయ తమాలపల్లవ ఇతి చ్ఛిందంతి యాం గోపికాః'
(కృష్ణకర్ణామృతము)

తా॥ సముద్రమువలెను, ఆకాశమువలెను, చీఁకటి ప్రాఁకుల యడవివలెను, శ్యామలశోభాసమృద్ధిగలిగి, పొడవులై కండపట్టి శేషశరీరమునందు శయ్యాసుఖానుభవములో భాగము గలవియై ఆకారమున శేషశరీరమును బోలి వనాద్రినాథుఁ డగు (శ్రీ) సుందరభుజస్వామివారి బాహువు లెంతయుఁ బ్రకా శించు చున్నవి.

ఉ. సాగరమట్టు లంబరము
చాయ విశాలతమాలకాననా
భోగములీల నీలరుగ
పూర్వము లాయతపీనవృత్తముల్
భోగికులేంద్ర దివ్యతను
భోగమునం గృతభాగముల్ సదా
యోగి జనాభయప్రదము
లోముత సుందరబాహుబాహువుల్.

**శ్లో॥ అహమహమికాభాజో గోవర్ధనోద్ధృతి నర్మణి**
**ప్రమథనవిధా వబ్ధే ర్లబ్ధప్రబంధ సమక్రియాః ।**
**అభిమతబహూభావాః కాంతాభిరంభణసంభ్రమే**
**వనగిరిపతే ర్బాహాః శుంభంతి సుందరదో ర్ద్రుమాః ॥ 54**

ప్రతి :— గోవర్ధన, ఉద్ధృతి, నర్మణి=గోవర్ధన పర్వతము నెత్తుట యను లీలయందు, అహమహమికాభాజః = నేను ముందు, నేను ముందు, అనుతొందరను పొందినవియు, అబ్ధేః = సముద్రముయొక్క—, ప్రమథనవిధౌ= చిలికెడు పనియందు, లబ్ధ,

ప్రబంధ, సమ, క్రియాః = పొందఁబడిన యను బంధనముగా (తెంపులేని) సమాన వ్యాపారములు గలవియు, కాంతా, అభిరంభణ, సంభ్రమే = భార్యను కౌఁగిలించుకొను సంబరము నందు (లేదా-త్వరలో) అభిమత, బహుతా భాజః = కోరఁబడిన బహుత్వము గలవియు అగు, వనగిరిపతేః = వనాద్రినాథుఁడైన, సుందరదోః = సుందరబాహువనెడు, హరేః = విష్ణుమూర్తియొక్క, బాహాః = బాహువులు, శుంభంతి = ప్రకాశించు చున్నవి.

విశేషములు :— అహమహమిక = అహమహమిక యను పూర్వ మితి యా ప్రవృత్తిః సా, నేను ముందు నేను ముందట యను ప్రవృత్తిని 'అహమహమిక' యందురు, దానిని 'భాజః' = పొందినవి, అని సుందరబాహు స్వామి బాహువులకు విశేషణము.

తా॥ గోవర్ధనపర్వతోద్ధరణ మనెడు క్రీడయందు నేను ముందట నేనుముందట యను తొందరతోఁ గూడినవియు, క్షీరాబ్ధిని మథించుటయందు ఎడతెగని సమానవ్యాపారములు గలవియు, అప్పుడే పాలసముద్రములోఁ బుట్టిన యిందిరాకాంతను కౌఁగిలించుకొను సంబరంబున అభిలషింపఁబడిన బహుత్వముగలవియు, (కాంతను కౌఁగిలించుకొనుటకు నాల్గు బాహువు లేమి చాలఁగలవు, ఇంకను పెక్కు బాహువులుండిన బాగుండునని స్వామివారి యభిలాష యని భావము) అగు వనాద్రినాథుఁడగు సుందరబాహుస్వామి యను విష్ణుమూర్తి యొక్క బాహువులు మిక్కిలి శోభిల్లుచున్నవి.

మ. వరగోవర్ధన పర్వతోద్వహాస భ
వ్యక్రీడ నే ముందు, ముం
దఱ నే నం చెవి పోరుం, జిల్కుతఱి సం
ద్రం జెవ్వి బల్ ప్రొద్దుపో
కరయం జాలవు, కోరుఁ జెచ్చు నెవి భా
ర్యన్ గొంగిటంజేర్చు సం
బరమందున్ వనశైలవాసిహరి త
ద్బాహుల్ ప్రభాగేహముల్.

శ్లో॥ శ్రీమద్వనాద్రి పతిపాణితలాబ్జయుగ్మ
మారూఢయో ర్విమలశంఖరథాంగయోస్తు ।
ఏకోఽబ్జ మాశ్రిత ఇవోత్తమరాజహంసః
పద్మప్రియోఽర్క ఇవ తత్సమితో ద్వితీయః ॥ 55

ప్రతి :— శ్రీమత్, వనాద్రిపతి, పాణితల, అబ్జ, యుగ్మమ్ = శ్రీమంతుఁడగు వనగిరి ప్రభువు యొక్క, కరతలము లనెడు, పద్మముల జంటను, ఆరూఢయోః=అధిష్ఠించియున్న, విమల, శంఖ, రథాంగయోః = నిర్మలములైన శంఖచక్రములలో, ఏకః, తు = ఒక్కటియగు శంఖము, అబ్జమ్=పద్మమును, ఆశ్రితః=ఆశ్రయించిన, ఉత్తమ, రాజహంసః ఇవ=శ్రేష్ఠమగు రాజహంసవలెను, తత్, సంమితః = దానివలెనే పద్మమును పొందిన, ద్వితీయః తు = రెండవది యగు చక్రమో, పద్మప్రియః=పద్మమునందుఁ బ్రేమగల, అర్కః ఇవ=సూర్యుని వలె, (భాతి=ప్రకాశించు చున్నది.)

విశేషములు :—ఈశ్లోకమున 'భాతి' అనుక్రియను జేర్చుకొని యన్వయము చెప్పుకొనవలెను. అలంకారము—అభూతోపమ—

తా॥ వనాద్రినాథుఁ డగు శ్రీ సుందరబాహుస్వామిగొక్క కరతలము లనెడు పద్మములజంట నధిష్ఠించియున్న నిర్మలము లగు శంఖచక్రములలో నొక్కటియగు శంఖము పద్మముపైనున్న శ్రేష్ఠమగు రాజహంసము వలెను, అట్టిదేయగు రెండవదియైన చక్రము పద్మమునందుఁ బ్రేమగల సూర్యునివలెను ప్రకాశించు చున్నది.

ఉ. చక్కఁగఁ గాననాద్రిగత
శౌరికరాబ్జయుగాధిరూఢముల్
మిక్కిలి కాంతిపుంజముల
మించెడి శంఖరథాంగయుగ్మమం
దొక్కటి పద్మసంశ్రితము
నుత్తమ హంసవరంబుఁ బోలు, వే
ఱొక్కటి పద్మమిత్రుఁ డయి
యొప్పు నభోమణిఁ బోలి క్రాలెడున్.

అవతారిక :— ఈ శ్లోకమునందు శ్రీ సుందరబాహుస్వామి వారి సర్వగుణోపేత మగు వక్షఃస్థలసౌందర్యము ననుభవించు చున్నారు.

శ్లో॥ లక్ష్మ్యాః పదం కౌస్తుభసంస్కృతం చ
శ్రీవత్సభూమి ర్విమలం విశాలమ్ ।
విభాతి వక్షో వనమాల యాఢ్యం
వనాద్రినాథస్య సుసుందరస్య ॥ 56

ప్రతి :— లక్ష్మ్యాః = లక్ష్మీదేవికి, పదమ్ = నివాసస్థానమును, కౌస్తుభ, సంస్కృతం, చ = కౌస్తుభమణిచేత నలంకరింపఁబడినదియు, శ్రీవత్స, భూమిః = శ్రీవత్స మనెడు పుట్టుమచ్చ

కుఁ డామైనదియు, వనమాలయా = వనమాల యనెడు పూల దండచేత, ఆఢ్యమ్=ఒప్పినదియు, విమలమ్=నిర్మలమైనదియు, విశాలమ్=వెడఁద యైనదియు, అగు వనాద్రినాథస్య=వనగిరి ప్రభువైన, సుసుందరస్య = శ్రీ సుందరబాహుస్వామియొక్క, వక్షః = వక్షఃస్థలము, విభాతి=మిక్కిలి ప్రకాశించుచున్నది.

విశేషములు :— ఇందు సుందరభుజస్వామి వక్షఃస్థల మనన్యసాధారణ చిహ్నములగు లక్ష్మీకౌస్తుభ శ్రీవత్సవనమాల లచేత నతివిలక్షణలక్ష్మీ సంపన్న మనుటచేత భక్తుల హృద యము నాకర్షించి స్వాయత్త మొనర్పఁ దగియున్నదని భావము.

తా॥ లక్ష్మీనివాసమును కౌస్తుభాలంకృతమును శ్రీవత్స మను పుట్టుమచ్చ కలదియు వనమాలాశోభితమును నిర్మలమును విశాలమునయి వనాద్రినాథుఁడగు శ్రీ సుందరబాహుస్వామి వక్షఃస్థలము మిక్కిలి ప్రకాశించు చున్నది.

సీ. క్షీరాబ్ధిలో జనించిన సుందరికి రమా
లీలావతికి నేది కేళిగృహము
రాజిల్లు నేమందిరమున శాణోల్లీఢ
ఘనరత్నదీపమై కౌస్తుభంబు
ఎచ్చోట సింగార మినుమడించెడు వన
మాల యందాలయూయేల వోలె
'నాది యీతా' వను శ్రీదేవిముద్ర నా
శ్రీవత్స మెచ్చోటఁ జెన్ను మీఱు
గీ. అతివిశాలమ్ము నిర్మల మద్దమట్లు
శ్రీవనాద్రీశు నిత్యలక్ష్మీయుతంబు

సుంపగోరస్థలంబును జూడ నలయు
సన్నఁ గావలె నొకవేయికన్ను లెస్స.

అవతారిక :— ఈశ్లోకమున (శ్రీ) సుందరబాహుస్వామివారి నాభిసౌందర్యము ననుభవించు చున్నారు.

శ్లో॥ సౌందర్యామృతసారపూరపరివాహావర్తగర్తాయితం
యాతః కించ విరించిసంభవన భూమ్యంభోజ సంభూతిభూః ।
నాభిః శుంభతి కుంభికుంభనిభనిర్భాత స్తనస్స్వర్వధూ
సంభుక్తద్రుమషండ శైలవసతే రారూఢలక్ష్మ్యా హరేః ॥ 57

ప్రతి :— కుంభి......వసతేః— కుంభి = ఏనుగులయొక్క, కుంభ = కుంభస్థలములతోఁ, నిభ = సమానములగు, నిర్భాత = మిక్కిలి ప్రకాశింపఁ జేయఁబడిన, స్తన = పాలిండ్లు గల, స్వర్, వధూ = దేవకాంతలచేత, సంభుక్త = చక్కగా ననుభవింపఁబడిన, ద్రుమషండశైల = (వృక్షసమూహముతోఁ గూడిన కొండ) వనగిరి, వసతేః = నివాసముగాఁ గల, ఆరూఢలక్ష్మ్యాః = ఆరూఢశ్రీ అను నామాంతరము గల, హరేః = సుందరబాహుస్వామియొక్క, సౌందర్యా..... గర్తాయితము — సౌందర్య = చక్కఁదన మనెడు, అమృతసార = అమృతపుఁ జేట యొక్క, పూర = ప్రవాహముయొక్క పరివాహ = పాయ యొక్క, (చిన్నప్రవాహముయొక్క) ఆవర్తగర్తాయితము = సుడిగుండముయొక్క, సామ్యమును, యాతః = పొందినదియు, కించ = మఱియు, విరించి...భూః— విరించి = బ్రహ్మయొక్క, సంభవన = పుట్టుకకు, భూమి = స్థానమగు, అంభోజ = పద్మము నకు, సంభూతిభూః = ఉత్పత్తి స్థానమైన, నాభిః = బొడ్డు, శుంభతి = ప్రకాశించు చున్నది.

విశేషములు :— ...... స్వర్ధ్వధూ సంభుక్త ద్రుమషండ శైల ...... సుర సుందరీ మణులకు సైతము విహారయోగ్య మీ శైల మనుటచేత వనాద్రియొక్క ఔన్నత్యము భోగ్యతయు వ్యక్తము లగుచున్నవి. 'ఆరూఢ లక్ష్మ్యాః' ఇది సుందర బాహు స్వామివారికి నామాంతరము.

తా॥ ఏనుఁగుల కుంభస్థలములఁ బోలు మెఱుగుపాలిండ్లు గల వేలుపు జవరాండ్రకు భోగ్యమగు వనాద్రియందు నిత్య నివాస మొనర్చుచు ఆరూఢ శ్రీ నామాంతరముతో నొప్పు శ్రీ సుందర బాహు స్వామివారి నాభి నాలుగు మోముల వేలుపుఁ బెద్దనుగన్న తమ్మిపూవునకుఁ బుట్టినిల్లై సౌందర్యామృత సార పూరపు టలుఁగునకు సుడిగుండమట్లు ప్రకాశించు చున్నది.

శా॥ పాలిండ్లన్ మదకుంభి కుంభములతోఁ
బంతాలు గావించు మేల్
వాలుం జూపుల వేల్పు జవ్వనులకున్
బ్రాపౌ వనాద్రిస్థలిన్
లోలుండౌ హరిదివ్యనాభి విలసి
ల్లున్ బద్మభూమూల ప
ద్మాలంబంబు సురూపకాంత్యమృత పూ
రావర్త గర్తం బటుల్

అవతారిక :— ఈ శ్లోకమున గ్రంథకర్తగారు శ్రీ స్వామి వారి నడుమునఁ గల సోయగము ననుభవించుచున్నారు.

శ్లో॥ సుందరస్య కిల సుందర బాహోః
శ్రీ మహాతరు వనాచల భర్తుః ।
హంత యత్ర నివసంతి జగంతి
ప్రాపిత క్రశిమ తత్తను మధ్యమ్ ॥ 58

ప్రతి :— శ్రీ మహాతరు, వనాచల, భర్తుః=శోభాయుక్తమును మహావృక్షములు గలదియు నగు వనగిరికిఁ బ్రభువైనట్టియు, సుందరస్య=అందగాఁడైనట్టియు, సుందరబాహోః=సుందరబాహుస్వామియొక్క, యత్ర=ఏ మధ్యభాగమునందు, జగంతి=లోకములు, నివసంతి=(ప్రళయకాలమునందు) నివసించుచున్నవో, తత్=అట్టి, తనుమధ్యమ్=దివ్యవిగ్రహము యొక్క మధ్యభాగము, ప్రాపిత, క్రశిమ, కిల=పొందింపఁబడిన కృశత్వము గల దఁట, హంత=ఆశ్చర్యము!

విశేషములు :– తత్తనుమధ్యమ్— ఇది యేకపదముగాఁ గూడఁ జేసికొనవచ్చును. ఆ సుందరబాహుస్వామి దివ్య విగ్రహముయొక్క మధ్యభాగము– అనఁగా ఉదర మని భావము. హంత— ఇది యాశ్చర్యార్థకమగు అవ్యయము. ఆశ్చర్య మేమనఁగా– ప్రళయకాలమున సకల లోకములు విశాలముగా నివసించిన భగవదుదరము కృశించి పోవుట వింత గదా!

తా॥ ప్రళయకాలమునందు సమస్త లోకములకు నివాస భూతమగు శ్రీమద్వనాద్రినాథుఁడైన యందగాఁడగు సుందర బాహుస్వామి మధ్యభాగ మెంతయుఁ గృశత్వము నందుట వింతగా నున్నది.

(నడుము సన్నముగా నుండుట యందము)

గీ॥ సలిలమయమైన యామహాప్రళయమందు
జగములు విశాలముగ నివాసంబు సలుపు
నెలవయిన శ్రీవనాచలనేత మధ్య
మెంత కృశియించియున్నది! వింత వింత.

అవతారిక :— ఈ శ్లోకమున శ్రీస్వామివారి యూరు సౌందర్యము ననుభవించు చున్నారు.

శ్లో॥ పిష్టదుష్ట మధుకైటభ కీటౌ
హస్తిహస్తయుగళాభసువృత్తౌ ।
రాజతః క్రమకృశౌ చ సదూరూ
సుందరస్య వనభూధర భర్తుః ॥ 59

ప్రతి :— పిష్ట...... కీటౌ — పిష్ట = పొడిచేయఁబడి నట్టియు, దుష్ట = (వేదాపహరణాదులచేత) దోషులైనట్టియు, మధు, కైటభ, కీటౌ = పురుగులవంటి మధు కైటభులు గల వియు, హస్తి, హస్త, యుగళాభ, సువృత్తౌ = ఏనుఁగు తొండ ముల జంటవలెఁ బ్రకాశించునవియు, మిక్కిలి గుండ్రతనము గలవియు, క్రమకృశౌ = క్రమముగా (పైనుండిక్రిందికి) కార్శ్య ముగలవియు అగు, వనభూధర భర్తుః = వనాద్రి నాథుఁడగు,

సుందరస్య = సుందర బాహు స్వామి యొక్క, సత్, ఊరూ=శ్రేష్ఠములగు తొడలు, రాజతః=ప్రకాశించుచున్నవి.

విశేషములు:—పిష్ట దుష్ట మధుకైటభ కీశా—భగవానుఁడగు నారాయణుఁడు వేదాపహరణ మొనర్చిన క్షుద్రులగు మధుకైటభులను తొడలతోఁ బొడిపొడి చేసెను. అని పురాణ ప్రసిద్ధి, 'ఊరుద్వయేన నిష్పిష్య జఘాన భగవాన్ — ఇతి — క్రమకృశౌ — ఏనుఁగు తొండమువలెఁ బైనుండి క్రిందివఱకుఁ గార్శ్యమును బొందిన వని భావము. ఇట్లుండుట సౌందర్య సంపాదకము.

తా॥ వేదాపహరణాదు లొనర్చి దోషులైన పురుషుల వంటి మధుకైటభు లనెడు రాక్షసులను పొడిపొడి చేసినవియు, ఏన్గు తొండముల వలెఁ బ్రకాశించు నవియు, సుంద్రమైనవియు, క్రమకృశములైనవియు నగు శ్రీ వనగిరి నాథుఁడగు సుందర బాహు స్వామి వారి శ్రేష్ఠములగు తొడలు మిక్కిలి ప్రకాశించుచున్నవి.

ఉ॥ దుండగులైన క్షుద్రుల మ
ధున్ మఱి కైటభు నొక్క సారిగాఁ
బిండియొనర్చె నెవ్వి, మఱి
పించెడు నందమునందు నెవ్వియు
ద్దండకరీంద్ర హస్తములఁ
దాదృశముల్ వనశైల సార్వభౌ
ముం డగు శౌరిసూరువులు
ముజ్జగమున్ భ్రమియింపఁ జేసెడున్

అవతారిక :— ఈ శ్లోకమునందు శ్రీ స్వామివారి జానుద్వయ లావణ్యము ననుభవించుచున్నారు.

శ్లో॥ యౌవనవృష కకుదో ద్భేదనిభం నితరాం
భాతి విభో రుభయం జాను శుభాకృతికమ్।
సుందరభుజనామ్నో మందరమథితా బ్ధే
శ్చందనవన విలసత్కందర వృషభపతేః॥ 60

ప్రతి :— చందన......పతేః— చందన=మంచిగంధపుఁ జెట్లయొక్క, వన = అడవితో, విలసత్ = ప్రకాశించెడు, కందర = గుహలుగల, వృషభపతేః = వృషభాచలమునకు స్వామియైనట్టియు, మందర, మథిత, అబ్ధేః = మందరపర్వతము చేతఁ జిల్కఁబడిన సముద్రము గలట్టియు, సుందరభుజనామ్నః— సుందరబాహు వనెడు పేరుగల, విభోః = ప్రభువుయొక్క యౌవన......నిభమ్— యౌవన=జవ్వన మనెడు, వృష= ఎద్దుయొక్క, కకుద = మూపురముయొక్క, ఉద్భేద=అంకురముతో (మొలకతో) నిభమ్=సమానమైనట్టియు, శుభ + ఆకృతికమ్=మంగళకరమగు ఆకారము గలిగినట్టియు, ఉభయం, జాను=మోకాళ్ళజంట, నితరామ్=మిక్కిలి, భాతి=ప్రకాశించుచున్నది.

విశేషములు :— యౌవనవృష కకుదోద్భేదనిభమ్ — కకుద మనఁగా— వృషభముయొక్క పృష్ఠమధ్యభాగమున నుండెడు ఉన్నతావయవవిశేషము. తెనుఁగున దీనిని మూపుర మందురు. ఇందులకు నిఘంటువు— 'ప్రాధాన్యే రాజలింగే

చ వృషాంగే కకుదోఽస్త్రియామ్' శ్రీ సుందర బాహుస్వామి
వారి యందముఁజిల్కు మోఁకాళ్ళజంట శ్రీ స్వామివారి
యౌవనవృషభమునకుఁ బొటమరించిన మూపురము వలె
ముద్దులొల్కుచున్నదని భావము.

తా॥ చందనవనంబులతో సందములగు కందరములుగల
వనాచలమునకు నాథుఁడై మందరంబుతో సముద్రమును
జిల్కిన శ్రీ సుందరబాహుస్వామివారి జానుయుగళము
(మోఁకాళ్ళజంట) శ్రీవారి యౌవన వృషభమునకుఁ బొటమ
రించిన మూపురమువలె మిక్కిలి ప్రకాశించు చున్నది.

ఉ॥ గంధప్రమాఁకులన్ బొలుచు
కందరముల్ గల కాననాద్రికిం
జెందినవేల్పు మందరము
చేఁ గడలిన్ మథియించు మేటియౌ
సుందరబాహు చక్రధరు
శోభన జానుయుగంబుచెల్వొ మే
మందుఁ దదీయ యౌవన వృ
షాగ్రణిమూపుర మట్లు రాజిలున్.

అవతారిక :— ఈ శ్లోకమునందు వనాద్రినాథుని జంఘా
సౌభాగ్యము ననుభవించు చున్నారు.

శ్లో॥ అథోముఖం న్యస్తపదారవిందయో
రుదంచితోదాత్తనునాళసన్నిభే।
విలంఘ్య జంఘే క్వను రంహతో దృశౌ
వనాద్రినాథస్య సుసుందరస్య మే॥ 61

ప్రతి :— వనాద్రి, నాథస్య = వనగిరికి స్వామియగు, సుసుందరస్య = శ్రీ సుందరబాహుస్వామియొక్క, అధో ముఖమ్=క్రిందికి మొగము గలుగునట్లు, న్యస్త, పదార విందయోః = ఉంచఁబడిన పాదపద్మములయొక్క, ఉదంచిత, ఉదాత్త, సు, నాళ, సన్నిభే=గుండ్రని నిడుదలైన యందము లగు కాడలతో సమానములగు, జంఘే=పిక్కలను, విలంఘ్య =అతిక్రమించి, మే=నాయొక్క, దృశౌ = చూపులు, క్వ, ను=ఎక్కడికి, రంహతః=వెళ్లును ?

విశేషములు :— 'విలంఘ్య జంఘే క్వను రంహతో దృశౌ' సుందరబాహుస్వామివారి జంఘలు (పిక్కలు) అతిలోక సౌందర్యముగలవి గనుకఁ దల్లావణ్యానుభవ ప్రవృత్తములగు నాకన్ను లవయవాంతర శోభావలోకమునకు వెళ్ళఁ జాలకున్న వని పాదమునకుఁ దాత్పర్యము. రంహతః— ఇచ్చట రహి ధాతువు గత్యర్థకము.

తా॥ వనాద్రినాథుఁడగు శ్రీ సుందరబాహుస్వామియొక్క యధోముఖముగా నున్న యడుగుఁదామరల గుండ్రని నిడుపైన యందములగు తూండ్లను బోలిన జంఘలను విడిచిపెట్టి నాకన్నులు మఱి యెచ్చటికిఁ బోవును ? అందములమేర యగు నా పిక్కలను జూచుచు నందే యుండునని భావము.

సీ॥ క్రిందిమొగ మగు పాదారవిందయుగళి
వర్తులాయత నాళముల్ వలె వెలుంగు
వనగిరి వసించు సుందరబాహుమూర్తి
జంఘలను వీడి నాకనుల్ సాగు నెటకు ?

అవతారిక :— ఈ క్రింది శ్లోకపంచకము శ్రీ (శ్రీ) స్వామివారి పాదపద్మ సౌందర్యాదుల ననుభవించు చున్నారు.

శ్లో॥ సుసుందర స్యాస్య పదారవిందే
పాదారవిందాధిక సౌకుమార్యే ।
అతో౽న్యథా తే బిభృయాత్ కథంను
తదాసనం నామ సహస్రపత్రమ్ ॥ 62

ప్రతి :— అస్య=ఈ, సుసుందరస్య = (శ్రీ) సుందర బాహు స్వామియొక్క, పదారవిందే = పాదపద్మములు, పాద, అరవింద, అధిక, సౌకుమార్యే = పాదపీఠమగు పద్మముకంటె మిక్కిలి మార్దవము గలవి, (భవతః=అగుచున్నవి) అతః, అన్యథా= ఇట్లుకాని యెడల, ఆసనం, నామ=పాదపీఠముగా(ఆసనముగా) ప్రసిద్ధి చెందిన, తత్=ఆ, సహస్రపత్రమ్ = కమలము, తే= ఆపాదపద్మములను, కథమ్ = ఎట్లు, బిభృయాత్, ను= భరించును.

విశేషములు :— అతో౽న్యథా (చేత్)=పైనిఁ జెప్పిన దానికి భిన్నముగానైన యెడల, ' నామ '— ప్రసిద్ధిని సూచించు అవ్యయము. కథం బిభృయాన్ను— ఎట్లు ధరించును. (శ్రీ) స్వామివారి పాదపద్మములజంట అతిసుకుమారము కానియెడల నొక పాదపీఠకమలము రెండు పాదపద్మములఁ ధరింపఁ జాలదని హృదయము.

తా॥ (శ్రీ) సుందరబాహుస్వామివారి పాదారవిందములు పాదపీఠకమలముకంటె నధిక సౌకుమార్యము గలవి. అట్లు

కొనిచోఁ బాదపీఠముగాఁ బ్రసిద్ధిగాంచిన కమలము శ్రీవారి పాదపద్మములజంట నెట్లు భరించఁ గలదు ?

శా. శ్రీ మత్సుందరబాహుమూర్తి పదరా
జీవ ద్వయం బౌర ! త
త్స్వామి శ్రీపదపీఠపద్మమునకున్
దత్సౌకుమార్యంబునన్
వేమద్దుల్ ఘన, మట్లుకానియెడలన్
విద్వాంసులారా ! యెటుల్
తా మోయం గలుగున్ వనాచల విభూ
ద్యత్పాదపద్మద్వయిన్.

శ్లో॥ సౌందర్యమార్దవ సుగంధరసప్రవాహైః
ఏతే హి సుందరభుజస్య పదారవిందే ।
అంభోజడంభపరిరంభణ మభ్యజైష్టాం
తద్వై పరాజిత మిమే శిరసా బిభర్తి ॥ 63

ప్రతి :— ఏతే = ఈ, సుందరభుజస్య = సుందరబాహు మూర్తియొక్క, పదారవిందే = పదపద్మములు, సౌందర్య, మార్దవ, సుగంధ, రసప్రవాహైః = అందముచేతను, సౌకుమార్యముచేతను, సుగంధముచేతను, మకరందరస ప్రవాహము చేతను, అంభోజ, డంభ, పరిరంభణమ్ = పద్మముయొక్క ప్రతిపక్షతాసామ్య ప్రసంగమును, అభ్యజైష్టామ్ = జయించినవి. పరాజితమ్ = ఓడిపోయిన, తత్ = ఆయాసనముగానున్న పద్మము, ఇమే = ఈపాదారవిందములను, శిరసా = తలతో, బిభర్తి = మోయుచున్నది, వై = సత్యము.

విశేషములు :— .... రసప్రవాహైః— 'విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః'— అను శ్రుతిలోఁ జెప్పఁబడినట్లు మకరంద ప్రవాహమని భావము. 'తద్వై పరాజిత మిమే శిరసా బిభర్తి,నిత్యానిరవద్య, నిరతిశయ, సౌందర్య, సౌకుమార్య, సౌగంధ్య, మకరంద ప్రవాహములు గల శ్రీ సుందరబాహు స్వామివారి పాదారవిందములచేత నోడింపఁ బడినట్టి లౌకిక మగు పద్మము శ్రీవారి పాదపీఠముగా నవతరించి స్వామివారి పాదారవిందములను మోయుచున్న దని భావము.

తా॥ శ్రీ సుందరభుజస్వామివారి యొక్క పాదారవిందములు సౌందర్య, సౌకుమార్య, సౌగంధ్య, మకరంద ప్రవాహముల చేతఁ బద్మాతిశయ ప్రసంగమును జయించినని. కనుకనే పరాజితమగు పద్మము దేవరవారి పాదపీఠముగా నేర్పడి శ్రీవారి పాదపద్మములను నేఁటికిని దలతో మోయుచున్నది.

ఉ. అందము సౌకుమార్యము మ
హత్తర దివ్య పరీమళంబు మా
రందఝురంబు గల్గి రుచి
రం బయి యొప్పెడు కానఁ బ్రసం
క్రందను పాదపంకజయు
గంబున కోడి సరోరుహంబు శ్రీ
సుందరు పాదపద్మముల
సొంపు తలన్ వహించు నేఁటికిన్.

శ్లో॥ ఏతే తే బత సుందరాహ్వయభుజః పాదారవిందే శుభే
యన్నిర్జేజసముత్థిత(?)త్రిపథగాస్రోతస్సు కించిత్ క్వచిత్ ।

ధ_త్తేఽసౌ శిరసా ధ్రువ _స్తదపరం స్రోతో భవానీపతి
ర్యస్యాస్యాలకనంది కేతి నిజగు ర్నామైవ మన్వర్థకమ్॥ 64

ప్రతి :— యత్, నిర్ణేజ, సముత్థిత, త్రిపథగా, స్రోతస్సు= ఏ దేవదేవుని పాదప్రక్షాళనముచేత బయలు వెడలిన గంగా ప్రవాహములయందు, కించిత్, కిల=ఒకటియగు, స్రోతః= ప్రవాహమును, అసౌ=ఈ, ధ్రువః = ధ్రువుఁడు (జ్యోతిశ్చక్ర మున కాధారభూతముగానున్న యుత్తాన పాదునికుమారుఁడు) ధ_త్తే=ధరించు చున్నాఁడో! తత్, అపరమ్ = ఆధ్రువుఁడు తాల్చుప్రవాహముకంటె నితరమగు, స్రోతః=ప్రవాహమును, భవానీపతిః=పార్వతీపతి యగు శివుఁడు, శిరసా = తలతో, ధ_త్తే=ధరించు చున్నాఁడో!, యస్య = ఏ, అస్యా=ఈ శివ శిరోధృతమగు ప్రవాహమునకు,(పౌరాణికాః=పురాణవేత్తలు) అలకనందికా, ఇతి=అలకనందిక యని, ఏవమ్ = ఇట్లు, అన్వర్థ కమ్=సార్థకమగు, నామ=పేరును, నిజగుః=పలికిరో, తే= అట్టువంటియు, సుందర, ఆహ్వాయ, జుషః = సుందరుఁ డనెడు పేరునుపొందిన సుందరబాహుస్వామియొక్క, ఏతే = ఈ, పాదారవిందే,=పాదపద్మములు, శుభే = భోగ్యములైనవి, (భవతః=అగుచున్నవి) బత=ఆశ్చర్యము.

విశేషములు :— అసౌ — ధ్రువః— జ్యోతిశ్చక్రమున కాధారభూతుఁడగు ధ్రువుఁడు, 'అలకనంది కేతి నిజగు ర్నామైవ మన్వర్థకమ్' అలకం నందయతి, ఇతి, అలకనందికా— శివుఁడు తలపై ధరించినప్పుడపాయ యామపేంశునలకల నానంద పెట్టుటచేత దీనికి 'అలకనందిక' అను పేరు సార్థకమని భావము.

ఏతే— తే— పాదారవిందే — త్రైలోక్యపావని యగు గంగ నుత్పాదింపఁ జేయుటచేత అత్యంతపావనములైన సుందర భుజస్వామి పాదపద్మములు, బత— ఆశ్చర్యార్థకమగు నవ్య యము. ఇచ్చట ఆశ్చర్యమేమన— పావనములగు స్వామి వారి పాదాబ్జములే భోగ్యములుగా నైతి మగుటగదా.

తా॥ ఏ వేల్పు పాదారవిందములఁ గడుగుటవలన నేర్పడి మూఁడు పాయలతోఁ బ్రవహించు మిన్నేటి యొకపాయను జ్యోతిశ్చక్రమున కాధారభూతుఁడగు ధ్రువుఁడు ధరించెనో! మఱియొకపాయ నళికనంద యను దాని పేరు సార్థకమగునట్లు పార్వతీపతి యగు శివుఁడు శిరస్సునఁ దాల్చెనో! అట్టి త్రిభువనపావని యగు గంగకుఁ గారణభూతములగు నట్టి సుందరబాహుస్వామి పాదారవిందములు భోగ్యములై యలరారు చున్నవి.

శా. ఏ పాదంబులఁ గడ్గ నుప్పతిలు మి
 న్నేర్ పాయలన్ మూఁట నొం
డౌ పాయన్ ధరియించె నాధ్రువుఁడు వే
 ఱొకపాయ మూర్ధంబుపై
నాపాదించుకొనెన్ శివుం డళికనం
 దాభిఖ్య పెంపార, నా
శ్రీ పద్మేక్షణుపాదపద్మములు మిం
 చెన్ భోగ్యముల్గా నహా!

శ్లో॥ ఆమ్నాయ కల్పలతికోత్థ సుగంధిపుష్పం
యోగీంద్రహార్ద సరసీరుహ రాజహంసమ్ ।
ఉత్పక్వధర్మ సహకారఫలప్రకాండం
వందేయ సుందరభుజస్య పదారవిందమ్ ॥ 65

ప్రతి :— ఆమ్నాయ, కల్పలతికా, ఉత్థ, సుగంధి, పుష్పమ్=శ్రుతి యనెడు కల్పలతయందుఁ బొడమిన సువాసన గల పూవును, (అనఁగా-పూవువంటిదియు) యోగీంద్ర, హార్ద, సరసీరుహ, రాజహంసమ్=యోగీశ్వరుల హృదయకమలము నందు రాజహంసము వంటిదియు, ఉత్పక్వ ధర్మ, సహకార, ఫల, ప్రకాండమ్=పరిపక్వమగు(పండిన) ధర్మమనెడు తియ్యమామిడి మేలిపండు వంటిదియునగు సుందరభుజస్య=సుందరభుజస్వామి యొక్క, పదారవిందమ్=పాదపద్మమును, వందేయ=నమస్కరింతును గాక (లేదా) స్తుతింతును గాక.

విశేషములు :— ఈ శ్లోకమునందుఁ గవి సుందరబాహు స్వామివారి పాదారవిందము శ్రుతిశిరః ప్రతిపాద్యము, యోగిధ్యేయము, ధ్యానఫలమని మాత్రమే చెప్పక శ్రుతికల్పలతా పుష్పముగాను, యోగిహృత్పద్మరాజహంసము గాను, ధర్మసహకారపక్వఫలరాజము గాను ఆరోపించి చెప్పుటవలన శ్రుతిశిరస్సుల కందుపాటులోని దనియు, యోగిహృదయావాసరసికమనియుఁ, బరమ పురుషార్థరూప మనియు స్తుతికర్త యభిప్రాయమైనట్లు తెలియు చున్నది.

తా॥ శ్రుతికల్పలత యందుఁ బొడమిన సుగంధి పుష్పమును, యోగీంద్ర హృదయకమలమందు విహరించు రాజహంసంబును, ధర్మసహకార తరువునకుఁ బండిన మేలిఫలంబు నగు శ్రీ సుందరబాహుమూర్తి పాదారవిందమును నమస్కరించుచును గాక.

చ॥ శ్రుతి యను కల్పవల్లిఁ బొడఁ
జూపిన దివ్యసుగంధిపుష్ప మం
చిత నియమీంద్రచిత్త సర
సీజ విరాజి మరాళరాజ ము
న్నత పదిపక్వ ధర్మశుభ
నామ రసాల ఫలోత్తమంబు సం
శ్రితజనకల్పమౌ వనగి
రి ప్రభుపాదపయోజ మెన్నెదన్.

శ్లో॥ సుసుందరస్యాస్యతు వామనాకృతేః
క్రమత్రయప్రార్థిని మానసే కిల ।
ఇమే పదే తావ ది హాసహిష్ణునీ
విచక్రమాతే త్రిజగత్పదద్వయే ॥ 66

ప్రతి :— వామన × ఆకృతేః = వామనాకారముగల, అస్య=ఈ, సుసుందరస్య = సుందరబాహుస్వామివారియొక్క, మానసే, తు=మనస్సునన్నను, క్రమ, త్రయ, ప్రార్థిని=(బలిచక్రవర్తి యొద్దనుండి) అడుగుల మూఁటిని ప్రార్థించునది కాఁగా, ఇమే = ఈ, పదే=పాదములు, ఇహ = ఈభూమియందు,

తావత్ = అంతమాత్రపు నేలను, (మూఁడడుగులను) అసహిష్ణునీ=సహింపనిదై, త్రిజగత్ = ముజ్జగమును, విక్రమద్వయే = అడుగుల జంటయందే (రెండడుగులయందే) విచక్రమాతే కిల = ఆక్రమించు కొనినవఁట.

విశేషములు :— 'విచక్రమాతే త్రిజగత్ పదద్వయే' — వామనావతారమున శ్రీ సుందరబాహుస్వామివారి రెండు పాదములే మూఁడులోకముల నాక్రమించు కొనినవని వర్ణించుట వలన శ్రీవారి పాదములకుఁగల యాశ్రిత సంరక్షణాత్వర యటువంటి దని భావము.

తా॥ వామనాకారమును దాల్చిన శ్రీ సుందరబాహు స్వామివారి మనస్సు బలిచక్రవర్తివలన మూఁడడుగుల పరిమితి గల భూమిని బ్రార్థింపవలసి వచ్చినప్పుడు స్వామివారి రెండు పాదములు భూమియందలి మూఁడడుగుల నేలను సహింపనివై ముజ్జగమును రెండడుగులలోనే యాక్రమించుకొనిన వఁట.

ఉ॥ వామనమూర్తి రూపమున
వర్తిలు సుందరబాహుఁడెంద మీ
భూమిని నా కొసంగు మొక
మూఁడడుగుల్ స్థల మంచు వేఁడఁగా
స్వామి పదద్వయం బపుడు
సైపక యబ్బలి విస్మయంబుతో
నే మిది నా నిముడ్చుకొని
యెన్ త్రిజగమ్ము పదద్వయమ్మునన్.

అవతారిక :— ఈ శ్లోకమున శ్రీకూరేశులు శ్రీ స్వామి వారి పాదాంగుళీనఖ సౌందర్యము నాస్వాదించు చున్నారు.

శ్లో॥ సౌందర్యసారామృతసింధువీచి
శ్రేణీషు పాదాంగుళినామికాసు ।
న్యక్కృత్య చంద్రశ్రియ మాత్మకాంత్యా
నఖావళీ శుంభతి సుందరస్య ॥ 67

ప్రతి :— సుందరస్య = సుందరబాహుస్వామి యొక్క, పాద, అంగుళి, నామికాసు = కాలివ్రేళ్ళు, అనెడు పేరుగల, సౌందర్య... శ్రేణీషు— సౌందర్యసార = శ్రేష్ఠమగు సౌందర్య మనెడు, అమృతసింధు = అమృతసముద్రము యొక్క, వీచి = తరంగముల యొక్క, శ్రేణీషు = పంక్తులయందు, నఖ, ఆవళీ = గోళ్ళపంక్తి, ఆత్మ, కాంత్యా = తనకాంతిచేత, చంద్రశ్రియను = చంద్ర (పంక్తియొక్క) శోభను, న్యక్కృత్య = అణగం ద్రొక్కి, శుంభతి = ప్రకాశించు చున్నది, హి = ప్రసిద్ధము.

విశేషములు :— ఈ శ్లోకమున స్వామివారి పాదాంగుళు లను సౌందర్యసారామృత సింధుతరంగ పంక్తులనుగా నిరూ పించుటవలన అందుం బ్రతిఫలించిన చంద్రపంక్తిగా నఖావళి యుత్ప్రేక్షింపం బడినది. హి— ఇది ప్రసిద్ధి ద్యోతకమగు నవ్యయము. లోకములోం బ్రతితరంగమునందును చంద్ర బింబము ప్రతిఫలించుట ప్రసిద్ధమే కదా!

తా॥ శ్రీ సుందరబాహుస్వామివారి సౌందర్యసార మనెడు నమృతసముద్రముయొక్క తరంగపంక్తులవలె నున్న కాలివ్రేళ్ళ

యందలి గోళ్ళవరుస తమకాంతిచేతఁ జంద్రపంక్తి కాంతిని క్రిందుపఱిచి ప్రకాశించు చున్నది.

ఉ॥ సుందరబాహుదేవు మెయి
సోయగపుంజిగి యన్ సుధాబ్ధిఁ గన్
విం దగు నూర్మిపంక్తు లని
పించు పదాంగుళులన్ నఖాళి పొ
ల్చెం దమలోపలన్ బ్రతిఫ
లించెడు చంద్రపరంపరేందిరన్
గ్రిందికిఁ ద్రొక్కి నిస్తులతఁ
గేరునఖల్ రమణీయకాంతిచేన్.

శ్లో॥ యో జాతక్రశిమా మలీ చ శిరసా సంభావిత శ్శంభునా
సోఽయం యచ్చరణాశ్రయీ శశధరో నూనం నఖవ్యాజతః ।
పూర్ణత్వం విమలత్వ ముజ్జ్వలతయా సార్థం బహుత్వం తథా
యాత స్తం తిరుమండశైల నిలయం వందామహే సుందరమ్ ॥ 68

ప్రతి :— శంభునా=శివునిచేత, శిరసా=తలచేత, సంభావితః=గౌరవింపఁబడిన, (ధరింపఁబడిన) యః=ఎవఁడు (ఏచంద్రుఁడు) సంజాత, క్రశిమా = పుట్టిన కార్శ్యము గలవాఁడును (క్షయరోగము గలవాఁడును) మలీ,చ = కళంకము గలవాఁడును, (అభూత్ =ఆయెనో) సః=అటువంటి, అయమ్= ఈ, శశధరః=చంద్రుఁడు, నఖ, వ్యాజతః = గోళ్ళుల నెపము వలన, యత్, చరణ, ఆశ్రయీ=ఏ దేవ దేవుని పాదములయందు గలవాఁ డగుచు, పూర్ణత్వమ్=నిండుతనమును, విమలత్వమ్= నిర్మలత్వమును, తథా=అట్లే, ఉజ్జ్వలతయా, సార్థమ్ =

ప్రకాశాధిక్యముతోఁ బాటు, బహుత్వమ్ = దశవిధశరీరములు గలిగియుండుటను, నూనమ్ = నిజముగా, యాతః = పొందెనో, తరు, షండ, శైల, నిలయమ్ = వనగిరి నివాసముగాఁగల, తమ్ = ఆ, సుందరమ్ = సుందరబాహుస్వామిని, వందామహే = నమస్కరించుచున్నాము.

విశేషములు :— శశధరః — కుందేటిని ధరించినవాఁడు — చంద్రుఁడు. బహుత్వమ్ — సుందరబాహుస్వామివారి పాద నఖముల పదింటియందును చంద్రుఁడు ప్రతిఫలించుటచేత బహుత్వమును (దశవిధశరీరత్వమును) పొంది యున్నాఁడని భావము. శివుఁడు చంద్రుని శిరసావహించి గౌరవించినను ఆ చంద్రుని క్షీణత్వముగాని, కళంకముగాని పోయి యుండలేదు. ఆ చంద్రుఁడే కాలిగోళ్ళయందుఁ బ్రతిఫలించుట యను మిషచేత శ్రీ సుందరబాహుస్వామివారి పాదముల నాశ్రయింపఁగా వెంటనే యా చంద్రుఁడు పరిపూర్ణుఁడు, నిష్కళంకుఁడు, ప్రకాశాధికుఁడు, బహుత్వము గలవాఁడయ్యెను. కనుక శ్రేయస్కాములకు సర్వశక్తి సంపన్నుఁడగు శ్రీ సుందరబాహు స్వామియే యాశ్రయణీయుఁడని భావము. నఖవ్యాజముచేత సుందరబాహుపాదముల నాశ్రయించిన చంద్రుఁడే యింత శ్రేయస్సును జెందగాఁ ద్రికరణశుద్ధితో శ్రీ స్వామివారిపాద ములయందుఁ జేరినవారిమాట వేఱె చెప్పవలయునా?

తా॥ శివునిచేత శిరసా గౌరవింపఁబడియు నేచంద్రుఁడు తన క్షీణత్వమును, కళంకమును బాయలేదో! యా చంద్రుఁ

డీప్పుడు పాదనఖములందుఁ బ్రతిఫలించుట యను నెపముచేత నే దేవదేవుని పాదముల నాశ్రయించి పరిపూర్ణతను, నిష్కళంకతను, ప్రకాశాతిశయమును, బహుత్వమును పొందెనో వనగిరినివాసి యగు ఆ సుందరబాహుస్వామిని నమస్కరింతుము.

చ॥ శివుఁడు తలన్ ధరించినను
క్షీణత మచ్చయుఁ బాయ కుండెనో
యెవనికిఁ జందమామ యతఁ
డే పరదైవముగోళ్ళ సోకుకై
తవమునఁ గాలు వట్టి కనెఁ
దత్పరిపూర్ణత మచ్చలేమి మేల్
ఛవియు బహుత్వమున్ నతులు
స్వామికి నావనశైలవాసికిన్.

శ్లో॥ యస్యాః కటాక్షణ మనుక్షణ మీశ్వరాణా
మైశ్వర్యహేతు రితి సార్వజనీన మేతత్ ।
శ్రీ స్సేతి సుందరనిషేవణతో నిరాహు
స్త్వాం హి శ్రియ శ్శ్రియ ముదాహు రుదారవాచః ॥ 69

ప్రతి :— ఈశ్వరాణామ్ = (ఐశ్వర్యవంతులుగాఁ బేర్వడిన) ఇంద్రాదులయొక్క, ఐశ్వర్యహేతుః = వారివారియధికార సంపదకుఁ గారణము, అనుక్షణమ్ = ప్రతిక్షణమును, యస్యాః = ఏతల్లియొక్క, కటాక్షణమ్ = క్రేగంటిచూపు, ఇతి, ఏతత్ = అనెడి యీవిషయము, సార్వజనీనమ్ = సర్వజనప్రసిద్ధమో,

సుందర నిషేవణతః = సుందరబాహుస్వామిని సేవవలన, సా = కటాక్షమాత్రముచేతనే యింద్రాదులకు సైతమైశ్వర్య ప్రవ్రాప్తి యగు నాతల్లి, (శ్రీః ఇతి = (శ్రీ)-అని, నిరాహుః = నిర్వచనముచేసిరి, ఉదార, వాచః = గొప్పవాక్కులు గల వాల్మీకియామునాచార్యాదులు, త్వామ్ = నిన్ను, శ్రియః = అట్టి (శ్రీ)దేవికి, శ్రియమ్ = (శ్రీ)ప్రదునిగా (సంపత్ప్రదునిగా) ఉదాహుః, హి = పెద్దగాఁ జెప్పిరిగదా!

విశేషములు :— '(శ్రీః ఇతి, నిరాహుః' (శ్రీ) యని నిర్వచన మొనర్చిరి. అనఁగా (శ్రీ) శబ్దమున కిట్లు వ్యుత్పత్తిని జెప్పిరి. అని భావము. (శ్రీ) స్సేతి సుందరనిషేవణతః — 'శ్రిఞ్ = సేవాయామ్' అను సేవార్థకమగు ధాతువువలన నేర్పడిన (శ్రీ)శబ్దము కటాక్షమాత్రముచేత నింద్రాదుల కట్టి దైశ్వర్యము ననుగ్రహించు నైశ్వర్యము లక్ష్మీదేవికి (శ్రీ) సుందరబాహుస్వామిని నిరంతరము సేవించుటవలనఁ గలిగినదని హృదయము. శ్రయతే - ఇతి - (శ్రీః = (శ్రీ) సుందరబాహుస్వామిని సదా సేవించుచుండు నది యని (శ్రీ) శబ్దమునకు నిర్వచనము. ఉదారవాచః— సర్వతత్త్వార్థప్రద స్వప్రబంధాః, అని వ్యాఖ్యలోఁ గలదు. భగవద్వాల్మీకి యామునాచార్య ప్రభృతుల ప్రబంధములలో సమస్త తత్త్వార్థములు గలవని తాత్పర్యము. వీరిగ్రంథములలో శ్రీదేవికి సైతము శ్రీప్రదుఁడు భగవానుఁడే యను సూక్తి యెక్కుడఁ గల దన్నచో—

'శ్రియ శ్రీ శ్చ భవే దగ్ర్యా కీర్త్యాః కీర్తిః క్షమా క్షమా'
(శ్రీ మద్రామాయణమ్)

'కః శ్రీః శ్రియః పరమసత్త్వసమాశ్రయః కః ?'
(స్తోత్రరత్నమ్)

తా॥ ఈశ్వరులుగాఁ బేర్వడిన యింద్రాదుల యధికార సంపద కనుక్షణము నేతల్లి క్రేగంటి చూపనునది సర్వజన సంప్రతిపన్నమో సుందరబాహుస్వామివారి నిరంతర సేవవల ననే యాతల్లికి'(శ్రీ)'యను నామ మ్మన్వర్థ మని చెప్పుచున్నారు. ఉదారవాక్కులగు వాల్మీకి యామునాచార్యప్రభృతులో (శ్రీ) సుందరబాహుస్వామీ! నిన్ను (శ్రీ)కి సైతము (శ్రీ) వని గట్టిగా నుడివియున్నారు. ఇంద్రాదులకు సైతము తన కటాక్షముచేత నతిశయమును గూర్చు లక్ష్మికి (శ్రీ) సుందరబాహు స్వామి యతిశయమును గలిగించుచున్నాఁ డనుటచే స్వామి వారి ఘనత వెల్లడియగు చున్నది.

శా॥ దేవేంద్రాదులకల్మి కంతటికి నే
దేవీ కటాక్షంబె సం
భావింపం బడె ముఖ్యహేతువుగ నా
భవ్యాత్మ (శ్రీ)సుందరున్
సేవల్ సేయుట '(శ్రీ)' యనం బరఁగె నీ
సిద్ధాంతమున్ బూర్వమే
ధావుల్ చాటిరి (శ్రీ)కి (శ్రీ) వనుచు గ్రం
థాలన్ నినుం దెల్పుచున్.

(18)

శ్లో॥ దివ్యాచింత్య మహాద్భుతోత్తమగుణైః స్వారస్యలావణ్యకైః
ప్రాప్తై రద్భుతభావగర్భ సతతాపూర్వప్రియై ర్విభ్రమైః ।
రూపాకారవిభూతిభి శ్చ సదృశీం నిత్యానపేతాం శ్రియం
నీలాం భూమి మపీదృశీం రమయితా నిత్యం వనాద్రీశ్వరః ॥ 70

ప్రతి :— దివ్య......గుణైః— దివ్య = అప్రాకృతములును, అచింత్య = ఇట్టివి, ఇంత పరిమాణము గలవి యని యూహింప శక్యము గానివియు, మహాద్భుత = అత్యాశ్చర్యకరము లైనవియు, ఉత్తమ = శ్రేష్ఠము లైనవియు, అగు, గుణైః = జ్ఞానశక్త్యాది, దయావాత్సల్యాది, స్వరూపగుణముల చేతను, తారుణ్య, లావణ్యక, ప్రాప్తైః = యౌవనము లావణ్యము వంటి శారీరగుణముల చేతను, అద్భుత, భావ, గర్భ, సతతాపూర్వ, ప్రియైః = ఆశ్చర్యకరము లగు అభిప్రాయములు, లోపలగలవియు నెప్పటి కప్పుడు క్రొత్త లనిపించునవియుఁ బ్రియము లైనవియునగు, విభ్రమైః = విలాసముల చేతను, రూప, ఆకార, విభూతిభిః, చ = స్వరూపము చేతను, విగ్రహసన్నివేశము చేతను, సంపద చేతను, సదృశీమ్ = తనకుఁదగినట్టియు, నిత్య, అనపేతామ్ = ఎన్నఁడును ఎడఁబాయనట్టిదియు నగు, శ్రియమ్ = లక్ష్మీదేవిని, ఈదృశీమ్ = ఇటువంటిదియేఅగు, నీళామ్ = నీలాదేవిని, భూమిమ్, అపి = భూదేవిని గూడ, వనాద్రి × ఈశ్వరః = వనాద్రినాథుఁడగు శ్రీసుందరబాహుస్వామి, నిత్యమ్ = ఎల్లప్పుడు, రమయితా = రమింపఁజేయువాఁడు, ఆనందపెట్టువాఁడు అని భావము. (భవతి = అగుచున్నాఁడు).

విశేషములు :— లావణ్యా మనఁగా — అవయవసము దాయశోభ— సతతాపూర్వ......నిరంతర మనుభవించు చున్నను భోగ్యతాతిశయముచేత ఎన్నఁడు ననుభవింపఁ బడని వానివలెఁ గ్రొత్తలుగాఁ గనఁ బడునవి. విభూతి— సంపద— ఉభయ విభూత్యైశ్వర్యము. సదృశీమ్— 'తుల్యశీలవయో వృత్తాం తుల్యాభిజనలక్షణామ్ రాఘవోఽర్హతి వైదేహీం తం చేయ మసితేక్షణా' అని సీతారాముల యెడలఁ జెప్పినట్లు సర్వప్రకారసాదృశ్యములతోఁ గూడినది యని భావము. నిత్యానపేతామ్— 'రాఘవత్వే భవేత్ సీతా । రుక్మిణీ కృష్ణజన్మని । అన్యేషు చావతారేషు విష్ణో రేషాఽనపాయినీ' అన్నట్టు లెన్నఁడు నెడఁబాయనిది అని ఆశయము. 'శ్రియం నీలాం భూమి మపీదృశీం రమయితా నిత్యంవనాద్రీశ్వరః' శ్రీ సుందరబాహుస్వామి శ్రీ భూనీలలను సంతోషపెట్టు చున్నాఁ డనుటవలన శ్రీస్వామివారి పాదారవిందములను శరణుచొచ్చు వారికిఁ బురుషకార సాన్నిధ్యము సమృద్ధిగాఁ గలదని సూచింపఁ బడినది.

తా॥ అప్రాకృతములును ఇట్టివి యింతపరిమాణము గలవి యని చింతింప నలవికానివియుఁ గనుకనే యాశ్చర్యమును గలిగించునవియు నుత్తమములైనవియు నగు జ్ఞానానంద శక్త్యా దులు దయావాత్సల్యాదులు నగు స్వరూపగుణముల చేతను తారుణ్యము లావణ్యము మున్నగు విగ్రహగుణముల చేతను అద్భుతభావగర్భితములును అనుభవించిన కొలఁది నిత్యనూత

నము లనిపించెడు కోరఁదగిన విలాసములచేతను, సౌందర్యము చేతను, ఆకృతివిశేషము చేతను, ఉభయవిభూత్యైశ్వర్యము చేతను తన కెంతయుఁ దగిన శ్రీదేవిని అట్లే [illegible] భూదేవిని నీళాదేవిని శ్రీవనాద్రినాథుఁడగు సుందరబాహు స్వామి నిత్యము రమింపఁ జేయును.

శా॥ ఔరా! దివ్యము లద్భుతంబులు సచిం
త్యంబుల్ శుభంబుల్ సు[illegible]
దారంబుల్ సహజంబులౌ గుణములన్
దారుణ్యలావణ్య వి
స్తారశ్రీ స్పృహణీయనూతన విలా
సస్ఫూర్తిఁ దుల్యాత్మలన్
శ్రీభామన్ మహిఁనీలలన్ దనిపెడున్
శ్రీసుందరుం డెప్పుడున్.

అవతారిక :— అత్యంతాపరాధులైనను క్షమింపనగు నని లక్ష్మీదేవి నుడివినచో భగవానుఁ డామాట నాదరించు నను నభిప్రాయము నీ శ్లోకమున ననుసంధించు చున్నారు.

శ్లో॥ అన్యోన్యచేష్టిత నిరీక్షణ హార్దభావ
ప్రేమానుభావ మధురప్రణయప్రభావః ।
ఆజస్రనవ్యతర దివ్యరసానుభూతిః
స్వాం ప్రేయసీం రమయితా వనశైలనాథః ॥ 71

ప్రతి :— అన్యోన్య......ప్రభావః — అన్యోన్య = పరస్పరము, చేష్టిత = బొమముడి, చిఱునవ్వు మొదలగు విలాస

వ్యాపారముల చేతను, నిరీక్షణ = క్రేగంటిచూపు చేతను, హార్ద = హృదయములోని, భావ = అభిప్రాయము చేతను (తారుణ్య, లావణ్యాదులను తలపోయుట చేతను) ప్రేమాను భావ = ప్రేమాతిశయము చేతను, మధుర = స్వాదుతరమైన, (తేనెవలె ననుభవింపదగిన) ప్రణయప్రభావః = అనురాగాతి శయముగల, వనశైలనాథః = వనగిరిప్రభువగు శ్రీ సుందర భుజస్వామి, ఆజస్ర, నవ్యతర, దివ్యరస, అనుభూతిః = ఎల్లప్పుడును అపూర్వమగు అప్రాకృతానందముల యొక్క అనుభవము కలవాడు (సన్ = అగుచు) స్వామ్ = స్వకీయ యగు, ప్రేయసీమ్ = ప్రియురాలిని, రమయితా = సంతోష పెట్టువాడు, భవతి = అగుచున్నాడు.

విశేషములు :— . . . ప్రేమానుభావ = ప్రేమాతిశయము— అనగా, ఆలింగనకాలమందు సైతము సౌకుమార్య పరా మర్శము, ప్రణయాసగాధముల లెక్క చేయకుండుట, ప్రేమాం ధ్యము. 'స్వాం ప్రేయసీం రమయితా' — ఈ విషయమున "రామ స్తు సీతయా సార్ధం విజహార బహూన్ ఋతూన్। మనస్వీ తద్గత స్తస్యాం నిత్యం హృది సమర్పితః, ప్రియా తు సీతా రామస్య దారాః పితృకృతా ఇతిగుణాత్ రూపగుణా చ్చాపి ప్రీతి ర్భూయో౽స్యవర్ధత, తస్యాశ్చ భర్తా ద్విగుణం హృదయే పరివర్తతే। అంతర్గాత మపి వ్యక్త మాఖ్యాతి హృదయం హృదా" ఇత్యాది శ్రీమద్రామాయణ శ్లోకములు ప్రమాణ ములుగా ననుసంధేయములు.

తా॥ పరస్పరముయొక్క భ్రూభంగమంద హాసాదివిలాస వ్యాపారములచేతను, క్రేగంటిచూపుల చేతను, తారుణ్య లావణ్యాదుల తలపోఁతలచేతను, ప్రేమాతిశయము చేతను, తేనెవలెఁ గ్రోలఁదగిన యనురాగాతిశయము గల శ్రీవనాద్రి నాథుఁడు ఎప్పటి కప్పు డపూర్వముగా నొప్పునప్రాకృతా నందానుభవము గలవాఁడై తన ప్రియురాలిని రమింపఁ జేయును.

మ॥ చిఱునవ్వుల్ కడగంటిచూపులు నయ
శ్రీస్ఫూర్తి మించులావణ్య వి
స్ఫురణంబుల్ దలపోసికొంట సరసం
పుంజిన్ని కయ్యంబులన్
బరిరంభంబుల నొచ్చుకోసిగతులున్
భాసిల్లు ప్రేమోన్నతిన్
సిరి నాత్మాంగనఁ జొక్కఁ జేయు హరిగా
శ్రీసుందరుం డెప్పుడున్.

శ్లో॥ సుందరస్య వనశైలవాసినో
భోగ మేవ నిజభోగ మాభజన్ ।
శేష ఏష ఇతి శేషతాక్య తేః
ప్రీతిమా నహిపతి స్స్వనామని ॥ 72

ప్రతి :— వనశైలవాసినః = వనగిరినివాసి యగు, సుంద రస్య = శ్రీ సుందరబాహుస్వామివారికి, భోగమ్, ఏవ = భోగసాధన మే యగు, నిజ, భోగమ్ = తనశరీరమును, ఆభ

జన్ = పొందుచు, అహంపతిః = సర్పరాజు, శేషతా, ఆకృతేః = శేషత్వాకారమునవలన, ఏషః = ఇతఁడు, శేషః = శ్రీహరికి శేషభూతుఁడు, (ఆదిశేషుఁ డని అర్థాంతరము) ఇతి = అని, స్వనామని = తన పేరునందు, ప్రీతిమాన్ = ప్రీతి గలవాఁడు, (భవతి = అగు చున్నాఁడు).

విశేషములు :— 'భోగ మేవ నిజభోగ మాభజన్' భోగ మేవ — అనుచోట — కార్యమునందు కారణత్వోపచారము చేత భోగకారణమని యర్థము చెప్పుకొనవలెను. లేదా భోగ శబ్దము సుఖపర్యాయము గాన సుఖకరమని యర్థము గూడ సంగతమగును. మొత్తముమీఁద నీపాదమునకు సుందరబాహు స్వామికి సుఖశయ్యా భూతనిజశరీరుఁ డని పిండితార్థము. 3-4-పాదముల భావ మేమనఁగా— అహిపతి (సర్పరాజు) తనభోగము (శరీరము) శ్రీ సుందరబాహుస్వామివారికి భోగ కర మగుటవలన ఈ విధముగా శేషత్వము సిద్ధించుటచేత సార్థకమగు శేషుఁడను నామమునందుఁ బరమపురుషార్థబుద్ధి గలవాఁ డాయెనని భావము. 'పరగతాతిశయాధానేచ్ఛయో పాదేయత్వమేవ యస్య స్వరూపం స శేషః— పరః శేషీ. అని శేషశేషిభావము నెఱుంగవలెను.

తా॥ వనగిరినివాసి యగు సుందరబాహుస్వామివారి భోగ సాధనమునుగాఁ దనభోగమును (శరీరమును) ధరించుచు సర్ప రాజు శేషత్వాకారము (దాస్యస్వరూపము) సిద్ధించుటవలన

'ఇతఁడు శేషుఁ'డని యెల్లరు ననుకొనెడు తననామమున నెంతయుఁ బ్రీతిగలవాఁ డాయెను.

చ॥ వనగిరివాసి యైన సుర
వంద్యుఁడు సుందరబాహుమూర్తికిన్
వనదుశరీర మెంతయు ను
దాత్తసుకోమల [illegible] గాఁ
దనరు ను శేషతాకృతిని
దాల్చుట నీతఁడు శేషుఁ డంచనన్
మనమునఁ బొంగిపోవు నను
మంతనుఁ డాయభిధాన మూనఁగన్.

శ్లో॥ వాహనాసన వితానచామరా
ద్యాకృతిః ఖగపతి స్త్రయీమయః ।
నిత్యదాస్యరతి రేవ యస్య సై
ష్యేష సుందరభుజో వనాద్రిగః ॥ 73

ప్రతి :— వాహన, ఆసన, వితాన, చామర, ఆది, ఆకృతిః = వాహనము, ఆసనము, చాందిని (మేలుకట్టు) వింజామరములు, మొదలుగాఁ గలవాని యొక్క యాకారమువంటి యాకారముగలవాఁ డగు, త్రయీమయః = వేదస్వరూపుఁడైన, ఖగపతిః = పక్షులకు రాజగు గరుత్మంతుఁడు, యస్య = ఏ సుందరభుజస్వామియొక్క, నిత్యదాస్య, రతిః, ఏవ = నిత్యము కైంకర్యమునందు ఆసక్తి గలవాఁడే, (అని) సః = ప్రసిద్ధమైన, ఏషః = ఈ సుందరబాహుస్వామి, వనాద్రిగః, హి = వనాద్రి యం దుండువాఁడే గదా!

విశేషములు :— వాహనాసన...ఆకృతిః '—దాస స్సఖా వాహన మాసనం ధ్వజో య స్తే వితానం వ్యజనం త్రయీ మయః' అని స్తోత్రరత్నమునఁ జెప్పినట్లు వాహనాద్యాకారము గలవాఁడని భావము. త్రయీమయః— 'వేదాత్మా విహగేశ్వరః' అని ప్రమాణము. హి — వేదస్వరూపుఁడగు గరుత్మంతునిచే నిరంతరము సేవింపఁబడు పాదారవిందములు గల సుందరబాహుస్వామి అందఱకు సులభుఁడుగా నుండుటకై వనశైలమున వేంచేసియున్నాఁడని ప్రసిద్ధార్థకమగు 'హి' అను అవ్యయమునకుఁ దాత్పర్యము.

తా॥ వాహనము, ఆసనము, మేల్కట్టు, వింజామరములు మొదలగు వాని యాకారములఁ దాల్చి వేదస్వరూపుఁడగు గరుత్మంతుఁ డే సుందరబాహుస్వామి యొక్క నిత్యకైంకర్య నిరతుఁడై యుండునో యాస్వామి యందఱకు నందుబాటునకై వనగిరియందు వేంచేసి యున్నాఁడు. ఎంత భక్తసులభుఁడు!

చ. ఒకపరివాహనంబు, మఱి
యొక్కపుడాసనమున్, వితాన మిం
కొకతఱిఁ, జామరంబు మఱి
యొక్కపు, డౌచుఁ ద్రయీమయుండు ప
క్షికులవిభుండు నిత్యమును
సేవ యొనర్పఁగ నొప్పు దేవతా
మకుటము కాననాచలము
మన్కిగ నుండుట, భాగ్య మెంతయున్.

శ్లో॥ వనాద్రినాథస్య సుసుందరస్య వై
ప్రభుక్తశిష్టాశ్యథ సైన్యసత్పతిః ।
సమస్తలోకైక ధురంధరః సదా
కటాక్షవీక్ష్యోఽస్య చ సర్వకర్మసు ॥ 74

ప్రతి :— అథ = అనంతరము, సుసుందరస్య = మిక్కిలి అందగాఁడగు, వనాద్రి, నాథస్య = వనగిరిప్రభువగు, సుందర బాహుస్వామి యొక్క, ప్రభుక్త, శిష్ట, అశీ=భుజించి విడిచి పెట్టిన శేషమును భుజించునట్టియు, సర్వకర్మసు=సకలజగత్ సృష్ట్యాది వ్యాపారములందు, అస్య=ఈవనాద్రి నాథునకు, కటాక్షవీక్ష్యః = క్రీఁగంటిచూపుచేఁ జూడఁదగిన వాఁడును, అగు, సైన్య, సత్, పతిః=యోగ్యుఁడగు సేనాధిపతి, సదా= ఎల్లప్పుడు, సమస్త, లోక, ఏక, ధురంధరః=ఉభయవిభూతుల ముఖ్యకైంకర్య నిర్వాహకుఁడు, వై =ప్రసిద్ధము.

విశేషములు :— ప్రభుక్తశిష్టాశీ— 'త్వదీయ భుక్తోజ్ఝిత శేషభోజినే'అని చెప్పిన ప్రకారము భగవదనుభూత శేషమునే అనుభవించువాఁడని భావము. 'కటాక్షవీక్ష్యః'— 'సేనా పతినా నివేదితం, తథాఽనుజానంత ముదారవీక్షణైః' అన్నట్లు ఇంగితపాత్రుఁడని తాత్పర్యము. సైన్యసత్పతిః— ఇతర సేనాపతు లున్నను ఇతఁడే యందఱిలోను శ్రేష్ఠుఁడని యాశ యము, వై = ప్రసిద్ధము, ఎవనిశ్రేష్ఠుఁడగు సేనాధిపతియే సర్వనిర్వాహకుఁడో! ఆప్రభువే యందఱకు సులభుఁడని హృదయము.

తా॥ మిక్కిలి అందగాఁడగు వనాద్రినాథుఁడైన సుందర భుజస్వామివారి భుక్తశేషము నారగించువాఁడును, సృష్ట్యాది సకలవ్యాపారములందును (శ్రీ) స్వామివారికిఁ గటాక్షవీక్షణీయుఁడై యింగితానుసారము మెలఁగువాఁడును సేనాధిపతులలో ముఖ్యుఁడైన విష్వక్సేనుఁడు ఎల్లప్పుడు నుభయవిభూతులలో ముఖ్యకైంకర్య నిర్వాహకుఁడను ప్రసిద్ధిని వహించెను. తా నొనర్చుపనుల నన్నింటిని సేనాధిపతియే చూచుకొనిపోవుచున్నప్పు డాప్రభువు మిక్కిలి విశ్రాంతి గలవాఁడై భక్తులకు సులభుఁడుగా నుండునని సారము.

ఉ॥ సుందరమూర్తితోఁ దనరు
చున్ వనశైలము నేలు దేవతా
వందిత పాదపద్ముఁడగు
వారిజలోచను భుక్తశేషమే
విందుగఁ దజ్జగత్సృజన
విశ్రుతకృత్యములందుఁ దత్కటా
క్షేందిరస్వాగతంబుఁ గొను
నీప్రభుసైన్యవిభుండు సేవలన్.

శ్లో॥ ఛత్రచామరముఖాః పరిచ్ఛదాః
సూరయః పరిజనా శ్చ నైత్యగాః ।
సుందరోరుభుజ మింధతే సదా
జ్ఞానశక్తి ముఖనిత్య సద్గుణాః ॥ 75

ప్రతి :— నైత్యగాః = నిత్యకైంకర్యము నొనర్చెడు, సూరయః = జ్ఞానులైన, (శేషిహృదయము నెఱింగిన) పరిజనాః

= అనంతగరుడాది సేవకులు, ఛత్ర, చామర, ముఖాః= ఛత్రము (గొడుగు) వింజామరలు మున్నగాంగల, పరిచ్ఛదాః, చ=పరికరములును, జ్ఞాన, శక్తి, ముఖ, నిత్య, సహ, గుణాః= జ్ఞానము,శక్తి, మున్నగాంగల స్వాభావిక కల్యాణగుణములును, సదా=ఎల్లప్పుడు, సుందర, ఉరు, భుజస్య = సుందరబాహు స్వామిని, (ప్రాప్య=పొంది) ఇంధతే=ప్రకాశించుచున్నవి.

విశేషములు :— నైత్యగాః — నిత్యంగచ్ఛన్తి = నైత్యం, అనఁగా నిత్యకైంకర్య మని భావము. తత్ గచ్ఛన్తి, ఇతి, నైత్యగాః=నిత్యకైంకర్యమును పొందినవారు. (శేషగరుడా దులు) ఇంధతే = ప్రకాశింపఁ జేయుచున్నవి, అను అర్థము చెప్పుటకు వీలుగాదు. ణిజంతము (ప్రేరణార్థకము) కాదుగనుక- మఱియు 'గుణాజం గుణినో హి మంగళత్వాయ' ఇత్యాదిసూక్తు లకు విరోధముగూడ వచ్చును. కాన 'ప్రాప్య' అను ల్యబంతము నధ్యాహార మొనర్చుకొని శ్లోక మన్వయింపవలెను.

తా॥ నిత్యకైంకర్యనిష్ఠులగు అనంతగరుడాది నిత్యసూరు లగు పరిజనులును, ఛత్రచామరప్రభృతు లగు పరికరంబులును, జ్ఞానశక్తిముఖ్యము లగు కల్యాణగుణములును శ్రీ సుందర బాహుస్వామి యందుచేత సర్వదా ప్రకాశించు చున్నవి.

గీ॥ నిత్యకైంకర్యనిరతులై నెగడు సూరి
వరులు, ధవళాతపత్రచామరముఖములు।
జ్ఞానశక్తిప్రభృత్యురు సద్గుణములు
శ్రీవనాద్రీశుఁ జేరి రాజిలు సతంబు.

శ్లో॥ ద్వారనాథ గణనాథ తల్లజాః
పారిషద్యపదభాగిన స్తథా ।
మామకా శ్చ గురవః పురాతనాః
సుందరం వనమహీధ్రగం శ్రితాః ॥ 76

ప్రతి :— ద్వారనాథ, గణనాథ, తల్లజాః = శ్రేష్ఠులగు చండప్రచండాది ద్వారపాలురు, కుముద, కుముదాక్షాది గణపాలురు, అను పారిషద్య, పద, భాగినః = ఆస్థానోద్యోగులనెడు శబ్దమును బొందినవారును, తథా=అట్లే, పురాతనాః= ప్రాచీనులగు, మామకాః=నాసంబంధులైన, గురవః, చ= గురువులును (పరాంకుశ, పరకాల యతి వరాదులును) వన, మహీధ్రగమ్ = వనగిరియందు వేంచేసియున్న, సుందరమ్= సుందరభుజస్వామిని, శ్రితాః=ఆశ్రయించిరి.

విశేషములు :— 'ద్వారనాథ గణనాథ తల్లజాః' ఇందలి శ్రేష్ఠవాచక మగు తల్లజశబ్దమును ద్వారనాథ, గణనాథపదములతోఁ బ్రత్యేక మన్వయించుకొనవలెను- అందువలన- శ్రేష్ఠులగు చండప్రచండాది ద్వారపాలకులు, శ్రేష్ఠులగు కుముద, కుముదాక్షాదిగణపాలకులు- అని యర్థ మేర్పడును. 'సుందరం వన మహీధ్రగం శ్రితాః' ద్వారపాలురు గణపాలురు, ఆస్థానోద్యోగి ప్రముఖులు మా పూర్వాచార్యవర్యులును శ్రీ సుందరబాహుస్వామినే నిరంతరము సేవించు చున్నారని భావము.

తా॥ శ్రేష్ఠులగు చండప్రచండాది ద్వారపాలకులు, కుముద కుముదాక్షాది గణపాలురు, ఆస్థానముఖ్యులు, మా పూర్వా

చార్యవర్యులు, వనశైలమున వేంచేసియున్న (శ్రీ) సుందర బాహుస్వామినే నిరంతరము ఆశ్రయించి సేవించుచున్నారు.

మ. అలచండుండు ప్రచండుఁడాది యగుద్వారాధీశులున్ సత్త్వాడులమే లౌకుముదప్రధానగణనాథుల్ పారిషద్వ్యాగ్రగణ్యులు, ప్రాచీన మదీయ దేశికవరేణ్యుల్, శ్రీవనాద్రీశ్వరున్ జలజాతాక్షుసమాశ్రయించిరిరమాసంభావితున్ సుందరున్.

శ్లో॥ ఈదృశైః పరిజనైః పరిచ్ఛదై
ర్నిత్యసిద్ధ నిజభోగ భూమిగః ।
సుందరో వనగిరే స్తటీషు వై
రజ్యతే సకలదృష్టిగోచరః ॥ 77

ప్రతి :— ఈదృశైః = ఇటువంటి, పరిజనైః = అనంతగరుడాది పరిజనులతోను, పరిచ్ఛదైః = ఛత్రచామరాది పరికరములతోను, నిత్యసిద్ధ, నిజ, భోగభూమిగః = ఎల్లప్పుడో కే విధముగా నుండు సహజమగు (తనకుమాత్రే పరిమితమైన) నిత్యవిభూతిని పొందిన వైకుంఠనాథుఁడు, సకల, దృష్టి, గోచరః = ఎల్లవారికనులకు గోచరించుచు, సుందరః(సన్) = సుందరబాహుమూర్తి యగుచు, వనగిరేః = వనశైలముయొక్క, తటీషు = చరియలయందు, రజ్యతే = అనురక్తుఁడగుచున్నాఁడు, వై = ప్రసిద్ధము.

విశేషములు :— నిత్యసిద్ధనిజభోగభూమిగః—

శ్లో॥ వైకుంఠే తు పరే లోకే శ్రియా సార్ధం జగత్పతిః
ఆస్తే విష్ణు రచింత్యాత్మా భక్తై ర్భాగవతై స్సహ॥

తా॥ పరమపద మగు వైకుంఠమునందు జగదీశ్వరుఁడును అచింత్య స్వరూపుఁడునగు శ్రీ మన్నారాయణమూర్తి లక్ష్మీ సమేతుఁడై భక్తులతో భాగవతులతో నుండును- అన్నట్లు దివ్యవిభూతిలో వేంచేసియున్న శ్రీ వైకుంఠనాథుఁడు. నిత్య నిరవద్యనిత్యసూరిపరివృత పరమపదనిలయుఁ డని నిష్కృష్టార్థము. 1. న చక్షుషా పశ్యతి కశ్చ నైనమ్— 2. న మాంస చక్షు రభివీక్షతే తమ్— 3. ద్రష్టవ్యః శ్రోతవ్యో, మంతవ్యో నిదిధ్యాసితవ్యః— అన్నట్లు దుర్లభదర్శనుఁడైనను అవ్యాజకరుణచేత వనగిరి ప్రాంతమున సకల జననేత్రగోచరుఁడగుట సుందరబాహుస్వామి సౌలభ్యమును చాటుచున్నది.

తా॥ ఇట్టిభాగవతోత్తములగు శేషగరుడాదులతోను,ఇటువంటి ఛత్రచామరాదులతోను గూడి శశ్వదేకప్రకారముగా నుండు నిత్యవిభూతిలో మహానంద మనుభవించు వైకుంఠనాథుఁడు సకలజనదృగ్గోచరుఁడై సుందరబాహుమూర్తిగా వనగిరి సానువుల ననురక్తుఁడై విహరించు చున్నాఁడు. ఎంత భక్తసులభుఁడు!

ఉ. ఇట్టి విశిష్టభాగవతు లీదృశ దివ్యపరిచ్ఛదంబు లు
న్నట్టి స్వదివ్యలోకమున నంగనతో సుఖియౌ సుపర్వస
మ్రాట్టు వనాద్రిభూపరిసరంబున సుందరుఁడై చరించుచున్
బుట్టువుధన్యమున్ సలుపుఁబో! ప్రజకుంగనువిందొనర్చుచున్.

అవతారిక :— పరమపదమునం దప్రాకృత దివ్యభోగములిచ్చు నకు, వనాద్రినివాసము వైరస్యమును కలిగింపదా ? అను శంక నీ శ్లోకమునఁ బరిహారించుచున్నారు.

శ్లో॥ ఆక్రీడభూమిషు సుగంధిషు పౌష్పికేషు
వైకుంఠధామని సమృద్ధసువాపికాసు ।
శ్రీమల్లతాగృహవతీషు యథా త్వ త్వైవ
లక్ష్మీధరః సజతి సింహగిరే స్తటీషు ॥ 78

ప్రతి:— వైకుంఠధామని = వైకుంఠలోకమునందు, సమృద్ధ సువాపికాసు = (అమృతమువంటి నీటితో) నిండినమంచి దిగుడు బావులు గలిగినట్టియు, శ్రీమత్, లతాగృహవతీషు = శోభ గల పొదరిండ్లు గలవియు, పౌష్పికేషు = పుష్పములతోఁ దులఁ దూగునవియు (కనుకనే) సుగంధిషు = సువాసన గలవియునగు, ఆక్రీడ భూమిషు = ఉద్యానభూములందు, లక్ష్మీధరః = శ్రీపతి, యథా = ఎట్లు, సజతి = ఆసక్తుఁడగు చున్నాఁడో, తథా, ఏవ = అట్లే, సింహగిరేః = వనాద్రియొక్క, తటీషు = చరియల యందు, సజతి = ఆసక్తి గలవాఁడగు చున్నాఁడు.

విశేషములు :— 'తత్రైవ లక్ష్మీధర స్సజతి సింహగిరే స్తటీషు ' వైకుంఠోద్యాన భూములవలెనే వనాద్రికానన భూములు శ్రీ సుందరబాహుస్వామికి భోగ్యతాపాత్రము లగు చున్నవని భావము.

తా॥ శ్రీ మన్నారాయణమూర్తి వైకుంఠలోకమున అమృతమువంటి నీటితో నిండిన దిగుడు బావులు శోభాయ

మానములగు లతాగృహములు (పొదరిండ్లు) సుగంధిపుష్ప ములు గలిగిన పూఁదోఁటలయందె ట్లనురక్తుఁడై యుండునో యట్లే సకలభోగ్యతా సమృద్ధిగల వనగిరి తటములందును శ్రీ సుందరబాహుస్వామి యనురక్తుఁడై విహరించు చుండును.

చ. పరమపదంబునన్ జెలఁగుఁ బొ
నకమున్ మఱపించునీటితో
వరలెడు దీర్ఘికల్, సిరికిఁ బ
ట్టగుమేల్ పొదరిండ్లు పుష్పమం
జరులఘుమంఘుమల్ మదికి
సంతసమీఁ బుపూఁదోఁటలందు శ్రీ
హరి యెటులో! యట్లే సుందరుఁడహా!
విహరించు వనాద్రి సీమలన్.

శ్లో॥ ఆనందమందిర మహామణి మండపాంత
ర్లక్ష్మ్యా భువా ప్యహిపతౌ సహ నీలయా చ।
నిస్సంఖ్య నిత్యనిజదివ్య జనైకసేవ్యో
నిత్యం వసన్ సజతి సుందరదో ర్వనాద్రౌ॥ 79

ప్రతి :— ఆనంద......అంతః— ఆనందమందిర = ఆనం దోత్పత్తి గృహమగు, మహాత్ = పెద్ద, మణి, మండప, అం తః = మణులుచెక్కిన, వెయ్యిస్తంభముల మండపములోపల, అహిపతౌ = సర్పరాజగు శేషునియందు, లక్ష్మ్యా = లక్ష్మీదేవి తోను, భువా అపి = భూదేవితోను, నీలయా, చ = నీలాదేవి తోను, వసన్ = నివసించుచు, నిస్సంఖ్యా, నిత్యా, నిజ, దివ్యజన,

ఏకసేవ్యః = లెక్కకు మించిన, తన అప్రాకృతులగు పరిజనులకు మాత్రమే అనుభవింపఁ దగినవాఁడై, సుందరదోః = సుందర బాహుస్వామి, వనాద్రౌ = వనగిరియందు, నిత్యశః = ఎల్లప్పుడు, సజతి = ఆసక్తుఁడై యున్నాఁడు.

విశేషములు :— 'ఆనందమందిర మహామణి మంటపాంతః' స్వరూపరూపగుణవిభూతి నిత్యముక్తసంయుక్త భగవదనుభవ జన్యమహానందమునకుఁ బుట్టినిల్లైన వెయ్యిస్తంభముల పెద్ద మణిమండపము మధ్యభాగమునం దని భావము. నిత్యం వసన్ సజతి సుందరదోర్వనాద్రౌ— పత్నీపరిజనాదులతో నిత్య నివాసయోగ్యమగు వనగిరి, సుందరబాహుస్వామివారికి ఆనంద మందిరమహామణిమండపముకంటె అత్యంత భోగ్యముగా నున్న దని తాత్పర్యము.

తా॥ భగవదనుభవజన్య మహానందమునకుఁ బుట్టినిల్లగు వేయిస్తంభములు గల మహత్తరమగు మణిమండపస్థాన మధ్యభాగమునందు శేషపర్యంకమున శ్రీభూనీలా సమేతుఁడై లెక్కకు మీఱిన యప్రాకృతులగు నిజపరిజనంబులచేత సేవ్య మానుఁడగు వైకుంఠపతి సుందరబాహుస్వామిగారు నిత్యము వనాద్రియం దాసక్తుఁడై యున్నాఁడు.

శా. ఆనందైకనిధాన రత్నమయ ది
వ్యస్తంభ బాభాసురా
స్థానీమండపమధ్యమందు నహీంద్రా
త్తల్పంబునన్ శ్రీరమా

జ్ఞానీలల్ భజియింపఁ గింకరతతుల్
కై వారముల్ సల్పఁగా
శ్రీనాథుం డెటొ సుందరుం డశె వనా
ద్రిన్ గ్రీడఁ గావించెడున్.

శ్లో॥ ప్రత్యర్థిని త్రిగుణకప్రకృతే రసీమ్ని
వైకుంఠధామని పరాంబరనామ్ని నిత్యే।
నిత్యం వసన్ పరమసత్త్వమయే వ్యతీత
యోగీంద్రవాఙ్మనస ఏవ హరి ర్వనాద్రౌ॥ 80

ప్రతి:— పరమ, సత్త్వ, మయే=శుద్ధసత్త్వమయ మైనట్టియు, (కనుకనే) త్రిగుణక, ప్రకృతేః = సత్త్వరజస్తమోమయ మైన మూలప్రకృతికి, ప్రత్యర్థిని = ప్రతిభటమైనట్టియు, (విరోధి యైనట్టియు) అసీమ్ని=హద్దులేనట్టియు. పర, అంబర, నామ్ని =పరమాకాశ మను పేరుగలట్టియు, నిత్యే = సనాతన మైన ట్టియు, వైకుంఠధామని = వైకుంఠలోకమునందు, నిత్యమ్= ఎల్లప్పుడు, వసన్=నివసించుచు, అతీత, యోగీంద్ర, వాఙ్మ నసః, అపి = యోగీంద్రుల వాక్కులకు మనస్సునకు అందని వాఁడైనను, హరిః = శ్రీమహావిష్ణువు, వనాద్రౌ=వనగిరి యందు, ఏషః = ఇతఁడే యని వ్రేలితోఁ జూపఁదగినవాఁడు, (ప్రత్యక్షుఁడుగా నున్నాఁడని యర్థము).

విశేషములు :— అసీమ్ని=అపరిచ్ఛిన్నపరిమాణముగల, అతీతయోగీంద్ర వాఙ్మనసః అపి=అపరిచ్ఛేద్య స్వరూపగుణ విభూత్యాదులు గలవాఁడైనను, 'అతీతయోగీంద్రవాఙ్మనసే

అని పదచ్ఛేద మొనర్చినపుడు వైకుంఠలోకమునకు విశేషణ మగును.

తా॥ శుద్ధసత్త్వమయమును త్రిగుణస్వరూప మగు ప్రకృతికిఁ బ్రతిభటమును, అపరిచ్ఛిన్నపరిమాణము గలదియు, పరమాకాశమనఁబడు నిత్యమగు వైకుంఠమున నిత్యనివాసియు యోగీశ్వరులవాక్కులకు మనస్సునకు నందని సుందరుఁడైన శ్రీపతి వనగిరిలో నితఁడే యని చూపుటకు నీ శ్లోక మందఱికిని దృగ్గోచరుఁ డగు చున్నాఁడు.

మ. పరిమాణం బతిమాత్రమై ప్రకృతికిం
బ్రత్యర్థిభూతంబునై
వరసత్త్వస్ఫురణాంచితంబు నగుచు న్భా
స్వద్రూపమై నిత్యమై
పరమాకాశపదాభిధేయ మగు శ్రీ
వైకుంఠమందున్ మునీ
శ్వరవాఙ్మానసదూరుఁడౌ హరి యిటన్
బ్రత్యక్షదృశ్యుం డహో!

అవతారిక :— ఈ మీఁద శ్రీవారి లీలావిభూతిభోగమును శ్లోకద్వయముతోఁ జెప్పుచున్నారు.

శ్లో॥ లోకాం శ్చతుర్దశ దధత్ కిల సుందరస్య
పంక్తిర్గుణోత్తరితసప్తవృతీద్ధ మండమ్ ।
అన్యాని చాస్య సుసదృశాని పరశ్శతాని
క్రీడావిధే రిహ పరిచ్ఛదతా మగచ్ఛన్ ॥ 81

ప్రతి :— చతుర్దశ = పదునాలుగు, లోకాన్ = లోకము లను, దధత్ = ధరించు చున్నట్టిము, పంక్తి.....సప్తవృతి= పంక్తిగుణ = పదిరెట్లు, ఉత్తరిత = ఒకదానికంటె నొకటి పెద్దవి యగు, సప్తవృతి = ఏడుఆవరణములు గల, ఇదమ్ = ఈ,అండమ్ = బ్రహ్మాండము, అస్య = దీనికి, సుసదృశాంశ్రీ = మిక్కిలి సదృ శములైన, పరశ్శతాని = లెక్కలేని, అన్యాని, చ = ఇతరము లగు బ్రహ్మాండములును, ఇహ = ఈలీలావిభూతియందు, సుంద రస్య = సుందరబాహుస్వామియొక్క, క్రీడావిధేః = లీలాకార్య మునకు, పరిచ్ఛదతామ్ = ఉపకరణ మగుటను (ఆటవస్తు వగు టను) అగచ్ఛన్, కిల, = పొందినవిగదా !

విశేషములు :— లోకాన్ చతుర్దశ దధత్ — ఇది అండమునకు విశేషణము. దీనిచేత నయ్యండ వైశాల్యము ప్రకటింపఁ బడుచున్నది. 'పరశ్శతాని' వందలకు దాఁటినవి, అనఁగా అనేకములని భావము.

తా॥ పదునాలుగు లోకములను తనలో ధరించు వైశాల్య మును ఒకదానికంటె నొకటి పదిరెట్లు విస్తారము గలయేడు ఆవరణములతోఁ గూడిన యీబ్రహ్మాండము, ఇట్టివే యగు వందలకొలఁది బ్రహ్మాండములును శ్రీ సుందరబాహుస్వామి వారి కీలీలావిభూతిలో ఆటవస్తువు లగుచున్నవి.

మ. పదునాల్గౌ జగముల్ విశాలత వసిం
పన్ బొల్చి యొండొండు తాఁ
బదిరెట్లాయతి మించుసప్తవృతులన్
భాసిల్లు నీయండ, మి

ట్టిదె యానందపరశ్శతంబు తగఁ గ్రీ
డింపంగ నేతద్విభూ
తిఁ దలిర్చున్ వనశైలనాథునకు నెం
తే నాటబొమ్మల్ వలెన్.

శ్లో॥ సురనరతిర్యగాది బహుభేదకభిన్నమిదం
జగదథ చాండ మండచరణాని చ సప్త తథా ।
గుణపురుషౌ చ ముక్తపురుషాశ్చ వనాద్రిపతే
రుపకరణాని నర్మవిధయేఽపి భవంతి విభోః ॥ 82

ప్రతి :— సుర, నర, తిర్యక్, ఆది, బహు, భేదక, భిన్నమ్ = దేవతలు, మనుష్యులు, తిర్యక్కులు (పశుపక్ష్యాదులు) మొదలగు పెక్కు విశేషణములచేత భిన్నమైన, (వేఱయిన) ఇదమ్=ఈ, జగత్=ప్రపంచము, అథ=అనిగాఁద, అండంచ = అండమును, తథా=అట్లే, సప్త=ఏడు, వరణాని, చ= ఆవరణములును, (పరిధులును) గుణ, పురుషౌ, చ = ప్రకృతి పురుషులును, ముక్తపురుషాః చ=ముక్తపురుషులును, విభోః, అపి=సర్వస్వామి యైనను, వనాద్రిపతేః = వనగిరినాథుఁడైన సుందరబాహుస్వామికి, నర్మ, విధయే=లీలాచరణములకొఱకు, ఉపకరణాని = సాధనములు, భవంతి = అగుచున్నవి.

విశేషములు :— తిర్యగాది— అనుచోట 'ఆది' పదముచేత తమకంటెఁ దక్కువవి యగు స్థావరాదులు గ్రహింపఁ బడును. గుణపురుషౌ=గుణశబ్దముచేత గుణత్రయ విశిష్టమగు ప్రకృతియు, పురుషశబ్దముచేతఁ దత్సంబద్ధుఁడగు పురుషుఁడును గ్రహింపఁబడును. ముక్తపురుషాః— ఇచ్చటఁ బ్రకృతిచేతవిడువఁ

బడుచున్న పురుషు లని యర్థము. లీలావిభూతియోగము ప్రాకృతము గనుకఁ గేవల ముక్తపురుషు లుండుటకువీలు లేదు.

తా॥ దేవతలు మనుష్యులు పశుపక్ష్యాదులు స్థావరములు మున్నగు నుపాధులచేత భిన్నమగు నీప్రపంచము, బ్రహ్మాండము, సప్తావరణములు, ప్రకృతిపురుషులు, ముక్తపురుషులు, ఈసర్వము సర్వవ్యాపియు, సర్వస్వామియు నైనను వనాద్రి నాథుఁడగు శ్రీ సుందరబాహుస్వామివారికి లీలాచరణమున కుపకరణ మగుచున్నది.

మ. అమరుల్ మర్త్యులు పక్షులుం బశువు లి
త్యాద్యాకృతుల్ పొల్చు లో
కము బ్రహ్మాండము దాని కావరణముల్
గా నొప్పునాసప్తకం
బు మ టింకన్ గుణపూరుషుల్ ప్రకృతిని
ర్ముక్తుల్ నరుల్ శ్రీవనా
ద్రిమురారాతికి నాటవస్తువులుగా
దీపించు స్వక్రీడలన్.

అవతారిక:—— గతశ్లోకమున ముక్తపురుషప్రస్తావన వచ్చుట చేత ముక్తు లెట్టివారో వివరించు చున్నారు.

శ్లో॥ జ్ఞానిన స్సతతయోగినో హి యే
సుందరాంఘ్రిపదభక్తిభాగినః ।
ముక్తి మాప్య పరమాం పరే పదే
నిత్యకింకరపదం భజంతి తే ॥ 83

ప్రతి :—— సతతయోగినః = ఎల్లప్పుడును కర్మయోగానుష్ఠానశీలురును, జ్ఞానినః=జ్ఞానయోగనిష్ఠులును, (అగు) యే-

ఏజనులు, సుందర, అంఘ్రి, పద, భక్తి, భాగినః = సుందర బాహుస్వామివారి చరణములందు భక్తి యోగమును పొందిన వారు,(భవంతి = అగుచున్నారో!, తే = ఆజనులు, పరమాః = ఉత్కృష్టమగు, ముక్తిమ్ = మోక్షమును, ఆప్య = పొంది, పరే, పథే = పరమపదమునందు, నిత్య, కింకర, పదము = నిత్య కింకరులు) అను శబ్దమును, భజంతి = పొందుచున్నారు.

విశేషములు :— పరమాం ముక్తిమ్ = అపునరావృత్తి ముక్తిమ్ = పునరావృత్తిలేని మోక్షమును 'న స పునరావర్తతే— న స పునరావర్తతే' అని శ్రుతి. మోక్షమునకు వెళ్ళినవాడు తిరిగి పుట్టడు. 'నిత్యకింకరపదం భజంతి తే' కర్మ జ్ఞానభక్తి యోగములు భగవన్నిత్యకింకరత్వసాధనము లని భావము,

తా॥ ఎల్లప్పుడు కర్మయోగము నాచరించువారును, జ్ఞాన యోగనిష్ఠులును, (శ్రీ) సుందరబాహుస్వామివారి చరణము లందు భక్తియుక్తులై పునరావృత్తిరహితమగు మోక్షమును బొంది పరమపదమునందు నిత్యకింకరులనెడు శబ్దమును బొందుదురు.

గీ. సంతతము కర్మయోగనిష్ఠాగరిష్ఠు
లనవరతమును జ్ఞానయోగాభిరతులు ।
సుందరపదారవిందభక్తిం దరించి
నిత్యకింకరపదము గణింతు రచట.

అవతారిక :— ఇటుమీద ముప్పదియొనిమిది శ్లోకముల చేత భగవదవతార సౌశీల్యము ననుభవించు చున్నారు.

శ్లో॥ దేవస్య సుందరభుజస్య వనాద్రిభర్తుః
హైహ శీలవత్త్వ మథ వాశ్రితవత్సలత్వమ్।
ఐశ్వర్యభావ మజహద్భి రిహావతారై
ర్యోఽలంచకార జగదాశ్రితతుల్యధర్మా ॥ 84

ప్రతి :— యః=ఏ సుందరబాహుస్వామి, ఐశ్వర్య, స్వభావమ్=ఈశ్వరసంబంధియగు స్వభావమును, అజహద్భిః=విడనాడనట్టి, అవతారైః=అవతారములచేత, ఇహ=ఈ లీలా విభూతియందు, ఆశ్రిత, తుల్య, ధర్మా = స్వాశ్రిత జనముతో సమానశీలముగల వాఁడగుచు, జగత్ = లోకమును, అలంచకార=అలంకరించెనో! వనాద్రి, భర్తుః=వనగిరినాథుఁడైన, సుందరభుజస్య = సుందరబాహు వనెడు, దేవస్య= దేవరవారి యొక్క, శీలవత్త్వమ్ = శీలము, హైహ = ఆశ్చర్యకరము, అథవా=అది కానిచో, ఆశ్రితవత్సలత్వమ్=ఆశ్రితులయెడఁగల ప్రేమాతిశయము, హైహ=ఆశ్చర్యజనకము, (భవతి=అగుచున్నది.)

విశేషములు :— ఐశ్వర్యభావమ్ = ఈశ్వరత్వమున కనురూపమగు రూపగుణ విభవాదికము. లేదా— సర్వజ్ఞత్వ, సర్వశక్తిత్వాదికము. శీలవత్త్వమ్ = శీలము. శీల మనఁగా 'మహతో మందైః సహ నీరంధ్రేణ సంశ్లేషః శీలమ్' (గొప్పవానికి మందులతోఁగల దట్టమైన కలయికను శీల మందురు) అను లక్షణము గలది. ఆశ్రిత వత్సలత్వమ్ — ఆశ్రితజనుల దోషములందు భోగ్యతాబుద్ధి.

శ్లో॥ అజోఽపి స న్నవ్యయాత్మా । భూతానా మీశ్వరోఽపిసన్ ।
ప్రకృతిం స్వా మధిష్ఠాయ । సంభవా మ్యాత్మమాయయా ॥

అనినట్లు స్వాసాధారణ దివ్యస్వభావమును వీడకుండ స్వేచ్ఛతో నవతరించి నప్పటికిని

శ్లో॥ 'ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్ ।'
'అహం వో బాంధవో జాతః' ఇత్యాద్యములఁ జెప్పఁబడిన బాంధవత్వ ప్రయుక్తవాత్సల్యము, సౌశీల్యము విస్మయకరమని భావము.

తా॥ సర్వజ్ఞత్వ, సర్వశక్తిత్వాది సర్వేశ్వరత్వ ప్రయుక్త కల్యాణగుణములను బాయలేని యవతారములచే నే దేవుఁ డీ విశ్వము నలంకరించెనో దేవ దేవుఁడగు వనాద్రీశ్వరుఁడైన యా సుందరబాహుస్వామి సౌశీల్యవాత్సల్యము లత్యాశ్చర్య కరములు—

ఉ॥ ఏగుణవారిరాశి తను నెన్నఁడుఁ
బాయని యైశభావమున్
త్యాగ మొనర్పలేని యవతారములన్
జగదేక భూషణం
బౌ గతి నొప్పె నావనధరాధిపు శీల
సువత్సలత్వముల్
బాగురె! మేల్! బళీ! యను ప్రశంసకుఁ
బాత్రములై తనర్చెడిన్.

శ్లో॥ సింహాద్రినాథ ! తవ వాఙ్మనసాతివృత్తం
రూపం త్వతీంద్రియ ముదాహ రహస్యవాణీ।
ఏవం చ న త్వ మిహ చేత్ సమవాతరిష్యః
త్యజ్ జ్ఞాన భక్తి విధయోఽద్య ముధాఽభవిష్యన్ ॥ 85

ప్రతి :— (హే) సింహాద్రినాథ ! = ఓ సుందరబాహు స్వామీ, రహస్యవాణీ = ఉపనిషత్తు, వాఙ్మనస, అతి, వృత్తమ్ = వాక్కులకు మనస్సునకు నందని, తవ = నీయొక్క, రూపం తు = రూపమునన్ననో, అతీంద్రియమ్ = ఇంద్రియములకు గోచరము కాని దానినిగా, ఉదాహ = పెద్దగాఁ జెప్పెను. ఏవంచ (సతి) ఇట్లు కాఁగా, ఇహ = ఈ లీలావిభూతియందు, అద్య = ఇప్పుడు, త్వమ్ = నీవు, న, సమవాతరిష్యః చేత్ = అవతరింపక పోయెదవేని, త్యత్, జ్ఞాన, భక్తి, విధయః = తమ జ్ఞానభక్తివిధాయకశాస్త్రములు, ముధా = వ్యర్థములు, అభవిష్యన్ = ఐ యుండెడివి.

విశేషములు :—సింహాద్రినాథ—వనగిరికి సింహాద్రి యని నామాంతరము. కనుక ఓ వనగిరిప్రభువా ! యని యర్థము. రూపమ్—ఇచ్చట రూపశబ్దము విగ్రహపరము. ఏవంచ (సతి) = వాక్కులకు మనస్సునకు అందని తారుణ్యలావణ్యములు గల దేవరవారి దివ్యవిగ్రహము కంటికి గోచరము కాదని. 'న చక్షుషా పశ్యతి కశ్చ నైనమ్' (ఎవఁడును ఈ పరమాత్మను కంటితోఁ జూడఁ జాలఁడు.) 'న మాంసచక్షు రభివీక్షతే తమ్' (మాంసచక్షుష్కుఁ డాపరాత్పరుని జూడ లేఁడు.)

ఇత్యాద్యుపనిషద్వాక్యములచేతఁ బ్రతిపాదింపఁబడెఁగా నని భావము. 'న త్వ మిహా చేత్ సముపాగమిష్యః త్వోక్త జ్ఞాన భక్తివిధయోఽద్య ముధాఽభవిష్యన్' శుభాశ్రయమగు విగ్రహము నాశ్రయించి ప్రవర్తిల్లిన దేవరవారి జ్ఞానభక్తివిషయకము లగు శాస్త్రములు శ్రీవారి యవతారము లేనిచో పాసఁగవని భావము.

తా॥ ఓ వనాద్రినాథా! యుపనిషద్వాక్యములు వాఙ్మనసంబుల కందని దేవరవారి విగ్రహము నతీంద్రియ మని పెద్దగా నుడువుచున్నది. ఇట్లు నీ దివ్యవిగ్రహము చక్షుర్గోచరము కాఁగా నీలీలావిభూతిలోఁ దామే యవతరింపని యెడల దేవరవారి జ్ఞానభక్తి ప్రతిపాదకశాస్త్రములు వ్యర్థములై పోయెడిని. అవతరించితిరి గాన నవి సార్థకము లగుచున్నవి.

ఉ. సుందరబాహురూప మధు
సూదన! దివ్యవనాచలస్థలీ
మందిర! నీదు విగ్రహము
మాటలకున్ మదికిన్ రనంత యో
నంద దటంచుఁ బల్కె శ్రుతి
యట్టులుగా నవతార మెత్తవే
నిందు వృథాయగుం గద! హ
రీ! తమజ్ఞాన సుభక్తిశాస్త్రముల్.

శ్లో॥ యే భక్తా భవదేకభోగమనసోఽనన్యాత్మ సంజీవనాః
తత్సంశ్లేషణతద్విరోధినిధనాద్యర్థం వనాద్రీశ్వర !
మధ్యేండం య దవాతర స్సురనరాద్యాకారదివ్యాకృతి
స్తే నైవ త్రిదశై ర్నరై శ్చ సుకరం స్వప్రార్థిత ప్రార్థనమ్॥ ౯6

ప్రతి — హే వనాద్రీశ్వర ! = ఓ సుందరబాహుమూర్తీ ! అనన్య, ఆత్మ, సంజీవనాః = మఱి యొకటి ఆత్మోజ్జీవనముగా లేనివారును, భవత్, ఏక, భోగ, మనసః = నీ వొక్కఁడవే భోగ్య మనెడు మనస్సుగలవారును, అగు, యే=ఏ, భక్తాః= భక్తులు, (సంతి = కలరో) తత్, సంశ్లేషణ, తత్, విరోధి, నిధన, ఆది, అర్థమ్ = వారిని రక్షించుట, వారివిరోధులను శిక్షించుట (సంహరించుట) ధర్మమును స్థాపించుట, యను ప్రయోజనము కొఱకు, మధ్యేండమ్ = బ్రహ్మాండమధ్యమున, సుర, నర, ఆది, ఆకార, దివ్య, ఆకృతిః= దేవతలు మానవులు మొదలగువారి యాకారమువంటి దివ్యవిగ్రహముగలవాఁడవై, అవాతరః, ఇతి, యత్ = అవతరించితివనుట యేది గలదో, తేన, ఏవ = ఆయవతారకారణముచేతనే, త్రిదశైః = దేవతలచేతను, నరైః = మానవులచేతను, స్వ, ప్రార్థిత, ప్రార్థనమ్ = తమకోరికలను వేఁడుకొనుట, సుకరమ్ = సులువైనది, (అభూత్ = ఆయెను.)

విశేషములు :— ‘ అనన్యాత్మసంజీవనాః, – భవదేకభోగమనసః’– అను విశేషణద్వయముచేత నీవే యుపాయముగను, ఉపేయముగను గలవారు. అని భక్తులయెడఁగల పరాకాష్ఠను

తెలియవలెను. అట్టి భక్తులే గీతయందలి 'పరిత్రాణాయ సాధూనామ్' అనుచోట సాధుపదముచేఁ జెప్పఁబడిరి. 'తత్సంశ్లేషణ తద్విరోధి నిధనాద్యర్థః' అను పదమునందు భగవదవతార ప్రయోజనములు సూచింపను 'పరిత్రాణాయ' అను గీతాశ్లోకము వివరింపఁబడినది. 'తత్సంశ్లేషణ' మనఁగా, అట్టి సాధువులతో నెడము లేక కలసియుండుట - అనఁగా వారిని రక్షించుటయందు బద్ధదీక్షుఁడై యుండుట యని భావము. అందులకై 'తద్విరోధినిధన' - అట్టి సాధువుల కపకారములను చేయువారిని సంహరింపవలయును 'వినాశాయ చ దుష్కృతామ్' అని గీత, ఈ రెండుపనులెందు కనఁగా 'అద్యర్థమ్' ఇచ్చట ఆదిపదగ్రాహ్యము ధర్మము. దానిని స్థాపించుటకొఱకు 'ధర్మసంస్థాపనార్థాయ' అని గీత. సుకరస్తు—నీవు సుందరబాహువమున నిట నవతరించుటచేతనే సురలును నరులును నీ ధర్మము లభించి తమకోరికలను నీవలనఁబడయుట సులభమయ్యెనని యాశయము.

తా॥ ఓ వనాద్రినాథా! నీకంటె మఱియొకఁడు దాతోజ్జీవకుఁడు లేఁడని నిన్నే యుపాయముగాను ఉపేయముగాను భావించి నిరంతరము సేవించుచున్న భక్తులను రక్షించుటకును, వారి కపకారము లొనర్చు దుర్మార్గులను శిక్షించుటకును, ధర్మమును నెలకొల్పుటకును, నీవీ బ్రహ్మాండమున సుందరాది దివ్యవిగ్రహుఁడవై యవతరించితివి కనుకనే దేవతలును మానవులకు నీవలన నభీష్టములను బడయుట సులువయ్యెను.

చ॥ వనగిరినాథ ! నిన్ను నె యు
పాయ ము పేయముగాఁ, దలంచి యా
త్మను గడ దేర్చుకోఁ దివురు
ధన్యులఁ బ్రోవఁగఁ దద్విరోధులన్
దునుమఁగ, ధర్మమున్ నిలుపఁ,
దోడనె నీవిలఁ బుట్టుకున్న నీ
మనుజులు వేలుపుల్ పడయు
మాత్రమువారె నిజేప్సితంబులన్.

శ్లో॥ శ్రీమన్మహావనగిరీశ ! విధీశయో స్తే
మధ్యే తు విష్ణు రితి యః ప్రథమావతారః ।
తే నైవ చే త్తవ మహిమ్ని జనాః కి లాంధాః
త్వన్మత్స్యభావ మవగమ్య కథం భవేయుః ॥ 87

ప్రతి :— శ్రీమన్ = శ్రీమంతుఁడవగు, మహావనగిరి + ఈశ = మహావనాద్రినాథా !, విధి, ఈశయోః = బ్రహ్మరుద్రుల యొక్క, మధ్యే, తు = నడుమనే, తే = నీకు, విష్ణుః, ఇతి = విష్ణువనెడు, యః = ఏ, ప్రథమ, అవతారః = మొదటి అవతారము, (అస్తి = కలదో) తేన, ఏవ = ఆయవతారము చేతనే, తవ = నీయొక్క, మహిమ్ని = మహిమయందు, (పరత్వవిషయమున) జనాః = జనులు. అంధాః, చేత్ = గ్రుడ్డివారైనయెడల, త్వత్, మత్స్యభావమ్ = నీమీన సజాతీయ రూపమును, అవగమ్య = తెలిసికొని, కథమ్ = ఎట్లు, భవేయుః, కిల = అగుదురో ! (సముద్రసంచారు లగు మీనములలో నిదికూడ నొకటి యని తలంతురా ?)

విశేషములు :— శ్రీమన్మత్స్యావతార! — అని యేకపదముగా నన్వితము చేసికొనవచ్చును— అప్పుడు శ్రీమంతమగు పెద్దవనాద్రికిఁ బ్రభువా! అని యర్థము. మధ్యే, తు= ఇచ్చట 'తు' అను నవ్యయము సమాహారార్థకము. తు స్యాద్భేదేఽవధారణే— అని నిఘంటువు. 'విష్ణు రితి యః ప్రథమావతారః'— బ్రహ్మా విష్ణురుద్రులు— అను పరిగణనమున కనుగుణముగా విష్ణువని ప్రథమమున నొక మొగ్గు దిగుట యేది గలదో, 'తేనైవ చేత తవ మహిమ్ని జనాః కిలాంధాః' అంతమాత్రము చేతనే నీపరత్వ విషయమున జనులు— సృష్టిస్థితిసంహారకర్తలు ముగ్గురును స్వతంత్రులు తుల్యులని నీప్రత్యేక సర్వేశ్వరత్వమును గుర్తింపనివారు అగుదురేని 'త్వన్మత్స్యభావ మవగమ్య కథం భవేయుః'— సముద్రమునఁ జరించు మీనములలో నిదియు నొక మీనము (చేఁప) అనియు మనస్సులోఁ దలంతురేమో!

తా॥ శ్రీమంతుఁడవగు ఓ వనాద్రినాథా! బ్రహ్మా విష్ణు రుద్రుల నెడు పరిగణనమును బట్టి నీవు తొలిసారిగా బ్రహ్మ రుద్రుల మధ్యమునందు అవతరించుటచేత (దిగుటచేత) జనులు సృష్టిస్థితిసంహారకర్తలు ముగ్గురును ప్రత్యేకము స్వతంత్రులు సమానులు నని నీ పరత్వవిషయమున గ్రుడ్డివారైనచో నీ మీనావతారమును దెలిసికొని యదియు సముద్రములోఁ జరించు నొక సామాన్యమగు చేపయే యని భావింతురు. కలసియున్నను సముద్రములోఁ దిరిగెడి యితర మత్స్యములకు

మీనావతారుఁడ వగు నీకు నెంతభేదము గలదో యట్లే బ్రహ్మ విష్ణురుద్ర పదములతోఁ గలసియున్నను విష్ణువగు నీకును బ్రహ్మరుద్రులకును గావలసినంత భేదము కలదని భావము.

శా॥ దేవా! యావిధిరుద్రులందు నడుమన్
దేవాధిదేవుండ వౌ
శ్రీవిష్ణుండవు నీవు త్రోల్త దిగుటన్
సృష్టిస్థితిధ్వంసకృ
ద్దేవుల్ మువ్వురుఁ దుల్యులంచు భవదు
త్కృష్టత్వమం దంధులౌ
ఆవా రెన్నరె చిన్నచేపగఁ ద్వదీ
యం బైనమీనాకృతిన్.

శ్లో॥ హే దేవ! సుందరభుజ త్వ మి హాండమధ్యే
సౌలభ్యతో విసదృశం చరితం మహిమ్నః।
అంగీకరోషి యది తత్ర సురై రమీభిః
సామ్యా న్నికర్షపరిపాలన మేవ సాధు॥ 88

ప్రతి :— హే దేవ = ఓస్వామీ! సుందరభుజ! = సుందరబాహుమూర్తీ!, త్వమ్ = నీవు, సౌలభ్యతః = సులభత్వ మనెడు గుణమువలన, మహిమ్నః = సర్వేశ్వరత్వ మహత్తకు, విసదృశమ్ = తగని. చరితమ్ = నడతను, అంగీకరోషి, యది = అంగీకరింతువేని, తత్ర = ఆతగని నడతవిషయమున, అమీభిః = ఈ, సురైః = దేవతలతోడ, (బ్రహ్మరుద్రేంద్రాదులతోడ) సామ్యాత్ = పోలికకంటె, నికర్ష, పరిపాలనమ్, ఏవ, = తక్కువవారితోడి

సామ్యము నభినయించుటయే, సాధు = యోగ్యమైనది. అనగా మత్స్యకూర్మ సజాతీయతాభినయము మే మేలని భావము.

విశేషములు :— 'తత్ర సురాసురాభిః సామ్యా న్నికర్ష పరిపాలన మేవ సాధు'— ఓ సుందరబాహుస్వామీ ! తమ సర్వస్వ మగు సౌలభ్యమును బ్రకటించుటకు శ్రీవారి పరత్వము నకు అననుగుణము లగు చేష్టలను బ్రదర్శింపవలసి వచ్చినపుడు బ్రహ్మరుద్రేంద్రాదులతో సామ్యమును బ్రకటించు విష్ణూపేంద్రాద్యవతారముల కంటె అందఱికి నందుబాటులో నుండు మత్స్యకూర్మాది సజాతీయావతారములే మీ యత్యంత సౌలభ్యమును జెప్పును గనుక నట్టియవతారముల నభినయించుటే మేలని భావము.

తా॥ శ్రీ సుందరభుజదేవా ! తా మీ బ్రహ్మాండములో శ్రీవారి సౌలభ్యగుణమును బ్రదర్శింప పరత్వమునకు విరుద్ధము లగు పనులను సలుపవలసి వచ్చినపుడు బ్రహ్మరుద్రేంద్రాదులతోఁ బోలిక నభినయించుటకంటె నల్పములగు మత్స్యకూర్మాదులతో సజాతీయములగు నవతారముల నభినయించుటయే మేలనిపించుచున్నది.

శా॥ సౌలభ్యం బనునీదు మేలిగుణమున్
జాటన్ బరత్వప్రభా
జాలాచ్ఛాదక వేషధారణ తఱిన్
స్రష్టన్ శివేంద్రాదులన్

బోలం జాలెడు విష్ణువామనుల రూ
పుల్ దాల్చి కంటెన్ వనీ
శైలైకాలయ! మత్స్య కూర్మముఖవే
షస్వీకృతుల్ శ్లాఘ్యముల్.

అవతారిక :— నికర్షపరిపాలన ప్రస్తావన వలన సర్వావతార ప్రధానములగు రామకృష్ణా ద్యవతారములలోని కొన్ని లీలల ననుభవించు చున్నారు.

శ్లో॥ ఇహావతీర్ణస్య వనాద్రి నాథ! తే
నిగూహతః స్వం మహిమాన మైశ్వరమ్।
ఉమాపతేః కిం విజయః ప్రియంకరః
ప్రియంకరా వేంద్రజిదస్త్ర బంధనా॥ 89

ప్రతి :— (హే) వనాద్రినాథ! = ఓ వనగిరిప్రభూ!, ఐశ్వరమ్ = ఈశ్వరసంబంధి యగు, (సర్వేశ్వరత్వ బోధకమగు) స్వమ్ = సహజమైన, మహిమానమ్ = మహిమను, నిగూహతః = కప్పిపుచ్చుచున్నట్టియు, ఇహ = ఈలీలావిభూతిలో, అవతీర్ణస్య = అవతరించిన, తే = నీయొక్క, ఉమాపతేః = పార్వతీపతియగు శివునియొక్క, విజయః = గెలుపు, ప్రియంకరః, కిమ్ = ప్రియమును గలిగించునదియా? ఇంద్రజిత్, అస్త్రబంధనా = ఇంద్రజిత్తుయొక్క, బ్రహ్మాస్త్ర నాగాస్త్రపాశబంధము, ప్రియంకరా, వా = ప్రియమును గలిగించునదియా?

విశేషములు :— అవతీర్ణస్య - సర్వేశ్వరత్వ తిరోధానము కొఱకవతరించి - 'ఉమాపతేః కిం విజయః ప్రియంకరః —

బాణాసురుని తోడియుద్ధకాలమునఁ దన్నుగని రక్షకుఁడైన యీశ్వరుని జయించుట యని భావము. (ఇది కృష్ణావతార మున) 'ప్రియంకరా మేంద్రజిద స్త్రబంధనా'— (ఇది రామావ తారమున) ఈ రెండింటిలోఁ దమ పరత్వమహిమను గప్పి పుచ్చుటలో నింద్రజి దస్త్రబంధనమే ప్రముఖపాత్రమును వహించుటచేత నదియే మిక్కిలి ప్రియకరమని భావము. కనుక వెనుకటి శ్లోకమునఁ జెప్పిన 'నిజత్వపరిపాలన మేన సాధు' అనుటయే సమంజసము.

తా॥ ఓ వనాద్రినాథా! సహజమును సర్వేశ్వరత్వ నిబంధ నము నగు నీ మహిమను గప్పివేసికొనుచు ఈభూమిభాగములో నవతరించిన నీకుఁ గృష్ణావతారములోని బాణాసురయుద్ధకాలిక మగు పరమశివుని జయించుట ముదావహమా? రామావ తారములో నింద్రజిన్నాగపాశములచేఁ గట్టువడుట ముదావ హమా? తెల్పుము.

శా॥ దేవా! నీదు పరత్వశోభక మహా
దివ్యత్వమున్ దాఁచి యిం
దావిర్భూతుఁడ వైననీకు వనగి
ర్యధ్యక్షపాదా! మహా
దేవున్ గెల్చుట యిష్టమో! రణభువిన్
దేవేంద్ర జిన్నాగపా
శావళ్యార్జితబంధనంబు ప్రియమో!
యాలించెదన్ దెల్పవే.

అవతారిక :— పరత్వప్రయుక్త మహిమను సర్వవిధములఁ గప్పిపుచ్చుటయు దుశ్శకమని యీశ్లోకమున నుడువుచున్నారు.

శ్లో॥ పుచ్ఛోత్పుచ్ఛన మూర్ఛనోద్ధతి ధుతవ్యావర్తి తావర్తవత్
సంవర్తార్ణవ నీరపూర విలుఠత్పాఠీన దివ్యాకృతేః ।
సింహాద్రీశ ! న వైభవం తవ కథం స్వాలక్ష్య మాలక్ష్యతే
పద్మాక్షస్య జుఘుక్షతోఽపి విభవం లక్ష్మీధరాధోక్షజ ! 90

ప్రతి :— అధోక్షజ ! = ఉపాసకహృదయకమలవాసీ ! సింహాద్రీశ !=వనగిరినాథా ! లక్ష్మీధర !=శ్రీ మహాలక్ష్మిని ధరించిన సుందరబాహుస్వామీ !, విభవమ్ = మహిమను, జుఘుక్షతః, అపి = దాఁచఁదలఁచు చున్నప్పటికిని, పుచ్ఛ... ఆకృతేః— పుచ్ఛ=తోఁకయొక్క, ఉత్పుచ్ఛన = పైకెత్తుట, మూర్ఛన=అడ్డముగాఁ ద్రిప్పుటలయొక్క, ఉద్ధతి=వడిచేత, ధుత=కదలింపఁ బడినదియు, వ్యావర్తిత=త్రిప్పఁబడినదియు, (కనుకనే) ఆవర్తవత్ =సుడులుగల, సంవర్త, అర్ణవ=ప్రళయ సముద్రముయొక్క, నీర, పూర = జలప్రవాహమునందు, విలుఠత్ =పొర్లుచున్న (వడివడిగాఁ దిరుగుచున్న) పాఠీన= చేఁపయొక్క, దివ్య=అప్రాకృతమైన, ఆకృతేః = విగ్రహము గలట్టియు, పద్మాక్షస్య = తెల్లఁదామరలవంటి కన్నులుగల ట్టియు, తవ = నీయొక్క, స్వాలక్ష్యమ్ = చక్కఁగా నంతట సాక్షాత్కరించుకొనఁ దగిన, వైభవమ్=మహిమ, కథమ్= ఎట్లు, న, ఆలక్ష్యతే = చూడఁబడదు ? (స్పష్టముగాఁ జూడఁ బడుచున్నదని భావము.)

విశేషములు :— అధోక్ష, జ !— అధః = అంతర్ముఖము లైన (బైటికిఁబోని) అక్ష = ఇంద్రియములు గలవారు— అనఁగా— యోగులు లేదా ఉపాసకులు, వారియందు, జ = ఆవిర్భవించినవాఁడా ! ఉపాసకుల హృదయకమలమున నివసించు వాఁడా ! యని భావము. పృచ్ఛ...ఆకృతేః— ప్రళయార్ణవ జలప్రవాహమును అల్లకల్లోలము చేయు వాలసంచలనముగల విలక్షణ మత్స్యమూర్తిగయొక్క— యని తాత్పర్యము.

పద్మాక్షస్య— మీనశరీరమును దాల్చినప్పుడు సైతము కన్నులు పుండరీకములఁ బోలియున్న దని భావము. వాలసంచలనము చేతఁ బ్రళయార్ణవమును సంక్షోభింపఁ జేయుటయు, మీనశరీరధారణము నందు సైతము పుండరీకములఁ బోలు కనులసోయగము గలిగి యుండుటయు, దాఁచినను దాగని భగవల్లక్షణములు.

తా॥ ఉపాసక హృదయకమలమున నివసించు లక్ష్మీపతీ ! సుందర బాహుస్వామీ ! నీమహిమను నీ వెంతదాఁచఁ దలఁచు చున్నను తోఁక నెత్తుట యందలి వడిచేతను అడ్డముగాఁ ద్రిప్పుటయందలి వడిచేతను కంపించి క్షోభిల్లుచు సుడులతో నొప్పుచున్న ప్రళయ సముద్రములో నవలీలగా నీఁదుచుండియుఁ బుండరీకములఁబోలు కనులనీఁగల నీ దివ్యమగు మీనశరీరము నీ లోకోత్తర మహిమను వెల్లడించు చున్నది.

శా॥ శ్రీలక్ష్మీధర ! యోగిచిత్త కమలా
సీనా ! వనాద్రిప్రభూ !

వాలోద్ధూనన తిర్యగీరణకళా
వైదుష్యసంక్షుబ్ధ ని
ర్వేలావర్త శతాంచిత ప్రళయ వా
ర్ధిన్ మీన మహాన తత్తటిన్
బోలెన్ గన్నులు తెల్లఁదమ్మి నెటు ల
బ్జున్ దాఁచ, నీచిహ్నముల్.

శ్లో॥ సాచలావట తటాకదీర్ఘికా
జాహ్నవీజల వివర్ధితః క్షయే।
శృంగసంగమితనౌ ర్మనో రభూ
రగ్రతోఽండజ వపు స్త్వ సుందర ! ॥ 91

ప్రతి :— సుందర ! = ఓసుందర భుజస్వామీ ! అండజ, వపుః=మత్స్యశరీరము గలవాఁడవై, సాచలా...వివర్ధితః— స, అచలా, అవట = భాగర్తముతోఁ గూడిన, తటాక= చెఱువుయొక్క, దీర్ఘికా, దిగుడుబావియొక్క, జాహ్నవీ= గంగానదియొక్కయు, జల=నీటియందు, వివర్ధితః = మిక్కిలిగాఁ బెంచఁబడిన వాఁడవై, (త్వమ్=నీవు) క్షయే=ప్రళయ కాలమందు, (ప్రళయార్ణవమందు) మనోః = మనువుయొక్క, అగ్రతః=ఎదుట, శృంగ, సంగమిత, నౌః = కొమ్మునకుఁ దగిలించుకొనఁబడిన, యోడగలవాఁడవు, అభూః, హి = అయితివి గదా !

విశేషములు :— పూర్వము మనువుతర్పణ మొనర్చుచుఁ దనకమండులువునందుఁ బుట్టి పెరుఁగుచున్న చేఁపను విశాల

మగు నొక నీటిగుంటలో వైచెను. అది యచ్చటఁ బెరిఁగి స్థలము చాలకపోఁగాఁ జెఱువులో వైచెను. అయ్యది తన వృద్ధికిఁ జాలకపోవుటఁ జూచి క్రమముగా దీర్ఘికలోను గంగానదిలోను సముద్రములోను బడవైచెను. అంతనామత్స్యము ప్రళయ సముద్రములో మనువుతోఁబాటు స్థిరచరపదార్థముల నొకయోడలో నుంచుకొని యా యోడను దన శృంగమునకుఁ దగిలించుకొని ధర్మముల నుపదేశించె నను పురాణగాథ నిట ననుసంధించుకొనవలెను. ఈ శ్లోకములోని యుత్తరార్థమునకుఁ దాత్పర్యము. అవాంతర ప్రళయమందు సృష్టికి బీజభూతుఁడగు మనువును ఓడయం దిడుకొని యా యోడను కొమ్మువంటి యవయవమునకుఁ దగిలించుకొని మనువు నగ్రభాగమున ధర్మోపదేశకుఁడై మీనావతారమున శ్రీహరి ప్రళయాబ్ధిలోఁ దిరిగెను. ఈయర్థమే శ్రీరంగరాజ స్తవమున నీ క్రింది శ్లోకమున ననుసంధింపఁ బడినది.

శ్లో॥ మీనతను స్త్వం నావి నిధాయ
స్థిరచరపరికర మను మమ భగవన్ ।
వేదనశాఖిస్సూక్తివినోదై
రకలితలయభయలవ మను మవహః ॥

తా॥ ఓ శ్రీసుందరభుజస్వామీ! నీవు మత్స్యశరీరమును దాల్చి క్రమముగా భూగర్తతటాకజాహ్నవీ జలములందుఁ బెరిఁగి ప్రళయపయోధిలో శృంగమున కంటఁగట్టఁబడిన యోడతో మనువున కగ్రభాగమున దర్శనమిచ్చితివి గదా!

చ॥ మనుజలకుండిఁ గన్పడి క్ర
మంబుగ గర్తతటాకవాపులం

దున నలగంగఁ బెగ్గి లయ
తోయధిలో మనునగ్రమందు శృం
గనిగడితప్లవుండ వయి
కన్నులపండువు గాఁగఁ జేఁపరూ
పున నగపించినా వఁట న
మోనమ శ్రీవనశైలసుందరా !

శ్లో॥ ప్రళయజ నీర పూర పరిపూరిత స్వనిలయావసన్నవదన
భ్రమదశరణ్యా భూతశరణార్థినాకిశరణం భవన్ స్వకృపయా ।
చలదుదధీరితాంబు కలుషీక్రియాధ్యగమన స్వపృష్ఠవిధృతా
చలకుల పీఠ మీనతను రత్ర సుందరభుజో వనాద్రినిలయే ॥ 92

ప్రతి :— స్వ, కృపయా = స్వతస్సిద్ధమగు దయచేత, ప్రళయ......శరణమ్— ప్రళయ=ప్రళయకాలమందు, జ = పుట్టిన, నీర=నీటియొక్క, పూర= వెల్లువచేత, పరిపూరిత= నింపఁబడిన (ఆక్రమింపఁబడిన) స్వ= సొంత, నిలయ= స్థానములు గలవారు గనుకనే, అవసన్న=ఖేదముతోఁగూడిన, వదన= మొగములు గలవారును, భ్రమత్ =(రక్షకులకొఱకు) ఇటు నటు తిరుగుచున్నవారును, అశరణ్యాభూత = శరణ్యులు లేని వారును, శరణార్థి=శరణుకోరుచున్న వారును, అగు, నాకి= దేవతలకు, శరణమ్=రక్షకుఁడు, భవన్ =అగుచు, చలత్ ... గమనః— చలత్ = ( తనసంచారముచేత ) కదలుచున్న, ఉదధి=సముద్రముచేత, ఈరిత=త్రోసివేయఁబడిన, అంబు= నీటియొక్క, కలుషీక్రియా = మలినము చేయుటయందు,

ఆఢ్య=ఒప్పిదమైన, గమనః=సంచారము గలిగినట్టియు, స్వ, స్పృష్ట, విధృత, అచల, కులః = తనవీఁపుపై ధరింపఁబడిన, కొండలగుంపు గలట్టియు, మీనతనుః = మత్స్యమూర్తి, అత్ర=ఈ, వనాద్రినిలయే=వనగిరి మందిరము నందలి, ఏషః= ఈ, సుందరభుజః = సుందరబాహుమూర్తియే.

విశేషములు :— ప్రలయజ......శరణం, భవన్ — స్వత స్సిద్ధమగు దయచేతనే రక్షాపేక్షకులగు నిట్టివేల్పులకు రక్షకుఁ డగుచు- 'ఏష మీనతను రత్ర సుందరభుజః'— ప్రళయార్ణవ నీరపూరనిమగ్నమందిరులై యతి విషణ్ణవదనులై అల్లాడు చున్న శరణాగతులగు దేవతలను రక్షించుట కొఱకు నత్తఱి నివసింపయోగ్యము లగు కొండలను వీఁపుమీఁద మోసికొని వచ్చిన యామీనవిగ్రహుఁడే సంసారార్ణవమగ్నుల మగు మనల నుద్ధరింప నిచ్చట సుందరభుజస్వామియై యున్నాఁడని యాశయము.

తా॥ ప్రళయ సముద్రములోని నీటివెల్లువలు తమ తమ నిలయములను ముంచివేయఁగా నిలువఁ దావులేక దీనవదనులై రక్షణకొఱ కటునిటు తిరుగుచున్న దిక్కులేని వేల్పులకు జాలి చేత శరణమై తన గమనవేగముచేత మున్నీటినీరు కలుషమగు నట్లు దేవతలు వసించుటకుఁ బెద్దపెద్ద కొండలను వీఁపుపై మోసి తెచ్చిన దివ్యమత్స్యరూపధరుఁ డీవనాద్రి నిలయుఁడగు సుందరభుజస్వామియే సందేహము లేదు. భక్తులమగు మనలఁ గూడ సంసారార్ణవమును దాఁటించును.

ఆఢ్య=ఒప్పిదమైన, గమనః=సంచారము గలిగినట్టియు, స్వ, పృష్ఠ, విధృత, అచల, కులః = తనవీఁపుపై ధరింపఁబడిన, కొండలగుంపు గలట్టియు, మీనతనుః = మత్స్యమూర్తి, అత్ర=ఈ, వనాద్రినిలయే=వనగిరి మందిరము నందలి, ఏషః= ఈ, సుందరభుజః = సుందరబాహుమూర్తియే.

విశేషములు :— ప్రలయజ.....శరణం, భవన్ — స్వత స్సిద్ధమగు దయచేతనే రక్షాపేక్షకులగు నిట్టివేల్పులకు రక్షకుఁ డగుచు– 'ఏష మీనతను రత్ర సుందరభుజః'— ప్రళయార్ణవ నీరపూరనిమగ్నమందిరులై యతి విషణ్ణవదనులై అల్లాడు చున్న శరణాగతులగు దేవతలను రక్షించుట కొఱకు నత్తఱి నివసింపయోగ్యము లగు కొండలను వీఁపుమీఁద మోసికొని వచ్చిన యామీనవిగ్రహుఁడే సంసారార్ణవమగ్నుల మగు మనల నుద్ధరింప నిచ్చట సుందరభుజస్వామియై యున్నాఁడని యాశయము.

తా॥ ప్రళయ సముద్రములోని నీటివెల్లువలు తమ తమ నిలయములను ముంచివేయఁగా నిలువఁ దావులేక దీనవదనులై రక్షణకొఱ కటునిటు తిరుగుచున్న దిక్కులేని వేల్పులకు జాలి చేత శరణమై తన గమనవేగముచేత మున్నీటినీరు కలుషమగు నట్లు దేవతలు వసించుటకుఁ బెద్దపెద్ద కొండలను వీఁపుపై మోసి తెచ్చిన దివ్యమత్స్యరూపధరుఁ డీవనాద్రి నిలయుఁడగు సుందరభుజస్వామియే సందేహము లేదు. భక్తులమగు మనలఁ గూడ సంసారార్ణవమును దాఁటించును.

కన్నులకాంతిగల, కచ్ఛపవపుః = తాఁబేలు శరీరము కల వాఁడవు, అభూః = అయితివి.

విశేషములు :— అవిస్పందః— తనవీఁపుమీఁద మందరాచలమునుంచి త్రిప్పుటలచేతఁ దనకును దిరుగుడు సంభవింపవచ్చును, మంథనాచల నిమిత్తము కవ్వపుఁద్రాడైన వాసుకిచేతఁ జిలుకుటవలన మిక్కిలి కల్లోలితమగు సముద్రపు నీటిచేతను తనకుఁ గదలిక సంభవింపవచ్చును. అట్టి కారణములున్నను కదలనివాఁడై యుండుట కూర్మరూపియగు శ్రీహరి యొక్క స్థైర్యమును జూటుచున్నది. నందన్— సమాశ్రిత సంరక్షణాత్మమునకుఁ గూడ భారలాభముచేత నతిప్రీతి కలుగునని భావము. తన శరీరమునకుఁ గ్లేశము కలిగినను భక్తజనులను రక్షించుట యను లాభము చేకూరినందుల కానందించుచు అని సారాంశము.

తా॥ వనశైలవల్లభా ! ఓ సుందరబాహుస్వామీ! శ్రీహరీ! నీవు నీ వీఁపుపై శ్రేష్ఠమగు మందరపర్వతమునుంచి గిరగిర త్రిప్పినను, కవ్వపుఁ దాడుగానున్న వాసుకిని ఒకవైపు దేవతలొకవైపు రాక్షసులు నిలిచి యటునిటు లాగఁగా మిక్కిలి క్షోభిల్లిన పాలసముద్రమునీటి కదలికలచేతను ఏమాత్రము కదలనివాఁడవై ఆశ్రితసంరక్షణ భారమనెడు లాభము దొరకినందులకు ఆనందించుచు ఆ యానందమును విచ్చిన తామరల వంటి కన్నులకాంతితోఁ జూటుచుఁ బూర్వము కూర్మరూపుఁడవైతివి గదా !

ఉ॥ పేంపున మందరాద్రి నిడి
వేమఱు ద్రిప్పిన వాసుకిన్ ఫణి
క్ష్మాపతి యోక్త్రమున్ సలిపి
సంభ్రమముఁ జిల్కఁగ నీరు రేచ్చి తా
నూఁపిన నూఁగ కాశ్రితుల
నోమినలాభము మోద మీయఁగాఁ
జూపులఁ దమ్ములన్ నగుచు
సుందర ! నాఁ డొక కూర్మమైతివా !

శ్లో॥ జగత్ ప్రలీనం పునరుద్ది ధీర్షతః
సింహాక్షితిక్షి న్నిలయస్థ ! సుందర ! !
పురా వరాహస్య త వేయ ముర్వరా
దంష్ట్రాహ్వయేందోః కిల లక్ష్మ లక్షితా ॥ 94

ప్రతి :— సింహాక్షితిక్షిత్, నిలయ, స్థ=సింహాద్రియనెడు నివాసస్థలమునను న్న, సుందర ! = ఓ సుందరభుజస్వామీ ! పురా=పూర్వము, ప్రలీనమ్ = ప్రళయార్ణవమున మునిఁగిన, జగత్=లోకమును, పునః=మఱల, ఉద్దిధీర్షతః=ఉద్ధరింపఁ దలఁచుచున్న, వరాహస్య=వరాహావతారుఁడవగు, తవ=నీ యొక్క, దంష్ట్రా, ఆహ్వాయ, ఇందోః=కోఱయనెడు పేరుగల చంద్రునికి, ఇయమ్=ఈ, ఉర్వరా=భూమి, లక్ష్మ, లక్షితా, కిల=మచ్చగాఁ జూడఁబడినది గదా !

విశేషములు :— జగత్ ప్రలీనం పునరుద్దిధీర్షతః— ప్రళయార్ణవ మధ్యనిమగ్న జగదుద్ధారకకుఁడవు అగు నీవు

సంసారమగ్నుల మగు మమ్ముఁ గూడ నుద్ధరింపుమని కవి ధ్వనింపఁజేయు చున్నాఁడు. 'దంష్ట్రాగ్రస్వాగేఁగోశ కిల లక్ష్మ లక్ష్మితా'— దంష్ట్ర యనెడు చంద్రునకు భూమి మచ్చగా నున్న దనుటచేత (శ్రీ) వరాహమూర్తివారి విగ్రహమంత లోకో త్తరమైనదని భావము.

తా॥ వనగిరినాథుండవగు (శ్రీ) సుందరభుజస్వామీ! నీవు పూర్వము ప్రళయ సముద్రములో మునిఁగిపోయిన లోకము నుద్ధరింపఁ దలఁచి వరాహమూర్తివిగా నవతరించినప్పుడు నీ దంష్ట్రయందు గోచరించిన భూదేవి చంద్రునందు మచ్చవలెఁ గానవచ్చిన దఁట. అట్టిచో నీ దివ్యవిగ్రహముయొక్క యున్నతి నెవఁడు వర్ణింపఁ గలఁడు.

గీ॥ ప్రళయవార్ధి నిమగ్న ప్రపంచ ముద్ధ
రింపఁ దలఁచి వరాహమూర్తని గ్రహించు
నీదు కోఱను వనగిరినేత! భూమి
చందురునియందుఁ గలమచ్చ ఛాయఁ దోఁచె.

శ్లో॥ న వాయుః పస్పందే యయతు రథవాస్తం శశిరవీ
దిశోఽనశ్యన్ విశ్వా వ్యచల దచలాః సాచలకులాః ।
నభ శ్చ ప్రక్షోభ్యత్ క్వథిత మపి పాథో నరహరౌ
త్వయి స్తంభే శుంభద్వపుషి సతి హే సుందరభుజ ! ॥ 95

ప్రతి :— హే సుందరభుజ! = ఓ సుందరభుజస్వామీ! నరహరౌ = నరసింహమూర్తివగు, త్వయి = నీవు, స్తంభే = (హిరణ్యకశిపుని దర్బారులోని) స్తంభమునందు, శుంభత్,

వపుషిసతి=శోభమాన మగు శరీరము గలవాఁడవు కాఁగా, వాయుః=గాలి, న, పస్పందే=కొంచెమైనను గదలలేదు, (భయముచేత) అథవా=తరువాత, శశిరవీ=చంద్రసూర్యులు, అస్తం, యయతుః = అస్తమించిరఁట, దిశః=దిక్కులు, అనశ్యన్=నశించినవి (ఇది తూర్పు, ఇది పడమర యని తెలిసి కొన వీలుగాలేదు) సాచలకులా = పర్వత సమూహముతోఁ గూడిన, విశ్వా = సమస్తమైన, అచలా, అపి = భూమియు, అచలత్=కంపించెను, నభః, చ=ఆకాశముగూడ, ప్రచ్యోతి =మిక్కిలి జాఱిపోయినది, పాథః అపి=సముద్రములోని నీరు కూడ, క్వథితమ్=సలసల తెర్లినది.

విశేషములు :— న వాయుః పస్పందే— శ్రీనరసింహ విగ్రహదర్శన జనితభయముచేత గాడ్పుకొంచెమును కదల లేదు. అచల దచలా— భూమి యచల యయ్యుఁ జలించెను. నరసింహదర్శన భయముచేత వ్యుత్పత్తికి విరుద్ధముగాఁ బ్రవర్తించిన దని భావము. క్వథితమపి పాథః— ఉష్ణత్వాతి శయముచే సముద్రోదకము గూడ సలసల మసలిపోయెను. ప్రహ్లాదప్రతిపక్ష శిక్షణమునకై ప్రాదుర్భవించుచున్న నరసింహ విగ్రహసాక్షాత్కారక్షణము లైన పంచభూతముల యొక్క వేగిరపాటిందు వర్ణింపఁబడినది.

తా॥ ఓ సుందరబాహుమూర్తీ! నరసింహమూర్తి వగు నీవు హిరణ్యకశిపుని సభాస్తంభమున శోభమాన శరీరము గలవాఁడవయి యావిర్భవించు చుండఁగా భయముచే గాలి

యించుకయుఁ గదలలేదు. సూర్యచంద్రులు అస్తంగతులైరి. దిక్కులు మాసినవి. చలించుటచేత సగము చెడి ప్రఖ్యాతిఁ గాంచిన భూమియుఁ గులాచలములతోఁ గూడఁ గంపించెను. మిన్నువడెను. సముద్రోదకము సలసల మసలి పోయెను. ఒకవేల సమస్త ప్రకృతియు భయగ్రస్తమై తారుమారాయెను.

మ॥ అరికుంభీంద్రముఁ జీల్చి భక్తునకుఁ బ్ర
హ్లాదునకుఁ గటాక్షించఁగా
నరసింహాకృతి నీవు స్తంభమునఁ గ
న్పట్టంగ గాఁ జూపెడ ద
ద్దిర ! చంద్రార్కులు అస్తమించిరి దెసల్
దీపింప నంభోనిధుల్
తెరలెన్ మిన్ను వడెన్ వడంకె వసుధం సా
ద్రిద్వీప ప్రజయై సుందరా !

అవతారిక :— పై విషయమునే వివరించుచున్నారు.

శ్లో॥ అకాశం పాతాళం త్రిదశనిలయః ప్రాపితలయో
ధరిత్రీ నిర్ధూతాయయు గపి దిశః కామపి దశామ్ ।
అజృంభి స్తాంభోధి "స్తనుఘు" మితి ఘూర్ణన్ సుగటనో
ర్విభిదానే వక్షస్త్వయి నరహరౌ సుందరభుజ ! ॥ 96

ప్రతి :— హే సుందరభుజ ! = ఓ సుందరబాహుస్వామీ ! నరహరౌ = నరసింహమూర్తివగు, త్వయి = నీవు, సురరిపోః = దేవవైరియగు హిరణ్యకశిపుని యొక్క, వక్షః = ఱొమ్మును,

విభిందానే (సతి) చీల్చివేయు చుండఁగా, పాతాళమ్=పాతాళ లోకము, అరాళమ్=వక్రమైనది (ఆసీత్=ఆయెను) త్రిదశ నిలయః = స్వర్గము (వేల్పులనివాసము), ప్రాపితలయః = పొందింపఁబడిన నాశనముగలది, (అభూత్=ఆయెను) ధరిత్రీ= భూమి, నిర్ధూతా = మిక్కిలి వణఁకెను, దిశః = దిక్కులు. కాం అపి=ఒకానొక, దిశమ్=విధమును, యయుః=పొందినవి, అంభోధిః=సముద్రము, ఘుముఘుమ్, ఇతి=ఘుముఘుమ్మని, ఘూర్ణన్=ధ్వనించుచు, అజృంభిష్ట =విజృంభించెను.

విశేషములు :— అరాళమ్— వ్యత్యస్తము అనఁగా ప్రకృతికిఁ దలక్రిందు. యయు రప దిశః కా మపి దిశమ్— దిక్కులు కూడ నేదోయొక దిక్కును పొందె ననఁగా అంతర్హితము లాయె నని భావము.

తా॥ ఓ సుందరబాహుమూర్తీ ! నీవు నరసింహావతార మెత్తి ప్రబలశత్రువగు హిరణ్యకశిపుని వక్షఃస్థలమును వ్రచ్చు చుండఁగా నాభయంకర దృశ్యమునకుఁ బాతాళ మరాళ మాయెను, త్రిదశనిలయము లయమును బొందెను, వసుధ వడవడ వడఁకెను, దిక్కులు తబ్బిబ్బాయెను, సముద్రములు ఘుముఘుముఘు మ్మని నినాద మొనర్చుచుఁ బొంగి పోయెనఁట.

మ॥ అలపాతాళ మరాళ మాయె విలయం
 బాయెన్ సుపర్వాలయం
బిల యెంతేని వణంకె నందె దిశలున్
 హీనాతిహీనన్ దశన్

చెలరేఁగెన్ ఘుముఘుమ్మటంచు జలధుల్
శ్రీమన్నృసింహుండపై
బలియౌ దైత్యునురమ్ము వ్రచ్చుతఱి శుం
భత్ప్రీథ వనాద్రీశ్వరా!

శ్లో॥ నఖ క్రకచక ప్రథి క్రథిత దైత్యవక్షః స్థలీ
సముత్థ రుధిరచ్ఛటాచ్ఛురిత బింబితం స్వం వపుః।
విలోక్య రుషితః పునః ప్రతిమృగేంద్ర శంకావశాత్
య ఏష నరకేసరీ స ఇహ దృశ్యతే సుందరః॥ 97

ప్రతి :— నఖ......బింబితమ్ — నఖ = గోరనెడు, క్రకచక = అంపముయొక్క, ప్రథి = అంచుచేత, క్రథిత = చీల్చఁబడిన, దైత్య = రాక్షసునియొక్క, (హిరణ్యకశిపుని యొక్క) వక్షఃస్థలీ = ఱొమ్ముప్రదేశమునుండి, సముత్థ = బయలుదేఱిన, రుధిర = నెత్తుటియొక్క, ఛటా = సమూహముచేత (ప్రవాహముచేత) ఛురిత = ప్రసక్తమై, బింబితమ్ = ప్రతిబింబించిన, స్వమ్ = స్వకీయ మగు, వపుః = శరీరమును, విలోక్య = చూచి, యః = ఏ, నరకేసరీ = నరసింహమూర్తి, ప్రతిమృగేంద్రశంకావశాత్ = ప్రతిభటమగు సింహముయొక్క శంకవలన, పునః = మఱల, రుషితః = రోషము కలవాఁడాయెనో, సః = ఆనరసింహమూర్తియే, ఇహ = ఇక్కడ, (ఈవనాద్రియందు) సుందరః = సుందరభుజస్వామిగా, దృశ్యతే = చూడఁబడుచున్నాఁడు.

విశేషములు :— ప్రతిమృగేంద్ర శంకావశాత్ — ఇది మఱల స్వామివారికి రోష మొదవుటకుఁ గారణముగాఁ

జేర్కొనఁ బడినది. సర్వజ్ఞుఁడగు నరకేసరి శత్రురక్తపూర ప్రతిబింబిత మగు తన విగ్రహమును సింహాంతరముగాఁ దలఁచుట మృగస్వభావోక్తిగా భావింపవలెను. 'స ఇహ దృశ్యతే సుందరః'— ఆనాఁడు భక్తద్వేషి యగు హిరణ్యకశిపుని వ్రచ్చిన నరకేసరియే యిచ్చట సుందరబాహుమూర్తియై ఆశ్రితద్వేషి నిరసనమునకు బద్ధకంకణుఁడై యున్నాఁడని భావము.

తా॥ గోళ్ళనెడు అంపములకొనలతోఁ జీల్చివేయఁబడిన హిరణ్యకశిపుని ఱొమ్మునుండి దొరలిన రక్తప్రవాహము నందు సంక్రాంతమై ప్రతిబింబించిన తన దేహమునే చూచి మృగేంద్ర స్వభావానుగుణముగా మఱియొక సింహమని శంకించి యేనరసింహమూర్తి మఱల రోషించెనో యా నరసింహుఁడే ఈ వనాద్రియందు నిజాశ్రిత ద్వేషుల నణఁచ బద్ధకంకణుఁడై సుందరభుజ రూపముతో నున్నాఁడు.

చ॥ శిత నఖరాంచలక్రకచ

శృంగ విదారితదైత్యరాడుర

శ్చ్యుత రుధిరప్రపూర పరి

శోభినిజాకృతిఁ జాఱఁ జూచి లోఁ

బ్రతిమృగ రాణ్మతిన్ మఱల

ఘాలనటన్భ్రుకుటీకుఁడైన శ్రీ

పతి యలనారసింహుఁ డిట

భాసిలు సుందరబాహునాముఁడై.

శ్లో॥ క్షితి రియం జనిసంహృతిపాలనై
ర్నిగిరణోద్గిర ణోద్ధరణై రపి ।
వనగిరీశ ! త వైవ సతీ కథం
వరద ! వామన ! భిక్షణ మర్హతి ॥ 99

ప్రతి :— (సే॰) వరద != అందఱికి నన్నివరముల నిచ్చు వాఁడా !, వామన ! == వామనరూపధారీ ! వనగిరి, ఈశ != వనగిరినాథుఁడ వగు సుందరభుజస్వామీ ! జని, సంహృతి, పాలనైః = సృష్టిసంహార, రక్షణముల చేతను, నిగిరణ, ఉద్గిరణ, ఉద్ధరణైః, అపి = మ్రింగుట, క్రక్కుట, ఉద్ధరించుటల చేతఁ గూడ, తవ, ఏవ = నీకే, సతీ = భార్య (ద్రవ్యభూత) అగు, ఇయమ్ = ఈ, క్షితిః = భూమి, కథం వా = ఎట్లుగా, భిక్షణమ్ = భిక్షను (ఒకరివలన యాచించుటను గూర్చి) అర్హతి = యోగ్యమగు చున్నది.

విశేషములు :— వామన !— బలిచక్రవర్తియొద్ద నుండి మూఁడడుగుల నేల నడుగుట కొఱకు స్వీకరింపఁబడిన వామన వేషము గలవాఁడా ! 'నిగిరణోద్గిరణోద్ధరణైః' — నిగిరణ మనఁగాఁ బ్రళయమునందు స్వకుక్షిలో నిడుకొనుట, ఉద్గిరణ మనఁగా, సముద్రమధ్యము నుండి లేవనెత్తుట నీనిచేత 'త్వవైవ సతీ కథం వరద వామన భిక్షణ మర్హతి'— వామనరూపి వగునో దేవా ! పరద్రవ్యముగ నా బిచ్చమెత్తఁ దగినది పై కారణములచేత నీద్రవ్యమేయైన భూమి నెందులకు బిచ్చమెత్తితివి ? (సశేషము)

నీ వామనవృత్తాంతముచేత నాశ్రితుల కద్భుతగులు వారికిఁ గూడ మేలుకలిగింపవలసి వచ్చినపుడు తదనుగుణముగా నవత రించి వారల నందలించుట శ్రీవారి కభిమతమని తెలియు చున్నది. సత్పాత్రుఁడవగు నీకు మూఁడడుగులనేల నిచ్చుట చేతనే గదా బలి పాతాళలోకమునకుఁ జక్రవర్తి యయ్యెను.

తా॥ వరదా! వామనరూపి వగు శ్రీ సుందరబాహు దేవా! సృష్టిసంహార రక్షణములచేతను, ప్రళయమునఁ బొట్టలో నిడుకొని సృష్టికాలమున బైటికిఁబంపి సముద్రమునుండి లేవ నెత్తి కాపాడుటచేతను ఈభూమి నీసతియు సొత్తునై యుండ దీనిని బలిచక్రవర్తి నుండి బిచ్చమెత్తుట యెట్లు పొసంగును పరద్రవ్యమును గదా! లోకమున బిచ్చమెత్తుదురు!

గీ॥ జనన సంహారరక్షణ సర్వవిధుల
నిగిరణోద్గిరణోద్ధార నియమములను
నేల నీభార్య భిక్షింప నేల బలిని?
వామనాకార! వరద! శ్రీవనగిరీశ!

శ్లో॥ భార్గవః కిల భవన్ భవాన్ పురా
కుంద సుందరవనాచలేశ్వర!
అర్జునస్య బలదర్పితస్య తు
చ్ఛేత్స్యతి స్మరతి బాహుకాననమ్ ॥ 99

ప్రతి :— (హే) కుందసుందర వనాచల, ఈశ్వర! = మల్లెలచేత నందమగు వనగిరికిఁ బ్రభువవగు ఓ సుందరభుజ స్వామీ!, పురా, కిల = పూర్వము, భార్గవః = పరశురాముఁడవు, భవన్ = అగుచు, భవాన్ = నీవు, బల, దర్పితస్య = బాహుబలముచేత గర్వితుఁడగు, అర్జునస్య = కార్తవీర్యార్జునునియొక్క, బాహుకాననం, తు = వనమునుబోలు వేయి బాహువులను, ఛేత్స్యతి = ఛేదించితివి, స్మరతి? = జ్ఞప్తి యున్నదా?

విశేషములు :— ఛేత్స్యతి స్మరతి బాహుకాననమ్— అనేక క్షత్త్రియయూథముల సంహరించుటకంటెను బాహుబల దర్పితుఁడగు కార్తవీర్యార్జుని బాహుకాననమును ఛేదించుట యతి దుష్కరమని భావము.

తా॥ మల్లెతీఁగలచే నందమగు వనాద్రికి నాథుఁడవగు శ్రీ సుందరభుజస్వామీ! పూర్వము శ్రీవారు పరశురామావతారమెత్తి బాహుబల గర్వితుఁడగు కార్తవీర్యార్జుని బాహుకాననమును ఛేదించిన విషయము జ్ఞప్తియున్నదా?

ఉ॥ కుందమనోజ్ఞ వల్లరుల
కున్ నెల వౌవనశైల మేలునో
సుందరబాహుమూర్తి! గుణ
శోభిత! మున్ జమదగ్ని పట్టివై
తందర లేక బాహుబల
దర్పితుఁడౌ కృతవీర్యపుత్రుని

ష్పంద భుజాటవిన్ నఱకి
వైచితి గొడ్డట జ్ఞప్తి యున్న దే.

శ్లో॥ ఆజ్ఞా తవాత్ర భవతీ విదితా త్రయీ సా
ధర్మం తదుక్త మఖిలేన వనాద్రినాథ!
అన్యూన మాచరితు మాస్తికశిక్షణార్థ
మత్రావతీర్య కిల సుందర! రాఘవోఽభూః॥ 100

ప్రతి :— వనాద్రి, నాథ!=వనగిరిప్రభువు వగు, సుందర!= సుందభుజస్వామీ!, అత్రభవతీ=పూజనీయయగు, సా=ఆ, త్రయీ=వేదత్రయము, తవ = నీయొక్క, ఆజ్ఞా=ఆజ్ఞగా, విదితా=ప్రసిద్ధమైనది, తత్, ఉక్తమ్=ఆవేదత్రయమందుఁ జెప్పఁబడిన, ధర్మమ్ = ధర్మమును, ఆస్తిక, శిక్షణార్థమ్= శాస్త్రవశ్యుల శిక్షకొఱకు, అఖిలేన=ఖిలముగాకుండ, అన్యూనమ్=అంగవైకల్యము లేకుండ, ఆచరితుమ్=ఆచరించుటకు, అత్ర=ఇచ్చట (అయోధ్యయందు) అవతీర్య = అవతరించి, రాఘవః=రాముఁడవు, అభూః, కిల=అయితివఁట.

విశేషములు :— అత్రభవతీ— ఈశబ్దము పూజ్యార్థకము. ప్రమాణము లన్నింటిలో 'త్రయి' శ్రేష్ఠమైనది గనుకఁ బూజ్య యని చెప్పఁబడెను. 'త్రయీ'— ఋగ్యజుస్సామ వేదములకుఁ గలిపి త్రయి యని పేరు. ఆస్తికశిక్షణార్థమ్— వేదములు దురవగాహములు గనుక వానిచేఁ జెప్పఁబడిన ధర్మము లందఱికిఁ దెలియక పోవుటవలన నవి ఖిలముగాకుండ అంగ వైకల్యము లేకుండ నాచరించి చూపి యాస్తికులకు శిక్ష యొసంగుటకు, 'అత్రావతీర్య కిల సుందర రాఘవోఽభూః'—

'రామో విగ్రహవాన్ ధర్మః' అన్నట్లు పితృవచన పరిపాలన, శరణాగత సంరక్షణాది సకలధర్మ వ్యవస్థాపకుఁడవై రాముఁడని ప్రసిద్ధిఁ బొందితివి.

తా॥ వనగిరినాథుఁడవగు ఓ సుందరబాహుమూర్తీ ప్రమాణోత్తమముగాఁ బూజనీయమగు వేదత్రయి దేవర వారి యాజ్ఞగాఁ బ్రసిద్ధి కెక్కినది. దానిచేఁ జెప్పఁబడిన ధర్మము ఖిలముగాకుండ సంగలోపము లేకుండ నెల్లరు నాచరించుటకు ఆస్తిక మహాశయులకు శిక్షణ మొసంగుటకు 'రామో విగ్రహవాన్ ధర్మః' అన్నట్లు నీవు శ్రీరాముఁడవై యవతరించి యాచరించి చూపితివి.

ఉ॥ పూజిత వేదవాక్కు వన
భూధర భూషణ! తావకాజ్ఞగా
భూజను లెన్నుచుందు రటఁ
బొల్చెడు ధర్మము నార్యశిక్షకై
యీ జగమందు నీవు జని
యించి యథావిధి నాచరించుచున్
రాజకులావతంస మగు
రాముఁడ వైతివి ధర్మమో! యనన్.

శ్లో॥ వనగిరిపతి రేష లేతి దేవై
స్త్రిపురహర త్రిపురఘ్న చాపభంగాత్ ।
స్వగణి పరశురామ దర్పితస్య
స్వకధనుషః పరిమర్ద్యదర్పహా చ్ఛ ॥ 101

ప్రతి :— దేవైః= దేవతలచేత, త్రిపురహార, త్రిపురఘ్న, చాప, భంగాత్ =రుద్రునియొక్క, త్రిపురసంహార మొనర్చిన ధనుస్సును విఱుచుటవలనను, పరశురామ దర్శితస్య=పరశు రామునిచేతఁ జూపఁబడిన, స్వకధనుషః=స్వీయమగు వైష్ణవ ధనుస్సుయొక్క, పరిమర్శ, దర్శనాత్, చ = అవలీలగా నెక్కిడుటను జూచుటవలనను, వనగిరిపతిః = వనాద్రినాథుఁ డగు సుందరభుజస్వామి, ఈశితా = సర్వేశ్వరుఁడు, ఇతి = అని, వ్యగణి = పరిగణింపఁ బడినది (నిర్ణయింపఁ బడినది)

విశేషములు :— 'త్రిపురహార త్రిపురఘ్న చాప భంగాత్'— ఈశ్వరుఁడు త్రిపురసంహార మొనర్చిన వింటిని భక్తుఁడగు జనకుని కొసఁగెను. ఆమహారాజు సీతాపరిణయ పరిపణమునుగా నాధనుస్సు నేర్పాటు చేసెను. శ్రీరాముఁడు దాని నవలీలగా విఱిచెను. ఈకథ నిట ననుసంధించుకొన వలెను. 'వనగిరిపతి రీశి తేతి దేవైః (వ్యగణి) శ్రీరాముఁడు 'ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్' అని నిజమాహాత్మ్యము నెంతదాఁచఁ దలఁచినను అది శివ ధనుర్భంగము వలనను, పరశురాముని వైష్ణవధనుస్సు నెక్కు పెట్టుట వలనను, దెల్ల మయ్యెనని భావము.

తా॥ వనగిరినాథుఁడగు సుందరబాహుమూర్తి శ్రీరా ముఁడుగా నవతరించి తా నెంతగా మానవత్వము నభినయింపఁ జూచినను త్రిపురసంహార మొనర్చిన శివునివిల్లు విఱుచుట వలనను, పరశురామదత్త మగు వైష్ణవధనుస్సు నవలీలగా

నెక్కు పెట్టుటచేతను వేల్పులు పరాత్పరునిగాను సర్వేశ్వ రునిగా నిర్ణయించిరి.

చ॥ వనగిరినాథుఁ డింపు రఘు
వల్లభుఁడై జనియించి యుండెఁగా
మనుజతఁ జాటు నొందిన స
మస్త్యు తెలిసెంగిరి తత్పరత్వమున్
దునియలు సేయుటన్ ముదల
ధూర్జటి చాపము, 'నెక్కు పెట్టు మీ
ధను'వని భార్గవుం డొసఁగఁ
దత్క్షణమే హరివిల్లు వంచుటన్.

శ్లో॥ అనవాప్త మత్ర కిల లిప్స్యతే జనై
ర్నచ లబ్ధమేత దిహ భోక్తు మిష్యతే ।
అనవాప్త మత్ర కిల నాస్తి రామ ! త
జ్జగతీ త్వయా తృణమపైక్షి సుందర ! ॥ 102

ప్రతి :— (హే) రామ ! సుందర ! = (శ్రీ) రాముఁడవుగా నవతరించిన యో సుందరబాహుస్వామీ ! అత్ర = ఈలోకమున, జనైః = జనులచేత, అనవాప్తం, కిల = పొందఁబడనిది గదా, భోక్తుమ్ = అనుభవించుటకు, లిప్స్యతే = కోరఁబడుచున్నది. ఇహ = ఇక్కడ, భోక్తుమ్ = అనుభవించుటకు, లబ్ధమ్ = పొందఁబడిన, ఏతత్ = ఈ వస్తువు, (ఈ వాంఛిత వస్తువు) న చ, ఇష్యతే = ఇష్టము కాదు, అత్ర = ఈలోకము నందు, అనవాప్తమ్ = పొందఁబడనిది, నాస్తి కిల = లేదు

గదా, తత్ = అందువలన (అవాప్తసమస్త కాముఁడవు గనుక) త్వయా = నీచేత, జగతీ = భూమి, తృణమ్ = గడ్డిపఱకగా, అన్వైక్షి = చూడఁబడినది.

విశేషములు :— 'నచ లబ్ధమేత దిహ భోక్తు మిష్యతే'— లబ్ధమగు వస్తువు ననుభవించుట కిష్ట ముండదు. సిద్ధవస్తువు కనుక, తృణ మన్వైక్షి— గడ్డిపఱకవలె నల్పముగాఁ జూడఁబడినది. ఉభయ విభూతి నాయకుఁడవగు నీకు ఇక్ష్వాకు రాజ్య మత్యల్పముగాఁ దోఁచినది. లేకున్నచో రాజ్యమును వీడుట సంభవింపదు.

తా॥ శ్రీరాముఁడవుగా నవతరించిన యో సుందరబాహు మూర్తి! ఈలోకమున జనులు లభించని వస్తువు ననుభవింపఁ గోరుదురు. కోరఁబడిన యీ వస్తువు లభించెనేని సిద్ధమగుటచే దానియందు నిష్టముండదు. అవాప్త సమస్తకాముఁడవగు నీకిక్కడ ననవాప్త మేదియు లేదు. కనుక నుభయవిభూతి నాయకుఁడవగు నీకు భూమి (కోసలరాజ్యము) గడ్డిపఱకగాఁ దోఁచినది.

ఉ. రాముఁడవై జనించిన ప
రాత్పర! సుందరబాహుమూర్తి! దే
వా! మహిఁ గోరుచుందు రన
వాప్తము సద్ది లభింపఁ దానిపైఁ
బ్రేమము వోవుఁ జెంతఁ గని
పించుట నీకు ననాప్త మున్నదే?

కోమలదేహా! దానగద!
కోసలలక్ష్మి తృణంబు నీమదిఁ.

శ్లో॥ శిఖరిషు విపినేష్వ ప్యాపగా స్వచ్ఛతోయా
స్వనుభవసి రసజ్ఞో దండకారణ్యవాసాన్ ।
త దిహ తదనుభూతౌ సాభిలాషోఽద్య రామ !
శ్రయసి వనగిరీంద్రం సుందరీభూయ భూయః ॥ 203

ప్రతి :— (హే) రామ! = ఓ రాముఁడ!, రసజ్ఞః = రసికుఁడవగు నీవు, శిఖరిషు = చిత్రకూటాది పర్వతములందును, విపినేషు = వనములందు, అచ్ఛతోయాసు = నిర్మలములగు నీరుగల, ఆపగాసు, అపి = నదులయందును, దండకారణ్యవాసాన్ = దండకావనము నందలి నివాససుఖములను, అనుభవసి = అనుభవించుచున్నావు, తత్ = అందువలన, తత్ + అనుభూతౌ = వానిని (కొండలను, అడవులను, నదులను) అనుభవించుటయందు, సాభిలాషః = కోరికతోఁ గూడినవాఁడవగుచు, ఇహ = ఈ జగత్తునందు, అద్య = ఇప్పుడు, భూయః = మఱల, (రామావతారానంతరము గూడ) సుందరీభూయ = సుందరభుజస్వామి వయి వనగిరీంద్రమ్ = నూపురాపగతో నొప్పు వనశైలరాజమును, ఆశ్రయసి = ఆశ్రయించుచున్నావు.

విశేషములు :—'అనుభవసి రసజ్ఞో దండకారణ్యవాసాన్' శ్రీరామా! నీరసికత్వము లోకోత్తరము. దండకావనవాసమును సుఖకరముగా ననుభవించితివి. ఇటఁ గొండలయందు

వనములందు నిర్మలతోయములుగల నదులందు విహరించితివి గాని శ్రమపడలేదు. వనవాసమును సుఖముగా మార్చుకొన్న నీవే రసికుఁడవు. ఇందులకుఁ బ్రమాణము – శ్రీమద్రామాయణమున—

శ్లో॥ చిత్రకూట మనుప్రాప్య భరద్వాజస్య శాసనాత్
రమ్య మావసథం కృత్వా రమమాణా వనే త్రయః
దేవగంధర్వ సంకాశా స్తత్ర తే న్యవసన్ సుఖమ్ ॥

అనుభవసి :— 'చిరనిర్వృత్త మ ప్యేతత్ ప్రత్యక్ష మివ దర్శితమ్'— చాలకాలము క్రింద ననుభవింపఁ బడినదికూడఁ గళ్ళకుఁ గట్టినట్లు వర్ణించుటవలన వర్తమానకాల క్రియ యుపయోగింపఁ బడినది. తదనుభూతౌ సాభిలాషః— శిఖరివిపిన స్రవంతీ సుఖానుభవమునఁ గోరిక గలవాఁడవై. 'అద్య'— వర్తమానకాలమున— 'భూయః'— మఱల – రామావతారానంతరముకూడ. 'శ్రయసి వనగిరీంద్రం సుందరీభూయ'— శ్రీరాముఁడు నాఁడు చిత్రకూటము నాశ్రయించినట్లు సుందబాహుమూర్తి! నీవు నేఁడు వనగిరిరాజము నాశ్రయించు చున్నావని భావము. 'సుభగ శ్చిత్రకూటోఽసౌ । గిరిరాజోపమో గిరిః యస్మిన్ వసతి కాకుత్స్థః కుబేర ఇవ నందనే' అని వర్ణింపఁ బడిన చిత్రకూట పర్వతముతో ఈవనశైలము సమానమని సారాంశము.

తా॥ శ్రీరామా! నీ వెంతయు రసికుఁడవు. చిత్రకూటాది పర్వతములందు, వాని యనుబంధులగు వనములందు, మాల్య

వంతము నందలి నిర్మలోదకములగు మందాకినీ సంపాతనముల యందును విహరించుచు దండకారణ్యావాసము సుఖగూసముగా మార్చుకొనినావు. అందువలన నిచ్చట నాయనుభూతియం దభిలాషతో రామావతారానంతము గూడ మఱల సుందర భుజస్వామివై నూపురాపగతో నొప్పు వనగిరిగాజము నాశ్ర యించు చున్నావు.

శా. రామా! నీవు రసజ్ఞ శేఖరుఁడ వౌ
రా! కొండలన్ గానలన్
భూమీహారనిభంబులౌ తటినులన్
భోగించి తౌ దండకన్
నేమం బొప్ప వసించునాళ్ళ సుఖ మా
నెయ్యంబుఁ బాయంగ లే
కేమీ చేరితి సుందరుండ వయి నేఁ
డీకాననాహార్యమున్.

అవతారిక :— దండకావనవాస మొక్కొక్కచోట శ్రమ విశేషమును గలిగించినది. వనగిరినివాస మట్టి శ్రమలను హరించినది యని చెప్పుచున్నారు.

శ్లో॥ ఉపవనతరుషండై ర్మండితే గండశైల
ప్రణయిభవదుదంతో ద్గాయిగంధర్వసిద్ధే ।
వనగిరితట భూమిప్రస్తరే సుందర ! త్వం
భజసి ను మృగయాసానుద్రవ శ్రాంతిశాంతిమ్ ॥ 105

ప్రతి :— హే సుందర ! = ఓ సుందరబాహుమూర్తీ ! ఉపవన, తరు, షండై ః= ఉద్యానవనము నందలి చెట్లగుబురుల చేత, మండితే=అలంకరింపఁ బడినట్టియు, గండ......సిద్ధే— గండశైల = కొండలనుండి జాఱిపడిన పెద్దబండలయందు, ప్రణాయి = ప్రేమగలిగి నట్టియు, భవత్ = తమరియొక్క, ఉదంత=చరితమును, ఉత్, గాయి=పెద్దగా గానముచేయు స్వభావముగల, గంధర్వసిద్ధే = గంధర్వులు సిద్ధులు గలిగి నట్టియు, వనగిరి, తట, భూమి, ప్రస్తరే=వన్యశైలముయొక్క సానుతలసన్నిహిత శిలయందు, త్వమ్=నీవు, మృగ.........శాంతిమ్— మృగ=మాయలేడియొక్క, యాన=గమనమును, అనుద్రవ = అనుసరించి పరుగెత్తుటవలని, శ్రాంతి = అలుపు యొక్క, శాంతిమ్=తీర్చుకొనుటను, భజసి, ను = పొందు చున్నావో ! యన్నట్లున్నావు.

విశేషములు :— ఇందలి యుత్తరార్థము సారాంశమిది. ఓ సుందరభుజస్వామీ ! నీవు రామావతారమునఁ గాంతార వాసమున మాయలేడి వెంబడి పరువెత్తినందు వలనఁ గలిగిన శ్రమను సిద్ధగంధర్వగాన మనోహరమగు వనాద్రితటమునఁ దీర్చుకొనుచున్నట్లున్నావు. దండకారణ్యావాసమున మృగాను ధావనశ్రమను వనాద్రి పోఁగొట్టిన దనుటచే వనగిరి యతి శయము వెల్లడి యగుచున్నది. భజసినుఁ— ఇందలి 'ను' అను నవ్యయము ఉత్ప్రేక్షాద్యోతకము.

తీరమున, నివసన్ = నివసించుచు (త్వమ్ = నీవు) దూర, ఉత్తర, అంభోధిగాన్ = దూరమందున్న యుత్తరసముద్ర ద్వీపమును జొచ్చిన, దైత్యాన్ = రాక్షసులను, ఏకపత్త్రిణా = ఒకటే బాణముతో, అచ్ఛినః, కిల = ఛేదించితివఁట, ఇతి = అని, ఇయమ్ = ఈ, కింవదంతీ = వార్త, శ్రుతా = వినఁబడినది. (రామాయణమున) తత్ర, ఏవ = ఆదక్షిణాబ్ధితీరముననే, అంభసామ్ = నీరములకు, ఈశ్వరమ్ = ఈశ్వరుఁడగు సముద్రుని, వ్యజయథాః = గెలిచితివి, తస్మాత్ = అందువలన, తవ = నీకు, సేతుబంధనముఖాః = సేతువు (వంతెన) కట్టుట మున్నగు, క్రీడాః = ఆటలు, ఆడంబరమ్ = ఖ్యాతికొఱకగు వ్యాపారము.

విశేషములు :— 'సేతుబంధనముఖాః క్రీడాస్తవాడంబరమ్'— ఒకే యొక బాణముచేత నుత్తరసముద్ర ద్వీపములో నున్న రక్కసిమూఁకను ద్రుంచిన నీకు నిక్కడ నుండియే లంకాద్వీపము నందలి రాక్షసనిర్మూలనము సులువై యుండ సాగరుని శరణాగతుఁ జేసికొని సేతునిర్మాణ మొనర్చి రావణ వధ మొనర్చుట మున్నగు నీ లీలలు లోకవిఖ్యాతి కొఱకు అని హృదయము.

తా॥ వనాద్రినాథుఁడ వగు నోసుందర బాహుమూర్తీ ! నీవు దక్షిణసముద్రతీరమున నివసించుచు నెంతో దూరమగు నుత్తర సముద్రద్వీపమున నున్న రాక్షసకోటుల నొక్కకోలచేతనే ఛేదించితి వని కింవదంతిని శ్రీమద్రామాయణమున విని యున్నాము. అంతేకాదు అచ్చటనే యుండి సాగరము చేతఁ

పురా = మునుపు, జాతుచిత్ = ఒకప్పుడు, యాతుధాన, ఛలమృగ, మృగయాయామ్=రాక్షసుఁడనెడు మాయలేడి యొక్క వేటయందు, సంప్రసక్తః=బాగుగా నాసక్తి గలవాఁడవు, అభూః=అయితివి, తత్, ఉపజనిత, ఖేద, ఛేదనాయ= దానివలనఁ బుట్టినశ్రమను బోఁగొట్టుకొనుట కొఱకు, అద్య= ఇప్పుడు, గాయత్, మధుకర, తరుషండమ్=ఝుంకరించుచున్న తుమ్మెదలు గల చెట్లగుబురు గల, వనాద్రిమ్=వనశైలమును, (గూర్చి) రజ్యసే, కిమ్=అనురక్తుఁడవగు చున్నావా ?

విశేషములు :— 'యాతుధానచ్ఛల మృగమృగయా యామ్' అది నిజముగా మృగముగాదు. మాయలేడి, లోకములో బంగారులేడి నెవ్వరును వినలేదు కనలేదు. 'న చ శ్రుతో నైన చ దృష్ట పూర్వో । లోకే క్వచి ద్ధేమమయః కురంగః'— అట్లయిన నెవరు? యాతుధానః— రాక్షసుఁ డగు మారీచుఁడు. మృగయాయామ్— తత్సంహారమునకు అనుగుణ మగు వ్యాపారమునందు రజ్యసే, కిం వనాద్రిమ్— ఆనాఁటి మాయలేడి వెంటఁ బరుగెత్తిన యాయాసమును దీర్చుకొను చున్నావా ? అను ప్రశ్నచేత వనగిరి భోగ్యతాతిశయము ధ్వనితమగు చున్నది.

తా॥ రఘువంశాలంకారభూతుఁడ వగుకో శ్రీరామా ! నీ వానాఁడు మాయలేడి యైన మారీచునివెంట మృగము వెంట మృగయునివలెఁ బరుగెత్తుట వలనఁ గలిగిన శ్రమను దీర్చుకొనుట కొఱకుఁ బూఁదేనెలఁ గ్రోలి ఝుమ్మని గాన

మొనర్చుచున్న తుమ్మెదలతో నొప్పు పూఁజెట్ల గుబురులతో నిండిన వనశైలము నెన్నుకొంటివా ?

ఉ. ఓ రఘువంశ మౌక్తికమ !

యుజ్జ్వల సోమసృగంబు వెంటఁ గాం

తారమునందుఁ బర్విడిన

తచ్ఛ్రమ మిప్పుడు దీర్పఁగో మనం

బై గసఁ లోలమత్త మధు

పారవ గానకళాభిరామ భా

స్త్రీరుహషండమండితము

దివ్యవనాచల మెన్నుకొంటివా ?

శ్లో॥ హే సుందరైకతరజన్మని కృష్ణభావే
ద్వే మాతరౌ చ పితరౌ చ కులే అపి ద్వే ।
ఏకక్షణా దనుగృహీతవతః పరం తే
నీలా కులేన సదృశీ కిల రుక్మిణీ చ ॥ 107

ప్రతి :— హే సుందర ! = ఓ సుందరబాహుస్వామీ ! ఏకతరజన్మని = ఒక యవతారమునందు, కృష్ణభావే = కృష్ణుండవైనప్పుడు, (ద్వే = ఇద్దఱు) మాతరౌ = తల్లులను, (దేవకీ యశోదలను(ద్వౌ = ఇద్దఱు) పితరౌ, చ = తండ్రులను (వసుదేవ నందగోపులను) ద్వే = రెండు, కులే, అపి = కులములనుగూడ, (క్షత్రియకుల నందగోపకులములను) ఏకక్షణాత్ = ఒకక్షణముననే, పరమ్ = మిక్కిలి అనుగృహీతవతః = అనుగ్రహించినట్టి, తే = నీకు, రుక్మిణీ = క్షత్రియకన్య యగు రుక్మిణీదేవి, నీలా చ = నీలాదేవియు, కులేన = వంశముచేత, సదృశీ, కిల = తగినది కదా !

విశేషములు :— ఏకక్షణాత్ =స్వల్పకాలములో, 'నీలా కులేన సదృశీ కిల రుక్మిణీ చ'— మాతృకుల మగు క్షత్రియ కులమునకుఁ దగినభార్య రుక్మిణి యనియు, తండ్రికుల మగు గోపకులమునకుఁ దగినభార్య నీల యనియు భావము. నీవు భిన్నభిన్న కులములలోఁ బుట్టిన పత్నీద్వయమును బరిగ్రహించుటకొఱకే రెండు కులములను అనుగ్రహించితి వని సారాంశము.

తా॥ ఓ సుందరబాహుమూర్తీ ! నీ వొక జన్మమునఁ గృష్ణుఁడ వైనప్పు డిద్దఱుతల్లుల నిద్దఱుతండ్రుల రెండుకులముల నొకక్షణములో నాదరపూర్వకముగాఁ బరిగ్రహించుట తల్లి కులమగు క్షత్రియకులమున కుచిత యగు రుక్మిణీదేవిని, తండ్రి కులమగు గోపకులమున కనుగుణ యగు నీలాదేవిని భార్యలను గాఁ బడయుటకే గదా !

ఉ॥ సుందరబాహా ! నీవు వ్రజ
సుందరరూపుఁడవై జనించిన
ట్టందఱు మెచ్చఁగా నిరువు
రమ్మల నయ్యల నన్వయంబులన్
బొంద నొకేక్షణాన నటు
పూనుట క్షత్త్రియకన్య భీష్మరా
ణ్ణందన గొల్లవంగడపు
నాతిని నీలను బెండ్లియాడనా ?

(26)

శ్లో॥ త్వం హి సుందర ! యదా స్తనంధయః
పూతనా స్తన మధా స్తదా నుకిసః ।
జీర్ణ మేవ జఠరే పయోవిషం
దుర్జరం వద తదాత్మనా సహ ॥ 108

ప్రతి :— సుందర != ఓ సుందరబాహుస్వామీ ! త్వమ్= నీవు, యదా, హి =ఎప్పుడైతే, స్తనంధయః (సన్)=పాలు త్రాగువాఁడవగుచు, (పసివాఁడవై) పూతనా స్తనమ=పూతన యొక్క, స్తనమును, అధాః = గ్రోలితివో ! తదాను = అప్పుడు, దుర్జరమ్ = (ఇతరులచేత) జీర్ణము చేసికొన శక్యముకాని, పయోవిషమ్=పాలరూపముతోనున్న విషమును, తదాత్మనా, సహ = తత్, అపూతనయొక్క, ఆత్మనా, సహ=జీవముతోఁ గూడ, జఠరే = ఉదరమునందు, జీర్ణం, ఏవ, కసు = జీర్ణము చేసికొనఁబడినదా ? వద చెప్పుము.

విశేషములు :— వద=నీచేతనే ప్రత్యుత్తర మీయఁ బడవలెను, అనఁగా- పాలుత్రాగు ప్రాయమునందే పూతనా ప్రాణములతోఁబాటు ఇతరులు జీర్ణించుకొనలేని యారక్కసి స్తనవిషమును జీర్ణము చేసికొనిన బాలుఁడవు నీవేనా ? ఈ శంకను దీర్పుమని భావము.

తా॥ ఓ సుందరబాహుస్వామీ ! నీవు పాలుత్రాగు పసివాఁడవై యున్నప్పు డితరులు జీర్ణించుకొనలేని పూతనా స్తనమును గ్రోలినప్పుడు ఆ రక్కసి పాలరూపుననున్న విషమును ఆమె ప్రాణములతోఁబాటు జీర్ణించుకొంటివా ? ఈ శంకను దీర్పుము.

ఉ॥ చేతులలోని బిడ్డ వయి
  క్షీరముఁ ద్రావెడు లేఁతయీడునన్
బూతనచంటి నోవిపిన
  భూధర వల్లభ! క్రోలి తంటగా!
ఆతటి నన్యదుర్జరము
  నైన తదుగ్రపయో విషంబు త
ద్ధాతుకి జీవమున్ సమము
  గా నుదరంబున జీర్ణమయ్యెనా?

శ్లో॥ ఆశ్రయేషు సులభో భవన్ భవాన్
మర్త్యతాం యది జగామ సుందర!
అస్తు నామ త దులూఖలే కియ
ద్దామ బద్ధ ఇతి కిం తదాఽరుదః॥ 109

ప్రతి :— సుందర! = ఓ సుందరభుజస్వామీ! భవాన్ = నీవు ఆశ్రయేషు = ఆశ్రితుల విషయమున, సులభః = సులభుఁడవు, భవన్ = అగుచు, మర్త్యతామ్ = మానవత్వమును, జగామ, యది = పొందితివేని, తత్ = అది (అమర్త్యత్వము) అస్తునామ = అగుఁగాక, తదా = అప్పుడు, ఉలూఖలే = ఱోటి యందు, కియత్, దామ, బద్ధః, ఇతి = చిన్నిత్రాటిచేత బంధింపఁబడితినని, కిమ్ = ఎందులకు, అరుదః = ఏడ్చితివి? (లేదా) దామబద్ధః ఇతి = త్రాటచేఁ గట్టఁబడితినని, కియత్ = ఎంతోసేపు, ఎంతోపెద్దగా, అరుదః = ఏడ్చితివి, కిం = ఎందుకు.

విశేషములు :— ఆశ్రయేషు సులభో భవన్' ఆశ్రయము చేత ఫలార్థము పరిచరణీయోగ్యుఁడ వగుదు, 'మర్త్యతాం యది జగామ'— మర్త్యం యోగ్యా మర్త్యాః (మరణింపఁ దగినవారు) అనుప్రవృత్తికిఁ దగినట్లు మర్త్యత్వమును బొందితి వేని, 'అస్తు నామ తత్'— దేవరవారిచే సంకల్పింపఁబడిన సౌలభ్యమున కనుకూల్యమైన యీమర్త్యత్వము కలుగుట మంచిదే కదా! అప్పుడు రోటి కేమాత్రపుత్రాటితోనో తల్లి కట్టివేసినదని యంతసేపు అంత పెద్దగా నేల యేడ్చితివి? శృంఖల బంధనము నీ యాశ్రిత సౌలభ్యమున కత్యంతానుకూల మని సంతోషింపఁ వలసిన సమయమున నీ వట్లు దుఃఖించుట శంకను గలిగించుచున్న దని భావము. వెనుకటి శ్లోకమున 'జీర్ణ మేవ జరఠే పయోవిషమ్' అను ప్రశ్న పరత్వసూచకము. ఈ శ్లోకమున 'కిం తదాఽరుదః' అను ప్రశ్న సౌలభ్యసూచక మని తెలియవలెను.

తా॥ ఓ సుందరభుజస్వామీ! ఆశ్రితసౌలభ్యము కొఱకు దేవరవారు మర్త్యత్వమును స్వీకరించుట నిజసంకల్పమున కనుగుణమై యుండ నాఁడు ఒకరోటి కేమాత్రపుత్రాటితోనో కట్టఁబడితినని యంతగా నేడ్వ నేల?

ఉ॥ ఆశ్రితకోటికిన్ సులభ
తాతిశయార్థము నీవు మర్త్యగా
పాశ్రయణం బొనర్చి తది
యంతయు నీకృతి కొప్పిదంబె కా!

ఏశ్రమ మబ్బె నీకు నొక
యించుకత్రాటను ఱోటఁ గట్టఁగా
నశ్రులు కాల్వలై పరఁగ
నవ్విధి నేడ్వఁగ నేల సుందరా !

శ్లో॥ సుందరోరుభుజ నందనందన
స్త్వం భవన్ భ్రమరవిభ్రమాలకః ।
మందిరేషు నవనీతతల్లజాన్
వల్లవీధియ ముత వ్యచూచురః ॥ 110

ప్రతి :— సుందర ! ఉరు, భుజ ! = అందములగు గొప్ప భుజములుగల యోసుందరబాహుస్వామి ! భ్రమర, విభ్రమ, అలకః = తుమ్మెదలయొక్క విలాసములవంటి విలాసములుగల ముంగురులు గలిగిన, నందనందనః = గోపకుమారుఁడవు, భవన్ = అగుచు, త్వమ్ = నీవు, మందిరేషు = గొల్లలయిండ్లలో, నవనీతతల్లజాన్ = శ్రేష్ఠములగు వెన్నలను, ఉత = లేక, వల్లవీధియమ్ = గోపికలబుద్ధిని, వ్యచూచురః = దొంగిలించితివా ? (లేక రెండిటిని దొంగిలించితివా ?)

విశేషములు :— 'నవనీతతల్లజాన్' ఇచ్చటఁ దల్లజ శబ్దము శ్రేష్ఠవాచకము. ఇందలి యుత్తరార్థముయొక్క సార మిది. ఓ సుందరబాహుస్వామీ ! అత్యంతకాంత దివ్యమంగళ విగ్రహముతో నీవు నందనందనుఁడవై నవనీతాపహరణ మొనర్చుట గోపీజనముయొక్క మనోఽపహరణమునకాయెను. నీ వెన్న దొంగతనము నీ సౌందర్యమును దిలకించుచున్న గోపాంగనల కెంతయు ముచ్చట గొల్పెను. అని తాత్పర్యము.

తా॥ ఓ సుందరబాహుస్వామీ! తుమ్మెదలవంటి నల్లని ముంగురులతో నీవు నందగోపకుమారుఁడవై నప్పుడు గోపికా మందిరములందు మంచిమంచి వెన్నముద్దల దొంగిలించితివా? లేక గొల్లయిల్లాండ్ర యుల్లములను ప్రముచ్చిలించితివా? లేక యూరెండిటిని గొల్లఁ గొట్టితివా?

ఉ॥ అల్ల యశోద బిడ్డనయి
నప్పుడు కాననశైల వల్లభా!
నల్లని గండుతుమ్మెదల
నైగనిగల్ గల ముంగురుల్ విగా
జిల్లెడు మోముతోడ వ్రజ
సీమల వెన్నల ప్రముచ్చిలించితో?
గొల్లమిటారి కత్తియల
కోమల మానసముల్ హరించితో?

శ్లో॥ కాళియస్య ఫణతాం శిరస్తు మే
సత్కదంబ శిఖరత్వ మేవ వా।
వక్తి జుష్టవనశైల సుందర!
త్వత్పదాబ్జయుగ మర్పితం యయోః॥ 111

ప్రతి:— జుష్ట, వనశైల = సేవింపఁబడిన వనాద్రిగల, సుందర! = ఓ సుందరభుజస్వామీ! త్వత్, పదాబ్జ, యుగమ్ = నీ పాదపద్మములజంట, యయోః = ఏ కాళియాహి ఫణా శిఖర మందును, ఏకడిమిచెట్టు కొనయందును, అర్పితమ్ = ఉంచఁ బడినదో, మే = నాయొక్క, శిరః, తు = శిరస్సైనతే, (తామ్ =

అట్టి) కాళియస్య=కాళియసర్పముయొక్క, ఫణతామ్ వా= పడగరూపమునుగాని, సత్, కదంబ, శిఖరత్వం, ఏవ, వా= యోగ్యమగు కడిమిమ్రానికొమ్మకొన యగుటనుగాని, వష్టి= కోరుచున్నది.

విశేషములు :— 'యయోః'— ఏకాళియాహి ఫణాగ్ర మందును, ఏకడిమిమ్రాని కొనయందును, వష్టి=కోరుచున్నది. ఎందులకనఁగా 'దుర్లభో మానుషో దేహో దేహినాం క్షణభంగురః' (క్షణభంగురమైనను మనుష్యదేహము దుర్ల భము.) అనియు, 'అరణ్యే సంతి పత్రాణి నద్యాం స్వాదూద కానిచ సంతి, హస్తౌ చ పాదౌ చ। కథం నారాధ్యతే హరిః' (అడవిలోఁ దుళసీపత్రములు గలవు, నదిలో మంచినీరము గలదు, కాళ్లు చేతులు గలవు. శ్రీహరి యేల యారాధింపఁ బడఁడు) అనియు భగవదాశ్రయణోపయోగి కరచరణాది విశిష్టమగు మనుష్యత్వమునందును నాకంత మోజు లేదు. భగవచ్ఛరణార్పణమున కుపయుక్తము లగు నేని తిర్యక్ స్థావరత్వములు గూడ నా కుపాదేయములే యని భావము.

తా॥ వనశైల వల్లభుఁడవగు ఓ సుందరబాహుమూర్తీ! నీ పాదపద్మములజంట వేనియందుంచఁబడెనో యాకాళియాహి ఫణాగ్రభాగమో ఆకడిమిచెట్టు కొమ్మచివర భాగమో యగు టకు నాశిరస్సు కోరుకొనుచున్నది.

ఉ॥ సుందరబాహుదేవ! వన
శోభిత దివ్యశిలోచ్చయాధిరా

ణ్మందిర ! నీపదద్వయి స
మర్పిత సూనటను జేసి కాళియా
హీంద్రుఫణాగ్ర భాగము ! య
హీనకదంబ మహీరుహాగ్రమో !
నందసుతుండవై నతాఘ
నాశిర మొటికెం గాక పోయెనో !

శ్లో॥ గూహితస్వమహిమాఽపి సుందర !
త్వం వ్రజే కి మితి శక్ర మాక్రమీః ।
సప్తరాత్ర మదధా శ్చ కిం గిరిం
పృచ్ఛత శ్చ సుహృదః కి మక్రుధః ॥

ప్రతి :— సుందర ! = ఓ సుందరభుజస్వామీ ! గూహిత, స్వ, మహిమా, అపి = దాచుకొనఁబడిన స్వాభావిక వైభవము గలవాఁడవయ్యు, త్వమ్ = నీవు, వ్రజే = నందగోకులమునందు, కిమితి = ఏమని, శక్రమ్ = దేవేంద్రుని, ఆక్రమీః = ఆక్రమించితివి, సప్తరాత్రమ్ = ఏడు రేయింబవళ్లు, గిరిమ్ = గోవర్ధన పర్వతమును, కిం = ఎందులకు, అదధాః = ధరించితివి, పృచ్ఛతః = (ఇంత పెద్ద పర్వతమును నెత్తితివి నీవు దేవుఁడవా ? సిద్ధుఁడవా ? అని) అడుగుచున్న, సుహృదః = మిత్రులను, కిం = ఎందులకు, అక్రుధః = కోపించితివి ?

విశేషములు :— 'కి మితి శక్ర మాక్రమీః'— తన పూజ కడ్డువచ్చెనని యుద్ధోన్ముఖుఁడగు దేవేంద్రుని శ్రీకృష్ణుఁ డెదుర్కొనెనని భావము. లేదా దేవేంద్రుని పూజ కడ్డ తగులుటయే యిట నెదుర్కొనుట యని తెలియ వలెను.

సప్తరాత్రమ్— ఇచ్చట రాత్రిశబ్దము దివారాత్రపరము. కిమక్రుధః— ఎందులకుఁ గోపించితివి? తన మహిమను దాచుకొనఁ దలఁచినవానికి దేవేంద్రు నెదుర్కొనుట, ఏడునాళ్లు రేయింబవళ్లు గోవర్ధనగిరి నెత్తి పట్టుట, ఇది యేమి? నీవు దేవుఁడవా? సిద్ధుఁడవా? యని ప్రశ్నించు మిత్రులను కోపించుట పరస్పరము వ్యాహతము (విరుద్ధము) అగుచున్న దని భావము.

తా॥ సుందరబాహుమూర్తీ! నీ మహిమను నీవు దాచుకొనఁదలంచిన యెడల నందగోకులమున నింద్రయాగము చేయ వలదని దేవేంద్రునిపై నేల దాడి వెడలితివి. ఏడునాళ్ళు రేయింబవళ్ళు నెందులకు గోవర్ధనపర్వతము నెత్తి పట్టుకొంటివి. ఇది యేమి? నీవు దేవతవా? సిద్ధుఁడవా? అని ప్రశ్నించు మిత్రులపైఁ గోపపడితి వేల? చెప్పుము.

శా॥ దేవా! నీమహిమంబు దాచుకొనును
ద్దేశంబ యేన్ నందగో
పావాసంబున నింద్రయాగమును జే
యన్ రా దటం చింద్రుపైఁ
బోవం గాఁ బని యేమి? యేడుదినముల్
పూనంగ నేలాగిరిన్?
నీ వెవ్వాఁడ వటన్న నెచ్చెలులపై
నీ కేటికో కోపముల్?

శ్లో॥ హే నందనందన ! సుసుందర సుందరబాహో !
వృందావనే విహరతః తవ వల్లవీభిః ।
వేణుధ్వనిశ్రవణత స్తరుభి స్తదా త్వ
సద్గ్రావభి ర్జతువిలాయ మహో విలిల్యే ॥ 113

ప్రతి :— హే నందనందన ! = నందగోపున కానంద కరుఁడా ! సుసుందర, సుందరబాహో ! = మిక్కిలి యందగాఁడ వగుటవలన సుందరుఁడను పేరు గలవాఁడా ! (సుందరబాహు మూర్తీ !) తదా = అప్పుడు, వృందావనే = బృందావనము నందు, వల్లవీభిః = గోపికలతో, విహరతః = క్రీడించుచున్న, తవ = నీయొక్క, వేణుధ్వని శ్రవణతః = వేణునాదమును వినుట వలన, సద్గ్రావభిః = మంచిరాళ్ళతోఁ గూడిన, తరుభిః = చెట్లచేత, (రాళ్ళచేతను చెట్లచేతను) జతువిలాయము = లక్క కరఁగి నట్లు, విలిల్యే = కరఁగుట యాయెనఁట, (ద్రవముగుట ఘనమేమొ నఁట) అహో = ఆశ్చర్యము.

విశేషములు :— త్వైై— ప్రసిద్ధము అను నర్థమును తెలుపు నవ్యయము. 'జతువిలాయ మహో విలిల్యే'— దేవా ! నీవు నందనందనుఁడవుగా నవతరించి బృందావనమున గోపికలతో విహరించుచుఁ బిల్లనగ్రోవి యూదుచుండఁగా నాపాట కందలి బండలు చెట్లు కఠినములయ్యు లక్కవలెఁ గరఁగిపోయినవఁట. ఎంత యాశ్చర్యము ! అని భావము.

తా॥ నందగోపు నానందపెట్టుచు సుందర విగ్రహము గలిగి యుండుటచేత 'సుందర' అను సార్థకనామమును బొందిన అప్పుడు

బృందావనమున గోపికలతో విహరించుచున్న నీ వేణునాదమును విని యచ్చటిబండలు వృక్షషండములు లక్కవలెఁ కరఁగి పోయినవఁట. ఎంత యాశ్చర్యము!

శా॥ నందానంద కరుండవై యధిక సౌం
దర్యంబు మైఁ గ్రాలుటన్
బృందావాసులు సుందరా! యనుచు నిన్
బిల్వంగ గోపాంగనా
సందోహంబును గూడి నీవు మురళీ
స్వానంబుఁ గావింపఁగా
నం దొప్పారుశిలల్ తరుల్ గరఁగె నం
బారార! లక్కం బలెన్ ॥

శ్లో॥ గాయంగాయం వనగిరిపతే! త్వం హి వృందావనాంత
ర్గోపీసంఘై ర్విహరసి యదా సుందర వ్యూఢబాహో।
రాసారంభోత్సవ బహువిధప్రేమ సీమంతినీనాం
చేత శ్చేత స్తవ చ తు తదా కాం దశా మన్వభూతామ్॥ 114

ప్రతి :— వ్యూఢబాహో! = ప్రసిద్ధములు, (లేదా దృఢములు) అగు బాహువులు గల, వనగిరిపతే! = వనాద్రి నాథుఁడవగు, సుందర! = ఓ సుందరభుజస్వామీ!, త్వమ్ = నీవు, యదా = ఎప్పుడు, వృందావనాంతః = బృందావనము లోపల, గాయంగాయమ్ = గాన మొనర్చిగాన మొనర్చి (పాడి పాడి) గోపీసంఘైః = గోపికా సమూహములతో, విహరసి = విహరించు చున్నావో, హి = ప్రసిద్ధము, తదా = ఆసమయమునందు, రాసా...ప్రేమ—రాసారంభ = రాసారంభ

మనెడు, ఉత్సవ = ఉత్సవమునందు, బహువిధ = అనేకవిధములు గల, ప్రేమ = ప్రణయము గలిగిన, సీమంతినీనాం = గోపికల యొక్క (పాపట గలవారగు) చేతః = మనస్సు, తవ = నీయొక్క, చేతః చ = మనస్సును, కాం = ఏ, దశాం = స్థితిని, అన్వభూతాం = అనుభవించినవో! (అనిర్వచనీయ మగు మహానందమును బొందినవి)

విశేషములు :— సుందరస్ఫ్యాఢబాహో — ఇది యేక పదముగా నన్వయించుకొనవచ్చును. అప్పుడు— అందములైన దృఢములగు బాహువులు గలవాఁడా! యని యర్థము. లేదా— సుందర! స్ఫ్యాఢ బాహో! అని విడివిడిగా నర్థము చెప్పికొనవచ్చును లేదా గోపీసంఘైః = గోపికాసమూహములచేత, స్ఫ్యాఢ బాహో! = ఆశ్లేషింపఁబడిన (మెడవేసి కొనఁబడిన) భుజములు గలవాఁడా! యనియు నన్వయించుకొననగును. 'రాసారంభోత్సవబహువిధ ప్రేమ'—

శ్లో॥ 'అంగనా మంగనా మంతరే మాధవో
మాధవం మాధవం చాంతరే చాంగనా।
ఇత్థ మాకల్పితే మండలే మధ్యగః
సంజగౌ వేణునా దేవకీనందనః॥'

అని వర్ణింపఁబడినట్లు శ్రీకృష్ణుఁ డనేక విగ్రహములఁ బరిగ్రహించి యనేక గోపికాకాంతలచే సంశ్లిష్టభుజుఁడై మురళిని వాయించుచుఁ గావించిన నృత్య విశేషమును రాస మందురు. అట్టి రాసోత్సవ ప్రారంభమున నావిర్భవించిన

బహువిధ ప్రణయరసముగల గోపికలయొక్కయు నీయొక్కయు మనస్సు సుందర సుందరీజన మనస్సులకు సైత మందని యవాఙ్మానసగోచర మగు నానందము ననుభవించినదని తాత్పర్యము.

తా॥ దృఢబాహువులు గలిగి, వనగిరి నాథుఁడవైన యో సుందరబాహుమూర్తీ ! ఎప్పుడు నీవు బృందావనములో గోపికా బృందములతోఁ గూడి పిల్లనగ్రోవితోఁ బాడుచు విహరించితివో ! యప్పుడు రాసక్రీడామహోత్స వారంభమున బహుప్రకారక మగు ప్రణయరసముతో నొప్పెడు గోపికల హృదయమును నీహృదయమును అనిర్వాచనీయ మగు నొకానొకస్థితి ననుభవించినవి.

ఉ॥ ఓ వనశైలసుందరుఁడ !

యూఁదుచుఁ బిల్లనగ్రోవి, నాఁడు బృం
దావనిలోన గోపవని
తాతతితో విహరించురాసలీ
లావిభవంబునన్ బ్రణయ
లాలిత మాజవరాంగ్రయుల్లమున్
తావకమానసంబుఁ బ్రమ
దం బతివాఙ్మనసంబుఁ గాంచెనే.

శ్లో. ఇంగితం నిమిషితం చ తావకం
రమ్య మద్భుత మతిప్రియంకరమ్ ।
తేన కంసముఖకీటశాసనం
సుందరాల్పక మపి ప్రశస్యతే ॥

భంగము ఖేంగితంబు సద
పాంగనిరీక్షణ మద్భుతావహం
బుం గమనీయమున్ బ్రియద
ముం జుమ! కంసముఖాల్పకీట హ్రా
ద్భంగ మొనర్చు కార్య మిది
పద్మదళేక్షణ! నీకు నల్ప మా
భంగిమ మానుఁ గాక నిజ
భక్తజనంబు ప్రశంస చేసెడున్.

శ్లో॥ వారాణసీదహన, పౌండ్రక, భౌమ, భంగ,
కల్పద్రుమాహరణ, శంకరజృంభణాద్యాః।
అన్యా శ్చ భారతబలక్రథనాదయ స్తే
క్రీడా స్సుసుందరభుజ! శ్రవణామృతాని ॥ 116

ప్రతి :— హే సుసుందరభుజ! = ఓ సుందరభుజస్వామీ! వారాణసీ......ణాద్యాః— వారణసీదహన=కాశిని భస్మ మొనర్చుట, పౌండ్రక=పౌండ్రకవాసు దేవుని, భౌమ=నరకాసురుని, భంగ = సంహారించుట, కల్పద్రుమ = కల్పవృక్షమగు పారిజాతమును, ఆహరణ=తెచ్చుట, శంకర, జృంభణ= జృంభణాస్త్రముచేత శంకరుని స్తంభింపఁజేయుట, ఆద్యాః= మొదలుగాఁ గలవియు, భారత, బల, క్రథన, ఆదయః= భారతయుద్ధమునందుఁ బదునెనిమిది యక్షౌహిణుల బలమును శింపఁజేయుట మొదలుగాఁ గలవియు, అన్యాః=ఇతరము గు, తే=నీయొక్క, క్రీడాః, చ=లీలలును, శ్రవణ, అమృ ాని=కర్ణామృతములవంటివి. (వీనులకు విందు గూర్చునవి)

విశేషములు :— ఈ శ్లోకమునందలి గాథలు స్ఫు గాఁ ప్రసిద్ధములు. 'అన్యాశ్చ'— గ్రంథ విస్తరభయముచేత భగవల్లీలలు సంగ్రహముగా శ్లోకమున వివరింపఁబడిన వని భావము. శ్రవణామృతాని— భగవల్లీలలు శ్రోత్రేంద్రియము నమృతమువలె సంతోషపెట్టు ననుట సుప్రసిద్ధమే. 'భూషణములు చెవులకు, బుధతోషణము లనేక జన్మదురితౌఘవినిశ్శోషణములు మంగళేతర ఘోషణములు గరుడగమనగుణ భూషణముల్'

— శ్రీ పోతనామాత్యుఁడు.

తా॥ ఓ సుందరబాహుమూర్తీ! కాశిని దగ్ధ మొనర్చుటయు, పౌండ్రకవాసుదేవునిఁ గూల్చుటయు, నరకాసురుని నాశ మొనర్చుటయు, జృంభకాస్త్రముచేత శంకరుని స్తంభింపఁ జేయుటయు, మున్నగు నవియు, భారతరణమున అష్టాదశాక్షౌహిణుల బలమును భస్మ మొనర్చుట మొదలైన దేవరవారి లీలలు కర్ణామృతములై భక్తుల నానందపఱచుచున్నవి.

శా॥ శ్రీవారాణసి పట్టణంబు నటు భస్మ
స్మీభూతముం జేయుటల్,
నీ వేషంబును దాల్చు పౌండ్రకుని క్షో
ణిం గూల్చుటల్, భౌము దు
ర్భావున్ జెందుట, జృంభణంబున హరున్
భంజించుటల్, దేవ! భూ
దేవీభారముఁ దీర్చు నీ కృతులు స్యం
దించున్ సుధన్ వీనులన్.

అవతారిక :—అతి సన్నిహితమగు కృష్ణావతార ప్రసంగము చేతఁ దత్తుల్య యోగక్షేమమగు నవతారత్రయము నందుండి నీవే యాశ్రిత జనంబులకు నఖిలాభీష్టముల ననుగ్రహించు చున్నావని మూఁడు శ్లోకములచేత (శ్రీ) సుందరబాహుమూర్తి వారి మహిమను వర్ణించు చున్నారు.

శ్లో॥ త్వం హి సుందర ! వనాద్రినాథ ! హే
వేంకటాహ్వాయ నగేంద్రమూర్ధని ।
దేవసేవిత పదాంబుజద్వయః
సంశ్రితేభ్య ఇహ తిష్ఠసే సదా॥ 117

ప్రతి :— వన+అద్రి, నాథ !=వనాద్రి ప్రభువగు, హే సుందర ! = ఓ సుందర భుజస్వామీ !, త్వమ్=నీవు, వేంకట, ఆహ్వాయ, నగేంద్ర, మూర్ధని = వేంకట మనెడు పేరుగల పర్వతరాజము యొక్క శిఖరమునందు, సదా = ఎల్లప్పుడు, దేవ, సేవిత, పదాంబుజ, ద్వయః (సన్) = నిత్యసూరులచేత సేవింపఁబడిన పాదపద్మముల జంటగలవాఁడ వగుచు, ఇహ= ఇక్కడ, సంశ్రితేభ్యః=ఆశ్రితులకొఱకు, తిష్ఠసే = ఉన్నావు, హి=ప్రసిద్ధము.

విశేషములు :— వేంకట, ఆహ్వాయ, నగేంద్ర, మూర్ధని— 'సర్వపాపాని వేం ప్రాహుః కట స్తద్దాహ ఉచ్యతే' అను ప్రమాణముచేత సర్వపాపములను దహించుటచేత ఆనగేంద్రము నకు వేంకట అను నామము వచ్చిన దని భావము. వేం =

సర్వపాపములను, కట=దహించునది. దేవసేవిత.....ఇచ్చట దేవశబ్దమునకు నిత్యసూరు లని యర్థము. ఇందులకుఁ బ్రమాణము 'యత్ర పూర్వే సాధ్యా స్సంతి దేవాః' సంశ్రితేభ్యః తిష్ఠసే— అనుచోట చతుర్థీ విభక్తియు, ఆత్మనేపదమును ఇచ్చటి యాశ్రితులకొఱకు సకలాభీష్టముల నొసంగుటకుఁ గంకణము కట్టుకొని యున్నాననెడు స్వాభిప్రాయమును వెల్లడించుచున్నది. ఇందులకుఁ బ్రమాణము 'సూ॥ శ్లాఘహ్నుఙ్, స్థాశపాం జ్ఞీప్స్యమానః'— అను పాణిని సూత్రము.

తా॥ వనాద్రీశ్వరుఁడ వగు ఓ సుందరబాహుస్వామీ దేవరవారు పాపముల నెల్లఁ బటాపంచలు సేయు వేంకటాచల శిఖరమున వేంచేసి నిత్యసూరులచేత సేవింపఁబడిన పాదారవిందములు గలవారలై యిచ్చట నుండుట సకలాశ్రితులకు సర్వాభీష్టముల నొసంగుటకే యనెడు తమ యభిప్రాయమును దేటపఱుచు చున్నారు.

గీ. శ్రీహరి! వనాద్రిసుందరబాహుమూర్తి!
నిత్యసూరీడితుండవై నీవు శేష
శిఖరి నిట్లుంట యిచటి యాశ్రితులకీప్సి
తార్థముల నిచ్చుతలఁ పని వ్యక్తమయ్యె.

శ్లో॥ హస్తిశైలనిలయో భవసి భవాన్
సాంప్రతం వరదరాజసాహ్వయః ।
ఇష్ట మర్థ మనుకంపయా దదత్
విశ్వ మేవ దయసే హి సుందర ! 118

ప్రతి :— (హే) సుందర ! = ఓ సుందరబాహుమూర్తీ !, వరదరాజసాహ్వయః = వరదరాజనెడు పేరితోఁ గూడిన వాఁడవై, హస్తిశైలనిలయః = కరిగిరి వాసముగాఁ గలవాఁడవు, భవన్ = అగుచు, భవాన్ = దేవరవారు, సాంప్రతమ్ = ఇప్పుడు, ఇష్టమ్ = ప్రార్థింపఁబడిన (ఇష్టమైన) అర్థమ్ = పురుషార్థమును, అనుకంపయా, ఏవ = దయచేతనే, దదత్ = ఇచ్చుచు, విశ్వమ్ = ప్రపంచమును, దయసే = కనికరించుచున్నావు, హి = ప్రసిద్ధము.

విశేషములు :— అనుకంపయా, ఏవ = తత్తత్సాధనాను ష్ఠానములేకయే యని భావము. దయసే— దయావిషయ మునుగాఁ జేయుచున్నావు.

తా॥ ఓ సుందరబాహుమూర్తీ ! నీవు వరదరాజస్వామి యను పేరితోఁ గరిగిరియందు వాసము చేయుచు నిప్పుడు భక్తులు కోరిన పురుషార్థము నవ్యాజకృపతోనే యిచ్చుచుఁ బ్రపంచమును కనికరించుచున్నావు. ఇది ప్రసిద్ధము.

గీ. దేవ ! సుందరబాహుమూర్తీ ! వనాద్రి
వల్లభా ! హస్తిగిరియందు వరదరాజు
పేరఁ గృపతోనె శ్రితుల కీప్సితము లిడుచుఁ
గనికరించుచు నున్నావుగా ! జగమ్ము.

శ్లో॥ మధ్యేక్షీరపయోధి శేషశయనే శేషే సదా సుందర !
త్వం తద్వైభవ మాత్మనో భువి భవ ద్భక్తేషు వాత్సల్యతః ।
విశ్రాణ్యాఖిలనేత్రపాత్ర మిహ సన్ సహ్యోద్భవాయా స్తటే
శ్రీరంగే నిజధామ్ని శేషశయనే శేషే వనాద్రీశ్వర ! ॥ 119

ప్రతి :— (హే) వనాద్రీశ్వర, సుందర ! = వనాద్రిప్రభువ వగు ఓ సుందరబాహుస్వామీ !, త్వం = నీవు, మధ్యేక్షీర పయోధి = పాలసముద్రముపందును, సదా = ఎల్లప్పుడు, శేష శయనే = శేషపర్యంకమునందు, శేషే = పరుండు చున్నావు, తత్ = అట్టి, ఆత్మనః = నీయొక్క, వైభవం = ప్రభావమును, భువి = భూమియందు, భవత్, భక్తేషు = దేవరవారి భక్తుల విషయమున, వాత్సల్యతః = స్నేహాతిశయమువలన, వితీర్య = ఇచ్చి, అఖిలనేత్ర పాత్రతాను, సన్ = అందరికన్నులకు గోచరమైన వాడవగుచు, ఇహ = ఇప్పుడు (ఇక్కడ) సహ్యాద్రిభవా యాః = కావేరీనదియొక్క, తటే = ఒడ్డున, నిజధామ్ని = స్వనివాసమగు, శ్రీరంగే = శ్రీరంగమునందు, శేషశయనే = శేషపర్యంకమున, శేషే = శయనించుచున్నావు.

విశేషములు :— 'తద్వైభవ మాత్మనః' శేషపర్యంక శాయిత్వరూప మగు శ్రీవారి యొక్క వైభవము వని భావము. వాత్సల్యతః — 'తః' అనునది పంచమ్యర్థమున వచ్చిన 'తసిల్' ప్రత్యయము. దోషములను పాటింపని స్నేహాతిశయము వలన అని యర్థము. శ్రీరంగే నిజధామ్ని — శ్రీరంగమునకు 'నిజధామ్ని' అను విశేషణము వేయుటవలన శ్రీరంగము వైకుంఠ విమానమని వ్యక్తమగుచున్నది. శేషశయనే శేషే— క్షీరాబ్ధిశాయిని సాక్షాత్తుగాఁ జూడ నశక్తులగు భక్తజనులకుఁ దత్సేవ ననుగ్రహింప నెంచి యిచ్చట సమస్తార్చావతారము లకు మూలకందమగు శ్రీరంగశాయి వగుచున్నా వని భావము.

తా॥ వనాచలనాథుఁడ వగు నోసుందరబాహుమూర్తీ! దేవరవారు పాలసంద్రము నందు సర్వదా శేషపర్యంకమున శయనించియుండు దివ్యవైభవమును దోషముల వైపు దృష్టిని బోనీయని ప్రేమవిశేషమువలన నశక్తులగు భూలోకవాసులైన భక్తులకు ననుగ్రహింప నిచ్చట, అందఱికన్నులకు గోచరించుచు కావేరీతీరమున భూలోకవైకుంఠ మగు శ్రీరంగమున శేష తల్పమునందు శయనించు చున్నావు.

శా. శ్రీమత్కాననశైల సుందరభుజా! క్షీరాబ్ధి భోగీంద్రుపై
నామోదంబున నీవు పండు విభవం బత్రత్యభక్తాళి కు
ద్దామప్రేమ ననుగ్రహింపఁగ భవద్ధామంబు శ్రీరంగ మం
దీమాద్రిఁ భుజగేంద్రశాయివయితోఁ?యీసప్యాజాతాతటిఁ॥

శ్లో॥ కల్కీ భవిష్యన్ కలికల్కదూషితాన్
దుష్టా నశేషాన్ భగవన్! హనిష్యసి ।
స ఏవ తస్యావసర స్సుసుందరః
ప్రశాధి లక్ష్మీశ! సమక్ష మేవ నః ॥ 120

ప్రతి :— లక్ష్మీశ! = లక్ష్మీనాథుఁడ వగు, భగవన్! = ఓ భగవానుఁడా! సుసుందరః = మిక్కిలి అందగాఁడ వగు (సుందరనామముగల) త్వమ్ = నీవు, కల్కీ = కల్కివి (గొప్ప గుఱ్ఱపురౌతు) భవిష్యన్ = కాఁబోవుచు, (కల్కివిగా నవత రింపఁబోవుచు) కలి, కల్క, దూషితాన్ = కలికాలప్రయుక్త మగు మాలిన్యముచేతఁ బాడయిన, అశేషాన్ = సమస్తమైన, దుష్టాన్ = దుర్మార్గులను, హనిష్యసి = చంపఁగలవు, తస్య =

ఆకల్క్యవతారమునకు, సః = ఆసీహ్యాస్గతమగు, అవసరః = సమయము, ఏషః = ఇదియే. నః = మాయొక్క సమక్షమ్, ఏవ = కన్నులయెదుటనే, ప్రశాధి = (దుష్టులను) శిక్షింపుము.

విశేషములు :— కల్కీ = హాయుసాదివిశేషః— అనఁగా నొకవిధమగు గుఱ్ఱపురౌతు, తస్య = కలికల్మషదూషితు లగు దుష్టులను సంహారింప ననువగు కల్కిరూపము నెత్తుటకు. 'ప్రశాధి లక్ష్మీశ! సమక్ష మేవ నః'— దేవరవా రిప్పుడే కల్క్యవతారము నెత్తి దుష్టసంహారము చేయనియెడల నాశ్రితుల మగు మాకు వినాశము తప్పదని భావము.

తా॥ లక్ష్మీశుఁడ వగునో భగవానుఁడా! సుందరబాహు మూర్తివగు నీవు కల్కివిగా నవతరింపఁ బోవుచుఁ గలికల్మష దూషితులగు దుర్మార్గులను వధింపఁగలవు ఆసమయ మిదియే కావున నాదుష్టులను మాకన్నుల యెదుట నిప్పుడే నిర్మూ లింపుము.

ఉ. సామి! రమేశ! సుందరభు
 జా! యిఁక ముందఱఁ దాము కల్కిగా
భూమి జనించి దుష్టజన
 ముం గలికల్మష దూషితమ్ము ని
స్సీమబలమ్ముతో నసిని
 జెండెద రంట! ముహూర్త మియ్యదే
యా మహనీయ కార్యమున
 కాఖలులన్ దునుమాడు మిప్పుడే.

అవతారిక— ఇట్లు పెక్కువిధముల నాశ్రితజనోపకారంబులగు నవతారముల నీవే తాల్చితి వని పలుసారులు చెప్పఁబడిన శ్రీ సుందరభుజస్వామివారి విహారలీలను ముగించి యీకారణముచేత దేవరవారే యాశ్రయణీయు లని శరణు చొచ్చుచున్నారు.

శ్లో॥ ఈదృశా స్త్వదవతారసత్తమాః
సర్వ ఏవ భవదాశ్రితాన్ జనాన్ ।
త్రాతు మేవ న కదాచి దన్యథా
తేన సుందర ! భవంత మాశ్రయే ॥ 121

ప్రతి :— హే సుందర ! = ఓ సుందరబాహుస్వామీ !, ఈదృశాః = ఇటువంటి, సర్వే, ఏవ = సమస్తములైన, త్వత్, అవతార, సత్తమాః = దేవరవారి ముఖ్యములగు నవతారములు, భవత్, ఆశ్రితాన్ = దేవరవారి నాశ్రయించిన, జనాన్ = సాధుజనులను, త్రాతుం ఏవ = రక్షించుట కొఱకే, కదాచిత్, అపి = ఒకప్పుడు గూడ, అన్యథా = ఇతర ప్రయోజనముకొఱకు, న = కావు, తేన = అందుచేత, భవంతమ్ = శ్రీవారిని, ఆశ్రయే = ఆశ్రయించు చున్నాను.

విశేషములు :— త్రాతు మేవ— 'పరిత్రాణాయ సాధూనామ్' అని చెప్పఁబడిన ప్రయోజనముకొఱకే యని భావము. ఎక్కడనైనను సాధురక్షణము దుష్టవినాశము లేకుండ జరుగదో యచ్చట దుష్టవినాశము గూడనని యాశయము. 'తేన'— వనాద్రియందు సుందరబాహుమూర్తిగా నవతరించుట యాశ్రిత పరిత్రాణమునకే కాన, భవంత మాశ్రయే— జ్ఞాన,

శక్తి, సౌలభ్య, సౌశీల్య, వాత్సల్యాది కల్యాణగుణ సంపన్నుఁడవును, ఆశ్రితరక్షణైక దీక్షితుఁడవును, అగు నిన్ను శరణు చొచ్చుచున్నాను. అని భావము.

తా॥ ఓ సుందరబాహుమూర్తీ ! ఇట్టువంటి నీముఖ్యావతారము లన్నియు నీయాశ్రితజనులను రక్షించుటకే కాని యితర ప్రయోజనములకుఁ గావు. ప్రకృత మీ వనాద్రియందు సుందరబాహుమూర్తిగా నవతరించుట కూడ నాశ్రితుల రక్షించుటకే కాన జ్ఞానశక్తి సౌలభ్యసౌశీల్యాది గుణసంపన్నుఁడవు నాశ్రితరక్షణ బద్ధదీక్షుఁడ వగు నిన్ను శరణు చొచ్చుచున్నాను.

శా. ఓ దేవా ! జగదేకమంగళ విధా
యుల్ ముఖ్యముల్ తావక
ప్రాదుర్భావము లెల్ల సుందరభుజ
స్వామీ ! వనాద్రీశ ! నీ
పాదాబ్జంబులఁ గొల్చుభక్తతతులన్
బాలింప; నన్యార్థమై
కా దింకేల సమాశ్రయించెద నినున్
గారుణ్య వారాంనిధిన్.

శ్లో॥ త్వా మామనంతి కవయః కరుణామృతాబ్ధిం
త్వా మేవ సంశ్రితజనిఘ్న ముపఘ్న మేషామ్ ।
ఏషాం వ్రజ న్నిహ హి లోచనగోచరత్వం
హేసుందరాహ్వ ! పరిచస్కరిషే వనాద్రికిమ్ ॥ 122

ప్రతి :— హే సుందరాహ్వ ! = సుందరనామ ధేయుఁడ వగు ఓ దేవా ! కవయః=కవులు, కరుణా, అమృత, అబ్ధిమ్= కరుణయ నెడు అమృతమునకుఁ బుట్టినిల్లగు వానినిగా (లేదా) కరుణకు క్షీరాబ్ధివంటి వానినిగా, త్వామ్=నిన్ను, ఆమనంతి= చెప్పుచున్నారు, త్వాంఏవ=నిన్నే, సంశ్రిత, జని, ఘ్నమ్= ఆశ్రితుల సంసార దుఃఖములను నశింపఁజేయువానిని గాను, ఏషామ్=ఈయాశ్రితులకు, ఉపఘ్నమ్=ఆశ్రయ భూతునిగాను, (ఆమనంతి=చెప్పుచున్నారు) ఏషామ్ = ఈ యాశ్రితజనులకు, లోచన, గోచరత్వమ్=కన్నులకుఁ గానవచ్చుటను, వ్రజన్ = పొందుచు, ఇహ=ఇచ్చట, (ఈలీలావిభూతిలో) వనాద్రిమ్= వనగిరిని, పరిచస్కరిషే = అలంకరించు చున్నావు, హి = ప్రసిద్ధము.

విశేషములు :— కవయః— కవనశీలు రగు భగవ ద్వాల్మీకి, పరాశర, పారాశర్య, పరాంకుశ, పరకాల, ప్రభృ తులు. ఉపఘ్నమ్=దగ్గఱగా నున్నయండ'స్యా దుపఘ్నోంతి కాశ్రయః' అని యమరము. పరిచస్కరిషే వనాద్రిమ్— నిర్హేతుక జాయమాన కరుణాపరిపూర్ణుఁడ వగుట వలనను శరణ్యుఁడ వగుటవలనను శరణవరణ సౌకర్యముకొఱకు ఆశ్రిత నేత్రపాత్రమవై వనాద్రి నలంకరించు చున్నావని భావము.

తా॥ ఓ సుందరభుజస్వామీ ! భగవద్వాల్మీకి ప్రభృతిమహా కవులు నిన్నుఁ గరుణామృత పరిపూర్ణునిగా నుడివిరి. మఱియు నాశ్రితజనుల జరామరణములఁ బాపుదగ్గఱనుండు నండను

గాను నిన్నే వర్ణించిరి. ఇట్లు సమాశ్రితులకు లోచనగోచర మగుచు నీలీలావిభూతి యందు శరణవరణ సౌకర్యమున కీ వనాద్రి నలంకరించి యున్నావు.

ఉ. నాకుజముఖ్యు సత్కవిజ
నంబులు నిన్నుఁ గృపామృతాబ్ధిఁగా
వాకొని రాశ్రితాళి భవ
పాశ వినాశకుఁగాఁగ బాపులో
నే కలయుండగాఁగ గరు
ణించిరి సంశ్రితకోటికంటిముం
దై కడు నందుపాటుగ వ
నాచలసీమ నలంకరించితో.

శ్లో॥ అశక్యం నో కించిత్ తవ న చ న జానాసి నిఖిలం
దయాలుః క్షంతా చా ప్యహ మపి చ సాగాంసి తరితుమ్ ।
క్షమోఽత స్త్వచ్ఛేషో హ్యగతి రతి చ క్షుద్ర ఇతి చ
క్షమ స్యైతావ న్నో బల మిహ హరే ! సుందరభుజ ! ॥ 123

ప్రతి:— హే సుందరభుజ ! = ఓ సుందరబాహుస్వామీ!, హరే ! = విష్ణుమూర్తీ ! తవ = నీకు, అశక్యమ్ = సాధ్యము గానిది, కించమ్ = కొంచెమును (ఒకటియు) నో = లేదు, నిఖిలంచ = అంతయును, న, జానాసి, ఇతి, న = ఎఱుఁగవని లేదు, (ఎఱుఁగుదు వన్నమాట) దయాలుః = దయగలవాఁడవు, క్షంతా, చ = ఓర్పుగలవాఁడవుగూడ, అహంఅపి = నేను గూడ, ఆగాంసి = అపరాధములను, తరితుంచ = దాఁటుటకుఁ (ప్రాయశ్చిత్తాదులచేత నశింపఁజేసికొనుట కొఱకు) న, క్షమః =

సమర్థుఁడనుగాను, అతః=ఇందువలన, త్వత్ + శేషః, హి= నీ దాసుఁడనియు, అగతిః ఇతి చ=గతిలేనివాఁడనియు (ఉపాయాంతరరహితుఁ డనియు) క్షుద్రః ఇతి చ =అకించనుఁడనియు, క్షమస్వ=(నేరములను) క్షమింపుము. ఇహ =ఈ సంసారమునందు, నః=మాకు, ఏతావత్ =ఈమాత్రమే, బలమ్=బలము.

విశేషములు :— ప్రథమచరణమునకు సర్వశక్తివి, సర్వజ్ఞుఁడవు నని భావము. దయాలుః=పరదుఃఖాసహిష్ణుః— ఒరులదుఃఖమును జూచి సహింపలేనివాఁడని భావము. 'క్షంతా'— అపరాధసహిష్ణుః— నేరములను సహించు శీలముగలవాఁడు, అతః— ఇందువలన— అనఁగా, నీవు సర్వశక్తివి, సర్వజ్ఞుఁడవు, దయాక్షమావిశిష్టుఁడవు గనుక, నేను దుష్కృతములఁ బ్రాయశ్చిత్తాదులచేతఁ బోఁగొట్టుకొనఁజాలని వాఁడను గనుకను - అని భావము. త్వచ్ఛేషః హి=నీ దాసుఁడనని— ఇచ్చట 'హి' శబ్దము ఇత్యర్థకము. క్షుద్రః ఇతి చ=క్షుద్రములగు పురుషార్థములచేతనే తృప్తి చెందిన వాఁడననియు, లేదా— అకించనుఁడ ననియు— 'ఏతావ న్నో బల మిహ'— ఈసంసారములో మాకు దేవరవారి విషయమున జ్ఞాన, శక్తి, దయా, క్షమా, వైశిష్ట్యము, మా విషయమున భవచ్ఛేషత్వాకించనత్వానన్యగతికత్వము ననుసంధించుకొనుటయే బలము. అనఁగాఁ దరణోపాయ మని తాత్పర్యము.

తా॥ ఓ సుందరభుజస్వామీ! నీ కశక్యమైన దేదియు లేదు. నీవు సమస్తము నెఱుఁగ వనుమాటయు లేదు. సర్వశక్తివి

సర్వజ్ఞుఁడవు దయగలవాఁడవు శక్తుఁడవునై యున్నావు, నేనో
నాయపరాధముల దాఁట శక్తిలేనివాఁడను. కావున నీదాసుఁడ
ననియు అనన్యగతి ననియు నకించనుఁడ ననియు నా యపరాధ
ముల క్షమింపుము. ఈ సంసారములో మాకీ యనుసంధానమే
బలము (సాహసము.)

శా॥ నీకున్ శక్యముగాని దొక్కటియు లే
నే లేదు, సర్వం బిలన్
నీకున్ హస్తతలస్థితామలక మా
నీ బంటియున్ [illegible]
లోకాతీతము లేదరింపఁ గలనే
లోకేశ ! యోగాంబుధిన్
నీకున్ దాసుఁడ దిక్కులేని యనదన్
నేరంబులన్ సైపవే !

శ్లో॥ లంకాయుద్ధహతాన్ హరీన్ ద్విజసుతం శంబూకదోషాన్మృతం
సాందీపన్యభిజం మృతం ద్విజసుతాన్ భూమాంశ్చ వైకుంఠగాన్ ।
గర్భం చార్జునిసంభవం వ్యదధథాః స్వైవ చాయాసేన యః
స్వాభీష్టం మమ మస్తుగోశ్చ దదసే నో కిం వనాద్రీశ్వర ! ॥ 124

ప్రతి :— హే వనాద్రీశ్వర ! = ఓ వనగిరిప్రభువవగు
సుందరబాహుమూర్తీ !, యః = ఏనీవు, లంకాయుద్ధహతాన్ =
లంకాపురీ యుద్ధమునఁ జంపఁబడిన, హరీన్ = వానరులను,
శంబూకదోషాత్ = శంబూకుని యపరాధమువలన, మృతమ్ =
మరణించిన, ద్విజసుతమ్ = బ్రాహ్మణకుమారుని, మృతమ్ =
చనిపోయిన, సాందీపిని × అభిజమ్ = సాందీపినియొక్క (కృష్ణుని

గురువు) కుమారుని, వైకుంఠగాన్ = వైకుంఠలోకమునకు వెళ్ళిన, బాలాన్ = చిన్నవారగు, ద్విజసుతాన్ = బ్రాహ్మణ పుత్త్రులను, ఆర్జునిసంభవమ్ = అర్జున కుమారుఁడగు అభిమన్యుని వలనఁ బుట్టుకగల, గర్భమ్ చ = గర్భమును (పరీక్షిత్తును) స్వేన, ఏవ, రూపేణ = సొంతరూపముతోనే, వ్యుదధరః = ఉద్ధరించితివో, (సః = ఆనీవు) మత్, గురోః = నా గురువగు భగవద్రామానుజా చార్యులయొక్కయు, మమ, చ = నాయొక్కయు, స్వాభీష్టమ్ = స్వీయమగు మనోరథమును, నో, దదసే, కిమ్ = ఇయ్యవేమి ?

విశేషములు :— ఇందు మొదటిపాదములోని లంకాయుద్ధ హతవానరోజ్జీవనము శంబూక దోషమృత బ్రాహ్మణబాలపునర్జీవనములు రామావతారకాలికములు, తక్కిన రెండు మూఁడు పాదములలోని మృతసంజీవనములు కృష్ణావతార కాలికము లని తెలియవలెను. స్వే నైవ రూపేణ— మరణ కాలమునందలి వయస్సు, వేషము, భూషాణాదులతోఁ గూడిన యాకారముతోనే 'స్వాభీష్టం మమ మద్గురో శ్చ దదసే నో కిమ్'— శ్రీ భగవద్రామానుజ గురుల యభిలషిత మే మన— శ్రీరంగనాథ సన్నిధినివాసము, తత్పరి చర్యాభాగ్యము. శ్రీ కూరేశులయభిలాష మే మన— భగవద్రామానుజుల సన్నిధి నుండుట తత్పరి చర్యాదిక మొనర్చుట యని తెలియ వలెను. కాలాంతరమున మృతులైనవారిని, పునరావృత్తి రహితలోకాంతరగతులను సైతము మరణకాలమునాఁటి వయోవేషభూషణములతోఁ గొనివచ్చి యిచ్చిన దేవరవారి

కశక్యమేదియు లేదు గదా! భవదాశ్రితుల మగుమా యభి లాషల నింకను దీర్పవేమి? అని తాత్పర్యము.

తా॥ ఓ వనాద్రినాథా! లంకాయుద్ధమున మరణించిన వానరులను, శంబూకతపశ్చర్యచే మృతుఁడైన బ్రాహ్మణ బాలుని రామావతారమున బ్రదికించితివి. అట్లే కృష్ణావతార మునఁ గూడ మరణించిన గురుపుత్రుని, మరణించి పునరావృత్తి రహితమగు వైకుంఠమును జేరుకొనిన బాలురగు బ్రాహ్మణ సుతులను, అభిమన్యునివలన నేర్పడిన యుత్తరాగర్భమును మరణకాలిక వయోవేషభూషణములతో నొప్పు రూపముతోఁ గొనివచ్చిన నీవు నిన్నాశ్రయించిన మద్గురుపాదులగు భగవ ద్రామానుజుల యభిలాషను నా వాంఛితమును దీర్ప వేల?

శా॥ లంకాసంగరరంగ నష్టకపిసు
ల్లశ్రేణీ, శంబూకము
న్యంకాస్తంగత విప్రబాలు, మృతుఁ డౌ
నాచార్యసూనున్, నిరా
తంకస్థానుల నష్టవిప్రసుతులన్,
దగ్ధోత్తరా పత్యమున్
సంకోచింపక యిచ్చి యేల యిడ వి
ష్టం బీశ! నా కొజ్జకున్.

అవతారిక :—నిజదేశవాసు లనెడు తృప్తిచేతనే వారికిఁ బ్రబల ఫలప్రదుఁడ వగుచున్నావని నాల్గు శ్లోకములతో నుడువు చున్నారు.

శ్లో॥ ఆయోధ్యగాన్ సపశుకీటతృణాంశ్చ జంతూన్
కిం కర్మణో ను బత కీదృశ వేదనాఢ్యాన్ ।
సాయుజ్యలభ్యవిభవాన్ నిజనిత్యలోకాన్
సాంతానికా నగమయో వనశైలనాథ ! 125

ప్రతి :—హే వనశైలనాథ ! = వనిగిరినాథుఁడవగు ఓ సుందరభుజస్వామీ ! ఆయోధ్యగాన్ = అయోధ్యానుబంధి దేశములను బొందిన, సపశు కీట తృణాన్ = పశువులతో, కీటములతో, తృణములతోఁ గూడిన, జంతూన్ = ప్రాణులను, కింకర్మణః, ను = ఏమి కర్మగలవి యని, బత = మఱియు, కీదృశ, వేదన, ఆఢ్యాన్ = ఎటువంటిజ్ఞానముతో ఒప్పునవి యనియు, సాయుజ్య, లభ్య, విభవాన్ = సాయుజ్యమోక్షము నందుఁ బొందఁదగిన వైభవము గలట్టియు, సాంతానికాన్ = సాంతానికము లనెడు, నిజ, నిత్యలోకాన్ = తన వైకుంఠమువలె శాశ్వతములగు లోకములను, అగమయః = పొందించితివి ?

విశేషములు :—ఆయోధ్యగాన్— కేవల మయోధ్యావాసులనే కాదు- అయోధ్యానుబంధి దేశములలో నున్న వారిని గూడ నని భావము. సపశుకీటతృణాన్ చ— కేవలము మనుష్యులనే కాదు చతుష్పాజ్జంతువులను, అతిక్షుద్రములగు పురుగులను, గడ్డిపఱకలను గూడ నని- 'కింకర్మణో ను బత కీదృశ వేదనాఢ్యాన్'— ఏమి కర్మయోగనిష్ఠులని, ఏమి జ్ఞానయోగనిష్ఠులని- తలఁచి యట్టి (శ్రీ) వైకుంఠతుల్యములగు సాంతానికలోకముల నొసంగితివి ? అది కేవల మయోధ్యానుబంధి దేశవాసులనియే యిచ్చితి వని యాశయము.

తా॥ ఓ వనశైలనాథా ! సుందరభుజా ! నీ వానాఁడు తృణ పశుకీటాది ప్రాణులకు భవదనుభవసౌభాగ్యసంపత్తి గల వైకుంఠ లోకతుల్యంబులగు సాంతానికలోకంబుల నొసంగుట వాని జ్ఞాననిష్ఠను కర్మనిష్ఠను జూచితివా ? కాదు కాదు- అయో ధ్యానుబంధి దేశసంబంధమునుబట్టి యొసంగితివి. కాన దేవర వారికి స్వీయదేశవాసుల యెడఁగల యభిమాన మనన్యా దృశము.

శా. ఆసాంతానికలోకముల్ పరమ ధా
మాభంబులన్ నీ వయో
ధ్యాసంబంధిసు దేశవాసు లని యే
యర్పించినా వంతయే
ఓసర్వోత్తమ ! యట్లు గానియెడ జ్ఞా
నోత్కృష్టముల్ కర్మని
ష్ఠాసంతుష్టములా ! తృణాక్రిమి చ తు
ష్పాజ్జంతు సంతానముల్.

శ్లో॥ హారితవారణ భృత్యసమాహ్వాయం
కరిగిరౌ వరద స్త్వ మపూర్వికామ్ ।
దృశ మలంభయ ఏవ హి సుందర !
స్ఫుట మదా శ్చ పరశ్శత మీదృశమ్ ॥ 126

ప్రతి :— హేసుందర!=ఓసుందరభుజస్వామీ! కరిగిరౌ= కరిగిరియందు, వరదః = వరదరాజస్వామి వగుచు, త్వమ్= నీవు, హారితవారణభృత్యసమాహ్వయమ్ = హారితవారణదాస నామము గల భక్తుని, అపూర్వికామ్ = పూర్వములేని, దృశమ్=దృష్టిని, అలంభయః ఏవ=పొందించితివి, ఈదృశమ్= ఈ ప్రకారముగా, పరశ్శతమ్ = పలుసారులు, స్ఫుటమ్= ప్రసిద్ధముగా, అదాః చ=ఇచ్చితివి కూడ, హి=ప్రసిద్ధము.

విశేషములు :—'అపూర్వాకాంద్రుశ మలంభయ ఏవ'—వరదరాజస్వామి గ్రుడ్డివాఁ డగు హారీతవారణదా సనెడుభాగవతునకుఁ గన్నుల ననుగ్రహించె నని ప్రసిద్ధి కలదు. పరశ్శతమ్ = వందలకు హెచ్చుగా అనియు నర్థము.

ఈ సందర్భమున నీ శ్లోకము నిచ్చట ననుసంధించుకొనునది.

శ్లో॥ యస్య ప్రసాదకళయా బధిర శ్శృణోతి
సంగుః ప్రధావతి జవేన చ, వక్తి మూకః ।
అంధః ప్రపశ్యతి, సుతం లభతే చ వంధ్యా
తం దేవ మేవ వరదం శరణం ప్రపద్యే ॥

తా॥ ఎవని నలుసంత యనుగ్రహముచేతఁ జెవిటివాఁడు వినునో, కుంటివాఁడు వడిగాఁ బర్వెత్తునో, మూగవాఁడు మాటలాడునో, గ్రుడ్డి చూచునో, గొడ్రాలు బిడ్డను గనునో, ఆవరదరాజస్వామిని శరణు చొచ్చు చున్నాను దీనికి నా తెలుఁగు పద్యము.

గీ. చెవిటి విను, గ్రుడ్డి చూచు, వచించు మూఁగ,
కుంటి పరుగెత్తు, గొడ్రాలుఁ గొమరుఁ బడయు,
నెవని క్రేగంటి చూపింత యెసఁగ, నట్టి
వరదరాజుల చరణంబు శరణు నాకు.

ఇఁక మూలశ్లోకమునకుఁ దాత్పర్యము.

తా॥ ఓ సుందరబాహుమూర్తి! నీవు కరిగిరియందు వరదరాజస్వామి నామముతో వెలయుచు, 'హారితవారణదాసు' అనెడు ఒక గ్రుడ్డిభాగవతునకుఁ గన్నుల ననుగ్రహించితివి. ఒక టేల? ఇట్టి వెన్నిమార్లో భక్తుల కొసఁగితివి. ఇది సుప్రసిద్ధము.

చ. కరిగిరియందు నీవు సుభ
గా! వరదుం డను సార్థకాఖ్యతో

వరలుచు భక్తుఁ డౌ హారిత
వారణదా సను గ్రుడ్డివానికిన్
వరనయనమ్ములన్ సుగుణ
వారిధి! యిచ్చితి వంట యో సుం
దరభుజ! యిట్టి దానములు
తావకముల్ శతముల్ సహస్రముల్.

శ్లో॥ ఇహ చ దేవ దదాసి వరాన్ వరాన్
వరద! సుందర! సుందరదోర్ధర! ।
వనగిరే రభిత స్తట మావసన్
నిఖిలలోచన గోచరవైభవః ॥ 127

ప్రతి :— వరద != వరముల నొసంగువాఁడా! సుందరదోః ధర != అందములగు బాహువులను ధరించువాఁడా!, సుందర != ఓ సుందరబాహుస్వామీ! దేవ != శ్రీయాదిగుణవిశిష్టుఁడా!, వనగిరేః, తటం, అభితః = వనాద్రితట సమీపమునందు, ఆవసన్ = నివసించుచు, నిఖిల, లోచన, గోచర, వైభవః = అందఱి కన్నులకుఁ గనఁబడు మహిమ గలవాఁడవగుచు, త్వం = నీవు, ఇహ చ = ఈవనగిరియందుఁగూడ, వరాన్ = అతిశయితములగు, వరాన్ = వరములను, దదాసి = ఇచ్చుచున్నావు.

తా॥ వరముల నొసఁగుచు సుందరములగు బాహువుల ధరించుకతన సుందరబాహుస్వామి యను సార్థకనామముగల యో దేవా! వనాద్రితట సమీపమున నివసించుచు అందఱికి గనిపించు దివ్యవైభవము గలవాఁడవై నీ విచ్చటఁగూడ భక్తుల కధికవరముల ననుగ్రహించుచున్నావు.

గీ. వరద! సుందరబాహు దేవా! వనాద్రి
తటి నిఖిలగోచరాత్మవైభవుఁడ వగుచు!
నిచట సైతము నినుఁ గొల్చు సుచరితులకు
నిచ్చుచున్నావు మేల్వరాల్ హెచ్చుగాను.

అవతారిక :— 'ఇహ చ దేవ దదాసి వరాన్ పరాన్' అని సామాన్యోక్తితోఁ జెప్పినదానినే స్థాలీపులాకన్యాయముతో విశేషాకారమునఁ జెప్పుచున్నారు.

శ్లో॥ ఇద మిమే శ్రుణుమో మలయధ్వజం
నృప మిహ స్వయ మేవ హి సుందర ! ।
చరణసాత్ కృతవా నితి త ద్వయం
వనగిరీశ్వర ! జాతమనోరథాః ॥ 128

ప్రతి :— హే వనగిరీశ్వర ! = ఓ వనాద్రిప్రభూ !, ఇమే = ఈ, వయమ్ = మేము, ఇహ = ఇచ్చట, (వనాద్రియందు) స్వయం, ఏవ, హి = స్వయముగానే, మలయధ్వజమ్ = మలయధ్వజుఁడనెడు, నృపమ్ = పాండ్యరాజును, చరణసాత్, కృతవాన్ = పాదపరిచర్యార్హుని జేసితివి, ఇతి = అని, ఇదమ్ = ఈ పూర్వవృత్తమును, శ్రుణుమః = వినుచున్నాము, తత్ = అందువలన, జాత, మనోరథాః = పుట్టినకోరిక గలవారము, (భవామః = అగుచున్నాము.)

విశేషములు :— 'స్వయ మేవ హి'— సాధనానుష్ఠానములతో అపేక్ష లేకయే కేవలము స్వకృపచేతనే యని భావము. 'జాతమనోరథాః'— అకారణ జాయమాన కరుణాకటాక్షముచేతఁ బాండ్యరాజగు మలయధ్వజునకు నిజపాద పరిచర్యా భాగ్యము నొసఁగినట్లు మాకును గరుణింతు వని యాశగలిగి యున్నామని యాశయము.

తా॥ ఓవనాద్రినాథా! యీమే మీ వనాద్రియందు సాధనానుష్ఠానాదులతో నపేక్ష లేకయే మలయధ్వజ మహారాజుగారు దేవరవారి యహేతుక జాయమాన కరుణాకటాక్షముచేతఁ జరణపరిచర్యాభాగ్యమును బొందినా రన్న గాథనువిని మాకు నట్టిభాగ్యమును గలిగింతురని పుట్టెఁడాశతోనున్నాము.

చ. ఇతర విశేషసాధనము

తెల్పియు నీకటంచు తొల్లి పాండ్యభూ
పతి మలయధ్వజాఖ్యుఁడు స
పాదకృపాసద్దృష్టిఁ బొంది ము
చ్చట నటు నీపదాంబుజపు
సేవన భాగ్యము నిమ్మటంచు వేఁడ నా
కత సకలమ్ము, నట్టిదనముఁ
గాంచఁగ నుంటిని పట్టి దాసతోఁ ॥

అవతారిక :— ఇట్లు నాల్గు శ్లోకములతో సుందరభుజస్వామి సర్వాభీష్టప్రదుఁడని చెప్పి అనాఁటి చండపాండ్యప్రభువగు క్రిమికంఠుని సమయములను బ్రవాసితులైన భగవద్రామానుజుల చరణనలిన విశ్లేషంబును కోర్వక స్తోత్రారంభము నందే 'సుందరోరుబాహుం! శ్రీరంగేశ్వరం విలోకనాభిలాషీ' అను నిజాభిలాషను తెల్పఁగా వాసఁగు మను స్వమనోరథమును సంక్షిప్తముగా నాల్గు శ్లోకములతో నుపసంహరించుచున్నారు.

శ్లో॥ విజ్ఞాపనాం వనగిరీశ్వర ! సత్యరూపా
మంగీకురుష్వ కరుణార్ణవ ! మామకీనామ్ ।
శ్రీరంగధామని యథాపురమేష సోఽహం
రామానుజార్యవశగః పరివర్తిషీయ ॥ 126

ప్రతి :— హే కరుణార్ణవ ! = దయాసముద్రుఁడ వగు, వనగిరి + ఈశ్వర ! = వనాద్రినాథుఁడ వగు సుందరబాహుమూర్తీ !, సత్యరూపామ్ = యథార్థమగు, మామకీనామ్ = నాసంబంధమైన, విజ్ఞాపనామ్ = మనవిని, అంగీకురుష్వ = అంగీకరింపుము. (విని సఫల మొనర్పుము) ఆమనవి యేమనఁగా— ఏషః = ఈ, సః = ఆ, అహమ్ = నేను, యథాపురమ్ = పూర్వము

నందు వలె, శ్రీరంగధామని = దేవరవారి నివాసస్థానమైన శ్రీరంగము నందు, రామానుజార్యవశగః = భగవద్రామానుజాచార్య గురుచరణుల వశవర్తి నగుచు, పరివర్తిషీయ = సమీపమునం దుందును గాక.

విశేషములు :— కరుణార్ణవ !—'వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః' అని శ్రీమద్రామాయణమునఁ జెప్పిన ప్రకారము పరదుఃఖమును జూచి దుఃఖించుట యను స్వరూపముగల కృపతో నిండినవాఁడా ! అని భావము. వనగిరీశ్వర— అకించనుల మగు మమ్ము సంరక్షించుటకు వనాద్రి నాశ్రయించిన వాఁడా! యని యాశయము. ఏష సోఽహమ్— ఇప్పుడాచార్యవిశ్లేషముచే విషణ్ణహృదయుఁడనై ఆచార్యసమాగమ నిమిత్తము నీస్తోత్రము నుడువఁ బ్రవృత్తుఁడ నగు నేనని తాత్పర్యము. 'రామానుజార్యవశగః పరివర్తిషీయ' సుందర బాహుస్వామి సర్వాభీష్టప్రదుఁడైనను తత్త్వజ్ఞు లగు శ్రీవత్స చిహ్నమిశ్రు లాచార్యవశవర్తిత్వము నే పరమ పురుషార్థముగాఁ బ్రార్థించుటచేత నిదియే సర్వోత్తీర్ణ మని యెఱుంగవలెను.

తా॥ కరుణాసముద్రుఁడ వగు ఓవనగిరినాథా ! యథార్థమగు నాయీమనవిని అంగీకరించి త్వరగా సఫల మొనర్పుము. ఆ మనవి యేమన ఆచార్యుల యెడఁబాటుచేత విషణ్ణహృదయుండనై వారి సమాగమాభిలాషినై దేవరవారి స్తుతిని వ్రాయఁ బ్రవృత్తుఁడ నగు నేను శ్రీవారి నివాసమగు శ్రీరంగమునందు భగవద్రామానుజ గురుచరణుల వశవర్తినై యుందును గాక.

ఉ. ఓనిరవద్య దివ్యకరు
ణోదధి! కాననశైలనాథ! నీ

వీనులఁ బెట్టి నా దయిన
విన్నపమున్ సఫలం బొనర్పు, రా
మానుజ దేశికేంద్ర చర
ణాంబుజ సేవన భాగ్య మందుచున్
నే నివసింతు నెల్లపుడు
నీ యుడుకఁ గంగని మందిరంబునన్.

శ్లో॥ కిం చేదం వద విరించి భావన! వనాద్రీశ! ప్రభో! సుందర!
ప్రత్యాఖ్యాన పరాఙ్ముఖో వరదతాం పశ్య న్నవశ్యం శృణు।
శ్రీరంగశ్రియ మన్వహం ప్రగుణయ న్ త్వద్భక్తభోగ్యాం కురు
ప్రత్యక్షం సునిరస్త మేవ విదధత్ ప్రత్యర్థినాం ప్రార్థనమ్॥ 130

ప్రతి :— విరించి భావన! = బ్రహ్మను ద్భవిల్లఁ జేసినవాఁడా!, వనాద్రీశ = వనగిరినాథా, ప్రభో! = ప్రభువా!, సుందర! = సుందరబాహుమూర్తీ!, వరదతామ్ = నీవర ప్రదత్వప్రసిద్ధిని, పశ్యన్ = చూచుచు, ప్రత్యాఖ్యాన, పరాఙ్ముఖః = త్రోసి వేయుటయందుఁ బెడమొగము గలవాఁడ వగుచు, కించ = మఱియు (పూర్వశ్లోకోక్త విజ్ఞప్తికంటెఁ గూడ) ఇదమ్ = ఈమాటను, అవశ్యమ్ = ముఖ్యముగా, శృణు = వినుము. (అది యేమన) ప్రత్యర్థినామ్ = ప్రతిపక్షులగు పాషండులయొక్క, ప్రార్థనమ్ = ప్రార్థనను (భగవద్రామానుజులను ప్రవాసము గావింపఁజేసి శ్రీరంగశోభ నణఁచివేయ వలయునను కోరికను) ప్రత్యక్షమ్, ఏవ = మాకన్నుల యెదుటనే, సునిరస్తమ్ = బాగుగాఁ ద్రోలగింపఁ బడినదానినిగా, విదధత్ = చేయుచు, శ్రీరంగశ్రియమ్ = శ్రీరంగసంపత్తిని, అన్వహమ్ = ప్రతిదినము, ప్రగుణయన్ = వర్ధిల్లఁ జేయుచు, త్వత్, భక్త, భోగ్యామ్ = దేవరవారి భక్తజనులచేత ననుభవింపఁ దగినదానినిగా, కురు = చేయుము.

విశేషములు :— విరించిభావన !— విరించిం భావయతి (ఉత్పాదయతి) ఇతి— బ్రహ్మను ఉద్భవింపఁ జేసినవాఁడని భావము. 'త్వద్భక్తభోగ్యాం కురు'— భగవద్రామానుజాచార్య ప్రభృతులగు శ్రీవారి భక్తులచేత ననుభవింపఁదగినదానినిగాఁ జేయుము. ప్రత్యర్థినిరసన పూర్వకముగా శ్రీరంగ మంగళానుభవము కొఱకు భవదీయులగు రామానుజార్య ప్రభృతులను రక్షింపు మని యాశయము.

తా॥ బ్రహ్మను గన్నతండ్రి వగు వనగిరినాథుఁడవైన యోసుందరబాహుమూర్తీ ! వరప్రదుఁడ వను ప్రసిద్ధిని దెలుపు నీ వరదరాజనామమును మనస్సులోఁ బెట్టుకొని మావిజ్ఞప్తిని త్రోసివేయుట యందుఁ బెడమొగము గలవాఁడ వగుము. అనఁగా మా విన్నపమును మన్నింపుము. అంతియే కాదు. ఈమాటను తప్పక విని ముఖ్యముగా మన్నింప వలెను. భగవద్రామానుజులను దఱిమివైచి శ్రీరంగవైభవము నణఁచి వేయ వలయునను ప్రత్యర్థులగు పాషండుల కృత్యములను మా కన్నులముందే విఫల మొనర్చి యథాపూర్వకముగా శ్రీరంగ శోభను వర్ధిల్లఁ జేయుచు భవదీయ భక్తుల కనుభావ్య మొనర్పుము.

మ. పరమేష్ఠిప్రభవా ! వనాచలవిభూ! భావంబునం దెన్ని నీ
వరదత్వోరుయశంబుఁ, గా దనక దేవా! సల్పుమా యిద్ది చె
చ్చెర శ్రీరంగముశోభవర్ధిలఁగ దుశ్చేష్టుల్ తలల్ వంప మే
మరయన్ వైష్ణవకోటిభోగ్యముగ నత్యంతంబు శ్రీరంగమున్.

అవతారిక :— ఇట్లు ప్రార్థింపఁబడిన విషయమునే యాదరాతిశయముచేత మఱొకసారి భంగ్యంతరముగాఁ బ్రార్థించుచున్నారు.

శ్లో॥ కారుణ్యామృతవారిధే! వృషపతే! హే సత్య సంకల్పన!
శ్రీమన్! సుందర! యోగ్యతావిరహితా నుత్సార్య సర్వాన్ కిల।
క్షామ్యన్ సాధుజనైః కృతాంస్తు నిఖిలా నేవాపచారాన్ క్షణాత్
తద్భోగ్యా మనిశం కురుష్వ భగవన్! శ్రీరంగధామశ్రియమ్॥ 131

ప్రతి :— భగవన్! = షడ్గుణైశ్వర్య సంపన్నుఁడా!, హే సత్యసంకల్పన! = ఓ సత్యసంకల్పుఁడా!, సద్వత్సల! = సజ్జనులయందు వాత్సల్యము గలవాఁడా! కారుణ్య, అమృత, వారిధే = దయను క్షీరాబ్ధి నంటివాఁడా!, వృషపతే = వనగిరి నాథా! శ్రీమన్ = పురుషకారభూతయగా లగు లక్ష్మీదేవితో నెడఁబాయనివాఁడా!, సుందర! = ఓ సుందరబాహుస్వామీ!, యోగ్యతా, విరహితాన్ = యోగ్యతలేని పామరులను, ఉత్సార్య = పాఱఁదోలి, సాధుజనైః = సాత్త్వికజనులచేత, కృతాన్ = చేయఁబడిన, నిఖిలాన్ = సమస్తములగు, అపచారాన్, ఏవ = అపరాధములను, క్షామ్యన్ = క్షమించుచు, క్షణాత్ = క్షణములో, (త్వరగా) శ్రీరంగధామశ్రియమ్ = శ్రీరంగక్షేత్రముయొక్క సంపదను, అనిశమ్ = ఎల్లప్పుడు, తద్భోగ్యామ్ = ఆసాధుజనులచేత ననుభవింపఁదగిన దానినిగా, కురుష్వ = చేయుము.

విశేషములు :— ఈ శ్లోకమునందలి సంబుద్ధు లన్నియు సాభిప్రాయకములు. హే సత్యసంకల్పన!— యథార్థమగు ప్రతిజ్ఞ గలవాఁడా! 'అప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే! సలక్షణామ్ । నహి ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః' అని రామాయణమున దేవరవారు సెలవిచ్చినట్లు 'ద్వయమును అర్థానుసంధానముతోఁ గూడ సతత మిట్లే నుడువుచు శరీరపాతపర్యంత మీ శ్రీరంగమునందే సుఖముగా నుండు' మని శ్రీ భగవద్రామానుజ గురుపాదుల నుద్దేశించి

సంకల్పించితిరి గదా! అది సత్యప్రతిజ్ఞ కావలదా? అని యీ సంబుద్ధియొక్క యాకూతము. కారుణ్యామృతవారిధే — సామాన్యముగాఁ బరదుఃఖాసహిష్ణువునకు ఆశ్రితుల క్లేశముల విషయమున ఉపేక్ష యుచితము కాదని భావము. అపచారాన్ — చేయరాని వానినిఁ జేయుట చేయవలసిన వానిని మానుట మొదలగు అపరాధములను, (అకృత్యకరణ, కృత్యాకరణాదిరూపా అపచారా ఇత్యుచ్యంతే) 'తదోభగ్యా మనిశం కురుష్వ భగవన్ శ్రీరంగధామశ్రియమ్' — శ్రీరంగక్షేత్ర వైభవమును భగవద్రామానుజతచ్ఛిష్య ప్రశిష్యాది సాత్త్విక జనానుభావ్యముగాఁ జేయవలసిన దని శ్రీకూరేశులవారి గూఢాభిప్రాయము.

తా॥ షడ్గుణైశ్వర్య సంపన్నుఁడవును, సత్యసంకల్పుఁడవును, సద్వత్సలుఁడవును, దయాసముద్రుఁడవును, వనగిరినాథుఁడవును, రమానపాయివియునగు ఓసుందరబాహుస్వామీ! యోగ్యతా విరహితులగు పాషండులను బాఁదోలి సాధుజనులొనర్చిన అపచారము లేవేని యున్నవాని నన్నిటిని క్షమించి త్వరగా శ్రీరంగక్షేత్ర వైభవమును భాగవతానుభావ్యము నొనర్పుము.

శా. కారుణ్యామృతవారిధీ! ప్రణతర
క్షా! సత్యసంకల్ప! శ్రీ
దారా! సంశ్రితవత్సలా! వనగిరీం
ద్రా! దుష్టపాషండులన్
బాఱం దోలి శ్రితాపచారము లెదన్
బాటింప కో దేవ! యీ
శ్రీరంగానుభవంబు భక్తతతికిన్
సిద్ధింపఁగాఁ జేయవే!

శ్లో॥ ఇదం భూయో భూయః పునరపిచ భూయః పునరపి
స్ఫుటం విజ్ఞాప్యాస్మ్యగతి రబుధోఽనన్యశరణః ।
కృతాగా దుష్టాత్మా కలుషమతి రస్మీత్యనవధే
ర్దయాయా స్తే పాత్రం వనగిరిపతే! సుందరభుజ ॥ 132

ప్రతి :— వనగిరిపతే! = వనాద్రినాథుఁడ వగు, సుందరభుజ = ఓ సుందరబాహుమూర్తీ!, అగతిః = దిక్కులేనివాఁడను, అబుధః = పామరుఁడను, అనన్యశరణః = ఇతర శరణము (రక్షణము) లేనివాఁడను (అగు అహమ్ = నేను ఇదమ్ = దీనిని, భూయః భూయః = మఱల మఱల, పునరపిచ = తిరిగియు, భూయః = మఱల, పునః, అపి = తిరిగియు, స్ఫుటమ్ = స్పష్టముగా, విజ్ఞాప్య్యాస్మి = మనవి చేసికొనఁ దలఁచుచున్నాను, దుష్టాత్మా = దుష్టచిత్తుఁడను, కలుషమతిః = మలినబుద్ధియు నగు నేను, కృతాగాః = చేయఁబడిన నేరములు గలవాఁడను, అస్మి, ఇతి = అగుచున్నానను కారణమునలన, తే = నీయొక్క, అనవధేః = హద్దులులేని, దయాయాః = కృపకు, పాత్రమ్ = పాత్రమును.

విశేషములు :— 'అగతిరబుధః'— జ్ఞానరాహిత్యపరమగు 'అబుధ' పదముతోఁ గలిపి చెప్పుటవలన 'అగతి'పదము కర్మరాహిత్యమును జెప్పును. కావున నిచ్చట అగతిః = కర్మయోగరహితుఁడను, అబుధః = జ్ఞానయోగరహితుఁడను అని యర్థము. కనుకనే కర్మజ్ఞానయోగములచేత సాధ్యమగు భక్తియోగముగూడ లేదు గావున (ఏయుపాయము లేదుగాన) అనన్యశరణః = నీవొకడవే శరణముగాఁ గలవాఁడ నని చెప్పుట పొసఁగును. 'ఇదం భూయో భూయః'— ఒకమారు మనవి చేసికొనుటయే చాలియుండఁ బిచ్చివానివలెఁ బదేపదే పలుసారు లిట్లు మనవి చేయుట అపరాధమే యైనను ప్రియ

తరులగు గురుచరణుల యెడఁబాటుచేఁ గలిగిన విషాదముచే నితఁ డిట్లు చేయుచున్నాఁడని తమరు కృపఁదలఁచి నావిన్న పమును మన్నించి గురుల సాంగత్యము మరలఁ ద్వరలో నాకు శ్రీరంగమునఁ గల్గింపుఁడని భావము.

తా॥ వనాద్రినాథుఁడవగు ఓ సుందరబాహుమూర్తీ! కర్మ జ్ఞాన భక్తిరూపములగు ఉపాయము లెఱుంగనివాఁడనై నీవే శరణుగా నమ్మియున్న నే నిదివఱకుఁ జేసియున్న యీ విన్న పమునే మఱల మఱలఁ దిరిగి తిరిగి చేసికొనుచున్నాను. దుష్టచిత్తుఁడు కలుషబుద్ధి యపరాధి యని నన్నుఁ దలపోసి హద్దులు లేని నీ కృపకుఁ బాత్రము నొనర్పుము.

ఉ. సుందరబాహుమూర్తి! వన
శోభిత భూధరవర్తి! నేఁ గడుఁ
మందుఁడ జ్ఞానకర్మముల
మాట యెఱుంగను దిక్కు నీవె నీ
ముందఱ మాటిమాటికి న
మోనమ యంచిది విన్నవించెదన్
వందలమార్లు నీకృపకుఁ
బాత్రుఁడ క్షుద్రుఁడ దుష్టచిత్తుఁడన్.

★

శా. స్వామీ! మీ స్తుతి టీకవ్రాయుటకు నే
శక్తుండనా! కాను, లే
దేమాత్రంబును శాస్త్రవైదుషియు సా
హిత్య ప్రవేశాదులున్,
సామాన్యుండను దాసశేషులదయా
సారంబె నా కున్నయా

శ్రీ హయగ్రీవాయ నమః

## శ్రీ వత్సాంకమిశ్ర విరచిత పంచస్తవీస్థ

# శ్రీ వరదరాజస్తవము

*కవిశేఖర మధ్వాశ్రీ పళ్లెపూర్ణ ప్రజ్ఞాచార్యకృత*

*భావాదర్శనామకాంధ్ర వివరణ*

## పద్య సహితము

అవతారిక :— శ్రీ భాష్యకారసకాశనివాస ప్రకాశితాఖిల వేదాంతతత్త్వార్థు లగు శ్రీ వత్సచిహ్నమిశ్రులు దయాపరులై సకలసజ్జన సంజీవనమునకుఁ బంచస్తవీ వ్యాజమున నర్థపంచకమును బ్రకాశింపఁ జేయఁదలఁచి మొట్టమొదటఁ బ్రధానముగా నకుంఠమహిముఁ డగు శ్రీ వైకుంఠనాథుని స్వరూపరూపాదికమును దాని కుపసర్జనముగాఁ బ్రత్యగాత్మాది స్వరూపమును, వైకుంఠస్తవమునందు గురువందన పూర్వకముగాఁ బ్రదర్శించి వ్యూహాంతర్యాములు గూడ నచింత్య వైభవములు గల వగుటచేఁ దదంతర్భూతములుగనే భావించి విభవావతార భావుక వ్యాపారవిషయకముగా అతిమానుష స్తవమును రచించి అర్చావతార ప్రస్తావమున సమస్త కాంక్షిత ప్రదానదీక్షితుఁ డగు వనాద్రిమందిరు సుందరబాహు మూర్తిని పలుసారులు స్వాచార్యు లగు భగవద్రామానుజుల చరణకమల సేవాఫలము ననుగ్రహింపుఁ డని స్తుతించి 'హస్తి

శ్రీ హయగ్రీవాయ నమః

## శ్రీ వత్సాంకమిశ్ర విరచిత పంచస్తవీస్థ

# శ్రీ వరదరాజస్తవము

కవిశేఖర మధ్వాశ్రీ పళ్లపూర్ణ ప్రజ్ఞాచార్యాకృత

భావాదర్శనామకాంధ్ర వివరణ

## పద్యసహితము

అవతారిక :— శ్రీ భాష్యకారసకాశనివాస ప్రకాశితాఖిలవేదాంతతత్త్వార్థు లగు శ్రీ వత్సచిహ్నమిశ్రులు దయాపరులై సకలసజ్జన సంజీవనమునకుఁ బంచస్తవీ వ్యాజమున నర్థపంచకమును బ్రకాశింపఁ జేయఁదలఁచి మొట్టమొదటఁ బ్రధానముగా నకుంఠమహిముఁ డగు శ్రీ వైకుంఠనాథుని స్వరూపరూపాదికమును దాని కుపసర్జనముగాఁ బ్రత్యగాత్మాది స్వరూపమును, వైకుంఠస్తవమునందు గురువందన పూర్వకముగాఁ బ్రదర్శించి వ్యూహాంతర్యాములు గూడ నచింత్యవైభవములు గల వగుటచేఁ దదంతర్భూతములుగనే భావించి విభవావతారభావుక వ్యాపారవిషయకముగా అతిమానుషస్తవమును రచించి అర్చావతార ప్రస్తావమున సమస్తకాంక్షిత ప్రదానదీక్షితుఁ డగు వనాద్రిమందిరు సుందరబాహుమూర్తిని పలుసారులు స్వాచార్యు లగు భగవద్రామానుజుల చరణకమల సేవాఫలము ననుగ్రహింపుఁ డని స్తుతించి 'హస్తి

శైలనిలయో భవాన్' అని ప్రస్తావింపఁబడిన కరిగిరినాథుని శరణాగతి మంత్రవిధముగా నిపుడు స్తుతింపఁ బోవుచుఁ బ్రారంభింపఁ దలఁచఁబడిన వరదరాజ స్తవము నిర్విఘ్నముగా సమాప్తిఁ జెందుటకు ఆశీర్వచనరూప మగు మంగళమును శిష్యశిక్షార్థము స్తవారంభమున నొనర్చు చున్నారు.

శ్లో॥ స్వస్తి హస్తిగిరిమస్తశేఖరః
సంతనోతు మయి సంతతం హరిః ।
నిస్సమాభ్యధిక మభ్యధత్త యం
దేవ మౌపనిషదీ సరస్వతీ ॥ 1

ప్రతి :— ఔపనిషదీ=ఉపనిషత్సంబంధిని అగు, సరస్వతీ= వాక్కు, (వేదాంతవాక్కు), దేవమ్ = సకల కల్యాణగుణ విశిష్టుఁ డగు, యమ్ = ఏ వేల్పును, నిస్సమ, అభ్యధికమ్= సమానుఁడుగాని అధికుఁడు గాని లేనివానినిగా, అభ్యధత్త = పలికెనో, హస్తిగిరి, మస్త, శేఖరః=కరిగిరిశిఖరమున కలంకార భూతుఁడగు, (సః=ఆ) హరిః = ప్రణతార్తిహరుఁడగు వరద రాజస్వామి, మయి=నావిషయమున, సంతతమ్=ఎల్లప్పుడు, స్వస్తి = శ్రేయస్సును, సంతనోతు = బాగుగా విస్తరింపఁ జేయుఁ గాక.

విశేషములు:—స్తోత్రారంభమున స్వస్తి పదప్రయోగము. వక్తకును, పాఠకులకును మంగళార్థము. 'నిస్సమాభ్యధికమ్— ఇందులకుఁ బ్రమాణమగు ఉపనిషద్వాక్యాది యన 'న తత్సమ శ్చాభ్యధిక శ్చ దృశ్యతే' (ఆపరమాత్మతో సమానుఁడుగాని

యంతకంటె నధికుఁడుగాని కానఁబడఁడు) దేవమ్— దివు క్రీడా, విజిగీషా, వ్యవహార, ద్యుతి, స్తుతి, మోద, మద, స్వప్న కాంతి గతిషు— అను ధాతుపాఠమునఁ జెప్పఁబడినట్లు సకల కల్యాణగుణగణములు కలవాఁ డని యర్థము.

తా॥ 'న తత్సమ శ్చాభ్యధిక శ్చ దృశ్యతే' ఇత్యాద్యుపని షద్వాణి కల్యాణగుణవిశిష్టుఁ డగు నేవేల్పును సమాధికులు లేనివానినిగా నుడివెనో కరిగిరి శిఖరాలంకారభూతుఁ డగు నావరదరాజస్వామి నాకు సంతతము శ్రేయస్సును విస్తరింపఁ జేయుఁగాక.

గీ॥ దేవు నెవ్వని నుపనిషద్దివ్యవాణి
పలుకునో! సమాధికులు లేనిప్రభువుఁ గాఁగ
కరిమహీధర శిఖర శేఖర సదృక్షుఁ
డా వరదరాజు నాకు శ్రేయస్సు లిడుత.

శ్లో॥ శ్రీనిధిం నిధి మపార మర్థినా
మర్థితార్థ పరిదాన దీక్షితమ్ ॥
సర్వభూత సుహృదం దయానిధిం
దేవరాజ మధిరాజ మాశ్రయే ॥ 2

ప్రతి :—శ్రీనిధిమ్=లక్ష్మీ నిలయ మైనట్టియు, అర్థినామ్= యాచకులకు, అపారమ్=అంతు లేని (తఱుఁగని) నిధిమ్=గని యైనట్టియు, అర్థిత, అర్థ, పరిదాన, దీక్షితమ్=ప్రార్థింపఁబడిన పురుషార్థముల నొసంగుటకు దీక్షవహించి నట్టియు, సర్వ, భూత, సుహృదమ్ = సమ స్తప్రాణులకు అనిమిత్తోపకారి యైనట్టియు,

దయానిధిమ్=దయకు గని యైనట్టియు, అధిరాజమ్=స్వామి యైనట్టియు, దేవరాజమ్=దేవతాసార్వభౌముఁ డగు శ్రీ వరద రాజస్వామిని, ఆశ్రయే=శరణుచొచ్చు చున్నాను.

విశేషములు :— ఈ శ్లోకమునందు మంత్రరత్నముయొక్క పూర్వఖండార్థము సంగ్రహింపఁ బడుచున్నది. పూర్వఖండ మిది 'శ్రీమన్నారాయణచరణౌ శరణమహం ప్రపద్యే' శ్రీనిధిమ్—శ్రీః నిధీయతే, అస్మిన్ ఇతి, శ్రీనిధిః, తమ్—శ్రీదేవి యిచట నుంచఁబడుచున్నది, (లేదా) శ్రీలకు నిధి అనఁగా నిధివలెఁ బ్రార్థనీయుఁ డని భావము. దీనిచే మంత్రరత్నము పూర్వఖండములోని 'శ్రీమత్' పదార్థము సంగ్రహింపఁబడెను.

నారయణ పదవాచ్యములగు కొన్నిగుణములు వర్ణింపఁ బడుటచే నారాయణపదార్థ మీమీఁదఁ జెప్పఁబడుచున్నది.

'నిధి మపార మర్థినామ్— అర్థుల కపరిచ్ఛిన్నమగు నిధి యనుటచేత- పరమప్రాప్యత్వము చెప్పఁబడెను. అర్థితార్థ— అను రెండవపాదముచేత 'ప్రాపకత్వము' సంగ్రహింపఁబడెను. సర్వభూతసుహృదమ్— అనుటచేతఁ బ్రాపకత్వమునఁ గించి త్కార నైరపేక్ష్యము చెప్పఁబడినది. దయానిధిం— అనుట చేత సౌహార్దము లేకున్నను పరదుఃఖాసహిష్ణుత్వ ముండుట చేత రక్షణ విషయమున స్వాభావికప్రవృత్తి నుడువఁబడెను. అధిరాజమ్— అనుటచేత స్వామిత్వము వివరింపఁబడెను. దేవరాజమ్— 'త మీశ్వరాణాం పరమం మహేశ్వరం । తం దేవతానాం పరమం చ దైవతమ్' అని చెప్పినట్లు దేవతా

సార్వభౌముఁ డని భావము. ఆశ్రయే— (శరణం ప్రపద్యే) శరణు చొచ్చుచున్నాను. శ్రీమంతుఁడు, ప్రాప్యుఁడు, ప్రాపకుఁడు, సౌహార్ద, దయా, స్వామిత్వ, విశిష్టుఁడు నగు దేవతా సార్వభౌముని చరణముల శరణుచొచ్చు చున్నాను. అని యీ శ్లోకసారము కావున మంత్రరత్నముయొక్క పూర్వ ఖండార్థము దీనిలో సంక్షిప్తముగా భక్తజనానుగ్రహమునకు శ్రీవత్సాంకులు చేర్చి యున్నారు.

తా॥ శ్రీనిధియు నర్థుల కక్షయనిధియు వాంఛితార్థముల నొసంగ బద్ధదీక్షుఁడు సర్వభూతములకు ననిమిత్తోపకారియు దయానిధియు దేవతాసార్వభౌముఁడు నగు దేవరాజగు వరద రాజును శరణుచొచ్చు చున్నాను.

గీ॥ శ్రీనిధియు నర్థులకుఁ బెన్నిధానమాశ్రి
తాళివాంఛితదాన దీక్షాన్వితుండు
అఖిలభూతహితుఁడు కరుణాశ్రయుండు
నైన శ్రీ దేవరాజు నే నాశ్రయింతు. 2

అవతారిక :— ఇంద్రియమార్గాతిక్రాంతుఁ డైనను భగవానుని యింద్రియగోచరత్వరూపమును శరణవరణోపయుక్తము నగు సౌలభ్యగుణమును శ్రీవత్సాంకమిశ్రులు లిట ననుభవించు చున్నారు.

శ్లో॥ నిత్య మింద్రియపథాతిగం మహో
యోగినా మపి సుదూరగం ధియః ।
అ ప్యనుశ్రవ శిరస్సు దుర్గ్రహం
ప్రాదురస్తి కరిశైల మస్తకే ॥ 3

ప్రతి :— నిత్యమ్=శాశ్వత మైనదియు, ఇంద్రియ, పథ, అతిగమ్=ఇంద్రియమార్గము నతిక్రమించినదియు, యోగినామ్ = యోగులయొక్క, ధియః అపి=బుద్ధికిం గూడ, సుదూర గమ్ = మిక్కిలి దూరమును జెందినదియు (అందనిదియు) అనుశ్రవశిరస్సు, అపి=వేదాంతముల యందుం గూడ, సుదుర్గ్రహామ్ = కష్టముచేత గ్రహింపం దగినదియు (సుగ్రహము కానిదియు) అగు మహః=తేజస్సు (వరదరాజస్వామి) కరిశైల మస్తకే = కరిగిరి శిఖరమునందు, ప్రాదురస్తి =ఆవిర్భవించి యున్నది.

విశేషములు :— ఇంద్రియపథాతిగమ్— న మాంసచక్షు రభివీక్షతే తమ్— అన్నట్లు ఇంద్రియాగోచర మని భావము. సుదూరగమ్— విభజించి తెలిసికొన శక్యముగానిది. అనుశ్రవ శిరస్సు—ఆచార్యోచ్చారణము ననుసరించి శ్రూయమాణములు గనుక వేదములకు అనుశ్రవములని పేరు. తచ్ఛిరములు ఉపని షత్తులు (వేదాంతములు) వానియందు. దుర్గ్రహామ్— సుగ్ర హము కానిది. ప్రమాణము.

'యతో వాచో నివర్తంతే । అప్రాప్య మనసా సహ' ఇత్యాదులు.

'ప్రాదు రస్తి కరిశైలమస్తకే' ఇందుకుం బ్రమాణ శ్లోక ములు.

'గంగాయా దక్షిణే భాగే । యోజనానాం శతద్వయే
పంచయోజన మాత్రేణ । పూర్వాంభోధే స్తు పశ్చిమే ।

వేగవత్యుత్తరే తీరే పుణ్యకోట్యాం హరి స్స్వయమ్
వరద స్సర్వభూతానా మద్యాఽపి పరిదృశ్యతే।
వపాహోమే ప్రవృత్తే తు ప్రాత స్సవనకర్మణి
ధాతు రుత్తరవేద్యంతః ప్రాదు రాసీ జ్జనార్దనః ॥

(గంగకు దక్షిణమున రెండువందల యామడలలో నున్న పూర్వసముద్రపుఁ బడమటి తీరమున వేగవతీనది యుత్తర తటమునందు 'పుణ్యకోటీ'క్షేత్రమున శ్రీహరి యందఱికి వరముల నిచ్చుచు వరదనామముతో నేఁటికిని గానవచ్చు చున్నాఁడు. బ్రహ్మచేయు యజ్ఞములో ప్రాతస్సవనకర్మ యందు వపా హోమము జరుగుచుండఁగా నుత్తరవేది యందు సాక్షా జ్జనార్దనుఁడు వరదరాజ రూపముతో నావిర్భవించెను.) దిగ్గ జములచేతఁ బూజింపఁబడుటచే నీకొండకు హస్తిగిరి యని పేరు.

తా॥ శాశ్వతమును, ఇంద్రియాతీతమును, యోగులబుద్ధికి సైత మందనిదియు, వేదాంతములందు సైతము సులభ గ్రాహ్యము కానిదియు నగు నొక తేజస్సు కరిగిరి శిఖరమున నావిర్భవించి యున్నది.

చ. పరిమితి లేనియట్టిది, య
పారజవేంద్రియ వాజిరాజముల్
పరుగిడ దవ్వుగానె కను
పట్టెడు నట్టిది, యోగిబుద్ధికిఁ
జొరఁ బడ రాని దాగమిక
సూక్తుల కందని దెద్ది యద్దియే
కరిగిరి మస్తకంబున నొ
కానొక వెల్గుగ గోచరించెడుః. 3

అవతారిక :— ఇప్పుడు వరదరాజులవారికి కరిగిరిశిఖరావాసము నందలి రసికతాతిశయము శ్రుతికి సైత మాదరణీయమని నుడువుచున్నారు.

శ్లో॥ వల్లికా శ్రుతిమతల్లికామయీ
యేన పల్లవితవిశ్వశాఖయా।
స్వశ్రియా కరిగిరే రనుక్రియాం
వష్టి మృష్టవరదం త మాశ్రయే ॥ 4

ప్రతి :— శ్రుతి, మతల్లికా, మయీ = శ్రేష్ఠమగు శ్రుతి స్వరూపమయిన, వల్లికా=తీఁగె, (శ్రేష్ఠమగు శ్రుతి యనెడు తీఁగె) యేన = ఏవరదరాజస్వామిచేత, పల్లవిత, విశ్వ, శాఖయా = పల్లవించిన సమస్తములగు కాణ్వ,కారక, కాలాపాది, వేదశాఖలుగల,(వనగిరిపక్షమున) చిగిర్చిన సమస్తములగు కొమ్మలు గల, స్వశ్రియా=స్వకీయశోభచేత, కరిగిరేః=హస్తిశైలముయొక్క, అనుక్రియామ్ = పోలికను (అనుకరణమును) వష్టి = కోరుచున్నదో, తమ్=అటువంటి, మృష్ట, వరదమ్= పూర్ణవరప్రదుఁ డగు వరదరాజస్వామిని, ఆశ్రయే=శరణు చొచ్చుచున్నాను.

విశేషములు :— 'వల్లికా శ్రుతిమతల్లికామయీ'—మతల్లికా శబ్దము శ్రేష్ఠవాచకము. శ్రుతి (వేదము) ప్రమాణములలో శ్రేష్ఠముగాన శ్రుతిమతల్లిక యైనది. దీనియందు వల్లికాత్వ మారోపింపఁబడినది. శ్రేష్ఠమగు వేదమనెడు తీఁగె అనిభావము. 'యేన పల్లవిత విశ్వశాఖయా'— వేదైశ్చ సర్వై రహ మేవ వేద్యః— సర్వే వేదా యత్పద మామనంతి— ఇత్యాది శ్రుతు

లచేఁ జెప్పఁబడినట్లు సర్వవేదప్రతిపాద్యుఁ డగు భగవానుఁడు గేయములకుఁ బదేపదే నుడువఁబడు పల్లవివలె భగవంతునికి గేయములవంటి కాణ్వ, కాఠక, సుబాలాది, వేదశాఖలకు 'పల్లవ' స్థానమువలె నలంకారభూతుఁ డని 'పల్లవిత' శబ్దముచే ధ్వనిత మగుచున్నది. 'వష్టి— 'వశ=కాంతౌ, కాంతి = రిచ్ఛా' అను ధాతువునకు లట్-రూపము కోరుచున్నది యని యర్థము. మృష్ట వరదమ్ = వాంఛితాధిక ఫలప్రదమ్— కోరఁబడిన దానికంటె నధిక ఫలప్రదుఁ డని భావము. మృష్ట మనఁగా సమృద్ధి. కరిగిరే రనుక్రియాం వష్టి— శ్రీవరదరాజస్వామి యంద అికి గోచరించునట్లు కరిగిరిశిఖరమున వేంచేసి యందలి శాఖ లకు (కొమ్మలకు) పల్లవమువలె (చిగురు వలె) నలంకారమై తన సౌలభ్యమును జూపినట్లు తన శాఖలయందు (కాణ, కాఠక, సుబాలాది వేదశాఖలయందు) పల్లవము (పల్లవి)వలె నలంకార మగుచు నట్టి సౌలభ్యమును జూపలేదని శ్రుతిమతల్లి కరిగిరి సామ్యమును దనకుఁ గోరుకొను చున్నది అని భావము.

తా॥ శ్రుతిమతల్లి యనెడు వల్లి (తీఁగె) ఏ వేల్పుచేతఁ జిగిరించిన కాణ్వ, కాఠ, కాలాప, సుబాలాది శాఖలు గల(కరిగిరి పక్షమున— కొమ్మలుగల) స్వకీయశోభచేతఁ గరిగిరిసామ్య మును కోరుచున్నదో! కోరినదానికంటె నధికముగా వరముల నిచ్చు ఆ వరదరాజస్వామిని శరణు చొచ్చుచున్నాను.

ఆ.వె. శ్రుతిమతల్లి వల్లి శోభిల్లియు నెవండు
పల్లవముగ శాఖ లెల్లఁ గ్రాల,

సర్వదృశ్యవరద చారుకిరీట మా
హాస్తిశైలసామ్య మభిలషించు. 4

అవతారిక :— శ్రుతికంటెను హాస్తిగిరియే అధికమని నుడువుచున్నారు.

శ్లో॥ యం పరోక్ష ముపదేశత స్త్రయీ
నేతి నేతి పరపర్యుదాసతః ।
వక్తి య స్త మపరోక్ష మీక్షయ
త్యేష తం కరిగిరిం సమాశ్రయే ॥ 5

ప్రతి :— త్రయీ = శ్రుతి, (బృహదారణ్యకోపనిషత్) ఉపదేశతః=ఉపదేశమువలన, నేతి, నేతి=(న X ఇతి–న X ఇతి) కాదు కాదని (పరబ్రహ్మము చెప్పఁబడిన దాని వంటిది కాదు కాదని) పర, పర్యుదాసతః=ఇతరములయొక్క నిషేధమువలన, యమ్=ఎవని, పరోక్షమ్=చాటుగా, వక్తి=చెప్పుచున్నదో, యః, ఏషః=ఏ యీకొండ, తమ్=ఆ పరబ్రహ్మమగు వరదరాజస్వామిని, అపరోక్షమ్=ప్రత్యక్షముగా (కన్నులముందు) ఈక్షయతి = చూపించుచున్నదో, తమ్ = అటువంటి, కరిగిరిమ్=హాస్తిశైలమును, సమాశ్రయే=భక్తితో ఆశ్రయించుచున్నాను.

విశేషములు :— పర, పర్యుదాసతః— శ్రుతి— ద్వే వావ బ్రహ్మణో రూపే,— మూర్తం చామూర్తం చ, సత్యం చానృతం చ ఇత్యాది వాక్యముల యందలి మూర్త, సత్య, శబ్దములచేతను, అమూర్తానృత శబ్దములచేతను, ప్రతిపాదింపఁ

బడిన చిదచిత్తత్త్వరూపాదుల పర్యుదాసము (నిషేధము) వలన చిదచిత్తత్త్వమాత్ర రూపత్వాద్యుక్త ప్రకారము బ్రహ్మము కాదని దానిని నిరసించుటయే చివరకుఁ దేలుట వలన, పరోక్షమ్ = అప్రత్యక్షముగా (చాటుగా) బ్రహ్మస్వరూప ప్రకారమును నిరూపింపకయే యని భావము. అపరోక్ష మీాక్షయతి=బృహదారణ్యకోపనిషత్తు వివిచ్య (స్పష్టముగాఁ జెప్పఁజాలని బ్రహ్మవస్తువును ఇదిగో! ఈ వరదరాజస్వామియే యా బ్రహ్మమని కరిగిరి స్పష్టముగా నెల్లరికిఁ జూపించుచున్న దని సారాంశము. ఈ విషయమే 'నిత్యా మింద్రియ పథా తిగ'మ్మనెడు 2వ శ్లోకమున వర్ణింపఁ బడినది. 'తం కరిగిరిం సమాశ్రయే'– పరబ్రహ్మమగు వరదరాజస్వామిని సాక్షాత్కరింపఁ జేయుటవలనఁ గరిగిరి సమాశ్రయణీయ మని భావము. బృహదారణ్యకోపనిషత్తునందు— 'ద్వే వావ బ్రహ్మణో రూపే మూర్తం చామూర్తం చ సత్యం చానృతం చ' అని యుపక్రమించి, తస్య హైతస్య పురుషస్య రూపం యథా మహారజనం వాసః పాండవావికః యథేంద్ర గోపా యథా గ్న్యర్చి ర్యథా పుండరీకమ్' ఈ మొదలగు వాక్యములచేత మూర్తామూర్త కనకాంబర పాండుకంబళాది రూపములను నుడివి 'అథాత ఆదేశో నేతి నేతి నే త్యన్య త్పర మస్తి. అథ నామధేయం సత్యస్య సత్యం ప్రాణా వై సత్యమ్– తేషా మేవ సత్యమ్' అని చెప్పఁబడినది. పై శ్రుతివాక్యముల కన్నింటికి సూ॥ ప్రకృతైతా వత్త్వం హి ప్రతిషేధతి తతో బ్రవీతి చ

భూయః 3-2-21 బ్రహ్మ సూత్రమున అర్థనిర్ణయ మొనర్పఁ బడినది.

తా॥ త్రయి (బృహదారణ్యకోపనిషత్తు) ఉపదేశమువలనఁ బరబ్రహ్మము పూర్వము చెప్పఁబడిన లక్షణములు కలది మాత్రమే కాదు- కాదు- అని పరపర్యాదాసవలననే వరదరాజ స్వామిని అప్రత్యక్షముగా నుడువుచున్నదో! యా వరదరాజ స్వామిని ఈ కరిగిరి యందఱకుఁ బ్రత్యక్షముగాఁ జూపుచున్నది. కావున వరదరాజస్వామిని పరబ్రహ్మమని స్పష్టముగాఁ జెప్పఁ జాలని శ్రుతి కంటె నందఱికన్నులకుఁ బరబ్రహ్మమగు శ్రీ వరద రాజస్వామిని స్పష్టముగాఁ జూపించుచున్న కరిగిరియే మిన్న యని భావము.

ఆ॥ వె॥ నేతి నేతిశ్రుతులచేత వేనిఁ బరోక్ష
భంగిఁ బ్రాఁతపలుకు పలుకు నట్టి
పరమదైవతంబుఁ బ్రత్యక్షముగఁ జూపు
నట్టి హస్తిశిఖరి నాశ్రయింతు. 5

శ్లో॥ ఏష ఈశ ఇతి నిర్ణయం త్రయీ
భాగధేయరహితేషు నో దిశేత్ ।
హస్తిధామని న నిర్ణయేత కో
దేవరాజ మయ మీశ్వర స్త్వితి ॥ 6

ప్రతి :— త్రయీ = వేదత్రయము, భాగధేయ, రహితేషు = అదృష్టహీనుల విషయమున, ఏషః = ఈ వరదరాజ స్వామి, ఈశః = సర్వేశ్వరుఁడు, ఇతి = అని, నిర్ణయమ్ = నిశ్చయ

మును, నో, దిశేత్=ఇయ్యలేదు, (కానీ) హస్తిధామని, తు=కరిగిరియందన్ననో, దేవరాజమ్=వరదరాజస్వామిని, అయమ్=ఇతఁడు, ఈశ్వరః = సర్వేశ్వరుఁడు, ఇతి = అని, కః=ఎవఁడు, న, నిర్ణయేత=నిర్ణయింపలేఁడు. (ఎల్లరును నిర్ణయింతురని భావము.)

విశేషములు :— త్రయీ— 'ఇతి వేదాస్త్రయ స్త్రయీ' అమరము. ఋగ్వేద యజుర్వేద సామవేదములు. ఇందలి పూర్వార్థములోని విషయమే వైకుంఠ స్తవము 13వ శ్లోకమున వివరింపఁబడినది.

'య త్కేచి దత్ర భవతీం శ్రుతి మాశ్రయంతో
వ్యర్థే కదృష్టివినివిష్టధియో వినష్టాః'

'కొందఱు పూజ్య యా శ్రుతిని భవ్యంబౌ
ప్రమాణంబుగా మహిఁ బేర్కొంచుఁ
దదర్థ మెల్లఁ గుదృశుల్ మార్తుర్ వినా
శంబుకై'                                  (మదీయ పద్యభాగము)

ఉత్తరార్థ భావమిది— కరిగిరి నివాసము దేవరాజగు వరదరాజస్వామికి సర్వేశ్వరత్వాదులతో నెడఁబాటు లేని సమస్తకల్యాణ గుణాత్మకత్వమును జాటుచున్నది.

తా॥ వేదములు దురదృష్టవంతుల విషయమున నీ వరద రాజస్వామి సర్వేశ్వరుఁడని నిర్ణయింపఁ జాలక పోయినను, శ్రీకరిగిరియందుఁ బ్రతిజనుఁడును వరదరాజస్వామియే సర్వేశ్వరుఁడని నిర్ణయింపఁజాలును.

క॥ దురదృష్టులకున్ బ్రదయి యీ
శ్వరుఁ డితఁ డని నిర్ణయింపఁ జాలదు గానీ,
కరిగిరియం దితఁడే యీ
శ్వరుఁడని నిర్ధారణంబు సలుపు జడుండున్. 6

అవ :— వెనుకఁ జెప్పినదానినే తేటతెల్ల మొనర్చు చున్నారు.

శ్లో॥ హై కుదృష్ట్యభినివిష్టచేతసాం
నిర్విశేష, సవిశేషతా, శ్రయమ్ ।
సంశయం కరిగిరి ర్నుద త్యసౌ
తుంగ మంగళ గుణాస్పదే హరౌ ॥ 7

ప్రతి :— తుంగ, మంగళ, గుణ, ఆస్పదే=ఉన్నతములును (ఆనందగుణము వలెనే అపరిచ్ఛేద్యంబులును), కల్యాణకరములును అగు గుణములకు నిలయమైన, హరౌ=శ్రీమన్నారాయణమూర్తి విషయమున, కుదృష్టి, అభినివిష్ట, చేతసామ్=కుదృష్టిచేత (అయథార్థ జ్ఞానముచేత) నాటుకొనిన మనస్సు గలవారికి, నిర్విశేష, సవిశేషతా, ఆశ్రయమ్ = నిర్గుణత్వ, సగుణత్వములకు నెలవైన, సంశయమ్=సందేహమును, అసౌ=ఈ, కరిగిరిః=హస్తిశైలము, నుదతి=పోగొట్టుచున్నది.

విశేషములు :— నిర్విశేష, సవిశేష, తాశ్రయం సంశయమ్— శ్రీమన్నారాయణమూర్తి నిర్గుణుఁడా! సగుణుఁడా!

అను కోటిద్వయావలంబి సందేహమును అని భావము. అసౌ, కరిగిరిః— నిత్య,నిరవద్య, నిరతిశయ, కల్యాణగుణములు పుష్కలముగా నుండి యందఱకుఁ గన్నులముందు కనిపించు దేవరాజును దలతో మ్రోయుచున్న యీ కరిగిరి అని తాత్పర్యము. నుదతి = నిరసించు చున్నది. కుదృష్టులకు ఉపనిషత్తులవలనఁ గూడ నేర్పడని 'దేవరాజు మంగళగుణగణాకరుఁ'డను నిర్ణయమును కరిగిరి సులువుగాఁ గలిగించుచున్నది యని సారాంశము. హై— ఈ శబ్దము (అవ్యయము) ప్రసిద్ధిని దెలుపును. శంకర పక్షీయులగు మాయావాదులు బ్రహ్మమునకు సగుణత్వము నంగీంరింపక పోయినను వారిలో నొక తెగవారగు యాదవ ప్రకాశ పక్షీయులు దశాభేదముచేత బ్రహ్మము నంగీకరించుట చేత బ్రహ్మము సగుణమా నిరుణమా! అని కోటి ద్వయావలంబి సంశయ మేర్పడెనని తెలియవలెను.

తా॥ ఆనందగుణమువలె నపరిచ్ఛిన్నంబులగు కల్యాణగుణములకు నిత్యనిలయుఁడగు శ్రీ నారాయణుని విషయమున శ్రీహరి సగుణుఁడా! నిర్గుణుఁడా! యని హృదయమున గాఢముగా నాటుకొనిన కుదృష్టుల సంశయము నీ కరిగిరి సులువుగా నివారించుచున్నది ప్రసిద్ధము.

ఉ॥ ఎందును మేరలన్ నుడువ
నేరికి శక్యముగాని యట్టి యా
నందగుణంబు నట్లె సుగు
ణంబుల కాలయమైన చక్రిపై

నెందులకో! కుదృష్టులకు
నేర్పడు నిర్గుణుఁడో! పరుండొ! యన్
సందియమున్ తొలంచుఁ గరి
శైలవరం బిది చూచి నంతనే. 7

అవతారిక :— సాత్వికులు కూడ నుపబృంహణ వాక్యములతోఁ గూడిన శ్రుతిచేతఁ దత్త్వనిర్ణయము నెట్లో చేసినను కరిగిరి మాత్రము విలక్షణముగా నందఱకు స్వయముగా భగవంతుని అనుభవింపఁ జేయుచున్నదని యీ శ్లోకమున ననుగ్రహించు చున్నారు.

శ్లో॥ న్యాయతర్కముని ముఖ్యభాషితైః
శోధితైః సహ కథం చన త్రయీ ।
జోషయే ద్ధరి మనంహసో జనాన్
హస్తిధామ సకలం జనం స్వయమ్ ॥ 8

ప్రతి :— త్రయీ = వేదత్రయము, శోధితైః = శుద్ధములైన, న్యాయ, తర్క, మునిముఖ్య, భాషితైః, సహ = న్యాయముల చేతను, తర్కములచేతను, మునిశ్రేష్ఠుల వాక్యములచేతను, కూడ, అనంహసః = పాపరహితులగు, (క్షీణకల్మషులగు) జనాన్ = జనులను, హరిమ్ = దేవరాజును, కథంచన = ఎట్లో కష్టముమీఁద, జోషయేత్ = సేవింపఁజేయును, హస్తిధామ = కరిగిరి, సకలమ్ = సమస్తమగు, జనమ్ = జనమును, స్వయమ్ = స్వయముగానే (ఇతరులయపేక్ష లేకుండనే) (హరిమ్ = దేవరాజును (భగవంతుని) జోషయేత్ = సేవింపఁజేయును.)

విశేషములు :— శోధితైః— శోధన చేయఁబడిన— అనఁగా అపన్యాయములు తర్కాభాసములు చేరకుండ రాజస తామస పురాణములు కాకుండ గాలింపఁబడిన, న్యాయ— తర్క— మునిముఖ్యభాషితైః— న్యాయ=పూర్వోత్తర మీమాంసాన్యాయముల చేతను— తర్క=అనుకూల తర్కముల చేతను, అనఁగా— పర్వతో వహ్నిమాన్ ధూమాత్— (పొగయుండుటవలనఁ గొండ నిప్పుకలది) అను అనుమాన ప్రమాణమున - ప్రతిపక్షి - ధూమోఽస్తు వహ్ని ర్మాస్తు (పొగయుండినను వహ్ని లేకపోవుఁగాక) అని యప్రయోజక శంక చేసినప్పుడు— 'యది వహ్ని ర్న స్యాత్ తర్హి ధూమోఽపి న స్యాత్' (వహ్ని లేనిచో ధూమము గూడ లేకపోనీ) అని చెప్పుటలు - అనుకూల తర్కములు, ముని ముఖ్య భాషితైః=మునిశ్రేష్ఠులగు వాల్మీకి, పరాశర, వ్యాస, భాషితములైన శ్రీమద్రామాయణ, విష్ణుపురాణ, భారతాది సాత్త్వికపురాణముల చేతను, అనంహసః— క్షీణకల్మషులైన, 'జన్మాంతర సహస్రేషు తపోధ్యాన సమాధిభిః। నరాణాం క్షీణ పాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే' (వేలకొలఁది జన్మాంత రములందుఁ దపస్సులచేత, ధ్యానములచేత, సమాధినిష్ఠలచేత క్షీణపాపులగు జనులకు శ్రీకృష్ణునియందు భక్తి జనించును.) సకలం జనమ్=పండితులను పామరులను.

(3)

తా॥ పరిశుద్ధములగు పూర్వోత్తర మీమాంసాన్యాయములచేతను, అనుకూలతర్కములచేతను, సాత్త్వికములగు శ్రీమద్రామాయణ, విష్ణుపురాణ, భారతాదులచేతను, ఉపబృంహితమై వేదత్రయి అనేక జన్మములలోఁ జేసిన తపస్సులచేత క్షీణకల్మషులగు జనుల నెట్లో భగవంతుఁడగు దేవరాజును సేవింపఁజేయును. కరిగిరి యన్ననో యట్లు గాక అన్యనిరపేక్షకముగానే తనంతఁ దానే యాబాలగోపాలము చేత శ్రీ దేవరాజును సేవింపఁజేయుచున్నది. కావునఁ త్రయి కంటె శ్రీ కరిగిరియే మిన్న.

మ॥ పరిశుద్ధంబులు న్యాయతర్కములచే
భద్రాయితంబై మునీ
ద్వర భాషావళిభూషితం బగుత్రయీ
వా క్కెట్టులో! యెట్టులో!
హరి సేవింపఁగఁజేయు నిష్కలుషులన్,
హ స్త్యద్రియో సుల్వగా
హరి దర్శింపఁగఁజేయు నెల్లరకుఁ దా
నై ఘోర కేసాయమున్.

శ్లో॥ అద్భుతం మహ దసీమ భూమకం,
కించి దస్తి కిల వస్తు నిస్తులమ్ ।
ఇ త్యఘోషి య దిదం త దగ్రత
స్తథ్య మేవ కరిధామ్ని దృశ్యతే ॥ 9

ప్రతి :— అద్భుతమ్ = ఆశ్చర్యకరమైనదియు, మహత్ = గొప్పదియు, అసీమ భూమకమ్ = అపరిచ్ఛిన్న మహిమ గలదియు,

నిస్తులమ్=సాటిలేనిదియుఅగు, కించిత్=ఒకానొక, వస్తు=వస్తువు, అస్తి, కిల=ఉన్నది సుమా, ఇతి=అని, యత్=ఏది, అఘోషి=చాటఁబడెనో, తత్=ఆ ప్రసిద్ధమగు వస్తువు, కరిధామ్ని=కరిగిరియందు. ఇదమ్=ఇదిగో, అగ్రతః=ఎట్టెదుట, తథ్యమ్, ఏవ=యథార్థముగానే, దృశ్యతే=కనఁబడుచున్నది.

విశేషములు :— అద్భుతమ్=సమస్తములైన విజాతీయ సజాతీయములకంటె నత్యాశ్చర్యకరము ఐన— అసీమ భూమకమ్=అపరిచ్ఛిన్న స్వభావముగల, కించిత్=తెలియఁబడిన యంశములోఁ గూడ నిది యిట్టిదని చెప్పుటకు సాధ్యముగాని, అగ్రతః = మాంసచక్షుష్కులమగు మనయెదుటఁ గూడ, దృశ్యతే=ప్రత్యక్షీక్రియతే— చూడఁబడుచున్నాఁడు. 'యతో వా ఇమాని భూతాని జాయంతే యేన జాతాని జీవంతి, యత్ ప్రయం త్యభిసం విశంతి, త ద్విజిజ్ఞాసస్వ, త ద్బ్రహ్మేతి, త దేవ సౌమ్యేద మగ్ర ఆసీత్, ఏక మేవా ద్వితీయం బ్రహ్మ, యః సర్వజ్ఞ స్సర్వవిత్, పరాఽస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియాచ, న తత్సమ శ్చాభ్యధిక శ్చ దృశ్యతే, ఏష సర్వభూతాంతరాత్మా అపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః' ఈ మొదలగు శ్రుతి శతములచేతఁ జెప్పఁబడిన వైభవాతిశయము గల నారాయణుఁడు కరిగిరియందుఁ జక్కఁగాఁ గనఁబడుచున్నాఁడని భావము.

తా॥ అద్భుతమును, మహత్తమమును, అపరిచ్ఛిన్న మహిమమును, అపరిచ్ఛిన్న స్వభావమును, నిరుపమానంబును, అగు వస్తు వొకటి కలదని శ్రుతిశతంబులు దేనినిఁ జాటు చున్నవో యా పరవస్తువు కరిగిరియందు నందఱి కన్నుల ముందఱ నిదిగోనని చూపుటకు ననువుగా సత్యముగాఁ జాటఁబడు చున్నది.

ఉ॥ నిస్తులమున్ మహాద్భుత మ
నీ దృశరూప మసీమభూమ మా
వస్తు వొకండు వేదముల
వాకొనఁగాఁ బడె నేది యిన్నగా,
శస్త ముదాత్త మా పరమ
సత్యము వస్తువె కంటిముందఱన్
హస్తి మహామహీధరము
నందు వెలింగెడుఁ జూడ నెల్లరున్.

అవతారిక :— ప్రత్యక్షాది ప్రమాణాంతరముల సంవాద మున్నప్పుడే యాగమమునకుఁ బ్రామాణ్య ముండునని వాదించు వేదబాహ్యుల మతమునందు సైతము వరదరాజస్వామిని సకల జనసాక్షాత్కారక్షమునిగాఁ జేయుచున్న కరిగిరిచేత వేదత్రయి ప్రామాణ్యము ననుభవించుచున్న దని యీ శ్లోక మున నుడువుచున్నారు.

శ్లో॥ సంవదేత కిల యత్ ప్రమాంతరై
సత్ ప్రమాణ మితి యే హి మేనిరే।
తన్మతేఽపి కిల మానతాం గతా
హస్తినాఽద్య పరవస్తుని త్రయీ॥ 10

ప్రతి :— యే=ఏవాదులు, యత్, కిల=ఏది, ప్రమాణ ముగా నభిమతమో, (తత్ = అది) ప్రమాంతరైః=ఇతర ప్రమాణములతో, సంవదేత=అనుకూలపడి యుండవలెను, (విరుద్ధము కాకూడదు) తత్ =అట్టిది, ప్రమాణం, హి, ఇతి= ప్రమాణమని తలంచిరో, తన్మతే, అపి= అట్టివారల మతము నందుఁ గూడ, త్రయీ = వేదత్రయి, అద్య = ఇప్పుడు, హస్తినా = (పరవస్తువగు వరదరాజస్వామిని కనులముందు ప్రత్యక్షముగాఁ జూపుచున్న) కరిగిరిచేత, పరవస్తుని=పరవస్తు విషయమున, మానతామ్=ప్రమాణత్వమును, గతా, కిల= పొందినది కదా!

విశేషములు :— హస్తినా— నామైకదేశే నామగ్రహణమ్— అను పరిభాషచేత హస్తిగిరి అను పేరిలో నొక భాగమగు హస్తిపదగ్రహణముచేత హస్తిగిరిగ్రహణ మేర్పడును. భీమపదముచేత భీమసేన గ్రహణమువలె. త్రయీ పరవస్తుని– మానతాంగతా– సర్వజ్ఞుఁడు సర్వశక్తి, సర్వ శరణ్యుఁడు, సకలఫలప్రదుఁడు, పుండరీకాక్షుఁడు, లక్ష్మీపతి, పరమపురుషుఁడు, సర్వనిర్వాహకుఁడని శ్రుతి ప్రతిపాదిత

పరవస్తువును హస్తిగిరి యందఱకుఁ బ్రత్యక్షముగాఁ దన శిరస్సునందుఁ దాల్చుటచేత శ్రుతి యబాధిత విషయమగు చున్నదని భావము.

తా॥ ఏది ప్రమాణముగా నభిమతమో అది యితర ప్రమాణములకు ననుగృహీతమై యుండవలెనని యేవాదులు తలఁచిరో వారి మతమునందుఁగూడ వేదత్రయి పరవస్తువగు (శ్రీ) వరదరాజస్వామిని బ్రత్యక్షముగా శిరమునందు దాల్చి చూపుచున్న హస్తిగిరిచేతఁ బరమ ప్రమాణపదవిని బొందింపఁ బడినది.

ఉ॥ ఏది ప్రమాణరూపముగ
నిష్టమొ, యద్ది ప్రమాంతరైక సం
వాదిగ నుండ నౌ ననెడు
వాదులకుం గడుసమ్మతంబుగా
నాదిమతత్త్వమా వరదు
నౌదలఁ దాలిచి హస్తిశైల మీ
మాదిరిఁ జూపుచుం ద్రయిఁ బ్ర
మాణతమంబని చాటుచుండెడిన్.

ఈ స్తవమునందు మొదటి పదిశ్లోకములు రథోద్ధతావృత్త నిబద్ధములు. రాన్నరా విహ రథోద్ధతా లగా— ర, న, ర, గణములు । లఘువు । గురువు పాదపాదమున రథోద్ధతా వృత్తమున కుండును.

అవతారిక :— ఇట్లు మంత్రరత్నమునఁ గల 'నార' పదమునకు అర్థమగు కరిగిరి వైభవము నుగ్గడించి తదయన పదాభిధేయమగు భగవానుని వైభవమును విస్తరించి చెప్పఁ బోవుచుఁ దొలుదొల్త గుణయోగమును బ్రతిపాదించు చున్నారు.

శ్లో॥ గుణాయత్తం లోకే గుణిషు హి మతం మంగళపదం
విపర్యస్తం హస్తిక్షితిధరపతే తత్ త్వయి పునః।
గుణా స్సత్యజ్ఞాన ప్రభృతయ ఉత త్వద్గతతయా
శుభీభూయం యాతా ఇతి హి నిరణైష్మ శ్రుతివశాత్ ॥ 11

ప్రతి :— లోకే=లోకమునందు, గుణిషు=గుణవంతుల విషయమున, మంగళపదమ్=మంగళశబ్దము (వీరు మంగళ కరులు అని) గుణాయత్తమ్ = గుణాధీనము (గుణములఁబట్టి ప్రయోగింపఁబడునదిగా) మతం హి=తలఁచఁబడినది గదా! హే హస్తిక్షితిధరపతే=కరిగిరిప్రభువగు ఓ వరదరాజస్వామీ! త్వయి, పునః=నీ విషయమునందో, విపర్యస్తమ్=తలక్రిందులు, (భవతి = అగుచున్నది) సత్యజ్ఞాన ప్రభృతయః=సత్యము, జ్ఞానము, మున్నుగాఁగల, గుణాః ఉత=గుణములన్నవో, త్వత్ గతతయా=నిన్నాశ్రయించుటచేత, శుభీభూయమ్=మంగళత్వ మును, యాతాః ఇతి=పొందినవని, శ్రుతివశాత్ = వేద సాహాయ్యమువలన, నిరణైష్మ, హి=నిశ్చయించుకొంటిమి.

విశేషములు :— 'గుణాయత్తం లోకే గుణిషు హి మతం మంగళపదమ్— మణి, ద్యుమణి (సూర్యుఁడు) చంద్ర, చందనాదులందు శోభనతా హేతువు శోభాతపచంద్రికా సుగంధభరాది సంబంధమే యని యెల్లరు నెఱిఁగిన విషయమే. తత్, త్వాయి. పునః, విపర్యస్తమ్— ఆ నియమము నీ విషయమునఁ దలక్రిందులైనది. అనఁగా— మంగళపదము గుణాయత్తము గాక గుణ్యాయత్తమైనది యని భావము. తృతీయ చతుర్థ పాదములు పై విషయమును సమర్థించుచున్నవి. భవదీయస్వరూప నిరూపకములగు సత్యజ్ఞానాది గుణములు నిన్నుఁ జేరుటచేతనే మంగళత్వమును బొందినవి. ఇది యెట్లెంగితిరి ? నిరస్తైమ్న శ్రుతిబలాత్— సత్యస్య సత్యమ్— జ్యోతిషాం జ్యోతిః— ఇత్యాదిశ్రుతుల మూలమున నని సమాధానము.

తా॥ కాంతినిబట్టి యిది మంచిరత్నము, సుగంధమునుబట్టి యిది మంచి చందన మన్నట్లు వీరు మంచివారనుటకు లోకమున గుణములు కారణమై యున్నవి. ఓ కరిగిరీశా! వరదరాజ స్వామీ! నీయం దీలక్షణము తలక్రిందులుగాఁ గన్పట్టు చున్నది. మంగళత్వము గుణములనుబట్టి రాదు గుణినిబట్టి వచ్చునని భావము. ఎట్లన సత్యజ్ఞాన ప్రభృతిగుణంబులు మంగళకరుఁడవగు నిన్నాశ్రయించుట చేతనే మంగళత్వమును బొందె నని 'సత్యస్య సత్యమ్,— జ్యోతిషాం జ్యోతిః' ఇత్యాతి శ్రుతి వాక్యములవలన నిర్ణయించు కొంటిమి.

మ॥ భువి దేవా! గుణులందు మంగళపదం
బున్ గూరుతుర్ సద్గుణా
ళి విరాజిల్లుటచే మణిద్యుమణు లో
లిన్ లక్ష్యముల్, తల్లక్రిం
దవు నీయం దిది నీగుణంబు లగు స
త్యజ్ఞాన ముఖ్యంబులున్
భవదాధారత వన్నెఁ గాంచెఁ ద్రయిచే
భావింతు మీయర్థమున్.

అవతారిక :— భగవంతున కిట్టి గుణవిశిష్టస్వరూపము వేదమునందు నైత మవాఙ్మానసగోచర మని ప్రతిపాదింపఁబడిన దనుచున్నారు.

శ్లో॥ నిరాబాధం నిత్యం నిరవధి నిరంహో నిరుపమం
సదా శాంతం శుద్ధం ప్రతిభట మవద్యస్య సతతమ్।
పరం బ్రహ్మామ్నాతం శ్రుతిశిరసి య ద్వరద! తే
పరం రూపం సాక్షాత్ త దిద మపదం వాఙ్మనసయోః॥ 12

ప్రతి :— నిరాబాధమ్=నిర్వికార మైనట్టియు, నిత్యమ్=శాశ్వత మైనట్టియు, నిరవధి=హద్దు లేనట్టియు, నిరంహః=నిర్మల మైనట్టియు, నిరుపమమ్=సాటి లేనట్టియు, సదాశాంతమ్ = నిత్యానుకూల మైనట్టియు, (భోగ్య మని భావము) శుద్ధమ్=శుద్ధసత్త్వస్వరూప మైనట్టియు, (కనుకనే) సతతమ్ = ఎల్లప్పుడు, అవద్యస్య = దోషమునకు, ప్రతిభటమ్=విరోధి

మైనట్టియు, యత్ = ఏది, (అస్తి = కలదో) తత్ = ఆ, పరం, బ్రహ్మ = పరబ్రహ్మము, శ్రుతిశిరసి = ఉపనిషత్తులందు, వాఙ్మనసయోః = వాక్కులకు మనస్సునకును, అపదమ్ = అందనిదిగా, ఆమ్నాతమ్ = పేర్కొనఁబడినది వరద! = ఓ వరదరాజ స్వామీ! తత్ = ఆ, ఇదమ్ = ఇది, తే = నీయొక్క, సాక్షాత్ = ప్రత్యక్ష మగు, పరమ్ = శ్రేష్ఠమైన, రూపమ్ = స్వరూపము. (భవతి = అగు చున్నది.)

విశేషములు :— నిత్యమ్ = కాలపరిచ్ఛేదరహితమ్— కాలముయొక్క మితిలేనిది, నిరవధి = దేశపరిచ్ఛేద రహితమ్— సర్వదేశములందుఁ గలది యని భావము. 'ప్రతిభట మవద్యస్య సతతమ్'— తన సంబంధులకు సైతము దోష లేశమును గూడ సహింపనిది యని తాత్పర్యము. దోషవిరోధి (నిర్దోషము) అని మాత్రమే చెప్పినచో 'నిరంజనః' అను పదముతోఁ బునరుక్తి వచ్చును.

అపదం వాఙ్మనసయోః— 'న చక్షుషా గృహ్యతే నాపి వాచా,— య త్త దద్రేశ్య మగ్రాహ్యమ్'— ఇత్యాది వేదాంత వాక్యములు పరబ్రహ్మ మవాఙ్మానసగోచర మని నుడువు చున్నవి. వరద! తే పరం రూపం సాక్షా త్త దిదమ్— ఇట్టి పరస్వరూపరూపవిశిష్టుఁడ వగు నీవు భక్తుల సౌలభ్యమునకై కరిగిరిశిఖరమున కలంకారముగా వేంచేసియున్నా వని భావము.

తా॥ నిర్వికారము నిత్యము నిరవధియు నిర్మలము నిరుపమానము సదా భోగ్యము శుద్ధము స్వసంబంధులకుఁ గూడ దోష లేశమును సైతము సహింపనిదియు నగు ఏపరబ్రహ్మము వేదాంతములం దవాఙ్మానసగోచర మని పేర్కొనఁ బడినదో యది యోవరదరాజస్వామీ! ప్రత్యేకు మగు నీ నిష్కృష్ట పరమ స్వరూప మే.

చ॥ నిరుపమమున్ వినిర్మలము
నిత్యము కేవల శుద్ధ సత్వమున్
నిరవధి నిర్వికారమును
నిత్యసుభోగ్య మవద్యశూన్యమున్
పరము వచోమనోఽతిగము
బ్రహ్మము వేదశిరోనిరూఢ మో
వరద! భవత్స్వరూప మయి
వర్తిలె వారణశైలభూషగాన్ ॥ 13

శ్లో॥ ప్రశాంతానంతాత్మానుభవజ మహానందమహిమ
ప్రసక్తస్తైమిత్యానుకృత వితరంగార్ణవదశమ్ ।
పరం య త్తే రూపం స్వసదృశదరిద్రం వరద! తే
త్రయీ విస్పష్టం తీ పరనిరసనే శ్రామ్యతి పరమ్ ॥ 13

ప్రతి :— హే వరద! = ఓ వరదరాజస్వామీ! ప్రశాంత ......దశమ్— ప్రశాంత = అత్యంతానుకూలమును, అనంత = అపరిచ్ఛిన్నమును, (అగు) ఆత్మ = స్వస్వరూపముయొక్క...,

అనుభవ, జ = సాక్షాత్కారమువలనఁ బుట్టిన, మహానంద= ఆనందాతిశయముయొక్క, మహిమ=ఆధిక్యము మహత్త్వము) చేత, ప్రసక్త=ఏర్పడిన, స్తైమిత్య=నిశ్చలత్వముచేత, అనుకృత = అనుకరింపఁబడిన, వితరంగ=అలలులేని, అర్ణవ=సముద్రము యొక్క, దశమ్=అవస్థగలిగినట్టియు, స్వ, సదృశ, దరిద్రమ్= (నిస్తరంగసముద్రముకంటె) ఇతర సమానవస్తువులేని, యత్ =ఏ, తే=నీయొక్క, పరమ్=అత్యుత్కృష్ట మగు, రూపమ్ =స్వరూపము (అస్తి = కలదో) తత్ =ఆ స్వరూపమును, విస్పృశంతీ=ప్రతిపాదింపఁ దలచుచు, త్రయీ= వేదత్రయి, పరనిరసనే, పరమ్= హేయావయవవికారాదులను నిరసించుట యందే, శ్రామ్యతి=అలసిపోవు చున్నది. (ఆఁగిపోవుచున్నది)

విశేషములు :—భగవానునకు శాంతోదితదశ యనియు, నిత్యోదితదశ యనియు రెండు దశలుగలవు. వానిలో హేయ ప్రత్యనీకకల్యాణైకతానస్వస్వరూపానుభవదశ మొదటిది, విభూత్యను భవదశ రెండవది. ఈ శ్లోకమున భగవంతుని శాంతో దితదశ వర్ణింపఁబడినది. పూర్వార్థముయొక్క భావమిది. అత్యంతానుకూలమును, అపరిచ్ఛిన్నమును అగు స్వస్వరూపముయొక్క సాక్షాత్కారమువలనఁ బొడమి నయపరిచ్ఛిన్నానంద వైభవమువలన నేర్పడిన నిశ్చలత్వముచేత నిస్తరంగ సాగరమువలె నున్న యని భగవత్స్వరూపమునకు విశేషణము. స్వసదృశదరిద్రమ్— కొంచెము పోలుచున్న నిస్తరంగార్ణవము కంటె నితర మగు సదృశవస్తువు లేని దని భావము. 4 వ పాదము

యొక్క సారాంశమిది. భగవానుని యత్యుత్కృష్ట స్వరూప మును బ్రతిపాదింపఁ దలఁచి త్రయి 'నిష్కలం నిష్క్రియం శాంతమ్– య త్త దద్రేశ్య మగ్రాహ్యామ్'– ఇత్యాది వాక్య ములచేత హేయావయవ వికారాది నిరసనముతోనే యాఁగి పోయినది. కాని యున్నది యున్నట్లు వర్ణింపలేక పోయెను. అని అట్టి శాంతోదితదశ ననుభవించు భగవానుఁ డిట్లు కరిగిరి యందు వెలసి సులభుఁ డగుట మాబోంట్ల ననుగ్రహించుట కని యభిప్రాయము.

తా॥ ఓ వరదరాజస్వామీ! అత్యంత భోగ్యము నపరి చ్ఛిన్నము నగు స్వస్వరూపముయొక్క సాక్షాత్కారమువలన జనించిన యానందాతిశయవైభవమునఁ గలిగిన నిశ్చలత్వముచే నలలు లేనియబ్ధిని బోలుచు నితరసదృశవస్తువు లేని నీ యుత్కృష్టస్వరూప మేదికలదో దానిని వేదత్రయి ప్రతిపా దింపఁ దలఁచి కేవలము పరనిరసనముతోనే విశ్రమించినది. సాకల్యముగా నీ స్వరూపమును వర్ణింప నెవరిశక్యము?

మ॥ అతి భోగ్యానవలోకితాంత నిజరూ
పాస్వాదనానంద సం
తతి లబ్ధాచల భావతన్ స్తిమితత
ద్వార్ధిన్ విడంబించుచున్

గతతుల్యేతరవస్తు వైన భవదా
కారంబు వర్ణింప నెం
చి త్రయీవాణి శ్రమించె నన్యము నిరా
సింపన్ రమావల్లభా !

అవతారిక :— చెప్పఁబడిన విషయమునే స్పష్టముగా వివరించు చున్నారు.

శ్లో॥ న వక్తుం న శ్రోతుం న మనితు మథోపాసిషయితుం
న చ ద్రష్టుం ప్రేమ్ణా తదను న చ భోక్తుం హి సుశకమ్ ।
పరం య ద్వస్త్వాక్తం నను వరద సాక్షా త్త దసి భోః
కథం విశ్వస్మై త్వం కరిగిరిపుర స్తిష్ఠస ఇహ ॥ 14

ప్రతి :— వరద ! = ఓ వరదరాజస్వామీ ! పరమ్ = అన్నిటికంటె శ్రేష్ఠమగు, యత్ = ఏతత్త్వము, వక్తుమ్= ఉపదేశించుటకు, న, సుశకమ్=సులభముగానిదియు (శక్యముగానిదియు) (ఉపదేశింపఁబడినను) శ్రోతుమ్ = వినుటకు (గ్రహించుటకు) న, సుశకమ్=శక్యముగానిదియు, (గ్రహింపఁబడినను) మనితుం చ=మననము చేయుటకును, న, సుశకమ్= సులభముగానిదియు, అథ=మననాంతరము, ఉపాసిషయితుం, చ=ఉపాసనచేయ, వాంఛించుటకును, న, సుశకమ్=సులభముగానిదియు, ప్రేమ్ణా=ప్రేమతో, ద్రష్టుం, చ, న సుశకమ్= చూచుటకును శక్యముగానిదియు, తదను=తరువాత, భోక్తుం, చ, న సుశకమ్ = అనుభవించుటకును శక్యముగానిదియు,

(ఇతి=అని, శ్రుత్యా=వేదముచేత) ఉక్తమ్=చెప్పఁబడినదో, తత్=ఆ, వస్తు=పరతత్వము, భోః=ఓ స్వామీ! సాక్షాత్=ప్రత్యక్షముగా, త్వమ్=నీవు, అసి, నను=అగుచున్నావు గదా! కథమ్=ఎట్లు, ఇహ=ఈ భూతలమునందు, కరిగిరి పురః=కరిగిరిముందు, త్వమ్=నీవు, విశ్వాసస్మ=సమస్తజనము కొఱకు, తిష్ఠసే=ఉన్నావు.

విశేషములు :— 'శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః' అను శ్రుతిచేఁ బరతత్వముయొక్క శ్రవణమనన సాక్షాత్కారములు విధింపఁబడినను 'న చక్షుషా గృహ్యతే నాపి వాచా,— యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ— ఇత్యాది శ్రుతులచేతఁ బరతత్వస్వరూపము గుణములు అవాఙ్మానస గోచరములని వర్ణించుటవలన శ్రవణమునకు మొదటిది యగు నుపదేశముతోఁగూడ సాక్షాత్కారానంతరము గలిగెడు నిరంతరానుభవ పర్యంతము గలషట్కము— అనఁగా 1 ఉపదేశము 2 శ్రవణము 3 మననము 4 నిదిధ్యాసనము 5 సాక్షాత్కారము 6 అనుభవము ఇవి యశక్యములని భావము.

శ్రవణము :— తత్వదర్శియగు నాచార్యునివలన న్యాయయుక్తమగు నర్థమును గ్రహించుట.

మననము :— యుక్తులచేత విన్నయర్థమును ధారణ చేయుట.

నిదిధ్యాసనము :— తైలధారవలెఁ దెంపులేని స్మృతి సంతానము.

'సాక్షాత్తదసిభోః'— ఉపదేశాది షట్కమున కందని యా పరవస్తువు నీవే గదా! చతుర్థపాదములో 'విశ్వాస్మై' అనుచోట చతుర్థీ విభక్తివలనను 'తిష్ఠసే' అను చోట ఆత్మనే పదివలనను ఆ పాదమునకు నాయాశ్రితులను రక్షింపఁ గల నని సమస్తజనులకు స్వాభిప్రాయమును బ్రకటించుచు నున్నా వని భావము.

తా॥ వరదరాజస్వామీ! ఏ పరతత్త్వము ఉపదేశించుటకుఁ గాని శ్రవణ మొనర్చుటకుఁగాని, మననము చేయుటకుఁగాని, దర్శించుటకుఁగాని, యనుభవించుటకుఁగాని శక్యముగాదని శ్రుతి చెప్పుచున్నదో! ఆ పరతత్త్వము సాక్షాత్తుగా నీవే యగుచున్నావు గదా! ఉపదేశాదులకు సైత మందని దుర్లభుఁడవగు నీవు నా యాశ్రితుల రక్షింపఁగల నని తెలుపుచు నీలోకమున నీ కరిగిరిముందు నిలిచి యుండుట దేవా! నీ వాత్సల్య సౌలభ్యములఁ జాటు చున్నది.

మ॥ చెవిలోఁ జెప్పఁగ నూఁకొనంగ మదిలోఁ
జింతింప ధ్యానింపఁ గా
నవలోకింప భుజింప నెయ్యది యశ
క్యం బట్టి దుష్ప్రాపవ
స్తువు నీవే గద దేవ యాశ్రితులఁ గా
తుఁ నే నటంచున్ జనుల్
భవదంఘ్రుల్ గొలువంగ నీగిరిపురో
భాగంబునన్ నిల్చితే? 14

అవతారిక :— ఈ శ్లోకమున శ్రీ వరదరాజస్వామికి షాడ్గుణ్యపరిపూర్తిని నుడువు చున్నారు.

శ్లో॥ ప్రకృష్టం విజ్ఞానం బల మతుల మైశ్వర్య మఖిలం
విమర్యాదం వీర్యం వరద ! పరమా శక్తి రపి చ ।
పరం తేజ శ్చేతి ప్రవరగుణషట్కం ప్రథమజం
గుణానాం నిస్సీమ్నాం గణనవిగుణానాం ప్రసవభూః ॥ 15

ప్రతి :— హేవరద ! = ఓ వరదరాజస్వామీ !, ప్రకృష్టమ్ = శ్రేష్ఠమగు, విజ్ఞానమ్ = వివిధజ్ఞానము, అతులమ్ = సాటిలేని, బలమ్ = బలము, అఖిలమ్ = సమగ్రమగు, ఐశ్వర్యమ్ = ఐశ్వర్యము, విమర్యాదమ్ = హద్దులేని, వీర్యమ్ = వీర్యము పరమా = గొప్ప, శక్తిఃఅపిచ = శక్తియును, పరమ్ = ఉత్కృష్టమగు, తేజః చ = తేజస్సును, ఇతి = అనెడు, ప్రథమజమ్ = అన్నికల్యాణగుణములకంటె ముందుపుట్టిన (ప్రథమగణ్య మగు) ప్రవరగుణషట్కమ్ = శ్రేష్ఠమగు నీగుణషట్కము (ఆఱుగుణములు) నిస్సీమ్నామ్ = హద్దులేని, గణనవిగుణానామ్ = లెక్కపెట్ట శక్యముకాని, గుణానామ్ = దయాక్షమాదిగుణములకు, ప్రసవభూః = ఉత్పత్తి స్థానము, (భవతి = అగుచున్నది)

విశేషములు :— ఇందు విజ్ఞానాదులకు వేసిన ఉత్కృష్టేత్యాది విశేషణము లితరచేతనుల విజ్ఞానాదు లట్టివి కావని తెలుపుటకని తెలియవలెను.

తా॥ ఓ వరదరాజస్వామీ ! గుణములలోఁ బ్రథమ గణ్యములగు శ్రేష్ఠమగు జ్ఞానము, సాటిలేనిబలము, సమగ్రమగు నైశ్వర్యము, అవధిలేని వీర్యము, ఉత్కృష్టమగు శక్తి, యధికమగు తేజస్సు, అనెడి యీ యాఱుగుణములు హద్దులేని లెక్కపెట్టరాని దయాక్షమాది కల్యాణగుణములకుఁ బుట్టినిల్లు.

చ॥ గురుతరమైన జ్ఞానము, న
కుంఠబలంబు, సమగ్రమైన యీ
శ్వరత, యపారవీర్య మురు
శక్తి, మహోజ్జ్వల తేజ, మన్ మహో
త్తర గుణషట్క మిద్ది వర
దా ! ప్రథమప్రభవంబు జన్మమం
దిరము దయాక్షమాదిగణ
నీయగుణాళి కనంత సంఖ్యకున్. 15

అవతారిక :— భగవానుఁడు సమస్తకల్యాణగుణుఁడైనను పరవ్యూహ విభాగమునందు గుణావిర్భావమును తిరోభావము నీ క్రిందిశ్లోకముతోఁ జెప్పుచున్నారు.

శ్లో॥ గుణైష్షడ్భిస్త్వేతైః ప్రథమతరమూర్తి స్తవ బభౌ
తత స్తిస్ర స్తేషాం త్రియుగ ! యుగళై ర్హి త్రిభి రభూః ।
వ్యవస్థా యా చైషా నను వరద ! సావిష్కృతివశాత్
భవాన్ సర్వత్రైవ త్వగణిత మహామంగళగుణః ॥ 16

ప్రతి :— త్రియుగ ! = మూఁడు జంటల గుణములుగల (షడ్గుణములుగల) హే వరద ! = ఓ వరదరాజస్వామీ ! తవ = నీయొక్క, ప్రథమతరమూర్తిః = మొట్టమొదటి మూర్తి (పరవాసుదేవమూర్తి) ఏతైః = ఈ, షడ్భిః = ఆఱు, గుణైః = గుణములచేత, బభౌ = ప్రకాశించెను, తతః = తరువాత, తిస్రః = మూఁడు మూర్తులు, తేషామ్ = ఆ గుణములలో, త్రిభిః = మూఁడు, యుగళైః = జంటలచేత, అభుః = ప్రకాశించినవి, హి = ప్రమాణప్రసిద్ధము, ఏషా = ఈ, వ్యవస్థా = ఏర్పాటు, యా = ఏది, (అస్తి = కలదో) సా = అది, ఆవిష్కృతి, వశాత్ = (ఉపాసకసౌకర్యమునకుఁగా) సంకల్పించుటవలన, అభూత్ = ఆయెను, భవాన్, తు = నీవన్ననో సర్వత్ర = సకలమూర్తులయందును అగణిత, మహత్, మంగళ గుణాః ఏవ, నను = అసంఖ్యాకములు అపరిచ్ఛిన్నములు నగు కల్యాణగుణములు గలవాఁడవే కదా !

విశేషములు :— త్రియుగ— త్రీణి, యుగాని, యస్యసః తస్యసంబుద్ధిః— జ్ఞానబలైశ్వర్య వీర్యశక్తి తేజస్సు లనెడు ఆఱుగుణములు గలవాఁడా ! ప్రథమతరమూర్తిః— భగవానునకు నాల్గుమూర్తులు గలవు

1. పరవాసుదేవమూర్తి. ఇది పరమపదమునం దుండును. దీనియందు పైనిఁ జెప్పఁబడిన జ్ఞానాది షడ్గుణములును గలవు.

2. సంకర్షణమూర్తి— దీనియందు జ్ఞానము, బలము, అను జంటయే (రెండుగుణములే) ఉండును.

3. ప్రద్యుమ్నమూర్తి- దీనియందు ఐశ్వర్యము, వీర్యము అను జంటయే యుండును.

4. అనిరుద్ధమూర్తి- దీనియందు శక్తి, తేజస్సు, అను జంటయే ఉండును.

ఆవిష్కృతివశాత్ — ఈ వ్యవస్థ ఉపాసకుల సౌకర్యము కొఱకు సంకల్పింపఁబడినది. శ్రీ వరదరాజస్వామియం దన్నను గుణసంకోచము లేదు- భవాన్ సర్వాత్రైవ త్వగణిత మహా మంగలగుణః— అని చెప్పుటవలన - ఈ విషయమే.

శ్లో॥ షాడ్గుణ్యా ద్వాసుదేవః
పర ఇతి స భవాన్ ముక్తభోగ్యో ।
బలాఢ్యాత్
బోధా త్సంకర్షణ స్త్వం ॥

అను శ్రీరంగరాజ స్తవ శ్లోకమునఁ బేర్కొనఁబడినది.

తా॥ షడ్గుణైశ్వర్యసంపన్నుఁడవగు ఓ వరదరాజస్వామీ! నీ మొదటి మూర్తియగు పరవాసుదేవమూర్తి యీ జ్ఞానాది షడ్గుణములచేతఁ బ్రకాశించినవి. తక్కిన మూఁడు మూర్తులును ఆ గుణములలో మూఁడు జంటలచేతఁ బ్రకాశించినవి. అనఁగా జ్ఞాన, బలముల జంటచేత సంకర్షణమూర్తియు, ఐశ్వర్య, వీర్యముల జంటచేతఁ బ్రద్యుమ్నమూర్తియు, శక్తి తేజస్సుల జంటచేత ననిరుద్ధమూర్తియుఁ, బ్రకాశించిన వని భావము. ఈ వ్యవస్థ ఉపాసకసౌకర్యమునకు సంకల్పింపఁబడినది. దేవరవారుమాత్ర మన్నిమూర్తులయందును అగణితానంత కల్యాణగుణ విశిష్టులే.

ఉ॥ మోహనరూప ! నీ ప్రథమ
మూర్తి సదా విలసిల్లు షడ్గుణా
వ్యాహతవృత్తి నాపయిన
వర్తిలు మూర్తులమూఁట నీ గుణ
వ్యూహము మూఁడుజంటలయి
యొప్పు, నుపాసకదృష్టితోడ న
భ్యూహిత మీ పథంబు సుగు
ణోదధి వీవు సమస్తమూర్తులన్. 16

అవతారిక :— భగవానుఁడు సమస్త కల్యాణగుణగణ విశిష్టుఁడు గనుక విభవావతారములందు సకలగుణావిర్భావ ముండు నని యాశంకించుకొని యందుఁ గూడ గుణావిర్భావ తిరోభావములు స్వామివారి సంకల్పానుసారమే యుండునని నుడువు చున్నారు.

శ్లో॥ ఇయం వైయూహీ వై స్థితి రథ కి లేచ్ఛావిహృతయే
విభూతీనాం మధ్యే సురనరతిరశ్చా మవతరన్ ।
సజాతీయ స్తేషా మితి తు విభవాఖ్యా మపి భజన్
కరీశ ! త్వం పూర్ణో వరగుణగణై స్తాన్ స్థగయసి 17

ప్రతి :— హేకరీశ!=ఓ వరదరాజస్వామీ! ఇయమ్=ఈ, (పూర్వోక్తమగు) స్థితిః = వ్యవస్థ, వైయూహీ = వ్యూహ సంబంధిని, వై=ప్రసిద్ధము, అథ, కిల=తరువాత, ఇచ్ఛా విహృతయే = స్వేచ్ఛావిహారము కొఱకు, విభూతీనామ్= నీ లీలకుఁ బరికరభూతములగు, సురనరతిరశ్చాం మధ్యే=

దేవతా, మానవ, తిర్యక్కులనడుమ, అవతరన్ =అవతార మెత్తుచు, వరగుణగణైః = కల్యాణగుణసమూహముల చేత, పూర్ణః=నిండినవాఁడవై, (కనుకనే) విభవాఖ్యామ్ అపి= విభవావతార మనెడు పేరినిసైతము, భజన్ =పొందుచు, త్వమ్=నీవు, తేషామ్=వారికి (దేవమానవతిర్యక్కులకు) సజాతీయః, ఇతి, తు=సజాతీయుఁడ నన్న కారణముచేతనే, తాన్ = ఆ కల్యాణగుణములను, స్థగయసి = కప్పివేయు చున్నావు.

విశేషములు :— 'కరీశ— కరిగిరీశ, అని గ్రహింపవలెను. మధ్యమపదమగు 'గిరి' అనునది లోపించినది. లేదా నామైక దేశమును గ్రహించినచో నామమాత్రమునకు గ్రహణ మగును. అను నియమమువలనఁ బై యర్థము వచ్చును. సజాతీయ స్తేషా మితి తు— రాముఁడు పరవాసుదేవుఁ డయ్యు మనుష్యుఁడుగా నవతరించుటచేత— ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్— తాను మానవుఁడుగ దశరథపుత్త్రుఁడుగ భావించినట్లు. తాన్ స్థగ యసి— ఆ కల్యాణగుణములఁ దిరోధాన మొనర్చు చున్నావు. సకలకల్యాణగుణ వైభవముచేత విభవావతార మను ప్రసిద్ధి యున్నను తత్తత్సజాతీయత్వమును నటించుటకు గుణతిరోధాన మొనర్చు చున్నావని యాశయము.

తా॥ ఓ కరిగిరినాథా ! ఈ పూర్వోక్తమగు వ్యవస్థ వ్యూహ సంబంధమైనది నీ మనోరథానుకూలమగు లీలల కొఱకు సాధన

భూతములైన దేవమానవతిర్యక్కులలో నవతార మెత్తుచుఁ గల్యాణగుణ పరిపూర్ణుఁడవయ్యు వైభవవిశిష్టమగుటచే విభవావతార మను నామమును బొందియు నీవు దేవమానవ తిర్యక్కుల సజాతీయుఁడ ననుకొనుచు 'ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్' అన్నట్లు నటించుచు నీ కల్యాణగుణముల మఱుఁగు పుచ్చుచున్నావు.

ఉ॥ ఓ వర దేశ ! వారణశి
లోచ్చయ శేఖరభూత ! వ్యూహసం
భావిత మీ వ్యవస్థ ప్రభు
వా ! గుణపూర్ణుఁడవయ్యు లీలకై
దేవ మనుష్య జంతువుల
దేననొ ! యుద్భవమంది వైభవ
శ్రీ విలసిల్లియున్ నటనఁ
జేయఁగ వారి గుణాళిదాఁతువొ. 17

అవతారిక :— కల్యాణగుణముల యావిర్భావ తిరో భావముల కీ శ్లోకమున విషయవిభాగము నొనర్చు చున్నారు.

శ్లో॥ పరో వా వ్యూహో వా విభవ ఉత వార్చావతరణో
భవన్ వాంతర్యామీ వరవరద ! యో యో భవసి వై ।
స స త్వం స స్తైనాన్ వరగుణగణాన్ బిభ్ర దఖిలాన్
భజద్భ్య భా స్యేవం సతత మితరేభ్య స్త్వితరథా ॥ 13

ప్రతి :— హే వరవరద ! = శ్రేష్ఠములగు వరముల నొసఁగు వరదరాజస్వామీ ! పరః, భవన్, వా=పరవాసు

దేవుఁడ వగుచుఁగాని, వ్యూహో, భవన్, వా=వ్యూహ మూర్తి వగుచుఁగాని, విభవః, భవన్, ఉత=విభవావతారుఁడ వగుచుఁగాని, అర్చావతరణః భవన్ వా=అర్చావతారుఁడ వగుచుఁగాని, అంతర్యామీ, భవన్, వా=అంతర్యామి వగుచుఁగాని, యః యః, భవసి, వై = ఎవఁడ వెవఁడ వగుదువో, సః, సః, సన్=వాఁడవు వాఁడవగుచు, ఐశాన్= ఈశ్వరసంబంధులగు, అఖిలాన్=సమస్తములైన, వరగుణ గణాన్ = కల్యాణగుణగణములను, సతతమ్ = ఎల్లప్పుడు, బిభ్రత్=ధరించుచు, త్వమ్=నీవు, ఏవమ్=ఇట్లు, (కల్యాణగుణ విశిష్టస్వరూపముతో) భజద్భ్యః=భక్తులకొఱకు, భాసి= ప్రకాశించుచున్నావు, ఇతరేభ్యః, తు= ఇతరులకొఱ కన్ననో (భజింపనివారి కొఱకు) ఇతరథా=మఱియొకరీతిగా, (నిర్గు ణుఁడవుగా) భాసి=ప్రకాశించుచున్నావు.

విశేషములు :— ఐశాన్ వరగుణగణాన్— సర్వేశ్వరు నకు సంబంధించిన సర్వజ్ఞత్వ, సర్వశక్తిత్వాది కల్యాణగుణము లను, ఏవమ్=సమస్త కల్యాణగుణగణ విశిష్టమగు నాకార ముతో— ఇతరథా— అన్యవిధముగా (నిర్గుణుఁడవుగా) పరాశరపారాశర్య వాల్మీకి ప్రహ్లాద భీష్మాది భక్తులకుఁ జక్కగాఁ బ్రకాశింపఁజేయఁబడిన కల్యాణగుణగణములే భక్తి లేని బాహ్యకుదృష్టి శిశుపాలాదులకుఁ దిరోహితములైన వని భావము.

తా॥ మంచిమంచి వరములఁ బ్రసాదించునో కరిగిరినాథా! నీవు పరవాసుదేవుఁడవో! వ్యూహమూర్తివో! విభవావతారుఁడవో! అర్చావతారుఁడవో! అంతర్యామివో! ఏ స్వామివో! యగుదువుగాక. అత్తఱి నీశ్వరత్వప్రయుక్తములగు సర్వకల్యాణగుణ గణములతో విశిష్టుఁడవు గానే నిన్ను సేవించు భక్తులకు గోచరింతువు. నీ యెడల భక్తి లేని యితరులకు గుణహీనుఁడవుగానే గోచరింతువు.

చ॥ పరుఁడవా! వ్యూహమూర్తివా! వి
భాసి విభూతివా! యార్చరూపివో!
వరద! మనోనియంతవా! యె
వండ వెవండవా! యౌదు గాక యై
శ్వరములు శోభనంబులగు
సర్వగుణంబుల నొప్పు చట్టులే
దరిసెన మిచ్చుచుండెదవు
దాసుల, కన్యుల కన్యరీతిగన్. 18

అవతారిక :— స్వరూపగుణాదులగు దయాదులు, రూపగుణములగు సౌందర్యాదులును భక్తజనులకు భోగ్యములగుట యిందు వర్ణింపఁబడుచున్నది.

శ్లో॥ దయాక్షాంత్యౌదార్య ప్రమదిమసమతా సౌహృదధృతి
ప్రసాదప్రేమాజ్ఞాఽఽ శ్రిత సులభతాద్యా వరగుణాః ।
తథా సౌందర్యాద్యా స్తవ వరదరాజోత్తమగుణా
విసీమానోఽసంఖ్యాః ప్రణతజనభోగం ప్రసువతే ॥ 19

ప్రతి :— హే వరదరాజ != ఓ వరదరాజస్వామీ !, తవ= నీయొక్క, విసీమానః=హద్దులేనట్టియు, అసంఖ్యాః=లెక్క లేనట్టియు, దయా......సులభతాద్యాః— దయా=దయయు, క్షాంతి=ఓర్పు, ఔదార్య=ఈవి, మ్రదిమ=మార్దవము, సమతా = సమత్వము, సౌహృద = స్నేహము, ధృతి = ధైర్యము, ప్రసాద=అనుగ్రహము, ప్రేమా=ప్రేమము, ఆజ్ఞా = ఆజ్ఞ, ఆశ్రితసులభతా = ఆశ్రితులకు సులభుఁడై యుండుట, ఆద్యాః=మొదలుగాఁగల, వరగుణాః=కల్యాణ గుణములు, తథా=అట్లే, సౌందర్యాద్యాః=చక్కఁదనము మొదలుగాఁగల, ఉత్తమగుణాః=శ్రేష్ఠములగు గుణములు, ప్రణత, జన, భోగమ్=భక్తజనమునకు సౌఖ్యమును, ప్రసువతే=కనుచున్నవి ఉద్భవింపఁ జేయుచున్నవి.

విశేషములు :—

1. దయ– స్వార్థనిరపేక్షముగాఁ బరదుఃఖమును సహింపలేని స్వభావము.
2. క్షాంతి– (క్షమ) శిక్షింపఁదగిన నేరమును సైతమోర్చు కొనుట.
3. ఔదార్యము– అర్థు లనుకొన్నంత కంటె మిన్నగా నిచ్చుట.
4. మ్రదిమ– ఆశ్రితుల యెడఁబాటును సహింపలేకుండుట.
5. సమత– జాతిగుణవృత్తాదులను జూడకే యందఱియెడల నాదరమును జూపుట. (సమోఽహం సర్వభూతేషు)

జెందుటచేత గుణములకు శ్రేష్ఠత్వము గలిగెనని శ్రుతులు చాటుచున్నవని భావము. ఆశ్రుతు లెవ్వి యన— 'సత్యస్య సత్యం, జ్యోతిషాం జ్యోతిః, పవిత్రాణాం పవిత్రం యో మంగలానాం చ మంగలమ్' సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ, విజ్ఞాన మానందం బ్రహ్మ, అపహతపాప్మా విజరః ఇత్యాదులు.

తా॥ తేజస్సుచేత మణి దినమణులకును, కాంతిచేతఁ జంద్రునకును, సౌగంధ్యముచేతఁ జందనచంపకారవిందాదులకును, గొప్పతనము గలిగి గుణవద్వస్తువునకుఁ గల్గిన గొప్పతనము గుణములవలన నని జగత్తులోఁ బ్రసిద్ధమైనది. దానికి విరుద్ధముగా శ్రుతిస్మృతులు గుణములకు గొప్పతనము హేయప్రత్యనీక కల్యాణగుణైకతాన మగు భగవత్స్వరూపము నాశ్రయించుటచేతి నని చాటుట గుణగౌరవము గుణ్యాధీన మని ఘంటాపథముగా ఘోషించుచున్నవో యట్టి దోషదూరుఁడును కల్యాణగుణనిలయుఁడును జ్ఞానానందస్వరూపుఁడు నగు శ్రీ సుందరబాహుస్వామిని శరణు చొచ్చెదను.

చ. గుణములచే మహత్త్వ మొనఁ
గూడును బో! గుణికోటికిన్ నభో
మణి ప్రభచేత శీతఘృణి
మంజులకాంతినిగాదె మిన్నధా
రుణిఁ దల్కకిందు దీనికి స్వ
రూపముగా నయి వేసికిన్ గుణాల్
గణుతి వహించె మ్రొక్కెద న
ఖండుని సుందరబాహు నావిభున్.

ప్రియతౌదార్య మృదుత్వముఖ్యములు నీ
విఖ్యాత దివ్యద్గుణా
ళియు, సౌందర్యవిలాస కాంతి తనులా
లిత్యాదులున్ సంశ్రితా
భయదా! హద్దును బద్దులేక సుఖ ము
త్పాదించు భక్తాళికిన్. 19

అవతారిక :— ఈ శ్లోకమున భగవంతుని స్వాతంత్ర్యమును సర్వజ్ఞత్వమును పైకి నిందతోఁచునట్లు స్తుతించుచున్నారు.

శ్లో॥ అనన్యాధీనత్వం తవ కిల జగు ర్వైదికగిరః
పరాధీనం త్వాం తు ప్రణతపరతంత్రం మనుమహే ।
ఉపాలంభోఽయం భోః శ్రయతి బత సార్వజ్ఞ్య మపి తే
యతో దోషం భక్తే ష్విహ వరద ! నైవాకలయసి ॥ 20

ప్రతి :— భో వరద ! = ఓ వరదరాజస్వామీ ! వైదిక గిరః = వేదసంబంధములగు వాక్కులు (ఉపనిషత్తులు) తవ = నీకు, అనన్యాధీనత్వమ్ = ఇతరుల యధీనమున లేమిని (స్వాతంత్ర్యమును) జగుః కిల = గానముచేసినవి గదా! (వయం) తు = మే మన్ననో, ప్రణత, పరతంత్రమ్ = భక్తపరతంత్రుఁడవైన, త్వామ్ = నిన్ను, పరాధీనమ్ = అస్వతంత్రునిగా, మనుమహే = తలఁచుచున్నాము, యతః = ఎందువలన, ఇహ = ఈ లీలావిభూతియందు, భక్తేషు = భక్తుల విషయమున, దోషం ఏవ = దోషము నే, న + ఆకలయసి = గమనింపవో,

తా॥ అవధిలేని స్వవైభవానుభవముచేత నుత్పన్నమగు సుఖముచేత నిస్తరంగమహోదధిసదృశ మగు నిత్యోదితదశ గలవాఁడై తమస్సునకుఁ దేజంబువలె హేయగుణనికరంబునకుఁ బ్రతిభటుండై యప్రతిమానుండై యొప్పువనాద్రితటవాసియగు శ్రీ సుందరబాహుమూర్తి నిట శరణు చొచ్చుచున్నాను.

ఉ. అంత విహీననైజ విభ
వానుభవప్రభవత్సుఖంబుచే
శాంతతరంగవారి నిధి
చందము నిత్యదశోపపన్నుఁడై
ఎంతయు హేయకోటి కెదు
రెత్తయి చీఁకటికిన్ వెలుంగటుల్
చింతకపాళిఁ దన్పుహరి
శ్రీవనశైలగు నాశ్రయించెదన్.

శ్లో॥ సదాషాడ్గుణ్యాఖ్యైః పృథులబలవిజ్ఞానశకన
ప్రభావీర్యైశ్వర్యై రవధివిధురై రేధితదశమ్।
ద్రుమస్తోమక్ష్మాభృత్ పరిసరమహోద్యానముదితం
ప్రపద్యేఽధ్యారూఢ శ్రియ మివ మహాం సుందరభుజమ్॥ 24

ప్రతి :— సదా = ఎల్లప్పుడు, షాడ్గుణ్య, ఆఖ్యైః = షడ్గుణముల నెడు పేరుగలిగినట్టియు, అవధి, విధురైః = హద్దు లేనట్టియు, పృథుల......శ్వర్యైః – పృథుల = గొప్ప, బల= బలముచేతను, విజ్ఞాన = విశేషజ్ఞానముచేతను, శకన = శక్తి చేతను, ప్రభా = కాంతిచేతను, వీర్య = వీర్యముచేతను, ఐశ్వర్యైః = ఐశ్వర్యముచేతను, ఏధితదశమ్ = వృద్ధి చెం

మెలసి వర్తించుట యను స్వామివారి సౌశీల్యగుణమునే స్తుతించుచున్నది. అట్లే భక్తులయందుఁ గల దోషమునే యెఱుఁగసి భగవానుఁ డేమి సర్వజ్ఞుఁడని పైకి నిందగఁ దోఁచినను ఇది ఆశ్రితులదోషమును గమనింపని స్వామివారి వాత్సల్యగుణమునే స్తుతించు చున్నది. కాన వ్యాజస్తుతి యను నలంకారము. ఈ శ్లోకముతో ద్వితీయదశకము పూర్తి యైనది. ఈపదియు శిఖరిణీ వృత్తములు.

తా॥ వరదరాజస్వామీ! సర్వస్య వశీ— సర్వ స్యేశానః— ఇత్యాదివేదవాణి నిన్నుఁ బరమస్వతంత్రుఁడ వని గాన మొనర్చినను మేము మాత్రము భక్తపరతంత్రుఁడ వని నిన్నుఁ దలఁచు చున్నాము. స్వామీ! నీవు భక్తులయెడల దోషమునే కాంచవు. ఇది యొకదూషణముక్రింద నేర్పడి నీసర్వజ్ఞత్వమునే అధిక్షేపించు చున్నది. చిత్రము.

మ॥ అభిభాషించును వేదముల్ నిను నన
న్యాధీనుఁ డంచుౘ సరే!
ఇభశైలేశ! నినుౘ దలంచెదము మే
మెంతే శ్రితాధీనుఁగాఁ
బ్రభువా! భక్తులయందు దోషమును స్వ
ల్పం బేని వీక్షింపవే
సభలౘ బండితు లెట్లు నిౘ బిలుతురో
సర్వజ్ఞుఁ గాఁ జిత్ర మా॥ 20

శా॥ ప్రౌఢజ్ఞానబలప్రభాశకనవీ
ర్యంబుల్ మహైశ్వర్య మర్
రూఢిన్ బొల్చెడుషడ్గుణంబుల సమా
రోహద్దశో పేతునిన్
గాఢోత్కంఠ భజింతు సుందరభుజున్
గంజాతపత్రాక్షు నా
రూఢశ్రీకు వనాద్రినిష్కలవిహా
రున్ నీవె దిక్కం చెదన్.

అవతారిక :— పూర్వోక్త షాడ్గుణ్యపరిణామ వితతి రూపంబులగు సౌశీల్యాదులగు స్వరూప గుణములను. విగ్రహ గుణంబులగు సౌందర్యాదులు నిందు వర్ణింపఁబడుచున్నవి.

శ్లో॥ సౌశీల్యాశ్రిత వత్సలత్వమృదుతా సౌహార్దసామ్యార్జవై
ర్ధైర్య స్థైర్య సువీర్యశౌర్యకృతితా గాంభీర్యచాతుర్యకైః ।
సౌందర్యాన్విత సౌకుమార్యసమతా లావణ్యముఖ్యై ర్గుణై
ర్దేవః శ్రీతరుషండశైలనిలయో నిత్యం స్థితః సుందరః ॥ 25

ప్రతి :— సౌశీల్యా......ఆర్జవైః— సౌశీల్య = మంచి శీలముచేతను, ఆశ్రితవత్సలత్వ = ఆశ్రయించిన వారియెడఁ గల వాత్సల్యముచేతను, మృదుతా = మార్దవముచేతను, సౌహార్ద = స్నేహముచేతను, సామ్య = సమత్వముచేతనుఁ ఆర్జవైః = ఋజుభావముచేతను, ధైర్య......చాతుర్యకైః— ధైర్య = ధైర్యముచేతను, స్థైర్య = స్థైర్యముచేతను, సువీర్య = మంచి వీరత్వముచేతను, శౌర్య = శూరత్వముచేతను, కృతితా =

వికారమగు, శృంగమ్=చఱియవు, లేదా శిఖరమవు, అసి=అగుచున్నావు.

విశేషములు :— ఆంజనం కరిగిరే రసి శృంగమ్ ఇందలి శృంగశబ్దమునకు 'శృంగం ప్రాధాన్యసాన్వోశ్చ' అను కోశము వలన సానువనునర్థము చెప్పఁబడెను.

శిఖరమను నర్థమే సమంజసముగాఁ దోఁచెడిని పర్వత శిఖరమున కుపరిభాగమునఁ బద్మములును తమాలవృక్షములు నుండవచ్చును గాన వరదరాజస్వామీ! పద్మములవంటి పాణిపాదవదన నయనములు గలిగి, తమాలవృక్షములవంటి బాహువులు గలిగియొప్పు నీలమేఘశ్యాముఁడ వగు నీవు కాటుకకొండనుబోలు కరిగిరికి నంజనశృంగమువలెఁ బ్రకాశించుచున్నా వని భావము.

తా॥ ఓ వరదరాజస్వామీ! కరచరణముఖనయనము లను పేర్లుగల యవయవములచేతఁ బద్మములను బాహువులచేత విశాలతమాల వృక్షములను నిరసించుచున్న నీవు కరిగిరికి నంజన శృంగమువలెఁ బ్రకాశించు చున్నావు.

గీ॥ వరద! బాహువులఁ దమాలతరులఁ బాణి
పాదవదనేక్షణమ్ములఁ బద్మములను
గెలుచుచుఁ దేవ! యీకరిగిరికి నీవు
సిరి ఘటించితి వంజనశిఖర మట్లు. 21

## సుందరబాహు స్తవము

(గతసంచిక తరువాయి)

వీర్యము = అతిదుష్కరమగు యుద్ధము నందును శ్రమముఁ జెందకుండుట, శౌర్యము = తోడు లేకున్నను అతిభయంకరము లగు వైరులలోనికిఁ జొచ్చుకొని పోవుశక్తి, కృతిత = కృతకృత్యత, గాంభీర్యము = తెలియ శక్యముగాని హృదయము గలిగి యుండుట, చాతుర్యము = ఇతరులకు శక్యములుకాని యెల్లపనులను సులువుగాఁ జేయు నేర్పు, సౌందర్యము=దృష్టిని చిత్తమును ఆకర్షించునవయవశోభ, సౌకుమార్యము=పూవు కంటె నధికమగు మార్దవము, సమత = సాముద్రికశాస్త్రోక్త సమపరిమాణావయవ శాలిత్వము, లావణ్యము=సముదాయ శోభ, ఇట్లీశ్లోకము నందలి పదముల కర్థము నెఱుంగవలయును.

తా॥ క్రీడాదిగుణవిశిష్టుఁ డగు శ్రీసుందర బాహుమూర్తి సౌశీల్యవాత్సల్యమార్దవ సౌహార్ద్రాది దివ్య స్వరూపగుణముల తోడను, సౌందర్య సౌకుమార్య సమతాలావణ్యాది దివ్య విగ్రహగుణములతోడను ఒప్పుచు ద్రుమషండమండితం బగు వనాద్రియందు నిత్యనివాస మొనర్చు చున్నాఁడు. ఆదేవ దేవుని శరణు చొచ్చెదను.

శా. సౌశీల్యాశ్రితవత్సలత్వమృదుతా
సౌహార్ద సామ్యార్జవ

తా॥ ఓ వరదరాజప్రభూ! పీనములు వృత్తములు నగు బాహువులును ఉన్నతమగు నాసికయు, విశాలములగు కర్ణ పాశములే భూషణములు గాఁగల సుందరభుజ శిరస్సులు, విశాలలోచనములు మంచిపుట్టుకగల చెక్కిళ్లుగలిగి యందముఁ జిందునిన్ను నాకన్నులు పూర్ణముగా ననుభవింపఁ గోరు చున్నవి.

ఉ॥ చారుసుదీర్ఘబాహువులు
చక్కనినాసిక, కర్ణపాశశో
భారుచిరంబు లంసములు,
భాసురగండతలంబు దృఙ్మనో
హారి విశాలనేత్రము ల
హా! యనిపించెడు నిన్ను నాకనుల్
పారణ సేయ హస్తిగిరి
పార్థివ! బల్ గుటకల్ పౌనర్చెడుణ్. 22

శ్లో॥ నీలమేఘనిభ మంజనపుంజ
శ్యామకుంతల మనంతశయం త్వామ్ ।
అబ్జపాణిపద మంబుజనేత్రం
నేత్రసాత్కురు కరీశ! సదా మే ॥ 23

ప్రతి :— హేకరీశ! = ఓ వరదరాజస్వామీ!, నీలమేఘ నిభమ్=నీలమేఘముతో సమానమైనట్టియు, అంజన, పుంజ, శ్యామ, కుంతలమ్=కాటుకముద్దవలె నల్లని తలవెండ్రుకలు గలట్టియు, అనంత, శయమ్=శేషునిపై శయనించినట్టియు,

## సుందర బాహు స్తవము

ఆత్మాశ్రయైః=దివ్యాత్మస్వరూపాధారము లైన, దివ్యగుణైః= జ్ఞానశక్త్యాది పూర్వోక్తగుణములచేత, ఇద్ధమ్=ప్రకాశించు చున్న, వనాద్రీశ్వరమ్=వనాద్రినాథుఁ డగు, సుందరబాహుమ్ —సుందరబాహుదేవుని, శరణమ్=శరణును, యాతః = పొందినవాఁడను, అస్మి = అగుచున్నాను.

విశేషములు :— తాదృశవైభవైః— స్వాశ్రయమునకు లోకోత్తరత్వమును జేకూర్చు వైభవముగల, అస్మి శరణం యాతః— ఏతాదృశ కల్యాణగుణవిశిష్టుఁ డగు సుందరబాహు స్వామితో శరణు చొచ్చఁ దగినవాఁడు.

తా॥ ఏకల్యాణగుణములలో నొకగుణముయొక్క బిందు వేనియు నిజాశ్రయమగు వ్యక్తిని లోకోత్తరునిగాఁ జేయునో, అట్టివైభవములు గలవియు అసంఖ్యాతము లైనవియు నిరవధి కములగు మహిమలు గలవియు నిత్యములైనవియుఁ బూర్వోక్త గుణములకంటె నత్యధికశుభాస్పదములైన దివ్యగుణములతోఁ బ్రకాశించు వనాద్రినాథుఁడగు (శ్రీ) సుందరబాహుమూర్తిని శరణు చొచ్చెదను.

శా. ఎం దేయొక్కగుణంబులోనియొకబా
 ష్టైనిన్ నిజాధారభూ
తుం దాఁ జేయునో సర్వలోకముల నా
 థున్ దాదృశైశ్వర్యని

గీ॥ మొయిలుమైచాయ కౌటుకహోయలుజుట్టు
పాఁపరాసెజ్జ, తమ్మిలపగిది నొప్పు
కరములు, పదంబు, లక్షులు, గ్రాలు నిన్నుఁ
గనులముందు సదా చూపు కరిగిరీశ. 23

శ్లో॥ త్వ క్చ దృ క్చ నిపిపాసతి జిహ్వా
విహ్వలా శ్రవణవ త్పరవృత్తౌ ।
నాసికా త్వయి కరీశ ! త థేతి
ప్రాప్నుయాం కథ మిమాం స్వి దవస్థామ్ ॥ 24

ప్రతి :— హే కరీశ = ఓ వరదరాజస్వామీ !, త్వయి= నీవిషయమున, (మమ=నాయొక్క) త్వక్, చ = త్వగింద్రియము, దృక్, చ=చక్షురింద్రియమును (కన్ను) నిపిపాసతి= మిక్కిలి త్రావఁ దలఁచుచున్నది. (రసనేంద్రియవ్యాపారమును గోరుచున్నది) జిహ్వా=రసనేంద్రియము (నాలుక) శ్రవణవత్ =కర్ణేంద్రియమువలె, పరవృత్తౌ = దర్శనము స్పర్శనము మొదలగు ఇతరేంద్రియ వ్యాపారమునందు, విహ్వలా = వ్యాకులమైనది లేదా చపలమైనది, (భవతి = అగుచున్నది) నాసికా, చ=ఘ్రాణేంద్రియము కూడ (ముక్కు) తథా=అట్లే యింద్రియాంతర వ్యాపారమున వ్యాకులమై యున్నది. ఇతి= కనుక, కథంస్విత్ = ఏవిధముగా, ఇమామ్ = ఇటువంటి, అవస్థామ్=దశను, ప్రాప్నుయామ్=పొందుదును !

విశేషములు :— శ్రవణవత్ — శ్రవణేంద్రియము ఇంద్రియాంతరవ్యాపారమున నెట్లు వ్యాకులమై యున్నదో యట్లే

వ్యావృత్తికొఱకును 'సదా' అను పదము ముక్తపురుష వ్యావృత్తికొఱకును నిబంధింపఁబడినవి. లేదా— 'సదా' అను ఒక పదముచేతనే యోగిముక్తజనవ్యావృత్తి సిద్ధించునుగాన 'స్వతః' అను పదము భగవత్సంకల్పాయత్తములగు సకల నిత్యజ్ఞానవ్యావృత్తిని జేయుచున్నది. 'స్వతః, యుగపద్భవా' అను రెండుపదములును 'నయనశ్రవణోద్భృశాశ్రుణోపి' అని చెప్పినప్రకారము తత్తద్విషయగ్రహణమునందుఁ బ్రతినియత కరణనియమాభావము కరణాపేక్ష లేకయే సాక్షాత్కార మును గర్భితములైన వని నుడువుచున్నవి. మొత్తముమీఁద ఈ శ్లోకములోని పై పదములు జ్ఞానమునకుఁ గావలసిన హంగుల నెల్ల వివరించుచున్నవి. ఇట్టి జ్ఞాననిధియగు సుందరబాహువు మాపాలిటి పెన్నిధియని సారాంశము. వనాద్రికే సింహాద్రి యనియు నామాంతరము.

తా॥ ఏ దేవదేవుఁడు సర్వదా యుగపదుద్భూత మగు సహజమైన దివ్యదృష్టిచేత సమస్త ప్రపంచమును నెదుటనున్న వస్తువును బోలెఁ జూచునో తాదృశదివ్యజ్ఞాననిధి యగు మా పాలిటి పెన్నిధియైన శ్రీసుందరబాహుమూర్తి వనాద్రి నికుంజములందుఁ బ్రకాశించు చున్నాఁడు.

ఉ. వేలుపువేలుపౌ నెవఁడు
విశ్వము సర్వము నొక్కమాటెయు

అవతారిక :— ఇట్లు నాల్గుశ్లోకములతో దివ్యమంగళ విగ్రహశోభ ననుభవించి ప్రత్యవయవశోభ ననుభవింప నారంభించుచున్నారు.

శ్లో॥ ఆధిరాజ్య మధికం భువనానా
మీశ ! తే పిశునయ౯ కిల మౌళిః
చూళికామణి సహస్రమరీచే
ర్హస్తిభూషణ ! భవ త్యుదయాద్రిః ॥ 25

ప్రతి :— హస్తిభూషణ ! = కరిగిరికి అలంకారభూతుఁడ వగు, ఈశ ! = ఓవరదరాజస్వామీ !, భువనానామ్=(సకల) లోకములయొక్క, ఆధిరాజ్యమ్=సామ్రాజ్యమును, అధికమ్= ఎక్కువగా, లేదా - అధికమ్=గొప్పదియగు, ఆధిరాజ్యమ్= సామ్రాజ్యమును, పిశునయ౯=సూచించుచు, తే=నీయొక్క, మౌళిః=కిరీటము, చూళికామణి, సహస్రమరీచేః=కిరీటశిఖరమున నుండెడు మణి యనెడు సూర్యునకు, ఉదయాద్రిః, భవతి, కిల=ఉదయపర్వతమో ! యన్నట్లున్నది.

విశేషములు :— మౌళిః — మౌళిస్థమగు కిరీటము (తాత్స్థ్యలక్షణ) కిల— ఉత్ప్రేక్షావాచకము చూళికామణి సహస్రమరీచేః ఉదయాద్రిః భవతి కిల— ఉభయవిభూతి సూచక దేవరాజకిరీటము విశృంఖల మయూఖసంఘాతము గల స్వశిఖామణియను నభోమణికి నుదయగిరివలెఁ బ్రకాశించుచున్న దని భావము. ఇందు— కిరీటమునకు— ఉదయాద్రికి, చూడామణికి— సూర్యునకుఁ బోలికలు.

వీర్య, శక్తయః ఐశ్వర్యము, తేజస్సు, బలము, వీర్యము, శక్తియు, కీదృగ్విధాః=ఇట్టివని చెప్పుటకు శక్యము గానివి.

విశేషములు:— ఏమహాత్ముని లవలేశమగు సంకల్పము వలన సకలజగత్ సృష్టిస్థితి సంహారాదులు ప్రవర్తిల్లుచున్నవో యామహనీయుఁడగు (శ్రీ) సుందరబాహుమూర్తి నవలంబించి యున్న యైశ్వర్యాదు లనన్యాదృశము లపరిచ్ఛిన్నంబులు నై యున్నవి.

తా॥ ఏదేవుఁడు స్వల్పసంకల్పముచేతను జగత్సృష్టి సంహార రక్షణ ప్రవృత్తినివృత్తుల నొనర్చునో యట్టిసుందరబాహువు నాశ్రయించియున్న యైశ్వర్యతేజోబల వీర్యశక్తులు లోకోత్త రము లైనవి.

ఉ. ఏ భగవానుఁ డల్ప మగు
నిచ్ఛను సృష్టిలయావనాదికం
బీభువనాళి కెల్ల ఘటి
యించునో ! యట్టిమహాప్రభావతే
జోభరశాలి సుందరభు
జుండె నివాసముగాఁగఁ గల్గుస
త్ప్రాభవవీర్యశక్తిబల
భాగుణముల్ జగదప్రమేయముల్.

బడిన యర్థశక్తిగల, ఊర్ధ్వపుండ్ర తిలకమును, బహుమానాత్ = గౌరవమువలన, స్వలలాటే = నీనుదుట, బిభర్షి, కిమ్ ? = ధరించుచున్నావా ?

విశేషములు :— ఊర్ధ్వం (ఊర్ధ్వగతిం) ప్రాపయతి ఇత్యూర్ధ్వపుండ్రమ్— అని వ్యుత్పత్తి ఊర్ధ్వలోకములను పొందించునది. బహుమానాత్ — నాభక్తుల నుద్ధరించుచున్నదను గౌరవమువలన కింభిభర్షి వరద ! స్వలలాటే ?— 'స్నానం దానం జపో హోమః స్వాధ్యాయః పితృతర్పణమ్ భస్మీభవతి తత్సర్వమూర్ధ్వపుండ్రం వినా కృతమ్ ॥' ఊర్ధ్వపుండ్రముల ధరింపక చేసిన స్నానదానజపాదు లన్నియు నిష్ఫలము లని పై శ్లోకమునకు భావము. ఇది కర్మాంగముగాఁ జెప్పఁబడుట చేత భగవానున కందులకై యూర్ధ్వపుండ్రధారణము సంభవింపదు గాన— బహుమానాత్ — అని చెప్పఁబడెను.

తా॥ ఓ వరదరాజాస్వామీ ! ఊర్ధ్వపుండ్రతిలకము స్వధారణముచేత భక్తజనుల నూర్ధ్వలోకములను బొందించు చున్నది. వ్యుత్పత్తిచేతనే ఊర్ధ్వాకార వైశిష్ట్యమును జ్ఞప్తిచేయుచున్న యీ యూర్ధ్వపుండ్రతిలకమును నాభక్తుల నుద్ధరించుచున్నది యను గౌరవమువలన నీలలాటమున ధరించుచున్నావా ?

గీ॥ ఊర్ధ్వపుండ్రంబు భక్తుల నూర్ధ్వగతికిఁ
జేర్చు నిజధారణంబునఁజేసి యనుచు
దీనిపైఁ గలబహుమానదృష్టి నుదుట
నూర్ధ్వపుండ్రంబుఁ దాల్చితి వోకో ! కరీశ ! 26

విశేషములు :— తథావిధైః=ఒక్కొక్కటియు 10 వేల కల్పము లనుభవించినను తఱుఁగని పాపఫలముగల, ఉత్సీమభిః=లెక్క లేని (లేదా) కొలతలేని, తిరోహితమ్=ఆత్మస్వరూపవివేకము లేని, జనమ్ = జన్మగుణాదితారతమ్యపర్యాలోచన లేని యొక యనామకుని, క్షమతే= 'స తం నిపతితం భూమౌ' అని శ్రీమద్రామాయణంబునఁ జెప్పినట్లు, నేలపైఁ బడుటనే శరణాగతిగా భావించి అంతఃపురద్రోహ మొనర్చుట చేత అత్యంతాపరాధి యైనను, కాకాసురుని క్షమించి రక్షించినట్లు- అని భావము.

తా॥ సామాన్యమానవుఁడు నిత్యమొనర్చు పాపములలో నొకదాని ఫలము. పదివేలకల్పములకాల మనుభవించినను తఱుఁగ దని పెద్దలు శాస్త్రములచే నిర్ణయించిరి. అనాది ప్రవృత్తమగు నీ సంసారమందు, ఒక దానికిఁ గోటిరెట్లుగా ఫలము చేకూర్చు ఈ కర్మభూమియందు నిరంతరము ఎన్నివేల కల్పము లనుభవించినను తీఱని హద్దుపద్దులేని యట్టి పాపముల నొనర్చుచు ఆత్మస్వరూపవివేచనము లేక యాత్మఘాతకుఁడై చెడిపోవుచు జన్మగుణ తారతమ్యములను బరిశీలించుకొనలేని యొక యనామకుఁడు ప్రణామ మొనరించినంత మాత్రమున వానిని వనాద్రిప్రణయి యగు సుందరబహుస్వామి అనాఁడంతఃపురద్రోహి యగు కాకాసురుఁడు కాళ్ళముందు నేలపైఁ

బడఁగా ఆదియే శరణాగతి యని భావించి శ్రీరాముఁ డెట్లు క్షమించి రక్షించెనో! అట్లే క్షమించి రక్షించు మని భావము.

మ. పదివేల్ కల్పము లేన్ భుజింప నొకపా
పంపున్ ఫలం బేని త
గ్గదొ! తాదృగ్వృజినంబులన్ జని జనిన్
గర్మావనిన్ జాల్చఁ బెం
పొదవన్ జేసెదు నాత్మఘాతుకుఁ డభ
వ్యుం డొక్కమాట్ ప్రొక్కఁ గా
చు దయన్ సుందరుఁ డల్లకాకదనుజున్
క్షోణీసుతేశుం డటుల్.

శ్లో॥ యజ్జాతీయో యాదృశో యత్స్వభావః
పాదచ్ఛాయాసంశ్రితో యోఽపి కోఽపి।
తజ్జాతీయ స్తాదృశ స్తత్స్వభావః
శ్లిష్య త్యేనం సుందరో వత్సలత్వాత్ ॥ 30

ప్రతి :— యత్, జాతీయః = ఎటువంటి జాతిగలవాఁడు, యాదృశః=ఎటువంటి యాచారము కలవాఁడు, యత్, స్వభావః=ఎటువంటి స్వభావము గలవాఁడు, యః, అపి, కః, అపి=ఎవ్వఁడే కాని, పాద, ఛాయా, సంశ్రితః=పాదముల నీడను ఆశ్రయించినవాఁడు, (భవతి = అగు చున్నాఁడో!)

ఏనమ్=ఈజనుని, సుందరః=సుందర బాహుదేవుఁడు, వత్సల త్వాత్ =వాత్సల్యము గలవాఁడగుటవలన, తత్, జాతీయః= అట్టిజాతి గలవాఁడును, తాదృశః = అట్టి యాచరముగల వాఁడును, తత్, స్వభావః=అట్టి స్వభావము గలవాఁడును, (సన్ =అగుచు) శ్లిష్యతి=ఆలింగనము చేసికొను చున్నాఁడు.

విశేషములు :— యజ్జాతీయః— దేవ, మనుష్య, తిర్య గాదిజాతులలో ఏజాతివాఁడైనను అని అర్థము. యాదృశః, యత్స్వభావః— భగవదాశ్రయమునకు జాతితో విద్యతో వృత్తముతో నపేక్ష లేక ఎవ్వఁడేనియు నర్హుఁడని భావము. వత్సలత్వాత్ — వత్సంలాలయతీతి=వత్సలా, అను వ్యుత్పత్తి చేత, అప్పుడే యీనినయావుదూడపైఁగల ప్రేమచేత దాని యొడలినిండ నంటుకొనియున్న హేయపదార్థ మగు మావిని (దోషమును) తననాలుకతో అమృతమునువలె నెట్లు భుజిం చునో యట్లే భగవంతుఁడు వనాద్రి సుందర బాహుమూర్తి ఆశ్రితులయందుఁగల దోషములను గుణములనుగా ననుభ వించు ప్రేమమయమూర్తి యని భావము. 'దోషో యద్యపి తస్య స్యాత్ సతా మేత దగర్హితమ్' అన్నట్లు సదోషులైనను ఆశ్రితులయందుఁ బ్రీతియుండుటవలనఁ దత్సమానజాత్యాచార శీలములు గలవాఁడై 'అహం వో బాంధవో జాతః,' ఆత్మా

నం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్' అని చెప్పినట్లు తత్తదాశ్రితానుగుణము లగు ఆభిజాత్యవిద్యావృత్తములతో నలరారుచు తత్సంశ్లేషభోగముల ననుభవించు చున్నాఁడు. పూర్వశ్లోకమున క్షాంతి యనఁగా- అపరాధసహిష్ణుత్వ మనియు, ఈ శ్లోకమున- వాత్సల్య మనఁగా- దోషములందు సైతము భోగ్యతాబుద్ధి యనియు నిరూపింపఁ బడినది.

తా॥ ఏజాతివాఁడేకాని, ఎట్టియాచారములు గలవాఁడే కాని, ఎట్టి స్వభావముగలవాఁడే గాని అగుఁగాక వాఁ డెవఁడైనను సరే. తన పాదసన్నిధానము నాశ్రయించిన యెడల నితనిని శ్రీ సుందరబాహుస్వామి వాత్సల్యమువలనఁ దత్సమానజాత్యాచార స్వభావములు గలవాఁడై తత్సంశ్లేషైక భోగు డగుచున్నాఁడు.

శా. యజ్జాతీయుఁడో! యాదృశాచరణుఁడో!
యచ్ఛీలుఁడో! యానుఁ గా
కజ్జాత్యాదుల నెన్నకుండ నె వనా
హార్యాధినాథుం డహో!
పజ్జం జేరినఁ జాలు వత్సలత పెం
పారంగ భోగించెదుః
తజ్జాతీయుఁడు తాదృగాచరణుఁడుః
తచ్ఛీలుఁడై యాశ్రితుః.

అవతారిక :— గొప్పవానికి అల్పులతోఁ గూడ (మందులతోఁ గూడ) నిరంతరము గలసి యుండుట యనెడు సౌశీల్యము సుందరభుజున కత్యంత మసదృశ మైనను మందుఁడనగు నా కా స్వామియే శరణమని యీ శ్లోకమునం దనుసంధిచుచున్నారు.

శ్లో॥ నిహీనో జాత్యా వా భృశ మకుశలై ర్వా స్వచరితైః
పుమాన్ స్యా యః కశ్చిత్ బహుతృణ మపి స్యా దగుణతః ।
భజంతం తం పశ్యేత్ భుజగపతినా తుల్య మపి యో
వనాద్రి ప్రస్థస్థః స మమ శరణం సుందరభుజః ॥ 13

ప్రతి :— భృశమ్ = మిక్కిలి, జాత్యా, వా = జాతిచేఁగాని, అకుశలైః = అశుభములగు, స్వ, చరితైః, వా = తన నడతలచేతఁ గాని, నిహీనః = మిక్కిలి హీనుఁడగు, యః, కశ్చిత్, పుమాన్ = ఊరును పేరును లేని మనుష్యుఁడు అగుణతః, అపి = గుణములు లేకుండుటచే సైతము, బహుతృణమ్, అపి = అల్ప మగుగడ్డిపఱక వంటివాఁడు గూడ, స్యాత్ = అగుఁ గాక, భజంతమ్ = (తనను) సేవించుచున్న, తమ్ = అతనిని (జాత్యాదిహీనుని) యః = ఏవేలుపు, భుజగపతినా, అపి = ఆదిశేషునితో సైతము, తుల్యమ్ = సమానునిగా, పశ్యేత్ = చూచునో, వనాద్రి ప్రస్థ, స్థః = వనగిరి సానువునందు వేంచేసియున్న, సః = ఆ, సుందరభుజః = సుందరబాహుస్వామి, మమ = నాకు, శరణమ్ = దిక్కు-

విశేషములు :— బహుతృణమ్- ఈషత్, అసమాప్తం తృణమ్ = బహుతృణమ్- అల్పోపమ్యార్థమున 'బహుచ్' ప్రత్యయము వచ్చినది. భజంతం తం- పూర్వపునడత పైని పేర్కొన్నప్రకారముండినను ప్రస్తుతము 'మా మేకం శరణం వ్రజ' అన్నవిధముగా శరణు చొచ్చుచున్న జాతి, వృత్త, చైతన్య, హీనుఁడగు ఆయనామకుని అని భావము. భుజగపతినా, అపి = 'నివాస శయ్యాసన పాదుకాంశుక' అని యారంభించి 'య థోచితం శేష ఇతీర్యతేజనైః' అని శేషత్వావధికిఁ జివరమెట్టుగాఁ జూపఁబడిన శేషునితో సయితము సమముగాఁ జూచునో యనుటవలన 'త్వమస్మాకం చతుర్ణాం హి భ్రాతా సుగ్రీవ! పంచమః' అని శేషావతారముగాఁ బ్రసిద్ధుఁడగులక్ష్మణునితో సమానభోగునిగా సుగ్రీవు ననుగ్రహించుట యిందభిప్రేతమై యున్నది. ఈ శ్లోకమునఁ బేర్కొనఁబడిన జాతిహీనుఁడు, వృత్తహీనుఁడు. జ్ఞానహీనుఁడు,నగు 'యః కశ్చిత్ పుమాన్' ఊరు పేరు లేనియాతఁడు సుగ్రీవుఁడే యని కవియాశయమైనట్లు కన్పించుచున్నది. ఎట్లన?

'వానరాణాం నరాణాం చ కథ మాసీ త్సమాగమః' నీచమైన వానరజాతితో ఉత్కృష్టమైన నరజాతివారికి సహవాస మెట్లు ఘటిల్లెను? అనుటచేత వానరుఁడగు సుగ్రీవుఁడు జాతిహీనుఁడనుటయు. భ్రాతృ భార్యయగు తారతోనుండుటచేత వృత్త హీనుఁడనుటయు, ఈ వృత్తహైన్యమునకు హేతువ జ్ఞానమగుటచేత జ్ఞానహీనుఁడనియు భావుకులకుఁదోఁచకపోదు.

కావున లోకోత్తరగుణోత్తరుఁడగు శ్రీరామునకు జాతివృత్త వివేకహీనుఁడగుటచే మందుఁడైన సుగ్రీవునితోడి నీరంధ్రమగు మైత్రి శ్రీరాముని సౌశీల్యమును జాటుచున్నది. అట్లే వనాద్రివాసుల ననుగ్రహించుచున్న సుందరబాహుమూర్తియు అని భావము.

తా॥ జాతిహీనుఁడు మంగళాచారశూన్యుఁడు వివేకరహితుఁడునై నామగ్రహణమునకును యోగ్యుఁడుగాని యెవఁడేని తన్ను భజించినయెడల వానిని వేవేల్పు తన శేషత్వమునకుఁ బరాకాష్ఠమైన యాదిశేషునితోఁ దుల్యునిగాఁ గటాక్షించునో వనగిరి సానునివాసి యగు ఆ సుందరబాహుమూర్తి దేమందుఁడ నగు నాకుశరణము.

ఉ. జాతికిఁ దగ్గి పోవుత, ల
సత్తరవృత్తము లేక పోవుతన్
భూతలియందు జ్ఞానమునఁ
బోలక పోవుత గడ్డిపోచకే
నాతఁడు తన్ భజింప భుజ
గాధిపునట్లుగఁ జూచు నెవ్వఁ డా
స్ఫీతవనాద్రిసాను సర
సీరుహనేత్రుఁడె నాకుదిక్కగుఁకన్.

శ్లో॥ ఏకైకమంగళగుణానుభవాభినంద
మీదృక్త్వయా నితి చ సుందరదోష్ణి కృష్ణే ।
'తే యే శతం త్వితి నియంతు మనాః శ్రుతుస్తై
సైవైష వాఙ్మనసగోచర ఇత్యుదాహ ॥

ప్రతి :— సుందరదోష్ణి = సుందరబాహు వనెడు, కృష్ణే = (శ్రీ) కృష్ణునియందు, ఏక, ఏక, మంగళ, గుణ, అను భవ, అభినందమ్ = ఒక్కొక్క కల్యాణగుణముయొక్క, అనుభవమువలన,( గలిగిన యానందమును, ఈ దృక్ = ఇటు వంటిది, ఇయాన్ = ఇంతపరిమాణము గలది, ఇతి, చ = అనియు, నినుంతుమనాః=కొలుచుటకు మనస్సుగలదియై, 'తే యే శతంత్వి' తి=తే యే శతం మానుషా ఆనందాః అనెడు, శ్రుతిఃతు = వేదవాక్యన్నను, ఏషః = సుందరబాహు స్వామియొక్క ఒక్కొక్క కల్యాణగుణానుభవమువలన( గలి గెడి యానందము, వాక్, మనస, గోచరః = వాక్కులకు మనస్సునకును గోచరించెడిది, న + ఏవ = నైవ = కానే కాదు, ఇతి = అని, ఉదాహా = బిగ్గఱగా( జెప్పెను. హై= ఆశ్చర్యము.

విశేషములు :— నియంతుమనాః = కొలగారమునకుఁ బూనిన మనస్సు గలదియై అని భావము— ఉత్ + ఆహా= ఉదాహా = పెద్దగా( జెప్పెను. దగ్గఱనున్నవారికి దవ్వున నున్నవారి కందఱకు వినఁబడునట్లు అని 'ఉత్' అను ఉపసర్గ వలన ద్యోతక మగుచున్నది. 'సైషానందస్య మీమాంసా భవతి। యువా స్యాత్ సాధు యువాధ్యాయకః। ఆశిష్ఠో ద్రఢిష్ఠో బలిష్ఠః। త స్యేయం పృథివీ సర్వా విత్తస్య పూర్ణా స్యాత్ । స ఏకో మానుష ఆనందః। తే యే శతం మానుషా ఆనందాః। స ఏకో మనుష్య గంధర్వాణా మానందః' అని

పైనిఁజెప్పిన క్రమముగా దేవగంధర్వపితృ చిరలోక లోక దేవా జానదేవ కర్మదేవేంద్ర బృహస్పతి పర్యంతము చెప్పి 'తే యే శతం ప్రజాపతే రానందాః । స ఏకో బ్రహ్మణ ఆనందః' అన్న తరువాత 'తే యే శతం బ్రహ్మణ ఆనందాః' అని చెప్పక 'యతో వాచో నివర్తంతే, అప్రాప్య మనసా సహ, ఆనందం బ్రహ్మణో విద్వాన్' అను శ్రుతియందు 'స ఏకో బ్రహ్మణ ఆనందః' అని ఏకశబ్దమును ప్రయోగించుట వలన ఏకైక గుణానుభవము వలనఁ గలిగెడి యానందమే యపరిచ్ఛిన్న మని శ్రుతిహృదయము.

తా॥ అసంఖ్యేయము లగు కల్యాణగుణములతోఁ గూడిన శ్రీ సుందరబాహు భగవాను నందలి ఏకైక కల్యాణగుణాను భవజనిత మగు నానందము ఇట్టిది, యింత ప్రమాణముగలది. యని కొలగార మొనర్పఁ దలచినదై 'తే యే శత' మ్మనెడు శ్రుతి యా యానందము మనస్సునకు వాక్కులకు నందని దని బిగ్గఱగాఁ జాటినది. ఇది యత్యంత మాశ్చర్యకరము. సుందర బాహుస్వామియొక్క ఒక కల్యాణగుణానుభవ జన్యానందమే యపరిచ్ఛిన్న మనఁగా సకల కల్యాణగుణానుభూతి వలనఁ గలుగు నానందము నెవరు వర్ణింపఁగలరని భావము.

ఉ. సుందరబాహు కృష్ణునెడ
శోభిలు సద్గుణ బృందమందు నే
మందు నొకొక్క దివ్య సుగు
ణానుభవంబునఁ గల్గుచున్న యా

నందము వేదమాత గణ
నం బొనరింపఁగఁబూని చేత కా
కందదు మాటకున్ మది క
టంచు నహా! వెనుకంజ వేయదే!

శ్లో॥ అబ్జపాద మరవిందలోచనం
పద్మపాణితల మంజనప్రభమ్ ॥
సుందరోరుభుజ మిందిరాపతిం
వందిషీయ వరదం వనాద్రిగమ్ ॥ 33

ప్రతి :— అబ్జ, పాదమ్ = పద్మములవంటి పాదములు గల వాఁడును, అరవింద, లోచనమ్ = కమలములవంటి కన్నులు గలవాఁడును, పద్మ, పాణి, తలమ్ = తామరలవంటి చేతులు గలవాఁడును, అంజన, ప్రభమ్ = కాటుక కాంతివంటి కాంతి గలవాఁడును, సుందర, ఉరు, భుజమ్ = అందము గలవియు, పెద్దవియు, అగు భుజములు గలవాఁడును, ఇందిరా, పతిమ్= లక్ష్మీనాథుఁడును, వన, అద్రి, గమ్ = వనగిరియందు వేంచేసి యున్న వాఁడును, వరదమ్=వరప్రదాతయునగు సుందర బాహుస్వామిని, వందిషీయ=నమస్కరింతును గాక.

విశేషములు :— వనాద్రిగం వరదమ్— ఇందు వనాద్రి నివాసమే వరప్రదానము నందు హేతువుగా సూచింపఁబడినది. శ్రీమంతు లేయంతఃపురములో నెక్కడనో యుండుటచే వారిసిరి యాచకుల కందుబాటులో నుండదు. ఈ శ్రీమంతుఁ డగు సుందరబాహుదేవుఁడు వనాద్రిశిఖరమున నుండుటచే

అందఱికిఁ గనఁబడుచు భక్తులకు అడ్డులేక దర్శనమిచ్చుచు వారుకోరిన వరములను గూడ నిచ్చునని భావము. సుందర రోరుభుజమ్— ఈ స్వామినామము సుందరబాహు వని యీపదము చాటుచున్నది. మఱియు సుందర, ఊరు, భుజమ్— అని పదచ్ఛేదము గావించుకొన్నయెడల అందములగు తొడలు భుజములును గలవాఁడని యర్థమిచ్చును. అప్పుడు శ్రీస్వామి వారి భుజములే కాక తొడలు గూడ సుందరములని మఱి యొక గుణానుభవముచేయ వీలగును. 'మధురాధిపతే రఖిలం మధురమ్' అని గదా ప్రాజ్ఞులనూక్తి.

అత్యంతభోగ్యవిగ్రహుఁ డగు వనాద్రినాథుఁడే పరమై కాంతికుల కుపాస్యమూర్తి యని భావము.

తా॥ పద్మములవంటి పాదములు, కమలములవంటి కన్నులు, తామరలవంటి చేతులు, కాటుకవంటి కాయకాంతి, సుంద రాజానుబాహువులు గలిగి లక్ష్మీదేవిచేత సైతము పతిగా వరింపఁబడిన వనాద్రివాసియు వరప్రదాతయు నగు సుందర బాహుస్వామిని వందన మొనర్తును.

గీ॥ కమలములఁ బోలుకరములు కాళ్ళు కనులు
గలుగుదొర నంజనప్రభాకలితకాయు
సిరి వలచువాని నందాలఁ జిందు బాహు
లలరువరదుని వనగిరినిలయుఁ గొలుతు.

అవతారిక :— దివ్యవిగ్రహ లావణ్యమునే ఇంకను వర్ణించుచున్నారు.

శ్లో॥ కనకమరకతాంజనద్రవాణాం
మథనసముత్థితసారమేలనోత్థమ్ ।
జయతి కిమపిరూప మస్య తేజో
వనగిరినందన సుందరోరుబాహోః ॥ 34

ప్రతి :— అస్య=ఈ, వన......బాహోః— వనగిరి= వనాద్రివాసు లగు జనులను, నందన=సంతోషపెట్టు, సుందర, ఉరు, బాహోః=అందములగు ఆజానుబాహువులుగల సుందర బాహుస్వామియొక్క, కనక, మరకత, అంజన, ద్రవాణామ్= (ప్రత్యేకము భిన్నభిన్న కాంతులుగల) బంగారము, మరకత మణులు, కాటుక, వీని రసములయొక్క, మథన, సముత్థిత, సార, మేలన, ఉత్థమ్=చిలుకుటచేతఁ బుట్టిన సారాంశము యొక్క కలయికచేతఁ గలిగిన, కిమపి, రూపమ్=అనిర్వాచ్య మగు స్వరూపముగల. తేజః=కాంతి, జయతి=సర్వోత్కృష్టమై ప్రకాశించుచున్నది.

విశేషములు :— 'వనగిరి నందన' అను చోట 'మంచాః క్రోశంతి' అను చోటునందు వలె తాత్స్థ్యలక్షణచేత వనగిరి వాసులని యర్థము చెప్పుకొనవలెను. కిమపిరూపమ్— ఇది యేకపదము. ఇట్టిది యని చెప్పుటకు శక్యముగాని రూపము గలది యని భావము, సారాంశ మేమన— ప్రత్యేక పాత్ర లందుఁ బ్రత్యేకముగా- కనకద్రవమును, మరకతద్రవమును, అంజనద్రవమును ఉంచి పెరుఁగును జిలికినట్లు చిలుకఁగా వెన్న వలెఁ దేలిన యాద్రవత్రయ సారాంశముల మూఁటిని మేళనము చేయఁగా నేర్పడిన పీత, హరిత, నీల, వర్ణాత్మకమగు మిళిత

సారాంశత్రయరూపమున ఇది బంగారు వన్నె, ఇది గరుడ పచ్చలవన్నె, ఇది కాటుకవన్నె, యని యెట్లు విడివిడిగాఁ దెలియ శక్యముగాదో యట్లే సుందరబాహుస్వామివారి విగ్రహ సముదాయశోభ విడిగాఁ దెలియ శక్యముగాక సర్వోత్కృష్టమై యున్నదని భావము.

తా॥ బంగారము గరుడపచ్చలు కాటుక వీని ద్రవములను వేఱువేఱు పాత్రములం దుంచి చిలుకఁగా నేర్పడిన సారాంశము లను మఱలఁ గలుపఁగా బొడఁగట్టు నచింత్యరూపము గల శ్రీ వనాద్రినివాసి యగు సుందరబాహుస్వామి వారి తేజస్సు సర్వోత్కృష్టమై వెలుఁగు చున్నది.

చ. కనక గరుత్మదశ్మ నవ
కజ్జల సుద్రవముల్ మథింప వ
చ్చిననికరంపుఁ దేటలను
జిల్కఁగ నొక్కెడ నుంచి వెండియున్
కనులను దన్పు తద్రుచిర
కాంతుల నేది యదీయమో! యెఱుం
గనియటు కాననాద్రిహరి
కాయమహోజ్జ్వల తేజ మొప్పెడిన్.

శ్లో॥ కిం ను స్వయం స్వాత్మవిభూషణం భవ
న్నసా వలంకార ఇతీరితో జనైః।
వర్షిష్ణుబాలద్రుమషండ మండితం
వనాచలం వా పరితః ప్రసాధయన్ ॥ 35

ప్రతి :— అసౌ = ఈసుందరబాహుస్వామి, స్వయమ్= తానే, స్వ, ఆత్మ, విభూషణమ్ = తన దివ్యవిగ్రహమునకు అలంకారము, భవన్ =అగుచు, జనైః = (తన దివ్యవిగ్రహ మును బ్రత్యక్షముగాఁ జూచు) జనులచేత, అలంకారః ఇతి = అలంకారమని, ఈరితః, కింను=పలుకఁబడెనా? వా=లేక, వర్ధిష్ణు, బాల, ద్రుమ, షండ, మండితమ్=వృద్ధి చెందుచున్న తరుణ వృక్షముల సమూహముచేత నలంకరింపఁబడిన, వనా చలం, పరితః = వనగిరిచుట్టు భాగమును, ప్రసాధయన్ = అలంకరించుచు, అలంకారః ఇతి= అలంకార మని, ఈరితః, కింను=పలుకఁబడెనా ?

విశేషములు :— శ్రీ సుందరబాహుస్వామి వారికి భక్త జనప్రసిద్ధ మగు 'అలంకార' నామము గలదు. ఆనామ మెందు వలన వచ్చియుండునా యని యీ శ్లోకమున నుత్ప్రేక్షింపఁ బడినది.

తా॥ ఈ సుందరబాహుస్వామి తానే తనదివ్య విగ్రహము నకు అలంకారమగుచు ప్రత్యక్షముగాఁ దన దివ్య విగ్రహ మును జూచు భక్తజనులచేత అలంకార నామమునఁ గొని యాడఁబడెనా! లేక నానాఁడు సమృద్ధిగాఁ బెరుగుచున్న తరుణవృక్షములచేత శోభాయమానముగా నున్న వనాచలము నకు నలంకారముగా నుండుటవలన జనులచేత నలంకార నామమునఁ గొనియాడఁ బడెనా!

ఉ. సారసలోచనుండు వన
 శైలవిభుండు స్వమూర్తికిన్ ప్రభా
పూరిత దివ్యరత్నమయ
 భూషణమై ధరియించెనో! యలం
కారముపేరు, లేక తరు
 కాండసుమండితకాననాద్రిశృం
గారనిదానమండనము
 గాఁ దనరారి తదాఖ్యఁ గాంచెనో!

శ్లో॥ సుఖస్పర్శై ర్నిత్యైః కుసుమసుకుమారాంగ సుఖదైః
సుసౌగంధ్యై ర్దివ్యాభరణగణదివ్యాయుధ గణైః।
అలంకారై స్సర్వై ర్నిగదిత మలంకార ఇతి యః
సమాఖ్యానం ధత్తే స వనగిరినాథోఽస్తు శరణమ్ ॥ 36

ప్రతి :— సుఖ, స్పర్శైః=సుఖమును గలిగించు స్పర్శగలిగి నట్టియు, (అతిసుకుమారము లైనట్టియు) సుసౌగంధ్యైః = మంచి సువాసన గలిగినట్టియు, (కనుక నే) కుసుమ, సుకుమార, అంగ. సుఖదైః = పూవులకంటె సుకుమారము లగు దివ్యావయవములకు సుఖము నిచ్చునట్టియు, నిత్యైః = (భగవద్విగ్రహమువలెనే తాము కూడ) నిత్యము లైనట్టియు, దివ్య, ఆభరణ, గణ, దివ్య, ఆయుధ, గణైః=దివ్యములగు నాభరణసమూహములు, దివ్యములైన యాయుధ సమూహములనెడు, సర్వైః = సమస్తము లైన, అలంకారైః=స్వదివ్యవిగ్రహముచేత, అలంకరించుకొనఁ దగిన సొమ్ములచేత, అలం

కారః, ఇతి=అలంకారమని, నిగదితమ్ = నిర్వచింపఁబడిన, సమాఖ్యానమ్=పేరును, యః=ఏ వేల్పు, ధత్తే = ధరించు చున్నాఁడో!, సః = ఆ, వనగిరినాథః = వనాద్రివిభుఁడగు సుందరబాహుస్వామి, (మమ = నాకు) శరణమ్ = దిక్కు, అస్తు=అగుఁగాక.

విశేషములు :— కుసుమసుకుమారాంగ సుఖదైః — పూవులకంటె మృదువులగు ఉత్తమాంగాది పాదారవింద పర్యంతములగు దివ్యావయవములకు మాలతీ మాలాదులవలె సుఖమును గలిగించునవి యని భావము. అలంకార్యైః సర్వైః— కిరీటాది దివ్యాభరణగణ భూషణ్ములును, సుదర్శన పాంచజన్యాది దివ్యాయుధ గణభూషములు నగు స్వదివ్య విగ్రహముచేత నలంకరించుకొనఁ దగిన సర్వభూషణములచేత నని తాత్పర్యము. శ్రీ విష్ణుపురాణమునందు అస్త్రభూషణా ధ్యాయమున సకల తత్వములకు అస్త్రభూషణత్వము వివరింపఁ బడినది. 'సర్వజ్ఞా సముచితశక్త్యస్స దైవ, త్వత్సే వాని యమజుష స్వదేకభోగాః। హేతీనా మధిపతయ స్సదా కి మేతాన్, శోభార్థం వరద! బిభర్షి హర్షతో వా' అని వరద రాజస్తవమునఁ జెప్పినట్లు సుదర్శనాద్యాయుధములకుఁ గూడ భూషణత్వము సర్వపూర్వాచార్య సమ్మతము. కనుక స్వవిగ్రహాలంకారములుగాఁ బ్రసిద్ధములగు ఆభరణములకు నాయుధములకును వివిధ శోభాసమగ్రమగు స్వవిగ్రహము వలన అతిశయశోభ యేర్పడుటచేత అలంకార్యత్వము తన

విగ్రహమునకు శోభను జేకూర్చుటవలన అలంకారత్వమును సిద్ధించుచున్న దని యాశయము.

తా॥ సుఖకరమగు స్పర్శగలవియు, మంచి సువాసన గలవియు, కుసుమసుకుమారము లగు ఉత్తమాంగాది పాదపర్యంతములగు తనదివ్యావయవములకు మాలతీ మాలాదులవలె సుఖమును గలిగించునవియు, నిత్యము లైనవియు, స్వవిగ్రహము చేత నలంకరించుకొనఁ దగినవియు, స్వమూర్తి కలంకారములుగా నున్నవియు అగు సమస్త కిరీటాది దివ్యాభరణముల చేతను, సమస్త సుదర్శనాది దివ్యాయుధముల చేతను నిర్వచింపఁబడిన 'అలంకార' నామమును ఏ దేవదేవుఁడు ధరించునో యా వనగిరినాథుఁ డగు సుందరబాహుస్వామినాకు శరణ మగుఁ గాక.

మ. కరముల్ స్పర్శసుఖంబుతోఁ దనరి సౌ
గంధ్యంబు చెన్నారి పూ
సరముల్ వోలె స్వకోమలాంగములకున్
సౌఖ్యంబుఁ జేకూర్చు సు
స్థిరదివ్యాభరణాయుధాళిఁ దనుల
క్ష్మిన్ శోభిలన్ జేసి శ్రీ
కరుఁ డూనెన్ వనశైల వల్లభుఁ డలం
కారాఖ్య, దిక్ఖ్యాతుఁడే.

అవతారిక :— 'దివ్యాభరణగణ దివ్యాయుధ గణైః' అని పై శ్లోకమునఁ బేర్కొనఁబడిన యావర్గద్వయ మెట్టు లాభ

రణంబు లయ్యెనో యీ క్రింది శ్లోకద్వయముతో నిరూపించు చున్నారు.

శ్లో॥ మకుట మకుట మాలో త్తంస చూడాలలామ
స్వలకతిల కమాలాకుండలై స్సోర్ధ్వపుండ్రైః।
మణివరవన మాలాహారకేయూరకం ఠ్యైః
తులసి కటకకాంచీనూపురాద్యై శ్చ భూషైః। 37

శ్లో॥ అసి జలజరథాంగైః శార్ఙ్గకౌమోదకీభ్యా
మగణితగుణజాలై రాయుధై ర ప్యథాఽన్యైః।
సతతవితతశోభం పద్మనాభం వనాద్రే
రుపవనసుఖలీలం సుందరం వందిషీయ ॥ 38

ప్రతి:— పై రెండు శ్లోకములకుఁ గలిపి యేకాన్వయము. దీనిని 'కులక' మందురు. మకుట........కుండలైః — మకుట = కిరీటముచేతను, మకుటమాలా = కిరీటమునకుఁ జుట్టెడు రత్నమాలచేతను, లేదా పుష్పమాలచేతను, ఉత్తంస —కిరీటశిరోరత్నముచేతను, చూడాలలామ = ప్రశస్త మగు జుట్టుచేతను, (సు+అలక) స్వలక = మంచి ముంగురులచేతను, తిలకమాలా = నొసటికి అలంకార మగు ముత్యములు పొదిగిన బంగారు బొట్టులదండచేతను, కుండలైః=కర్ణాభరణములచేతను, స+ఊర్ధ్వపుండ్రైః = ఊర్ధ్వపుండ్రములతోఁ గూడిన, మణి........కంఠ్యైః— మణివర = మణిశ్రేష్ఠ మగు కౌస్తుభముచేతను, వనమాలా = వనమాలచేతను, (పాదములవఱకు వ్రేలాడు వివిధపుష్పములు చేర్చికట్టినదండ) హార = ముత్యాల పేరులచేతను, కేయూర = భుజకీర్తులచేతను

కంఠ్యైః = కంఠాభరణములచేతను, తులసికటక, కాంచీ, నూపుర, ఆద్యైః,=తులసిమురుగులు, మొలత్రాడు, అందెలు, మొదలుగాఁగల, భూషైః, చ=అలంకారములచేతను, (ఇంత వఱకు మొదటి శ్లోకమునకు అర్థము).

అసి, జలజ, రథాంగైః=నందక, పాంచజన్య సుదర్శనము లనెడు ఖడ్గశంఖచక్రముల చేతను, శార్ఙ్గ, కౌమోదకీభ్యామ్ = ఆనామములుగల ధనుస్సుచేతను, గదచేతను, అథ=తరువాత, అన్యైః=ఇతరములగు, ఆయుధైః, అపి=ఆయుధముల చేతను, అగణిత, గుణ, జాలైః = లెక్కలేనన్ని గుణసమూహముల చేతను, సతత, వితత, శోభమ్=నిరంతరము వృద్ధిచేయఁబడిన సౌందర్యము గలిగినట్టియు, వనాద్రేః = వనగిరియొక్క, ఉప వన, సుఖ, లీలమ్ = ఉద్యానవనమునందు సుఖకరములగు క్రీడలుగల, సుందరమ్ = సుందరబాహుస్వామి యను, పద్మ నాభమ్ = (శ్రీ) మహావిష్ణువును, వందిషీయ = నమస్కరింతును గాక. (ఇది రెండవ శ్లోకమున కర్థము.)

విశేషములు :— 'భూషైః'— భూషాశబ్దమాకారాంత స్త్రీలింగముగాఁ బ్రసిద్ధము— అప్పుడు భూషాభిః అని యుండును. ఈలింగవ్యత్యయము వ్యాకరణ నిపుణులచే విచారణీయము. కొందఱిది ఘఞంతరూపము పులింగముగా నిరూపమందురు. అగణితగుణజాలైః=సర్వజ్ఞత్వ, సర్వశక్తిత్వాద్యనంతగుణగణములచేత, మఱియు - అగణిత గుణజాలైః =

అసంఖ్యాత గుణగణమునుగల, అని యర్థమును జెప్పికొని, దీనిని— 'అసి, జలజ, రథాంగైః శార్ఙ్గ, కౌమోదకీభ్యామ్' — అను వానినిగూడ విభక్తి విపరిణామముచేత విశేషణము చేసి కొనఁదగును. అస్త్రైః, ఆయుధైః = హల, ముసల, పరశు, ప్రభృతులచేత, శ్రీసుందరబాహుస్వామివారికి దివ్యాభరణధారణమువలెనే దివ్యాయుధధారణము సైతము తత్తద్దివ్యావయవములకు శోభాతిశయాధాయక మని భావము.

తా॥ కిరీటము, కిరీటమునకుఁ జుట్టెడు మణిమాల, కిరీట శిరోమణి, నెమలిపించెము (శ్లేష్మముగు చూడ) అందములగు ముంగురులు, నొసటికి, ఆభరణ మగు ముత్యాలు పొదగిన బంగారుబొట్లదండ, కర్ణాభరణములు, కౌస్తుభమణి, వనమాల, హారములు, భుజకీర్తులు, కంఠాభరణములు, తులసికటకములు, రత్నమేఖల, అందెలు, మొదలగు భూషణములచేతను, నందక పాంచజన్య సుదర్శనకౌమోదకీ శార్ఙ్గములచేతను, తదితరములగు హల ముసలపరశు ప్రభృతి దివ్యాయుధముల చేతను. సర్వజ్ఞత్వ, సర్వశక్తిత్వాద్యగణ్యగుణములచేతను, వర్ధమాన సౌందర్యవిశేషము గలట్టియు వనాచలోద్యానవీథుల లీలానందము ననుభవించుచున్న సుందరబాహు మహావిష్ణువునకు వందన మొనర్తును.

శా॥ రాజద్దివ్యకిరీటముం దదుపరి
ప్రత్యగ్రరత్నంబు వి
భ్రాజిష్ణూత్తమఫాలభూషణము హా
రంబుల్ శ్రవోఽలంకృతుల్

తేజఃపుంజము కౌస్తుభం బితరముల్
దీప్తోర్ధ్వపుండ్రంబులున్
రాజిల్లన్ వనశైల మేలుహారి నా
రాధింతు నెల్లప్పుడున్.

మ. ఘనకౌమోదకి పాంచజన్య మనుశం
ఖశ్రేష్ఠముఁ శ్రీసుద
ర్శన చక్రంబును నందకాసియును శా
ర్ఙ్గంబున్ దదన్యంబులౌ
అనవద్యాయుధముల్ ద్యుతుల్ పెనుప మే
లౌసద్గుణా లొప్పశ్రీ
వనశైలేంద్రవిహారి సుందరభుజుఁ
వర్ణింతుఁ గేల్ మోడ్చుచుఁ.

అవతారిక :— ఈమీఁద శ్రీ సుందరబాహుస్వామివారి కేశాదిపాదపర్యంతములగు నవయవములను ముప్పదియొక్క శ్లోకములతో వర్ణించు చున్నారు.

శ్లో॥ ఆజానజస్వగతబంధురగంధలుబ్ధ
భ్రామ్యద్విదగ్ధమధుపాళి సదేశకేశమ్।
విశ్వాధిరాజ్య పరిబర్హకిరీటరాజం
హైః సుందరస్య బత సుందర ముత్తమాంగమ్॥ 39

ప్రతి :— ఆజానజ......... కేశమ్— ఆజానజ = జన్మ సిద్ధమగు (సహజమైన) స్వగత = కేశములకుఁ జెందిన, బం

ధుర = దట్టమైన, లేదా - సమృద్ధమైన, గంధ=సువాసన యందు, లుబ్ధ=పేరాసగలవి గనుకనే, భ్రామ్యత్ = తిరుగు చున్న, విదగ్ధ=రసికములగు, మధుప = తుమ్మెదలయొక్క, ఆళి=పంక్తితో, సదేశ=సమానమగు, కేశమ్=కేశపాశము గలిగినట్టియు, విశ్వ, అధిరాజ్య, పరిబర్హ, కిరీటరాజమ్=సర్వే శ్వరత్వమునకు యోగ్యచిహ్నమగు శ్రేష్ఠమగు కిరీటము గలట్టియు, సుందరస్య=సుందరబాహుమూర్తియొక్క, ఉత్త మాంగమ్=శిరస్సు, సుందరమ్ = అందమైనది, హై, బత= ఔరౌర !

విశేషములు :— విశ్వాధిరాజ్యపరిబర్హకిరీటరాజమ్ — ఉభయవిభూతినిర్వహణలక్షణాతివిలక్షణ దివ్యకిరీటము గలవాఁ డని భావము. హై, బత— ఈ నిపాతద్వయము సుందర బాహుస్వామివారి విలక్షణకేశపాశయుత మగు నుత్తమాంగ మెంత అందముగానున్నది ! అని యాశ్చర్యాతిశయమును దెలుపు చున్నది.

తా॥ సహజమయి సాంద్రమును సమృద్ధము నగు సుగంధము మీఁది పేరాసతో నటుఁ దిరుగుచున్న రసికము లగు తుమ్మె దలతో సదృశ మైన (నల్లని) కేశపాశము గలిగి యుభయ విభూతులను నిర్వహింపఁదగిన సర్వేశ్వరత్వమునకుఁ జిహ్న మగు కిరీటరాజముతోఁ బ్రకాశించు (శ్రీ) సుందరబాహుస్వామి యుత్తమాంగ మెంత సుందరముగా నున్నది. ఆహాహా !

మ॥ తన నైసర్గికభవ్యబంధురసుగం
ధం బానఁగాఁ జుట్టుముూఁ
గిన చుట్టాలకుఁ దేంట్లకుకా నిగనిగల్
గీలించు కైశ్యంబుతో
తన లోకేశ్వరతాసుచిహ్న మగుహృ
ద్యమ్మా కిరీటమ్ముతో
మననీయంబు వనాద్రిసుందరుని త
న్మౌళిం బ్రశంసించెదకా.

శ్లో॥ అంధంతమస్తిమిరనిర్మితమేవ యత్ స్యాత్
తత్సారసాధిత సుతంత్వతి వృత్తవార్తమ్ ।
ఈశస్య కేశవగిరేరలకాలిజాలం
తత్తుల్య కుల్యమధుపాఢ్య మహావనస్య ॥ 40

ప్రతి :— తత్, తుల్య, కుల్య, మధుప, ఆఢ్య, మహాత్, వనస్య=ఆముంగురులతో, సమానకులమునఁ బుట్టిన, తుమ్మెదలతో నొప్పుచున్న మహావనము గల, కేశవగిరేః=వనాద్రికి, ఈశస్య = నాథుఁడైనట్టి, సుందరబాహుస్వామియొక్క, అలక, అళి, జాలమ్ = తుమ్మెదలవంటి ముంగురులగుంపు, అను, యత్=ఏ, అంధమ్=గ్రుడ్డినిగాఁ జేయు, తమః = చీఁకటి గలదో, (తత్=అది) తిమిర, నిర్మితమ్, ఏవ=చీకఁటి చేత నిర్మింపఁబడినదే, స్యాత్ = అగును, (కనుకనే) తత్, సార, సాధిత, సుతంతు, అతివృత్త, వార్తమ్=తిమిరనిర్మిత మగు అంధతమసముయొక్క సారముచేత నిర్మింపఁబడినయం

దములగు దారములను మించినసంగతి గలది, (భవతి = అగు చున్నది.)

విశేషములు :— తత్తుల్య కుల్యా మధుపాఢ్య మహావనస్య— ఇందలి తత్—శబ్దము సుందరబాహుస్వామివారి యలకలను జెప్పను, అందుచేత సుందరబాహుస్వామి ముంగురులగుంపు తోడ సమానకాంతిగల తుమ్మెదలతో నిండిన పెద్దవనముగల యని యర్థ మేర్పడు చున్నద. కేశవగిరేః— కేశవుఁ డని సుందరభుజస్వామివారికి నామాంతరము. వారికి సంబంధించిన గిరి యనఁగా వనాద్రి అని భావము. తిమిరనిర్మితమేవ— చీఁకటియే ఉపాదానకారణముగాఁ గలది. కవులు ముంగురు లకు సహజముగానే అంధకారము నుపమానముగాఁ జెప్పు దురు. ఈ శ్లోకమున చీఁకటిచేత నుద్భవింపఁ జేయఁబడిన గాఢాంధకార సారాంశమువలనఁ దీయఁబడిన సన్నని దారము లను మించియున్నవి దేవరవారి ముంగురు లని వర్ణించినందు వలన సుందరబాహుస్వాముల ముంగురులు మిక్కిలి నల్లగా నిగనిగ లాడుచున్న వని భావము.

తా॥ (శ్రీ) సుందరభుజస్వామివారి ముంగురులతో సమా నము లగు తుమ్మెదలతో నొప్పు మహావనముగల (శ్రీ)వనాద్రి కిఁ బ్రభువగు సుందరభుజస్వామియొక్క తుమ్మెదలను బోలు ముంగురులగుంపు అనెడు కటికిచీఁకటి యంధకారమే యుపా దానకారణముగాఁ గలది యయి యుండును, అందుచేతనే అంధకారసారాంశమువలనఁ దీయఁబడిన యందములగు దార

ముల నతిక్రమించిన సౌందర్యవార్త గలదియై మిక్కిలి నల్లనై యలరారు చున్నది.

చ॥ వనగిరినాథు ముంగురుల

వంటి యళుల్ చెలరేఁగుకానలన్

దనరెడుకొండ నేలుహరి

తద్భ్రమగోపమ కుంతలవ్రజం

బనునిబిడాంధకారము మ

హాతిమిరంబుననే జనించియుం

డును దిమిరంపుఁదేట జిగి

నూలు నిగన్నిగ లేపుఁ జూపెడిన్.

అవతారిక :— ఈ శ్లోకమున సుందరబాహుస్వామివారి లలాటమును వర్ణించు చున్నారు.

శ్లో॥ జుష్టాష్టమీకజ్వలదిందుసన్నిభం
ధృతోర్ధ్వపుండ్రం విలసద్విశేషకమ్ ।
భ్రూమూర్ధ్ని లలాటం విమలం విరాజతే
వనాద్రినాథస్య సముచ్ఛ్రితశ్రియః ॥ 41

ప్రతి :— సముచ్ఛ్రితశ్రియః = 'ఆరూఢశ్రీ' అను నామాంతరము గల, వనాద్రి, నాథస్య = వనగిరి ప్రభువగు శ్రీ సుందరబాహుస్వామియొక్క, జుష్ట. అష్టమీక, జ్వలత్, ఇందు. సన్నిభమ్ = సేవింపఁబడిన యష్టమీతిథి గలవాఁడును, ప్రకాశమానుఁడు నగు చంద్రునితో సమాన మయినట్టియు, ధృత, ఊర్ధ్వపుండ్రమ్ = ధరింపఁబడిన యూర్ధ్వపుండ్రములు

గలిగినట్టియు, విలసత్, విశేషకమ్ = ప్రకాశించుచున్న శ్రీ చూర్ణతిలకము గలిగినట్టియు, (లేదా) కస్తూరి తిలకము గలిగి నట్టియు, విమలమ్=నిర్మలమైనట్టియు, లలాటమ్=నొసలు, భూమ్నా=తేజస్సుతో, విరాజతే=ప్రకాశించు చున్నది.

విశేషములు :— 'జుష్టా.....సన్నిభమ్— అమంద ప్రకాశమగు అర్ధచంద్రునితో సమానమని భావము. భూమ్నా=అధికముగా— తేజస్సుతో అని యర్థద్వయమును జెప్పికొన వచ్చును. విమలమ్— అను చోట 'విపులమ్' అను పాఠాంతరమున – విశాలము, అని అర్థము.

తా॥ ప్రకాశమానుఁడగు అష్టమీ చంద్రునితో (అష్ట చంద్రునితో) సమాన మైనదియు, ఊర్ధ్వపుండ్రములు గలదియు, వానినడుమ శ్రీచూర్ణ (లేదా – కస్తూరి) తిలకము గలదియు, విశాలమును నిర్మలమును అయినదియు, నగు 'ఆరూఢశ్రీ' అను నామాంతరము గల వనాద్రినాథుఁడగు శ్రీ సుందర బాహుస్వామివారి నొసలు మిక్కిలి తేజస్సుతోఁ బ్రకాశించు చున్నది.

గీ॥ అష్టమీచంద్రువలెఁ బ్రాలునదియు, నూర్ధ్వ
పుండ్రములమధ్యఁ గస్తురిబొట్టు వెలయు
నదియు, వెడఁదయు నిర్మల మౌ వనాద్రి
నాథునిటలమ్ము తేజస్సునఁ వెలుంగు.

అవతారిక :— ఈ శ్లోకమున స్వామివారి కనుబొమల జంటను వర్ణించు చున్నారు.

శ్లో॥ సుచారుచాపద్వయవిభ్రమం భ్రువో
ర్యుగం సునేత్రాహ్వసహస్రపత్రయోః ।
ఉపాంతగం వా మధుపావళీయుగం
విరాజతే సుందరబాహుసంశ్రయమ్ ॥ 42

ప్రతి :— సుందర బాహు, సంశ్రయమ్=శ్రీసుందర బాహు స్వామియే ఆశ్రయముగాఁ గలట్టియు, సుచారు, చాప, ద్వయ, విభ్రమమ్ = అతిసుందరమగు వింటిజంటయొక్క విలాసము వంటి విలాసము గలట్టియు, భ్రువోః = కనుబొమలయొక్క, యుగమ్=జంట, సునేత్ర, ఆహ్వ, సహస్రపత్రయోః=మంచి కన్నులనెడు పేరు గలతామర రేకులయొక్క, ఉపాంత, గమ్= సమీపమును బొంగియున్న, మధుప, ఆవలీ, యుగం, వా = తుమ్మెదబంతులజంట వలె, విరాజతే=మిక్కిలి ప్రకాశించు చున్నది.

విశేషములు :— ఈ శ్లోకమునందలి ఉపాంతగం వా— అనుచోట గల 'వా' అను శబ్దము 'ఇవ' అను నర్థమునఁ బ్రయుక్తమైనది. నేత్రములందు సహస్ర పత్రభ్రాంతిచేత మకరందపానాసక్తితో నేత్రప్రాంతముల బారుదీర్చిన భ్రమర పంక్తిద్వయమువలె శ్రీసుందరబాహుస్వామివారి కనుబొమల జంట ప్రకాశించు చున్నదని భావము.

తా॥ శ్రీ సుందరబాహుస్వామివారి కనుబొమల జంట యందమగు వింటిజంటయొక్క విలాసమువంటి విలాసముతో నొప్పుచు మనోహర నేత్రము లనెడు సహస్రపత్రముల సమీప

మున రెండుబారులు దీర్చిన తుమ్మెద బంతులవలెఁ బ్రకాశించు చున్నది.

ఉ॥ శ్రీ యుతముల్ ధనుర్ద్వయ వి
శిష్టవిలాసము సుందరప్రభ
భ్రూయుగళంబు లోచనస
రోరుహసన్నిధియందు నాసతోఁ
బాయక రెండు బంతులుగ
బారులు దీర్చి చలింపకుండు తేం
ట్లో! యనఁ జూచుభక్తుల క
నుంగవకుం గడు విందొనర్చెడుల్.

అవతారిక :— ఈ శ్లోకమున శ్రీ సుందరబాహుస్వామి నేత్రసౌందర్యమును వర్ణించు చున్నారు.

శ్లో॥ అదీర్ఘ మప్రేమదుహం క్షణోజ్జ్వలం
న చోర మంతః కరణస్య పశ్యతామ్।
అనుబ్జ మబ్జం ను కథం నిదర్శనం
వనాద్రినాథస్య విశాలయో ర్దృశోః॥ 43

ప్రతి:— అదీర్ఘమ్=గుండ్రనిదియు (దీర్ఘము కానిదియు) అప్రేమ,దుహామ్=ప్రేమను స్రవింప నదియు క్షణ,ఉజ్జ్వలమ్= క్షణకాలము మాత్రమే ప్రకాశించు నదియు, పశ్యతామ్= చూచువారియొక్క, అంతఃకరణస్య=మనస్సునకు, న చోరమ్=ఆకర్షించనిదియు, (హరించ నదియు)అనుబ్జమ్-ఆర్జవము లేనిదియు.(అగు)అబ్జమ్= పద్మము,వన,అద్రి,నాథస్య=వనగిరి

ప్రభు వగుసుందరబాహుస్వామియొక్క,విశాలయోః=పెద్దవి
యగు,దృశోః=కన్నులకు,కథం ను=ఎట్లు,నిదర్శనమ్=దృష్టాం
తము.(భవేత్=అగును)కా దని భావము.

విశేషములు:— అప్రేమదుహామ్—ప్రేమము—అనఁగా
స్నేహము,దానిని పితుకు నది.లేదా—నింపు నదిలేదా స్రవించు
నది,ప్రేమదుహమ్-అగును. అట్టిది కా నిది, అప్రేమదుహామ్=
స్నేహమును స్రవింపనిది,పద్మము కొంచెము పూఁదేనెను
స్రవించునే కాని ప్రేమను స్రవింప దని భావము.క్షణోజ్జ్వలమ్-
క్షణకాలము దాఁటినచోఁ బద్మము క్రమముగా వాడిపోవు నని
భావము. అనుబ్జమ్—ఉబ్జ-ఆర్జవే;అనుధాతువునుండి యేర్ప
డినఁఉబ్జపదమునకు అర్జవ మని యర్థముఅదిలేనిది యనుబ్జము.
పద్మము సూర్యోదయమున వికసించునట్లు చంద్రోదయమున
వికసింపదు. అందుచేత ఋజుమార్గము లేనిది యగు చున్నది.
విశాలయోః=దీర్ఘము లగు,అనఁగా-కర్ణాంతవిశ్రాంతము లని
యభిప్రాయము.

తా॥ కర్ణాంత విశాలములును ఆశ్రితులయెడలఁ బ్రేమ
పూరమును బ్రవహించునవియు, సదాఏకరూపమగు వికాసము
గలవియు, చూచువారియంతఃకరణముల నాకర్షించునవియు
నగు వనాద్రి నాథుఁడగు శ్రీసుందరబాహుస్వామియొక్క
దివ్యనేత్రములకు గుండ్రనిదియుఁ గొంచెము పూఁదేనెను
మాత్రమే స్రవించునదియు, పగలు వికసించి రాత్రి ముకుళించు
నదియుఁ జూచువారిమదినంతగా నాకర్షింపలేనిదియునై తన్నేత్ర

గుణములతో సరితూగలేనిపద్మమెట్లు నిదర్శనముకాఁగలదు ? పద్మము శ్రీవారికన్నులకుఁ బోల్పఁగదగదని భావము.

మ. నిడువాల్ కాదఁట ప్రేమపూరమును జిం
దింపంగ లేదంట ప్రే
ల్మిడిలో వాఁడెడు నంట ద్రష్టృహృదయా
ళిన్ లాఁగ లేదంట శే
ముడుఁగం బాఱెడు నంట పద్మ మది యే
మో మెప్పుఁగా నీడు వ
చ్చెడు శ్రీసుందరబాహు నేత్రయుగళ
శ్రీ కాయతత్వాదులన్.

అవతారిక :— అలంకారనాముఁ డగు శ్రీ వనాద్రి నాథుఁడు అట్టి కన్నులతో నన్నుఁ గటాక్షించుఁ గాక యని ప్రార్థించు చున్నారు.

శ్లో॥ ప్రశ్చ్యోతత్ ప్రేమసారామృతరసచులుకప్రక్రమప్రక్రియాభ్యాం
విక్షిప్తాలోకితోర్మి ప్రసరణముషితస్వాంత కాంతాజనాభ్యామ్ ।
విశ్వోత్పత్తి ప్రవృత్తి స్థితిలయకరణై కాంత శాంత క్రియాభ్యాం
దేవోఽలంకారనామా వనగిరి నిలయో వీక్షతా మీక్షణాభ్యామ్॥ 44

ప్రతి :— వనగిరినిలయః=వనాద్రి నివాసియు, అలంకార నామా=అలంకార నామధేయుఁడును అగు, దేవః=సుందర బాహుదేవుఁడు, ప్రశ్చ్యోతత్ — — — ప్రక్రియాభ్యామ్— ప్రశ్చ్యోతత్=మిక్కిలి స్రవించుచున్న, ప్రేమ, సార=శ్రేష్ఠ మగు ప్రేమ యనెడు, అమృతరస = సుధారసము గల,

చుళుక=పుడిసిలియొక్క, ప్రక్రమ=విధమువంటి, ప్రక్రియాభ్యామ్=విధములు గలిగినట్టియు, విక్షిప్త......జనాభ్యామ్—విక్షిప్త=ప్రేరేపింపఁబడిన, ఆలోకిత = చూపుల నెడు, ఊర్మి=అలలయొక్క, ప్రసరణ = ప్రసారముచేత (వ్యాప్తిచేత, ముషిత=దొంగిలింపఁబడిన, స్వాంత=మనస్సుగల, కాంతాజనాభ్యామ్=స్త్రీజనము గలట్టియు, విశ్వ......క్రియాభ్యామ్—విశ్వ=నమస్త చేతనాచేతన సమూహముయొక్క, ఉత్పత్తి=పుట్టుకను, ప్రవృత్తి=ప్రవర్తనమును, స్థితి = పోషణమును, లయ = నాశనమును, కరణ = చేయుటయందు, ఏకాంత, శాంత, క్రియాభ్యామ్=మిక్కిలి శాంతవ్యాపారము గలట్టియు, ఈక్షణాభ్యామ్=కన్నులతో, వీక్షతామ్ =చూచుఁగాక.

విశేషార్థములు :— అమృతరసచుళుక......ఏకకరోదరపరిమాణమగు చుళకమును (పుడిసిలిని) దృష్టాంతమునుగాఁ జెప్పుట భక్తులు సుందరబాహుస్వామివారి నేత్రములనుండి స్యందించు ప్రేమరసామృతమును మెల్లమెల్లగాఁ దనివిదీర సుఖముగాఁ ద్రాగఁ గలరని సూచించునిమిత్తమని తెలియనగును. విక్షిప్తా — — — జనాభ్యామ్— సుందరీజన మనోవిలాసశాలి మనోజ్ఞాలోకనములచేత నని భావము. విశ్వా — — — క్రియాభ్యామ్— సకలజగత్సృష్టిస్థితిప్రళయ విధానములందు మిక్కిలి ప్రవర్తమానము లగుచున్న— అని తాత్పర్యము. వీక్షతామ్— అనన్యలక్ష్యము లగు సమ

గ్రానుగ్రహముగల కటాక్షములకు నన్ను లక్ష్యమును జేయుఁ గాక అని యాశయము.

తా॥ వనగిరి నిత్యనివాసుఁడును, 'అలంకార నామధేయుఁడును అగు శ్రీ సుందరబాహుస్వామి నిరంతరము స్యందించుచున్న ప్రేమసార మనెడు అమృతరసమునకుఁ జాలుకములవంటివియు, తరంగములఁ బోలినకటాక్షాలోకములచేత సుందరీ జనముల మనస్సుల నాకర్షించుచున్నవియు, సకలజగత్సృష్టి స్థితి ప్రళయవిధానములందుఁ బ్రశాంతవ్యాపారములు గలవియు నగు లోచనములతో నన్ను నిరంతరము కటాక్షించుఁ గాక.

శా॥ భూరిప్రేమ రసామృతం పుఁజాలుకం
బుల్, మంజులాలోకసం
చారాకృష్ట విలాసినీ జనమన
స్సర్వస్వకంబుల్, జగ
త్ప్రారంభస్థితి సంహృతీడ్యములు నే
త్రాల్ విప్పి న న్నాయలం
కారాఖ్యుం డగుకాననాద్రివారి శ్రీ
కంజాక్షుఁ డీక్షించుతన్.

అవతారిక :— ఈ శ్లోకమునందు శ్రీ సుందరబాహుస్వామి నాసాసౌందర్యమును వర్ణించు చున్నారు.

శ్లో॥ ప్రేమామృతౌఘపరివాహిమహాక్షిసింధు
మధ్యే ప్రబద్ధ సముదంచిత సేతుకల్పా ।
బుజ్యే సుసుందరభుజస్య విభాతి నాసా
కల్పద్రుమాంకురనిభా వనశైలభర్తుః ॥

ప్రతి :— వన, శైల, భర్తుః = వనాద్రినాథుఁ డగు సుందర బాహుస్వామియొక్క, ఋజ్వీ = వంకరటింకరలు లేక సరిగానున్నట్టియు, కల్పద్రుమ, అంకుర, నిభా = కల్పవృక్షము యొక్క, చిగురాకుతో సమానమైనట్టియు, నాసా = ముక్కు, ప్రేమ—మధ్యే—ప్రేమ = ప్రేమ మనెడు, అమృత + ఓఘ = అమృతప్రవాహమును పరివాహి = ప్రవహింపఁజేయు, మహాత్ = పెద్ద, అక్షి = కన్నులనెడు, సింధు = సముద్రముల యొక్క, మధ్యే = నడుమ, ప్రబద్ధ, సముదంచిత, సేతు, కల్పా = కట్టఁబడినదియు, అత్యంతసంభావిత మైనదియు, నగు సేతువుతో సమానమైనది, భవతి = అగుచున్నది.

విశేషములు :— ఋజ్వీ = నిరంతరమను భవింపఁబడు చున్నను, ఎప్పటి కప్పుడు క్రొత్తదానివలె నగపించు ఏకరూప మగు శోభగలది.

ఈ శ్లోకములోని పూర్వార్థముయొక్క భావమిది. (శ్రీ) సుందర బాహుమూర్తి నేత్రశోభానుభవము కొఱకుఁ దిగి అందలి ప్రేమరసములో మునిఁగి పోవుటచే అవయవాంతర శోభానుభవమునకుఁ బోవ శక్తి లేని ప్రేక్షకుల కన్నులకు స్వామివారినాసిక సేతువువలె నావలియొడ్డుఁ జేరుటకు సాధన మగు చున్నది.

తా॥ ఎల్లప్పుడు ననుభవింపఁ బడుచున్నను శశ్వదేకప్రకార మగు నవనవశోభ గలదియు, కల్పవృక్షకిసలయము వలె మనో

హారమైనదియు నగు సుందరబాహుస్వామివారి నాసిక ప్రేమామృతపూరమును ప్రవహింపఁజేయు కన్నులనెడు సముద్రముల నడుమ బంధింపఁబడి యొప్పిదముగా నున్నసేతువువలెఁ బ్రకాశించు చున్నది.

చ. నిరుపమశోభ యెప్డు రమ
ణీయత నేకవిధాన నొప్ప స్వ
స్తరు నవపల్లవాకృతిఁ బ్ర
శస్తి వహించు వనాద్రివాసి సుం
దరభుజునాస ప్రేమరస
ధారలఁ బూర్ణము లైన నేత్రసా
గరముల నంతరాళమునఁ
గన్పడు నూతనసేతువో! యనన్.

అవతారిక :— ఈ శ్లోకమున శ్రీ స్వామివారివదన సౌందర్యము ననుభవించు చున్నారు.

శ్లో॥ వ్యాభాషితాభ్యధికనందన భందనర్ద్ధి
మందస్మితామృత పరిస్రవ సంస్తవార్హ్యమ్।
ఆ భాతి విద్రుమసమాధర మాస్య మస్య
దేవస్య సుందరభుజస్య వనాద్రి భర్తుః॥ 46

ప్రతి :— వన, అద్రి, భర్తుః = వనగిరి నాథుఁడైన, సుందరభుజస్య = సుందరబాహుమూర్తియను, అస్య = ఈ, దేవస్య = స్వామియొక్క, వ్యాభా — — — ఆర్హ్యమ్— వ్యాభాషిత, అభ్యధిక, నందన, భందన, ఋద్ధి = మాటలాడునపు డత్యంతా

నందకరమును శుభదము నగు సమృద్ధి గల, మందస్మిత, అమృత, పరిస్రవ, సంస్తవ, ఆఢ్యమ్=చిఱునవ్వు అనెడు అమృతరసముయొక్క పరిచయముతో నొప్పునదియు, విద్రుమ, సమ, అధరమ్=పొగడముతో సమానమగు పెదవిగలదియు అగు, ఆస్యమ్=మొగము, ఆభాతి=ప్రకాశించు చున్నది.

విశేషములు :— ఇందలి పూర్వార్థము 'స్మితపూర్వాభిభాషిణమ్' అన్నట్లు శ్రీసుందరబాహుస్వామి ప్రియులతో మాటలాడు నప్పుడు శ్రీవారి ముఖమునం దానందకరమును శుభప్రదమునగు మందహాస సుధానిష్యంద పరిచయముతో నొప్పుశోభాతిశయమును జాటుచున్నది. మాటలాడు నపుడు దేవరవారి చిఱునవ్వు వెన్నెలలు గాయునెమ్మోము భక్తుల కత్యంతభోగ్యముగా నుండునని పిండితార్థము.

విద్రుమసమాధరమ్— సంభాషణసమయమునఁ బొగడము వంటివాతెఱ కెంజాయలతోఁ గూడిన స్వామివారి చిఱునవ్వే దేవరవారి మోమున కంతయు శోభ చేకూర్చు చున్నదని యాశయము.

తా॥ వనాద్రినాథుఁ డగు నీ శ్రీసుందరబాహుస్వామివారి ముఖము సంభాషణసమయమం దధికానందకరమును శుభప్రదమునగు సమృద్ధిగల మందహాసమను అమృతనిష్యందముతోఁ బుష్టిఁగాంచి పొగడమువంటి వాతెఱపొలుపుతో నెంతయుఁ బ్రకాశించు చున్నది

క. పలికెడు తఱి నమృతంబుం
జిలుకుచు లేనవ్వు గాయఁ జిఱువెన్నెలలన్
తుల లేనిమోవి పగడపుఁ
దళుకులఁ గురియన్ వనాద్రిధవుమో మలరున్.

అవతారిక :— ఈ శ్లోకమునందు శ్రీవనాద్రినాథుని కపోల సౌభాగ్యము ననుభవించు చున్నారు

శ్లో॥ యశోదాంగుళ్యగ్రో న్నమితచుబుకాఘ్రాణముదితౌ
కపోలా వద్యాపి హ్యనుపరతతద్ధర్షగమకౌ।
విరాజేతే విష్వగ్వితతసహకారాసవరస
ప్రమాద్య ద్భృంగాఢ్య ద్రుమవనగిరే స్సుందరహరేః॥ 47

ప్రతి :— విష్వగ్వితత......గిరేః—విష్వక్ = నలువైపుల, వితత = వ్యాపించిన, సహకార = తియ్యమామిడిపండ్లయొక్క, ఆసవ = ఆసవముయొక్క, రస = రసముచేత, ప్రమాద్యత్ = మదించుచున్న, భృంగ = తుమ్మెదలచేత, ఆఢ్య = ఒప్పుచున్న, ద్రుమ = చెట్లుగల, వనగిరేః = వనాద్రిగల, సుందరహరేః = సుందరభుజస్వామియొక్క, యశోదా......... ముదితౌ— యశోదా = యశోదాదేవియొక్క, అంగుళి = వ్రేళ్ళయొక్క, అగ్ర = కొనలచేత, ఉన్నమిత = పైకెత్తబడిన, చిబుక = గడ్డముయొక్క, ఆఘ్రాణ = మూచూచుటచేత, ముదితౌ = సంతసించినవియు, (వికసించినవియు) అద్యాపి = నేఁటికిని, అనుపరత, తత్, హర్ష, గమకౌ = ముగియని యానంతోష వికాసమును సూచించు నవియు, అగు, కపోలౌ = చెక్కిళ్ళు, విరాజేతే, మిక్కిలి ప్రకాశించుచున్నవి, హి = సత్యము.

విశేషములు :— యశోదా.....ముదితౌ — యశోదా దేవి వాత్సల్యాతిశయముచేత శ్రీ బాలకృష్ణుని గడ్డమును తన వ్రేళ్ళకొనలతో నెత్తి పట్టి ముద్దుకొనఁగాఁ జెక్కిళ్ళ యందు సంతోషముచేత నొకవికాసము గలిగెనని భావము. అద్యాఽపి— ఇప్పటికిని— అనఁగాఁ జాలకాలము గతించి నప్పటికిని, సుందరభుజావతారమునఁ గూడ ఆసంతోష వికాస మనువర్తించుచునే యున్నదని యాశయము. 'హి' హి శబ్ద ప్రయోగమువలనఁ బూర్వోక్త సుందరభుజస్వామివారికపోల వికాసము శ్రీవారి సేవింపవచ్చిన భక్తులెల్లరకుఁ బ్రత్యక్షాను భావ్యమగు చున్నదని సుస్పష్ట మగుచున్నది.

తా॥ నలువైపుల విజృంభించిన తియ్యమామిళ్ళ యాసవ రసంబును గ్రోలి మదించిన తుమ్మెదలతో నొప్పు వృక్షములు గల వనాద్రికి నాథుఁడైన శ్రీ సుందరభుజస్వామియొక్క చెక్కిళ్ళు కృష్ణావతారమున యశోద వాత్సల్యాతిశయముచేత గడ్డమును బైకెత్తి ముద్దాడుటచేఁ గలిగిన వికాసముతో నేఁటికిని భక్తజనుల కనుభావ్యములై యలరారు చున్నవి.

ఉ. చిన్నతనాన గడ్డమును
జేఁ గొని నందునిరాణి ముద్దులన్
గొన్నది, తద్వికాస మొక
కొంచెముఁ దగ్గక విందు గూర్చెదున్

గన్నుల కిప్డు వ్యాప్తసహ
కారఫలాసవమత్తభృంగ సం
పన్న వనాద్రి సుందర సు
బాహు మనోజ్ఞకపోల మండలిన్.

అవతారిక :— ఈ శ్లోకమునందు శ్రీస్వామివారి కర్ణపాశ సౌందర్యమును వర్ణించుచున్నారు.

శ్లో॥ వ్యాలంబికుండల ముదగ్రసువర్ణపుష్ప
నిష్పన్నకల్పలతికాయమలానుకారమ్ ।
యత్కర్ణపాశయుగలం నిగడం ధియాం నః
సోఽయం సుసుందరభుజో వనశైలభూషా ॥ 49

ప్రతి :— వ్యాలంబి, కుండలమ్ = (మూపులమీఁద) వ్రేలాడుచున్న కర్ణాభరణములు గలదియు, ఉదగ్ర . . . . . అను కారమ్— ఉదగ్ర = ఉజ్జ్వలమగు, సువర్ణ = బంగారపు, పుష్ప = పువ్వులతో, సంపన్న = కూడిన, కల్పలతికా = కల్పలతల యొక్క, యమల = జంటయొక్క, అనుకారమ్ = సారూప్యము గల, యత్, కర్ణపాశ, యుగళమ్ = ఏసుందరబాహుమూర్తి యొక్క ప్రశస్తములగు చెవులజంట, నః = మాయొక్క, ధియామ్ = బుద్ధులకు, నిగడమ్ = సంకెల,(భవతి = అగుచున్నదో) సః = అట్టి, అయమ్ = ఈ సుందరభుజః = సుందరబాహుస్వామి, వనశైల, భూషా = వనాద్రికి అలంకారమువంటివాఁడు.

విశేషములు :— 'యత్కర్ణపాశయుగళం నిగడం ధియాం నః' శ్రీ సుందరబాహుస్వామివారి కర్ణపాశయుగళము మిక్కిలి అందముగా నుండుటవలన మాబుద్ధులకుఁ దదితర దివ్యావయ

వానుభవంబు నొనర్ప సంకెలవలె నాటంకము గలిగించు చున్నది. లేదా— మాబుద్ధులను విషయాంతరానుభవము నకుఁ బోనీయక యరికట్టుచున్న దని భావము. అట్టి త్రిలోక సుందరుఁ డగు (శ్రీ) సుందరభుజస్వామి యీ వనాద్రి కొక యమూల్యాలంకారముగా నుండుట వనగిరి భాగ్యమని తాత్పర్యము.

తా॥ మూఁపులపై వ్రేలాడుచున్న కర్ణాభరణములు గల దియు, దేదీప్యమానము లగు బంగారు పువ్వులతోఁ గూడిన కల్పలతలజంటను బోలినదియు నగు శ్రీ సుందరబాహుస్వామి వారి ప్రశస్తములగు వీనులజంట మాబుద్ధుల ఇతర దివ్యావ యవసౌందర్యానుభవమునకుఁ గాని విషయాంతర సంచారము నకుఁ గాని పోనీయక సంకెలవలె నరికట్టు చున్నది. ఏతాదృశ కర్ణపాశసౌందర్యవిశిష్టుఁ డగు శ్రీ సుందరబాహుస్వామి వనాద్రి కొక దివ్యభూషణముగాఁ బ్రకాశించు చున్నాఁడు.

ఉ. మూఁపులపైని నాడునటు
ముచ్చటఁ గొల్పఁగఁ గుండలమ్ము లు
ద్దీపిత హేమపుష్పములు
తీర్చిన కల్పలతాద్వయం బటుల్
దాపున వెల్గుస్వామి చెవి
తమ్మొలు సంకెల మాదుబుద్ధికిన్,
జూపరి దివ్యభూషణము
సుందరబాహువు కాననాద్రికిన్.

అవతారిక :— ఈ శ్లోకమున శ్రీవారి కంఠ సౌందర్యము ననుభవించు చున్నారు.

శ్లో॥ సదంసనంసంజిత కుంతలాంతికా
వతీర్ణకర్ణాభరణాఢ్య కంధరః
సుబంధురస్కంధ నిబంధనో యువా
సుసుందర స్సుందరదో ర్విజృంభతే ॥ 49

ప్రతి :— సదంస......కంధరః— సత్ = యోగ్యము లగు (అందము లైన) అంస = మూపులమీఁద, సంసంజిత = బాగుగా నంటుకొనియున్న, కుంతల = ముంగురులయొక్క, (చూర్ణకుంతలములయొక్క) అంతిక = సమీపమునందు, అవతీర్ణ = వ్రేలాడుచున్న, కర్ణాభరణ = కుండలములతోడ, ఆఢ్య = ఒప్పుచున్న, కంధరః = కంఠముగల వాఁడును, సుబంధుర, స్కంధ, నిబంధనః = మిక్కిలి దృఢమగు మూపులయొక్క సంధి బంధములు గలవాఁడును, యువా = యౌవనవంతుఁడును, సుందరదోః = సుందరములగు బాహువులు గలవాఁడును, అగు సుందరభుజస్వామి, సుసుందరః = మిక్కిలి సుందరుఁడగుచు, విజృంభతే = విజృంభించు చున్నాఁడు (చెలరేగు చున్నాఁడు.)

విశేషములు :— పూర్వార్థము భావమేమన ? మూపులఁ దాఁకుచున్న పిల్లజుట్టువఱకు వ్రేలాడు కర్ణాభరణములతో నలంకృతమగు కంఠము గలవాఁడు. యువా = బాల్యయౌవన సంధిలోని వాఁడని భావము.

తా॥ సుందరబాహుస్వామి యందము లగు మూపుల నంటియున్న పిల్లజుట్టు వఱకు వ్రేలాడుచున్న కుండలములతో సుందర

మగు కంఠము గలవాఁడును, దృఢములగు భుజశిరస్సుల సంధులు గలవాఁడును, బాల్యయౌవనముల సంధిలో నున్న వాఁడునై మిక్కిలి సుందర రూపముతో విజృంభించు చున్నాఁడు.

ఉ. మూఁపుల మూఁగి మెంతయును
 ముచ్చటఁ గొల్పెడు పిల్లజుట్టు పెన్
దాపునఁ గుండలచ్ఛవుల
 తాండవ మొప్పి సుసంధిబంధురం
బై పొలుపారఁ గంధరము
 యౌవన నవ్య విలాసమంజులా
టోపముతో వనాచల కు
 టుంబి సుసుందరుఁ జేపుఁ జూపెడున్.

శ్లో॥ వ్యూఢగాఢ భుజజత్రు ముల్లస
 త్కంబు కంధరధరం ధరాధరమ్।
 వృక్షషండమయ భూభృత స్తటే
 సుందరాయత భుజం భజామహే॥

ప్రతి :— వ్యూఢ, గాఢ, భుజ, జత్రుమ్=బలిసినవియు (భారమును సహించు నవియు) దాగినవియు (మాంసములో) అగు భుజములదగ్గఱ నున్న మెడయెముకలు గలవాఁడును, ఉల్లసత్, కంబు, కంధర, ధరమ్ = ప్రకాశించుచున్న శంఖము వంటి మెడకలవాఁడును, సర్వమును ధరించువాఁడును, వృక్ష, షండ, మయ, భూభృతః=చెట్లగుబురులతో నిండిన పర్వతము యొక్క, తటే=చటియందు, ధరాధరమ్=భూమిని రక్షించు

చున్నవాఁడును, అగు, సుసుందర, ఆయత, భుజమ్=మిక్కిలి ఆందములును దీర్ఘములును అగు భుజములుగల సుందరబాహు స్వామిని, భజామహే=సేవించుచున్నాము.

విశేషములు :— ఉల్లసత్కంబు కంధరధరమ్— కంధరా శబ్దము స్త్రీలింగముగనుక— కంధరాధరమ్— అని యుండవలసి యున్నది. శ్రీకూరేశులవారు అకారాంతముగాఁ బ్రయోగించుటంజేసి— 'కంధర' వఱకు బహువ్రీహి చేసికొని తరువాత 'ధర' శబ్దముతో విశేషణోభయ పదకర్మధారయ మొనర్పఁబడినది. తదనుసారముగనే యర్థము వ్రాయఁబడినది. ధరాధరం వృక్షషండమయ భూభృతః, తటే, ఇందలి 'మయట్' ప్రత్యయము ప్రాచుర్యార్థమున వచ్చినది. శ్రీసుందరభుజస్వామి అందఱిని రక్షింప బద్ధకంకణుఁడై యున్నను మాబోంట్ల సంరక్షణ సౌలభ్యమునకై వనాద్రితటమున వేంచేసి యుండెనని యాశయము.

తా॥ బలిసి కండపట్టిన మెడయెముకలు గలిగి యందమగు శంఖమువంటి కంఠము గలిగి వనాద్రిసానుతలమునందు భక్తరక్షణ సౌలభ్యమునకు వేంచేసియున్న యాయతబాహు వగు శ్రీసుందరభుజస్వామిని భజించుచున్నాము.

మ. బలసంపన్నము మాంసగర్భితము
శుంభజ్జత్రు దేశంబు ను
జ్జ్వలకంబూపమ భవ్యకంధరము భా
స్వద్దీర్ఘ బాహాద్వయం

బలరారన్ దరుషండ మండితవనా
హార్యంబునం దొక్కచో
జెలువొప్పన్ నివసించు సుందరభుజున్
సేవింతు మశ్రాంతమున్

అవతారిక :— ఈ క్రింది యైదు శ్లోకములయందు శ్రీ సుందరబాహుస్వామి దివ్యభుజములు సౌందర్యము ననుభవించు చున్నారు.

శ్లో॥ మందరభ్రమణ విభ్రమోద్భటాః
సుందరస్య విలసంతి బాహవః ।
ఇందిరా సమభినంద భందనా
శ్చందనాగరు విలేపభూషితాః ॥ 51

ప్రతి :— మందర, భ్రమణ, విభ్రమ, ఉద్భటాః = మందర మనెడు కవ్వపుఁగొండను ద్రిప్పుటయందు ఉత్సాహము గలవియు, ఇందిరా, సమభినందన, భందనాః = లక్ష్మీదేవిని సంతోషపెట్టు విషయమున మంగళకరములును, (లేదా) సుఖకరములును, చందన, అగరు, విలేప, భూషితాః = గంధము–అగరు – మైపూఁతలతో అలంకరింపఁ బడినవియు అగు, సుందరస్య = సుందరబాహుమూర్తి వారి యొక్క, బాహవః = భుజములు, విలసంతి = మిక్కిలి ప్రకాశించుచున్నవి.

విశేషములు :— 'భందనాః' భది కల్యాణే – సుఖే చ – అను ధాతువువలన నేర్పడిన రూపము గావున – కల్యాణకరములు లేదా సుఖకరములు– అని యర్థ మొసఁగును. క్షీరాబ్ధి

మథనకాలమునందే లక్ష్మీదేవి ఆవిర్భవించుటవలన మందర భ్రమణ విలాసమహోత్సాహ మిందిరానందావాప్తికి హేతువుగా వర్ణింపఁ బడినది.

తా॥ మందరాచలభ్రమణ విలాసోత్సాహంబులును ఇందిరానంద సమవాప్తి హేతువులును చందనా గరువిలేపనాలంకృతములు నగు సుందరబాహుస్వామి బాహువులు మిక్కిలి ప్రకాశించు చున్నవి.

గీ॥ మందరా ఘూర్ణన విలాసమంజులములు
ఇందిరా నందసమవాప్తి కందళములు
చందనాగరులిప్తముల్ సుందరభుజ
బాహుదండంబు లతిలోక మోహనములు.

శ్లో॥ జ్యాకిణాంక పరికర్మ ధర్మిణో
భాంతి సుందరభుజస్య బాహవః ।
పారిజాత విటపాయితర్ధయః
ప్రార్థితార్థ పరిదాన దీక్షితాః ॥ 52

ప్రతి :— జ్యా, కిణ, అంక, పరికర్మ, ధర్మిణః = వింటినారి వలనికాయ యనెడు గుర్తే అలంకార రూపమగు ధర్మముగాఁ గలవియు, ప్రార్థిత, అర్థ, పరిదాన, దీక్షితాః = (ఆశ్రితజనుల చేత) ప్రార్థింపఁ బడిన, పురుషార్థముల నొసంగుటయందు దీక్ష గలవియు, (కనుకనే) పారిజాత, విటపాయిత, ఋద్ధయః = పారిజాతపుఁ గొమ్మవంటి సమృద్ధి గలవియు, అగు, సుందర భుజస్య = సుందరబాహుస్వామియొక్క, బాహవః = భుజములు, భాంతి = ప్రకాశించు చున్నవి.

విశేషములు :— జ్యాకిణాంక......ధర్మిణః — జ్యాకిణ మనఁగా— ధనుస్సు నెక్కువెట్టి బాణమును సంధించు సమయమున వింటినారి దెబ్బచేత నేర్పడిన ముంజేతి యందలి వ్రణవిశేషము. ఇది మహావీరుల భుజమున కలంకారము. ఈ యలంకారము సుందరభుజస్వామివారిభుజము లన్నింటికిఁ బేర్కొనుట వలన నాస్వామి సవ్యసాచి యని స్పష్టమగు చున్నది. ఈవిశేషణము స్వామివారి శౌర్యమును జాటుచున్నది. ప్రార్థితా...... దీక్షితాః— ఆశ్రిత జనులకుఁ జతుర్విధ పురుషార్థముల నొసంగుటలో దీక్ష వహించిన వని భావము. ఈ విశేషణము స్వామివారి యౌదార్యవిశేష స్ఫోరకము. దీనివలన శౌర్యౌదార్యములే భుజములకు శోభాజనకము లనుట స్పష్టమగు చున్నది.

తా॥ వింటినారివలన నేర్పడిన కాయలే ఆభరణములుగాఁ గలిగి, ఆశ్రితుల యభీష్టము లొసంగుటకు దీక్షవహించి, పారిజాతశాఖాసమానసమృద్ధి చెన్నారి శ్రీ సుందరబాహు స్వామివారి దివ్యబాహువులు మిక్కిలి శోభిల్లుచున్నవి.

గీ. జ్యాకిణాంకాఢ్య వీరభూషల ధరించి
సంశ్రితేష్టార్థదాన దీక్షాయుతములు।
పారిజాత ద్రుమవిటపశోభావహములు
సుందరభుజార్గళమ్ము లానందదములు.

శ్లో॥ సాగరాంబరతమాలకానన
శ్యామలర్ధయ ఉదారపీవరాః।

శేషభోగ పరిభోగ భాగిన
స్తన్నిభా వనగిరీశితు ర్భుజాః ॥ 53

ప్రతి :— సాగరా......బుద్ధయః— సాగర=సముద్రము వలెను, అంబర=ఆకాశమువలెను, తమాలకానన = చీఁకటి మ్రాఁకుల యడవివలెను, శ్యామల = నల్లని, బుద్ధయః= శోభాసమృద్ధి గలవియు, ఉదార, పీవరాః =దీర్ఘము లైనవియు, బలిష్ఠము లైనవియును, శేషభోగ, పరిభోగ, భాగినః=శేష శరీరరూపమగు శయ్యాసుఖము ననుభవించుటయందు భాగము (పాలు) గలవియు, తత్ + నిభాః = ఆ శేషశరీరముతో సమా నము లైనవియునై, వన, గిరి, ఈశితుః=వనాద్రి నాథుఁడైన శ్రీ సుందరబాహుస్వామియొక్క, భుజాః = బాహువులు, (భాంతి = ప్రకాశించు చున్నవి.)

విశేషములు :— సాగర......బుద్ధయః— శ్రీ సుందర భుజస్వామివారి బాహువులకు సాగరములు, ఆకాశము, తమాలకాననము— ఈ మూఁడింటి నుపమానములుగాఁ జెప్పుట చేత మిక్కిలి శ్యామలతాశోభాసమృద్ధిగల్గి యున్నవని భావము ఈ సమాసములోని చివరది యగు 'బుద్ధి'పదము శోభాసమృద్ధి పరము. సాగరములు వివిధవర్ణములు గలవియైనను సామాన్య ముగా దానిరంగు కవిసమయమున నైల్యముగనే వర్ణింపఁబడు చున్నది. ఆకాశముగూడ 'నీలం నభః' ఇత్యాది ప్రతీతిచేత నల్లనిదిగానే కవులవ్యవహారములో గోచరించు చున్నది. తమాలకాననము నీలమే కదా!

'ఉత్తంసాయ తమాలపల్లవ ఇతి ఛ్ఛిందంతి యాం గోపికాః'

(కృష్ణకర్ణామృతము)

తా॥ సముద్రమువలెను, ఆకాశమువలెను, చీఁకటి ప్రాఁకుల యడవివలెను, శ్యామలశోభాసమృద్ధిగలిగి, పొడవులై కండపట్టి శేషశరీరమునందు శయ్యాసుఖానుభవములో భాగము గలవియై ఆకారమున శేషశరీరమును బోలి వనాద్రినాథుఁడగు (శ్రీ) సుందరభుజస్వామివారి బాహువు లెంతయుఁ బ్రకాశించు చున్నవి.

ఉ. సాగరమట్టు లంబరము
చాయ విశాలతమాలకాననా
భోగములీల నీలరుగ
పూర్వము లాయతపీనవృత్తముల్
భోగికులేంద్ర దివ్యతను
భోగమునం గృతభాగముల్ సదా
యోగి జనాభయప్రదము
లోముత సుందరబాహుబాహువుల్.

శ్లో॥ అహమహమికాభాజో గోవర్ధనోద్ధృతి నర్మణి
ప్రమథనవిధా వబ్ధే ర్లబ్ధప్రబంధ సమక్రియాః ।
అభిమతబహూభావాః కాంతాభిరంభణసంభ్రమే
వనగిరిపతే ర్బాహాః కుంభంతి సుందరదో ర్ద్రుమాః ॥ 54

ప్రతి :— గోవర్ధన, ఉద్ధృతి, నర్మణి=గోవర్ధన పర్వతము నెత్తుట యను లీలయందు, అహమహమికాభాజః = నేను ముందు, నేను ముందు, అనుతొందరను పొందినవియు, అబ్ధేః = సముద్రముయొక్క, ప్రమథనవిధౌ= చిలికెడు పనియందు, లబ్ధ,

ప్రబంధ, సమ, క్రియాః = పొందఁబడిన యను బంధముగల (తెంపులేని) సమాన వ్యాపారములు గలవియు, కాంతా, అభి రంభణ, సంభ్రమే = భార్యను గౌఁగిలించుకొను సంబరము నందు (లేదా-త్వరలో) అభిమత, బహూభావాః = కోరఁ బడిన బహుత్వము గలవియు అగు, వనగిరిపతేః=వనాద్రినాథుఁ డైన, సుందరదోః = సుందరబాహు వనెడు, హరేః = విష్ణు మూర్తియొక్క, బాహవః = బాహువులు, శుంభంతి=ప్రకా శించు చున్నవి.

విశేషములు :— అహమహమికా=అహంపూర్వ మహం పూర్వ మితి యా ప్రవృత్తిః సా, నేను ముందఱ నేను ముందఱ యను ప్రవృత్తిని 'అహమహమిక యందురు, దానిని 'భాజః'=పొందినవి, అని సుందరబాహుస్వామి బాహువులకు విశేషణము.

తా॥ గోవర్ధనపర్వతోద్ధరణ మనెడు క్రీడయందు నేను ముందఱ నేనుముందఱ యను తొందరతోఁ గూడినవియు, క్షీరాబ్ధి మథించుటయందు ఎడతెగని సమానవ్యాపారములు గలవియు, అప్పుడే పాలసముద్రములోఁ బుట్టిన యిందిరాకాం తను గౌఁగిలించుకొను సంబరంబున అభిలషింపఁబడిన బహు త్వముగలవియు, (కాంతను కౌఁగిలించు కొనుటకు నాల్గు బాహువు లేమి చాలఁగలవు, ఇంకను పెక్కు బాహువులుండిన బాగుండునని స్వామివారి యభిలాష యని భావము) అగు వనాద్రినాథుఁ డగు సుందరబాహుస్వామి యను విష్ణుమూర్తి యొక్క బాహువులు మిక్కిలి శోభిల్లుచున్నవి.

మ. వరగోవర్ధన పర్వతోద్వహన భ
వ్యక్రీడ నే ముందు, ముం
దఱ నే నం చెవి పోరుం, జిల్కుతఱి సం
ద్రం బెవ్వి బల్ప్రొద్దుపో
కరయం జాలవు, కోరుఁ బెచ్చు నెవి భా
ర్యన్ గాఁగిటంజేర్చు సం
బరమందున్ వనశైలవాసిహరి త
ద్బాహుల్ ప్రభాగేహముల్.

శ్లో॥ శ్రీమద్వనాద్రి పతిపాణితలాబ్జయుగ్మ
మారూఢయో ర్విమలశంఖరథాంగయోస్తు ।
ఏకో౽బ్జ మాశ్రిత ఇవో త్తమరాజహంసః
పద్మప్రియో౽ర్క ఇవ తత్సమితో ద్వితీయః ॥ 55

ప్రతి :— (శ్రీ)మత్, వనాద్రిపతి, పాణితల, అబ్జ, యుగ్మమ్ = (శ్రీ)మంతుడగు వనగిరి ప్రభువు యొక్క, కరతలము లనెడు, పద్మముల జంటను, ఆరూఢయోః=అధిష్ఠించియున్న, విమల, శంఖ, రథాంగయోః = నిర్మలములైన శంఖచక్రములలో, ఏకః, తు = ఒక్కటియగు శంఖము, అబ్జమ్=పద్మమును, ఆశ్రితః=ఆశ్రయించిన, ఉత్తమ, రాజహంసః ఇవ=శ్రేష్ఠమగు రాజహంసవలెను, తత్, సంమితః = దానివలెనే పద్మమును పొందిన, ద్వితీయః తు = రెండవది యగు చక్రమో, పద్మ ప్రియః=పద్మమునందుఁ బ్రేమగల, అర్కః ఇవ=సూర్యుని వలె, (భాతి=ప్రకాశించు చున్నది.)

విశేషములు :—ఈశ్లోకమున 'భాతి' అనుక్రియను జేర్చుకొని యన్వయము చెప్పుకొనవలెను. అలంకారము—అభూతోపమ—

తా॥ వనాద్రినాథుఁ డగు శ్రీ సుందరబాహుస్వామియొక్క కరతలము లనెడు పద్మములజంట నధిష్ఠించియున్న నిర్మలము లగు శంఖచక్రములలో నొక్కటియగు శంఖము పద్మముపై నున్న శ్రేష్ఠమగు రాజహంసము వలెను, అట్టిదేయగు రెండ వదియైన చక్రము పద్మమునందుఁ బ్రేమగల సూర్యునివలెను బ్రకాశించు చున్నది.

ఉ. చక్కఁగఁ గాననాద్రిగత
శౌరికరాబ్జయుగాధిరూఢముల్
మిక్కిలి కాంతిపుంజముల
మించెడి శంఖరథాంగయుగ్మమం
దొక్కటి పద్మసంశ్రితము
నుత్తమ హంసవరంబుఁ బోలు, వే
ఱొక్కటి పద్మమిత్రుఁ డయి
యొప్పు నభోమణిఁ బోలి క్రాలెడున్.

అవతారిక :— ఈ శ్లోకమునందు శ్రీ సుందరబాహుస్వామి వారి సర్వగుణోపేత మగు వక్షఃస్థలసౌందర్యము ననుభవించు చున్నారు.

**శ్లో॥ లక్ష్మ్యాః పదం కౌస్తుభసంస్కృతం చ**
**శ్రీవత్సభూమి ర్విమలం విశాలమ్ ।**
**విభాతి వక్షో వనమాల యాఢ్యం**
**వనాద్రినాథస్య సుసుందరస్య ॥** 56

ప్రతి :— లక్ష్మ్యాః = లక్ష్మీదేవికి, పదమ్ = నివాసస్థానమును, కౌస్తుభ, సంస్కృతం, చ = కౌస్తుభమణిచేత నలంకరింపఁబడినదియు, శ్రీవత్స, భూమిః = శ్రీవత్స మనెడు పుట్టుమచ్చ

కుఁ దావైనదియు, వనమాలయా = వనమాల యనెడు పూల దండచేత, ఆఢ్యమ్=ఒప్పినదియు, విమలమ్=నిర్మలమైనదియు, విశాలమ్= వెడఁద యైనదియు, అగు వనాద్రినాథస్య=వనగిరి ప్రభువైన, సుసుందరస్య = శ్రీ సుందరబాహుస్వామియొక్క, వక్షః = వక్షఃస్థలము, విభాతి=మిక్కిలి ప్రకాశించుచున్నది.

విశేషములు :— ఇందు సుందరభుజస్వామి వక్షఃస్థల మనన్యసాధారణ చిహ్నములగు లక్ష్మీకౌస్తుభ శ్రీవత్సవనమాల లచేత నతివిలక్షణలక్ష్మీ సంపన్న మనుటచేత భక్తుల హృదయము నాకర్షించి స్వాయత్త మొనర్పఁ దగియున్నదని భావము.

తా॥ లక్ష్మీనివాసమును కౌస్తుభాలంకృతమును శ్రీవత్స మను పుట్టుమచ్చ కలదియు వనమాలాశోభితమును నిర్మలమును విశాలమునయి వనాద్రినాథుఁడగు శ్రీ సుందరబాహుస్వామి వక్షఃస్థలము మిక్కిలి ప్రకాశించు చున్నది.

సీ. క్షీరాబ్ధిలో జనించిన సుందరికి రమా
లీలావతికి నేది కేళిగృహము
రాజిల్లు నేమందిరమున శాణోల్లీఢ
ఘనరత్నదీపమై కౌస్తుభంబు
ఎచ్చోట సింగార మినుమడించెడు వన
మాల యందాలయూయేల వోలె
'నాది యీాతా' వను శ్రీదేవిముద్ర నా
శ్రీవత్స మెచ్చోటఁ జెన్ను మీాఱు

గీ. అతివిశాలమ్ము నిర్మల మద్దమట్లు
శ్రీవనాద్రీశు నిత్యలక్ష్మీయుతంబు

సుందరోపస్థలంబును జూడ వలయు
నన్నఁ గావలె నొకవేయికన్ను లైన.

అవతారిక :— ఈశ్లోకమున శ్రీ సుందరబాహుస్వామివారి నాభిసౌందర్యము ననుభవించు చున్నారు.

శ్లో॥ సౌందర్యామృతసారపూరపరివా హావర్తగర్తాయితం
యాతః కించ విరించిసంభవన భూమ్యంభోజ సంభూతిభూః ।
నాభిః శుంభతి కుంభికుంభనిభనిర్భాత స్తనస్వర్వధూ
సంభుక్తద్రుమషండ శైలవసతే రారూఢలక్ష్మ్యా హరేః ॥ 57

ప్రతి :— కుంభి......వసతేః— కుంభి = ఏనుగులయొక్క, కుంభ = కుంభస్థలములతో, నిభ = సమానములగు, నిర్భాత = మిక్కిలి ప్రకాశింపఁ జేయఁబడిన, స్తన = పాలిండ్లు గల, స్వర్, వధూ = దేవకాంతలచేత, సంభుక్త = చక్కగా ననుభవింపఁబడిన, ద్రుమషండశైల = (వృక్షసమూహముతోఁ గూడిన కొండ) వనగిరి, వసతేః = నివాసముగాఁ గల, ఆరూఢలక్ష్మ్యాః = ఆరూఢశ్రీ అను నామాంతరము గల, హరేః = సుందర బాహుస్వామియొక్క, సౌందర్యా...... గర్తాయితమ్ — సౌందర్య = చక్కఁదన మనెడు, అమృతసార = అమృతపుఁదేట యొక్క, పూర = ప్రవాహముయొక్క పరివాహ = పాయ యొక్క, (చిన్నప్రవాహముయొక్క) ఆవర్తగర్తాయితమ్ = సుడిగుండముయొక్క, సామ్యమును, యాతః = పొందినదియు, కించ = మఱియు, విరించి...భూః— విరించి = బ్రహ్మయొక్క, సంభవన = పుట్టుకకు, భూమి = స్థానమగు, అంభోజ = పద్మము నకు, సంభూతిభూః = ఉత్పత్తి స్థానమైన, నాభిః = బొడ్డు, శుంభతి = ప్రకాశించు చున్నది.

విశేషములు :— ...... స్వర్వధూ సంభుక్త ద్రుమషండ శైల ...... సుర సుందరీ మణులకు సైతము విహారయోగ్య మీ శైలమనుటచేత వనాద్రియొక్క ఔన్నత్యము భోగ్యతయు వ్యక్తము లగుచున్నవి. 'ఆరూఢ లక్ష్మ్యాః' ఇది సుందర బాహు స్వామివారికి నామాంతరము.

తా॥ ఏనుఁగుల కుంభస్థలములఁ బోలు మెఱుగుపాలిండ్లు గల వేలుపు జవరాండ్రకు భోగ్యమగు వనాద్రియందు నిత్య నివాస మొనర్చుచు ఆరూఢ శ్రీ నామాంతరముతో నొప్పు శ్రీ సుందర బాహు స్వామివారి నాభి నాలుగు మోముల వేలుపుఁ బెద్దనుగన్న తమ్మిపూవునకుఁ బుట్టినిల్లై సౌందర్యా మృత సార పూరపు టలుగునకు సుడిగుండమట్లు ప్రకాశించు చున్నది.

శా॥ పాలిండ్లన్ మదకుంభి కుంభములతోఁ
బంతాలు గావించు మేల్
వాలుం జూపుల వేల్పు జవ్వనులకున్
బ్రాపౌ వనాద్రిస్థలిన్
లోలుండౌ హరిదివ్యనాభి విలసి
ల్లున్ బద్మభూమూల ప
ద్మాలంబంబు సురూపకాంత్యమృత పూ
రావర్త గర్తంబటుల్

అవతారిక :— ఈ శ్లోకమున గ్రంథకర్తగారు శ్రీ స్వామి వారి నడుమునఁ గల సౌయగము ననుభవించుచున్నారు.

శ్లో॥ సుందరస్య కిల సుందర బాహోః
శ్రీ మహాతరు వనాచల భర్తుః ।
హంత యత్ర నివసంతి జగంతి
ప్రాపిత క్రశిమ తత్తను మధ్యమ్ ॥ 58

ప్రతి :— శ్రీ మహాతరు, వనాచల, భర్తుః=శోభాయుక్తమును మహావృక్షములు గలదియు నగు వనగిరికిఁ బ్రభువైనట్టియు, సుందరస్య=అందగాఁడైనట్టియు, సుందరబాహోః=సుందరబాహుస్వామియొక్క, యత్ర=ఏ మధ్యభాగమునందు, జగంతి=లోకములు, నివసంతి=(ప్రళయకాలమునందు) నివసించుచున్నవో, తత్=అట్టి, తనుమధ్యమ్=దివ్యవిగ్రహము యొక్క మధ్యభాగము, ప్రాపిత, క్రశిమ, కిల=పొందింపఁబడిన కృశత్వము గల దఁట, హంత=ఆశ్చర్యము!

విశేషములు :- తత్తనుమధ్యమ్— ఇది యేకపదముగాఁ గూడఁ జేసికొనవచ్చును. ఆ సుందరబాహుస్వామి దివ్య విగ్రహముయొక్క మధ్యభాగము- అనఁగా ఉదర మని భావము. హంత— ఇది యాశ్చర్యార్థకమగు అవ్యయము. ఆశ్చర్య మేమనఁగా- ప్రళయకాలమున సకల లోకములు విశాలముగా నివసించిన భగవదుదరము కృశించి పోవుట వింత గదా!

తా॥ ప్రళయకాలమునందు సమస్త లోకములకు నివాస భూతమగు శ్రీమద్వనాద్రినాథుఁడైన యందగాఁడగు సుందర బాహుస్వామి మధ్యభాగ మెంతయుఁ గృశత్వము నందుట వింతగా నున్నది.

(నడుము సన్నముగా నుండుట యందము)

గీ॥ సలిలమయమైన యామహాప్రళయమందు
జగములు విశాలముగ నివాసంబు సలుపు
నెలవయిన శ్రీవనాచలనేత మధ్య
మెంత కృశియించియున్నది! వింత వింత.

అవతారిక :— ఈ శ్లోకమున శ్రీస్వామివారి యూరు సౌందర్యము ననుభవించు చున్నారు.

**శ్లో॥ పిష్టదుష్ట మధుకైటభ కీటౌ**
**హస్తి హస్తయుగళాభసువృత్తౌ ।**
**రాజతః క్రమకృశౌ చ సదూరూ**
**సుందరస్య వనభూధర భర్తుః ॥ 59**

ప్రతి :— పిష్ట..... కీటౌ — పిష్ట = పొడిచేయఁబడి నట్టియు, దుష్ట = (వేదాపహరణాదులచేత) దోషులైనట్టియు, మధు, కైటభ, కీటౌ = పురుగులవంటి మధు కైటభులు గల వియు, హస్తి, హస్త, యుగళాభ, సువృత్తౌ = ఏనుఁగు తొండ ముల జంటవలెఁ బ్రకాశించునవియు, మిక్కిలి గుండ్రతనము గలవియు, క్రమకృశౌ = క్రమముగా (పైనుండి క్రిందికి) కార్శ్య ముగలవియు అగు, వనభూధర భర్తుః = వనాద్రి నాథుఁడగు,

సుందరస్య = సుందర బాహు స్వామి యొక్క, సత్, ఊరూ=శ్రేష్ఠములగు తొడలు, రాజతః=ప్రకాశించుచున్నవి.

విశేషములు:—పిష్ట దుష్ట మధుకైటభ కీటా—భగవానుఁడగు నారాయణుఁడు వేదాపహరణ మొనర్చిన క్షుద్రులగు మధు కైటభులను తొడలతోఁ బొడిపొడి చేసెను. అని పురాణ ప్రసిద్ధి, 'ఊరుద్వయేన నిష్పిష్య జఘాన భగవాన్ — ఇతి — క్రమ కృశౌ — ఏనుఁగు తొండమువలెఁ బైనుండి క్రిందివఱకుఁ గార్శ్యమును బొందిన వని భావము. ఇట్లుండుట సౌందర్య సంపాదకము.

తా॥ వేదాపహరణాదు లొనర్చి దోషులైన పురుగుల వంటి మధుకైటభు లనెడు రాక్షసులను పొడిపొడి చేసినవియు, ఏన్గు తొండముల వలెఁ బ్రకాశించు నవియు, గుండ్రనివియు, క్రమకృశములైనవియు నగు శ్రీ వనగిరి నాథుఁడగు సుందర బాహు స్వామి వారి శ్రేష్ఠములగు తొడలు మిక్కిలి ప్రకాశించుచున్నవి.

ఉ॥ దుండగులైన క్షుద్రుల మ
ధున్ మఱి కైటభు నొక్కసారిగాఁ
బిండియొనర్చె నెవ్వి, మఱి
పించెడు నందమునందు నెవ్వియు
ద్దండకరీంద్ర హస్తములఁ
దాదృశముల్ వనశైల సార్వభౌ
ముం డగు శౌరియూరువులు
ముజ్జగమున్ భ్రమియింపఁ జేసెడున్

అవతారిక :— ఈ శ్లోకమునందు శ్రీ స్వామివారి జానుద్వయ లావణ్యము ననుభవించుచున్నారు.

శ్లో॥ యౌవనవృష కకుదో ద్భేదనిభం నితరాం
భాతి విభో రుభయం జాను శుభాకృతికమ్।
సుందరభుజనామ్నో మందరమథితాబ్ధే
శ్చందనవన విలసత్కందర వృషభపతేః॥ 60

ప్రతి :— చందన......పతేః— చందన=మంచిగంధపుఁ జెట్లయొక్క, వన = అడవితో, విలసత్ = ప్రకాశించెడు, కందర = గుహలుగల, వృషభపతేః = వృషభాచలమునకు స్వామియైనట్టియు, మందర, మథిత, అబ్ధేః = మందరపర్వతము చేతఁ జిల్కఁబడిన సముద్రము గలట్టియు, సుందరభుజనామ్నః— సుందరబాహు వనెడు పేరుగల, విభోః = ప్రభువుయొక్క— యౌవన......నిభమ్— యౌవన=జవ్వన మనెడు, వృష= ఎద్దుయొక్క, కకుద = మూపురముయొక్క, ఉద్భేద=అంకు రముతో (మొలకతో) నిభమ్=సమానమైనట్టియు, శుభ+ ఆకృతికమ్=మంగళకరమగు ఆకారము గలిగినట్టియు, ఉభయం, జాను=మోకాళ్ళజంట, నితరామ్=మిక్కిలి, భాతి=ప్రకా శించుచున్నది.

విశేషములు :— యౌవనవృష కకుదోద్భేదనిభమ్ — కకుద మనఁగా— వృషభముయొక్క పృష్ఠమధ్యభాగమున నుండెడు ఉన్నతావయవవిశేషము. తెనుఁగున దీనిని మూపుర మందురు. ఇందులకు నిఘంటువు— 'ప్రాధాన్యే రాజలింగే

చ వృషాంగే కకుదోఽస్త్రియామ్' (శ్రీ) సుందరబాహుస్వామి వారి యందముఁజిల్కు మోఁకాళ్ళజంట (శ్రీ) స్వామివారి యౌవనవృషభమునకుఁ బొటమరించిన మూపురము వలె ముద్దులొల్కుచున్నదని భావము.

తా॥ చందనవనంబులతో నందములగు కందరములుగల వనాచలమునకు నాథుఁడై మందరంబుతో సముద్రమును జిల్కిన (శ్రీ) సుందరబాహుస్వామివారి జానుయుగళము (మోఁకాళ్ళజంట) (శ్రీ)వారి యౌవన వృషభమునకుఁ బొటమరించిన మూపురమువలె మిక్కిలి ప్రకాశించుచున్నది.

ఉ. గందపుభ్రమ్మాఁకులన్ బొలుచు
కందరముల్ గల కాననాద్రికిం
జెందిన వేల్పు మందరము
చేఁ గడలిన్ మథియించు మేటియౌ
సుందరబాహు చక్రధరు
శోభన జానుయుగంబు చెల్వ మే
మందుఁ దదీయ యౌవన వృ
షాగ్రణిమూపుర మట్లు రాజిలున్.

అవతారిక :— ఈ శ్లోకమునందు వనాద్రినాథుని జంఘా సౌభాగ్యము ననుభవించు చున్నారు.

శ్లో॥ అధోముఖం న్యస్తపదారవిందయో
రుదంచితోదాత్తనునాళసన్నిభే ।
విలంఘ్య జంఘే క్వను రంహతో దృశౌ
వనాద్రినాథస్య సుసుందరస్య మే ॥ 61

ప్రతి :— వనాద్రి, నాథస్య = వనగిరికి స్వామియగు, సుసుందరస్య = శ్రీ సుందరబాహుస్వామియొక్క, అధో ముఖమ్ = క్రిందికి మొగము గలుగునట్లు, న్యస్త, పదార విందయోః = ఉంచఁబడిన పాదపద్మములయొక్క, ఉదంచిత, ఉదాత్త, సు, నాళ, సన్నిభే = గుండ్రని నిడుదవైన యందము లగు కాడలతో సమానములగు, జంఘే = పిక్కలను, విలంఘ్య = అతిక్రమించి, మే = నాయొక్క, దృశౌ = చూపులు, క్వ, ను = ఎక్కడికి, రంహతః = వెళ్లును ?

విశేషములు :— 'విలంఘ్య జంఘే క్వను రంహతో దృశౌ' సుందరబాహుస్వామివారి జంఘలు (పిక్కలు) అతిలోక సౌందర్యముగలవి గనుకఁ దల్లావణ్యానుభవ ప్రవృత్తములగు నాకన్ను లవయవాంతర శోభావలోకమునకు వెళ్ళఁ జాలకున్న వని పాదమునకుఁ దాత్పర్యము. రంహతః— ఇచ్చట రహి ధాతువు గత్యర్థకము.

తా॥ వనాద్రినాథుఁడగు శ్రీ సుందరబాహుస్వామియొక్క యధోముఖముగా నున్న యడుగుఁదామరల గుండ్రని నిడుపైన యందములగు తూండ్లను బోలిన జంఘలను విడిచిపెట్టి నాకన్నులు మఱి యెచ్చటికిఁ బోవును ? అందములమేర యగు నా పిక్కలను జూచుచు నందే యుండునని భావము.

సీ॥ క్రిందిమొగ మగు పాదారవిందయుగళి
వర్తులాయత నాళముల్ వలె వెలుంగు
వనగిరి వసించు సుందరబాహుమూర్తి
జంఘలను వీడి నాకనుల్ సాగు నెటకు ?

అవతారిక :— ఈ క్రింది శ్లోకపంచకముతో (శ్రీ) స్వామివారి పాదపద్మ సౌందర్యాదుల ననుభవించు చున్నారు.

**శ్లో॥ సుసుందర స్యాస్య పదారవిందే**
**పాదారవిందాధిక సౌకుమార్యే।**
**అతోఽన్యథా తే బిభృయాత్ కథంను**
**తదాసనం నామ సహస్రపత్రమ్॥ 62**

ప్రతి :— అస్య=ఈ, సుసుందరస్య = (శ్రీ) సుందరబాహు స్వామియొక్క, పదారవిందే=పాదపద్మములు, పాద, అరవింద, అధిక, సౌకుమార్యే = పాదపీఠమగు పద్మముకంటె మిక్కిలి మార్దవము గలవి, (భవతః=అగుచున్నవి) అతః, అన్యథా= ఇట్లుకాని యెడల, ఆసనం, నామ=పాదపీఠముగా(ఆసనముగా) ప్రసిద్ధి చెందిన, తత్=ఆ, సహస్రపత్రమ్ = కమలము, తే= ఆపాదపద్మములను, కథమ్ = ఎట్లు, బిభృయాత్, ను= ధరించును.

విశేషములు :— అతోఽన్యథా (చేత్)=పైనిఁ జెప్పిన దానికి భిన్నముగానైన యెడల, 'నామ'— ప్రసిద్ధిని సూచించు అవ్యయము. కథం బిభృయాన్ను— ఎట్లు ధరించును. (శ్రీ) స్వామివారి పాదపద్మములజంట అతిసుకుమారము కానియెడల నొక పాదపీఠకమలము రెండు పాదపద్మముల ధరింపఁ జాలదని హృదయము.

తా॥ (శ్రీ) సుందరబాహుస్వామివారి పాదారవిందములు పాదపీఠకమలముకంటె నధిక సౌకుమార్యము గలవి. అట్లు

కానిచోఁ బాదపీఠముగాఁ బ్రసిద్ధిగాంచిన కమలము శ్రీవారి పాదపద్మములజంట నెట్లు భరించఁ గలదు ?

శా. శ్రీ మత్సుందరబాహుమూర్తి పదరా
జీవ ద్వయం బౌర! త
త్స్వామి శ్రీపదపీఠపద్మమునకున్
దతౌకుమార్యంబునన్
వేమద్దుల్ ఘన, మట్లుకానియెడలన్
విద్వాంసులారా! యెటుల్
తా మోయం గలుగున్ వనాచల విభూ
ద్వత్పాదపద్మద్వయిన్.

శ్లో॥ సౌందర్యమార్దవ సుగంధరసప్రవాహై
రేతే హి సుందరభుజస్య పదారవిందే ।
అంభోజడంభపరిరంభణ మభ్యజైష్టాం
తద్వై పరాజిత మిమే శిరసా బిభర్తి ॥ 63

ప్రతి :— ఏతే = ఈ, సుందరభుజస్య = సుందరబాహుమూర్తియొక్క, పదారవిందే = పదపద్మములు, సౌందర్య, మార్దవ, సుగంధ, రసప్రవాహైః = అందముచేతను, సౌకుమార్యముచేతను, సుగంధముచేతను, మకరందరస ప్రవాహముచేతను, అంభోజ, డంభ, పరిరంభణమ్ = పద్మముయొక్క ప్రతిపక్షతాసామ్య ప్రసంగమును, అభ్యజైష్టామ్ = జయించినవి. పరాజితమ్ = ఓడిపోయిన, తత్ = ఆయాసనముగానున్న పద్మము, ఇమే = ఈపాదారవిందములను, శిరసా = తలతో, బిభర్తి = మోయుచున్నది, వై = సత్యము.

విశేషములు :— ...... రసప్రవాహైః— 'విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః'— అను శ్రుతిలోఁ జెప్పఁబడినట్లు మకరంద ప్రవాహమని భావము. 'త ద్వై పరాజిత మిమే శిరసా బిభర్తి,నిత్యనిరవద్య, నిరతిశయ, సౌందర్య, సౌకుమార్య, సౌగంధ్య, మకరంద ప్రవాహములు గల శ్రీ సుందరబాహు స్వామివారి పాదారవిందములచేత నోడింపఁ బడినదై లౌకిక మగు పద్మము శ్రీవారి పాదపీఠముగా నవతరించి స్వామివారి పాదారవిందములను మోయుచున్న దని భావము.

తా॥ శ్రీ సుందరభుజస్వామివారి యీ పాదారవిందములు సౌందర్య, సౌకుమార్య, సౌగంధ్య, మకరంద ప్రవాహముల చేతఁ బద్మాతిశయ ప్రసంగమును జయించినవి. కనుక నే పరాజితమగు పద్మము దేవరవారి పాదపీఠముగా నేర్పడి శ్రీవారి పాదపద్మములను నేఁటికిని దలతో మోయుచున్నది.

ఉ. అందము సౌకుమార్యము మ
హత్తర దివ్య పరీమళంబు మా
రందస్ఫురంబు గల్గి రుచి
రం బయి యొప్పెడు కాననాద్రిసం
క్రందను పాదపంకజయు
గంబున నోడి సరోరుహంబు శ్రీ
సుందరు పాదపద్మముల
నోడు తలన్ వహియించు నేఁటికిన్.

శ్లో॥ ఏ తే తే బత సుందరాహ్వయభుజాఖ్యః పాదారవిందే శుభే
యన్నిర్ణేజనముత్థితత్రిపథగాస్రోతస్సు కించిత్కలా ।

ధత్తేఽసౌ శిరసా ధ్రువ స్తదపరం స్రోతో భవానీపతి
ర్యస్యాస్యాలకనంది కేతి నిజగు ర్నామైవ మన్వర్థకమ్ ॥ 64

ప్రతి :— యత్, నిర్ణేజ, సముత్థిత, త్రిపథగా, స్రోతస్సు= ఏ దేవదేవుని పాదప్రక్షాళనముచేత బయలు వెడలిన గంగా ప్రవాహములయందు, కించిత్, కిల=ఒకటియగు, స్రోతః= ప్రవాహమును, అసౌ=ఈ, ధ్రువః = ధ్రువుఁడు (జ్యోతిశ్చక్ర మున కాధారభూతముగానున్న యుత్తాన పాదునికుమారుఁడు) ధత్తే=ధరించు చున్నాఁడో! తత్, అపరమ్ = ఆధ్రువుఁడు తాల్చుప్రవాహముకంటె నితరమగు, స్రోతః=ప్రవాహమును, భవానీపతిః=పార్వతీపతి యగు శివుఁడు, శిరసా = తలతో, ధత్తే=ధరించు చున్నాఁడో!, యస్య = ఏ, అస్య=ఈ శివ శిరోధృతమగు ప్రవాహమునకు,(పౌరాణికాః=పురాణవేత్తలు) అలకనందికా, ఇతి=అలకనందిక యని, ఏవమ్ = ఇట్లు, అన్వర్థ కమ్=సార్థకమగు, నామ=పేరును, నిజగుః=పలికిరో, తే= అటువంటియు, సుందర, ఆహ్వాయ, జుషః = సుందరుఁ డనెడు పేరునుపొందిన సుందరబాహుస్వామియొక్క, ఏతే = ఈ, పాదారవిందే,=పాదపద్మములు, శుభే = భోగ్యములైనవి, (భవతః=అగుచున్నవి) బత=ఆశ్చర్యము.

విశేషములు :— అసౌ — ధ్రువః— జ్యోతిశ్చక్రమున కాధారభూతుఁడగు ధ్రువుఁడు, 'అలకనంది. కేతి నిజగు ర్నామైవ మన్వర్థకమ్' అలకం నందయతి, ఇతి, అలకనందికా— శివుఁడు తలపై ధరించినప్పు డీపాయ యామహేశునలకల నానంద పెట్టుటచేత దీనికి 'అలకనందిక' అను పేరు సార్థకమని భావము.

ఏ తే— త్వే— పాదారవిందే — త్రైలోక్యపావని యగు గంగ నుత్పాదింపఁ జేయుటచేత అత్యంతపావనములైన సుందర భుజస్వామి పాదపద్మములు, బత— ఆశ్చర్యార్థకమగు నవ్యయము. ఇచ్చట ఆశ్చర్యమేమన— పావనములగు స్వామి వారి పాదాబ్జములే భోగ్యములుగా సైత మగుటయే.

తా॥ ఏవేల్పు పాదారవిందములఁ గడుగుటవలన నేర్పడి మూఁడు పాయలతోఁ బ్రవహించు మిన్నేటి యొకపాయను జ్యోతిశ్చక్రమున కాధారభూతుఁడగు ధ్రువుఁడు ధరించెనో! మఱియొకపాయ నళికనంద యను దానిపేరు సార్థకమగునట్లు పార్వతీపతి యగు శివుఁడు శిరస్సునఁ దాల్చెనో! అట్టి త్రిభువనపావని యగు గంగకుఁ గారణభూతములగు నట్టి సుందరబాహుస్వామి పాదారవిందములు భోగ్యములై యల రారు చున్నవి.

శా. ఏ పాదంబులఁ గడ్గ నుప్పతిలు మి
న్నేర్ పాయలన్ మూఁట నొం
డో పాయన్ ధరియించె నా ధ్రువుఁడు వే
ఱొ పాయ మూర్ధంబుపై
నాపాదించుకొనెన్ శివుం డళికనం
దాభిఖ్య పెంపార, నా
శ్రీ పద్మేక్షణుపాదపద్మములు మిం
చెన్ భోగ్యముల్గా నహో!

శ్లో॥ ఆమ్నాయ కల్పలతికోత్థ సుగంధిపుష్పం
యోగీంద్రహార్ద సరసీరుహ రాజహంసమ్ ।
ఉత్పక్వధర్మ సహకారఫలప్రకాండం
వందేయ సుందరభుజస్య పదారవిందమ్ ॥ 65

ప్రతి :— ఆమ్నాయ, కల్పలతికా, ఉత్థ, సుగంధి, పుష్పమ్=శ్రుతి యనెడు కల్పలతయందుఁ బొడమిన సువాసన గల పూవును, (అనఁగా–పూవువంటిదియు) యోగీంద్ర, హార్ద, సరసీరుహ, రాజహంసమ్=యోగీశ్వరుల హృదయకమలము నందు రాజహంసము వంటిదియు, ఉత్పక్వ ధర్మ, సహకార, ఫల, ప్రకాండమ్=పరిపక్వమగు(పండిన) ధర్మమనెడు తియ్యమామిడి మేలిపండు వంటిదియునగు సుందరభుజస్య=సుందరభుజస్వామి యొక్క, పదారవిందమ్=పాదపద్మమును, వందేయ=నమస్కరింతును గాక (లేదా) స్తుతింతును గాక.

విశేషములు :— ఈ శ్లోకమునందుఁ గవి సుందరబాహు స్వామివారి పాదారవిందము శ్రుతిశిరః ప్రతిపాద్యము, యోగి ధ్యేయము, ధ్యానఫలమని మాత్రమే చెప్పక శ్రుతికల్పలతా పుష్పముగాను, యోగిహృత్పద్మరాజహంసము గాను, ధర్మ సహకారపక్వఫలరాజము గాను ఆరోపించి చెప్పుటవలన శ్రుతి శిరస్సుల కందుపాటులోని దనియు, యోగిహృదయావాసరసిక మనియుఁ, బరమ పురుషార్థరూప మనియు స్తుతికర్త యభిప్రాయమైనట్లు తెలియుచున్నది.

తా॥ శ్రుతికల్పలత యందుఁ బొడమిన సుగంధి పుష్పమును, యోగీంద్ర హృదయకమలమందు విహరించు రాజహంసంబును, ధర్మసహకార తరువునకుఁ బండిన మేలిఫలంబు నగు శ్రీ సుందరబాహుమూర్తి పాదారవిందమును నమస్కరింతును గాక.

చ॥ శ్రుతి యను కల్పవల్లిఁ బొడఁ
జూపిన దివ్యసుగంధిపుష్ప మం
చిత నియమీంద్రచిత్త సర
సీజ విరాజి మరాళరాజ ము
న్నత పదిపక్వ ధర్మశుభ
నామ రసాల ఫలోత్తమంబు సం
శ్రితజనకల్పమా వనగి
రి ప్రభుపాదపయోజ మెన్నదన్.

శ్లో॥ సుసుందరస్యాస్యతు వామనాకృతేః
క్రమత్రయప్రార్థిని మానసే కిల ।
ఇమే పదే తావ ది హాసహిష్ణునీ
విచక్రమాతే త్రిజగ త్పదద్వయే ॥ 66

ప్రతి :— వామన × ఆకృతేః = వామనాకారముగల, అస్య=ఈ, సుసుందరస్య = సుందరబాహుస్వామివారియొక్క, మానసే, తు=మనస్సన్ననో, క్రమ, త్రయ, ప్రార్థిని=(బలిచక్రవర్తి యొద్దనుండి) అడుగుల మూఁటిని ప్రార్థించునది కాఁగా, ఇమే = ఈ, పదే=పాదములు, ఇహా = ఈభూమియందు,

తావత్ = అంతమాత్రపు నేలను, (మూఁడడుగులను) అసహిష్ణునీ=సహింపనిదై, త్రిజగత్ = ముజ్జగమును, విక్రమద్వయే = అడుగుల జంటయందే (రెండడుగులయందే)విచక్రమాతే కిల = ఆక్రమించు కొనినవఁట.

విశేషములు :— 'విచక్రమాతే త్రిజగత్ పదద్వయే' — వామనావతారమున శ్రీ సుందరబాహుస్వామివారి రెండు పాదములే మూఁడులోకముల నాక్రమించు కొనినవని వర్ణించుట వలన శ్రీవారి పాదములకుఁగల యాశ్రిత సంరక్షణాత్వర యటువంటి దని భావము.

తా॥ వామనాకారమును దాల్చిన శ్రీ సుందరబాహు స్వామివారి మనస్సు బలిచక్రవర్తివలన మూఁడడుగుల పరిమితి గల భూమిని ప్రార్థింపవలసి వచ్చినప్పుడు స్వామివారి రెండు పాదములు భూమియందలి మూఁడడుగుల నేలను సహింపనివై ముజ్జగమును రెండడుగులలోనే యాక్రమించుకొనిన వఁట.

ఉ॥ వామనమూర్తి రూపమున

వర్తిలు సుందరబాహుఁడెంద మీ

భూమిని నా కొసంగు మొక

మూఁడడుగుల్ స్థల మంచు వేఁడఁగా

స్వామి పదద్వయం బపుడు

సైపక యబ్బలి విస్మయంబుతో

నే మిది నా నిముడ్చుకొని

యెన్ ద్రిజగమ్ము పదద్వయమ్మునన్.

అవతారిక :— ఈ శ్లోకమున శ్రీకూరేశులు శ్రీస్వామి వారి పాదాంగుళీనఖ సౌందర్యము నాస్వాదించు చున్నారు.

శ్లో॥ సౌందర్యసారామృతసింధువీచి
శ్రేణీషు పాదాంగుళి నామికాసు ।
న్యక్కృత్య చంద్రశ్రియ మాత్మకాంత్యా
నఖావళీ శుంభతి సుందరస్య ॥ 67

ప్రతి :— సుందరస్య = సుందరబాహుస్వామి యొక్క, పాద, అంగుళి, నామికాసు = కాలివ్రేళ్ళు, అనెడు పేరుగల, సౌందర్య. . .శ్రేణీషు— సౌందర్యసార = శ్రేష్ఠమగు సౌందర్యమనెడు, అమృతసింధు = అమృతసముద్రము యొక్క, వీచి = తరంగములయొక్క, శ్రేణీషు = పంక్తులయందు, నఖ, ఆవళీ = గోళ్ళపంక్తి, ఆత్మ, కాంత్యా = తనకాంతిచేత, చంద్రశ్రియమ్ = చంద్ర (పంక్తియొక్క) శోభను, న్యక్కృత్య = అణఁగఁ ద్రొక్కి, శుంభతి = ప్రకాశించు చున్నది, హి = ప్రసిద్ధము.

విశేషములు :— ఈ శ్లోకమున స్వామివారి పాదాంగుళులను సౌందర్యసారామృత సింధుతరంగ పంక్తులనుగా నిరూపించుటవలన అందుఁ బ్రతిఫలించిన చంద్రపంక్తిగా నఖావళి యుత్ప్రేక్షింపఁ బడినది. హి— ఇది ప్రసిద్ధి ద్యోతకమగు నవ్యయము. లోకములోఁ బ్రతితరంగమునందును చంద్ర బింబము ప్రతిఫలించుట ప్రసిద్ధమే కదా!

తా॥ శ్రీ సుందరబాహుస్వామివారి సౌందర్యసార మనెడు యొక్క తరంగపంక్తులవలె నున్న కాలివ్రేళ్ళ

యందలి గోళ్ళవరుస తమకాంతిచేతఁ జంద్రపంక్తి కాంతిని క్రిందుపఱిచి ప్రకాశించు చున్నది.

ఉ॥ సుందరబాహుదేవు మెయి
సోయగపుంజిగి యన్ సుధాబ్ధిఁ గన్
విం దగు నూర్మిపంక్తు లని
పించు పదాంగుళులన్ నఖాళి పో
ల్చం దమలోపలన్ బ్రతిఫ
లించెడు చంద్రపరంపరేందిరన్
గ్రిందికిఁ గ్రొక్కి నిస్తులతఁ
గేరునటుల్ రమణీయకాంతిచేన్.

శ్లో॥ యో జాతక్రశిమా మలీ చ శిరసా సంభావిత శ్శంభునా
సోఽయం యచ్చరణాశ్రయీ శశధరో నూనం నఖవ్యాజతః।
పూర్ణత్వం విమలత్వ ముజ్జ్వలతయా సార్ధం బహుత్వం తథా
యాత స్తం తరుషండశైల నిలయం వందామహే సుందరమ్॥ 68

ప్రతి :—— శంభునా=శివునిచేత, శిరసా=తలచేత, సంభావితః=గౌరవింపఁబడిన, (ధరింపఁబడిన) యః=ఎవఁడు (ఏచంద్రుఁడు) సంజాత, క్రశిమా = పుట్టిన కార్శ్యము గలవాఁడును (క్షయరోగము గలవాఁడును) మలీ,చ = కళంకము గలవాఁడును, (అభూత్ =ఆయెనో) సః=అటువంటి, అయమ్= ఈ, శశధరః=చంద్రుఁడు, నఖ, వ్యాజతః = గోళ్ల నెపము వలన, యత్ , చరణ, ఆశ్రయీ=ఏ దేవ దేవుని పాదములయందు గలవాఁ డగుచు, పూర్ణత్వమ్=నిండుతనమును, విమలత్వమ్= నిర్మలత్వమును, తథా=అట్లే, ఉజ్జ్వలతయా, సార్ధమ్ =

ప్రకాశాధిక్యముతోఁ బాటు, బహుత్వమ్=దశవిధశరీరములు గలిగియుండుటను, నూనమ్=నిజముగా, యాతః=పొందెనో, తరు, షండ, శైల, నిలయమ్ = వనగిరి నివాసముగాఁగల, తమ్ = ఆ, సుందరమ్=సుందర బాహుస్వామిని, వందామహే= నమస్కరించుచున్నాము.

విశేషములు :— శశధరః— కుందేటిని ధరించినవాఁడు— చంద్రుఁడు. బహుత్వమ్— సుందరబాహుస్వామివారి పాద నఖముల పదింటియందును చంద్రుఁడు ప్రతిఫలించుటచేత బహుత్వమును (దశవిధశరీరత్వమును) పొంది యున్నాఁడని భావము. శివుఁడు చంద్రుని శిరసావహించి గౌరవించినను ఆ చంద్రుని క్షీణత్వముగాని, కళంకముగాని పోయి యుండలేదు. ఆ చంద్రుఁడే కాలిగోళ్ళయందుఁ బ్రతిఫలించుట యను మిష చేత శ్రీ సుందరబాహుస్వామివారి పాదముల నాశ్రయింపఁగా వెంటనే యా చంద్రుఁడు పరిపూర్ణుఁడు, నిష్కళంకుఁడు, ప్రకాశాధికుఁడు, బహుత్వము గలవాఁడయ్యెను. కనుక శ్రేయస్కాములకు సర్వశక్తి సంపన్నుఁడగు శ్రీ సుందరబాహు స్వామియే యాశ్రయణీయుఁడని భావము. నఖవ్యాజముచేత సుందరబాహుపాదముల నాశ్రయించిన చంద్రుఁడే యింత శ్రేయస్సును జెందగాఁ ద్రికరణశుద్ధితో శ్రీ స్వామివారిపాదముల యందుఁ జేరినవారిమాట వేఱె చెప్పవలయునా?

తా॥ శివునిచేత శిరసా గౌరవింపఁబడియు నేచంద్రుఁడు తన క్షీణత్వమును, కళంకమును బాయలేదో! యా చంద్రుఁ

శీస్వాదు పాదనఖములందుఁ బ్రతిఫలించుట యను నెపముచేత నే దేవదేవుని పాదముల నాశ్రయించి పరిపూర్ణతను, నిష్కళంకతను, ప్రకాశాతిశయమును, బహుత్వమును పొందెనో వనగిరినివాసి యగు ఆ సుందరబాహుస్వామిని నమస్కరింతుము.

చ॥ శివుఁడు తలన్ ధరించినను
క్షీణత మచ్చయుఁ బాయ కుండెనో
యెవనికిఁ జందమామ యతఁ
డే పరదైవముగోళ్ళ సోకుకై
తవమునఁ గాలు వట్టి కనెఁ
దత్పరిపూర్ణత మచ్చలేమి మేల్
ఛవియు బహుత్వమున్ నతులు
స్వామికి నావనశైలవాసికిన్.

శ్లో॥ యస్యాః కటాక్షణ మనుక్షణ మీశ్వరాణా
మైశ్వర్యహేతు రితి సార్వజనీన మేతత్ ।
శ్రీ స్సేతి సుందరనిషేవణతో నిరాహు
స్త్వాం హి శ్రియ శ్శ్రియ ముదాహు రుదారవాచః ॥ 69

ప్రతి :— ఈశ్వరాణామ్ = (ఐశ్వర్యవంతులుగాఁ బేర్వడిన) ఇంద్రాదులయొక్క, ఐశ్వర్యహేతుః = వారివారియధికార సంపదకుఁ గారణము, అనుక్షణమ్ = ప్రతిక్షణమును, యస్యాః = ఏతల్లియొక్క, కటాక్షణమ్ = క్రేగంటిచూపు, ఇతి, ఏతత్ = అనెడి యీవిషయము, సార్వజనీనమ్ = సర్వజనప్రసిద్ధమో,

సుందర నిషేవణతః = సుందరబాహుస్వామివారి సేవవలన, సా = కటాక్షమాత్రము చేతనే యింద్రాదులకు సైతమైశ్వర్య ప్రదాత్రి యగు నాతల్లి, (శ్రీ)ః ఇతి = (శ్రీ)-అని, నిరాహుః = నిర్వచనముచేసిరి, ఉదార, వాచః = గొప్పవాక్కులు గల వాల్మీకి యామునా చార్యాదులు, త్వామ్ = నిన్ను, శ్రియః = అట్టి (శ్రీ) దేవికి, శ్రియమ్ = (శ్రీ)ప్రదునిగా (సంపత్ప్రదునిగా) ఉదాహుః, హి = పెద్దగాఁ జెప్పిరిగదా!

విశేషములు :— '(శ్రీ)ః ఇతి, నిరాహుః' (శ్రీ) యని నిర్వచన మొనర్చిరి. అనఁగా (శ్రీ) శబ్దమున కిట్లు వ్యుత్పత్తిని జెప్పిరి. అని భావము. (శ్రీ) స్సేతి సుందరనిషేవణతః — 'శ్రిఞ్ = సేవాయామ్' అను సేవార్థకమగు ధాతువువలన నేర్పడిన (శ్రీ)శబ్దము కటాక్షమాత్రము చేత నింద్రాదుల కట్టి యైశ్వర్యము ననుగ్రహించు నైశ్వర్యము లక్ష్మీదేవికి (శ్రీ) సుందరబాహుస్వామిని నిరంతరము సేవించుటవలనఁ గలిగినదని హృదయము. శ్రయతే — ఇతి — (శ్రీ)ః = (శ్రీ) సుందరబాహుస్వామిని సదా సేవించుచుండు నది యని (శ్రీ) శబ్దమునకు నిర్వచనము. ఉదారవాచః— సర్వతత్త్వార్థప్రద స్వప్రబంధాః, అని వ్యాఖ్యలోఁ గలదు. భగవద్వాల్మీకి యామునాచార్య ప్రభృతుల ప్రబంధములలో సమస్త తత్త్వార్థములు గలవని తాత్పర్యము. వీరిగ్రంథములలో శ్రీదేవికి సైతము శ్రీప్రదుఁడు భగవానుఁడే యను సూక్తి యెక్కడఁ గల దన్నచో—

'శ్రియ శ్రీ శ్చ భవే దగ్ర్యా కీర్త్యాః కీర్తిః క్షమా క్షమా'
(శ్రీ మద్రామాయణమ్)

'కః శ్రీః శ్రియః పరమసత్త్వసమాశ్రయః కః?'
(స్తోత్రరత్నమ్)

తా॥ ఈశ్వరులుగాఁ బేర్వడిన యింద్రాదుల యధికార సంపద కనుక్షణము నేతల్లి క్రేగంటి చూపనునది సర్వజన సంప్రతిపన్నమో సుందరబాహుస్వామివారి నిరంతర సేవవల్ల ననే యాతల్లికి'(శ్రీ)'యను నామ మన్వర్థ మని చెప్పచున్నారు. ఉదారవాక్కులగు వాల్మీకి యామునాచార్యప్రభృతు లో (శ్రీ) సుందరబాహుస్వామీ! నిన్ను (శ్రీ)కి సైతము (శ్రీ) వని గట్టిగా నుడివియున్నారు. ఇంద్రాదులకు సైతము తన కటాక్షముచేత నతిశయమును గూర్చు లక్ష్మికి (శ్రీ) సుందరబాహు స్వామి యతిశయమును గలిగించుచున్నాఁ డనుటచే స్వామి వారి ఘనత వెల్లడియగు చున్నది.

శా॥ దేవేంద్రాదులకల్మి కంతటికి నే
దేవీ కటాక్షంబె సం
భావింపం బడె ముఖ్యహేతువుగ నా
భవ్యాత్మ (శ్రీ)సుందరున్
సేవల్ సేయుట '(శ్రీ)' యనం బరఁగె నీ
సిద్ధాంతమున్ బూర్వమే
ధావుల్ చాటిరి (శ్రీ)కి (శ్రీ) వనుచు గ్రం
థాలన్ నినుం దెల్పుచున్.

శ్లో॥ దివ్యాచింత్య మహాద్భుతోత్తమగుణైః స్వాతంత్ర్యలావణ్యక
ప్రాయై రద్భుతభావగర్భ సతతాపూర్వప్రియై ర్విభ్రమైః।
రూపాకారవిభూతిభి శ్చ సదృశీం నిత్యానపేతాం శ్రియం
నీళాం భూమి మపీదృశీం రమయితా నిత్యం వనాద్రీశ్వరః॥ 70

ప్రతి:— దివ్య.....గుణైః— దివ్య = అప్రాకృతము లైనవి. అచింత్య = ఇట్టివి, ఇంత పరిమాణము గలవి యని మనస్సుచే తలంప శక్యము గానివియు, మహాద్భుత = అత్యాశ్చర్య కరము లైనవియు, ఉత్తమ = శ్రేష్ఠము లైనవియు, అగు, గుణైః = జ్ఞానశక్త్యాది, దయావాత్సల్యాది, స్వరూపగుణముల చేతను. స్వాతంత్ర్య, లావణ్యక, ప్రాయైః = యౌవనము లావణ్యము మొదలగు శారీరకగుణముల చేతను, అద్భుత, భావ, గర్భ, సతతాపూర్వ, ప్రియైః = ఆశ్చర్యకరము లగు అభిప్రాయములు, లోపల గలవియు నెప్పటి కప్పుడు క్రొత్త లనిపించునవియుఁ ప్రియము లైనవియునగు, విభ్రమైః = విలాసములచేతను, రూప, ఆకార, విభూతిభిః, చ = స్వరూపముచేతను, విగ్రహముచేతను, సంపదచేతను, సదృశీమ్ = తనకుఁదగినట్టియు. నిత్య, అనపేతామ్ = ఎన్నఁడును ఎడఁబాయనట్టిదియు నగు, శ్రియమ్ = లక్ష్మీదేవిని, ఈదృశీమ్ = ఇటువంటిదే యగు, నీళామ్ = నీలాదేవిని, భూమిమ్, అపి = భూదేవిని కూడ, వనాద్రి, ఈశ్వరః = వనాద్రినాథుఁడగు శ్రీసుందర బాహుస్వామి, నిత్యమ్ = ఎల్లప్పుడు, రమయితా = రమింపఁ జేయువాఁడు, ఆనందపెట్టువాఁడు అని భావము. (భవతి = అగుచున్నాఁడు).

నము లనిపించెడు కోరఁదగిన విలాసముల చేతను, సౌందర్యము చేతను, ఆకృతివిశేషము చేతను, ఉభయవిభూత్యైశ్వర్యము చేతను తన కెంతయుఁ దగిన శ్రీదేవిని అట్టిదే యగు భూదేవిని నీలాదేవిని శ్రీవనాద్రినాథుఁ డగు సుందరబాహు స్వామి నిత్యము రమింపఁ జేయును.

శా॥ ఔరా! దివ్యము లద్భుతాంబులు సచిం
త్యంబుల్ శుభంబుల్ సుశీలా
దారంబుల్ సహజంబులౌ గుణములన్
దారుణ్యలావణ్య వి
స్తార శ్రీ స్పృహణీయనూతన విలా
సస్ఫూర్తిఁ దుల్యాత్మలన్
శ్రీ రామన్ మహినీలలన్ దనిపెడున్
శ్రీసుందరుం డెప్పుడున్.

అవతారిక :— అత్యంతాపరాధులనైనను క్షమింపవలయు నని లక్ష్మీదేవి నుడివినచో భగవానుఁ డామాట నాదరించు నను నభిప్రాయము నీ శ్లోకమున ననుసంధించు చున్నారు.

శ్లో॥ అన్యోన్యచేష్టిత నిరీక్షణ హార్దభావ
ప్రేమానుభావ మధురప్రణయప్రభావైః ।
అజస్రనవ్యతర దివ్యరసానుభూతిః
స్వాం ప్రేయసీం రమయితా వనశైలనాథః ॥ 71

ప్రతి :— అన్యోన్య.....ప్రభావైః — అన్యోన్య = పర స్పరము, చేష్టిత=బొమముడి, చిఱునవ్వు మొదలగు విలాస

వ్యాపారముల చేతను, నిరీక్షణ = క్రేగంటిచూపు చేతను, హార్ద = హృదయములోని, భావ = అభిప్రాయము చేతను (తారుణ్య, లావణ్యాదులను తలపోయుట చేతను) ప్రేమాను భావ = ప్రేమాతిశయము చేతను, మధుర = స్వాదుతరమైన, (తేనెవలె ననుభవింపదగిన) ప్రణయప్రభావః = అనురాగాతి శయముగల, వనశైలనాథః = వనగిరిప్రభువగు శ్రీ సుందర భుజస్వామి, అజస్ర, నవ్యతర, దివ్యరస, అనుభూతిః = ఎల్లప్పుడును అపూర్వమగు అప్రాకృతానందముల యొక్క అనుభవము కలవాడు (సన్ = అగుచు) స్వామ్ = స్వకీయ యగు, ప్రేయసీమ్ = ప్రియురాలిని, రమయితా = సంతోష పెట్టువాడు, భవతి = అగుచున్నాడు.

విశేషములు :— ...ప్రేమానుభావ = ప్రేమాతిశయము— అనగా, ఆలింగనకాలమందు సైతము సౌకుమార్య పరా మర్శము, ప్రణయాపరాధముల లెక్కచేయకుండుట, ప్రేమాంధ్యము. 'స్వాం ప్రేయసీం రమయితా' — ఈ విషయమున 'రామస్తు సీతయా సార్ధం విజహార బహూన్ ఋతూన్। మనస్వీ తద్గత స్తస్యాం నిత్యం హృది సమర్పితః, ప్రియా తు సీతా రామస్య దారాః పితృకృతా ఇతిగుణాత్ రూపగుణా చ్చాపి ప్రీతి ర్భూయోఽప్యవర్ధత, తస్యాశ్చ భర్తా ద్విగుణం హృదయే పరివర్తతే। అంతర్జాత మపి వ్యక్త మాఖ్యాతి హృదయం హృదా' ఇత్యాది శ్రీమద్రామాయణ శ్లోకములు ప్రమాణ ములుగా ననుసంధేయములు.

తా॥ పరస్పరముయొక్క భ్రూభంగమంద హాసాదివిలాస వ్యాపారములచేతను, క్రేగంటిచూపుల చేతను, తారుణ్య లావణ్యాదుల తలపోఁతలచేతను, ప్రేమాతిశయము చేతను, తేనెవలెఁ గ్రోలఁదగిన యనురాగాతిశయము గల శ్రీవనాద్రి నాథుఁడు ఎప్పటి కప్పు డపూర్వముగా నొప్పుఅప్రాకృతా నందానుభవము గలవాఁడై తన ప్రియురాలిని రమింపఁ జేయును.

మ॥ చిఱునవ్వుల్ కడగంటిచూపులు వయ
శ్శ్రీ మించులావణ్య వి
స్ఫురణంబుల్ దలపోసికొంట సరసం
పుంజిన్నికయ్యంబులన్
బరిరంభంబుల నొచ్చుకోనిగతులున్
భాసిల్లు ప్రేమోన్నతిన్
సిరి నాత్మాంగనఁ జొక్కఁ జేయు హరియా
శ్రీసుందరుం డెప్పుడున్.

శ్లో॥ సుందరస్య వనశైలవాసినో
భోగ మేవ నిజభోగ మాశ్రజన్ ।
శేష ఏష ఇతి శేషతాకృతేః
ప్రీతిమా నహిపతి స్స్వనామని ॥ 72

ప్రతి :— వనశైలవాసినః=వనగిరినివాసి యగు, సుంద రస్య = శ్రీ సుందరబాహుస్వామివారికి, భోగమ్, ఏవ = భోగసాధనమే యగు, నిజ, భోగమ్=తనశరీరమును, ఆభ

జన్ = పొందుచు, అహిపతిః = సర్పరాజు, శేషతా, ఆకృతేః = శేషత్వాకారమువలన, ఏషః = ఇతఁడు, శేషః = శ్రీహరికి శేషభూతుఁడు, (ఆదిశేషుఁ డని అర్థాంతరము) ఇతి = అని, స్వనామని = తన పేరునందు, ప్రీతిమాన్ = ప్రీతి గలవాఁడు, (భవతి = అగు చున్నాఁడు).

విశేషములు :— 'భోగ మేవ నిజభోగ మాభజన్' భోగ మేవ — అనుచోట — కార్యమునందు కారణత్వోపచారము చేత భోగకారణమని యర్థము చెప్పుకొనవలెను. లేదా భోగ శబ్దము సుఖపర్యాయము గాన సుఖకరమని యర్థము గూడ సంగతమగును. మొత్తముమీఁద నీపాదమునకు సుందరబాహు స్వామికి సుఖశయ్యా భూతనిజశరీరుఁ డని పిండితార్థము. 3–4–పాదముల భావ మేమనఁగా— అహిపతి (సర్పరాజు) తనభోగము (శరీరము) శ్రీ సుందరబాహుస్వామివారికి భోగ కర మగుటవలన ఈ విధముగా శేషత్వము సిద్ధించుటచేత సార్థకమగు శేషుఁడను నామమునందుఁ బరమపురుషార్థబుద్ధి గలవాఁ డాయెనని భావము. 'పరగతాతిశయాధానేచ్ఛయో పాదేయత్వమేవ యస్య స్వరూపం స శేషః— పరః శేషీ. అని శేషశేషిభావము నెఱుంగ వలెను.

తా॥ వనగిరినివాసి యగు సుందరబాహుస్వామివారి భోగ సాధనమునుగాఁ దనభోగమును (శరీరమును) ధరించుచు సర్ప రాజు శేషత్వాకారము (దాస్యస్వరూపము) సిద్ధించుటవలన

'ఇతఁడు శేషుఁ'డని యెల్లరు ననుకొనెడు తననామమున నెంతయుఁ బ్రీతిగలవాఁ డాయెను.

చ॥ వనగిరివాసి యైన సుర
వంద్యుఁడు సుందరబాహుమూర్తికిన్
దనదుశరీర మెంతియు ను
దాత్తసుకోమలచారుశయ్యగాఁ
దనరుచు శేషతాకృతిని
దాల్చుట నీతఁడు శేషుఁ డంచనన్
మనమునఁ బొంగిపోవు నహీ
మంశనుఁ డాయభిధాన మూనఁగన్.

శ్లో॥ వాహనాసన వితానచామరా
ద్యాకృతిః ఖగపతి స్త్రయీమయః।
నిత్యదాస్యరతి రేవ యస్య నై
హ్యేష సుందరభుజో వనాద్రిగః॥ 73

ప్రతి :— వాహన, ఆసన, వితాన, చామర, ఆది, ఆకృతిః =వాహనము, ఆసనము, చాందిని (మేలుకట్టు) వింజామర ములు, మొదలుగాఁ గలవానియొక్క యాకారమువంటి యాకారముగలవాఁ డగు, త్రయీమయః = వేదస్వరూపుఁ డైన, ఖగపతిః=పక్షులకు రాజగు గరుత్మంతుఁడు, యస్య = ఏ సుందరభుజస్వామియొక్క, నిత్యదాస్య, రతిః, ఏవ=నిత్యము కైంకర్యమునందు ఆసక్తి గలవాఁడే, (అని) నై=ప్రసిద్ధమో, ఏషః=ఈ సుందరబాహుస్వామి, వనాద్రిగః, హి=వనాద్రి యం దుండువాఁడే గదా!

విశేషములు :— వాహనాసన...ఆకృతిః '—దాస స్సఖా వాహన మాసనం ధ్వజో య స్తే వితానం వ్యజనం త్రయీమయః' అని స్తోత్రరత్నమునఁ జెప్పినట్లు వాహనాద్యాకారము గలవాఁడని భావము. త్రయీమయః— 'వేదాత్మా విహగేశ్వరః' అని ప్రమాణము. హి — వేదస్వరూపుఁడగు గరుత్మంతునిచే నిరంతరము సేవింపఁబడు పాదారవిందములు గల సుందరబాహుస్వామి అందఱకు సులభుఁడుగా నుండుటకై వనశైలమున వేంచేసియున్నాఁ డని ప్రసిద్ధార్థకమగు 'హి' అను అవ్యయమునకుఁ దాత్పర్యము.

తా॥ వాహనము, ఆసనము, మేల్కట్టు, వింజామరములు మొదలగు వాని యాకారములఁ దాల్చి వేదస్వరూపుఁడగు గరుత్మంతుఁ డే సుందరబాహుస్వామి యొక్క నిత్యకైంకర్య నిరతుఁడై యుండునో యాస్వామి యందఱకు నందుబాటునకై వనగిరియందు వేంచేసి యున్నాఁడు. ఎంత భక్తసులభుఁడు!

చ. ఒకపరివాహనంబు, మఱి
యొక్కపుడాసనమున్, వితాన మిం
కొకతఱిఁ, జామరంబు మఱి
యొక్కపు, డౌచుఁ ద్రయీమయుండు ప
క్షికులవిభుండు నిత్యమును
సేవ యొనర్పఁగ నొప్పు దేవతా
మకుటము కాననాచలము
మక్కఁగ నుండుట, భాగ్య మెంతయున్.

(19)

శ్లో॥ వనాద్రినాథస్య సుసుందరస్య వై
ప్రభుక్తశిష్టాశ్యథ సైన్యసత్పతిః ।
సమస్తలోకైక ధురంధరః సదా
కటాక్షవీక్ష్యోఽస్య చ సర్వకర్మసు ॥ 74

ప్రతి :— అథ = అనంతరము, సుసుందరస్య = మిక్కిలి అందగాఁడగు, వనాద్రి, నాథస్య = వనగిరిప్రభువగు, సుందరబాహుస్వామి యొక్క, ప్రభుక్త, శిష్ట, అశీ=భుజించి విడిచిపెట్టిన శేషమును భుజించునట్టియు, సర్వకర్మసు=సకలజగత్సృష్ట్యాది వ్యాపారములందు, అస్య=ఈవనాద్రి నాథునకు, కటాక్షవీక్ష్యః = క్రీఁగంటిచూపుచేఁ జూడఁదగిన వాఁడును, అగు, సైన్య, సత్, పతిః=యోగ్యుఁడగు సేనాధిపతి, సదా=ఎల్లప్పుడు, సమస్త, లోక, ఏక, ధురంధరః=ఉభయవిభూతుల ముఖ్యకైంకర్య నిర్వాహకుఁడు, వై =ప్రసిద్ధము.

విశేషములు :— ప్రభుక్తశిష్టాశీ— 'త్వదీయ భుక్తోజ్ఝిత శేషభోజినే'అని చెప్పిన ప్రకారము భగవదనుభూతశేషమునే అనుభవించువాఁ డని భావము. 'కటాక్షవీక్ష్యః'— 'సేనాపతినా నివేదితం, తథాఽనుజానంత ముదారవీక్షణైః' అన్నట్లు ఇంగితపాత్రుఁ డని తాత్పర్యము. సైన్యసత్పతిః— ఇతర సేనాపతు లున్నను ఇతఁడే యందఱిలోను శ్రేష్ఠుఁడని యాశయము, వై = ప్రసిద్ధము, ఎవనిశ్రేష్ఠుఁడగు సేనాధిపతియే సర్వనిర్వాహకుఁడో! ఆ ప్రభువే యందఱకు సులభుఁడని హృదయము.

తా॥ మిక్కిలి అందగాఁడగు వనాద్రినాథుఁడైన సుందర భుజస్వామివారి భుక్తశేషము నారగించువాఁడును, సృష్ట్యాది సకలవ్యాపారములందును (శ్రీ) స్వామివారికిఁ గటాక్షవీక్షణీయుఁడై యింగితానుసారము మెలఁగువాఁడును సేనాధిపతులలో ముఖ్యుఁడైన విష్వక్సేనుఁడు ఎల్లప్పుడు నుభయవిభూతులలో ముఖ్యకైంకర్య నిర్వాహకుఁడను ప్రసిద్ధిని వహించెను. తా నొనర్చుపనుల నన్నింటిని సేనాధిపతియే చూచుకొనిపోవు చున్నప్పు డాప్రభువు మిక్కిలి విశ్రాంతి గలవాఁడై భక్తులకు సులభుఁడుగా నుండునని సారము.

ఉ॥ సుందరమూర్తితోఁ దనరు
చున్ వనశైలము నేలు దేవతా
వందిత పాదపద్ముఁ డగు
వారిజలోచను భుక్తశేషమే
విందుగఁ దజ్జగత్సృజన
విశ్రుతకృత్యములందుఁ దత్కటా
క్షేందిరస్వాగతంబుఁ గొను
నీప్రభుసైన్యవిభుండు సేవలన్.

శ్లో॥ ఛత్రచామరముఖాః పరిచ్ఛదాః
సూరయః పరిజనా శ్చ నైత్యగాః ।
సుందరోరుభుజ మింధతే సదా
జ్ఞానశక్తి ముఖనిత్య సద్గుణాః ॥ 75

ప్రతి :— నైత్యగాః = నిత్యకైంకర్యము నొనర్చెడు, సూరయః=జ్ఞానులైన, (శేషిహృదయము నెఱింగిన) పరిజనాః

= అనంతగరుడాది సేవకులు, ఛత్ర, చామర, ముఖాః= ఛత్రము (గొడుగు) వింజామరలు మున్నగాఁగల, పరిచ్ఛదాః, చ=పరికరములును, జ్ఞాన, శక్తి, ముఖ, నిత్య, సత్, గుణాః= జ్ఞానము,శక్తి, మున్నగాఁగల స్వాభావిక కల్యాణగుణములును, సదా=ఎల్లప్పుడు, సుందర, ఉరు, భుజమ్ = సుందరబాహు స్వామిని, (ప్రాప్య=పొంది) ఇంధతే=ప్రకాశించుచున్నవి.

విశేషములు :— నైత్యాగాః — నిత్యంభవమ్ = నైత్యం, అనఁగా నిత్యకైంకర్య మని భావము. తత్ గచ్ఛంతి, ఇతి, నైత్యాగాః=నిత్యకైంకర్యమును పొందినవారు. (శేషగరుడాదులు) ఇంధతే=ప్రకాశింపఁ జేయుచున్నవి, అను అర్థము చెప్పుటకు వీలుగాదు. ణిజంతము (ప్రేరణార్థకము)కాదుగనుక- మఱియు 'గుణజం గుణినో హి మంగళత్వమ్' ఇత్యాదిసూక్తులకు విరోధముగూడ వచ్చును. కాన 'ప్రాప్య' అనుల్యబంతము నధ్యాహార మొనర్చుకొని శ్లోక మన్వయించవలెను.

తా॥ నిత్యకైంకర్యనిష్ఠులగు అనంతగరుడాది నిత్యసూరులగు పరిజనులును, ఛత్రచామరప్రభృతు లగు పరికరంబులును, జ్ఞానశక్తిముఖ్యము లగు కల్యాణగుణములును శ్రీ సుందరబాహుస్వామి యండచేత సర్వదా ప్రకాశించు చున్నవి.

గీ॥ నిత్యకైంకర్యనిరతులై నెగడు సూరి
వరులు, ధవళాతపత్రచామరముఖములు।
జ్ఞానశక్తిప్రభృత్యురు సద్గుణములు
శ్రీవనాద్రీశుఁ జేరి రాజిలు సతంబు.

శ్లో॥ ద్వారనాథ గణనాథ తల్లజాః
పారిషద్యపదభాగిన స్తథా ।
మామకా శ్చ గురవః పురాతనాః
సుందరం వనమహీధ్రగం శ్రితాః ॥ 76

ప్రతి :— ద్వారనాథ, గణనాథ, తల్లజాః = శ్రేష్ఠులగు చండప్రచండాది ద్వారపాలురు, కుముద, కుముదాక్షాది గణపాలురు, అను పారిషద్య, పద, భాగినః = ఆస్థానోద్యోగుల నెడు శబ్దమును బొందినవారును, తథా = అట్లే, పురాతనాః = ప్రాచీనులగు, మామకాః = నాసంబంధులైన, గురవః, చ = గురువులును (పరాంకుశ, పరకాల యతి వరాదులును) వన, మహీధ్రగమ్ = వనగిరియందు వేంచేసియున్న, సుందరమ్ = సుందరభుజస్వామిని, శ్రితాః = ఆశ్రయించిరి.

విశేషములు :— 'ద్వారనాథ గణనాథ తల్లజాః' ఇందలి శ్రేష్ఠవాచక మగు తల్లజశబ్దమును ద్వారనాథ, గణనాథపదములతోఁ బ్రత్యేక మన్వయించుకొనవలెను- అందువలన- శ్రేష్ఠులగు చండప్రచండాది ద్వారపాలకులు, శ్రేష్ఠులగు కుముద, కుముదాక్షాదిగణపాలకులు- అని యర్థ మేర్పడును. 'సుందరం వన మహీధ్రగం శ్రితాః' ద్వారపాలురు గణపాలురు, ఆస్థానోద్యోగి ప్రముఖులు మా పూర్వాచార్యవర్యులును శ్రీ సుందరబాహుస్వామినే నిరంతరము సేవించు చున్నారని భావము.

తా॥ శ్రేష్ఠులగు చండప్రచండాది ద్వారపాలకులు, కుముద కుముదాక్షాది గణపాలురు, ఆస్థానముఖ్యులు, మా పూర్వా

చార్యవర్యులు, వనశైలమున వేంచేసియున్న (శ్రీ) సుందర బాహుస్వామినే నిరంతరము ఆశ్రయించి సేవించు చున్నారు.

మ. అలచండుండు ప్రచండుఁడాది యగుద్వారాధీశులున్ సద్గుణా
దుల మే లౌకుముదప్రధానగణనాథుల్ పారిషద్యాగ్రగ
ణ్యులు, ప్రాచీన మదీయ దేశికవరేణ్యుల్, శ్రీవనాద్రీశ్వరున్
జలజాతాక్షుసమాశ్రయించిరిరమాసంభావితున్ సుందరున్.

శ్లో॥ ఈదృశైః పరిజనైః పరిచ్ఛదై
ర్నిత్యసిద్ధ నిజభోగ భూమిగః ।
సుందరో వనగిరే స్తటీషు వై
రజ్యతే సకలదృష్టిగోచరః ॥ 77

ప్రతి :— ఈదృశైః=ఇటువంటి, పరిజనైః = అనంతగరుడాది పరిజనులతోను, పరిచ్ఛదైః=ఛత్రచామరాది పరికరములతోను, నిత్యసిద్ధ, నిజ, భోగభూమిగః=ఎల్లప్పు డొకే విధముగా నుండు సహజమగు (తనకుమాత్ర పరిమితమైన) నిత్య విభూతిని పొందిన వైకుంఠనాథుఁడు, సకల, దృష్టి, గోచరః = ఎల్లవారికనులకు గోచరించుచు, సుందరః(సన్)=సుందరబాహు మూర్తి యగుచు, వనగిరేః=వనశైలముయొక్క, తటీషు= చరియలయందు, రజ్యతే=అనురక్తుఁడగు చున్నాఁడు, వై = ప్రసిద్ధము.

విశేషములు :— నిత్యసిద్ధనిజభోగభూమిగః—

శ్లో॥ వైకుంఠే తు పరే లోకే శ్రియా సార్థం జగత్పతిః
ఆస్తే విష్ణు రచింత్యాత్మా భక్తై ర్భాగవతై స్సహ॥

తా॥ పరమపద మగు వైకుంఠమునందు జగదీశ్వరుఁడును అచింత్య స్వరూపుఁడునగు శ్రీమన్నారాయణమూర్తి లక్ష్మీ సమేతుఁడై భక్తులతో భాగవతులతో నుండును- అన్నట్లు దివ్యవిభూతిలో వేంచేసియున్న శ్రీవైకుంఠనాథుఁడు. నిత్య నిరవద్యనిత్యసూరిపరివృత పరమపదనిలయుఁ డని నిష్కృష్టార్థము. 1. న చక్షుషా పశ్యతి కశ్చ నైనమ్— 2. న మాంస చక్షు రభివీక్షతే తమ్— 3. ద్రష్టవ్యః శ్రోతవ్యో, మంతవ్యో నిదిధ్యాసితవ్యః— అన్నట్లు దుర్లభదర్శనుఁడైనను అవ్యాజకరుణచేత వనగిరి ప్రాంతమున సకల జననేత్రగోచరుఁ డగుట సుందరబాహుస్వామి సౌలభ్యమును చాటుచున్నది.

తా॥ ఇట్టిభాగవతోత్తములగు శేషగరుడాదులతోను,ఇటువంటి ఛత్రచామరాదులతోను గూడి శశ్వదేకప్రకారముగా నుండు నిత్యవిభూతిలో మహానంద మనుభవించు వైకుంఠ నాథుఁడు సకలజనదృగ్గోచరుఁడై సుందరబాహుమూర్తిగా వనగిరి సానువుల ననురక్తుఁడై విహరించు చున్నాఁడు. ఎంత భక్తసులభుఁడు!

ఉ. ఇట్టి విశిష్టభాగవతు లీదృశ దివ్యపరిచ్ఛదంబు లు
న్నట్టి స్వదివ్యలోకమున నంగనతో సుఖియౌ సుపర్వస
ద్రమ్మట్టు వనాద్రిభూపరిసరంబున సుందరుఁడై చరించుచున్
బుట్టువుధన్యమున్ సలుపుఁబో! ప్రజకుంగనువిందొనర్చుచున్.

అవతారిక :— పరమపదమునం దప్రాకృత దివ్యభోగరసికు నకు, వనాద్రినివాసము వైరస్యమును కలిగింపదా? అను శంక నీ శ్లోకమునఁ బరిహరించు చున్నారు.

శ్లో॥ ఆక్రీడభూమిషు సుగంధిషు పౌష్పికీషు
వైకుంఠధామని సమృద్ధసువాపికాసు ।
శ్రీమల్లతాగృహవతీషు యథా తథైవ
లక్ష్మీధరః సజతి సింహగిరే స్తటీషు ॥ 78

ప్రతి:— వైకుంఠధామని = వైకుంఠలోకమునందు, సమృద్ధ సువాపికాసు = (అమృతమువంటి నీటితో) నిండినమంచి దిగుడు బావులు గలిగినట్టియు, శ్రీమత్, లతాగృహవతీషు = శోభ గల పొదరిండ్లు గలవియు, పౌష్పికీషు = పుష్పములతోఁ దులఁ దూగునవియు (కనుకనే) సుగంధిషు = సువాసన గలవియునగు, ఆక్రీడ భూమిషు = ఉద్యానభూములందు, లక్ష్మీధరః = శ్రీపతి, యథా = ఎట్లు, సజతి = ఆసక్తుఁడగు చున్నాఁడో, తథా, ఏవ = అట్లే, సింహగిరేః = వనాద్రియొక్క, తటీషు = చరియల యందు, సజతి = ఆసక్తి గలవాఁడగు చున్నాఁడు.

విశేషములు :— 'తథైవ లక్ష్మీధర స్సజతి సింహగిరే స్తటీషు' వైకుంఠోద్యాన భూములవలెనే వనాద్రికానన భూములు శ్రీ సుందరబాహుస్వామికి భోగ్యతాపాత్రము లగు చున్నవని భావము.

తా॥ శ్రీ మన్నారాయణమూర్తి వైకుంఠలోకమున అమృతమువంటి నీటితో నిండిన దిగుడుబావులు శోభాయ

మానములగు లతాగృహములు (పొదరిండ్లు) సుగంధిపుష్ప ములు గలిగిన పూఁదోఁటలయందె ట్లనురక్తుఁడై యుండునో యట్లే సకలభోగ్యతా సమృద్ధిగల వనగిరి తటములందును (శ్రీ) సుందరబాహుస్వామి యనురక్తుఁడై విహరించు చుండును.

చ. పరమపదంబునన్ జెలఁకుఁ బా
  నకమున్ మఱపించునీటితో
 వరలెడు దీర్ఘికల్, సిరికిఁ బ
  ట్టగుమేల్ పొదరిండ్లు పుష్పమం
 జరులఘుమం ఘుమల్ మదికి
  సంతసమీఁ బువుఁదోఁటలందు (శ్రీ)
 హరి యెటొ! యట్లే సుందరుఁడహా!
  విహరించు వనాద్రి సీమలన్.

శ్లో॥ ఆనందమందిర మహామణి మండపాంత
 ర్లక్ష్మ్యా భువా ప్యహిపతౌ సహ నీలయా చ ।
 నిస్సంఖ్య నిత్యనిజదివ్య జనైక సేవ్యో
 నిత్యం వసన్ సజతి సుందరదో ర్వనాద్రౌ ॥ 79

ప్రతి :— ఆనంద......అంతః— ఆనందమందిర = ఆనం దోత్పత్తి గృహమగు, మహాత్ = పెద్ద, మణి, మండప, అం తః = మణులుచెక్కిన, వెయ్యిస్తంభముల మండపములోపల, అహిపతౌ = సర్పరాజగు శేషునియందు, లక్ష్మ్యా = లక్ష్మీదేవి తోను, భువా అపి = భూదేవితోను, నీలయా, చ = నీలాదేవి తోను, వసన్ = నివసించుచు, నిస్సంఖ్యా, నిత్యా, నిజ, దివ్యజన,

ఏకసేవ్యః=లెక్కకు మించిన, తన అప్రాకృతులగు పరిజనులకు మాత్రమే అనుభవింపఁ దగినవాఁడై, సుందరదోః=సుందర బాహుస్వామి, వనాద్రౌ=వనగిరియందు, నిత్యమ్=ఎల్లప్పుడు, సజతి=ఆసక్తుఁడై యున్నాఁడు.

విశేషములు :— 'ఆనందమందిర మహామణి మండపాంతః' స్వరూపరూపగుణవిభూతి నిత్యముక్తసంయుక్త భగవదనుభవ జన్యమహానందమునకుఁ బుట్టినిల్లైన వెయ్యిస్తంభముల పెద్ద మణిమండపము మధ్యభాగమునం దని భావము. నిత్యం వసన్ సజతి సుందరదోర్వనాద్రౌ— పత్నీపరిజనాదులతో నిత్య నివాసయోగ్య మగు వనగిరి, సుందరబాహుస్వామివారికి ఆనంద మందిరమహామణిమండపముకంటె అత్యంత భోగ్యముఁగా నున్న దని తాత్పర్యము.

తా॥ భగవదనుభవజన్య మహానందమునకుఁ బుట్టినిల్లగు వేయిస్తంభములు గల మహత్తరమగు మణిమండపాస్థాన మధ్యభాగమునందు శేషపర్యంకమున శ్రీభూనీలా సమేతుఁడై లెక్కకు మీఱిన యప్రాకృతులగు నిజపరిజనంబులచేత సేవ్య మానుఁడగు వైకుంఠపతి సుందరబాహుస్వామియై నిత్యము వనాద్రియం దాసక్తుఁడై యున్నాఁడు.

శా. ఆనందైకనిధాన రత్నమయ ది
వ్య స్తంభ బాభాసురా
స్థానీమండపమధ్యమందు నహిరా
ట్తల్పంబునన్ శ్రీరమా

క్ష్మానీలల్ భజియింపఁ గింకరతతుల్
కై వారముల్ సల్పఁగా
శ్రీనాథుం డెటొ సుందరుం డటె వనా
ద్రిన్ గ్రీడఁ గావించెడున్.

శ్లో॥ ప్రత్యర్థిని త్రిగుణకప్రకృతే రసీమ్ని
వైకుంఠధామని పరాంబరనామ్ని నిత్యే।
నిత్యం వసన్ పరమసత్త్వమయే హ్యతీత
యోగీంద్రవాఙ్మనస ఏష హరి ర్వనాద్రౌ॥ 80

ప్రతి:— పరమ, సత్త్వ, మయే = శుద్ధసత్త్వమయ మైనట్టియు, (కనుకనే) త్రిగుణక, ప్రకృతేః = సత్త్వరజస్తమోమయ మైన మూలప్రకృతికి, ప్రత్యర్థిని = ప్రతిభటమైనట్టియు, (విరోధి యైనట్టియు) అసీమ్ని = హద్దులేనట్టియు. పర, అంబర, నామ్ని = పరమాకాశ మను పేరుగలట్టియు, నిత్యే = సనాతన మైన ట్టియు, వైకుంఠధామని = వైకుంఠలోకమునందు, నిత్యమ్ = ఎల్లప్పుడు, వసన్ = నివసించుచు, అతీత, యోగీంద్ర, వాఙ్మనసః, అపి = యోగీంద్రుల వాక్కులకు మనస్సునకు అందని వాఁడైనను, హరిః = శ్రీమహావిష్ణువు, వనాద్రౌ = వనగిరి యందు, ఏషః = ఇతఁడే యని వ్రేలితోఁ జూపఁదగినవాఁడు, (ప్రత్యక్షుఁడుగా నున్నాఁడని యర్థము).

విశేషములు :— అసీమ్ని = అపరిచ్ఛిన్నపరిమాణముగల, అతీతయోగీంద్ర వాఙ్మనసః అపి = అపరిచ్ఛేద్య స్వరూపగుణ విభూత్యాదులు గలవాఁడైనను, 'అతీతయోగీంద్రవాఙ్మనసే,

అని పదచ్ఛేద మొనర్చినపుడు వైకుంఠలోకమునకు విశేషణ మగును.

తా॥ శుద్ధసత్త్వమయమును త్రిగుణస్వరూప మగు ప్రకృతికిఁ బ్రతిభటమును, అపరిచ్ఛిన్నపరిమాణము గలదియు, పరమాకాశమనఁబడు నిత్యమగు వైకుంఠమున నిత్యనివాసియై యోగీశ్వరులవాక్కులకు మనస్సునకు నందని వాఁడైన శ్రీపతి వనగిరిలో నితఁడే యని చూపుటకు వీలై యందఱికి దృగ్గోచరుఁ డగు చున్నాఁడు.

మ. పరిమాణం బతిమాత్రమై ప్రకృతికిం
బ్రత్యర్థిభూతంబునై
వరసత్త్వస్ఫురణాంచితంబు నయి భా
స్వద్రూపమై నిత్యమై
పరమాకాశపదాభిధేయ మగు శ్రీ
వైకుంఠమందున్ మునీ
శ్వరవాఙ్మానసదూరుఁడౌ హరి యిటన్
బ్రత్యక్షదృశ్యుం డహో!

అవతారిక :— ఈ మీఁద శ్రీవారి లీలావిభూతియోగమును శ్లోకద్వయముతోఁ జెప్పుచున్నారు.

శ్లో॥ లోకాం శ్చతుర్దశ దధత్ కిల సుందరస్య
పంక్తీగుణో త్తరితసప్తవృ తీద మండమ్।
అన్యాని చాస్య సదృశాంశి పరశ్శతాని
క్రీడావిధే రిహ పరిచ్ఛదతా మగచ్ఛన్॥ 81

ప్రతి :— చతుర్దశ = పదునాలుగు, లోకాన్ = లోకము లను, దధత్ = ధరించు చున్నట్టిము, పంక్తి.....సప్తవృతి = పంక్తిగుణ = పదిరెట్లు, ఉత్తరిత = ఒకదానికంటె నొకటి పెద్దవి యగు, సప్తవృతి = ఏడుఆవరణములు గల, ఇదమ్ = ఈ, అండమ్ = బ్రహ్మాండము, అస్య = దీనికి, సుసదృశాంశీ = మిక్కిలి సదృశములైన, పరశ్శతాని = లెక్కలేని, అన్యాని, చ = ఇతరము లగు బ్రహ్మాండములును, ఇహ = ఈలీలావిభూతియందు, సుందరస్య = సుందరబాహుస్వామియొక్క, క్రీడావిధేః = లీలాకార్యమునకు, పరిచ్ఛదతామ్ = ఉపకరణ మగుటను (ఆటవస్తు వగుటను) అగచ్ఛన్, కిల, = పొందినవిగదా !

విశేషములు :— లోకాన్ చతుర్దశ దధత్ — ఇది అండమునకు విశేషణము. దీనిచేత నయ్యండ వైశాల్యము ప్రకటింపఁ బడుచున్నది. 'పరశ్శతాని' వందలకు దాఁటినవి, అనఁగా అనేకములని భావము.

తా॥ పదునాలుగు లోకములను తనలో ధరించు వైశాల్యమును ఒకదానికంటె నొకటి పదిరెట్లు విస్తారము గలయేడు ఆవరణములతోఁ గూడిన యీబ్రహ్మాండము, ఇట్టివే యగు వందలకొలఁది బ్రహ్మాండములును శ్రీ సుందరబాహుస్వామి వారి కేళీలావిభూతిలో ఆటవస్తువు లగుచున్నవి.

మ. పదునాల్గా జగముల్ విశాలత వసిం
పన్ బొల్చి యొండొండు తాఁ
బదిరెట్లాయతి మించుసప్తవృతులన్
భాసిల్లు నీయండ, మి

ట్టెదె యానందపరశ్శతంబు తగఁ గ్రీ
డింపంగ నేతద్విభూ
తిఁ దలిర్చున్ వనశైలనాథునకు నెం
తే నాటబొమ్మల్ వలెన్.

శ్లో॥ సురనరతిర్యగాది బహుభేదకభిన్నమిదం
జగ దథ చాండ మండవరణాని చ సప్త తథా ।
గుణపురుషౌ చ ముక్తపురుషా శ్చ వనాద్రి పతే
రుపకరణాని నర్మవిధయేఽపి భవంతి విభోః ॥ 82

ప్రతి :— సుర, నర, తిర్యక్, ఆది, బహు, భేదక, భిన్నమ్ = దేవతలు, మనుష్యులు, తిర్యక్కులు (పశుపక్ష్యాదులు) మొదలగు పెక్కు విశేషణములచేత భిన్నమైన, (వేఱయిన) ఇదమ్=ఈ, జగత్=ప్రపంచము, అథ=ఆమీఁద, అండంచ = అండమును, తథా=అట్లే, సప్త=ఏడు, వరణాని, చ= ఆవరణములును, (పరిధులును) గుణ, పురుషౌ, చ = ప్రకృతి పురుషులును, ముక్తపురుషాః చ=ముక్తపురుషులును, విభోః, అపి=సర్వస్వామి యైనను, వనాద్రిపతేః = వనగిరినాథుఁడైన సుందరబాహుస్వామికి, నర్మ, విధయే=లీలాచరణముకొఱకు, ఉపకరణాని = సాధనములు, భవంతి = అగుచున్నవి.

విశేషములు :— తిర్యగాది— అనుచోట 'ఆది' పదముచేత తమకంటెఁ దక్కువవి యగు స్థావరాదులు గ్రహింపఁ బడును. గుణపురుషౌ=గుణశబ్దముచేత గుణత్రయ విశిష్టమగు ప్రకృతియు, పురుషశబ్దముచేతఁ దత్సంబద్ధుఁడగు పురుషుఁడును గ్రహింపఁబడును. ముక్తపురుషాః— ఇచ్చటఁ బ్రకృతిచేతవిడువఁ

ట్టిదె యానందపరశ్శతంబు తగఁ గ్రీ
డింపంగ నేతద్విభూ
తిఁ దలిర్చున్ వనశైలనాథునకు నెం
తే నాటబొమ్మల్ వలెన్.

శ్లో॥ సురనరతిర్యగాది బహుభేదకభిన్నమిదం
జగదథ చాండ మండవరణాని చ సప్త తథా।
గుణపురుషౌ చ ముక్తపురుషా శ్చ వనాద్రి పతే
రుపకరణాని నర్మవిధయేఽపి భవంతి విభోః॥ 82

ప్రతి :— సుర, నర, తిర్యక్, ఆది, బహు, భేదక, భిన్నమ్ = దేవతలు, మనుష్యులు, తిర్యక్కులు (పశుపక్ష్యాదులు) మొదలగు పెక్కు విశేషణములచేత భిన్నమైన, (వేఱయిన) ఇదమ్=ఈ, జగత్=ప్రపంచము, అథ=ఆమీఁద, అండంచ = అండమును, తథా=అట్లే, సప్త=ఏడు, వరణాని, చ= ఆవరణములును, (పరిధులును) గుణ, పురుషౌ, చ = ప్రకృతి పురుషులును, ముక్తపురుషాః చ=ముక్తపురుషులును, విభోః, అపి=సర్వస్వామి యైనను, వనాద్రిపతేః = వనగిరినాథుఁడైన సుందరబాహుస్వామికి, నర్మ, విధయే=లీలాచరణముకొఱకు, ఉపకరణాని = సాధనములు, భవంతి = అగుచున్నవి.

విశేషములు :— తిర్యగాది— అనుచోట 'ఆది' పదముచేత తమకంటెఁ దక్కువవి యగు స్థావరాదులు గ్రహింపఁ బడును. గుణపురుషౌ=గుణశబ్దముచేత గుణత్రయ విశిష్టమగు ప్రకృతియు, పురుషశబ్దముచేతఁ దత్సంబద్ధుఁడగు పురుషుఁడును గ్రహింపఁబడును. ముక్తపురుషాః— ఇచ్చటఁ బ్రకృతిచేతవిడువఁ

ఏజనులు, సుందర, అంఘ్రి, పద, భక్తి, భాగినః=సుందర బాహుస్వామివారి చరణములందు భక్తియోగమును పొందిన వారు,(భవంతి=అగుచున్నారో!, తే=ఆజనులు, పరమామ్= ఉత్కృష్టమగు, ముక్తిమ్=మోక్షమును, ఆప్య = పొంది. పరే, పధే= పరమపదమునందు, నిత్య, కింకర, పదమ్ = నిత్య కింకరులు) అను శబ్దమును, భజంతి=పొందు చున్నారు.

విశేషములు :— పరమాం ముక్తిమ్ = అపునరావృత్తి ముక్తిమ్ = పునరావృత్తిలేని మోక్షమును 'న స పున రావర్తతే— న స పున రావర్తతే' అని శ్రుతి. మోక్షమునకు వెళ్ళినవాఁడు తిరిగి పుట్టఁడు. 'నిత్యకింకరపదం భజంతి తే' కర్మ జ్ఞానభక్తి యోగములు భగవన్నిత్యకింకరత్వసాధనము లని భావము,

తా॥ ఎల్లప్పుడు కర్మయోగము నాచరించువారును, జ్ఞాన యోగనిష్ఠులును, శ్రీ సుందరబాహుస్వామివారి చరణము లందు భక్తియుక్తులై పునరావృత్తిరహితమగు మోక్షమును బొంది పరమపదమునందు నిత్యకింకరు లనెడు శబ్దమును బొందుదురు.

గీ. సంతతము కర్మయోగనిష్ఠాగరిష్ఠు
లనవరతమును జ్ఞానయోగాభిరతులు।
సుందరపదారవిందభక్తిం దరించి
నిత్యకింకరపదము గణింతు రచట.

అవతారిక :— ఇటుమీఁద ముప్పదియొనిమిది శ్లోకముల చేత. భగవదవతార సౌశీల్యమ్ము ననుభవించు చున్నారు.

ఏజనులు, సుందర, అంఘ్రి, పద, భక్తి, భాగినః=సుందర బాహుస్వామివారి చరణములందు భక్తియోగమును పొందిన వారు,(భవంతి=అగుచున్నారో!, తే=ఆజనులు, పరమామ్= ఉత్కృష్టమగు, ముక్తిమ్=మోక్షమును, ఆప్య = పొంది. పరే, పథే= పరమపదమునందు, నిత్య, కింకర, పదమ్ = నిత్య కింకరులు) అను శబ్దమును, భజంతి=పొందు చున్నారు.

విశేషములు :— పరమాం ముక్తిమ్ = అపునరావృత్తి ముక్తిమ్ = పునరావృత్తిలేని మోక్షమును 'న స పున రావ ర్తతే— న స పున రావర్తతే' అని శ్రుతి. మోక్షమునకు వెళ్ళినవాఁడు తిరిగి పుట్టఁడు. 'నిత్యకింకరపదం భజంతి తే' కర్మ జ్ఞానభక్తి యోగములు భగవన్నిత్యకింకరత్వసాధనము లని భావము,

తా॥ ఎల్లప్పుడు కర్మయోగము నాచరించువారును, జ్ఞాన యోగనిష్ఠులును, శ్రీ సుందరబాహుస్వామివారి చరణము లందు భక్తియుక్తులై పునరావృత్తిరహితమగు మోక్షమును బొంది పరమపదమునందు నిత్యకింకరులనెడు శబ్దమును బొందుదురు.

గీ. సంతతము కర్మయోగనిష్ఠాగరిష్ఠు
లనవరతమును జ్ఞానయోగాభిరతులు।
సుందరపదారవిందభక్తిం దరించి
నిత్యకింకరపదము గణింతు రచట.

అవతారిక :— ఇటుమీఁద ముప్పదియెనిమిది శ్లోకముల చేత. భగవదవతార సౌశీల్యము ననుభవించు చున్నారు.

శ్లో॥ అజోఽపి సన్నవ్యయాత్మా । భూతానా మీశ్వరోఽపిసన్ ।
ప్రకృతిం స్వా మధిష్ఠాయ । సంభవా మ్యాత్మమాయయా ॥

అనినట్లు స్వాసాధారణ దివ్యస్వభావమును వీడకుండ స్వేచ్ఛతో నవతరించి నప్పటికిని

శ్లో॥ 'ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్ ।'
'అహం వో బాంధవో జాతః' ఇత్యాద్యులఁ బేర్కొనఁబడిన బాంధవత్వ ప్రయుక్తవాత్సల్యము, సౌశీల్యము విస్మయకరమని భావము.

తా॥ సర్వజ్ఞత్వ, సర్వశక్తిత్వాది సర్వేశ్వరత్వ ప్రయుక్త కల్యాణగుణములను బాయలేని యవతారములచే నే దేవుఁడీ విశ్వము నలంకరించెనో దేవ దేవుఁడగు వనాద్రీశ్వరుఁడైన యా సుందరబాహుస్వామి సౌశీల్యవాత్సల్యము లత్యాశ్చర్యకరములు—

ఉ॥ ఏగుణవారిరాశి తను నెన్నఁడుఁ
బాయని యైశభావమున్
త్యాగ మొనర్పలేని యవతారములన్
జగదేక భూషణం
బౌ గతి నొప్పె నావనధరాధిపు శీల
సువత్సలత్వముల్
చాఁగురె! మేల్! బళీ! యను ప్రశంసకుఁ
బాత్రములై తనర్చెడిన్.

శ్లో॥ సింహాద్రినాథ ! తవ వాఙ్మనసాతివృత్తం
రూపం త్వతీంద్రియ మురాహ రహస్యవాణీ ।
ఏవం చ న త్వ మిహ చేత్ సమవాతరిష్యః
త్వజ్ జ్ఞాన భక్తి విధయోఽద్య ముధాఽభవిష్యన్ ॥ 85

ప్రతి :— (హే) సింహాద్రినాథ ! = ఓ సుందరబాహు స్వామీ, రహస్యవాణీ = ఉపనిషత్తు, వాఙ్మనస, అతి, వృత్తమ్ = వాక్కులకు మనస్సునకు నందని, తవ = నీయొక్క, రూపం తు = రూపమునన్ననో, అతీంద్రియమ్ = ఇంద్రియములకు గోచరము కాని దానినిగా, ఉదాహ = పెద్దగాఁ జెప్పెను. ఏవంచ (సతి) ఇట్లు కాఁగా, ఇహ = ఈ లీలావిభూతియందు, అద్య = ఇప్పుడు, త్వమ్ = నీవు, న, సమవాతరిష్యః చేత్ = అవతరింపక పోయెదవేని, త్వత్, జ్ఞాన, భక్తి, విధయః = తమ జ్ఞానభక్తివిధాయకశాస్త్రములు, ముధా = వ్యర్థములు, అభవిష్యన్ = ఐ యుండెడివి.

విశేషములు :—సింహాద్రినాథ—వనగిరికి సింహాద్రి యని నామాంతరము. కనుక ఓ వనగిరిప్రభువా ! యని యర్థము. రూపమ్—ఇచ్చట రూపశబ్దము విగ్రహపరము. ఏవంచ (సతి) = వాక్కులకు మనస్సునకు అందని తారుణ్యలావణ్యములు గల దేవరవారి దివ్యవిగ్రహము కంటికి గోచరము కాదని. 'న చక్షుషా పశ్యతి కశ్చ నైనమ్' (ఎవఁడును ఈ పరమాత్మను కంటితోఁ జూడఁ జాలఁడు.) 'న మాంసచక్షు రభివీక్షతే తమ్ (మాంసచక్షుష్కుఁ డాపరాత్పరుని జూడ లేఁడు.)

ఇత్యాద్యుపనిషద్వాక్యములచేతఁ బ్రతిపాదింపఁ బడఁగా నని భావము. 'న త్వా మిహ చేత్ సమవాతరిష్యః త్వజ్ జ్ఞాన భక్తివిధయోఽద్య ముధాఽభవిష్యన్' శుభాశ్రయమగు విగ్రహము నాశ్రయించి ప్రవర్తిల్లిన దేవరవారి జ్ఞానభక్తివిషయకము లగు శాస్త్రములు శ్రీవారి యవతారములే లేనిచో పొసఁగవని భావము.

తా॥ ఓ వనాద్రినాథా! యుపనిషద్వాణి వాఙ్మనసంబుల కందని దేవరవారి విగ్రహము నతీంద్రియ మని పెద్దగా నుడువుచున్నది. ఇట్లు నీ దివ్యవిగ్రహము చక్షురగోచరము కాఁగా నీలీలావిభూతిలోఁ దామే యవతరింపని యెడల దేవరవారి జ్ఞానభక్తి ప్రతిపాదకశాస్త్రములు వ్యర్థములై పోయెడిని. అవతరించితిరి గాన నవి సార్థకము లగుచున్నవి.

ఉ. సుందబాహురూప మధు
సూదన! దివ్యవనాచలస్థలీ
మందిర! నీదు విగ్రహము
మాటలకుఁ మదికిఁ రవంతయే
నంద దటంచుఁ బల్కుఁ శ్రుతి
యట్టులుగా నవతార మెత్తవే
నిందు వృథాయగుం గద! హ
రీ! తమజ్ఞాన సుభక్తిశాస్త్రముల్.

శ్లో॥ యే భక్తా భవదేకభోగమనసోఽనన్యాత్మ సంజీవనాః
తత్సంశ్లేషణతద్విరోధినిధనాద్యర్థం వనాద్రీశ్వర !
మధ్యేండం య దవాతర స్సురనరాద్యాకారదివ్యాకృతి
స్తే నైవ త్రిదశై ర్నరై శ్చ సుకరం స్వప్రార్థిత ప్రార్థనమ్॥ ౯6

ప్రతి — హే వనాద్రీశ్వర ! = ఓ సుందరబాహుమూర్తీ ! అనన్య, ఆత్మ, సంజీవనాః = మఱి యొకటి ఆత్మోజ్జీవనముగా లేనివారును, భవత్, ఏక, భోగ, మనసః = నీ వొక్కఁడవే భోగ్య మనెడు మనస్సుగలవారును, అగు, యే = ఏ, భక్తాః = భక్తులు, (సంతి = కలరో) తత్, సంశ్లేషణ, తత్, విరోధి, నిధన, ఆది, అర్థమ్ = వారిని రక్షించుట, వారివిరోధులను శిక్షించుట (సంహరించుట) ధర్మమును స్థాపించుట, యను ప్రయోజనము కొఱకు, మధ్యేండమ్ = బ్రహ్మాండమధ్యమున, సుర, నర, ఆది, ఆకార, దివ్య, ఆకృతిః = దేవతలు మానవులూ మొదలగువారి యాకారమువంటి దివ్యవిగ్రహముగలవాఁడవై, అవాతరః, ఇతి, యత్ = అవతరించితివనుట యేది గలదో, తేన, ఏవ = ఆయవతారకారణముచేతనే, త్రిదశైః = దేవతలచేతను, నరైః = మానవులచేతను, స్వ, ప్రార్థిత, ప్రార్థనమ్ = తమకోరికలను వేఁడుకొనుట, సుకరమ్ = సులువైనది, (అభూత్ = ఆయెను.)

విశేషములు :— ‘అనన్యాత్మసంజీవనాః, – భవదేకభోగ మనసః’– అను విశేషణద్వయముచేత నీవే యుపాయముగను, ఉపేయముగను గలవారు. అని భక్తులయెడఁగల పరాకాష్ఠను

దెలియవలెను. అట్టి భక్తులే గీతయందలి 'పరిత్రాణాయ సాధూనామ్' అనుచోట సాధుపదముచేఁ బేర్కొనఁబడిరి. 'తత్సంశ్లేషణ తద్విరోధి నిధనాద్యర్థమ్' ఈ పదమునందు భగవదవతార ప్రయోజనములు సూచించుచు 'పరిత్రాణాయ' అను గీతాశ్లోకము వివరింపఁబడినది. 'తత్సంశ్లేషణ' మనఁగా, అట్టి సాధువులతో నెడములేక కలసియుండుట– అనఁగా వారిని రక్షించుటయందు బద్ధదీక్షుఁడై యుండుట యని భావము. అందులకై 'తద్విరోధినిధన'– అట్టి సాధువుల కపకారములను చేయువారిని సంహరింపవలయును 'వినాశాయ చ దుష్కృతామ్' అని గీత, ఈ రెండుపనులెందు కనఁగా 'ఆద్యర్థమ్ ఇచ్చట ఆదిపదగ్రాహ్యము ధర్మము. దానిని స్థాపించుటకొఱకు 'ధర్మసంస్థాపనార్థాయ' అని గీత. సుకరమ్—నీవు సుందరరూపమున నిట నవతరించుటచేతనే సురలకు నరులకు నీ ధర్మము లభించి తమకోరికలను నీవలనఁబడయుట సులభమయ్యెనని యాశయము.

తా॥ ఓ వనాద్రినాథా! నీకంటె మఱియొకఁడాత్మోజ్జీవకుఁడు లేఁడని నిన్నే యుపాయముగాను ఉపేయముగాను భావించి నిరంతరము సేవించుచున్న భక్తులను రక్షించుటకును, వారి కపకారము లొనర్చు దుర్మార్గులను శిక్షించుటకును, ధర్మమును నెలకొల్పుటకును, నీ వీ బ్రహ్మాండమున సురనరాది దివ్యవిగ్రహుఁడవై యవతరించితివి కనుకనే దేవతలకు మానవులకు నీవలన నభీష్టములను బడయుట సులువయ్యెను.

చ॥ వనగిరినాథ! నిన్ను నె యు
పాయ ముపేయముగాఁ, దలంచి యా
త్మను గడదేర్చుకోఁ దివురు
ధన్యులఁ బ్రోవఁగఁ దద్విరోధులన్
దునుమఁగ, ధర్మమున్ నిలుపఁ,
దోడనె నీవిలఁ బుట్టుచున్న నీ
మనుజులు వేలుపుల్ పడయు
మాత్రమువారె నిజేప్సితంబులన్.

శ్లో॥ శ్రీమన్మహావనగిరీశ! విధీశయో స్తే
మధ్యే తు విష్ణు రితి యః ప్రథమావతారః।
తే నైవ చే త్తవ మహిమ్ని జనాః కి లాంధాః
త్వన్మత్స్యభావ మవగమ్య కథం భవేయుః॥ 87

ప్రతి :— (శ్రీ)మన్ = (శ్రీ)మంతుఁడవగు, మహావనగిరి + ఈశ = మహావనాద్రినాథా!, విధి, ఈశయోః = బ్రహ్మారుద్రుల యొక్క, మధ్యే, తు = నడుమనే, తే = నీకు, విష్ణుః, ఇతి = విష్ణువనెడు, యః = ఏ, ప్రథమ, అవతారః = మొదటి అవతారము, (అస్తి = కలదో) తేన, ఏవ = ఆయవతారము చేతనే, తవ = నీయొక్క, మహిమ్ని = మహిమయందు, (పరత్వవిషయమున) జనాః = జనులు. అంధాః, చేత్ = గ్రుడ్డివారైనయెడల, త్వత్, మత్స్యభావమ్ = నీమీన సజాతీయ రూపమును, అవగమ్య = తెలిసికొని, కథమ్ = ఎట్లు, భవేయుః, కిల = అగుదురో! (సముద్రసంచారు లగు మీనములలో నిదికూడ నొకటి యని తలంతురా?)

విశేషములు :— శ్రీమన్మహావనగిరీశ! — అని యేక పదముగాసైతము చేసికొనవచ్చును- అప్పుడు శ్రీమంత మగు పెద్దవనాద్రికిఁ బ్రభువా! అని యర్థము. మధ్యే, తు= ఇచ్చట 'తు' అను నవ్యయ మవధారణార్థకము. తు స్యా ద్భేదేఽవధారణే— అని నిఘంటువు. 'విష్ణు రితి యః ప్రథమావ తారః'— బ్రహ్మ విష్ణురుద్రులు- అను పరిగణమున కనుగుణ ముగా విష్ణు వని ప్రథమమున నొక మెట్టు దిగుట యేది గలదో, 'తే నైవ చేత్ తవ మహిమ్ని బనాః కిలాంధాః' అంతమాత్రము చేతనే నీపరత్వ విషయమున అనఁగా- సృష్టి స్థితిసంహారకర్తలు ముగ్గురును స్వతంత్రులు తుల్యు లని నీప్రత్యేక సర్వేశ్వరత్వమును గణింపనివారు అగుదురేని 'త్వ న్మత్స్యభావ మవగమ్య కథం భవేయుః'— సముద్రమునఁ జరించు మీనములలో నిదియు నొకమీనము (చేఁప) అనియు మనస్సులోఁ దలంతు రేమో!

తా॥ శ్రీమంతుఁడవగు ఓ వనాద్రినాథా! బ్రహ్మ విష్ణు రుద్రులనెడు పరిగణనమును బట్టి నీవు తొలిసారిగా బ్రహ్మ రుద్రుల మధ్యమునందు అవతరించుటచేత (దిగుటచేత) జనులు సృష్టిస్థితిసంహారకర్తలు ముగ్గురును ప్రత్యేకము స్వతంత్రులు సమానులు నని నీ పరత్వవిషయమున గ్రుడ్డివారైనచో నీ మీనావతారమును దెలిసికొని యదియు సముద్రములోఁ జరించు నొక సామాన్యమగు చేపయే యని భావింతురు. కలసియున్నను సముద్రములోఁ దిరిగెడి యితర మత్స్యములకు

మీనావతారుఁడవగు నీకు నెంతభేదము గలదో యట్లే బ్రహ్మ విష్ణురుద్ర పదములతోఁ గలసియున్నను విష్ణువగు నీకును బ్రహ్మరుద్రులకును గావలసినంత భేదము కలదని భావము.

శా॥ దేవా! యావిధిరుద్రులందు నడుమన్
దేవాధిదేవుండ వౌ
శ్రీవిష్ణుండవు నీవు తొల్త దిగుటన్
సృష్టిస్థితిధ్వంసకృ
ద్దేవుల్ మూవురుఁ దుల్యులందు భవదు
త్కృష్టత్వమం దంధులా
ఆవా రెన్నరె చిన్నచేపగఁ ద్వదీ
యం బైనమీనాకృతిన్.

శ్లో॥ హే దేవ! సుందరభుజ త్వ మి హాండజుత్యే
సౌలభ్యతో విసదృశం చరితం మహిమ్నః।
అంగీకరోషి యది తత్ర సురై రమీభిః
సామ్యా న్నికర్షపరిపాలన మేవ సాధు॥ 88

ప్రతి :— హే దేవ=ఓస్వామీ! సుందరభుజ! =సుందర బాహుమూర్తీ!, త్వమ్=నీవు, సౌలభ్యతః=సులభత్వ మనెడు గుణమువలన, మహిమ్నః=స రేశ్వరత్వ మహత్తకు, విసదృశమ్ =తగని. చరితమ్=నడతను, అంగీకరోషి, యది=అంగీకరింతు వేని, తత్ర=ఆతగని నడతవిషయమున, అమీభిః=ఈ, సురైః =దేవతలతోడ, (బ్రహ్మరుద్రేంద్రాదులతోడ) సామ్యాత్= పోలికకంటె, నికర్ష, పరిపాలనమ్, ఏవ, = తక్కువవారితోడి

సామ్యము నభినయించుటయే, సాధు = యోగ్యమైనది, అనఁగా మత్స్యకూర్మ సజాతీయతాభినయమే మేలని భావము.

విశేషములు :— 'తత్ర సురై రమిాభిః సామ్యా న్నికర్ష పరిపాలన మేవ సాధు'— ఓ సుందరబాహుస్వామిా! తమ సర్వస్వ మగు సౌలభ్యమును ప్రకటించుటకు శ్రీవారి పరత్వము నకు అననుగుణము లగు చేష్టలను ప్రదర్శింపవలసి వచ్చినపుడు బ్రహ్మరుద్రేంద్రాదులతో సామ్యమును ప్రకటించు విష్ణూ పేంద్రాద్యవతారముల కంటె అందఱికి నందుపాటులో నుండు మత్స్యకూర్మాది సజాతీయావతారమే మిాయత్యంత సౌలభ్య మును జెప్పును గనుక నట్టియవతారముల నభినయించుటే మేలని భావము.

తా॥ శ్రీ సుందరభుజదేవా! తా మిా బ్రహ్మాండములో శ్రీవారి సౌలభ్యగుణమును బ్రదర్శింప పరత్వమునకు విరుద్ధము లగు పనులను సలుపవలసి వచ్చినపుడు బ్రహ్మరుద్రేంద్రాదు లతోఁ బోలిక నభినయించుటకంటె నల్పములగు మత్స్య కూర్మాదులతో సజాతీయములగు నవతారముల నభినయించు టయే మేలనిపించు చున్నది.

శా॥ సౌలభ్యం బనుసీదు మేలిగుణమున్
జాటన్ బరత్వప్రభా
జాలాచ్ఛాదక వేషధారణ తఱిన్
స్రష్టన్ శివేంద్రాదులన్

బోలం జాలెడు విష్ణువామనుల చూ
పుల్ దాల్చు కంటెన్ వనీ
శైలైకాలయ! మత్స్య కూర్మముఖవే
షస్వీకృతుల్ శ్లాఘ్యముల్.

అవతారిక :— నికర్షపరిపాలన ప్రస్తావన వలన సర్వావ తార ప్రధానములగు రామకృష్ణా ద్యవతారములలోని కొన్ని లీలల ననుభవించు చున్నారు.

శ్లో॥ ఇహావతీర్ణస్య వనాద్రి నాథ! తే
నిగూహతః స్వం మహిమాన మైశ్వరమ్।
ఉమాపతేః కిం విజయః ప్రియంకరః
ప్రియంకరా వేంద్రజిదస్త్ర బంధనా॥ 89

ప్రతి :— (హే) వనాద్రినాథ! = ఓ వనగిరిప్రభూ!, ఐశ్వ రమ్ = ఈశ్వరసంబంధి యగు, (సర్వేశ్వరత్వ బోధకమగు) స్వమ్ = సహజమైన, మహిమానమ్ = మహిమను, నిగూహతః = కప్పిపుచ్చుచున్నట్టియు, ఇహ = ఈలీలావిభూతిలో, అవ తీర్ణస్య = అవతరించిన, తే = నీయొక్క, ఉమాపతేః = పార్వతీ పతియగు శివునియొక్క, విజయః = గెలుపు, ప్రియంకరః, కిమ్ = ప్రియమును గలిగించునదియా? ఇంద్రజిత్, అస్త్రబంధనా = ఇంద్రజిత్తుయొక్క, (బ్రహ్మాస్త్ర నాగాస్త్ర)పాశబంధము, ప్రియంకరా, వా = ప్రియమును గలిగించునదియా?

విశేషములు :— అవతీర్ణస్య - సర్వేశ్వరత్వ తిరోధానము కొఱకవతరించిన- 'ఉమాపతేః కిం విజయః ప్రియంకరః—

బాణాసురుని తోడియుద్ధకాలమునఁ దన్నగర రక్షకుఁడైన యీశ్వరుని జయించుట యని భావము. (ఇది కృష్ణావతార మున) 'ప్రియంకరా వేంద్రజి దస్త్రబంధనా'— (ఇది రామావ తారమున) ఈ రెండింటిలోఁ దమ పరత్వమహిమను గప్పి పుచ్చుటలో నింద్రజి దస్త్రబంధనమే ప్రముఖపాత్రమును వహించుటచేత నదియే మిక్కిలి ప్రియకరమని భావము. కనుక వెనుకటి శ్లోకమునఁ జెప్పిన 'నికర్ష పరిపాలన మేవ సాధు' అనుటయే సమంజసము.

తా॥ ఓ వనాద్రినాథా! సహజమును సర్వేశ్వరత్వ నిబంధ నము నగు నీ మహిమను గప్పివేసికొనుచు ఈలీలావిభూతిలో నవతరించిన నీకుఁ గృష్ణావతారములోని బాణాసురయుద్ధకాలిక మగు పరమశివుని జయించుట ముదావహమా? రామావ తారములో నింద్రజిన్నాగపాశములకుఁ గట్టువడుట ముదావ హమా? తెల్పుము.

శా॥ దేవా! నీదు పరత్వబోధక మహో
దివ్యత్వమున్ డాచి యిం
దావిర్భూతుఁడ వైననీకు వనగి
ర్యధ్యక్షపాదా! మహో
దేవున్ గెల్చుట యిష్టమో! రణభువిన్
దేవేంద్ర జిన్నాగపా
శావళ్యూర్జితబంధనంబు ప్రియమో!
యాలించెదన్ దెల్పవే.

అవతారిక :— పరత్వప్రయుక్త మహిమను సర్వవిధములఁ గప్పిపుచ్చుటయు దుశ్శక మని యీశ్లోకమున నుడువుచున్నారు.

శ్లో॥ పుచ్ఛోత్పుచ్ఛన మూర్ఛనోద్ధతి ధుతవ్యావర్తి తావర్తవత్
సంవర్తార్ణవ నీరపూర విలుఠత్పాఠీన దివ్యాకృతేః।
సింహాద్రీశ ! న వైభవం తవ కథం స్యాలక్ష్య మాలక్ష్యతే
పద్మాక్షస్య జుఘుక్షతోఽపి విభవం లక్ష్మీధరాధోక్షజ ! 90

ప్రతి :— అధోక్షజ ! = ఉపాసకహృదయకమలవాసీ ! సింహాద్రీశ !=వనగిరినాథా ! లక్ష్మీధర !=(శ్రీ) మహాలక్ష్మిని ధరించిన సుందరబాహుస్వామీ !, విభవమ్ = మహిమను, జుఘుక్షతః, అపి = దాఁచఁదలఁచు చున్నప్పటికిని, పుచ్ఛ... ఆకృతేః— పుచ్ఛ=తోఁకయొక్క, ఉత్పుచ్ఛన = పైకెత్తుట, మూర్ఛన=అడ్డముగాఁ ద్రిప్పుటలయొక్క, ఉద్ధతి=వడిచేత, ధుత=కదలింపఁ బడినదియు, వ్యావర్తిత=త్రిప్పఁబడినదియు, (కనుకనే) ఆవర్తవత్ =సుడులుగల, సంవర్త, అర్ణవ=ప్రళయ సముద్రముయొక్క, నీర, పూర = జలప్రవాహమునందు, విలుఠత్ =పొర్లుచున్న (వడివడిగాఁ దిరుగుచున్న) పాఠీన= చేఁపయొక్క, దివ్య=అప్రాకృతమైన, ఆకృతేః = విగ్రహము గలట్టియు, పద్మాక్షస్య = తెల్లఁదామరలవంటి కన్నులుగల ట్టియు, తవ = నీయొక్క, స్యాలక్ష్యమ్ = చక్కఁగా నంతట సాక్షాత్కరించుకొనఁ దగిన, వైభవమ్=మహిమ, కథమ్= ఎట్లు, న, ఆలక్ష్యతే = చూడఁబడదు ? (స్పష్టముగాఁ జూడఁ బడుచున్నదని భావము.)

విశేషములు :— అధోక్ష, జ !— అధః=అంతర్ముఖము లైన (బైటికిఁబోని) అక్ష = ఇంద్రియములు గలవారు— అనఁగా— యోగులు లేదా ఉపాసకులు, వారియందు, జ= ఆవిర్భవించినవాఁడా! ఉపాసకుల హృదయకమలమున నివసించువాఁడా! యని భావము. పుచ్ఛ...ఆకృతేః— ప్రళయార్ణవ జలప్రవాహమును అల్లకల్లోలముచేయు వాలసంచలనముగల విలక్షణ మత్స్యమూర్తియొక్క— యని తాత్పర్యము.

పద్మాక్షస్య— మీనశరీరమును దాల్చినప్పుడు సైతము కన్నులు పుండరీకములఁ బోలియున్న దని భావము. వాలసంచలనముచేతఁ బ్రళయార్ణవమును సంక్షోభింపఁ జేయుటయు, మీనశరీరధారణము నందు సైతము పుండరీకములఁ బోలు కనులసోయగము గలిగి యుండుటయు, దాఁచినను దాగని భగవల్లక్షణములు.

తా॥ ఉపాసక హృదయకమలమున నివసించు లక్ష్మీపతీ! సుందరబాహుస్వామీ! నీమహిమను నీ వెంతదాఁచఁ దలఁచుచున్నను తోఁక నెత్తుట యందలి వడిచేతను అడ్డముగాఁ ద్రిప్పుటయందలి వడిచేతను కంపించి క్షోభిల్లుచు సుడులతో నొప్పుచున్న ప్రళయ సముద్రములో నవలీలగా నీఁదుచుండియుఁ బుండరీకములఁబోలు కనులనీటుగల నీ దివ్యమగు మీనశరీరము నీ లోకోత్తర మహిమను వెల్లడించు చున్నది.

శా॥ శ్రీలక్ష్మీధర! యోగిచిత్త కమలా
సీనా! వనాద్రిప్రభూ!

వాలోద్ధూనన తిర్యగీరణకళా
వై దుష్యసంక్షుబ్ధ ని
ర్వేలావర్త శతాంచిత ప్రళయ వా
ర్ధిన్ మీన మూన త్తతిన్
బోలెన్ గన్నులు తెల్లఁదమ్మి నెటు ల
బ్బున్ దాఁచ, నీచిహ్నముల్.

శ్లో॥ సాచలావట తటాకదీర్ఘికా
జాహ్నవీజల వివర్ధితః క్షయే ।
శృంగసంగమితనౌ ర్మనో రభూః
రగ్రతో౽ండజ వపు స్త్వం సుందర ! ॥ 91

ప్రతి :— సుందర ! = ఓసుందర భుజస్వామీ ! అండజ, వపుః=మత్స్యశరీరము గలవాఁడవై, సాచలా...వివర్ధితః— స, అచలా, అవట = భూగర్తముతోఁ గూడిన, తటాక= చెఱువుయొక్క, దీర్ఘికా, దిగుడుబావియొక్క, జాహ్నవీ= గంగానదియొక్కయు, జల=నీటియందు, వివర్ధితః = మిక్కిలిగాఁ బెంచఁబడిన వాఁడవై, (త్వమ్=నీవు) క్షయే=ప్రళయ కాలమందు, (ప్రళయార్ణవమందు) మనోః = మనువుయొక్క, అగ్రతః=ఎదుట, శృంగ, సంగమిత, నౌః = కొమ్మునకుఁ దగిలించుకొనఁబడిన, యోడగలవాఁడవు, అభూః, హి = అయితివి గదా !

విశేషములు :— పూర్వము మనువుతర్పణ మొనర్చుచుఁ దనకమండులువునందుఁ బుట్టి పెరుఁగుచున్న చేఁపను విశాల

మగు నొక నీటిగుంటలో వైచెను. అది యచ్చటఁ బెరిఁగి స్థలము చాలకపోఁగాఁ జెఱువులో వైచెను. అయ్యావి తన వృద్ధికిఁ జాలకపోవుటఁ జూచి క్రమముగా దీర్ఘికలోను గంగానది లోను సముద్రములోను బడవైచెను. అంతనామత్స్యము ప్రళయ సముద్రములో మనువుతోఁబాటు స్థిరచరపదార్థముల నొకయోడలో నుంచుకొని యాయోడను దన శృంగము నకుఁ దగిలించుకొని ధర్మముల నుపదేశించె నను పురాణగాథ నిట ననుసంధించుకొనవలెను. ఈ శ్లోకములోని యుత్తరార్థ మునకుఁ దాత్పర్యము. అవాంతర ప్రళయమందు సృష్టికి బీజభూతుఁడగు మనువును ఓడయం దిడుకొని యాయోడను కొమ్మువంటి యవయవమునకుఁ దగిలించుకొని మనువు నగ్ర భాగమున ధర్మోపదేశపరుఁడై మీనావతారమున శ్రీహరి ప్రళయాబ్ధిలోఁ దిరిగెను. ఈయర్థమే శ్రీరంగరాజ స్తవమున నీ క్రింది శ్లోకమున ననుసంధింపఁ బడినది.

**శ్లో॥ మీనతను స్త్వం పాపి నిభాయ**
**స్థిరచరపరికర మను మమ భగవన్ ।**
**వేదనశాఖిస్స్వోక్తివినోదై**
**రకలితలయభయలవ మము మవహః ॥**

తా॥ ఓ శ్రీసుందరభుజస్వామీ! నీవు మత్స్యశరీరమును దాల్చి క్రమముగా భూగర్తతటాకజాహ్నవీ జలములందుఁ బెరిఁగి ప్రళయపయోధిలో శృంగమున కంటఁగట్టఁబడిన యోడతో మనువున కగ్రభాగమున దర్శనమిచ్చితివి గదా!

**చ॥ మనుజలకుండఁ గన్పడి క్ర**
**మంబుగ గర్తతటాకవాపులం**

దున నలగంగఁ బెగ్గి లయ
తోయధిలో మునుగ్రమందు శ్రం
గనిగడితప్లవుండ వయి
కన్నులపండువు గాఁగఁ జేఁపరూ
పున నగపించినా వఁట న
మోనమ శ్రీవనశైలసుందరా!

శ్లో॥ ప్రళయజ నీర పూర పరిపూరిత స్వనిలయావసన్నవదన
భ్రమదశరణ్యభూతశరణార్థినాకిశరణం భవన్ స్వకృపయా।
చలదుదధీరితాంబు కలుషీక్రియాధ్యగమన స్వపృష్ఠవిధృతా
చలకుల ఏవ మీనతను రత్ర సుందరభుజో వనాద్రినిలయే॥ 92

ప్రతి :— స్వ, కృపయా = స్వతస్సిద్ధమగు దయచేత, ప్రళయ......శరణమ్— ప్రళయ=ప్రళయకాలమందు, జ = పుట్టిన, నీర =నీటియొక్క, పూర = వెల్లువచేత, పరిపూరిత= నింపఁబడిన (ఆక్రమింపఁబడిన) స్వ=సొంత, నిలయ=స్థానములు గలవారు గనుకనే, అవసన్న=ఖేదముతోఁగూడిన, వదన= మొగములు గలవారును, భ్రమత్ =(రక్షకులకొఱకు) ఇటు నటు తిరుగుచున్నవారును, అశరణ్యభూత = శరణ్యులు లేని వారును, శరణార్థి=శరణుకోరుచున్న వారును, అగు, నాకి= దేవతలకు, శరణమ్=రక్షకుఁడు, భవన్ =అగుచు, చలత్ ... గమన— చలత్ = ( తనసంచారముచేత ) కదలుచున్న, ఉదధి=సముద్రముచేత, ఈరిత=త్రోసివేయఁబడిన, అంబు= నీటియొక్క, కలుషీక్రియా = మలినము చేయుటయందు,

ఆఖ్యా=ఒప్పిదమైన, గమనః=సంచారము గలిగినట్టియు, స్వ, పృష్ఠ, విధృత, అచల, కులః = తనవీఁపుపై ధరింపఁబడిన, కొండలగుంపు గలట్టియు, మీనతనుః = మత్స్యమూర్తి, అత్ర=ఈ, వనాద్రినిలయే=వనగిరి మందిరము నందలి, ఏషః= ఈ, సుందరభుజః = సుందరబాహుమూర్తియే.

విశేషములు :— ప్రలయజ......శరణం, భవన్ — స్వత స్సిద్ధమగు దయచేత నే రక్షకాపేక్షకులగు నిట్టివేల్పులకు రక్షకుఁ డగుచు- 'ఏష మీనతను రత్ర సుందరభుజః'— ప్రళయార్ణవ నీరపూరనిమగ్నమందిరులై యతి విషణ్ణవదనులై అల్లాడు చున్న శరణాగతులగు దేవతలను రక్షించుట కొఱకు నత్తఱి నివసింపయోగ్యము లగు కొండలను వీఁపుమీఁద మోసికొని వచ్చిన యామీనవిగ్రహుఁడే సంసారార్ణవమగ్నుల మగు మనల నుద్ధరింప నిచ్చట సుందరభుజస్వామియై యున్నాఁడని యాశయము.

తా॥ ప్రళయ సముద్రములోని నీటివెల్లువలు తమ తమ నిలయములను ముంచి వేయఁగా నిలువఁ దావులేక దీనవదనులై రక్షణకొఱకు కట్టునిటు తిరుగుచున్న దిక్కులేని వేల్పులకు జాలి చేత శరణమై తన గమనవేగముచేత మున్నీటినీరు కలుషమగు నట్లు దేవతలు వసించుటకుఁ బెద్దపెద్ద కొండలను వీఁపుపై మోసి తెచ్చిన దివ్యమత్స్యరూపధరుఁ డీవనాద్రి నిలయుఁడగు సుందరభుజస్వామియే సందేహము లేదు. భక్తులమగు మనలఁ గూడ సంసారార్ణవమును దాఁటించును.

మ॥ ప్రళయాంభోనిధి నీటివెల్లువలు ముం
పన్ స్థానవిభ్రష్టులై,
కలఁతన్ బొఱుచు దిక్కుగోరు సురలన్
గాపాడ వా రుంటకై
జలధిన్ క్షోభిలఁ జేయు శీఘ్రగతితో
శైలంబులన్ వీఁపుపై
సులు వొప్పన్ గొనివచ్చు విహానశుభ వే
షుం డీ వనాద్రీశుఁడే.

శ్లో॥ స్వపృష్ఠే ప్రస్థాద్రిభ్రమణకరణైః కించ ఫణినో
వికృష్టి వ్యాకృష్టి వ్యతివిధుతదుగ్ధాబ్ధి చలితైః।
అవిస్పందో నందన్ వికసదరవిందేక్షణరుచిః
పురాఽభూత్ సింహాద్రేః ప్రియతమ హరే కచ్ఛపవపుః॥ 93

ప్రతి :— సింహాద్రేః = వనగిరికి, ప్రియతమ ! = మిక్కిలి ప్రియుఁడవగు, (హే) హరే = ఓ సుందరభుజస్వామి! పురా = పూర్వకాలమున, స్వపృష్ఠే = తనవీఁపుమీఁది, ప్రస్థ, అద్రి, భ్రమణ, కరణైః = శ్రేష్ఠమగు మందరాద్రిని త్రిప్పుటలచేతను, కించ = మఱియు, ఫణినః = (కవ్వపుఁ త్రాడుగానున్న) వాసుకి యను సర్పముయొక్క, వికృష్టి.....చలితైః— వికృష్టి = ముందుకు లాగుటచేతను, వ్యాకృష్టి = వెనుకకు విడుచుట చేతను, వ్యతివిధుత = మిక్కిలి కంపింపఁజేయఁబడిన, దుగ్ధాబ్ధి = పాలసముద్రముయొక్క, చలితైః = కదలికలచేతను, అవిస్పందః = ఏమాత్రమును చలింపనివాఁడవై, నందన్ = సంతోసించుచు వికసత్, అరవింద, ఈక్షణ, రుచిః = విచ్చిన పద్మములవంటి

కన్నులకాంతిగల, కచ్ఛపవపుః = తాఁబేలు శరీరము కల వాఁడవు, అభూః = అయితివి.

విశేషములు :— అవిస్పందః— తనవీఁపుమీఁద మందరా చలమునుంచి త్రిప్పుటలచేతఁ దనకును దిరుగుడు సంభవింప వచ్చును, మంథనాచల నిమిత్తము కవ్వపుఁద్రాడైన వాసుకి చేతఁ జిలుకుటవలన మిక్కిలి కల్లోలితమగు సముద్రపు నీటి చేతను తనకుఁ గదలిక సంభవింపవచ్చును. అట్టి కారణము లున్నను కదలనివాఁడై యుండుట కూర్మరూపియగు శ్రీహరి యొక్క స్థైర్యమును జాటుచున్నది. నందన్— సమాశ్రిత సంరక్షణక్షమునకుఁ గూడ భారలాభముచేత నతిప్రీతి కలుగు నని భావము. తన శరీరమునకుఁ గ్లేశము కలిగినను భక్తజను లను రక్షించుట యను లాభము చేకూరినందుల కానందించుచు అని సారాంశము.

తా॥ వనశైలవల్లభా ! ఓ సుందరబాహుస్వామీ! శ్రీహరీ! నీవు నీ వీఁపుపై శ్రేష్ఠమగు మందరపర్వతమునుంచి గిరగిర త్రిప్పినను, కవ్వపుఁ దాడుగానున్న వాసుకిని ఒకవైపు దేవత లొకవైపు రాక్షసులు నిలిచి యటునిటు లాగఁగా మిక్కిలి క్షోభిల్లిన పాలసముద్రమునీటి కదలికలచేతను ఏమాత్రము కదలనివాఁడవై ఆశ్రితసంరక్షణ భారమనెడు లాభము దొరకి నందులకు ఆనందించుచు ఆ యానందమును విచ్చిన తామరల వంటి కన్నులకాంతితోఁ జాటుచుఁ బూర్వము కూర్మరూపుఁడ వైతివి గదా!

సంసారమగ్నుల మగు మమ్ముఁ గూడ నుద్ధరింపుమని కవి ధ్వనింపఁజేయు చున్నాఁడు. 'దంష్ట్రాహ్వాయేందోః కిల లక్ష్మ లక్షితా'— దంష్ట్ర యనెడు చంద్రునకు భూమి మచ్చగా నున్న దనుటచేత శ్రీ వరాహమూర్తివారి విగ్రహమంత లోకోత్తరమైనదని భావము.

తా॥ వనగిరినాథుండవగు శ్రీ సుందరభుజస్వామీ! నీవు పూర్వము ప్రళయ సముద్రములో మునిఁగిపోయిన లోకము నుద్ధరింపఁ దలఁచి వరాహమూర్తివిగా నవతరించినప్పుడు నీ దంష్ట్రయందు నొప్పెసంగిన భూదేవి చంద్రునందు మచ్చవలెఁ గానవచ్చిన దఁట. అట్టిచో నీ దివ్యవిగ్రహముయొక్క యున్నతి నెవఁడు వర్ణింపఁ గలఁడు.

సీ॥ ప్రళయవార్ధి నిమగ్న ప్రపంచ ముద్ధ
రింపఁ దలఁచి వరాహమూర్తిని గ్రహించు
నీదు కోఱను వనగిరినేత! భూమి
చందురునియందుఁ గలమచ్చ చాయఁ దోఁచె.

శ్లో॥ న వాయుః పస్పందే యయతు రథవా స్తం శశిరవీ
దిశోఽనశ్యన్ విశ్వా ప్యచల దచలా సాచలకులా।
నభ శ్చ ప్రశ్చ్యోతి క్ష్వేళిత మపి పాథో నరహరౌ
త్వయి స్తంభే శుంభద్వపుషి సతి హే సుందరభుజ!॥ 95

ప్రతి :— హే సుందరభుజ! = ఓ సుందరభుజస్వామీ! నరహరౌ = నరసింహమూర్తివగు, త్వయి = నీవు, స్తంభే = (హిరణ్యకశిపుని దర్బారులోని) స్తంభమునందు, శుంభత్,

వపుషిసతి=శోభమాన మగు శరీరము గలవాఁడవు కాఁగా, వాయుః=గాలి, న, పస్పందే=కొంచెమైనను గదలలేదు, (భయముచేత) అథవా=తరువాత, శశిరవీ=చంద్రసూర్యులు, అస్తం, యయతుః = అస్తమించిరఁట, దిశః=దిక్కులు, అనశ్యన్=నశించినవి (ఇది తూర్పు, ఇది పడమర యని తెలిసి కొన వీలుగా లేదు) నాచలకులా = పర్వత సమూహముతోఁ గూడిన, విశ్వా = సమస్తమైన, అచలా, అపి = భూమియు, అచలత్=కంపించెను, నభః, చ=ఆకాశముగూడ, ప్రచ్యోతి =మిక్కిలి జాఱిపోయినది, పాథః అపి=సముద్రములోని నీరు కూడ, క్వథితమ్=సలసల తెర్లినది.

విశేషములు :— న వాయుః పస్పందే— శ్రీనరసింహ విగ్రహదర్శన జనితభయముచేత గాడ్పుకొంచెమును కదల లేదు. అచల దచలా– భూమి యచల యయ్యుఁ జలించెను. నరసింహదర్శన భయముచేత వ్యుత్పత్తికి విరుద్ధముగాఁ బ్రవర్తించిన దని భావము. క్వథితమపి పాథః— ఉష్ణత్వాతి శయముచే సముద్రోదకము గూడ సలసల మసలిపోయెను. ప్రహ్లాదప్రతిపక్షశిక్షణమునకై ప్రాదుర్భవించుచున్న నరసింహ విగ్రహసాక్షాత్కారక్షమము లైన పంచభూతముల యొక్క వేగిరపాటిందు వర్ణింపఁబడినది.

తా॥ ఓ సుందరబాహుమూర్తీ ! నరసింహమూర్తి వగు నీవు హిరణ్యకశిపుని సభాస్తంభమున శోభమాన శరీరము గలవాఁడవయి యావిర్భవించు చుండఁగా భయముచే గాలి

యించుకయుఁ గదలలేదు. సూర్యచంద్రు లస్తంగతులైరి. దిక్కులు మాసినవి. చలింపమిచేత నచల యని ప్రఖ్యాతిఁ గాంచిన భూమియుఁ గులాచలములతోఁ గూడఁ గంపించెను. మిన్నుపడెను. సముద్రోదకము సలసల మసలి పోయెను. ఒకవేళ సమస్త ప్రకృతియు భయగ్రస్తమై తాఱుమాఱాయెను.

మ॥ అరికుంభీంద్రముఁ జీల్చి భక్తవరుఁ బ్ర
హ్లాదున్ గటాక్షింపఁగా
నరసింహాకృతి నీవు స్తంభమునఁ గ
న్పట్టంగ గా ద్వాడ ద
ద్దిర! చంద్రారుణు లస్తమించిరి దెసల్
దీపింప వంభోనిధుల్
తెరలెన్ మిన్ను వడెన్ వడంకె మహి సా
ద్రిక్ష్మాజ యై సుందరా!

అవతారిక :— పై విషయమునే వివరించు చున్నారు.

శ్లో॥ అరాళం పాతాళం త్రిదశనిలయః ప్రాపితలయో
ధరిత్రీ నిర్ధూతాయయు రపి దిశః కా మపి దిశమ్।
అజృంభి ష్టాంభోధి ‘ర్ఘుముఘు’ మితి ఘూర్ణన్ సురరిపో
ర్వింభిదానే వక్షస్త్వయి నరహరౌ సుందరభుజ! ॥ 96

ప్రతి :— హేసుందరభుజ! = ఓ సుందరబాహుస్వామీ! నరహరౌ = నరసింహమూర్తి వగు, త్వయి = నీవు, సురరిపోః = దేవవైరియగు హిరణ్యకశిపుని యొక్క, వక్షః = ఱొమ్మును,

విభిందానే (సతి) చీల్చివేయుచుండఁగా, పాతాళమ్=పాతాళ లోకము, అరాళమ్=వక్రమైనది (ఆసీత్=ఆయెను) త్రిదశ నిలయః = స్వర్గము (వేల్పులనివాసము), ప్రాపితలయః = పొందింపఁబడిన నాశనముగలది, (అభూత్=ఆయెను) ధరిత్రీ= భూమి, నిర్ధూతా = మిక్కిలి వణఁకెను, దిశః = దిక్కులు. కాం అపి=ఒకానొక, దిశమ్=విధమును, యయుః=పొందినవి, అంభోధిః=సముద్రము, ఘుముఘుమ్, ఇతి=ఘుముఘుమ్మని, ఘూర్ణన్=ధ్వనించుచు, అజృంభిష్ట = విజృంభించెను.

విశేషములు :— అరాళమ్— వ్యత్యస్తము అనఁగా ప్రకృతికిఁ దలక్రిందు. యయు రపి దిశః కా మపి దిశమ్— దిక్కులు కూడ నేదోయొక దిక్కును పొందె ననఁగా అంతర్హితము లాయె నని భావము.

తా॥ ఓ సుందరబాహుమూర్తి! నీవు నరసింహావతార మెత్తి ప్రబలశత్రువగు హిరణ్యకశిపుని వక్షఃస్థలమును వ్రచ్చుచుండఁగా నాభయంకర దృశ్యమునకుఁ బాతాళ మరాళ మాయెను, త్రిదశనిలయము లయమును బొందెను, వసుధ వడవడ వడఁకెను, దిక్కులు తబ్బిబ్బాయెను, సముద్రములు ఘుముఘుముఘు మ్మని నినాద మొనర్చుచుఁ బొంగి పోయెనఁట.

మ॥ అలపాతాళ మరాళ మాయె నిలయం
బాయెన్ సుపర్వాలయం
బిల యెంతేని వణంకె నందె దిశలున్
హీనాతిహీనన్ దశన్

చెలరేఁగెన్ ఘుమఘుమ్మటించు జలధుల్
శ్రీమన్నృసింహాండ పై
బలి సోదైత్యు నురమ్ము వ్రచ్చుతఱి శుం
భత్స్ఫూర్తి వనాద్రీశ్వరా!

శ్లో॥ నఖ క్రకచ ప్రఘ క్రథిత దైత్యవక్షఃస్థలీ
సముత్థ రుధిరచ్ఛటాచ్ఛురిత బింబితం స్వం వపుః।
విలోక్య రుషితః పునః ప్రతిమృగేంద్ర శంకావశాత్
య ఏష నరకేసరీ స ఇహ దృశ్యతే సుందరః॥ 97

ప్రతి :— నఖ.....బింబితమ్ — నఖ = గోరనెడు, క్రకచ = రంపము యొక్క, ప్రఘ = అంచుచేత, క్రథిత = చీల్చఁబడిన, దైత్య = రాక్షసుని యొక్క, (హిరణ్యకశిపుని యొక్క) వక్షఃస్థలీ = రొమ్ము ప్రదేశమునుండి, సముత్థ = బయలు దేఱిన, రుధిర = నెత్తుటి యొక్క, ఛటా = సమూహముచేత (ప్రవాహముచేత) ఛురిత = ప్రసక్తమై, బింబితమ్ = ప్రతిబింబించిన, స్వమ్ = స్వకీయ మగు, వపుః = శరీరమును, విలోక్య = చూచి, యః = ఏ, నరకేసరీ = నరసింహమూర్తి, ప్రతిమృగేంద్రశంకావశాత్ = ప్రతిభటుఁడగు సింహము యొక్క శంకవలన, పునః = మఱల, రుషితః = రోషము కలవాఁడాయెనో, సః = ఆనరసింహమూర్తియే, ఇహ = ఇక్కడ, (ఈవనాద్రియందు) సుందరః = సుందరభుజస్వామిగా, దృశ్యతే = చూడఁబడుచున్నాఁడు.

విశేషములు :— ప్రతిమృగేంద్ర శంకావశాత్ — ఇది మఱల స్వామివారికి రోష మొదవుటకుఁ గారణముగాఁ

చేర్కొనఁ బడినది. సర్వజ్ఞుఁడగు నరకేసరి శత్రురక్తపూర ప్రతిబింబిత మగు తన విగ్రహమును సింహాంతరముగాఁ దలఁచుట మృగస్వభావోక్తిగా భావింపవలెను. 'స ఇహ దృశ్యతే సుందరః'— ఆనాఁడు భక్తద్వేషి యగు హిరణ్యకశిపుని వ్రచ్చిన నరకేసరియే యిచ్చట సుందరబాహుమూర్తియై ఆశ్రితద్వేషి నిరసనమునకు బద్ధకంకణుఁడై యున్నాఁడని భావము.

తా॥ గోళ్ళనెడు అంపములకొనలతోఁ జీల్చివేయఁబడిన హిరణ్యకశిపుని ఱొమ్మునుండి దొరలిన రక్తప్రవాహము నందు సంక్రాంతమై ప్రతిబింబించిన తన దేహమునే చూచి మృగేంద్ర స్వభావానుగుణముగా మఱియొక సింహమని శంకించి యేనరసింహమూర్తి మఱల రోషించెనో యా నర సింహుఁడే ఈ వనాద్రియందు నిజాశ్రితద్వేషుల నణఁచ బద్ధకంక ణుఁడై సుందరభుజ రూపముతో నున్నాఁడు.

చ॥ శిత నఖరాంచలక్రకచ
శృంగ విదారితదైత్యరాడుర
శ్చ్యుత రుధిరప్రపూర పరి
శోభినిజాకృతిఁ బాఱఁ జూచి లోఁ
బ్రతిమృగ రాణ్మతిన్ మఱల
ఘాలనటద్భ్రుకుటీకుఁడైన శ్రీ
పతి యలనారసింహుఁ డిట
భాసిలు సుందరబాహునాముఁడై.

శ్లో॥ క్షితి రియం జనిసంహృతిపాలనై
ర్నిగిరణోద్గిరణోద్ధరణై రపి ।
వనగిరీశ! త వైవ సతీ కథం
వరద! వామన! భిక్షణ మర్హతి ॥ 99

ప్రతి :— (హే) వరద!=అందఱికి నన్ని వరముల నిచ్చువాఁడా!, వామన! = వామనరూపధారీ! వనగిరి, ఈశ!= వనగిరినాథుఁడు వగు సుందరభుజస్వామీ! జని, సంహృతి, పాలనైః=సృష్టిసంహార, రక్షణములచేతను, నిగిరణ, ఉద్గిరణ, ఉద్ధరణైః, అపి=మ్రింగుట, క్రక్కుట, ఉద్ధరించుటలచేతఁ గూడ, తవ, ఏవ=నీకే, సతీ=భార్య (ద్రవ్యభూత) అగు, ఇయమ్= ఈ, క్షితిః=భూమి, కథం వా=ఎట్లుగా, భిక్షణమ్=భిక్షను (ఒకరివలన యాచించుటను గూర్చి) అర్హతి = యోగ్యమగు చున్నది.

విశేషములు :— వామన!— బలిచక్రవర్తి యొద్ద నుండి మూఁడడుగుల నేల నడుగుట కొఱకు స్వీకరింపఁబడిన వామన వేషము గలవాఁడా! 'నిగిరణోద్గిరణోద్ధరణైః' — నిగిరణ మనఁగాఁ బ్రళయమునందు స్వకుక్షిలో నిడుకొనుట, ఉద్గిరణ మనఁగా, సముద్రమధ్యము నుండి లేవనెత్తుట వీనిచేత 'తవైవ సతీ కథం వరద వామన భిక్షణ మర్హతి'— వామన రూపి వగునో దేవా! పరద్రవ్యముగదా బిచ్చమెత్తఁ దగినది పై కారణములచేత నీద్రవ్యమేయైన భూమి నెందులకు బిచ్చ మెత్తితివి? (సశేషము)

నీ వామనవృత్తాంతముచేత నాశ్రితుల కష్టతగులు వారికిఁ గూడ మేలుకలిగింపవలసి వచ్చినపుడు తదనుగుణముగా నవత రించి వారల మందలించుట శ్రీవారి కభిమతమని తెలియు చున్నది. సత్పాత్రుఁడవగు నీకు మూఁడడుగులనేల నిచ్చుట చేతనే గదా బలి పాతాళలోకమునకుఁ జక్రవర్తి యయ్యెను.

తా॥ వరదా! వామనరూపి వగు శ్రీ సుందరబాహు దేవా! సృష్టిసంహార రక్షణములచేతను, ప్రళయమునఁ బొట్టలో నిడుకొని సృష్టికాలమున బైటికిఁబంపి సముద్రమునుండి లేవ నెత్తి కాపాడుటచేతను ఈభూమి నీసతియు సొత్తునై యుండ దీనిని బలిచక్రవర్తి నుండి బిచ్చమెత్తుట యెట్లు పొసంగును పరద్రవ్యమును గదా! లోకమున బిచ్చమెత్తుదురు !

గీ॥ జనన సంహారరక్షణ సర్వవిధుల
నిగిరణోద్గిరణోద్ధార నియమములను
నేల నీభార్య భిక్షింప నేల బలిని?
వామనాకార! వరద! శ్రీవనగిరీశ!

శ్లో॥ భార్గవః కిల భవన్ భవాన్ పురా
కుంద సుందరవనాచలేశ్వర!
అర్జునస్య బలదర్పితస్య తు
చ్ఛేత్స్యతి స్మరతి బాహుకాననమ్ ॥ 99

ప్రతి :— (హే) కుందసుందర వనాచల, ఈశ్వర ! = మల్లెలచేత నందమగు వనగిరికిఁ బ్రభువవగు ఓ సుందరభుజ స్వామీ !, పురా, కిల=పూర్వము, భార్గవః=పరశురాముఁడవు, భవన్ = అగుచు, భవాన్=నీవు, బల, దర్పితస్య = బాహుబలముచేత గర్వితుఁడగు, అర్జునస్య = కార్తవీర్యార్జునునియొక్క, బాహుకాననం, తు = వనమునుబోలు వేయి బాహువులను, ఛేత్స్యతి = ఛేదించితివి, స్మరతి? = జ్ఞప్తి యున్నదా ?

విశేషములు :— ఛేత్స్యతి స్మరతి బాహుకాననమ్— అనేక క్షత్త్రియయూథముల సంహరించుటకంటెను బాహు బల దర్పితుఁడగు కార్తవీర్యార్జుని బాహుకాననమును ఛేదించుట యతి దుష్కరమని భావము.

తా॥ మల్లెతీఁగలచే నందమగు వనాద్రికి నాథుఁడవగు శ్రీ సుందరభుజస్వామీ ! పూర్వము శ్రీవారు పరశురామావతారమెత్తి బాహుబల గర్వితుఁడగు కార్తవీర్యార్జుని బాహు కాననమును ఛేదించిన విషయము జ్ఞప్తియున్నదా ?

ఉ॥ కుందమనోజ్ఞ వల్లరుల
కున్ నెల వౌవనశైల మేలునో
సుందరబాహుమూర్తి ! గుణ
శోభిత ! మున్ జమదగ్ని పట్టివై
తందర లేక బాహుబల
దర్పితుఁడౌ కృతవీర్యపుత్రుని

ష్పంద భుజాటవిన్ నటికి
వైచితి గొడ్డట జ్ఞప్తి యున్న దే.

శ్లో॥ ఆజ్ఞా తవాత్ర భవతీ విదితా త్రయీ సా
ధర్మం తదుక్త మఖిలేన వనాద్రినాథ!
అన్యూన మాచరితు మాస్తికశిక్షణార్థ
మత్రావతీర్య కిల సుందర! రాఘవోఽభూః॥ 100

ప్రతి :— వనాద్రి, నాథ ! = వనగిరిప్రభువు వగు, సుందర! = సుందభుజస్వామీ !, అత్రభవతీ = పూజనీయయగు, సా = ఆ, త్రయీ = వేదత్రయము, తవ = నీయొక్క, ఆజ్ఞా = ఆజ్ఞగా, విదితా = ప్రసిద్ధమైనది, తత్, ఉక్తమ్ = ఆవేదత్రయమందుఁ జెప్పఁబడిన, ధర్మమ్ = ధర్మమును, ఆస్తిక, శిక్షణార్థమ్ = శాస్త్రవశ్యుల శిక్షకొఱకు, అఖిలేన = ఖిలముగాకుండ, అన్యూనమ్ = అంగవైకల్యము లేకుండ, ఆచరితుమ్ = ఆచరించుటకు, అత్ర = ఇచ్చట (అయోధ్యయందు) అవతీర్య = అవతరించి, రాఘవః = రాముఁడవు, అభూః, కిల = అయితివఁట.

విశేషములు :— అత్రభవతీ— ఈశబ్దము పూజ్యార్థకము. ప్రమాణము లన్నింటిలో 'త్రయి' శ్రేష్ఠమైనది గనుకఁ బూజ్య యని చెప్పఁబడెను. 'త్రయీ'— ఋగ్యజుస్సామ వేదములకుఁ గలిపి త్రయి యని పేరు. ఆస్తికశిక్షణార్థమ్— వేదములు దురవగాహములు గనుక వానిచేఁ జెప్పఁబడిన ధర్మము లందఱికిఁ దెలియక పోవుటవల్లన నవి ఖిలముగాకుండ అంగ వైకల్యము లేకుండ నాచరించి చూపి యాస్తికులకు శిక్ష యొసంగుటకు, 'అత్రావతీర్య కిల సుందర రాఘవోఽభూః'—

'రామో విగ్రహవాన్ ధర్మః' అన్నట్లు పితృవచన పరిపాలన, శరణాగత సంరక్షణాది సకలధర్మ వ్యవస్థాపకుఁడవై రాముఁడని ప్రసిద్ధిఁ బొందితివి.

తా॥ వనగిరినాథుఁడ వగు ఓ సుందరబాహుమూర్తీ ప్రమాణోత్తమముగాఁ బూజనీయమగు వేదత్రయి దేవర వారి యాజ్ఞగాఁ బ్రసిద్ధి కెక్కినది. దానిచేఁ జెప్పఁబడిన ధర్మము ఖిలముగాకుండ సంగలోపము లేకుండ నెల్లరు నాచరించుటకు ఆస్తిక మహాశయులకు శిక్షణ మొసంగుటకు 'రామో విగ్రహవాన్ ధర్మః' అన్నట్లు నీవు శ్రీరాముఁడవై యవతరించి యాచరించి చూపితివి.

ఉ॥ పూజిత వేదవాక్కు వన
భూధర భూషణ ! తావకాజ్ఞగా
భూజను లెన్నుచుందు రటఁ
బొల్చెడు ధర్మము నార్యశిక్షకై
యీ జగమందు నీవు జని
యించి యథావిధి నాచరించుచున్
రాజకులావతంస మగు
రాముఁడ వైతివి ధర్మమో ! యనన్.

శ్లో॥ వనగిరిపతి రీశ శ్శేతి దేవ
త్రిపురహర త్రిపురఘ్న చాపభంగాత్ ।
వ్యగజే పరశురామ దర్శితస్య
స్వకధనుషః పరిమర్శదర్శనాచ్చ ॥

ప్రతి :— దేవైః = దేవతలచేత, త్రిపురహర, త్రిపురఘ్న, చాప, భంగాత్ =రుద్రునియొక్క, త్రిపురసంహార మొనర్చిన ధనుస్సును విఱుచుటవలనను, పరశురామ దర్శితస్య=పరశురామునిచేతఁ జూపఁబడిన, స్వకధనుషః=స్వీయమగు వైష్ణవ ధనుస్సుయొక్క, పరిమర్శ, దర్శనాత్, చ = అవలీలగా నెక్కిడుటను జూచుటవలనను, వనగిరిపతిః = వనాద్రినాథుఁడగు సుందరభుజస్వామి, ఈశితా = సర్వేశ్వరుఁడు, ఇతి = అని, వ్యగణి = పరిగణింపఁ బడినది (నిర్ణయింపఁ బడినది)

విశేషములు :— 'త్రిపురహార త్రిపురఘ్న చాప భంగాత్'— ఈశ్వరుఁడు త్రిపురసంహార మొనర్చిన వింటిని భక్తుఁడగు జనకుని కొసఁగెను. ఆమహారాజు సీతాపరిణయ పరిపణమునుగా నాధనుస్సు నేర్పాటు చేసెను. శ్రీరాముఁడు దాని నవలీలగా విఱిచెను. ఈ కథ నిట ననుసంధించుకొన వలెను. 'వనగిరిపతి రీశి తేతి దేవైః (వ్యగణి) శ్రీరాముఁడు 'ఆత్మానం మానుమం మన్యే రామం దశరథాత్మజమ్' అని నిజమాహాత్మ్యము నెంతదాఁచఁ దలఁచినను అది శివ ధనుర్భంగము వలనను, పరశురాముని వైష్ణవధనుస్సు నెక్కు పెట్టుట వలనను, దెల్ల మయ్యెనని భావము.

తా॥ వనగిరినాథుఁడగు సుందరబాహుమూర్తి శ్రీరాముఁడుగా నవతరించి తా నెంతగా మానవత్వము నభినయింపఁ జూచినను త్రిపురసంహార మొనర్చిన శివునివిల్లు విఱుచుట వలనను, పరశురామదత్త మగు వైష్ణవధనుస్సు నవలీలగా

నెక్కు పెట్టుటచేతను వేల్పులు పరాత్పరుఁడగు సర్వేశ్వ
రునిగా నిర్ణయించిరి.

చ॥ వనగిరినాథుఁ డిందు రఘు
వల్లభుఁడై జనియించి యెంతగా
మనుజతఁ జాట నెంచిన న
మర్త్యు లెఱింగిరి తత్పరత్వమున్
దనియలు సేయుటన్ మొదల
ధూర్జటి చాపము, 'నెక్కు పెట్టు మీ
ధను'వని భార్గవుం డొసఁగఁ
దత్ క్షణమే హరివిల్లు వంచుటన్.

శ్లో॥ అనవాప్త మత్ర కిల లిప్స్యతే జనై
ర్నచ లబ్ధ మేత దిహ భోక్తు మిష్యతే।
అనవాప్త మత్ర కిల నాస్తి రామ! త
జ్జగతీ త్వయా తృణమవైక్షి సుందర!॥ 102

ప్రతి :— (హే) రామ! సుందర! = (శ్రీ) రాముఁడవుగా
నవతరించినయో సుందరబాహుమూర్తీ! అత్ర=ఈలోకమున,
జనైః = జనులచేత, అనవాప్తం, కిల = పొందఁబడనిది
గదా, భోక్తుమ్=అనుభవించుటకు, లిప్స్యతే = కోరఁదలఁచఁ
బడుచున్నది. ఇహ = ఇక్కడ, భోక్తుమ్ = భుజించుటకు,
లబ్ధమ్ = పొందఁబడిన, ఏతత్ = ఈవస్తువు, (ఈ వాంఛిత
వస్తువు) న చ, ఇష్యతే=ఇష్టముకాదు, అత్ర=ఈలోకము
నందు, అనవాప్తమ్ = పొందఁబడనిది, నాస్తి కిల = లేదు

గదా, తత్ = అందువలన (అవాప్తసమస్త కాముఁడవు గనుక) త్వయా = నీచేత, జగతీ = భూమి, తృణమ్ = గడ్డి పఱకగా, అవైక్షి = చూడఁబడినది.

విశేషములు :— 'నచ లబ్ధ మేత దిహ భోక్తు మిష్యతే'— లబ్ధమగు వస్తువు ననుభవించుట కిష్ట ముండదు. సిద్ధవస్తువు కనుక, తృణ మవైక్షి— గడ్డిపఱకవలె నల్పముగాఁ జూడఁ బడినది. ఉభయ విభూతి నాయకుఁడవగు నీకు ఇక్ష్వాకు రాజ్య మత్యల్పముగాఁ దోఁచినది. లేకున్నచో రాజ్యమును వీడుట సంభవింపదు.

తా॥ శ్రీరాముఁడవుగా నవతరించిన యో సుందరబాహు మూర్తి! ఈలోకమున జనులు లభించని వస్తువు ననుభవింపఁ గోరుదురు. కోరఁబడిన యీ వస్తువు లభించెనేని సిద్ధమగుటచే దానియందు నిష్టముండదు. అవాప్త సమస్తకాముఁడవగు నీ కిక్కడ ననవాప్త మేదియు లేదు. కనుక నుభయవిభూతి నాయ కుఁడవగు నీకు భూమి (కోసలరాజ్యము) గడ్డిపఱకగాఁ దోఁచినది.

ఉ. రాముఁడవై జనించిన ప
రాత్పర! సుందరబాహుమూర్తి! దే
వా! మహిఁ గోరుచుందు రన
వాప్తము నద్ది లభింపఁ దానిపైఁ
బ్రేమము వోవుఁ జెంతఁ గని
పించుట నీకు ననాప్త మున్నదే?

కోమలదేహా! దానఁ గద!
కోసలలక్ష్మి తృణంబు నీమదిన్.

శ్లో॥ శిఖరిషు విపినేష్వ ప్యాపగా స్వచ్ఛతోయా
స్వనుభవసి రసజ్ఞో దండకారణ్యవాసాన్ ।
త దిహ తదనుభూతౌ సాభిలాషోఽద్య రామ!
శ్రయసి వనగిరీంద్రం సుందరీభూయ భూయః ॥ 203

ప్రతి :— (హే) రామ! = ఓరాముఁడ!, రసజ్ఞః = రసికుఁడవగు నీవు, శిఖరిషు=చిత్రకూటాది పర్వతములందును, విపినేషు = వనములందు, అచ్ఛతోయాసు = నిర్మలములగు నీరుగల, ఆపగాసు, అపి = నదులయందును, దండకారణ్యవాసాన్ = దండకావనము నందలి నివాససుఖములను, అనుభవసి=అనుభవించు చున్నావు, తత్ = అందువలన, తత్ + అనుభూతౌ = వానిని (కొండలను, అడవులను, నదులను) అనుభవించుటయందు, సాభిలాషః = కోరికతోఁ గూడిన వాఁడవగుచు, ఇహ = ఈ జగత్తునందు, అద్య=ఇప్పుడు, భూయః=మఱల, (రామావతారానంతరము కూడ) సుందరీభూయ = సుందరభుజస్వామి వయి వనగిరీంద్రమ్ = నూపురాపగతో నొప్పు వనశైలరాజమును, ఆశ్రయసి = ఆశ్రయించు చున్నావు.

విశేషములు :—'అనుభవసి రసజ్ఞో దండకారణ్యవాసాన్' శ్రీరామా! నీరసికత్వము లోకోత్తరము. దండకావనవాసమును సుఖకరముగా ననుభవించితివి. ఇటఁ గొండలయందు

వనములందు నిర్మలతోయములుగల నదులందు విహరించితివి గాని శ్రమపడలేదు. వనవాసమును సుఖముగా మార్చుకొన్న నీవే రసికుఁడవు. ఇందులకుఁ బ్రమాణము – శ్రీమద్రామాయణమున—

శ్లో॥ చిత్రకూట మనుప్రాప్య భరద్వాజస్య శాసనాత్
రమ్య మావసథం కృత్వా రమమాణా వనే త్రయః
దేవగంధర్వ సంకాశా స్తత్ర తే న్యవసన్ సుఖమ్ ॥

అనుభవసి :— 'చిరనిర్వృత్త మ ప్యేతత్ ప్రత్యక్ష మివ దర్శితమ్'— చాలకాలము క్రింద ననుభవింపఁ బడినదికూడఁ గళ్ళకుఁ గట్టినట్లు వర్ణించుటవలన వర్తమానకాల క్రియ యుపయోగింపఁ బడినది. తదనుభూతౌ సాభిలాషః— శిఖరివిపిన స్రవంతీ సుఖానుభవమునఁ గోరిక గలవాఁడవై. 'అద్య'— వర్తమానకాలమున— 'భూయః'— మఱల – రామావతారానంతరముకూడ. 'శ్రయసి వనగిరీంద్రం సుందరీభూయ'— శ్రీరాముఁడు నాఁడు చిత్రకూటము నాశ్రయించినట్లు సుందబాహుమూర్తీ ! నీవు నేఁడు వనగిరిరాజము నాశ్రయించు చున్నావని భావము. 'సుభగ శ్చిత్రకూటోఽసౌ ! గిరిరాజోపమో గిరిః యస్మిన్ వసతి కాకుత్స్థః కుబేర ఇవ నందనే' అని వర్ణింపఁ బడిన చిత్రకూట పర్వతముతో ఈవనశైలము సమానమని సారాంశము.

తా॥ శ్రీరామా ! నీ వెంతయు రసికుఁడవు. చిత్రకూటాది పర్వతములందు, వాని యనుబంధులగు వనములందు, మాల్య

వంతము నందలి నిర్మలోదకములగు మందాకినీ పంపాదినదుల యందును విహరించుచు దండకారణ్యావాసము సుఖరూపముగా మార్చుకొనినావు. అందువలన నిచ్చట నాయనుభూతియం దభిలాషతో రామావతారానంతము గూడ మఱల సుందర భుజస్వామివై నూపురాపగతో నొప్పు వనగిరిరాజము నాశ్రయించు చున్నావు.

శా. రామా! నీవు రసజ్ఞ శేఖరుఁడ వౌ
రా! కొండలన్ గానలన్
భూమీహారనిభంబులౌ తటినులన్
భోగించి తో దండకన్
నేమం బొప్ప వసించునాళ్ళ సుఖ మా
నెయ్యంబుఁ బాయంగ లే
కేమీ చేరితి సుందరుండ వయి నేఁ
డీకాననాహార్యమున్.

అవతారిక :— దండకావనవాస మొక్కొక్కచోట శ్రమ విశేషమును గలిగించినది. వనగిరినివాస మట్టి శ్రమలను హరించినది యని చెప్పుచున్నారు.

శ్లో॥ ఉపవనతరుషండై ర్మండితే గండశైల
ప్రణయిభవదుదంతో ద్గాయిగంధర్వసిద్ధే।
వనగిరితట భూమిప్రస్తరే సుందర! త్వం
భజసి స మృగయానాసుద్రవ శ్రాంతిశాంతిమ్॥ 105

ప్రతి :— హే సుందర ! = ఓ సుందరబాహుమూర్తీ ! ఉపవన, తరు, షండైః = ఉద్యానవనము నందలి చెట్లగుబురుల చేత, మండితే = అలంకరింపఁ బడినట్టియు, గండ......సిద్ధే— గండశైల = కొండలనుండి జాఱిపడిన పెద్దబండలయందు, ప్రణాయి = ప్రేమగలిగి నట్టియు, భవత్ = తమయొక్క, ఉదంత = చరితమును, ఉత్, గాయి = పెద్దగా గానముచేయు స్వభావముగల, గంధర్వసిద్ధే = గంధర్వులు సిద్ధులు గలిగి నట్టియు, వనగిరి, తట, భూమి, ప్రస్తరే = వన్యశైలముయొక్క సానుతలసన్నిహిత శిలయందు, త్వమ్ = నీవు, మృగ......... శాంతిమ్— మృగ = మాయ లేడియొక్క, యాన = గమనమును, అనుద్రవ = అనుసరించి పరుగెత్తుటవలని, శ్రాంతి = అలుపు యొక్క, శాంతిమ్ = తీర్చుకొనుటను, భజసి, ను = పొందు చున్నావో ! యన్నట్లున్నావు.

విశేషములు :— ఇందలి యుత్తరార్థము సారాంశమిది. ఓ సుందరభుజస్వామీ ! నీవు రామావతారమునఁ గాంతార వాసమున మాయలేడివెంబడి పరువెత్తినందు వలనఁ గలిగిన శ్రమను సిద్ధగంధర్వగాన మనోహరమగు వనాద్రితటమునఁ దీర్చుకొనుచున్నట్లున్నావు. దండకారణ్యావాసమున మృగాను ధావనశ్రమను వనాద్రి పోఁగొట్టిన దనుటచే వనగిరి యతి శయము వెల్లడి యగుచున్నది. భజసిను— ఇందలి 'ను' అను నవ్యయము ఉత్ప్రేక్షాద్యోతకము.

తా॥ ఓ సుందరభుజస్వామీ! పూఁదోఁటలలోని చెట్ల గుబురులచే నలంకృతమై కొండలనుండి జాఱిన పెనుబండలఁ గూర్చుండి ప్రేమతోఁ దమ చరిత్రమును గంతమెత్తి పాడు సిద్ధులతో గంధర్వులతోఁ గూడినదై యొప్పు వనాద్రితటాంతిక శిలాతలమున నీవు రామావతారమునాఁడు మాయలేడి వెంబడి పరువెత్తిన శ్రమను దీర్చుకొనుచున్నావో యన్నట్లలరారు చున్నావు.

శా॥ పూఁదోఁటన్ గుబురైన చెట్లగములన్
బొల్పారి, గంధర్వ లా
హ్లాదం బొప్పఁగ గండశైలగతులై
యాలాపముల్ సేయఁగా
నీదివ్యత్కథ గేయభంగి వినుచున్
నీ పీవనాద్రిస్థలీ
వేదిన్ బాయుదె సుందరా! హరిణమున్
వెంటాడు నాయాసమున్.

శ్లో॥ కూలేఽబ్ధేః కిల దక్షిణస్య నివసన్ దూరోత్తరాంభోధిగాన్
దైత్యాన్ నీకపత్రిణాఽచ్ఛినః ఇతీయం కింవదంతీ శ్రుతా।
తత్త్రైశ్వర మంథసాం వ్యజయథా స్తస్మాద్వనాద్రీశ్వర!
శ్రీమన్ సుందర! సేతుబంధనముఖాః క్రీడా స్తవాదః బహుమ॥ 105

ప్రతి :— వనాద్రి + ఈశ్వర ! = వనగిరిప్రభువా! శ్రీమన్ = లక్ష్మీసంపన్నుఁడా!, సుందర = శ్రీసుందరబాహుస్వామీ!, దక్షిణస్య = దక్షిణపు, అబ్ధేః = సముద్రముయొక్క, కూలే =

తీరమున, నివసన్ =నివసించుచు (త్వమ్=నీవు) దూర, ఉత్తర, అంభోధిగాన్ =దూరమందున్న యుత్తరసముద్ర ద్వీపమును జొచ్చిన, దైత్యాన్ =రాక్షసులను, ఏకపత్రిణా = ఒకచే బాణముతో, అచ్ఛినః, కిల = ఛేదించితివఁట, ఇతి=అని, ఇయమ్=ఈ, కింవదంతీ = వార్త, శ్రుతా = వినఁబడినది. (రామాయణమున) తత్ర, ఏవ=ఆదక్షిణాబ్ధితీరముననే, అంభసామ్=నీరములకు, ఈశ్వరమ్ = ఈశ్వరుఁడగు సముద్రుని, వ్యజయథాః=గెలిచితివి, తస్మాత్ =అందువలన, తవ=నీకు, సేతుబంధనముఖాః = సేతువు (వంతెన) కట్టుట మున్నగు, క్రీడాః = ఆటలు, ఆడంబరమ్ = ఖ్యాతికొఱకగు వ్యాపారము.

విశేషములు :— 'సేతుబంధనముఖాః క్రీడాస్తవాడంబరమ్'— ఒకే యొక బాణముచేత నుత్తరసముద్ర ద్వీపములో నున్న రక్కసిమూఁకను ద్రుంచిన నీకు నిక్కడ నుండియే లంకాద్వీపము నందలి రాక్షసనిర్మూలనము సులువై యుండ సాగరుని శరణాగతుఁ జేసికొని సేతునిర్మాణ మొనర్చి రావణ వధ మొనర్చుట మున్నగు నీ లీలలు లోకవిఖ్యాతి కొఱకు అని హృదయము.

తా॥ వనాద్రినాథుఁడ వగు నోసుందరబాహుమూర్తి ! నీవు దక్షిణసముద్రతీరమున నివసించుచు నెంతో దూరమగు నుత్తర సముద్రద్వీపమున నున్న రాక్షసకోటుల నొక్కకోలచేతనే ఛేదించితి వని కింవదంతిని శ్రీమద్రామాయణమున విని యున్నాము. అంతేకాదు అచ్చటనే యుండి సామముచేతఁ

జక్కఁబఱని సాగరుని సాయకముచేత గడగడ లాడించి జయించితివి. అందువలన నిచ్చటనుండియే లంకారాక్షసుల నిర్మూలించుట నీకు సులువైనను సేతుబంధనాది ఘనకార్య ముల ద్వారా శత్రువుల జయించు నీ లీలలు ఖ్యాతికొఱకని తెల్లమగు చున్నది.

ఉ. దక్షిణవార్ధి వేల నొక
తావున నుండి యుదక్ప్రయోధిరా
ట్కుక్షిగతానురాళి నొక
కోలనె కూల్చి పయోధి గెల్చినీ
కక్షయకీర్తి నిల్పుటకె
యయ్యె వనాద్ర్యధినాథ ! సేతుబం
ధక్షణదాచరాధిప వ
ధప్రభృతుల్ భవదీయ్యఖేలముల్.

అవతారిక :— రామావతార మనోహరవ్యాపారముల నుపసంహరింపఁ బోవుచు 'ఉపవనతరుషండైః' అను 104 వ శ్లోకమున ననుభవించిన భావమునే వనగిరిభోగ్యతాతిశయమును సూచించుటకు మఱల మఱల ననుభవించుచున్నారు.

శ్లో॥ రఘుకులతిలక త్వం జాతుచి ద్వ్యాతుధాన
చ్ఛలమృగమృగయాయాం సంప్రసక్తః పురాఽభూః ।
తదుపజనితఖేదచ్ఛేదనా యాద్య గాయ
న్మధుకరతరుషండం రజ్యసే కిం వనాద్రిమ్ ॥ 106

ప్రతి :— (హే) రఘుతిలక ! = రఘువంశమునకు బొట్టు వలె నలంకారభూతుఁడ వగు నో రామా ! త్వమ్ = నీవు,

పురా = మునుపు, జాతుచిత్ = ఒకప్పుడు, యాతుధాన, ఛలమృగ, మృగయాయామ్ = రాక్షసుఁడనెడు మాయలేడి యొక్క వేటయందు, సంప్రసక్తః = బాగుగా నాసక్తి గలవాఁడవు, అభూః = అయితివి, తత్, ఉపజనిత, ఖేద, ఛేదనాయ = దానివలనఁ బుట్టినశ్రమను బోఁగొట్టుకొనుట కొఱకు, అద్య = ఇప్పుడు, గాయత్, మధుకర, తరుషండమ్ = ఝుంకరించుచున్న తుమ్మెదలు గల చెట్లగుబురు గల, వనాద్రిమ్ = వనశైలమును, (గూర్చి) రజ్యసే, కిమ్ = అనురక్తుఁడవగు చున్నావా ?

విశేషములు :— ‘యాతుధానచ్ఛల మృగమృగయాయామ్’ అది నిజముగా మృగముగాదు. మాయలేడి, లోకములో బంగారులేడి నెవ్వరును వినలేదు కనలేదు. ‘న చ శ్రుతో నైవ చ దృష్ట పూర్వో । లోకే క్వచి ద్ధేమమయః కురంగః’— అట్లయిన నెవరు? యాతుధానః— రాక్షసుఁ డగు మారీచుఁడు. మృగయాయామ్— తత్సంహారమునకు అనుగుణమగు వ్యాపారమునందు రజ్యసే, కిం వనాద్రిమ్— ఆనాఁటి మాయలేడివెంటఁ బరుగెత్తిన యాయాసమును దీర్చుకొనుచున్నావా ? అను ప్రశ్నచేత వనగిరి భోగ్యతాతిశయము ధ్వనితమగు చున్నది.

తా॥ రఘువంశాలంకారభూతుఁడ వగుకో శ్రీరామా ! నీ వానాఁడు మాయలేడి యైన మారీచునివెంట మృగము వెంట మృగయునివలెఁ బరుగెత్తుట వలనఁ గలిగిన శ్రమను దీర్చుకొనుట కొఱకుఁ బూఁదేనెలఁ గ్రోలి జుమ్మని గాన

మొనర్చుచున్న తుమ్మెదలతో నొప్పు పూఁజెట్ల గుబురులతో నిండిన వనశైలము నెన్నుకొంటివా ?

ఉ. ఓ రఘువంశ వరాక్రమ !
యుజ్జ్వల హేమమృగంబు వెంటఁ గాం
తారమునందుఁ బర్విడిన
తచ్ఛ్రమ మిప్పుడు దీర్చుకో మనం
బై రసలోలమత్త మధు
పారవ గానకళాభిరామ ధా
త్రీరుహషండమండితము
దివ్యవనాచల మెన్నుకొంటివా ?

శ్లో॥ హే సుందరైకతరజన్మని కృష్ణభావే
ద్వే మాతరౌ చ పితరౌ చ కులే అపి ద్వే ।
ఏకక్షణా దనుగృహీతవతః పరం తే
నీలా కులేన సదృశీ కిల రుక్మిణీ చ ॥ 107

ప్రతి :— హే సుందర ! = ఓ సుందరబాహుమూర్తీ ! ఏకతరజన్మని = ఒక యవతారమునందు, కృష్ణభావే = కృష్ణుఁడవైనప్పుడు, (ద్వే = ఇద్దఱు) మాతరౌ = తల్లులను, (దేవకీ యశోదలను) (ద్వౌ = ఇద్దఱు) పితరౌ, చ = తండ్రులను (వసుదేవ నందగోపులను) ద్వే = రెండు, కులే, అపి = కులములనుగూడ, (క్షత్రియకుల నందగోపకులములను) ఏకక్షణాత్ = ఒకక్షణములో, పరమ్ = మిక్కిలి అనుగృహీతవతః = అనుగ్రహించినట్టి, తే = నీకు, రుక్మిణీ = క్షత్రియకన్య యగు రుక్మిణీదేవి, నీలా చ = నీలాదేవియు, కులేన = వంశముచేత, సదృశీ, కిల = తగినది కదా !

విశేషములు :— ఏకక్షణాత్ =స్వల్పకాలములో, 'నీలా కులేన సదృశీ కిల రుక్మిణీ చ'— మాతృకుల మగు క్షత్రియ కులమునకుఁ దగినభార్య రుక్మిణి యనియు, తండ్రికుల మగు గోపకులమునకుఁ దగినభార్య నీల యనియు భావము. నీవు భిన్నభిన్న కులములలోఁ బుట్టిన పత్నీద్వయమును బరిగ్ర హించుటకొఱకే రెండు కులములను అనుగ్రహించితి వని సారాంశము.

తా॥ ఓ సుందరబాహుమూర్తీ ! నీ వొక జన్మమునఁ గృష్ణుఁడ వైనప్పు డిద్దఱుతల్లుల నిద్దఱుతండ్రుల రెండుకులముల నొకక్షణములో నాదరపూర్వకముగాఁ బరిగ్రహించుట తల్లి కులమగు క్షత్రియకులమున కుచిత యగు రుక్మిణీదేవిని, తండ్రి కులమగు గోపకులమున కనుగుణ యగు నీలాదేవిని భార్యలను గాఁ బడయుటకే గదా !

ఉ॥ సుందరబాహ ! నీవు వ్రజ
సుందరరూపుఁడవై జనించిన
ట్లందఱు మెచ్చఁగా నిరువు
రమ్మల నయ్యల నన్వయంబులన్
బొంద నొకేక్షణాన నటు
పూనుట క్షత్రియకన్య భీష్మరా
ణ్ణందన గొల్లవంగడపు
నాతిని నీలను బెండ్లియాడనా ?
(26)

శ్లో॥ త్వం హి సుందర ! యదా స్తనంధయః
పూతనా స్తన మధా స్తదా ను కిమ్।
జీర్ణ మేవ జఠరే పయోవిషం
దుర్జరం వద తదాత్మ నా సహ ॥ 108

ప్రతి :— సుందర != ఓ సుందర బాహుస్వామీ ! త్వమ్= నీవు, యదా, హి=ఎప్పుడైతే, స్తనంధయః (సన్)=పాలు త్రాగువాఁడవగుచు, (పసివాఁడవై) పూతనా స్తనమ్=పూతన యొక్క, స్తనమును, అధాః=త్రాగితివో ! తదాను=అప్పుడు, దుర్జరమ్ = (ఇతురులచేత) జీర్ణము చేసికొన శక్యముకాని, పయోవిషమ్=పాలరూపముతోనున్న విషమును, తదాత్మనా, సహ = తత్, ఆపూతనయొక్క, ఆత్మనా, సహ=జీవముతోఁ గూడ, జఠరే = ఉదరమునందు, జీర్ణం, ఏవ, కిమ్ = జీర్ణము చేసికొనఁబడినదా ? వద చెప్పుము.

విశేషములు :— వద=నీచేతనే ప్రత్యుత్తర మీయఁ బడవలెను, అనఁగా- పాలుత్రాగు ప్రాయమునందే పూతనా ప్రాణములతోఁబాటు ఇతరులు జీర్ణించుకొనలేని యారక్కసి స్తనవిషమును జీర్ణము చేసికొనిన బాలుఁడవు నీ వేనా ? ఈ శంకను దీర్పుమని భావము.

తా॥ ఓ సుందరబాహుస్వామీ ! నీవు పాలుత్రాగు పసి వాఁడవై యున్నప్పు డితరులు జీర్ణించుకొనలేని పూతనా స్తన మును గ్రోలినప్పుడు ఆ రక్కసి పాలరూపుననున్న విషమును ఆమె ప్రాణములతోఁబాటు జీర్ణించుకొంటివా ? ఈ శంకను దీర్పుము.

ఉ॥ చేతులలోని బిడ్డ వయి
క్షీరముఁ ద్రావెడు లేఁతయీడునన్
బూతనచంటి నోవిపిన
భూధర వల్లభ! క్రోలి తంటగా!
ఆతటి నన్యదుర్జరము
నైన తదుగ్రపయో విషంబు త
ద్ఘాతుకి జీవమున్ సమము
గా నుదరంబున జీర్ణమయ్యెనా?

శ్లో॥ ఆశ్రయేషు సులభో భవన్ భవాన్
మర్త్యతాం యది జగామ సుందర!
అస్తు నామ తదులూఖలే కియ
ద్దామ బద్ధ ఇతి కిం తదా౽రుదః॥ 109

ప్రతి :— సుందర! = ఓ సుందరభుజస్వామీ! భవాన్ = నీవు ఆశ్రయేషు = ఆశ్రితుల విషయమున, సులభః = సులభుఁడవు, భవన్ = అగుచు, మర్త్యతామ్ = మానవత్వమును, జగామ, యది = పొందితివేని, తత్ = అది (అమర్త్యత్వము) అస్తునామ = అగుఁగాక, తదా = అప్పుడు, ఉలూఖలే = ఱోటి యందు, కియత్, దామ, బద్ధః, ఇతి = చిన్నిత్రాటిచేత బంధింపఁబడితినని, కిమ్ = ఎందులకు, అరుదః = ఏడ్చితివి? (లేదా) దామబద్ధః ఇతి = త్రాటచేఁ గట్టఁబడితినని, కియత్ = ఎంతోసేపు, ఎంతోపెద్దగా, అరుదః = ఏడ్చితివి, కిం = ఎందుకు.

విశేషములు :— ఆశ్రయేషు సులభోఽభవన్' ఆశ్రయము చేత ఫలార్థము పరిచరింపయోగ్యుఁడ వగుచు, 'మర్త్యతాం యదిజగామ'— మర్త్యుం యోగ్యా మర్త్యాః (మరణింపఁ దగినవారు) అనువ్యుత్పత్తికిఁ దగినట్లు మర్త్యత్వమును బొందితి వేని, 'అస్తు నామ తత్'— దేవరవారిచే సంకల్పింపఁబడిన సౌలభ్యమున కనుకూలమైన యామర్త్యత్వము కలుగుట మంచిదే కదా! అప్పుడు ఱోటి కేమాత్రపుత్రాటితోనో తల్లి కట్టివేసినదని యంతసేపు అంతపెద్దగా నేల ఏడ్చితివి? ఉలూఖల బంధనము నీ యాశ్రిత సౌలభ్యమున కత్యంతానుకూల మని సంతోషింపఁ వలసిన సమయమున నీ వట్లు దుఃఖించుట శంకను గలిగించుచున్న దని భావము. వెనుకటి శ్లోకమున 'జీర్ణ మేవ జఠరే పయోవిషమ్' అను ప్రశ్న పరత్వసూచకము. ఈ శ్లోక మున 'కిం తదాఽరుదః' అను ప్రశ్న సౌలభ్యసూచక మని తెలియవలెను.

తా॥ ఓ సుందరభుజస్వామీ! ఆశ్రితసౌలభ్యము కొఱకు దేవరవారు మర్త్యత్వమును స్వీకరించుట నిజసంకల్పమున కనుగుణమై యుండ నాఁడు ఱోటి కేమాత్రపుత్రాటితోనో కట్టఁబడితినని యంతగా నేడ్వ నేల ?

ఉ॥ ఆశ్రితకోటికిన్ సులభ
తాతిశయార్థము నీవు మర్త్యరూ
పాశ్రయణం బొనర్చి తది
యంతయు నీకృతి కొప్పిదంబె కా!

ఏ శ్రమ మబ్బె నీకు నొక
యించుక త్రాటను ఱోటఁ గట్టఁగా
నశ్రులు కాల్వలై పరఁగ
నవ్విధి నేడ్వఁగ నేల సుందరా!

శ్లో॥ సుందరోరుభుజ నందనందన
స్త్వం భవన్ భ్రమరవిభ్రమాలకః।
మందిరేషు నవనీతతల్లజాన్
వల్లవీధియ ముత వ్యచూచురః॥ 110

ప్రతి :— సుందర! ఉరు, భుజ! = అందములగు గొప్ప భుజములుగల యోసుందరబాహుస్వామి! భ్రమర, విభ్రమ, అలకః=తుమ్మెదలయొక్క విలాసములవంటి విలాసములుగల ముంగురులు గలిగిన, నందనందనః = గోపకుమారుఁడవు, భవన్ = అగుచు, త్వమ్=నీవు, మందిరేషు=గొల్లలయిండ్లలో, నవనీతతల్లజాన్ =శ్రేష్ఠములగు వెన్నలను, ఉత=లేక, వల్లవీధియమ్=గోపికలబుద్ధిని, వ్యచూచురః=దొంగిలించితివా? (లేక రెండిటిని దొంగిలించితివా?)

విశేషములు :— 'నవనీతతల్లజాన్' ఇచ్చటఁ దల్లజ శబ్దము శ్రేష్ఠవాచకము. ఇందలి యుత్తరార్థముయొక్క సార మిది. ఓ సుందరబాహుస్వామీ! అత్యంతకాంత దివ్యమంగళ విగ్రహముతో నీవు నందనందనుఁడవై నవనీతాపహరణ మొనర్చుట గోపీజనముయొక్క మనోఽపహరణమునకాయెను. నీ వెన్న దొంగతనము నీ సౌందర్యమును దిలకించుచున్న గోపాంగనల కెంతయు ముచ్చట గొల్పెను. అని తాత్పర్యము.

తా॥ ఓ సుందరబాహుస్వామీ! తుమ్మెదలవంటి నల్లని ముంగురులతో నీవు నందగోపకుమారుఁడవై నప్పుడు గోపికా మందిరములందు మంచిమంచి వెన్నముద్దల దొంగిలించితివా? లేక గొల్లయిల్లాండ్ర యుల్లములను మ్రుచ్చిలించితివా? లేక యీరెండిటిని గొల్లఁ గొట్టితివా?

ఉ॥ అల్ల యశోద బిడ్డవయి
నప్పుడు కాననశైల వల్లభా!
నల్లని గండుతుమ్మెదల
నైగనిగల్ గల ముంగురుల్ విరా
జిల్లెడు మోముతోడ వ్రజ
సీమల వెన్నల మ్రుచ్చిలించితో?
గొల్లమిటారి క్షత్రియల
కోమల మానసముల్ హరించితో?

శ్లో॥ కాళియస్య ఫణతాం శిరస్తు మే
సత్కదంబ శిఖరత్వ మేవ వా।
వష్టి జుష్టవనశైల సుందర!
త్వత్పదాబ్జయుగ మర్పితం యయోః॥ 111

ప్రతి :— జుష్ట, వనశైల = సేవింపఁబడిన వనాద్రిగల, సుందర!= ఓ సుందరభుజస్వామీ! త్వద్, పదాబ్జ, యుగమ్ = నీ పాదపద్మములజంట, యయోః = ఏకాళియాహి ఫణా శిఖరమందును, ఏకడిమిచెట్టు కొనయందును, అర్పితమ్ = ఉంచఁబడినదో, మే = నాయొక్క, శిరః, తు = శిరస్సైనతే, (తామ్ =

అట్టి) కాళియస్య=కాళియసర్పముయొక్క, ఫణతామ్ వా= పడగరూపమునుగాని, సత్, కదంబ, శిఖరత్వం, ఏవ, వా= యోగ్యమగు కడిమిమ్రానికొమ్మకొన యగుటనుగాని, వష్టి= కోరుచున్నది.

విశేషములు :— 'యయోః'— ఏకాళియాహి ఫణాగ్ర మందును, ఏకడిమిమ్రాని కొనయందును, వష్టి=కోరుచున్నది. ఎందులకనఁగా 'దుర్లభో మానుషో దేహో దేహినాం క్షణభంగురః' (క్షణభంగురమైనను మనుష్యదేహము దుర్ల భము.) అనియు, 'అరణ్యే సంతి పత్రాణి నద్యాం స్వాదూద కానిచ సంతి, హస్తౌ చ పాదౌ చ । కథం నారాధ్యతే హరిః' (అడవిలోఁ దుళసీపత్రములు గలవు, నదిలో మంచినీరము గలదు, కాళ్లు చేతులు గలవు. శ్రీహరి యేల యారాధింపఁ బడఁడు) అనియు భగవదాశ్రయణోపయోగి కరచరణాది విశిష్టమగు మనుష్యత్వమునందును నాకంత మోజు లేదు. భగవచ్ఛరణార్పణమున కుపయుక్తము లగు నేని తిర్యక్ స్థావరత్వములు గూడ నా కుపాదేయములే యని భావము.

తా॥ వనశైల వల్లభుఁడవగు ఓ సుందరబాహుమూర్తీ! నీ పాదపద్మములజంట వేనియందుంచఁబడెనో యాకాళియాహి ఫణాగ్రభాగమో ఆకడిమిచెట్టు కొమ్మచివర భాగమో యగు టకు నాశిరస్సు కోరుకొను చున్నది.

ఉ॥ సుందరబాహుదేవ! వన
శోభిత దివ్యశిలోచ్చయాధిరా

ణ్మందిర ! నీపదద్వయి స
మర్పిత మాటను జేసి కాళియా
హీంద్రుఫణాగ్ర భాగ మొ ! య
హీనకదంబ మహీరుహాగ్రమో !
నందసుతుండవై నతజి
నాశిర మేటికిఁ గాక పోయెనో !

శ్లో॥ గూహితస్వమహిమాఽపి సుందర !
త్వం వ్రజే కి మితి శక్ర మాక్రమీః ।
సప్తరాత్ర మదధా శ్చ కిం గిరిం
పృచ్ఛత శ్చ సుహృదః కి మక్రుధః ॥

ప్రతి :— సుందర != ఓ సుందరభుజస్వామీ ! గూహిత, స్వ, మహిమా, అపి = దాచుకొనఁబడిన స్వాభావిక వైభవము గలవాఁడవయ్యు, త్వమ్ = నీవు, వ్రజే = నందగోకులమునందు, కిమితి = ఏమని, శక్రమ్ = దేవేంద్రుని, ఆక్రమీః = ఆక్రమించితివి, సప్తరాత్రమ్ = ఏడురేయింబవళ్లు, గిరిమ్ = గోవర్ధన పర్వతమును, కిం = ఎందులకు, అదధాః = ధరించితివి, పృచ్ఛతః = (ఇంతపెద్ద పర్వతమును నెత్తితివి నీవు దేవుఁడవా ? సిద్ధుఁడవా ? అని) అడుగుచున్న, సుహృదః = మిత్రులను, కిం = ఎందులకు, అక్రుధః = కోపించితివి ?

విశేషములు :— 'కి మితి శక్ర మాక్రమీః'— తన పూజ కడ్డువచ్చెనని యుద్ధోన్ముఖుఁ డగు దేవేంద్రుని శ్రీకృష్ణుఁ డెదుర్కొనె నని భావము. లేదా దేవేంద్రుని పూజ కడ్డు తగులుటయే యిట నెదుర్కొనుట యని తెలియ వలెను.

స_ప్తరాత్రమ్— ఇచ్చట రాత్రిశబ్దము దివారాత్రపరము. కి మర్థంక్రుధః— ఎందులకుఁ గోపించితివి? తన మహిమను దాచుకొనఁ దలఁచినవానికి దేవేంద్రు నెదుర్కొనుట, ఏడునాళ్లు రేయింబవళ్లు గోవర్ధనగిరి నెత్తి పట్టుట, ఇది యేమి? నీవు దేవుఁడవా? సిద్ధుఁడవా? యని ప్రశ్నించు మిత్రులను కోపించుట పరస్పరము వ్యాహతము (విరుద్ధము) అగుచున్న దని భావము.

తా॥ సుందరబాహుమూర్తీ! నీ మహిమను నీవు దాచుకొనఁదలంచిన యెడల నందగోకులమున నింద్రయాగము చేయవలదని దేవేంద్రునిపై నేల దాడి వెడలితివి. ఏడునాళ్ళు రేయింబవళ్ళు నెందులకు గోవర్ధనపర్వతము నెత్తి పట్టుకొంటివి. ఇది యేమి? నీవు దేవతవా? సిద్ధుఁడవా? అని ప్రశ్నించు మిత్రులపైఁ గోపపడితి వేల? చెప్పుము.

శా॥ దేవా! నీమహిమంబు దాచుకొనుదు
ద్దేశంబ యేన్ నందగో
వావాసంబున నింద్రయాగమును జే
యన్ రా దటం చింద్రుపైఁ
బోవం గాఁ బని యేమి? యేడుదినముల్
పూనంగ నేలాగిరిన్?
నీ వెవ్వాఁడ వటన్న నెచ్చెలులపై
నీ కేటికో కోపముల్?

శ్లో॥ హే నందనందన ! సుసుందర సుందరాహ్వ !
వృందావనే విహరత స్తవ వల్లవీభిః ।
వేణుధ్వనిశ్రవణత స్తరుభి స్తదా వై
సగ్రావభి ర్జతువిలాయ మహో విలిల్యే ॥ 113

ప్రతి :— హే నందనందన ! = నందగోపున కానంద కరుఁడా ! సుసుందర, సుందరాహ్వ ! = మిక్కిలి యందగాఁడ వగుటవలన సుందరుఁడను పేరు గలవాఁడా ! (సుందరబాహు మూర్తీ !) తదా = అప్పుడు, వృందావనే = బృందావనము నందు, వల్లవీభిః = గోపికలతో, విహరతః = క్రీడించుచున్న, తవ = నీయొక్క, వేణుధ్వని శ్రవణతః = వేణునాదమును వినుట వలన, సగ్రావభిః = ఱాళ్ళతోఁ గూడిన, తరుభిః = చెట్లచేత, (ఱాళ్ళచేతను చెట్లచేతను) జతువిలాయమ్ = లక్క కరఁగి నట్లు, విలిల్యే = కరఁగుట యాయెనఁట, (లీనమగుట ఘటాయె నఁట) అహో = ఆశ్చర్యము.

విశేషములు :— వై — ప్రసిద్ధము అను నర్థమును తెలుపు నవ్యయము. 'జతువిలాయ మహో విలిల్యే'— దేవా ! నీవు నందనందనుఁడవుగా నవతరించి బృందావనమున గోపికలతో విహరించుచుఁ బిల్లనగ్రోవి యూఁదు చుండఁగా నాపాట కందలి బండలు చెట్లు కఠినములయ్యు లక్కవలెఁ గరఁగిపోయినవఁట. ఎంత యాశ్చర్యము ! అని భావము.

తా॥ నందగోపు నానందపెట్టుచు సుందర విగ్రహము గలిగి యుండుటచేత 'సుందర' అను సార్థకనామమును జెంది అప్పుడు

బృందావనమున గోపికలతో విహరించుచున్న నీ వేణునాదమును విని యచ్చటిబండలు వృక్షషండములు లక్ష్యవలెఁ కరఁగి పోయినవఁట. ఎంత యాశ్చర్యము!

శా॥ నందానంద కరుండవై యధిక సౌం
దర్యంబు మైఁ గ్రాలుటన్
బృందావాసులు సుందరా! యనుచు నిన్
బిల్వంగ గోపాంగనా
సందోహంబును గూడి నీవు మురళీ
స్వానంబుఁ గావింపఁగా
నం దొప్పారుశిలల్ తరుల్ గరఁగె నం
చూరార! లక్ష్యం బలెన్ ॥

శ్లో॥ గాయంగాయం వనగిరిపతే! త్వం హి వృందావనాంత
ర్గోపీసంఘై ర్విహరసి యదా సుందర వ్యూఢబాహో ।
రాసారంభోత్సవ బహువిధప్రేమ సీమంతినీనాం
చేతశ్చైత త్తవ చ తు తదా కాం దశా మన్వభూతామ్ ॥ 114

ప్రతి :— వ్యూఢబాహో! = ప్రసిద్ధములు, (లేదా దృఢములు) అగు బాహువులు గల, వనగిరిపతే!=వనాద్రి నాథుఁడవగు, సుందర! = ఓ సుందరభుజస్వామీ!, త్వమ్= నీవు, యదా = ఎప్పుడు, వృందావనాంతః= బృందావనము లోపల, గాయంగాయమ్ = గాన మొనర్చిగాన మొనర్చి (పాడి పాడి) గోపీసంఘైః = గోపికా సమూహములతో, విహరసి=విహరించు చున్నావో, హి = ప్రసిద్ధము, తదా= ఆసమయమునందు, రాసా...ప్రేమ—రాసారంభ = రాసారంభ

మనెడు, ఉత్సవ=ఉత్సవమునందు, బహువిధ=అనేకవిధములు గల, ప్రేమ=ప్రణయము గలిగిన, సీమంతినీనామ్ = గోపికల యొక్క (పాపట గలవారు) చేతః=మనస్సు, తవ=నీయొక్క, చేతః చ=మనస్సును, కామ్ = ఏ, దశామ్ = స్థితిని, అన్వభూతామ్=అనుభవించినవో! (అనిర్వచనీయ మగు మహానంద మును బొందినవి)

విశేషములు :— సుందరవ్యూఢబాహో— ఇది యేక పదముగా నన్వయించు కొనవచ్చును. అప్పుడు— అందములైన దృఢములగు బాహువులు గల వాఁడా! యని యర్థము. లేదా— సుందర! వ్యూఢ బాహో! అని విడివిడిగా నర్థము చెప్పికొన వచ్చును లేదా గోపీసంఘైః = గోపికాసమూహములచేత, వ్యూఢబాహో!=ఆశ్లేషింపఁ బడిన (మెలవేసి కొనఁబడిన) భుజములు గలవాఁడా! యనియు నన్వయించు కొననగును. 'రాసారంభోత్సవబహువిధ ప్రేమ'—

> శ్లో॥ 'అంగనా మంగనా మంతరే మాధవో
> మాధవం మాధవం చాంతరే ణాంగనా।
> ఇత్థ మాకల్పితే మండలే మధ్యగః
> సంజగౌ వేణునా దేవకీనందనః ॥'

అని వర్ణింపఁబడినట్లు శ్రీకృష్ణుఁ డనేక విగ్రహములఁ బరిగ్రహించి యనేక గోపికాకాంతలచే సంశ్లిష్టభుజుఁడై మురళిని వాయించుచుఁ గావించిన నృత్య విశేషమును రాస మందురు. అట్టి రాసోత్సవ ప్రారంభమున నావిర్భవించిన

బహువిధ ప్రణయరసముగల గోపికలయొక్కయు నీయొక్కయు మనస్సు సుందర సుందరీజన మనస్సులకు సైత మందని యవాఙ్మానసగోచర మగు నానందము ననుభవించినదని తాత్పర్యము.

తా॥ దృఢబాహువులు గలిగి, వనగిరి నాథుఁడవైన యో సుందరబాహుమూర్తి ! ఎప్పుడు నీవు బృందావనములో గోపికా బృందములతోఁ గూడి పిల్లనగ్రోవితోఁ బాడుచు విహరించితివో ! యప్పుడు రాసక్రీడామహోత్స వారంభమున బహుప్రకారక మగు ప్రణయరసముతో నొప్పెడు గోపికల హృదయమును నీహృదయమును అనిర్వచనీయ మగు నొకా నొకస్థితి ననుభవించినవి.

ఉ॥ ఓ వనశైలసుందరుఁడ !
యూఁదుచుఁ బిల్లనగ్రోవి, నాఁడు బృం
దావనిలోన గోపవని
తాతతితో విహరించురాసలీ
లావిభవంబునన్ బ్రణయ
లాలిత మాజవరాంద్రయుల్లమున్
తావకమానసంబుఁ బ్రమ
దం బతివాఙ్మనసంబుఁ గాంచెనే.

శ్లో. ఇంగితం నిమిషితం చ తావకం
రమ్య మద్భుత మతిప్రియంకరమ్ ।
తేన కంసముఖకీటశాసనం
సుందరాల్పక మపి ప్రశస్యతే ॥ 115

ప్రతి :— సుందర ! = సుందరభుజస్వామీ !, తావకమ్ = నీ సంబంధియగు, ఇంగితమ్ = కనుబొమముడి మున్నగు చేష్టితము, నిమిషితం, చ = కటాక్షమును, అద్భుతమ్ = ఆశ్చర్య కర్మము, అతిప్రియంకరమ్ = మిక్కిలి ప్రీతిని గలిగించునదియు, రమ్యమ్ = మనోహరమైనదియు, (భవతి = అగుచున్నది) తేన = ఆకారణముచేత, అల్పకమపి = స్వల్పమైన దైనను, కంస, ముఖ, కీట, శాసనమ్ = కంసుఁడు మున్నగు జంతువులను సంహరించుట, ప్రశస్యతే = పొగడఁబడుచున్నది.

విశేషములు :— తేన......ప్రశస్యతే— ఓ సుందరభుజ స్వామీ ! నీదయినంతమాత్రముచేతనే సర్వము విస్మయా వహము ప్రీతికరము మనోహరము గావున నీ దృష్టిలోఁ గీట ములవంటి కంసాదులను దునుమాడుట సంకల్పమాత్రము చేతనే సకలజగత్తును సంహరించు నీకు భ్రూభంగసాధ్యమే యైనను లోకమంతగా దానిని ప్రశంసించు చున్నది.

తా॥ ఓ సుందరభుజస్వామీ ! నీసంబంధియగు భ్రూభంగాది చేష్టయుఁ గటాక్ష వీక్షణమును విస్మయకరము ప్రీతికరము మనోహరము నగు చున్నది. కనుకనే నీకు స్వల్పవిషయ మైనప్పటికిఁ గీటములఁబోలు కంసాదులను సంహరించుట మిక్కిలి ప్రశంసింపఁబడు చున్నది.

ఉ॥ మంగళవిగ్రహా ! సుగుణ
మండన ! సుందర ! తావకంబు భ్రూ

భంగము ఖేంగితంబు సద
పాంగనిరీక్షణ మద్భుతావహం
బుం గమనీయమున్ బ్రియద
ముం జుమ! కంసముఖాల్పకీట హ్యా
ద్భంగ మొనర్చు కార్య మిది
పద్మదళేక్షణ! నీకు నల్ప మా
భంగిమ మాను గాక నిజ
భక్తజనంబు ప్రశంస చేసెడున్.

శ్లో॥ వారాణసీదహన, పౌండ్రక, భౌమ, భంగ,
కల్పద్రుమాహరణ, శంకరజృంభణాద్యాః ।
అన్యాశ్చ భారతబలక్రథనాదయ స్తే
క్రీడా స్సుసుందరభుజ! శ్రవణామృతాని ॥ 116

ప్రతి :— హే సుసుందరభుజ! = ఓ సుందరభుజస్వామీ! వారాణాసీ......ణాద్యాః— వారణసీదహన=కాశిని భస్మ మొనర్చుట, పౌండ్రక=పౌండ్రకవాసు దేవుని, భౌమ=నరకాసురుని, భంగ = సంహారించుట, కల్పద్రుమ = కల్పవృక్షమగు పారిజాతమును, ఆహరణ=తెచ్చుట, శంకర, జృంభణ= జృంభణాస్త్రముచేత శంకరుని స్తంభింపఁజేయుట, ఆద్యాః= మొదలుగాఁ గలవియు, భారత, బల, క్రథన, ఆదయః= భారతయుద్ధమునందుఁ బదునెనిమిది యక్షౌహిణుల బలమును నశింపఁజేయుట మొదలుగాఁ గలవియు, అన్యాః=ఇతరము లగు, తే=నీయొక్క, క్రీడాః, చ=లీలలును, శ్రవణ, అమృతాని=కర్ణామృతములవంటివి. (వీనులకు విందు గూర్చునవి)

విశేషములు :— ఈ శ్లోకమునందలి గాథలు పురాణ ప్రసిద్ధములు. 'అన్యాశ్చ'— గ్రంథ విస్తరభయముచేత భగవల్లీలలు సంగ్రహముగా శ్లోకమున వివరింపఁబడిన వని భావము. శ్రవణామృతాని— భగవల్లీలలు శ్రోత్రేంద్రియము నమృతమువలె సంతోషపెట్టు ననుట సుప్రసిద్ధమే. 'భూషణ ములు చెవులకు, బుధతోషణము లనేక జన్మదురితౌఘవిని శ్శోషణములు మంగళతర ఘోషణములు గరుడగమనగుణ భూషణముల్'

—శ్రీపోతనామాత్యుఁడు.

తా॥ ఓ సుందరబాహుమూర్తీ! కాశిని దగ్ధ మొనర్చుట, పౌండ్రకవాసుదేవునిఁ గూల్చుట, నరకాసురుని నాశ మొనర్చుట, జృంభకాస్త్రముచేత శంకరుని స్తంభింపఁ జేయుట, మున్నగు నవియు, భారతరణమున అష్టాదశాక్షౌహిణుల బలమును భస్మ మొనర్చుట మొదలైన దేవరవారి లీలలు కర్ణామృతములై భక్తుల నానందపఱచుచున్నవి.

శా॥ శ్రీవారాణసి పట్టణంబు నటు భస్మ
స్మీభూతముం జేయుటల్,
నీ వేషంబును దాల్చు పౌండ్రకుని క్షో
ణిం గూల్చుటల్, భౌము దు
ర్భావున్ జెండుట, జృంభణంబున హరున్
భంజించుటల్, దేవ! భూ
దేవీభారముఁ దీర్చు నీ కృతులు స్యం
దించున్ సుధన్ వీనులన్.

అవతారిక :— అతి సన్నిహితమగు కృష్ణావతార ప్రసంగము చేతఁ దత్తుల్య యోగక్షేమమగు నవతారత్రయము నందుండి నీవే యాశ్రిత జనంబులకు నఖిలాభీష్టముల ననుగ్రహించు చున్నావని మూఁడు శ్లోకములచేత (శ్రీ) సుందరబాహుమూర్తి వారి మహిమను వర్ణించు చున్నారు.

శ్లో॥ త్వం హి సుందర ! వనాద్రినాథ ! హే
వేంకటాహ్వాయ నగేంద్రమూర్ధని ।
దేవసేవిత పదాంబుజద్వయః
సంశ్రితేభ్య ఇహ తిష్ఠసే సదా॥ 117

ప్రతి :— వన + అద్రి, నాథ ! = వనాద్రి ప్రభువగు, హే సుందర ! = ఓ సుందర భుజస్వామీ !, త్వమ్ = నీవు, వేంకట, ఆహ్వాయ, నగేంద్ర, మూర్ధని = వేంకట మనెడు పేరుగల పర్వతరాజము యొక్క శిఖరమునందు, సదా = ఎల్లప్పుడు, దేవ, సేవిత, పదాంబుజ, ద్వయః (సన్) = నిత్యసూరులచేత సేవింపఁబడిన పాదపద్మముల జంటగలవాఁడ వగుచు, ఇహ = ఇక్కడ, సంశ్రితేభ్యః = ఆశ్రితులకొఱకు, తిష్ఠసే = ఉన్నావు, హి = ప్రసిద్ధము.

విశేషములు :— వేంకట, ఆహ్వాయ, నగేంద్ర, మూర్ధని— 'సర్వపాపాని వేం ప్రాహుః కట స్తద్దాహ ఉచ్యతే' అను ప్రమాణముచేత సర్వపాపములను దహించుటచేత ఆనగేంద్రము నకు వేంకట అను నామము వచ్చిన దని భావము. వేం =

సర్వపాపములను, కట=దహించునది. దేవసేవిత......ఇచ్చట దేవశబ్దమునకు నిత్యసూరు లని యర్థము. ఇందులకుఁ బ్రమాణము 'యత్ర పూర్వే సాధ్యా స్సంతి దేవాః' సంశ్రితేభ్యః తిష్ఠసే— అనుచోట చతుర్థీ విభక్తియు, ఆత్మనేపదమును ఇచ్చటి యాశ్రితులకొఱకు సకలాభీష్టముల నొసంగుటకుఁ గంకణము కట్టుకొని యున్నానని నేడు స్వాభిప్రాయమును వెల్లడించుచున్నది. ఇందులకుఁ బ్రమాణము 'సూ॥ శ్లాఘున్ హుఙ్, స్థా శపాం జ్ఞీప్స్యమానః'— అను పాణిని సూత్రము.

తా॥ వనాద్రీశ్వరుఁడ వగు ఓ సుందరబాహుస్వామీ! దేవరవారు పాపముల నెల్లఁ బటాపంచలుసేయు వేంకటాచల శిఖరమున వేంచేసి నిత్యసూరులచేత సేవింపఁబడిన పాదారవిందములు గలవారలై యిచ్చట నుండుట సకలాశ్రితులకు సర్వాభీష్టముల నొసంగుటకే యనెడు తమ యభిప్రాయమును దేటపఱుచు చున్నారు.

గీ. శ్రీహరి! వనాద్రిసుందరబాహుమూర్తి!
నిత్యసూరీడితుండవై నీవు శేష
శిఖరి నిట్లుంట యిచటి యాశ్రితులకీప్సి
తార్థముల నిచ్చుతలఁ పని వ్యక్తమయ్యె.

శ్లో॥ హస్తిశైలనిలయో భవన్ భవాన్
సాంప్రతం వరదరాజసాహ్వయః ।
ఇష్ట మర్థ మనుకంపయా దదత్
విశ్వ మేవ దయసే హి సుందర! 118

ప్రతి :— (హే) సుందర ! = ఓ సుందరబాహుమూర్తీ !, వరదరాజసాహ్వయః = వరదరాజ నెడు పేరితోఁ గూడిన వాఁడవై, హస్తిశైలనిలయః = కరిగిరి వాసముగాఁ గలవాఁడవు, భవన్ = అగుచు, భవాన్ = దేవరవారు, సాంప్రతమ్ = ఇప్పుడు, ఇష్టమ్ = ప్రార్థింపఁబడిన (ఇష్టమైన) అర్థమ్ = పురుషార్థమును, అనుకంపయా, ఏవ = దయచేతనే, దదత్ = ఇచ్చుచు, విశ్వమ్ = ప్రపంచమును, దయసే = కనికరించు చున్నావు, హి = ప్రసిద్ధము.

విశేషములు :— అనుకంపయా, ఏవ = తత్తత్సాధనాను ష్ఠానములేకయే యని భావము. దయసే— దయావిషయ మునుగాఁ జేయుచున్నావు.

తా॥ ఓ సుందరబాహుమూర్తీ ! నీవు వరదరాజస్వామి యను పేరితోఁ గరిగిరియందు వాసము చేయుచు నిప్పుడు భక్తులు కోరిన పురుషార్థము నవ్యాజకృపతోనే యిచ్చుచుఁ బ్రపంచమును కనికరించు చున్నావు. ఇది ప్రసిద్ధము.

గీ. దేవ ! సుందరబాహుమూర్తీ ! వనాద్రి
వల్లభా ! హస్తిగిరియందు వరదరాజు
పేరఁ గృపతోనె శ్రితుల కీప్సితము లిడుచుఁ
గనికరించుచు నున్నావుగా ! జగమ్ము.

శ్లో॥ మధ్యేక్షీరపయోధి శేషశయనే శేషే సదా సుందర !
త్వం తద్వైభవ మాత్మనో భువి భవ ద్భక్తేషు వాత్సల్యతః ।
విశ్రాణాఖిలనేత్రపాత్ర మిహ సన్ సహ్యోద్భవాయా స్తటే
శ్రీరంగే నిజధామ్ని శేషశయనే శేషే వనాద్రీశ్వర ! ॥ 119

ప్రతి :— (హే) వనాద్రీశ్వర, సుందర ! = వనాద్రిప్రభువ వగు ఓ సుందరబాహుస్వామీ !, త్వమ్=నీవు, మధ్యేక్షీర పయోధి = పాలసంద్రమునడుమ, సదా = ఎల్లప్పుడు, శేష శయనే=శేషపర్యంకమునందు, శేషే = పరుండు చున్నావు, తత్ =అట్టి, ఆత్మనః= నీయొక్క, వైభవమ్=ప్రభావమును, భువి=భూమియందు, భవత్, భక్తేషు=దేవరవారి భక్తుల విషయమున, వాత్సల్యతః=స్నేహవిశేషమువలన, విశ్రాణ్య= ఇచ్చి, అఖిలనేత్ర పాత్రమ్, సన్ =అందఱిదృష్టికి గోచరమైన వాఁడ వగుచు, ఇహ=ఇప్పుడు (ఇక్కడ) సహ్యాద్భవా యాః = కావేరీనదియొక్క, తటే = ఒడ్డున, నిజధామ్ని= స్వనివాస మగు, శ్రీరంగే=శ్రీరంగమందు, శేషశయనే= శేషపర్యంకమున, శేషే = శయనించుచున్నావు.

విశేషములు :— ' తద్వైభవ మాత్మనః ' శేషపర్యంక శాయిత్వరూప మగు శ్రీవారి యీ వైభవము నని భావము. వాత్సల్యతః— 'తః' అనునది పంచమ్యర్థమున వచ్చిన 'తసిల్' ప్రత్యయము. దోషములను పాటింపని స్నేహవిశేషము వలన అని యర్థము. శ్రీరంగే నిజధామ్ని— శ్రీరంగమునకు 'నిజధామ్ని' అను విశేషణము వేయుటవలన శ్రీరంగము వైకుంఠ విమానమని వ్యక్తమగు చున్నది. శేషశయనే శేషే— క్షీరాబ్ధిశాయిని సాక్షాత్తుగాఁ జూడ నశక్తులగు భక్తజనులకుఁ దత్సేవ ననుగ్రహింప నెంచి యిచ్చట సమస్తార్చావతారము లకు మూలకందమగు శ్రీరంగశాయి వగుచున్నా వని భావము.

తా॥ వనాచలనాథుఁడ వగు నోసుందరబాహుమూ ర్తీ! దేవరవారు పాలసంద్రము నందు సర్వదా శేషపర్యంకమున శయనించియుండు దివ్యవైభవమును దోషముల వైపు దృష్టిని బోనీయని ప్రేమవిశేషమువలన నశక్తులగు భూలోకవాసులైన భక్తులకు ననుగ్రహింప నిచ్చట, అందఱికన్నులకు గోచరించుచు కావేరీతీరమున భూలోకవైకుంఠ మగు శ్రీరంగమున శేష తల్పమునందు శయనించు చున్నావు.

శా. శ్రీమత్కాననశైల సుందరభుజా! క్షీరాబ్ధి భోగీంద్రుపై
నామోదంబున నీవు పండు విభవం బత్రత్యభక్తాళి కు
ద్దామప్రేమ ననుగ్రహింపఁగ భవద్ధామంబు శ్రీరంగ మం
దీమాద్రిన్ భుజగేంద్రశాయివయితో? యీసహ్యజాతాతటిన్॥

శ్లో॥ కల్కీ భవిష్య౯ కలికల్కదూషితా౯
దుష్టా నశేషా౯ భగవ౯! హనిష్యసి।
స ఏవతస్యావసర స్సుసుందరః
ప్రశాధి లక్ష్మీశ! సమక్ష మేవ నః॥ 120

ప్రతి :— లక్ష్మీశ! = లక్ష్మీనాథుఁడ వగు, భగవ౯! = ఓ భగవానుఁడా! సుసుందరః = మిక్కిలి అందగాఁడ వగు (సుందరనామముగల) త్వమ్ = నీవు, కల్కీ = కల్కివి (గొప్ప గుఱ్ఱపురౌతు) భవిష్య౯ = కాఁబోవుచు, (కల్కివిగా నవత రింపఁబోవుచు) కలి, కల్క, దూషితా౯ = కలికాలప్రయుక్త మగు మాలిన్యముచేతఁ బాడయిన, అశేషా౯ = సమస్తమైన, దుష్టా౯ = దుర్మార్గులను, హనిష్యసి = చంపఁగలవు, తస్య =

ఆకల్క్యవతారమునకు, సః = ఆసీహృద్గతమగు, అవసరః = సమయము, ఏషః = ఇదియే. నః = మాయొక్క సమక్షమ్, ఏవ = కన్నులయెదుటనే, ప్రశాధి = (దుష్టులను) శిక్షింపుము.

విశేషములు :— కల్కీ = హయసాదివిశేషః— అనఁగా నొకవిధమగు గుఱ్ఱపురౌతు, తస్య = కలికల్మషదూషితు లగు దుష్టులను సంహరింప ననువగు కల్కిరూపము నెత్తుటకు. 'ప్రశాధి లక్ష్మీశ! సమక్ష మేవ నః'— దేవరవా రిప్పుడే కల్క్యవతారము నెత్తి దుష్టసంహారము చేయనియెడల నాశ్రితుల మగు మాకు వినాశము తప్పదని భావము.

తా॥ లక్ష్మీశుఁడ వగునో భగవానుఁడా! సుందరబాహు మూర్తివగు నీవు కల్కివిగా నవతరింపఁ బోవుచుఁ గలికల్మష దూషితులగు దుర్మార్గులను వధింపఁగలవు ఆసమయ మిదియే కావున నాదుష్టులను మాకన్నుల యెదుట నిప్పుడే నిర్మూలింపుము.

ఉ. సామి! రమేశ! సుందరభు
జా! యిఁక ముందఱఁ దాము కల్కిగా
భూమి జనించి దుష్టజన
ముం గలికల్మష దూషితమ్ము ని
స్సీమబలమ్ముతో నసిని
జెండెద రంట! ముహూర్త మియ్యదే
యా మహనీయ కార్యమున
కాఖలులన్ దునుమాడు మిప్పుడే.

అవతారిక — ఇట్లు పెక్కువిధముల నాశ్రితజనోపకారంబు లగు నవతారముల నీవే తాల్చితి వని పలుసారులు చెప్పఁబడిన శ్రీ సుందరభుజస్వామివారి విహారలీలను ముగించి యీకారణముచేత దేవరవారే యాశ్రయణీయు లని శరణు చొచ్చుచున్నారు.

శ్లో॥ ఈదృశా స్త్వదవతారసత్తమాః
సర్వ ఏవ భవదాశ్రితాన్ జనాన్ ।
త్రాతు మేవ న కదాచి దన్యథా
తేన సుందర ! భవంత మాశ్రయే ॥ 121

ప్రతి :— హే సుందర ! = ఓ సుందరబాహుస్వామీ !, ఈదృశాః=ఇటువంటివి, సర్వే, ఏవ = సమస్తములైన, త్వత్, అవతార, సత్తమాః= దేవరవారి ముఖ్యములగు నవతారములు, భవత్, ఆశ్రితాన్ = దేవరవారి నాశ్రయించిన, జనాన్=సాధుజనులను, త్రాతుం ఏవ=రక్షించుట కొఱకే, కదాచిత్, అపి = ఒకప్పుడు గూడ, అన్యథా=ఇతర ప్రయోజనముకొఱకు, న=కావు, తేన=అందుచేత, భవంతమ్ = శ్రీవారిని, ఆశ్రయే=ఆశ్రయించు చున్నాను.

విశేషములు :— త్రాతు మేవ— 'పరిత్రాణాయ సాధూనామ్' అని చెప్పఁబడిన ప్రయోజనముకొఱకే యని భావము. ఎక్కడనైనను సాధురక్షణము దుష్టవినాశము లేకుండ జరుగదో యచ్చట దుష్టవినాశము గూడనని యాశయము. 'తేన'— వనాద్రియందు సుందరబాహుమూర్తిగా నవతరించుట యాశ్రిత పరిత్రాణమునకే కాన, భవంత మాశ్రయే— జ్ఞాన,

శక్తి, సౌలభ్య, సౌశీల్య, వాత్సల్యాది కల్యాణగుణ సంపన్నుఁడవును, ఆశ్రితరక్షణైక దీక్షితుఁడవును, అగు నిన్ను శరణు చొచ్చు చున్నాను. అని భావము.

తా॥ ఓ సుందరబాహుమూర్తీ ! ఇటువంటి నీముఖ్యావతారము లన్నియు నీయాశ్రితజనులను రక్షించుటకే కాని యితర ప్రయోజనములకుఁ గావు. ప్రకృత మీ వనాద్రియందు సుందరబాహుమూర్తిగా నవతరించుట కూడ నాశ్రితుల రక్షించుటకే కాన జ్ఞానశక్తి సౌలభ్యసౌశీల్యాది గుణసంపన్నుఁడవు నాశ్రితరక్షణ బద్ధదీక్షుఁడ వగు నిన్ను శరణుచొచ్చు చున్నాను.

శా. ఓ దేవా ! జగదేకమంగళ విధా
యుల్ ముఖ్యముల్ తావక
ప్రాదుర్భావము లెల్ల సుందరభుజ
స్వామీ ! వనాద్రీశ ! నీ
పాదాబ్జంబులఁ గొల్చుభక్తతతులన్
బాలింప; నన్యార్థమె
కా దింకేల సమాశ్రయించెద నినున్
గారుణ్య వారాంనిధీన్.

శ్లో॥ త్వా మామనంతి కవయః కరుణామృతాబ్ధిం
త్వా మేవ సంశ్రితజనిఘ్న ముపఘ్న మేషామ్ ।
ఏషాం వ్రజ న్నిహ హి లోచనగోచరత్వం
హే సుందరాహ్వ ! పరిచస్కరిషే వనాద్రిమ్ ॥ 122

ప్రతి :— హే సుందరాహ్వ! = సుందరనామ ధేయుఁడ వగు ఓ దేవా! కవయః=కవులు, కరుణా, అమృత, అబ్ధిమ్= కరుణయ నెడు అమృతమునకుఁ బుట్టినిల్లగు వానినిగా (లేదా) కరుణకు క్షీరాబ్ధివంటి వానినిగా, త్వామ్=నిన్ను, ఆమనంతి= చెప్పుచున్నారు, త్వాంఏవ=నిన్నే, సంశ్రిత, జని, ఘ్నమ్= ఆశ్రితుల సంసార దుఃఖములను నశింపఁజేయువానిని గాను, ఏషామ్=ఈయాశ్రితులకు, ఉపఘ్నమ్=ఆశ్రయ భూతునిగాను, (ఆమనంతి=చెప్పుచున్నారు) ఏషామ్ = ఈ యాశ్రితజనులకు, లోచన, గోచరత్వమ్=కన్నులకుఁ గానవచ్చుటను, వ్రజన్ = పొందుచు, ఇహ=ఇచ్చట, (ఈలీలావిభూతిలో) వనాద్రిమ్= వనగిరిని, పరిచస్కరిషే = అలంకరించు చున్నావు, హి = ప్రసిద్ధము.

విశేషములు :— కవయః— కవనశీలు రగు భగవ ద్వాల్మీకి, పరాశర, పారాశర్య, పరాంకుశ, పరకాల, ప్రభృ తులు. ఉపఘ్నమ్=దగ్గఱగా నున్నయండ 'స్యా దుపఘ్నోంతి కాశ్రయః' అని యమరము. పరిచస్కరిషే వనాద్రిమ్— నిర్హేతుక జాయమాన కరుణాపరిపూర్ణుఁడ వగుట వలనను శరణ్యుఁడ వగుటవలనను శరణవరణ సౌకర్యముకొఱకు ఆశ్రిత నేత్రపాత్రమవై వనాద్రి నలంకరించు చున్నావని భావము.

తా॥ ఓ సుందరభుజస్వామీ! భగవద్వాల్మీకి ప్రభృతిమహా కవులు నిన్నుఁ గరుణామృత పరిపూర్ణునిగా నుడివిరి. మఱియు నాశ్రితజనుల జరామరణములఁ బాపుదగ్గఱనుండు నండను

గాను నిన్నే వర్ణించిరి. ఇట్లు సమాశ్రితులకు లోచనగోచర మగుచు నీలీలావిభూతి యందు శరణవరణ సౌకర్యమున కీ వనాద్రి నలంకరించి యున్నావు.

ఉ. నాకుజముఖ్యు సత్క విజ
నంబులు నిన్నుఁ గృపామృతాబ్ధిఁగా
వాకొని రాశ్రితాళి భవ
పాశ వినాశకుఁగాఁగ దాపులో
నే కలయుండగాఁగ గరు
ణించిరి సంశ్రితకోటికంటెనుం
దై కడు నంటుపాటుగ వ
నాచలసీమ నలంకరించితో.

శ్లో॥ అశక్యం నో కించిత్ తవ న చ న జానాసి నిఖిలం
దయాలుః క్షంతా చా ప్యహ మపి చ నాగాంసి తరితుమ్ ।
క్షమోఽత స్త్వచ్ఛేషో హ్యగతి రితి చ క్షుద్ర ఇతి చ
క్షమ స్వైతావ న్నో బల మిహ హరే! సుందరభుజ! ॥ 123

ప్రతి :— హే సుందరభుజ! = ఓ సుందర బాహుస్వామీ!, హరే! = విష్ణుమూర్తీ! తవ=నీకు, అశక్యమ్=సాధ్యము గానిది, కించమ్=కొంచెమును (ఒకటియు) నో= లేదు, నిఖిలంచ=అంతయును, న, జానాసి, ఇతి, న=ఎఱుఁగవని లేదు, (ఎఱుఁగుదు వన్నమాట) దయాలుః = దయగలవాఁడవు, క్షంతా, చ=ఓర్పుగలవాఁడవుగూడ, అహంఅపి=నేను గూడ, ఆగాంసి=అపరాధములను, తరితుంచ=దాఁటుటకుఁ (ప్రాయశ్చిత్తాదులచేత నశింపఁజేసికొనుట కొఱకు) న, క్షమః=

సమర్థుఁడనుగాను, అతః=ఇందువలన, త్వత్ + శేషః, హి= నీ దాసుఁడనియు, అగతిః ఇతి చ=గతిలేనివాఁడనియు (ఉపాయాంతరరహితుఁ డనియు) క్షుద్రః ఇతి చ =అకించనుఁడనియు, క్షమస్వ=(నేరములను) క్షమింపుము. ఇహ =ఈ సంసారము నందు, నః=మాకు, ఏతావత్ =ఈమాత్రమే, బలమ్=బలము.

విశేషములు :— ప్రథమచరణమునకు సర్వశక్తివి, సర్వజ్ఞుఁడవు నని భావము. దయాలుః=పరదుఃఖాసహిష్ణుః— ఒరులదుఃఖమును జూచి సహింపలేనివాఁడని భావము. 'క్షంతా'— అపరాధసహిష్ణుః— నేరములను సహించు శీలముగలవాఁడు, అతః— ఇందువలన— అనఁగా, నీవు సర్వశక్తివి, సర్వజ్ఞుఁడవు, దయాక్షమావిశిష్టుఁడవు గనుక, నేను దుష్కృతములఁ బ్రాయశ్చిత్తాదులచేతఁ బోఁగొట్టుకొనఁజాలని వాఁడను గనుకను - అని భావము. త్వచ్ఛేషః హి=నీ దాసుఁడనని— ఇచ్చట 'హి' శబ్దము ఇత్యర్థకము. క్షుద్రః ఇతి చ=క్షుద్రము లగు పురుషార్థములచేతనే తృప్తిచెందిన వాఁడననియు, లేదా— అకించనుఁడ ననియు- 'ఏతావ న్నో బల మిహ'— ఈసంసారములో మాకు దేవరవారి విషయమున జ్ఞాన, శక్తి, దయా, క్షమా, వైశిష్ట్యము, మా విషయమున భవచ్ఛేషత్వాకించనత్వానన్యగతికత్వము ననుసంధించుకొనుటయే బలము. అనఁగాఁ దరణోపాయ మని తాత్పర్యము.

తా॥ ఓ సుందరభుజస్వామీ! నీ కశక్యమైన దేదియు లేదు. నీవు సమస్తము నెఱుఁగ వనుమాటయు లేదు. సర్వశక్తివి

సర్వజ్ఞుఁడవు దయగలవాఁడవు క్షంతవునై యున్నావు, నేనో నాయపరాధముల దాఁట శక్తిలేనివాఁడను. కావున నీదాసుఁడ ననియు అనన్యగతి ననియు నకించనుఁడ ననియు నా యపరాధ ముల క్షమింపుము. ఈ సంసారములో మాకీ యనుసంధానమే బలము (సాధనము.)

శా॥ నీకున్ శక్యముగాని దొక్కటియు లే
నే లేదు, సర్వం బిలన్
నీకున్ హస్తతలస్థితామలక మా
నీ జాలియున్ శాంతియున్
లోకాతీతము లే దరింపఁ గలనే
లోకేశ ! యాగోఽంబుధిన్
నీకున్ దాసుఁడ దిక్కులేని యనదన్
నేరంబులన్ సైపవే !

శ్లో॥ లంకాయుద్ధహతాన్ హరీన్ ద్విజసుతం శంబూకదోషా న్మృతం
సాందీపిన్యభిజం మృతం ద్విజసుతాన్ బాలాం శ్చ వైకుంఠగాన్।
గర్భం చార్జునిసంభవం వ్యదధరః స్వే నైవ రూపేణ యః
స్వాభీష్టం మమ మద్గిరోశ్చ దదసే నో కిం వనాద్రీశ్వర ! ॥ 124

ప్రతి :— హే వనాద్రీశ్వర ! = ఓ వనగిరిప్రభువ వగు సుందరబాహుమూర్తీ!, యః=ఏనీవు, లంకాయుద్ధహతాన్= లంకాపురీ యుద్ధమునఁ జంపఁబడిన. హరీన్ = వానరులను, శంబూకదోషాత్ =శంబూకుని యపరాధమువలన, మృతమ్= మరణించిన, ద్విజసుతమ్=బ్రాహ్మణకుమారుని, మృతమ్= చనిపోయిన, సాందీపిని × అభిజమ్=సాందీపినియొక్క (కృష్ణుని

గురువు) కుమారుని, వైకుంఠగాన్ = వైకుంఠలోకమునకు వెళ్ళిన, బాలాన్ = చిన్నవారగు, ద్విజసుతాన్ = బ్రాహ్మణ పుత్త్రులను, అర్జునిసంభవమ్ = అర్జున కుమారుఁడగు అభిమన్యుని వలనఁ బుట్టుకగల, గర్భమ్ చ = గర్భమును (పరీక్షిత్తును) స్వేన, ఏవ, రూపేణ = సొంతరూపముతోనే, వ్యుదధరః = ఉద్ధరించితివో, (సః = ఆనీవు) మత్, గురోః = నా గురువగు భగవద్రామానుజా చార్యులయొక్కయు, మమ, చ = నాయొక్కయు, స్వాభీష్టమ్ = స్వీయమగు మనోరథమును, నో, దదసే, కిమ్ = ఇయ్యవేమి ?

విశేషములు :—ఇందు మొదటిపాదములోని లంకాయుద్ధ హతవానరోజ్జీవనము శంబూక దోషమృత బ్రాహ్మణబాలపు నర్జీవనములు రామావతారకాలికములు, తక్కిన రెండు మూఁడు పాదములలోని మృతసంజీవనములు కృష్ణావతార కాలికము లని తెలియవలెను. స్వే నైవ రూపేణ— మరణ కాలమునందలి వయస్సు, వేషము, భూషాణాదులతోఁ గూడిన యాకారముతోనే 'స్వాభీష్టం మమ మద్గురో శ్చ దదసే నో కిమ్'— శ్రీ భగవద్రామానుజ గురుల యభిలషిత మే మన— శ్రీరంగనాథ సన్నిధినివాసము, తత్పరి చర్యాభాగ్యము. శ్రీ కూరేశులయభిలాష మే మన— భగవద్రామానుజుల సన్నిధి నుండుట తత్పరి చర్యాదిక మొనర్చుట యని తెలియ వలెను. కాలాంతరమున మృతులైనవారిని, పునరావృత్తి రహితలోకాంతరగతులను సైతము మరణకాలమునాఁటి వయోవేషభూషణములతోఁ గొనివచ్చి యిచ్చిన దేవరవారి

కశక్యమేదియు లేదు గదా! భవదాశ్రితుల మగుమా యభి లాషల నింకను దీర్చవేమి? అని యాశయము.

తా॥ ఓ వనాద్రినాథా! లంకాయుద్ధమున మరణించిన వానరులను, శంబూకతపశ్చర్యచే మృతుఁడైన బ్రాహ్మణ బాలుని రామావతారమున బ్రదికించితివి. అట్లే కృష్ణావతార మునఁ గూడ మరణించిన గురుపుత్త్రుని, మరణించి పునరావృత్తి రహితమగు వైకుంఠమును జేరుకొనిన బాలురగు బ్రాహ్మణ సుతులను, అభిమన్యునివలన నేర్పడిన యుత్తరాగర్భమును మరణకాలిక వయోవేషభూషణములతో నొప్పు రూపముతోఁ గొనివచ్చిన నీవు నిన్నాశ్రయించిన మద్గురుపాదులగు భగవ ద్రామానుజుల యభిలాషను నా వాంఛితమును దీర్ప వేల?

శా॥ లంకాసంగరరంగ నష్టకపిము
ల్లశ్రేణి, శంబూకము
న్యంకాస్తంగత విప్రబాలు, మృతుఁడౌ
నాచార్యసూనున్, నిరా
తంకస్థానుల నష్టవిప్రసుతులన్,
దగ్ధోత్తరా పత్యమున్
సంకోచింపక యిచ్చి యేల యిష వి
ష్టం బీశ! నా కొజ్జకున్.

అవతారిక :—నిజదేశవాసు లనెడు తృప్తిచేతనే వారికిఁ బ్రబల ఫలప్రదుఁడ వగుచున్నావని నాల్గు శ్లోకములతో నుడువు చున్నారు.

శ్లో॥ ఆయోధ్యగాన్ సపశుకీటతృణాంశ్చ జంతూన్
కింకర్మణో ను బత కీదృశ వేదనాఢ్యాన్ ।
సాయుజ్యలభ్యవిభవాన్ నిజనిత్యలోకాన్
సాంతానికా నగమయో వనశైలనాథ ! 125

ప్రతి :— హే వనశైలనాథ ! = వనిగిరినాథుఁడవగు ఓ సుందరభుజస్వామీ ! ఆయోధ్యగాన్ = అయోధ్యానుబంధి దేశములను బొందిన, సపశు కీట తృణాన్ = పశువులతో, కీటములతో, తృణములతోఁ గూడిన, జంతూన్ = ప్రాణులను, కింకర్మణః, ను = ఏమి కర్మ గలవి యని, బత = మఱియు, కీదృశ, వేదన, ఆఢ్యాన్ = ఎటువంటిజ్ఞానముతో ఒప్పునవి యనియు, సాయుజ్య, లభ్య, విభవాన్ = సాయుజ్యమోక్షము నందుఁ బొందఁదగిన వైభవము గలట్టియు, సాంతానికాన్ = సాంతానికము లనెడు, నిజ, నిత్యలోకాన్ = తన వైకుంఠమువలె శాశ్వతములగు లోకములను, అగమయః = పొందించితివి ?

విశేషములు :— ఆయోధ్యగాన్ — కేవల మయోధ్యావాసులనే కాదు- అయోధ్యానుబంధి దేశములలో నున్న వారిని గూడ నని భావము. సపశుకీటతృణాన్ చ— కేవలము మనుష్యులనే కాదు చతుష్పాజ్జంతువులను, అతిక్షుద్రములగు పురుగులను, గడ్డిపఱకలను గూడ నని- 'కింకర్మణో ను బత కీదృశ వేదనాఢ్యాన్'— ఏమి కర్మయోగనిష్ఠులని, ఏమి జ్ఞానయోగనిష్ఠులని— తలఁచి యట్టి శ్రీవైకుంఠతుల్యములగు సాంతానికలోకముల నొసంగితివి ? అది కేవల మయోధ్యానుబంధి దేశవాసులనియే యిచ్చితి వని యాశయము.

తా॥ ఓ వనశైలనాథా ! సుందరభుజా ! నీ వానాఁడు తృణ పశుకీటాది ప్రాణులకు భవదనుభవయోగ్యసంపత్తి గల వైకుంఠ లోకతుల్యంబులగు సాంతానికలోకంబుల నొసంగుట వాని జ్ఞాననిష్ఠను కర్మనిష్ఠను జూచియా? కాదు కాదు- అయో ధ్యానుబంధి దేశసంబంధమునుబట్టి యొసంగితివి. కాన దేవర వారికి స్వీయదేశవాసుల యెడఁగల యభిమాన మనన్యా దృశము.

శా. ఆసాంతానికలోకముల్ పరమ ధా
మాభంబులన్ నీ వయో
ధ్యాసంబంధిసు దేశవాసు లని యే
యర్పించినా వంత యే
ఓసర్వోత్తమ ! యట్లు గానియెడ జ్ఞా
నోత్కృష్టముల్ కర్మని
ష్ఠాసంతుష్టములా ! తృణక్రిమి చతు
ష్పాజ్జంతు సంతానముల్.

శ్లో॥ హారితవారణ భృత్యసమాహ్వాయం
కరిగిరౌ వరద స్త్వ మపూర్వికామ్ ।
దృశ మలంభయ ఏవ హి సుందర !
స్ఫుట మదా శ్చ పరశ్శత మీదృశమ్ ॥ 126

ప్రతి :— హేసుందర!=ఓసుందరభుజస్వామీ! కరిగిరౌ= కరిగిరియందు, వరదః = వరదరాజస్వామి వగుచు, త్వమ్= నీవు, హారితవారణభృత్యసమాహ్వాయమ్ = హారితవారణదాస నామము గల భక్తుని, అపూర్వికామ్ = పూర్వము లేని, దృశమ్=దృష్టిని, అలంభయః ఏవ=పొందించితివి, ఈదృశమ్= ఈ ప్రకారముగా, పరశ్శతమ్ = పలుసారులు, స్ఫుటమ్= ప్రసిద్ధముగా, అదాః చ=ఇచ్చితివి కూడ, హి=ప్రసిద్ధము.

విశేషములు :—'అపూర్వికాం దృశ మలంభయ ఏవ'— వరదరాజస్వామి గ్రుడ్డివాఁ డగు హారితవారణదా సనెడుభాగవతునకుఁ గన్నుల ననుగ్రహించె నని ప్రసిద్ధి కలదు. పరశ్శతమ్ = వందలకు హెచ్చుగా అనియు నర్థము.

ఈ సందర్భమున నీ శ్లోకము నిచ్చట ననుసంధించుకొనునది.

శ్లో॥ యస్య ప్రసాదకళయా బధిర శ్శృణోతి
సంగుః ప్రధావతి జవేన చ వక్తి మూకః ।
అంధః ప్రపశ్యతి, సుతం లభతే చ వంధ్యా
తం దేవ మేవ వరదం శరణం ప్రపద్యే ॥

తా॥ ఎవని నలుసంత యనుగ్రహముచేతఁ జెవిటివాఁడు వినునో, కుంటివాఁడు వడిగాఁ బర్వెత్తునో, మూగవాఁడు మాటలాడునో, గ్రుడ్డి చూచునో, గొడ్రాలు బిడ్డను గనునో, ఆవరదరాజస్వామిని శరణు చొచ్చు చున్నాను దీనికి నా తెలుఁగు పద్యము.

గీ. చెవిటి విను, గ్రుడ్డి చూచు, వచించు మూఁగ,
కుంటి పరుగెత్తు, గొడ్రాలుఁ గొమరుఁ బడయు,
నెవని క్రేగంటి చూ పింత యెసఁగ, నట్టి
వరదరాజుల చరణంబు శరణు నాకు.

ఇఁక మూలశ్లోకమునకుఁ దాత్పర్యము.

తా॥ ఓ సుందరబాహుమూర్తీ ! నీవు కరిగిరియందు వరదరాజస్వామి నామముతో వెలయుచు, 'హారితవారణదాసు' అనెడు ఒక గ్రుడ్డిభాగవతునకుఁ గన్నుల ననుగ్రహించితివి. ఒక కేల? ఇట్టి వెన్నిమార్లో భక్తుల కొసఁగితివి. ఇది సుప్రసిద్ధము.

చ. కరిగిరియందు నీవు సుభ
గా! వరదుం డను సార్థకాఖ్యతో

వరలుచు భక్తుఁడౌ హారిత
వారణదా సను గ్రుడ్డివానికిన్
వరనయనమ్ములన్ సుగుణ
వారిధి! యిచ్చితి వంట తొల్లి సుం
దరభుజ! యిట్టి దానములు
తావకముల్ శతముల్ సహస్రముల్.

శ్లో॥ ఇహ చ దేవ దదాసి వరాన్ పరాన్
వరద! సుందర! సుందరదోర్ధర! ।
వనగిరే రభిత స్తట మావసన్
నిఖిలలోచన గోచర వైభవః ॥ 127

ప్రతి :— వరద!=వరముల నొసంగువాఁడా! సుందరదోః ధర!=అందములగు బాహువులను ధరించువాఁడా!,సుందర!= ఓ సుందరబాహుస్వామీ! దేవ!=క్రీడాదిగుణవిశిష్టుఁడా!, వనగిరేః, తటం, అభితః=వనాద్రితట సమీపమునందు, ఆవసన్ =నివసించుచు, నిఖిల, లోచన, గోచర, వైభవః=అందఱి కన్నులకుఁ గనఁబడు మహిమ గలవాఁడవగుచు, త్వమ్=నీవు, ఇహ చ = ఈవనగిరియందుఁగూడ, పరాన్ =అతిశయితము లగు, వరాన్=వరములను, దదాసి=ఇచ్చు చున్నావు.

తా॥ వరముల నొసఁగుచు సుందరములగు బాహువుల ధరించుకతన సుందరబాహుస్వామి యను సార్థకనామముగల యో దేవా! వనాద్రితట సమీపమున నివసించుచు అందఱి కగపించు దివ్యవైభవము గలవాఁడవై నీ విచ్చటఁగూడ భక్తుల కధికవరముల ననుగ్రహించు చున్నావు.

గీ. వరద! సుందరబాహు దేవా! వనాద్రి
తటి నిఖిలగోచరాత్మవైభవుఁడ వగుచు।
నిచట సైతము నినుఁ గొల్చు సుచరితులకు
నిచ్చుచున్నావు మేల్వరాల్ హెచ్చుగాను.

అవతారిక :— 'ఇహ చ దేవ దదాసి వరాన్ పరాన్' అని సామాన్యరీతితోఁ జెప్పినదానినే స్థాలీపులాకన్యాయముతో విశేషాకారమునఁ జెప్పుచున్నారు.

శ్లో॥ ఇద మిమే శ్రుణుమో మలయధ్వజం
నృప మిహ స్వయ మేవ హి సుందర ! ।
చరణసాత్ కృతవా నితి త ద్వయం
వనగిరీశ్వర ! జాతమనోరథాః ॥ 128

ప్రతి :— హే వనగిరీశ్వర ! = ఓ వనాద్రిప్రభూ !, ఇమే = ఈ, వయమ్ = మేము, ఇహ = ఇచ్చట, (వనాద్రియందు) స్వయం, ఏవ, హి = స్వయముగానే, మలయధ్వజమ్ = మలయధ్వజుఁడనెడు, నృపమ్ = పాండ్యరాజును, చరణసాత్, కృతవాన్ = పాదపరిచర్యార్హుని జేసితివి, ఇతి = అని, ఇదమ్ = ఈ పూర్వవృత్తమును, శ్రుణుమః = వినుచున్నాము, తత్ = అందువలన, జాత, మనోరథాః = పుట్టినకోరిక గలవారము, (భవామః = అగుచున్నాము.)

విశేషములు :— 'స్వయ మేవ హి' — సాధనానుష్ఠానములతో అపేక్ష లేకయే కేవలము స్వకృపచేతనే యని భావము. 'జాతమనోరథాః'— అకారణ జాయమాన కరుణా కటాక్షముచేతఁ బాండ్యరాజగు మలయధ్వజునకు నిజపాద పరిచర్యా భాగ్యము నొసఁగినట్లు మాకును గరుణింతు వని యాశగలిగి యున్నామని యాశయము.

తా॥ ఓవనాద్రినాథా! యీమే మీ వనాద్రియందు సాధనానుష్ఠానాదులతో నపేక్ష లేకయే మలయధ్వజ మహారాజుగారు దేవరవారి యహేతుక జాయమాన కరుణాకటాక్షముచేతఁ జరణపరిచర్యాభాగ్యమును బొందినా రన్న గాథనువిని మాకు నట్టిభాగ్యమును గలిగింతురని పుట్టెఁడాశతోనున్నాము.

చ. ఇతర విశేషసాధనము

లెవ్వియు లేకయె తొల్లి పాండ్యభూ
పతి మలయధ్వజాధిపు న
పారకృపారసదృష్టిఁ జూచి యి
చ్చితి వఁట నీపదాంబురుహా
సేవనభాగ్యము వింటి మీశ! మీ
కత సకలమ్ము, నట్టిదయఁ
గాంచఁగ నుంటిమి ప్రీతిఁ దాసతోఁ ॥

అవతారిక :— ఇట్లు నాల్గు శ్లోకములతో సుందరభుజ స్వామి సర్వాభీష్టప్రదుఁ డని చెప్పి ఆనాఁటి చండపాషండప్రభు వగు క్రిమికంఠుని మూలమునఁ బ్రవాసితులైన భగవ ద్రామానుజుల చరణనలిన విశ్లేషంబున కోర్వక స్తోత్రారంభము నందే 'సుందరోరుబాహుం। స్తోష్యే తచ్చరణ విలోకనాభి లాషీ' అను నిజాభిలాషను త్వరగా నొసఁగు మను స్వమనో రథమును సంక్షిప్తముగా నాల్గు శ్లోకములతో నుపసంహరించు చున్నారు.

> శ్లో॥ విజ్ఞాపనాం వనగిరీశ్వర! సత్యరూపా
> మంగీకురుష్వ కరుణార్ణవ! మామకీనామ్ ।
> శ్రీరంగధామని యథాపుర మేష సోఽహం
> రామానుజార్యవశగః పరివర్తిషీయ ॥ 126

ప్రతి :— హే కరుణార్ణవ! = దయాసముద్రుఁడ వగు, వనగిరి + ఈశ్వర! = వనాద్రినాథుఁడ వగు సుందరబాహు మూర్తీ!, సత్యరూపామ్ = యథార్థమగు, మామకీనామ్ = నాసంబంధమైన, విజ్ఞాపనామ్ = మనవిని, అంగీకురుష్వ = అంగీక రింపుము. (విని సఫల మొనర్పుము) ఆమనవి యేమనఁగా— ఏషః = ఈ, సః = ఆ, అహమ్ = నేను, యథాపురమ్ = పూర్వము

నందు వలె, శ్రీరంగధామని = దేవరవారి నివాసస్థానమైన శ్రీరంగము నందు, రామానుజార్యవశగః = భగవద్రామానుజాచార్య గురుచరణుల వశవర్తి నగుచు, పరివర్తిషీయ = సమీపమునం దుందును గాక.

విశేషములు :— కరుణార్ణవ !—'వ్యసనేషు మనుష్యాణాం భృశం భవతి దుఃఖితః' అని శ్రీమద్రామాయణమునఁ జెప్పిన ప్రకారము పరదుఃఖమును జూచి దుఃఖించుట యను స్వరూపముగల కృపతో నిండినవాఁడా ! అని భావము. వనగిరీశ్వర— అకించనుల మగు మమ్ము సంరక్షించుటకు వనాద్రి నాశ్రయించినవాఁడా ! యని యాశయము. ఏష సోఽహమ్— ఇప్పుడాచార్యవిశ్లేషముచే విషణ్ణహృదయుఁడనై ఆచార్యసమాగమ నిమిత్తము నీస్తోత్రమును నుడువఁ బ్రవృత్తుఁడ నగు నేనని తాత్పర్యము. 'రామానుజార్యవశగః పరివర్తిషీయ' సుందర బాహుస్వామి సర్వాభీష్టప్రదుఁడైనను తత్త్వజ్ఞు లగు శ్రీవత్స చిహ్నమిశ్రు లాచార్యవశవర్తిత్వము నే పరమ పురుషార్థముగాఁ బ్రార్థించుటచేత నిదియే సర్వోత్తీర్ణ మని యెఱుంగవలెను.

తా॥ కరుణాసముద్రుఁడ వగు ఓవనగిరినాథా ! యథార్థ మగు నాయీమనవిని అంగీకరించి త్వరగా సఫల మొనర్పుము. ఆ మనవి యేమన ఆచార్యుల యెడఁబాటుచేత విషణ్ణహృదయుండనై వారి సమాగమాభిలాషినై దేవరవారి స్తుతిని వ్రాయఁ బ్రవృత్తుఁడ నగు నేను శ్రీవారి నివాసమగు శ్రీరంగమునందు భగవద్రామానుజ గురుచరణుల వశవర్తినై యుందును గాక.

ఉ. ఓనిరవద్య దివ్యకరు
ణోదధి ! కాననశైలనాథ ! నీ

పీనులఁ బెట్టి నా దయిన
విన్నపముల్ సఫలం బొనర్పు, రా
మానుజ దేశికేంద్ర చర
ణాంబుజసేవనభాగ్య మందుచున్
నే నివసించునట్లు దయ
నీయుఁడ రంగని మందిరంబునన్.

శ్లో॥ కిం చేదం చ విరించి భావన! వనాద్రీశ! ప్రభో! సుందర!
ప్రత్యాఖ్యాన పరాఙ్ముఖో వరదతాం పశ్య న్నవశ్యం శృణు।
శ్రీరంగశ్రియ మన్వహం ప్రగుణయః స్త్వద్భక్తభోగ్యాం కురు
ప్రత్యక్షం సునిర స్త మేవ విదధత్ ప్రత్యర్థినాం ప్రార్థనమ్॥ 130

ప్రతి :— విరించిభావన! = బ్రహ్మ నుద్భవిల్లఁ జేసినవాఁడా!, వనాద్రీశ = వనగిరినాథా, ప్రభో! = ప్రభువా!, సుందర! = సుందరబాహుమూర్తీ!, వరదతామ్ = నీవర ప్రదత్వప్రసిద్ధిని, పశ్యన్ = చూచుచు, ప్రత్యాఖ్యాన, పరాఙ్ముఖః = త్రోసి వేయుటయందుఁ బెడమొగము గలవాఁడ వగుచు, కించ = మఱియు (పూర్వశ్లోకోక్త విజ్ఞప్తికంటెఁ గూడ) ఇదమ్ = ఈమాటను, అవశ్యమ్ = ముఖ్యముగా, శృణు = వినుము. (అది యేమన)ప్రత్యర్థినామ్ = ప్రతిపక్షులగు పాషండులయొక్క, ప్రార్థనమ్ = ప్రార్థనను (భగవద్రామానుజులను ప్రవాసము గావింపఁజేసి శ్రీరంగశోభ నణఁచివేయ వలయునను కోరికను) ప్రత్యక్షమ్, ఏవ = మాకన్నుల యెదుటనే, సునిరస్తమ్ = బాగుగాఁ దొలగింపఁ బడినదానినిగా, విదధత్ = చేయుచు, శ్రీరంగశ్రియమ్ = శ్రీరంగసంపత్తిని, అన్వహమ్ = ప్రతిదినము, ప్రగుణయన్ = వర్ధిల్లఁజేయుచు, త్వత్, భక్త, భోగ్యామ్ = దేవరవారి భక్తజనులచేత ననుభవింపఁ దగిన దానినిగా, కురు = చేయుము.

విశేషములు :— విరించిభావన !— విరించిం భావయతి (ఉత్పాదయతి) ఇతి— బ్రహ్మను ఉద్భవింపఁ జేసినవాఁడని భావము. 'త్వద్భక్తభోగ్యాం కురు '— భగవద్రామానుజాచార్య ప్రభృతులగు శ్రీవారి భక్తులచేత ననుభవింపఁదగిన దానినిగాఁ జేయుము. ప్రత్యర్థినిరసన పూర్వకముగా శ్రీరంగ మంగళానుభవము కొఱకు భవదీయులగు రామానుజార్య ప్రభృతులను రక్షింపు మని యాశయము.

తా॥ బ్రహ్మను గన్నతండ్రి వగు వనగిరినాథుఁడవైన యోసుందరబాహుమూర్తీ ! వరప్రదుఁడ వను ప్రసిద్ధిని దెలుఁపు నీ వరదరాజనామమును మనస్సులోఁ బెట్టుకొని మావిజ్ఞప్తిని త్రోసివేయుట యందుఁ బెడమొగము గలవాఁడ వగుము. అనఁగా మా విన్నపమును మన్నింపుము. అంతియేకాదు. ఈమాటను తప్పక విని ముఖ్యముగా మన్నింప వలెను. భగవద్రామానుజులను దఱిమివైచి శ్రీరంగవైభవము నణఁచి వేయ వలయునను ప్రత్యర్థులగు పాషండుల కృత్యములను మా కన్నులముందే విఫల మొనర్చి యథాపూర్వకముగా శ్రీరంగ శోభను వర్ధిల్లఁ జేయుచు భవదీయ భక్తుల కనుభావ్య మొనర్పుము.

మ. పరమేష్ఠిప్రభవా ! వనాచలవిభూ! భావంబునం దెన్ని నీ
వరదత్వోరుయశంబుఁ,గా దనక దేవా! సల్పుమా యిద్ది చె
చ్చెర శ్రీరంగముశోభవర్ధిలఁగ దుశ్చేష్టుల్ తలల్ వంప మే
మరయన్ వైష్ణవకోటిభోగ్యముగ నత్యంతంబుశ్రీరంగముఁన్.

అవతారిక :— ఇట్లు ప్రార్థింపఁబడిన విషయమునే యాదరాతిశయముచేత మఱొకసారి భంగ్యంతరముగాఁ బ్రార్థించు చున్నారు.

శ్లో॥ కారుణ్యామృతవారిధే! వృషపతే! హేసత్య సంకల్పన!
శ్రీమన్! సుందర! యోగ్యతావిరహితా నుత్సార్య సర్వాన్ కిల।
క్షామ్యన్ సాధుజనైః కృతాం స్తు నిఖిలా నేవాపచారాన్ క్షణాత్
తద్భోగ్యా మనిశం కురుష్వ భగవన్! శ్రీరంగధామశ్రియమ్॥ 131

ప్రతి :— భగవన్! = షడ్గుణైశ్వర్య సంపన్నుఁడా!, హే సత్యసంకల్పన! = ఓ సత్యసంకల్పుఁడా!, సద్వాత్సల! = సజ్జనులయందు వాత్సల్యము గలవాఁడా! కారుణ్య, అమృత, వారిధే = దయకు క్షీరాబ్ధివంటివాఁడా!, వృషపతే= వనగిరి నాథా! శ్రీమన్=పురుషకారభూతురా లగు లక్ష్మీదేవితో నెడఁబాయనివాఁడా!, సుందర!= ఓ సుందరబాహుస్వామీ!, యోగ్యతా, విరహితాన్ = యోగ్యతలేని పాషండులను, ఉత్సార్య = పాఱఁదోలి, సాధుజనైః = సాత్త్వికజనులచేత, కృతాన్= చేయఁబడిన, నిఖిలాన్= సమస్తములగు, అపచారాన్, ఏవ = అపరాధములను, క్షామ్యన్= క్షమించుచు, క్షణాత్ = క్షణములో, (త్వరగా) శ్రీరంగధామశ్రియమ్ = శ్రీరంగక్షేత్రముయొక్క సంపదను, అనిశమ్ = ఎల్లప్పుడు, తద్భోగ్యామ్= ఆసాధుజనులచేత ననుభవింపఁదగిన దానినిగా, కురుష్వ= చేయుము.

విశేషములు :— ఈ శ్లోకమునందలి సంబుద్ధు లన్నియు సాభిప్రాయకములు. హే సత్యసంకల్పన!— యథార్థమగు ప్రతిజ్ఞ గలవాఁడా! 'అ ప్యహం జీవితం జహ్యాం త్వాం వా సీతే! సలక్ష్మణామ్। నహి ప్రతిజ్ఞాం సంశ్రుత్య బ్రాహ్మణేభ్యో విశేషతః' అని రామాయణమున దేవరవారు సెలవిచ్చినట్లు 'ద్వయమును అర్థానుసంధానముతోఁ గూడ సతత మిట్లే నుడువుచు శరీరపాతపర్యంత మీ శ్రీరంగమునందే సుఖముగా నుండు' మని శ్రీ భగవద్రామానుజ గురుపాదుల నుద్దేశించి

సంకల్పించితిరి గదా! అది సత్యప్రతిజ్ఞ కావలదా? అని యీ సంబుద్ధియొక్క యాకూతము. కారుణ్యామృతవారిధే — సామాన్యముగాఁ బరదుఃఖాసహిష్ణువునకు ఆశ్రితుల క్లేశముల విషయమున ఉపేక్ష యుచితము కాదని భావము. అపచారాన్ — చేయరాని వానినిఁ జేయుట చేయవలసిన వానిని మానుట మొదలగు అపరాధములను, (అకృత్యకరణ, కృత్యాకరణాదిరూపా అపచారా ఇత్యుచ్యంతే) 'తదాభగ్నా మనిశం కురుష్వ భగవన్ శ్రీరంగధామశ్రియమ్' — శ్రీరంగక్షేత్ర వైభవమును భగవద్రామానుజతచ్ఛిష్య ప్రశిష్యాది సాత్త్విక జనానుభావ్యముగాఁ జేయవలసిన దని శ్రీకూరేశులవారి గూఢాభిప్రాయము.

తా॥ షడ్గుణైశ్వర్య సంపన్నుఁడవును, సత్యసంకల్పుఁడవును, సద్వాత్సల్యుఁడవును, దయాసముద్రుఁడవును, వనగిరినాథుఁడవును, రమానపాయివియునగు ఓసుందరబాహుస్వామీ! యోగ్యతా విరహితులగు పాషండులను బాఱఁదోలి సాధుజనులొనర్చిన అపచారము లేవేని యున్నవాని నన్నిటిని క్షమించి త్వరగా శ్రీరంగక్షేత్ర వైభవమును భాగవతానుభావ్యము నొనర్పుము.

శా. కారుణ్యామృతవారిధీ! ప్రణతర
క్షా! సత్యసంకల్ప! శ్రీ
దారా! సంశ్రితవత్సలా! వనగిరీం
ద్రా! దుష్టపాషండులన్
బాఱం దోలి శ్రితాపచారము లెదన్
బాటింప కోదేవ! యీ
శ్రీరంగానుభవంబు భక్తతతికిన్
సిద్ధింపఁగాఁ జేయవే!

శ్లో॥ ఇదం భూయో భూయః పున రపిచ భూయః పున రపి
స్ఫుటం విజ్ఞాప్స్యా మీత్యగతి రబుధోఽనన్యశరణః ।
కృతాగా దుష్టాత్మా కలుషమతి రస్మీత్యనవధే
ర్దయాయా స్తే పాత్రం వనగిరిపతే! సుందరభుజ ॥ 132

ప్రతి :— వనగిరిపతే! = వనాద్రినాథుఁడ వగు, సుందరభుజ = ఓ సుందరబాహుమూర్తీ!, అగతిః = దిక్కులేనివాఁడను, అబుధః = పామరుఁడను, అనన్యశరణః = ఇతర శరణము (రక్షణము) లేనివాఁడను (అగు అహమ్ = నేను ఇదమ్ = దీనిని, భూయః భూయః = మఱల మఱల, పున రపిచ = తిరిగియు, భూయః = మఱల, పునః, అపి = తిరిగియు, స్ఫుటమ్ = స్పష్టముగా, విజ్ఞాప్స్యామి = మనవి చేసికొనఁ దలఁచుచున్నాను, దుష్టాత్మా = దుష్టచిత్తుఁడను, కలుషమతిః = మలినబుద్ధియు నగు నేను, కృతాగాః = చేయఁబడిన నేరములు గలవాఁడను, అస్మి, ఇతి = అగుచున్నానను కారణమువలన, తే = నీయొక్క, అనవధేః = హద్దులులేని, దయాయాః = కృపకు, పాత్రమ్ = పాత్రమును.

విశేషములు :— 'అగతిరబుధః'— జ్ఞానరాహిత్యపర మగు 'అబుధ' పదముతోఁ గలిపి చెప్పుటవలన 'అగతిపదము కర్మరాహిత్యమును జెప్పును. కావున నిచ్చట అగతిః = కర్మయోగరహితుఁడను, అబుధః = జ్ఞానయోగరహితుఁడను అని యర్థము. కనుక నే కర్మజ్ఞానయోగములచేత సాధ్యమగు భక్తియోగముగూడ లేదు గావున (ఏయుపాయము లేదుగాన) అనన్యశరణః = నీవొకడవే శరణముగాఁ గలవాఁడ నని చెప్పుట పొసఁగును. 'ఇదం భూయో భూయః'— ఒకమారు మనవి చేసికొనుటయే చాలియుండఁ బిచ్చివానివలెఁ బదేపదే పలుసారు లిట్లు మనవి చేయుట అపరాధమే యైనను ప్రియ

తరులగు గురుచరణుల యెడఁబాటుచేఁ గలిగిన విషాదముచే నితఁ డిట్లు చేయుచున్నాఁడని తమరు కృపఁదలఁచి నావిన్నపమును మన్నించి గురుల సాంగత్యము మరలఁ ద్వరలో నాకు శ్రీరంగమునఁ గల్గింపుఁడని భావము.

తా॥ వనాద్రినాథుఁడవగు ఓ సుందరబాహుమూర్తీ! కర్మ జ్ఞాన భక్తిరూపములగు ఉపాయము లెఱుంగనివాఁడనై నీవే శరణుగా నమ్మియున్న నే నిదివఱకుఁ జేసియున్న యీ విన్నపమునే మఱల మఱలఁ దిరిగి తిరిగి చేసికొనుచున్నాను. దుష్టచిత్తుఁడు కలుషబుద్ధి యపరాధి యని నన్నుఁ దలపోసి హద్దులు లేని నీ కృపకుఁ బాత్రము నొనర్పుము.

ఉ. సుందరబాహుమూర్తి! వన
శోభిత భూధరవర్తి! నేఁ గదుఁ
మందుఁడ జ్ఞానకర్మముల
మాట యెఱుంగను దిక్కునీవె నీ
ముందఱ మాటిమాటికి న
మోనమ యంచిది విన్నవించెదన్
వందలమార్లు నీకృపకుఁ
బాత్రుఁడ క్షుద్రుఁడ దుష్టచిత్తుఁడన్.

★

శా. స్వామీ! మీ స్తుతి టీకవ్రాయుటకు నే
శక్తుండనా! కాను, లే
దేమాత్రంబును శాస్త్రవైదుషియు సా
హిత్య ప్రవేశాదులున్,
సామాన్యుండను దాసశేషులదయా
సారంబె నా కున్నయా

సామగ్రీబల మెల్ల దోషములకుఁ
దెంతవ్యుండఁ సుందరా!

శా. స్తోత్రవ్యాఖ్యకు బ్రొక్కదుఁ వనగిరి
క్ష్మోణీశ! యేమంటివో
'కృతాయంతృణకల్ప' యం చనక శ్రీ
కోదండరామప్రభు
క్షేత్రాస్థానకపీంద్ర పట్టము నొసం
గెఁ దాస శేషుండు భ
క్త్రత్రాతా! భవదీయ సంస్తవమహా
త్వ్యంబెన్న నాశక్యమే॥

శా. టీకఁ వ్రాసి యొసంగుఁడం చడుగ న
ట్లేయంటేఁబంచ స్తవిఁ
సాకల్యంబుగ వ్రాసియీ వరదరా
జస్తోత్ర మొక్కం డిఁకఁ
బాకీ యుంటిని దాస శేషులకు దే
వా! దీనిఁ జెల్లించి నా
వాకుఁ సత్యముఁ జేసి కొంటకు భవ
ద్వాత్సల్య మర్థించెదఁ.

గద్యము. ఇది శ్రీ శ్రీ వత్సాంకమిశ్ర విరచితంబగు పంచ స్తవీస్థం బగు శ్రీ సుందరబాహు స్తవంబునకు కవిశేఖర, మహోపాధ్యాయ, మధ్వశ్రీ పళ్ళెపూర్ణప్రజ్ఞాచార్య కృతం బగు భావాదర్శంబను సపద్యాంధ్ర వివరణంబు.

సమాప్తంబు.

శ్రీ హయగ్రీవాయ నమః

## శ్రీ వత్సాంకమిశ్ర విరచిత పంచస్తవీస్థ

# శ్రీ వరదరాజస్తవము

కవిశేఖర మధ్వశ్రీ పళ్లెపూర్ణ ప్రజ్ఞాచార్యకృత

భావాదర్శనామకాంధ్ర వివరణ

## పద్యసహితము

అవతారిక :— శ్రీ భాష్యకారసకాశనివాస ప్రకాశితాఖిలవేదాంతతత్త్వార్థు లగు శ్రీవత్సచిహ్నమిశ్రులు దయాపరులై సకలసజ్జన సంజీవనమునకుఁ బంచస్తవీ వ్యాజమున నర్థపంచకమును బ్రకాశింపఁ జేయఁదలఁచి మొట్టమొదటఁ బ్రధానముగా నకుంఠమహిముఁ డగు శ్రీ వైకుంఠనాథుని స్వరూపరూపాదికమును దాని కుపసర్జనముగాఁ బ్రత్యగాత్మాది స్వరూపమును, వైకుంఠస్తవమునందు గురువందన పూర్వకముగాఁ బ్రదర్శించి వ్యూహాంతర్యాములు గూడ నచింత్య వైభవములు గల వగుటచేఁ దదంతర్భూతములుగనే భావించి విభవావతారభావుక వ్యాపారవిషయకముగా అతిమానుష స్తవమును రచించి అర్చావతార ప్రస్తావమున సమస్త కాంక్షిత ప్రదానదీక్షితుఁ డగు వనాద్రిమందిరు సుందరబాహు మూర్తిని పలుసారులు స్వాచార్యు లగు భగవద్రామానుజుల చరణకమల సేవాఫలము ననుగ్రహింపుఁ డని స్తుతించి 'హస్తి

శైలనిలయో భవాన్' అని ప్రస్తావింపఁబడిన కరిగిరినాథుని శరణాగతి మంత్రవిధముగా నిపుడు స్తుతింపఁ బోవుచుఁ బ్రారంభింపఁ దలఁచఁబడిన వరదరాజ స్తవము నిర్విఘ్నముగా సమాప్తిఁ జెందుటకు ఆశీర్వచనరూప మగు మంగళమును శిష్యశిక్షార్థము స్తవారంభమున నొనర్చు చున్నారు.

శ్లో॥ స్వస్తి హస్తిగిరిమస్తశేఖరః
సంతనోతు మయి సంతతం హరిః ।
నిస్సమాభ్యధిక మభ్యధత్త యం
దేవ మౌపనిషదీ సరస్వతీ ॥ 1

ప్రతి :— ఔపనిషదీ = ఉపనిషత్సంబంధిని అగు, సరస్వతీ = వాక్కు, (వేదాంతవాక్కు), దేవమ్ = సకల కల్యాణగుణ విశిష్టుఁ డగు, యమ్ = ఏ వేల్పును, నిస్సమ, అభ్యధికమ్ = సమానుఁడుగాని అధికుఁడు గాని లేనివానినిగా, అభ్యధత్త = పలికెనో, హస్తిగిరి, మస్త, శేఖరః = కరిగిరిశిఖరమున కలంకార భూతుఁడగు, (సః = ఆ) హరిః = ప్రణతార్తిహరుఁడగు వరద రాజస్వామి, మయి = నావిషయమున, సంతతమ్ = ఎల్లప్పుడు, స్వస్తి = శ్రేయస్సును, సంతనోతు = బాగుగా విస్తరింపఁ జేయుఁ గాక.

విశేషములు:—స్తోత్రారంభమున స్వస్తి పదప్రయోగము. వక్తకును, పాఠకులకును మంగళార్థము. 'నిస్సమాభ్యధికమ్— ఇందులకుఁ బ్రమాణమగు ఉపనిషద్వాక్యమది యన 'న తత్సమ శ్చాభ్యధిక శ్చ దృశ్యతే' (ఆపరమాత్మతో సమానుఁడుగాని

యంతకంటె నధికుఁడుగాని కానఁబడఁడు) దేవమ్— దివు క్రీడా, విజిగీషా, వ్యవహార, ద్యుతి, స్తుతి, మోద, మద, స్వప్న కాంతి గతిషు— అను ధాతుపాఠమునఁ జెప్పఁబడినట్లు సకల కల్యాణగుణగణములు కలవాఁ డని యర్థము.

తా॥ 'న తత్సమ శ్చాభ్యధిక శ్చ దృశ్యతే' ఇత్యాద్యుపని షద్వాణి కల్యాణగుణవిశిష్టుఁ డగు నేవేల్పును సమాధికులు లేనివానినిగా నుడివెనో కరిగిరి శిఖరాలంకారభూతుఁ డగు నావరదరాజస్వామి నాకు సంతతము శ్రేయస్సును విస్తరింపఁ జేయుఁగాక.

గీ॥ దేవు నెవ్వని నుపనిషద్దివ్యవాణి
పలుకునో! సమాధికులు లేనిప్రభువుఁ గాఁగ
కరిమహీధర శిఖర శేఖర సదృక్షుఁ
డా వరదరాజు నాకు శ్రేయస్సు లిడుత.

శ్లో॥ శ్రీనిధిం నిధి మపార మర్థినా
మర్థితార్థ పరిదాన దీక్షితమ్ ॥
సర్వభూత సుహృదం దయానిధిం
దేవరాజ మధిరాజ మాశ్రయే ॥ 2

ప్రతి :—శ్రీనిధిమ్=లక్ష్మీ నిలయ మైనట్టియు, అర్థినామ్= యాచకులకు, అపారమ్=అంతులేని (తఱుఁగని) నిధిమ్=గని యైనట్టియు, అర్థిత, అర్థ, పరిదాన, దీక్షితమ్=ప్రార్థింపఁబడిన పురుషార్థముల నొసంగుటకు దీక్షవహించి నట్టియు, సర్వ, భూత, సుహృదమ్ = సమస్తప్రాణులకు అనిమిత్తోపకారి యైనట్టియు,

దయానిధిమ్=దయకు గని యైనట్టియు, అధిరాజమ్=స్వామి యైనట్టియు, దేవరాజమ్= దేవతాసార్వభౌముఁ డగు శ్రీ వరద రాజస్వామిని, ఆశ్రయే=శరణు చొచ్చు చున్నాను.

విశేషములు :— ఈ శ్లోకమునందు మంత్రరత్నముయొక్క— పూర్వఖండార్థము సంగ్రహింపఁ బడుచున్నది. పూర్వఖండ మిది 'శ్రీమన్నారాయణచరణౌ శరణమహం ప్రపద్యే' శ్రీనిధిమ్—శ్రీః నిధీయతే, అస్మిన్ ఇతి, శ్రీనిధిః, తమ్—శ్రీదేవి యిచట నుంచఁబడుచున్నది, (లేదా) శ్రీలకు నిధి అనఁగా నిధివలెఁ బ్రార్థనీయుఁ డని భావము. దీనిచే మంత్రరత్నము పూర్వఖండములోని 'శ్రీమత్' పదార్థము సంగ్రహింపఁబడెను.

నారయణ పదవాచ్యములగు కొన్నిగుణములు వర్ణింపఁ బడుటచే నారాయణపదార్థ మీామీాఁదఁ జెప్పఁబడుచున్నది.

'నిధి మపార మర్థినామ్— అర్థుల కపరిచ్ఛిన్నమగు నిధి యనుటచేత- పరమప్రాప్యత్వము చెప్పఁబడెను. అర్థితార్థ— అను రెండనపాదముచేత 'ప్రాపకత్వము' సంగ్రహింపఁబడెను. సర్వభూతసుహృదమ్— అనుటచేతఁ బ్రాపకత్వమునఁ గించి త్కార నైరపేక్ష్యము చెప్పఁబడినది. దయానిధిం— అనుట చేత సౌహార్దము లేకున్నను పరదుఃఖాసహిష్ణుత్వ ముండుట చేత రక్షణ విషయమున స్వాభావికప్రవృత్తి నుడువఁబడెను. అధిరాజమ్— అనుటచేత స్వామిత్వము వివరింపఁబడెను. దేవరాజమ్— 'త మీశ్వరాణాం పరమం మహేశ్వరం । తం దేవతానాం పరమం చ దైవతమ్' అని చెప్పినట్లు దేవతా

సార్వభౌముఁ డని భావము. ఆశ్రయే— (శరణం ప్రపద్యే) శరణు చొచ్చుచున్నాను. శ్రీమంతుఁడు, ప్రాప్యుఁడు, ప్రాపకుఁడు, సౌహార్ద, దయా, స్వామిత్వ, విశిష్టుఁడు నగు దేవతాసార్వభౌముని చరణముల శరణుచొచ్చు చున్నాను. అని యీ శ్లోకసారము కావున మంత్రరత్నముయొక్క పూర్వఖండార్థము దీనిలో సంక్షిప్తముగా భక్తజనానుగ్రహమునకు శ్రీవత్సాంకులు చేర్చి యున్నారు.

తా॥ శ్రీనిధియు నర్థుల కక్షయనిధియు వాంఛితార్థముల నొసంగ బద్ధదీక్షుఁడు సర్వభూతములకు ననిమిత్తోపకారియు దయానిధియు దేవతాసార్వభౌముఁడు నగు దేవరాజగు వరదరాజును శరణుచొచ్చు చున్నాను.

గీ॥ శ్రీనిధియు నర్థులకుఁ బెన్నిధానమాశ్రి
తాళివాంఛితదాన దీక్షాన్వితుండు
అఖిలభూతహితుఁడు కరుణాశ్రయుండు
నైనశ్రీ దేవరాజు నే నాశ్రయింతు. 2

అవతారిక :— ఇంద్రియమార్గాతిక్రాంతుఁ డైనను భగవానుని యింద్రియగోచరత్వరూపమును శరణవరణోపయుక్తము నగు సౌలభ్యగుణమును శ్రీవత్సాంకమిశ్రులు లిట ననుభవించుచున్నారు.

శ్లో॥ నిత్య మింద్రియపథాతిగం మహో
యోగినా మపి సుదూరగం ధియః ।
అ ప్యనుశ్రవ శిరస్సు దుర్గ్రహం
ప్రాదరస్తి కరిశైల మస్తకే ॥ 3

ప్రతి :— నిత్యమ్=శాశ్వత మైనదియు, ఇంద్రియ, పథ, అతిగమ్=ఇంద్రియమార్గము నతిక్రమించినదియు, యోగినామ్ =యోగులయొక్క, ధియః అపి=బుద్ధికిఁ గూడ, సుదూర గమ్ = మిక్కిలి దూరమును జెందినదియు (అందనిదియు) అనుశ్రవశిరస్సు, అపి=వేదాంతముల యందుఁ గూడ, సుదుర్గ్రహమ్ = కష్టముచేత గ్రహింపఁ దగినదియు (సుగ్రహము కానిదియు) అగు మహః=తేజస్సు (వరదరాజస్వామి) కరిశైల మస్తకే = కరిగిరి శిఖరమునందు, ప్రాదురస్తి =ఆవిర్భవించి యున్నది.

విశేషములు :— ఇంద్రియపథాతిగమ్– న మాంసచక్షు రభివీక్షతే తమ్– అన్నట్లు ఇంద్రియాగోచర మని భావము. సుదూరగమ్– విభజించి తెలిసికొన శక్యముగానిది. అనుశ్రవ శిరస్సు–ఆచార్యోచ్చారణము ననుసరించి శ్రూయమాణములు గనుక వేదములకు అనుశ్రవములని పేరు. తచ్ఛిరములు ఉపని షత్తులు (వేదాంతములు) వానియందు. దుర్గ్రహమ్— సుగ్రహము కానిది. ప్రమాణము.

'యతో వాచో నివర్తంతే । అప్రాప్య మనసా సహ' ఇత్యాదులు.

'ప్రాదు రస్తి కరిశైలమస్తకే' ఇందుకుఁ బ్రమాణ శ్లోకములు.

'గంగాయా దక్షిణే భాగే । యోజనానాం శతద్వయే
పంచయోజన మాత్రేణ । పూర్వాంభోధే స్తు పశ్చిమే ।

వేగవత్యుత్తరే తీరే పుణ్యకోట్యాం హరి స్స్వయమ్
వరద స్సర్వభూతానా మద్యాఽపి పరిదృశ్యతే।
వపాహోమే ప్రవృత్తే తు ప్రాత స్సవనకర్మణి
ధాతు రుత్తరవేద్యంతః ప్రాదు రాసీ జ్జనార్దనః॥'

(గంగకు దక్షిణమున రెండువందల యామడలలో నున్న పూర్వసముద్రపుఁ బడమటి తీరమున వేగవతీనది యుత్తర తటమునందు 'పుణ్యకోటీక్షేత్రమున శ్రీహరి యందఱికి వరముల నిచ్చుచు వరదనామముతో నేఁటికిని గానవచ్చు చున్నాఁడు. బ్రహ్మచేయు యజ్ఞములో ప్రాతస్సవనకర్మ యందు వపా హోమము జరుగుచుండఁగా నుత్తరవేది యందు సాక్షా జ్జనార్దనుఁడు వరదరాజ రూపముతో నావిర్భవించెను.) దిగ్గ జములచేతఁ బూజింపఁబడుటచే నీకొండకు హస్తిగిరి యనిపేరు.

తా॥ శాశ్వతమును, ఇంద్రియాతీతమును, యోగులబుద్ధికి సైత మందనిదియు, వేదాంతములందు సైతము సులభ గ్రాహ్యము కానిదియు నగు నొకతేజస్సు కరిగిరి శిఖరమున నావిర్భవించి యున్నది.

చ. పరిమితి లేనియట్టిది, య
పారజవేంద్రియ వాజిరాజముల్
పరుగిడ దవ్వగానె కను
పట్టెడు నట్టిది, యోగిబుద్ధికిన్
జొరఁ బడ రాని దాగమిక
సూక్తుల కందని దెద్ది యద్దియే
కరిగిరి మస్తకంబున నొ
కానొక వెల్గుగ గోచరించెడున్.

అవతారిక :— ఇప్పుడు వరదరాజులవారికి కరిగిరిశిఖరావాసము నందలి రసికతాతిశయము శ్రుతికి సైతమాదరణీయమని నుడువుచున్నారు.

శ్లో॥ వల్లికా శ్రుతిమతల్లికామయీ
యేన పల్లవితవిశ్వశాఖయా ।
స్వశ్రియా కరిగిరే రనుక్రియాం
వష్టి పుష్టవరదం త మాశ్రయే ॥ 4

ప్రతి :— శ్రుతి, మతల్లికా, మయీ = శ్రేష్ఠమగు శ్రుతి స్వరూపమయిన, వల్లికా=తీఁగె, (శ్రేష్ఠమగు శ్రుతి యనెడు తీఁగె) యేన = ఏవరదరాజస్వామిచేత, పల్లవిత, విశ్వ, శాఖయా = పల్లవించిన సమస్తములగు కాణ్వ, కాఠక, కాలాపాది, వేదశాఖలుగల,(వనగిరిపక్షమున) చిగిర్చిన సమస్తములగు కొమ్మలు గల, స్వశ్రియా=స్వకీయశోభచేత, కరిగిరేః=హస్తిశైలముయొక్క, అనుక్రియామ్ = పోలికను (అనుకరణమును) వష్టి = కోరుచున్నదో, తమ్=అటువంటి, పుష్ట, వరదమ్= పూర్ణవరప్రదుఁడగు వరదరాజస్వామిని, ఆశ్రయే=శరణు చొచ్చుచున్నాను.

విశేషములు :— 'వల్లికా శ్రుతిమతల్లికామయీ'—మతల్లికా శబ్దము శ్రేష్ఠవాచకము. శ్రుతి (వేదము) ప్రమాణములలో శ్రేష్ఠముగాన శ్రుతిమతల్లిక యైనది. దీనియందు వల్లికాత్వ మారోపింపఁబడినది. శ్రేష్ఠమగు వేదమనెడు తీఁగె అనిభావము. 'యేన పల్లవిత విశ్వశాఖయా'— వేదైశ్చ సర్వై రహ మేవ వేద్యః— సర్వే వేదా యత్పద మామనంతి— ఇత్యాది శ్రుతు

లచేఁ జెప్పఁబడినట్లు సర్వవేదప్రతిపాద్యుఁ డగు భగవానుఁడు గేయములకుఁ బదేపదే నుడువఁబడు పల్లవివలె భగవంతునికి గేయములవంటి కాణ్వ, కాఠక, సుబాలాది, వేదశాఖలకు 'పల్లవ' స్థానమువలె నలంకారభూతుఁ డని 'పల్లవిత' శబ్దముచే ధ్వనితమగుచున్నది. 'వష్టి— 'వశ=కాంతౌ, కాంతి = రిచ్ఛా అను ధాతువునకు లట్—రూపము కోరుచున్నది యని యర్థము. మృష్ట వరదమ్ = వాంఛితాధిక ఫలప్రదమ్—— కోరఁబడిన దానికంటె నధికఫలప్రదుఁ డని భావము. మృష్ట మనఁగా సమృద్ధి. కరిగిరే రనుక్రియాం వష్టి— శ్రీవరదరాజస్వామి యందఱికి గోచరించునట్లు కరిగిరిశిఖరమున వేంచేసి యందలి శాఖలకు (కొమ్మలకు) పల్లవమువలె (చిగురు వలె) నలంకారమై తన సౌలభ్యమును జూపినట్లు తన శాఖలయందు (కాణ, కాఠక, సుబాలాది వేదశాఖలయందు) పల్లవము (పల్లవి)వలె నలంకారమగుచు నట్టి సౌలభ్యమును జూపలేదని శ్రుతిమతల్లి కరిగిరి సామ్యమును దనకుఁ గోరుకొను చున్నది అని భావము.

తా॥ శ్రుతిమతల్లి యనెడు వల్లి (తీఁగె) ఏ వేల్పుచేతఁ జిగిరించిన కాణ్వ, కాఠ, కాలాప, సుబాలాది శాఖలు గల(కరిగిరి పక్షమున—— కొమ్మలుగల) స్వకీయశోభచేతఁ గరిగిరిసామ్యమును కోరుచున్నదో! కోరినదానికంటె నధికముగా వరముల నిచ్చు ఆ వరదరాజస్వామిని శరణు చొచ్చుచున్నాను.

ఆ.వె. శ్రుతిమతల్లి వల్లి శోభిల్లియు నెవండు
పల్లవముగ శాఖ లెల్లఁ గ్రాల,

సర్వదృశ్యవరద చారుకిరీట మా
హాస్తిశైలసామ్య మభిలషించు. 4

అవతారిక :— శ్రుతికంటెను హాస్తిగిరియే అధికమని నుడువు చున్నారు.

శ్లో॥ యం పరోక్ష ముపదేశత స్త్రయీ
నేతి నేతి పరపర్యుదాసతః ।
వక్తి య స్త మపరోక్ష మీక్షయ
త్యేష తం కరిగిరిం సమాశ్రయే ॥ 5

ప్రతి :— త్రయీ = శ్రుతి, (బృహదారణ్యకోపనిషత్) ఉపదేశతః=ఉపదేశమువలన, నేతి, నేతి=(న × ఇతి–న × ఇతి) కాదు కాదని (పరబ్రహ్మము చెప్పఁబడిన దాని వంటిది కాదు కాదని) పర, పర్యుదాసతః=ఇతరముయొక్క నిషేధమువలన, యమ్=ఎవని, పరోక్షమ్=చాటుగా, వక్తి= చెప్పుచున్నదో, యః, ఏషః=ఏ యీకొండ, తమ్=ఆ పరబ్రహ్మమగు వరద రాజస్వామిని, అపరోక్షమ్=ప్రత్యక్షముగా (కన్నులముందు) ఈక్షయతి = చూపించుచున్నదో, తమ్ = అటువంటి, కరి గిరిమ్=హాస్తిశైలమును, సమాశ్రయే=భక్తితో ఆశ్రయించు చున్నాను.

విశేషములు :— పర, పర్యుదాసతః— శ్రుతి— ద్వే వావ బ్రహ్మణో రూపే,— మూర్తం చామూర్తం చ, సత్యం చానృతం చ ఇత్యాది వాక్యముల యందలి మూర్త, సత్య, శబ్దములచేతను, అమూర్తానృత శబ్దములచేతను, ప్రతిపాదింపఁ

బడిన చిదచిత్తత్త్వరూపాదుల పర్యుదాసము (నిషేధము) వలన చిదచిత్తత్త్వమాత్ర రూపత్వాద్యుక్త ప్రకారము బ్రహ్మము కాదని దానిని నిరసించుటయే చివరకుఁ దేలుట వలన, పరోక్షమ్ = అప్రత్యక్షముగా (చాటుగా) బ్రహ్మస్వరూప ప్రకారమును నిరూపింపకయే యని భావము. అపరోక్షమీాక్షయతి=బృహదారణ్యకోపనిషత్తు వివిచ్య (స్పష్టముగాఁ జెప్పఁజాలని బ్రహ్మవస్తువును ఇదిగో! ఈ వరదరాజస్వామియే యీా బ్రహ్మమని కరిగిరి స్పష్టముగా నెల్లరికిఁ జూపించుచున్న దని సారాంశము. ఈ విషయమే 'నిత్యం మింద్రియ పథాతిగ'మ్మనెడు 8వ శ్లోకమున వర్ణింపఁ బడినది. 'తం కరిగిరిం సమాశ్రయే'– పరబ్రహ్మమగు వరదరాజస్వామిని సాక్షాత్కరింపఁ జేయుటవలనఁ గరిగిరి సమాశ్రయణీయ మని భావము. బృహదారణ్యకోపనిషత్తునందు—— 'ద్వే వావ బ్రహ్మణో రూపే మూర్తం చామూర్తం చ సత్యం చానృతం చ' అని యుపక్రమించి, తస్య హైతస్య పురుషస్య రూపం యథా మహారజనం వాసః పాండవావికః యథేంద్ర గోపా యథాగ్న్యర్చి ర్యథా పుండరీకమ్' ఈ మొదలగు వాక్యములచేత మూర్తామూర్త కనకాంబర పాండుకంబళాది రూపములను నుడివి 'అథాత ఆదేశో నేతి నేతి నే త్యన్య త్పర మస్తి. అథ నామధేయం సత్యస్య సత్యం ప్రాణా వై సత్యమ్– తేషా మేవ సత్యమ్' అని చెప్పఁబడినది. పై శ్రుతివాక్యముల కన్నింటికి సూ॥ ప్రకృతైతా వత్త్వం హి ప్రతిషేధతి తతో బ్రవీతి చ

భూయః 3-2-21 బ్రహ్మ సూత్రమున అర్థనిర్ణయ మొనర్పఁ బడినది.

తా॥ త్రయి (బృహదారణ్యకోపనిషత్తు) ఉపదేశమువలనఁ బరబ్రహ్మము పూర్వము చెప్పఁబడిన లక్షణములు కలది మాత్రమే కాదు- కాదు- అని పరపర్యుదాసవలననే వరదరాజ స్వామిని అప్రత్యక్షముగా నుడువుచున్నదో! యీ వరదరాజ స్వామిని ఈ కరిగిరి యందఱకుఁ బ్రత్యక్షముగాఁ జూపుచున్నది. కావున వరదరాజస్వామిని పరబ్రహ్మమని స్పష్టముగాఁ జెప్పఁ జాలని శ్రుతి కంటె నందఱికన్నులకుఁ బరబ్రహ్మమగు (శ్రీ) వరద రాజస్వామిని స్పష్టముగాఁ జూపించుచున్న కరిగిరియే మిన్న యని భావము.

ఆ॥ వె॥ నేతి నేతిశ్రుతులచేత వేనిఁ బరోక్ష
భంగిఁ బ్రాఁతపలుకు పలుకు నట్టి
పరమదైవతంబుఁ బ్రత్యక్షముగఁ జూపు
నట్టి హస్తిశిఖరి నాశ్రయింతు. 5

శ్లో॥ ఏష ఈశ ఇతి నిర్ణయం త్రయీ
భాగధేయరహితేషు నో దిశేత్ ।
హస్తిధామని న నిర్ణయేత కో
దేవరాజ మయ మీశ్వర స్త్వితి ॥ 6

ప్రతి :— త్రయీ = వేదత్రయము, భాగధేయ, రహితేషు = అదృష్టహీనుల విషయమున, ఏషః = ఈ వరదరాజ స్వామి, ఈశః = సర్వేశ్వరుఁడు, ఇతి = అని, నిర్ణయమ్ = నిశ్చయ

మును, నో, దిశేత్ = ఇయ్య లేదు, (కానీ) హస్తిధామని, తు = కరిగిరియం దున్ననో, దేవరాజమ్ = వరదరాజస్వామిని, అయమ్ = ఇతఁడు, ఈశ్వరః = సర్వేశ్వరుఁడు, ఇతి = అని, కః = ఎవఁడు, న, నిర్ణయేత = నిర్ణయింప లేఁడు. (ఎల్లరును నిర్ణయింతురని భావము.)

విశేషములు :— త్రయీ— 'ఇతి వేదాస్త్రయ స్త్రయీ' అమరము. ఋగ్వేద యజుర్వేద సామవేదములు. ఇందలి పూర్వార్థములోని విషయమే వైకుంఠ స్తవము 13వ శ్లోకమున వివరింపఁబడినది.

> 'య త్కేచి దత్ర భవతీం శ్రుతి మాశ్రయంతో
> వ్యర్థే కుదృష్టివినివిష్టధియో వినష్టాః'

> 'కొందఱు పూజ్య యా శ్రుతిని భవ్యంబా
> ప్రమాణంబుగా మహిఁ బేర్కొంచుఁ
> దదర్థ మెల్లఁ గుదృశుల్ మార్తుర్ వినా
> శంబుకై' (మదీయ పద్యభాగము)

ఉత్తరార్థ భావమిది— కరిగిరి నివాసము దేవరాజగు వరదరాజస్వామికి సర్వేశ్వరత్వాదులతో నెడఁబాటు లేని సమస్తకల్యాణ గుణాత్మకత్వమును జాటుచున్నది.

తా॥ వేదములు దురదృష్టవంతుల విషయమున నీ వరద రాజస్వామి సర్వేశ్వరుఁడని నిర్ణయింపఁ జాలక పోయినను, శ్రీకరిగిరియందుఁ బ్రతిజనుఁడును వరదరాజస్వామియే సర్వేశ్వరుఁడని నిర్ణయింపఁజాలును.

క॥ దురదృష్టులకున్ ద్రయి యీ
శ్వరుఁ డితఁ డని నిర్ణయింపఁ జాలదు గానీ,
కరిగిరియం దితఁడే యీ
శ్వరుఁడని నిర్ధారణంబు సలుపు జడుండున్. 6

అవ :— వెనుకఁ జెప్పినదానినే తేటతెల్ల మొనర్చు
చున్నారు.

శ్లో॥ హై కుదృష్ట్యభినివిష్టచేతసాం
నిర్విశేష, సవిశేషతా, శ్రయమ్ ।
సంశయం కరిగిరి ర్నుద త్యసౌ
తుంగ మంగళ గుణాస్పదే హరౌ ॥ 7

ప్రతి :— తుంగ, మంగళ, గుణ, ఆస్పదే=ఉన్నతము
లును (ఆనందగుణము వలెనే అపరిచ్ఛేద్యంబులును), కల్యాణ
కరములును అగు గుణములకు నిలయమైన, హరౌ=శ్రీ
మన్నారాయణమూర్తి విషయమున, కుదృష్టి, అభినివిష్ట,
చేతసామ్=కుదృష్టిచేత (అయథార్థ జ్ఞానముచేత) నాటుకొనిన
మనస్సు గలవారికి, నిర్విశేష, సవిశేషతా, ఆశ్రయమ్ =
నిర్గుణత్వ, సగుణత్వములకు నెలవైన, సంశయమ్=సందేహ
మును, అసౌ=ఈ, కరిగిరిః=హస్తిశైలము, నుదతి=పో
గొట్టుచున్నది.

విశేషములు :— నిర్విశేష, సవిశేష, తాశ్రయం సంశ
యమ్— శ్రీమన్నారాయణమూర్తి నిర్గుణుఁడా! సగుణుఁడా!

అను కోటిద్వయావలంబి సందేహమును అని భావము. అసౌ, కరిగిరిః— నిత్య,నిరవద్య, నిరతిశయ, కల్యాణగుణములు పుష్కలముగా నుండి యందఱకుఁ గన్నులముందు కనిపించు దేవరాజును దలతో మోయుచున్న యీ కరిగిరి అని తాత్పర్యము. నుదతి = నిరసించు చున్నది. కుదృష్టులకు ఉపనిషత్తులవలనఁ గూడ నేర్పడని 'దేవరాజు మంగళగుణగణాకరుఁ'డను నిర్ణయమును కరిగిరి సులువుగాఁ గలిగించుచున్నది యని సారాంశము. హై— ఈ శబ్దము (అవ్యయము) ప్రసిద్ధిని దెలుపును. శంకర పక్షీయులగు మాయావాదులు బ్రహ్మమునకు సగుణత్వము నంగీంరింపక పోయినను వారిలో నొక తెగవారగు యాదవ ప్రకాశ పక్షీయులు దశాభేదముచేత బ్రహ్మము నంగీకరించుట చేత బ్రహ్మము సగుణమా నిరుణమా! అని కోటి ద్వయావలంబి సంశయ మేర్పడెనని తెలియవలెను.

తా॥ ఆనందగుణమువలె నపరిచ్ఛిన్నంబులగు కల్యాణ గుణములకు నిత్యనిలయుఁడగు (శ్రీ) నారాయణుని విషయమున (శ్రీ)హరి సగుణుఁడా! నిర్గుణుఁడా! యని హృదయమున గాఢముగా నాటుకొనిన కుదృష్టుల సంశయము నీ కరిగిరి సులువుగా నివారించుచున్నది ప్రసిద్ధము.

ఉ॥ ఎందును మేరలన్ నుడువ
నేరికి శక్యముగాని యట్టి యా
నందగుణంబు నట్లె సుగు
ణంబుల కాలయమైన చక్రిపై

నెందులకో! కుదృష్టులకు
నేర్పడు నిర్గుణుఁడో! పరుండో! యన్
సందియమున్ తొలంచుఁ గరి
శైలవరం బిది చూచి నంతనే. 7

అవతారిక :— సాత్త్వికులు కూడ నుపబృంహణ వాక్యము లతోఁ గూడిన శ్రుతిచేతఁ దత్త్వనిర్ణయము నెట్లో చేసినను కరిగిరి మాత్రము విలక్షణముగా నందఱకు స్వయముగా భగవంతుని అనుభవింపఁ జేయుచున్నదని యీ శ్లోకమున ననుగ్రహించు చున్నారు.

శ్లో॥ న్యాయతర్కమునిముఖ్యభాషితైః
శోధితైః సహ కథం చన త్రయీ ।
జోషయే ద్ధరి మనంహసో జనాన్
హస్తిధామ సకలం జనం స్వయమ్ ॥ 8

ప్రతి :— త్రయీ=వేదత్రయము, శోధితైః=శుద్ధములైన, న్యాయ, తర్క, మునిముఖ్య, భాషితైః, సహ=న్యాయముల చేతను, తర్కములచేతను, మునిశ్రేష్ఠుల వాక్యములచేతను, కూడ, అనంహసః = పాపరహితులగు, (క్షీణకల్మషులగు) జనాన్=జనులను, హరిమ్=దేవరాజును, కథంచన=ఎట్లో కష్టమునీఁద, జోషయేత్=సేవింపఁజేయును, హస్తిధామ= కరిగిరి, సకలమ్=సమస్తమగు, జనమ్=జనమును, స్వయమ్= స్వయముగానే (ఇతరులయపేక్ష లేకుండనే) (హరిమ్= దేవరాజును (భగవంతుని) జోషయేత్ =సేవింపఁజేయును.)

విశేషములు :— శోధితైః— శోధనచేయఁబడిన— అనఁగా అపన్యాయములు తర్కాభాసములు చేరకుండ రాజస తామస పురాణములు కాకుండ గాలింపఁబడిన, న్యాయ— తర్క— మునిముఖ్యభాషితైః— న్యాయ=పూర్వోత్తర మీమాంసాన్యాయముల చేతను— తర్క—అనుకూల తర్కముల చేతను, అనఁగా— పర్వతో వహ్నిమాన్ ధూమాత్— (పొగయుండుటవలనఁ గొండ నిప్పుకలది) అను అనుమాన ప్రమాణమున - ప్రతిపక్షి - ధూమోఽస్తు వహ్ని ర్మాస్తు (పొగయుండినను వహ్ని లేకపోవుఁగాక) అని యప్రయోజక శంక చేసినప్పుడు— 'యది వహ్ని ర్న స్యాత్ తర్హి ధూమోఽపి న స్యాత్' (వహ్ని లేనిచో ధూమము గూడ లేకపోనీ) అని చెప్పుటలు - అనుకూల తర్కములు, ముని ముఖ్య భాషితైః=మునిశ్రేష్ఠులగు వాల్మీకి, పరాశర. వ్యాస, భాషితములైన శ్రీమద్రామాయణ, విష్ణుపురాణ, భారతాది సాత్త్వికపురాణముల చేతను, అనంహసః— క్షీణకల్మషులైన, 'జన్మాంతర సహస్రేషు తపోధ్యాన సమాధిభిః। నరాణాం క్షీణ పాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే' (వేలకొలఁది జన్మాంత రములందుఁ దపస్సులచేత, ధ్యానములచేత, సమాధినిష్ఠలచేత క్షీణపాపులగు జనులకు (శ్రీ)కృష్ణునియందు భక్తి జనించును.) సకలం జనమ్=పండితులను పామరులను.

(3)

తా॥ పరిశుద్ధములగు పూర్వోత్తర మీమాంసాన్యాయముల చేతను, అనుకూలతర్కముల చేతను, సాత్వికములగు శ్రీమద్రామాయణ, విష్ణుపురాణ, భారతాదుల చేతను, ఉపబృంహితమై వేదత్రయి అనేక జన్మములలోఁ జేసిన తపస్సుల చేత క్షీణకల్మషులగు జనుల నెట్లో భగవంతుఁడగు దేవరాజును సేవింపఁజేయును. కరిగిరి యున్ననో యట్లు గాక అన్యనిరపేక్షకముగా నే తనంతఁ దానే యాబాలగోపాలము చేత శ్రీ దేవరాజును సేవింపఁజేయుచున్నది. కావునఁ త్రయి కంటె శ్రీ కరిగిరియే మిన్న.

మ॥ పరిశుద్ధంబులు న్యాయతర్కముల చే
భద్రాయితంబై మునీ
డ్వర భాషావళిభూషితం బగుత్రయీ
వా క్కెట్టులో! యెట్టులో!
హరి సేవింపఁగఁజేయు నిష్కలుషులన్,
హస్త్యద్రియో సుల్వగా
హరి దర్శింపఁగఁజేయు నెల్లరకుఁ దా
నై కోరకే సాయమున్.

శ్లో॥ అద్భుతం మహ దసీమ భూమకం,
కించి దస్తి కిల వస్తు నిస్తులమ్।
ఇ త్యఘోషి య దిదం త దగ్రత
స్తథ్య మేవ కరిధామ్ని దృశ్యతే॥ 9

ప్రతి :— అద్భుతమ్=ఆశ్చర్యకరమైనదియు, మహత్=గొప్పదియు, అసీమ భూమకమ్=అపరిచ్ఛిన్నమహిమ గలదియు,

నిస్తులమ్=సాటిలేనిదియుఅగు, కించిత్=ఒకానొక, వస్తు=వస్తువు, అస్తి, కిల=ఉన్నది సుమా, ఇతి=అని, యత్=ఏది, అఘోషి=చాటఁబడెనో, తత్=ఆ ప్రసిద్ధమగు వస్తువు, కరిధామ్ని=కరిగిరియందు. ఇదమ్=ఇదిగో, అగ్రతః=ఎట్ట యెదుట, తథ్యమ్, ఏవ=యథార్థముగానే, దృశ్యతే=కనఁబడుచున్నది.

విశేషములు :— అద్భుతమ్=సమస్తములైన విజాతీయ సజాతీయములకంటె నత్యాశ్చర్యకరము ఐన— అసీమ భూమకమ్=అపరిచ్ఛిన్న స్వభావముగల, కించిత్=తెలియఁబడిన యంశములోఁ గూడ నిది యిట్టిదని చెప్పుటకు సాధ్యముగాని, అగ్రతః = మాంసచక్షుష్కులమగు మనయెదుటఁ గూడ, దృశ్యతే=ప్రత్యక్షీక్రియతే— చూడఁబడుచున్నాఁడు. 'యతో వా ఇమాని భూతాని జాయంతే యేన జాతాని జీవంతి, యత్ ప్రయం త్యభిసం విశంతి, త ద్విజిజ్ఞాసస్వ, త ద్బ్రహ్మేతి, త దేవ సౌమ్యేద మగ్ర ఆసీత్, ఏక మేవా ద్వితీయం బ్రహ్మ, యః సర్వజ్ఞ స్సర్వవిత్, పరాఽస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియాచ, న తత్సమ శ్చాభ్యధిక శ్చ దృశ్యతే, ఏష సర్వభూతాంతరాత్మా అపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః' ఈ మొదలగు శ్రుతి శతములచేతఁ జేర్కొనఁబడిన వైభవాతిశయము గల నారాయణుఁడు కరిగిరియందుఁ జక్కఁగాఁ గనఁబడుచున్నాఁడని భావము.

తా॥ అద్భుతమును, మహత్తమమును, అపరిచ్ఛిన్న మహిమమును, అపరిచ్ఛిన్న స్వభావమును, నిరుపమానంబును, అగు వస్తు వొకటి కలదని శ్రుతిశతంబులు దేనినిఁ జాటుచున్నవో యా పరవస్తువు కరిగిరియందు నందఱి కన్నుల ముందఱ నిదిగోనని చూపుటకు ననువుగా సత్యముగాఁ జాటఁబడు చున్నది.

ఉ॥ నిస్తులమున్ మహాద్భుత మ
నీ దృశరూప మసీమభూమ మా
వస్తు వొకండు వేదముల
వాకొనఁగాఁ బడె నేది మిన్నగా,
శస్త ముదాత్త మా పరమ
సత్యము వస్తువె కంటిముందఱన్
హస్తి మహామహీధరము
నందు వెలింగెడుఁ జూడ నెల్లరున్.

అవతారిక :— ప్రత్యక్షాది ప్రమాణాంతరముల సంవాద మున్నప్పుడే యాగమమునకుఁ బ్రామాణ్య ముండునని వాదించు వేదబాహ్యుల మతమునందు సైతము వరదరాజస్వామిని సకల జనసాక్షాత్కారవిషయునిగాఁ జేయుచున్న కరిగిరిచేత వేదత్రయి ప్రామాణ్యము ననుభవించుచున్న దని యీ శ్లోకమున నుడువుచున్నారు.

శ్లో॥ సంవదేత కిల యత్ ప్రమాంతరై
స్తత్ ప్రమాణ మితి యే హి మేనిరే ।
తన్మతేఽపి కిల మానతాం గతా
హస్తినాఽద్య పరవస్తుని త్రయీ ॥ 10

ప్రతి :— యే=ఏవాదులు, యత్, కిల=ఏది, ప్రమాణముగా నభిమతమో, (తత్ =అది) ప్రమాంతరైః=ఇతర ప్రమాణములతో, సంవదేత=అనుకూలపడి యుండవలెను, (విరుద్ధము కాకూడదు) తత్ =అట్టిది, ప్రమాణం, హి, ఇతి= ప్రమాణమని తలంచిరో, తన్మతే, అపి=అట్టివారల మతము నందుఁ గూడ, త్రయీ = వేదత్రయి, అద్య = ఇప్పుడు, హస్తినా = (పరవస్తుపగు వరదరాజస్వామిని కనులముందు ప్రత్యక్షముగాఁ జూపుచున్న) కరిగిరిచేత, పరవస్తుని=పరవస్తు విషయమున, మానతామ్=ప్రమాణత్వమును, గతా, కిల= పొందినది కదా!

విశేషములు :— హస్తినా— నామైకదేశే నామగ్రహణమ్— అను పరిభాషచేత హస్తిగిరి అను పేరిలో నొక భాగమగు హస్తిపదగ్రహణముచేత హస్తిగిరిగ్రహణ మేర్పడును. భీమపదముచేత భీమసేన గ్రహణమువలె. త్రయీ పరవస్తుని— మానతాంగతా— సర్వజ్ఞుఁడు సర్వశక్తి, సర్వశరణ్యుఁడు, సకలఫలప్రదుఁడు, పుండరీకాక్షుఁడు, లక్ష్మీపతి, పరమపురుషుఁడు, సర్వనిర్వాహకుఁడని శ్రుతి ప్రతిపాదిత

పరవస్తువును హస్తిగిరి యందఱకుఁ బ్రత్యక్షముగాఁ దన శిరస్సునందుఁ దాల్చుటచేత శ్రుతి యబాధిత విషయమగు చున్నదని భావము.

తా॥ ఏది ప్రమాణముగా నభిమతమో అది యితర ప్రమాణములకు ననుగృహీతమై యుండవలెనని యేవాదులు తలఁచిరో వారి మతమునందుఁగూడ వేదత్రయి పరవస్తువగు శ్రీ వరదరాజస్వామిని బ్రత్యక్షముగా శిరమునందు దాల్చి చూపుచున్న హస్తిగిరిచేతఁ బరమ ప్రమాణపదవిని బొందింపఁ బడినది.

ఉ॥ ఏది ప్రమాణరూపముగ
నిష్టమొ, యద్ది ప్రమాంతరైక సం
వాదిగ నుండ నౌ ననెడు
వాదులకుం గడుసమ్మతంబుగా
నాదిమతత్త్వమా వరదు
నౌదలఁ దాలిచి హస్తిశైల మీ
మాదిరిఁ జూపుచుం ద్రయిఁ బ్ర
మాణతమంబని చాటుచుండెడిన్.

ఈ స్తవమునందు మొదటి పదిశ్లోకములు రథోద్ధతావృత్త నిబద్ధములు. రాన్నరా విహ రథోద్ధతా లగా– ర, న, ర, గణములు । లఘువు । గురువు పాదపాదమున రథోద్ధతా వృత్తమున కుండును.

అవతారిక :— ఇట్లు మంత్రరత్నమునఁ గల 'నార' పదమునకు అర్థమగు కరిగిరి వైభవము నుగ్గడించి తదయన పదాభిధేయమగు భగవానుని వైభవమును విస్తరించి చెప్పఁ బోవుచుఁ దొలుదొల్త గుణయోగమును ప్రతిపాదించు చున్నారు.

శ్లో॥ గుణాయత్తం లోకే గుణిషు హి మతం మంగళపదం
విపర్యస్తం హస్తిక్షితిధరపతే తత్ త్వయి పునః।
గుణా స్సత్యజ్ఞాన ప్రభృతయ ఉత త్వద్గతతయా
శుభీభూయం యాతా ఇతి హి నిరణైష్మ శ్రుతివశాత్ ॥ 11

ప్రతి :— లోకే=లోకమునందు, గుణిషు=గుణవంతుల విషయమున, మంగళపదమ్=మంగళశబ్దము (వీరు మంగళ కరులు అని) గుణాయత్తమ్ = గుణాధీనము (గుణములఁబట్టి ప్రయోగింపఁబడునదిగా) మతం హి=తలఁచఁబడినది గదా! హే హస్తిక్షితిధరపతే=కరిగిరిప్రభువగు ఓ వరదరాజస్వామీ! త్వయి, పునః=నీ విషయమునందో, విపర్యస్తమ్=తలక్రిందులు, (భవతి = అగుచున్నది) సత్యజ్ఞాన ప్రభృతయః=సత్యము, జ్ఞానము, మున్నగాఁగల, గుణాః ఉత=గుణములన్నవో, త్వత్ గతతయా=నిన్నాశ్రయించుటచేత, శుభీభూయమ్=మంగళత్వ మును, యాతాః ఇతి=పొందినవని, శ్రుతివశాత్ = వేద సాహాయ్యమువలన, నిరణైష్మ, హి=నిశ్చయించుకొంటిమి.

విశేషములు :— 'గుణాయ త్తం లోకే గుణిషు హి మతం మంగళపదమ్— మణి, ద్యుమణి (సూర్యుఁడు) చంద్ర, చందనాదులందు శోభనతాహేతువు శోభాతపచంద్రికా సుగంధభరాది సంబంధమే యని యెల్లరు నెఱింగిన విషయమే. తత్, త్వయి, పునః, విపర్యస్తమ్— ఆ నియమము నీ విషయమునఁ దలక్రిందులైనది. అనఁగా— మంగళపదము గుణాయత్తము గాక గుణ్యాయత్తమైనది యని భావము. తృతీయ చతుర్థ పాదములు పై విషయమును సమర్థించుచున్నవి. భవదీయస్వరూప నిరూపకములగు సత్యజ్ఞానాది గుణములు నిన్నుఁ జేరుటచేతనే మంగళత్వమును బొందినవి. ఇది యెట్లెంగితిరి? నిరఙ్కుశ్మ శ్రుతిబలాత్— సత్యస్య సత్యమ్— జ్యోతిషాం జ్యోతిః— ఇత్యాదిశ్రుతుల మూలమున నని సమాధానము.

తా॥ కాంతినిబట్టి యిది మంచిరత్నము, సుగంధమునుబట్టి యిది మంచి చందన మన్నట్లు వీరు మంచివారనుటకు లోకమున గుణములు కారణమై యున్నవి. ఓ కరిగిరీశా! వరదరాజ స్వామీ! నీయం దీలక్షణము తలక్రిందులుగాఁ గన్పట్టు చున్నది. మంగళత్వము గుణములనుబట్టి రాదు గుణినిబట్టి వచ్చునని భావము. ఎట్లన సత్యజ్ఞాన ప్రభృతిగుణంబులు మంగళ కరుఁడవగు నిన్నాశ్రయించుట చేతనే మంగళత్వమును బొందె నని 'సత్యస్య సత్యమ్,— జ్యోతిషాం జ్యోతిః' ఇత్యాతి శ్రుతి వాక్యములవలన నిర్ణయించు కొంటిమి.

మ॥ భువి దేవా! గుణులందు మంగళపదం
బున్ గూరుతుర్ సద్గుణా
ళి విరాజిల్లుటచే మణిద్యుమణు లో
లిన్ లక్ష్యముల్, తల్లక్రిం
దవు నీయం దిది నీగుణంబు లగు స
త్వ్యజ్ఞాన ముఖ్యంబులున్
భవదాధారత వన్నెఁ గాంచెఁ ద్రయిచే
భావింతు మీయర్థమున్.

అవతారిక :— భగవంతున కిట్టి గుణవిశిష్టస్వరూపము వేదమునందు సైత మవాఙ్మానసగోచర మని ప్రతిపాదింపఁ బడిన దనుచున్నారు.

శ్లో॥ నిరాబాధం నిత్యం నిరవధి నిరంహో నిరుపమం
సదా శాంతం శుద్ధం ప్రతిభట మవద్యస్య సతతమ్।
పరం బ్రహ్మామ్నాతం శ్రుతిశిరసి య ద్వరద! తే
పరం రూపం సాక్షాత్ త దిద మపదం వాఙ్మనసయోః॥ 12

ప్రతి :— నిరాబాధమ్=నిర్వికార మైనట్టియు, నిత్యమ్= శాశ్వత మైనట్టియు, నిరవధి=హద్దు లేనట్టియు, నిరంహః= నిర్మల మైనట్టియు, నిరుపమమ్=సాటి లేనట్టియు, సదాశాంతమ్ = నిత్యానుకూల మైనట్టియు, (భోగ్య మని భావము) శుద్ధమ్=శుద్ధసత్త్వస్వరూప మైనట్టియు, (కనుకనే) సతతమ్ = ఎల్లప్పుడు, అవద్యస్య = దోషమునకు, ప్రతిభటమ్=విరోధి

మైనట్టియు, యత్ = ఏది, (అస్తి = కలదో) తత్ = ఆ, పరం, బ్రహ్మ = పరబ్రహ్మము, శ్రుతిశిరసి = ఉపనిషత్తులందు, వాఙ్మనసయోః = వాక్కులకు మనస్సునకును, అపదమ్ = అందనిదిగా, ఆమ్నాతమ్ = పేర్కొనఁబడినది వరద! = ఓ వరదరాజ స్వామీ! తత్ = ఆ, ఇదమ్ = ఇది, తే = నీయొక్క, సాక్షాత్ = ప్రత్యక్ష మగు, పరమ్ = శ్రేష్ఠమైన, రూపమ్ = స్వరూపము. (భవతి = అగు చున్నది.)

విశేషములు :— నిత్యమ్ = కాలపరిచ్ఛేదరహితమ్— కాలముయొక్క మితిలేనిది, నిరవధి = దేశపరిచ్ఛేద రహితమ్— సర్వదేశములందుఁ గలది యని భావము. 'ప్రతిభట మవద్యస్య సతతమ్'— తన సంబంధులకు సైతము దోషలేశమును గూడ సహింపనిది యని తాత్పర్యము. దోషవిరోధి (నిర్దోషము) అని మాత్రమే చెప్పినచో 'నిరంహః' అను పదముతోఁ బునరుక్తి వచ్చును.

అపదం వాఙ్మనసయోః— 'న చక్షుషా గృహ్యతే నాపి వాచా,— యత్త దద్రేశ్య మగ్రాహ్యమ్'— ఇత్యాది వేదాంత వాక్యములు పరబ్రహ్మ మవాఙ్మానసగోచర మని నుడువు చున్నవి. వరద! తే పరం రూపం సాక్షా త్తదిదమ్— ఇట్టి పరస్వరూపరూపవిశిష్టుఁడ వగు నీవు భక్తుల సౌలభ్యమునకై కరిగిరిశిఖరమున కలంకారముగా వేంచేసియున్నా వని భావము.

తా॥ నిర్వికారము నిత్యము నిరవధియు నిర్మలము నిరుపమానము సదా భోగ్యము శుద్ధము స్వసంబంధులకుఁ గూడ దోషలేశమును సైతము సహింపనిదియు నగు ఏపరబ్రహ్మము వేదాంతములం దవాఙ్మానసగోచర మని పేర్కొనఁ బడినదో యది యోవరదరాజస్వామీ ! ప్రత్యక్ష మగు నీ నిష్కృష్ట పరమ స్వరూపమే.

చ॥ నిరుపమమున్ వినిర్మలము
నిత్యము కేవల శుద్ధ సత్వమున్
నిరవధి నిర్వికారమును
నిత్యసుభోగ్య మవద్యశూన్యమున్
పరము వచోమనోఽతిగము
బ్రహ్మము వేదశిరోనిరూఢ మో
వరద ! భవత్స్వరూప మయి
వర్తిలె వారణశైలభూషగాన్ ॥ 13

శ్లో॥ ప్రశాంతానంతాత్మానుభవజ మహానందమహిమ
ప్రసక్తస్తైమిత్యానుకృత వితరంగార్ణవదశమ్ ।
పరం య త్తే రూపం స్వసదృశదరిద్రం వరద ! తే
త్రయీ విస్పష్టంతీ పరనిరసనే శ్రామ్యతి పరమ్ ॥ 13

ప్రతి :— హే వరద ! = ఓ వరదరాజస్వామీ ! ప్రశాంత ......దశమ్— ప్రశాంత = అత్యంతానుకూలమును, అనంత = అపరిచ్ఛిన్నమును, (అగు) ఆత్మ = స్వస్వరూపముయొక్క..,

అనుభవ, జ = సాక్షాత్కారమువలనఁ బుట్టిన, మహానంద = ఆనందాతిశయముయొక్క, మహిమ = ఆధిక్యము మహత్త్వము) చేత, ప్రసక్త = ఏర్పడిన, స్తైమిత్య = నిశ్చలత్వము చేత, అనుకృత = అనుకరింపఁబడిన, వితరంగ = అలలు లేని, అర్ణవ = సముద్రము యొక్క, దశమ్ = అవస్థగలిగినట్టియు, స్వ, సదృశ, దరిద్రమ్ = (నిస్తరంగసముద్రముకంటె) ఇతర సమానవస్తువు లేని, యత్ = ఏ, తే = నీయొక్క, పరమ్ = అత్యుత్కృష్ట మగు, రూపమ్ = స్వరూపము (అస్తి = కలదో) తత్ = ఆ స్వరూపమును, విస్పృశంతీ = ప్రతిపాదింపఁ దలచుచు, త్రయీ = వేదత్రయి, పరనిరసనే, పరమ్ = హేయావయవవికారాదులను నిరసించుట యందే, శ్రామ్యతి = అలసిపోవు చున్నది. (ఆఁగిపోవుచున్నది)

విశేషములు :—భగవానునకు శాంతోదితదశ యనియు, నిత్యోదితదశ యనియు రెండు దశలుగలవు. వానిలో హేయ ప్రత్యనీకకల్యాణైకతానస్వస్వరూపానుభవదశ మొదటిది, విభూత్యను భవదశ రెండవది. ఈ శ్లోకమున భగవంతుని శాంతోదితదశ వర్ణింపఁబడినది. పూర్వార్ధముయొక్క భావమిది. అత్యంతానుకూలమును, అపరిచ్ఛిన్నమును అగు స్వస్వరూపముయొక్క సాక్షాత్కారమువలనఁ బొడమి నయపరిచ్ఛిన్నానంద వైభవమువలన నేర్పడిన నిశ్చలత్వముచేత నిస్తరంగ సాగరమువలె నున్న యని భగవత్స్వరూపమునకు విశేషణము. స్వసదృశదరిద్రమ్— కొంచెము పోలుచున్న నిస్తరంగార్ణవము కంటె నితర మగు సదృశవస్తువు లేని దని భావము. 4 వ పాదము

యొక్క సారాంశమిది. భగవానుని యత్యుత్కృష్ట స్వరూప మును బ్రతిపాదింపఁ దలఁచి త్రయి 'నిష్కలం నిష్క్రియం శాంతమ్– య త్త దద్రేశ్య మగ్రాహ్యమ్'– ఇత్యాది వాక్య ములచేత హేయావయవ వికారాది నిరసనముతోనే యాఁగి పోయినది. కాని యున్నది యున్నట్లు వర్ణింపలేక పోయెను. అని అట్టి శాంతోదితదశ ననుభవించు భగవానుఁ డిట్లు కరిగిరి యందు వెలసి సులభుఁ డగుట మాబోంట్ల ననుగ్రహించుట కని యభిప్రాయము.

తా॥ ఓ వరదరాజస్వామీ! అత్యంత భోగ్యము నపరి చ్ఛిన్నము నగు స్వస్వరూపముయొక్క సాక్షాత్కారమువలన జనించిన యానందాతిశయపై భవమునఁ గలిగిన నిశ్చలత్వముచే నలలు లేనియబ్ధిని బోలుచు నితరసదృశవస్తువు లేని నీ యుత్కృష్టస్వరూప మేదికలదో దానిని వేదత్రయి ప్రతిపా దింపఁ దలఁచి కేవలము పరనిరసనముతోనే విశ్రమించినది. సాకల్యముగా నీ స్వరూపమును వర్ణింప నెవరిశక్యము?

మ॥ అతి భోగ్యానవలోకితాంత నిజరూ
పాస్వాదనానంద సం
తతి లబ్ధాచల భావతన్ స్తిమితత
ద్వార్ధిన్ విడంబించుచున్

గతతుల్యేతరవస్తు వైన భవదా
కారంబు వర్ణింప నెం
చి త్రయీవాణి శ్రమించె నన్యము నిరా
సింపన్ రమావల్లభా !

అవతారిక :— చెప్పఁబడిన విషయమునే స్పష్టముగా వివరించు చున్నారు.

శ్లో॥ న వక్తుం న శ్రోతుం న మనితు మథోపాసిషయిషుం
న చ ద్రష్టుం ప్రేమ్ణా తదను న చ భోక్తుం హి సుశకమ్ ।
పరం య ద్వస్త్వాక్తం నను వరద సాక్షా త్త దసి భోః
కథం విశ్వస్మై త్వం కరిగిరిపుర స్తిష్ఠస ఇహ ॥ 14

ప్రతి :— వరద ! = ఓ వరదరాజస్వామీ ! పరమ్ = అన్నిటికంటె శ్రేష్ఠమగు, యత్ = ఏతత్త్వము, వక్తుమ్= ఉపదేశించుటకు, న, సుశకమ్=సులభముగానిదియు (శక్యముగానిదియు) (ఉపదేశింపఁబడినను) శ్రోతుమ్ = వినుటకు (గ్రహించుటకు) న, సుశకమ్=శక్యముగానిదియు, గ్రహింపఁబడినను) మనితుం చ=మననము చేయుటకును, న, సుశకమ్= సులభముగానిదియు, అథ=మననాంతరము, ఉపాసిషయితుం, చ=ఉపాసనచేయ, వాంఛించుటకును, న, సుశకమ్=సులభము గానిదియు, ప్రేమ్ణా=ప్రేమతో, ద్రష్టుం, చ, న సుశకమ్= చూచుటకును శక్యముగానిదియు, తదను=తరువాత, భోక్తుం, చ, న సుశకమ్ = అనుభవించుటకును శక్యముగానిదియు,

(ఇతి=అని, శ్రుత్యా= వేదముచేత) ఉక్తమ్= చెప్పఁబడినదో, తత్ =ఆ, వస్తు=పరతత్త్వము, భోః= ఓ స్వామీ! సాక్షాత్ = ప్రత్యక్షముగా, త్వమ్=నీవు, అసి, నను = అగుచున్నావు గదా! కథమ్=ఎట్లు, ఇహ= ఈ భూతలమునందు, కరిగిరి పురః =కరిగిరిముందు, త్వమ్=నీవు, విశ్వస్మై=సమస్తజనము కొఱకు, తిష్ఠసే=ఉన్నావు.

విశేషములు :— 'శ్రోతవ్యో మంతవ్యో నిదిధ్యాసితవ్యః' అను శ్రుతిచేఁ బరతత్త్వముయొక్క. శ్రవణమనన సాక్షాత్కార ములు విధింపఁబడినను 'స చక్షుషా గృహ్యతే నాపి వాచా,— యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ— ఇత్యాది శ్రుతులచేతఁ బరతత్త్వస్వరూపము గుణములు అవాఙ్మానస గోచరములని వర్ణించుటవలన శ్రవణమునకు మొదటిది యగు నుపదేశముతోఁగూడ సాక్షాత్కారానంతరము గలిగెడు నిరంతరానుభవ పర్యంతము గలషట్కము— అనఁగా 1 ఉప దేశము 2 శ్రవణము 3 మననము 4 నిదిధ్యాసనము 5 సాక్షా త్కారము 6 అనుభవము ఇవి యశక్యములని భావము.

శ్రవణము :— తత్త్వదర్శియగు నాచార్యునివలన న్యాయ యుక్తమగు నర్థమును గ్రహించుట.

మననము :— యుక్తులచేత విన్నయర్థమును ధారణ చేయుట.

నిదిధ్యాసనము :— తైలధారవలెఁ దెంపులేని స్మృతి సంతానము.

'సాక్షా త్తదసిభోః'— ఉపదేశాది షట్కమున కందని యీ పరవస్తువు నీవే గదా! చతుర్థపాదములో 'విశ్వస్మై' అనుచోట చతుర్థీ విభక్తివలనను 'తిష్ఠసే' అను చోట ఆత్మనే పదివలనను ఆ పాదమునకు నాయాశ్రితులను రక్షింపఁ గల నని సమస్తజనులకు స్వాభిప్రాయమును బ్రకటించుచు నున్నా వని భావము.

తా॥ వరదరాజస్వామీ! ఏ పరతత్త్వము ఉపదేశించుటకుఁ గాని శ్రవణ మొనర్చుటకుఁగాని, మననము చేయుటకుఁగాని, దర్శించుటకుఁగాని, యనుభవించుటకుఁగాని శక్యముగాదని శ్రుతి చెప్పుచున్నదో! ఆ పరతత్త్వము సాక్షాత్తుగా నీవే యగుచున్నావు గదా! ఉపదేశాదులకు సైతమందని దుర్లభుఁడవగు నీవు నా యాశ్రితుల రక్షింపఁగల నని తెలుపుచు నీలోకమున నీ కరిగిరిముందు నిలిచి యుండుట దేవా! నీ వాత్సల్య సౌలభ్యములఁ జాటుచున్నది.

మ॥ చెవిలోఁ జెప్పఁగ నూఁకొనంగ మదిలోఁ
జింతింప ధ్యానింపఁ గా
నవలోకింప భుజింప నెయ్యది యశ
క్యం బట్టి దుష్ప్రాపవ
స్తువు నీవే గద దేవ యాశ్రితులఁ గా
తుఁ నే నటంచున్ జనుల్
భవదంఘ్రుల్ గొలువంగ నీగిరిపురో
భాగంబునన్ నిల్చితే? 14

అవతారిక :— ఈ శ్లోకమున శ్రీ వరదరాజస్వామికి షాడ్గుణ్యపరిపూర్తిని నుడువు చున్నారు.

శ్లో॥ ప్రకృష్టం విజ్ఞానం బల మతుల మైశ్వర్య మఖిలం
విమర్యాదం వీర్యం వరద! పరమా శక్తి రపి చ।
పరం తేజ శ్చేతి ప్రవరగుణషట్కం ప్రథమజం
గుణానాం నిస్సీమ్నాం గణనవిగుణానాం ప్రసవభూః॥ 15

ప్రతి :— హేవరద!=ఓ వరదరాజస్వామీ!, ప్రకృష్టమ్=శ్రేష్ఠమగు, విజ్ఞానమ్=వివిధజ్ఞానము, అతులమ్=సాటిలేని, బలమ్=బలము, అఖిలమ్=సమగ్రమగు, ఐశ్వర్యమ్ = ఐశ్వర్యము, విమర్యాదమ్ = హద్దులేని, వీర్యమ్ = వీర్యము పరమా=గొప్ప, శక్తిఃఅపిచ=శక్తియును, పరమ్=ఉత్కృష్టమగు, తేజః చ=తేజస్సును, ఇతి=అనెడు, ప్రథమజమ్=అన్నికల్యాణగుణములకంటె ముందుపుట్టిన (ప్రథమగణ్య మగు) ప్రవరగుణషట్కమ్=శ్రేష్ఠమగు నీగుణషట్కము (ఆఱుగుణములు) నిస్సీమ్నామ్=హద్దులేని, గణనవిగుణానామ్=లెక్కపెట్ట శక్యముకాని, గుణానామ్=దయాక్షమాదిగుణములకు, ప్రసవభూః=ఉత్పత్తి స్థానము, (భవతి=అగుచున్నది)

విశేషములు :— ఇందు విజ్ఞానాదులకు వేసిన ఉత్కృష్టేత్యాది విశేషణము లితరచేతనుల విజ్ఞానాదు లట్టివి కావని తెలుపుటకని తెలియవలెను.

(5)

తా॥ ఓ వరదరాజస్వామీ ! గుణములలోఁ బ్రథమ గణ్యములగు శ్రేష్ఠమగు జ్ఞానము, సాటిలేనిబలము, సమగ్రమగు నైశ్వర్యము, అవధిలేని వీర్యము, ఉత్కృష్టమగు శక్తి, యధికమగు తేజస్సు, అనెడి యీ యాఱుగుణములు హద్దులేని లెక్కపెట్టరాని దయాక్షమాది కల్యాణగుణములకుఁ బుట్టినిల్లు.

చ॥ గురుతరమైన జ్ఞానము, న
కుంఠబలంబు, సమగ్రమైన యై
శ్వరత, యపారవీర్యమురు
శక్తి, మహోజ్జ్వల తేజ, మన్ మహ
త్తర గుణషట్క మిద్ది వర
దా! ప్రథమప్రభవంబు జన్మమం
దిరము దయాక్షమాదిగణ
నీయగుణాళి కనంత సంఖ్యకున్. 15

అవతారిక :— భగవానుఁడు సమస్తకల్యాణగుణుఁడైనను పరవ్యూహ విభాగమునందు గుణావిర్భావమును తిరోభావము నీ క్రిందిశ్లోకముతోఁ జెప్పుచున్నారు.

శ్లో॥ గుణైష్షడ్భిస్త్వేతైః ప్రథమతరమూర్తిస్తవ బభౌ
తతస్తిస్రస్తేషాం త్రియుగ ! యుగళైర్హి త్రిభి రభూః ।
వ్యవస్థా యా చైషా నను వరద ! సావిష్కృతివశాత్
భవాన్ సర్వత్రైవ త్వగణిత మహామంగళగుణః ॥ 16

ప్రతి :— త్రియుగ ! = మూఁడు జంటల గుణములుగల (షడ్గుణములుగల) హే వరద ! = ఓ వరదరాజస్వామీ ! తవ=నీయొక్క, ప్రథమతరమూర్తిః= మొట్టమొదటి మూర్తి (పరవాసుదేవమూర్తి) ఏతైః=ఈ, షడ్భిః=ఆఱు, గుణైః= గుణములచేత, బభౌ = ప్రకాశించెను, తతః = తరువాత, తిస్రః=మూఁడు మూర్తులు, తేషామ్=ఆ గుణములలో, త్రిభిః=మూఁడు, యుగళైః=జంటలచేత, అభుః=ప్రకాశించినవి, హి=ప్రమాణప్రసిద్ధము, ఏషా=ఈ, వ్యవస్థా= ఏర్పాటు, యా = ఏది, (అస్తి = కలదో) సా = అది, ఆవిష్కృతి, వశాత్ = (ఉపాసకసౌకర్యమునకుఁగా) సంకల్పించుటవలన, అభూత్=ఆయెను, భవాన్, తు=నీవన్ననో సర్వత్ర=సకలమూర్తులయందును అగణిత, మహాత్, మంగళ గుణః ఏవ, నను=అసంఖ్యాకములు అపరిచ్ఛిన్నములు నగు కల్యాణగుణములు గలవాఁడవే కదా !

విశేషములు :— త్రియుగ— త్రీణి, యుగాని, యస్యసః తస్యసంబుద్ధిః— జ్ఞానబలైశ్వర్య వీర్యశక్తి తేజస్సు లనెడు ఆఱుగుణములు గలవాఁడా ! ప్రథమతరమూర్తిః— భగవానునకు నాల్గుమూర్తులు గలవు

1. పరవాసుదేవమూర్తి. ఇది పరమపదమునం దుండును. దీనియందు పైనిఁ జెప్పఁబడిన జ్ఞానాది షడ్గుణములును గలవు.

2. సంకర్షణమూర్తి– దీనియందు జ్ఞానము, బలము, అను జంటయే (రెండుగుణములే) ఉండును.

3. ప్రద్యుమ్నమూర్తి- దీనియందు ఐశ్వర్యము, వీర్యము అను జంటయే యుండును.

4. అనిరుద్ధమూర్తి- దీనియందు శక్తి, తేజస్సు, అను జంటయే ఉండును.

ఆవిష్కృతివశాత్ —— ఈ వ్యవస్థ ఉపాసకుల సౌకర్యము కొఱకు సంకల్పింపఁబడినది. శ్రీ వరదరాజస్వామియం దన్ననో గుణసంకోచము లేదు- భవాన్ సర్వత్రైవ త్వగణిత మహా మంగలగుణః—— అని చెప్పుటవలన - ఈ విషయమే.

శ్లో॥ షాడ్గుణ్యా ద్వాసుదేవః
పర ఇతి స భవాన్ ముక్తభోగ్యో ।
బలాఢ్యాత్
బోధా త్సంకర్షణ స్త్వం ॥

అను శ్రీరంగరాజ స్తవ శ్లోకమునఁ జెప్పఁబడినది.

తా॥ షడ్గుణైశ్వర్యసంపన్నుఁడవగు ఓ వరదరాజస్వామీ ! నీ మొదటి మూర్తియగు పరవాసుదేవమూర్తి యీ జ్ఞానాది షడ్గుణములచేతఁ బ్రకాశించినవి. తక్కిన మూఁడు మూర్తులును ఆ గుణములలో మూఁడు జంటలచేతఁ బ్రకాశించినవి. అనఁగా జ్ఞాన, బలముల జంటచేత సంకర్షణమూర్తియు, ఐశ్వర్య, వీర్యముల జంటచేతఁ బ్రద్యుమ్నమూర్తియు, శక్తి తేజస్సుల జంటచేత ననిరుద్ధమూర్తియుఁ, బ్రకాశించిన వని భావము. ఈ వ్యవస్థ ఉపాసకసౌకర్యమునకు సంకల్పింపఁబడినది. దేవరవారుమాత్ర మన్నిమూర్తులయందును అగణితానంత కల్యాణగుణ విశిష్టులే.

ఉ॥ మోహనరూప! నీ ప్రథమ
మూర్తి సదా విలసిల్లు షడ్గుణా
వ్యాహతవృత్తి నాపయిన
వర్తిలు మూర్తులమూఁట నీ గుణ
వ్యూహము మూఁడుజంటలయి
యొప్పు, నుపాసకదృష్టితోడ న
భ్యూహిత మీ పథంబు సుగు
ణోదధి వీవు సమస్తమూర్తులన్. 16

అవతారిక :— భగవానుఁడు సమస్త కల్యాణగుణగణ విశిష్టుఁడు గనుక విభవావతారములందు సకలగుణావిర్భావ ముండు నని యాశంకించుకొని యందుఁ గూడ గుణావిర్భావ తిరోభావములు స్వామివారి సంకల్పానుసారమే యుండునని నుడువు చున్నారు.

శ్లో॥ ఇయం వైయూహీ వై స్థితి రథ కి లేచ్ఛావిహృతయే
విభూతీనాం మధ్యే సురనరతిరశ్చా మవతరన్ ।
సజాతీయ స్తేషా మితి తు విభవాఖ్యా మపి భజన్
కరీశ ! త్వం పూర్ణో వరగుణగణైః స్తాన్ స్థగయసి 17

ప్రతి :— హేకరీశ!=ఓ వరదరాజస్వామీ! ఇయమ్=ఈ, (పూర్వోక్తమగు) స్థితిః = వ్యవస్థ, వైయూహీ = వ్యూహ సంబంధిని, వై=ప్రసిద్ధము, అథ, కిల=తరువాత, ఇచ్ఛా విహృతయే = స్వేచ్ఛావిహారము కొఱకు, విభూతీనామ్= నీ లీలకుఁ బరికరభూతములగు, సురనరతిరశ్చాం మధ్యే=

దేవతా, మానవ, తిర్యక్కులనడుమ, అవతరన్ =అవతార మెత్తుచు, వరగుణగణైః = కల్యాణగుణసమూహములచేత, పూర్ణః=నిండినవాఁడవై, (కనుకనే) విభవాఖ్యామ్ అపి= విభవావతార మనెడు పేరినిసైతము, భజన్ =పొందుచు, త్వమ్=నీవు, తేషామ్=వారికి (దేవమానవతిర్యక్కులకు) సజాతీయః, ఇతి, తు=సజీతీయుఁడ నన్న కారణముచేతనే, తాన్ = ఆ కల్యాణగుణములను, స్థగయసి = కప్పివేయు చున్నావు.

విశేషములు :— 'కరీశ— కరిగిరీశ, అని గ్రహింపవలెను. మధ్యమపదమగు 'గిరి' అనునది లోపించినది. లేదా నామైక దేశమును గ్రహించినచో నామమాత్రమునకు గ్రహణ మగును. అను నియమమువలనఁ బై యర్థము వచ్చును. సజాతీయ స్తేషా మితి తు— రాముఁడు పరవాసుదేవుఁ డయ్యు మనుష్యుఁడుగా నవతరించుటచేత— ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్— తాను మానవుఁడుగ దశరథపుత్త్రుఁడుగ భావించినట్లు. తాన్ స్థగ యసి— ఆ కల్యాణగుణములఁ దిరోధాన మొనర్చు చున్నావు. సకలకల్యాణగుణ వైభవముచేత విభవావతార మను ప్రసిద్ధి యున్నను తత్తత్సజాతీయత్వమును నటించుటకు గుణతిరోధాన మొనర్చు చున్నావని యాశయము.

తా॥ ఓ కరిగిరినాథా! ఈ పూర్వోక్తమగు వ్యవస్థ వ్యూహ సంబంధమైనది నీ మనోరథానుకూలమగు లీలల కొఱకు సాధన

భూతములైన దేవమానవతిర్యక్కులలో నవతార మెత్తుచుఁ గల్యాణగుణ పరిపూర్ణుఁడవయ్యు వైభవవిశిష్టమగుటచే విభవావతార మను నామమును బొందియు నీవు దేవమానవ తిర్యక్కుల సజాతీయుఁడ ననుకొనుచు 'ఆత్మానం మానుషం మన్యే రామం దశరథాత్మజమ్' అన్నట్లు నటించుచు నీ కల్యాణగుణముల మఱుఁగు పుచ్చుచున్నావు.

ఉ॥ ఓ వరదేశ! వారణశి
లోచ్చయశేఖరభూత! వ్యూహసం
భావిత మీ వ్యవస్థ ప్రభు
వా! గుణపూర్ణుఁడవయ్యు లీలకై
దేవ మనుష్య జంతువుల
దేననొ! యుద్భవమంది వైభవ
శ్రీ విలసిల్లియున్ నటనఁ
జేయఁగ వారి గుణాళిదాఁతువొ. 17

అవతారిక :— కల్యాణగుణముల యావిర్భావ తిరో భావముల కీ శ్లోకమున విషయవిభాగము నొనర్చు చున్నారు.

శ్లో॥ పరో వా వ్యూహో వా విభవ ఉత వార్చావతరణో
భవన్ వాంతర్యామీ వరవరద! యో యో భవసి వై।
స స త్వం స న్నైశాన్ వరగుణగణాన్ బిభ్ర దఖిలాన్
భజద్భ్యో భా స్యేవం సతత మితరేభ్య స్త్వితరథా॥ 13

ప్రతి :— హే వరవరద! = శ్రేష్ఠములగు వరముల నొసఁగు వరదరాజస్వామీ! పరః, భవన్, వా=పరవాసు

దేవుఁడ వగుచుఁగాని, వ్యూహో, భవన్, వా=వ్యూహ మూర్తి వగుచుఁగాని, విభవః, భవన్, ఉత=విభవావతారుఁడ వగుచుఁగాని, అర్చావతరణః భవన్ వా=అర్చావతారుఁడ వగుచుఁగాని, అంతర్యామీ, భవన్, వా=అంతర్యామి వగుచుఁగాని, యః యః, భవసి, వై = ఎవఁడ వెవఁడ వగుదువో, సః, సః, సన్ =వాఁడవు వాఁడవగుచు, ఐశాన్ = ఈశ్వరసంబంధులగు, అఖిలాన్ =సమస్తములైన, వరగుణ గణాన్ = కల్యాణగుణగణములను, సతతమ్ = ఎల్లప్పుడు, బిభ్రత్ =ధరించుచు, త్వమ్=నీవు, ఏవమ్=ఇట్లు, (కల్యాణగుణ విశిష్టస్వరూపముతో) భజద్భ్యః=భక్తులకొఱకు, భాసి= ప్రకాశించుచున్నావు, ఇతరేభ్యః, తు= ఇతరులకొఱకన్ననో (భజింపనివారి కొఱకు) ఇతరథా=మఱియొకరీతిగా, (నిర్గుణుఁడవుగా) భాసి=ప్రకాశించుచున్నావు.

విశేషములు :— ఐశాన్ వరగుణగణాన్— సర్వేశ్వరు నకు సంబంధించిన సర్వజ్ఞత్వ, సర్వశక్తిత్వాది కల్యాణగుణము లను, ఏవమ్=సమస్త కల్యాణగుణగణ విశిష్టమగు నాకార ముతో— ఇతరథా— అన్యవిధముగా (నిర్గుణుఁడవుగా) పరాశరపారాశర్య వాల్మీకి ప్రహ్లాద భీష్మాది భక్తులకుఁ జక్కఁగాఁ బ్రకాశింపఁజేయఁబడిన కల్యాణగుణగణములే భక్తి లేని బాహ్యకుదృష్టి శిశుపాలాదులకుఁ దిరోహితములైన వని భావము.

తా॥ మంచిమంచి వరములఁ బ్రసాదించునో కరిగిరినాథా! నీవు పరవాసుదేవుఁడవో! వ్యూహమూర్తివో! విభవావతారుఁడవో! అర్చావతారుఁడవో! అంతర్యామివో! ఏ స్వామివో! యగుదువుగాక. అత్తఱి నీశ్వరత్వప్రయుక్తములగు సర్వకల్యాణగుణ గణములతో విశిష్టుఁడవు గానే నిన్ను సేవించు భక్తులకు గోచరింతువు. నీ యెడల భక్తిలేని యితరులకు గుణహీనుఁడవుగానే గోచరింతువు.

చ॥ పరుఁడవో! వ్యూహమూర్తివో! వి
 భాసి విభూతివో! యార్చరూపివో!
 వరద! మనోనియంతివో! యె
 వండ వెవండవో! యాదు గాక యై
 శ్వరములు శోభనంబులగు
 సర్వగుణంబుల నొప్పు చట్టులే
 దరిసెన మిచ్చుచుండెదవు
 దాసుల, కన్యుల కన్యరీతిగన్. 18

అవతారిక :— స్వరూపగుణాదులగు దయాదులు, రూపగుణములగు సౌందర్యాదులును భక్తజనులకు భోగ్యములగుట యిందు వర్ణింపఁబడుచున్నది.

శ్లో॥ దయాక్షాంత్యౌదార్య ప్రమదిమసమతా సౌహృదధృతి
 ప్రసాదప్రేమాజ్ఞాఽఽశ్రిత సులభతాద్యా వరగుణాః ।
 తథా సౌందర్యాద్యా స్తవ వరదరాజోత్తమగుణా
 విసీమానోఽసంఖ్యాః ప్రణతజనభోగం ప్రసువతే ॥ 19

ప్రతి :— హే వరదరాజ != ఓ వరదరాజస్వామీ !, తవ= నీయొక్క, విసీమానః=హద్దులేనట్టియు, అసంఖ్యాః= లెక్క లేనట్టియు, దయా......సులభతాద్యాః- దయా=దయయు, క్షాంతి=ఓర్పు, ఔదార్య= ఈవి, మ్రదిమ=మార్దవము, సమతా = సమత్వము, సౌహార్ద = స్నేహము, ధృతి = ధైర్యము, ప్రసాద=అనుగ్రహము, ప్రేమా=ప్రేమము, ఆజ్ఞా = ఆజ్ఞ, ఆశ్రితసులభతా = ఆశ్రితులకు సులభుఁడై యుండుట, ఆద్యాః= మొదలుగాఁగల, వరగుణాః= కల్యాణ గుణములు, తథా=అట్లే, సౌందర్యాద్యాః=చక్కఁదనము మొదలుగాఁగల, ఉత్తమగుణాః=శ్రేష్ఠములగు గుణములు, ప్రణత, జన, భోగమ్=భక్తజనమునకు సౌఖ్యమును, ప్రసువతే=కనుచున్నవి ఉద్భవింపఁ జేయుచున్నవి.

విశేషములు :—

1. దయ- స్వార్థనిరపేక్షముగాఁ బరదుఃఖమును సహింపలేని స్వభావము.
2. క్షాంతి- (క్షమ) శిక్షింపఁదగిన నేరమును సైత మోర్చుకొనుట.
3. ఔదార్యము- అర్థు లనుకొన్నంత కంటె మిన్నగా నిచ్చుట.
4. మ్రదిమ- ఆశ్రితుల యెడఁబాటును సహింపలేకుండుట.
5. సమత- జాతిగుణవృత్తాదులను జూడకే యందఱియెడల నాదరమును జూపుట. (సమోఽహం సర్వభూతేషు)

6. సౌహార్దము- పరులకు మేలుచేయుట యందే మనస్సు గలిగి యుండుట.

7. ధృతి- నేరముల బైటఁబెట్టినను దయగలిగి యుండుట.

8. ప్రసాదము- కారణములేకయే నిత్యము సుముఖుఁడుగా నుండుట.

9. ప్రేమ- ఆశ్రితసంశ్లేషైక రసికత్వము. (ఆశ్రితులతోఁ గలసియుఁడవలెనను అభిరుచి.)

10. ఆజ్ఞ- కృత్యాకృత్యములను దెలుపుట. (సత్యం వద- న సురాంపిబేత్)

11. ఆశ్రితసులభత- ఆశ్రితుల కందుబాటులో నుండుట.

ఆద్యాః- ఆద్యపదముచేత సౌశీల్యాదులు గ్రాహ్యములు ఇవి భగవానుని ఆత్మగుణములు (స్వరూపగుణములు) సౌందర్యాద్యాః- ఇందలి ఆద్యపదముచేత లావణ్యాదులు గ్రాహ్యములు. ఇవి భగవంతుని దివ్యమంగళవిగ్రహ గుణములు (రూపగుణములు)

తా॥ ఓ వరదరాజస్వామీ! అంతులేనివియు నసంఖ్యాకము లైనవియునగు నీ దయాక్షమౌదార్యాది కల్యాణగుణములును సౌందర్యాది దివ్యమంగళవిగ్రహ గుణములును, భక్తజనులకు భోగ్యములై యున్నవి.

మ॥ దయయున్ క్షాంతి సమత్వమున్ ధృతి ప్రసా
దం బాజ్ఞ సౌహార్దమున్

ప్రియతౌదార్య మృదుత్వముఖ్యములు నీ
విఖ్యాత దివ్యద్గుణా
ళియు, సౌందర్యవిలాసకాంతి తనులా
లిత్యాదులున్ సంశ్రితా
భయదా! హద్దును బద్దులేక సుఖ ము
త్పాదించు భక్తాళికిన్. 19

అవతారిక :— ఈ శ్లోకమున భగవంతుని స్వాతంత్ర్యమును సర్వజ్ఞత్వమును పైకి నిందతోఁచునట్లు స్తుతించుచున్నారు.

శ్లో॥ అనన్యాధీనత్వం తవ కిల జగు ర్వైదికగిరః
పరాధీనం త్వాం తు ప్రణతపరతంత్రం మనుమహే ।
ఉపాలంభోఽయం భోః శ్రయతి బత సార్వజ్ఞ్య మపి తే
యతో దోషం భక్తే ష్విహ వరద ! నైవాకలయసి ॥ 20

ప్రతి :— భో వరద ! = ఓ వరదరాజస్వామీ ! వైదికగిరః = వేదసంబంధములగు వాక్కులు (ఉపనిషత్తులు) తవ = నీకు, అనన్యాధీనత్వమ్ = ఇతరుల యధీనమున లేమిని (స్వాతంత్ర్యమును) జగుః కిల = గానముచేసినవి గదా! (వయం) తు = మేమన్ననో, ప్రణత, పరతంత్రమ్ = భక్తపరతంత్రుఁడవైన, త్వామ్ = నిన్ను, పరాధీనమ్ = అస్వతంత్రునిగా, మనుమహే = తలఁచుచున్నాము, యతః = ఎందువలన, ఇహ = ఈ లీలావిభూతియందు, భక్తేషు = భక్తుల విషయమున, దోషం ఏవ = దోషమునే, న + ఆకలయసి = గమనింపవో,

అయమ్=ఈ ఉపాలంభః=నింద (దూషణము) తే=నీ యొక్క, సార్వజ్ఞ్యం అపి = సర్వజ్ఞత్వమును సైతము, శ్రయతి=ఆశ్రయించుచున్నది (ఆక్షేపించుచున్నది- లేదా - తాఁకుచున్నది) బత!=ఆశ్చర్యము!

విశేషములు :— వైదికగిరః— భగవంతుఁడు స్వతంత్రుఁడని నుడువు వేదవాక్కులివి. న తస్యేశే కశ్చన- తస్య నామ మహా ద్యశః- సర్వస్య వశీ- సర్వ స్యేశానః- త మీశ్వరాణాం పరమం మహేశ్వరం తం దేవతానాం పరమం చ దైవతమ్- ప్రణతపరతంత్రం మనుమహే- భక్తిక్రీతో జనార్దనః,- భగవంతుఁడు భక్తిచేఁ గొనఁబడెను. భక్తపరతంత్రుఁడని భావము. 'ఇమౌ స్మ ముని శార్దూల! కింకరౌ సముపస్థితౌ' అని రామలక్ష్మణులు విశ్వామిత్రునితోఁ దము కింకరులమని చెప్పుకొనుచున్నారు. ఉపాలంభోఽయం భోః శ్రయతి బత! సార్వజ్ఞ్య మపి తే— భక్తులదోషము నే తెలియని యీయన యేమి సర్వజ్ఞుఁడని లోక మాక్షేపించునని నింద. ఈ శ్లోకమున 'వ్యాజస్తుతి' అను అలంకారము గలదు. నిందచేత స్తుతియు, స్తుతిచేత నిందయు, గోచరించుట దీనికి లక్షణము. ఇచ్చట నిందచే స్తుతి గోచరించుచున్నది. ఎట్లన— వేదాంతములచేతఁ గీర్తింపఁబడిన పరమస్వతంత్రుఁడగు భగవానుఁ డస్వతంత్రులగు నాశ్రితులచేతిలోఁ గీలుబొమ్మగా నుండెననుట పైకి నిందగాఁ గనఁబడినను గొప్పవాడు తక్కువవారితోఁ గూడఁ గలసి

మెలసి వర్తించుట యను స్వామివారి సౌశీల్యగుణమునే స్తుతించుచున్నది. అట్లే భక్తులయందుఁ గల దోషమునే యెఱుఁగని భగవానుఁ డేమి సర్వజ్ఞుఁడని పైకి నిందగఁ దోఁచినను ఇది ఆశ్రితులదోషమును గమనింపని స్వామివారి వాత్సల్యగుణమునే స్తుతించు చున్నది. కాన వ్యాజస్తుతి యను నలంకారము. ఈ శ్లోకముతో ద్వితీయదశకము పూర్తి యైనది. ఈపదియు శిఖరిణీ వృత్తములు.

తా॥ వరదరాజస్వామీ! సర్వస్య వశీ— సర్వ స్యేశానః— ఇత్యాదివేదవాణి నిన్నుఁ బరమస్వతంత్రుఁడ వని గాన మొనర్చినను మేము మాత్రము భక్తపరతంత్రుఁడ వని నిన్నుఁ దలఁచు చున్నాము. స్వామీ! నీవు భక్తులయెడల దోషమునే కాంచవు. ఇది యొకదూషణముక్రింద నేర్పడి నీసర్వజ్ఞత్వమునే అధిక్షేపించు చున్నది. చిత్రము.

మ॥ అభిభాషించును వేదముల్ నిను నన
న్యాధీనుఁ డంచున్ సరే!
ఇభశైలేశ! నినున్ దలంచెదము మే
మెంతే శ్రితాధీనుఁగాఁ
బ్రభువా! భక్తులయందు దోషమును స్వ
ల్పం బేని వీక్షింపవే
సభలన్ బండితు లెట్లు నిన్ బిలుతురో
సర్వజ్ఞుఁ గాఁ జిత్ర మా॥ 20

అవతారిక :— ఈరీతిగా మంత్రరత్నములోని శ్రీమత్పద మును 'శ్రీనిధిమ్' అను రెండవ శ్లోకముచేత వ్యాఖ్యానించి నారాయణ శబ్దైకదేశ మగు 'నార' శబ్దార్థముగా మొదటి పదిశ్లోకములచేతఁ గరిగిరి మహిమను వర్ణించి నారాయణ పదముయొక్క గుణప్రాధాన్యమును జెప్పఁదలఁచి కల్యాణ గుణములను ద్వితీయదశకముచేఁ జెప్పి దివ్యవిగ్రహయోగము గూడ నారాయణశబ్దార్థ మగుటవలనను 'చరణ' శబ్దముచేత నాక్షిప్త మగుటవలనను ముప్పదిమూఁడు శ్లోకములచేత శిరము మొదలుకొని పాదములవఱకు దివ్యమంగళ విగ్రహ మును వర్ణించుటకుఁ బ్రారంభించు చున్నారు.

శ్లో॥ పాణిపాదవదనేక్షణశబ్దై
రంబుజా న్యపదిశన్ వరద ! త్వమ్ ।
బాహుభి స్త్వతివిశాలతమాలా
నాంజనం కరిగిరే రసి శృంగమ్ ॥ 21

ప్రతి :— హే వరద ! = ఓవరదరాజస్వామీ !, పాణి, పాద, వదన, ఈక్షణశబ్దైః = చేతులు, కాళ్ళు, ముఖము, కన్నులు అను పేర్లుగల (అవయవైః = అవయవములచేత) అంబుజాని = పద్మములను, అపదిశన్ = నిరసించుచు, బాహు భిః,తు = భుజములచేత, అతివిశాలతమాలాన్ = మిక్కిలివిశా లములగు చీఁకటి మ్రాఁకులను, (అపదిశన్ = నిరసించుచు) త్వమ్ = నీవు, కరిగిరేః = కరిగిరియొక్క, అంజనమ్ = కాటుక

వికారమగు, శృంగమ్=చటియవు, లేదా శిఖరమవు, అసి= అగుచున్నావు.

విశేషములు :— ఆంజనం కరిగిరే రసి శృంగమ్ ఇందలి శృంగశబ్దమునకు 'శృంగం ప్రాధాన్యసాన్వో శ్చ' అను కోశము వలన సానువనుసర్థము చెప్పఁబడెను.

శిఖరమను స్థామే సమంజసముగాఁ దోఁచెడిని పర్వత శిఖరమున కుపరిభాగమునఁ బద్మములును తమాలవృక్షములు నుండవచ్చును గాన వరదరాజస్వామీ! పద్మములవంటి పాణిపాదవదన నయనములు గలిగి, తమాలవృక్షములవంటి బాహువులు గలిగియొప్పు నీలమేఘశ్యాముఁడ వగు నీవు కాటుకకొండనుబోలు కరిగిరికి నంజనశృంగమువలెఁ బ్రకాశించుచున్నా వని భావము.

తా॥ ఓ వరదరాజస్వామీ! కరచరణముఖనయనము లను పేర్లుగల యవయవములచేతఁ బద్మములను బాహువులచేత విశాలతమాల వృక్షములను నిరసించుచున్న నీవు కరిగిరికి నంజన శృంగమువలెఁ బ్రకాశించు చున్నావు.

గీ॥ వరద! బాహువులఁ దమాలతరులఁ బాణి
పాదవదనేక్షణమ్ములఁ బద్మములను
గెలుచుచుఁ దేవ! యీకరిగిరికి నీవు
సిరి ఘటించితి వంజనశిఖర మట్లు. 21

శ్లో॥ త్వా ముదారభుజ మున్నస మాయత్
కర్ణపాశపరికర్మసదంసమ్ ।
ఆయతాక్ష మభిజాతకపోలం
పారణీయతి వరప్రద ! దృ క్మే ॥ 22

ప్రతి :— హేవరప్రద ! = ఓ వరదరాజస్వామీ !, మే = నాయొక్క, దృక్ = కన్ను, ఉదార,భుజమ్ = గొప్పబాహువులు గలట్టియు, ఉన్నసమ్ = ఉన్నతమగు నాసిక (ముక్కు) గలట్టియు, ఆయత్, కర్ణపాశ, పరికర్మ సత్, అంసమ్ = విశాలము లగు ప్రశస్తములైన చెవులే యలంకారములుగాఁ గల మేలైన మూఁపులు గలట్టియు, ఆయత + అక్షమ్ = దీర్ఘములగు కన్నులు గలట్టియు, అభిజాత, కపోలమ్ = మంచి పుట్టుకగల చెక్కిళ్ళు గలట్టియు, త్వామ్ = నిన్ను, పారణీయతి = పారణచేయఁ దలఁచుచున్నది. (పూర్ణముగా) ననుభవింపఁ దలఁచుచున్నది.)

విశేషములు :— కర్ణపాశౌ = ప్రశస్తౌ కర్ణౌ,'పాశ' అనునది ప్రశస్తార్థమున వచ్చినది కేశపాశ మిట్టిదే పారణీయతి— ఉప వాసానంతర భోజనమును 'పారణ' మందురు. క్రిమికంఠుఁడు కన్నులు పీఁకించినది మొదలు నీదర్శనమను భోజనము లేక యుపవాస మొనర్చుచున్న నాకనులు నీ వనెడు (నీ దర్శన మనెడు) పారణమున కెప్పుడెప్పుడా ! యని యెదురు చూచు చున్నదని యాశయము. ఏకాదశి నుపవసించినవాఁడు ద్వాదశి పారణకు వలె నని తెలియవలెను.

తా॥ ఓ వరదరాజప్రభూ! పీనములు వృత్తములు నగు బాహువులును ఉన్నతమగు నాసికయు, విశాలములగు కర్ణ పాశములే భూషణములు గాఁగల సుందరభుజ శిరస్సులు, విశాలలోచనములు మంచిపుట్టుకగల చెక్కిళ్లుగలిగి యందముఁ జిందునిన్ను నాకన్నులు పూర్ణముగా ననుభవింపఁ గోరు చున్నవి.

ఉ॥ చారుసుదీర్ఘబాహువులు
చక్కనినాసిక, కర్ణపాశశో
భారుచిరంబు లంసములు,
భాసురగండతలంబు దృష్టినో
హారి విశాలనేత్రము ల
హా! యనిపించెడు నిన్ను నాకనుల్
పారణ సేయ హస్తిగిరి
పార్థివ! బల్ గుటకల్ పొనర్చెడున్. 22

శ్లో॥ నీలమేఘనిభ మంజనపుంజ
శ్యామకుంతల మనంతశయం త్వామ్।
అబ్జపాణిపద మంబుజనేత్రం
నేత్రసాత్కురు కరీశ! సదా మే॥ 23

ప్రతి:— హేకరీశ! = ఓ వరదరాజస్వామీ!, నీలమేఘ నిభమ్=నీలమేఘముతో సమానమైనట్టియు, అంజన, పుంజ, శ్యామ, కుంతలమ్=కాటుకముద్దవలె నల్లని తలవెండ్రుకలు గలట్టియు, అనంత, శయమ్=శేషునిపై శయనించినట్టియు,

అబ్జ, పాణిపదమ్=పద్మములవంటి కరచరణములు గలట్టియు, అంబుజనేత్రమ్=తామరలవంటి కన్నులు గలట్టియు, త్వామ్=నిన్ను, సదా=ఎల్లప్పుడు, మే=నాకు, నేత్రసాత్=కన్నులకు అధీనము, (కన్నులముందఱ) కురు = చేయుము.

విశేషములు :—త్వాం సదా మే నేత్రసాత్ కురు– నిన్ను సదా నాకనులముందఱ నుంచుము 'త ద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః' అనుచోటఁ జెప్పిన సదాదర్శనము నొసంగుమని యాశయము.

ఈ శ్లోకమునందు సంప్రదాయజ్ఞు లీయైతిహ్యమును జెప్పుచుందురు. 'భాష్యకారవిశ్లేషకాలమునఁ గ్రిమికంఠుని దౌష్ట్యము చేత నేత్రములఁ గోల్పోయిన శ్రీవత్సచిహ్నమిశ్రులచేత నిర్మితమగు నీవరదరాజస్తవమును దిరిగివచ్చిన తరువాత విన్నవారై భాష్యకారు లీ శ్లోకమును వినునప్పుడు శ్రీవత్స చిహ్నమిశ్రుల కంటెని జూచి యేమిది! దయానిధి యగు వరద రాజస్వామి యెందులకు నేత్రము ననుగ్రహింప లేదని శంకించి రఁట. అప్పుడు శ్రీవత్సచిహ్నులు సదాదర్శనమే నాచేతఁ బ్రార్థింపఁ బడినదని సమాధానమిచ్చిరఁట. కనుకనే యిందు సదాదర్శనమునే చక్కఁగా వివరించుచుఁ బ్రార్థించుచున్నారు.

తా॥ ఓ వరదరాజస్వామీ! నీలమేఘమును బోలినట్టియు, కాటుకముద్దవలె నల్లనికురులు గలట్టియు, శేషునిపై శయనించి నట్టియు, పద్మములవంటి కరచరణనయనములు గలట్టి నిన్ను నాకు సదాదర్శింపఁ జేయుము.

సీ॥ మొయిలుమైచాయ కౌటుకహారయలుజుట్టు
పాఁపరాసెజ్జ, తమ్మిలపగిది నొప్పు
కరములు, పదంబు, లక్షులు, గ్రాలు నిన్నుఁ
గనులముందు సదా చూపు కరిగిరీశ. 23

శ్లో॥ త్వ క్చ దృ క్చ నిపిపాసతి జిహ్వా
విహ్వలా శ్రవణవ త్పరవృత్తౌ ।
నాసికా త్వయి కరీశ ! త థేతి
ప్రాప్నుయాం కథ మిమాం స్వి దవస్థామ్ ॥ 24

ప్రతి :— హే కరీశ = ఓ వరదరాజస్వామీ !, త్వయి = నీవిషయమున, (మమ = నాయొక్క) త్వక్, చ = త్వగింద్రియము, దృక్, చ = చక్షురింద్రియమును (కన్ను) నిపిపాసతి = మిక్కిలి త్రావఁ దలఁచుచున్నది. (రసనేంద్రియవ్యాపారమును గోరుచున్నది) జిహ్వా = రసనేంద్రియము (నాలుక) శ్రవణవత్ = కర్ణేంద్రియమువలె, పరవృత్తౌ = దర్శనము స్పర్శనము మొదలగు ఇతరేంద్రియ వ్యాపారమునందు, విహ్వలా = వ్యాకులమైనది లేదా చపలమైనది, (భవతి = అగుచున్నది) నాసికా, చ = ఘ్రాణేంద్రియము కూడ (ముక్కు) తథా = అట్లే యింద్రియాంతర వ్యాపారమున వ్యాకులమై యున్నది. ఇతి = కనుక, కథంస్విత్ = ఏవిధముగా, ఇమామ్ = ఇటువంటి, అవస్థామ్ = దశను, ప్రాప్నుయామ్ = పొందుదును !

విశేషములు :— శ్రవణవత్ — శ్రవణేంద్రియము ఇంద్రియాంతరవ్యాపారమున నెట్లు వ్యాకులమై యున్నదో యట్లే

రసనేంద్రియము గూడ నింద్రియాంతర వ్యాపారమున వ్యాకులమై యున్నదని యర్థము. 'ప్రాప్నుయాం కథమిమాం స్వి దవస్థామ్'— 'పశ్య త్యచక్షు స్స శృణో త్యకర్ణః— విశ్వత శ్చక్షు రుత విశ్వతోముఖః— ఇత్యాది ప్రమాణ కోటియందుఁ బ్రతిపాదిత మగు సార్వపథీనప్రత్యక్షము గల భగవంతుని యొక్క పరమసామ్యాప త్తిరూప మగు ముక్తిని బొంది యట్టి ప్రత్యక్షముతో నిష్టము వచ్చినట్లు భగవంతు ననుభవింపవలె నని శ్రీవత్సచిహ్నమిశ్రుల యుత్కంఠ.

తా॥ ఓ కరిగిరినాథా! నీవిషయమున నాచక్షురింద్రియ, త్వగింద్రియములు ప్రాఁవఁ దలఁచుచున్నవి (రసనేంద్రియవృత్తి గలిగియున్నవి. జిహ్వాయు నాసికయు శ్రవణేంద్రియమువలెనే యింద్రియాంతర వ్యాపారములు గలిగియున్నవి. ఎట్లీపరమ సామ్యరూపదశను బొందుదునో!

ఉ॥ ఓ వరదేశ! హస్తిగిరి
నొప్పెడువేల్ప! మదక్షిచర్మముల్
ప్రాఁవఁగఁ గోరు నీయెడలఁ
దత్పరతన్ మఱి నాదుజిహ్వయుఁ
దేవర! నాసయుఁ శ్రుతిగ
తిఁ గనిపించెడు నన్యవృత్తులై
యేవిధి సామ్యరూప మగు
నీదృశమా స్థితిఁ గాంచువాఁడనో! 24

అవతారిక :— ఇట్లు నాల్గుశ్లోకములతో దివ్యమంగళ విగ్రహశోభ ననుభవించి ప్రత్యవయవశోభ ననుభవింప నారంభించుచున్నారు.

శ్లో॥ అధిరాజ్య మధికం భువనానా
మీశ ! తే పిశునయ౯ కిల మౌళిః
చూళికామణి సహస్రమరీచే
ర్హస్తిభూషణ ! భవ త్యుదయాద్రిః ॥ 25

ప్రతి :— హస్తిభూషణ ! = కరిగిరికి అలంకారభూతుఁడ వగు, ఈశ ! = ఓవరదరాజస్వామీ !, భువనానామ్ =(సకల) లోకములయొక్క, అధిరాజ్యమ్ = సామ్రాజ్యమును, అధికమ్ = ఎక్కువగా, లేదా - అధికమ్ = గొప్పదియగు, అధిరాజ్యమ్ = సామ్రాజ్యమును, పిశునయ౯ = సూచించుచు, తే = నీయొక్క, మౌళిః = కిరీటము, చూళికామణి, సహస్రమరీచేః = కిరీటశిఖరమున నుండెడు మణి యనెడు సూర్యునకు, ఉదయాద్రిః, భవతి, కిల = ఉదయపర్వతమో ! యన్నట్లున్నది.

విశేషములు :— మౌళిః — మౌళిస్థమగు కిరీటము (తాత్స్థ్యలక్షణ) కిల— ఉత్ప్రేక్షావాచకము చూళికామణి సహస్రమరీచేః ఉదయాద్రిః భవతి కిల— ఉభయవిభూతి సూచక దేవరాజకిరీటము విశృంఖల మయూఖసంఘాతము గల స్వశిఖామణియను నభోమణికి నుదయగిరివలెఁ బ్రకాశించుచున్న దని భావము. ఇందు— కిరీటమునకు— ఉదయాద్రికి, చూడామణికి— సూర్యునకుఁ బోలికలు.

తా॥ కరిగిరి కలంకారభూతుఁడ వగు ఓ వరదరాజస్వామీ! నీ కిరీటము సర్వలోక సామ్రాజ్యమును సూచించుచు కిరీట శిఖరస్థితమగు చూడామణియను సూర్యున కుదయాద్రియో! యన నొప్పు చున్నది.

చ॥ అదిగో! కిరీట మాదల మ
హామణిభాసుర మగ్రభాగమం
దది భవదీయసర్వభువ
నాధిపతిత్వము నుగ్గడించుచున్
త్రిదశవరేడ్య! రుజ్నిచయ
దీప్తశిరోమణిచండరశ్మి క
య్యుదయ మహీధరంబో! యన
నొప్పెడు వారణశైలభూషణా! 25

శ్లో॥ ఉద్ధర త్యుపరి భక్తజనాని
తూర్ధ్వతాశ్రయణ సూచితశక్తిమ్ ।
ఊర్ధ్వపుండ్రతిలకం బహుమానాత్
కిం బిభర్షి వరద! స్వలలాటే ॥ 26

ప్రతి:— హేవరద! = ఓవరదరాజస్వామీ!, (అయం ఊర్ధ్వపుండ్రతిలకః = ఈఊర్ధ్వపుండ్రతిలకము) భక్తజనాన్ = భగవద్భక్తిగల జనులను, ఉపరి = ఊర్ధ్వగతికి, ఉద్ధరతి = ఎత్తుకొని పోవుచున్నది. (స్వధారణముచేత నూర్ధ్వగతిని బొందించుచున్నది యని భావము) ఇతి = ఇట్లు, ఊర్ధ్వతా, ఆశ్రయణ, సూచిత, శక్తిమ్ = ఊర్ధ్వాకారాశ్రయణముచేత సూచింపఁ

బడిన యర్థశక్తిగల, ఊర్ధ్వపుండ్ర తిలకమును, బహుమానాత్ = గౌరవమువలన, స్వలలాటే = నీనుదుట, బిభర్షి, కిమ్ ? = ధరించుచున్నావా ?

విశేషములు :— ఊర్ధ్వం (ఊర్ధ్వగతిం) ప్రాపయతి ఇత్యూర్ధ్వపుండ్రమ్ – అని వ్యుత్పత్తి. ఊర్ధ్వలోకములను పొందించునది. బహుమానాత్ — నాభక్తుల నుద్ధరించుచున్నదను గౌరవమువలన కింబిభర్షి వరద! స్వలలాటే ?– 'స్నానం దానం జపో హోమః స్వాధ్యాయః పితృతర్పణమ్ భస్మీభవతి తత్సర్వమూర్ధ్వపుండ్రం వినా కృతమ్ ॥' ఊర్ధ్వపుండ్రముల ధరింపక చేసిన స్నానదానజపాదు లన్నియు నిష్ఫలము లని పై శ్లోకమునకు భావము. ఇది కర్మాంగముగాఁ జెప్పఁబడుట చేత భగవానున కందులకై యూర్ధ్వపుండ్రధారణము సంభవింపదు గాన– బహుమానాత్ – అని చెప్పఁబడెను.

తా॥ ఓ వరదరాజాస్వామీ ! ఊర్ధ్వపుండ్రతిలకము స్వధారణముచేత భక్తజనుల నూర్ధ్వలోకములను బొందించు చున్నది. వ్యుత్పత్తిచేతనే ఊర్ధ్వాకార వైశిష్ట్యమును జ్ఞప్తిచేయుచున్న యీ యూర్ధ్వపుండ్రతిలకమును నాభక్తుల నుద్ధరించుచున్నది యను గౌరవమువలన నీలలాటమున ధరించుచున్నావా ?

గీ॥ ఊర్ధ్వపుండ్రంబు భక్తుల నూర్ధ్వగతికిఁ
జేర్చు నిజధారణంబునఁ జేసి యనుచు
దీనిపైఁ గలబహుమానదృష్టి నుదుట
నూర్ధ్వపుండ్రంబుఁ దాల్చితి వాఁకా ! కరీశ ! 26

శ్లో॥ కర్ణికా తవ కరీశ ! కి మేషా
కర్ణభూషణ ము తాంసవిభూషా ।
అంసలంబ్యలకభూషణ మాహో !
మానసస్య మమ వా పరికర్మ ॥ 27

ప్రతి :— హే కరీశ ! = ఓ వరదరాజస్వామీ !, తవ= నీయొక్క, ఏషా=ఈ, కర్ణికా=కర్ణాలంకార మగు మకర కుండలము, కర్ణభూషణం కిమ్=కర్ణములకు మాత్రమే యలం కారమా ? ఉత = లేక, అంసవిభూషా = భుజశిరస్సులకు మాత్రమే యలంకారమా ? (మూఁపులపై వ్రేలాడుటచేత వానికే యలంకారమా ? అని భావము) ఆహో=అదియుఁ గానిచో, అంస, లంబి, అలక, భూషణమ్ = మూఁపులపై వ్రేలాడుచున్న చిన్నికురులకు నలంకారమా ? మమ = నాయొక్క, మానసస్య = మనస్సునకు, పరికర్మవా=అలం కారమా ?

విశేషములు :— కర్ణకా— సూ॥ కర్ణలలాటాత్ క న్నలం కారే- అను సూత్రమువలన అలంకారమను నర్థమున 'కర్ణ' శబ్దముమీఁద కన్ ప్రత్యయము రాఁగా నేర్పడినరూపము. ఇట్లే లలాటశబ్దముమీఁద కన్ ప్రత్యయము రాఁగా 'లలాటికా' అగును- నొసటిభూషణము. ఇందు కోటిచతుష్టయావగాహి సంశయము ప్రదర్శింపఁ బడినది.

(1) ప్రథమకోటి- స్వామీ ! తమ చెవులకుఁగల సొమ్ము కర్ణములకే భూషణమా ? లేక

(2) ద్వితీయకోటి— మూఁపులపై వ్రేలుచుండుటచే అంస భూషణమా ? లేక

(3) తృతీయకోటి— అంసములపైఁ బడుచున్నయలకలకు భూషణమా ? లేక

(4) పై శోభల నన్నియు ననుభవింపఁ గోరుచున్న నామనస్సునకుఁ భూషణమా ? అని— పైనిఁ బేర్కొనఁబడిన నాల్గింటికిని భూషణమే యని భావము.

తా॥ ఓ కరిగిరినాథా ! నీచెవుల నొప్పుసొమ్ము కర్ణములకే భూషణమా ? లేక భుజశిరస్సులకు నలంకారమా ? కానిచో అంసముల వ్రేలునలకల కలంకృతియా ? అదియుఁ గానిచో నామానసమునకే మండనమా ? తెలుప వేఁడెదను.

ఉ॥ ఏనికకొండ తేఁడ ! వర
దేశ ! ప్రభూ ! మకరాంచితంబు నీ
వీనులఁ గ్రాలువస్తు వది
వే వచియింపుము కర్ణభూషణం
బౌనొ ! నిజాంసమండనమె
యౌనొ ! యలంకృతి యౌనొ ! తన్మిళ
న్మానితకుంతలావళికి,
నాదుమనంబునకుఁ విభూషయౌ ! 27

శ్లో॥ పారిజాతవిటపా నభితో యూ
పుష్పసంప దుదియాత్ కరినాథ ! ।
తాం విడంబయతి తావకబాహు
ష్వాతతా తు కటకాంగదలక్ష్మీః ॥ 28

ప్రతి :— హే కరినాథ ! = ఓ వరదరాజస్వామీ !, తావక బాహుషు = నీ సంబంధములగు బాహువులయందు, ఆతతా = విస్తృతమైన, కటక, అంగద, లక్ష్మీః = మురుగులయొక్క— భుజకీర్తులయొక్క—యు శోభ, పారిజాత, విటపాః, అభితః = కల్పవృక్షశాఖలచుట్టు (నిండ) యా = ఏ, పుష్ప, సంపత్ = పూలశోభ, ఉదియాత్ = పుట్టునో, తామ్ = దానిని (ఆపుష్ప శోభను) విడంబయతి = అనుకరించు చున్నది.

విశేషములు :— తావకబాహుషు— అనుబహువచనము చేత వరదరాజస్వామి చతుర్భుజుఁ డని తెలియుచున్నది.

ఈ శ్లోకమున భక్తులకుఁ గోరినవరములఁ బ్రసాదించు వరదరాజస్వామిని పారిజాత వృక్షముతోను, స్వామివారి బాహువులను పారిజాతవిటపములతోను, శ్రీవారి కటక కేయూరశోభను పారిజాతవిటప పుష్పలక్ష్మితోను, బోల్చుట యెంతయు హృదయంగమముగా నున్నది.

తా॥ ఓ కరిగిరీశా! నీబాహువులయందలి విస్తృత మగు కటకకేయూరశోభ పారిజాతవిటపములఁ బొడమిన పుష్పసంపద ననుకరించు చున్నది.

ఉ॥ భాసురపారిజాతవిట

పంబుల నిండుగఁ బుష్పశోభ యు

ద్భాసిత మయ్యె నే నపుడు

దానినిఁ బోలు సమస్తదైవతా

గ్రేసర ! వారణాద్రితట
ఖేలనపండిత ! నీదు భాహులకా
మీాసరకంకణాంగద స
మేధితలక్ష్మి వరప్రదాగ్రణీ !

శ్లో॥ మథ్యమానచల ఫేనిలసింధు
ప్రోత్థితక్షణదశాం గమితౌ తే ।
వక్షసి స్ఫురితమౌక్తికహారే
కౌస్తుభ శ్చ కమలా చ కరీశ ! 29

ప్రతి :— హే కరీశ ! = ఓ వరదరాజస్వామీ !, స్ఫురిత, మౌక్తిక, హారే= మెఱయుచున్న (కదలుచున్న) ముత్యాల పేరుగల, తే=నీయొక్క, వక్షసి = ఱొమ్మునందు, కౌస్తుభః, చ=కౌస్తుభమణియు, కమలా, చ=లక్ష్మీదేవియు, మథ్యమాన — — దశామ్— మథ్యమాన = చిలుకఁ బడుచున్న, (కనుకనే) చల=కదలుచున్న, ఫేనిల= నుఱుగుగల, సింధు= సముద్రమునుండి, ప్రోత్థిత=బయలుదేఱుటయొక్క, సమయ = కాలమునందలి, దశామ్=స్థితిని, గమితౌ = పొందింపఁ బడినవి.

విశేషములు :— ఫేనిల— మత్వర్థమున ఫేనశబ్దమీాఁద 'ఇలచ్' ప్రత్యయమును జేసికొనఁగా నీరూపము సిద్ధించుచున్నది. నుఱుగుగలది యని యర్థము. లక్ష్మీకౌస్తుభాధిష్ఠితము స్ఫురితముక్తాహారము నగు భగవానుని వక్షఃస్థలమునకు ఆవిర్భవల్లక్ష్మీ కౌస్తుభముల నిమిత్తము చిలుకఁ బడుచు నలలతో నుఱుగుతో నొప్పుసముద్రముతోడి సామ్య మిందు

హృద్యముగా వర్ణింపఁబడినది. ఇందు 'ప్రోథిత' అనుచోట 'ప్రోజ్ఝిత' అని పాఠాంతతముగలదు. అర్థము సమానము.

తా॥ ఓ కరిగిరినాథా! తళతళలాడు ముత్యాలపేరు గల నీవక్షఃస్థలము నందలి కౌస్తుభమణి లక్ష్మీదేవియుఁ జిలుకఁ బడుచుండుటచేత నలలు నుఱుగుగల సముద్రమునుండి యుద్భవించుసమయస్థితిని బొందింపఁబడిరి.

గీ॥ తరళమౌక్తిక హారంబు తనరు నీదు
వక్షమునఁ గౌస్తుభము లక్ష్మి వరదరాజ!
చిలుకఁ బడుట నలల్ నుర్గు చెన్ను మీఱు
జలధిఁ బొడమెడుసమయంబుఁ జాటుచుండె. 29

శ్లో॥ అంజనక్షితిభృతో యదినామో
పత్యకా వరద! హేమమయీ స్యాత్ ।
తాదృశీ తవ విభాతి తు లక్ష్మీ
రాంబరీ బత విడంబిత విద్యుత్ ॥ 30

ప్రతి : — హే వరద! = ఓ వరద రాజస్వామీ!, అంజనక్షితి భృతః = కాటుకకొండ యొక్క, ఉపత్యకా = ఆసన్నభూమి, హేమమయీ, స్యాత్, యది, నామ = బంగారువికారమైనది యగునేని విడంబిత విద్యుత్ = అనుకరింపఁబడిన మెఱుపుఁ దీఁగెగల, తవ = నీయొక్క, ఆంబరీ = పీతాంబరసంబంధిని యగు, లక్ష్మీః, తు = శోభ, తాదృశీ = అట్టిదిగా, విభాతి = ప్రకాశించుచున్నది. బత! = ఆశ్చర్యము.

విశేషములు :— ఉపత్యకా = పర్వతపర్యంతభూమి 'ఉపత్యకాద్రే రాసన్నభూమిః' అమరము. బత— ఆశ్చర్యార్థకము. ఏమినీపీతాంబరశోభ యని యాశ్చర్యము. ఇందలి యభూతోపమ కుమారసంభవములోని పార్వతీవర్ణనము నందలి యీ శ్లోకమును జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది.

> శ్లో॥ పుష్పం ప్రవాళోపహితం యది స్యాత్
> ముక్తాఫలం వా స్ఫుటవిద్రుమస్థమ్ ।
> తతోఽనుకుర్యా ద్విశదస్య తస్యాః
> తామ్రౌష్ఠపర్యస్తరుచః స్మితస్య ॥

దీనితో స్వాగతాదశకము ముగిసినది.

తా॥ ఓ వరదరాజస్వామీ ! అంజన పర్వతముయొక్క పర్యంతభూమి బంగారువికార మైనచో నప్పుడు మెఱుపుఁదీఁగె ననుకరించు నీ పీతాంబరశోభ దానినిఁ బోలఁగలదు. ఆహా ! ఏమి నీ పీతాంబరమునీటు.

ఉ॥ కాటుకకొండ చేరువుగఁ
గ్రాలెడు నేల యదెప్డు డేనియుౝ
హాటక సన్నిభం బయిన
నప్పుడు వోలెడు మెర్పుఁదీఁగెతోఁ
బోటి యొనర్చు నీపసిఁడి
పుట్టపు మేల్ సిరి హాస్తిభూమిభృ
త్కూటవిహార ! కైటభవ
ధూముఖకుంకుమ పత్త్రహారా ! 30

శ్లో॥ పరభాగ మియా ద్రవే స్తమిస్రా
వరదాద్య త్వయి త న్నిశామయామః ।
గమితా తవ వక్త్రచిత్రభానోః
పరభాగం నను కౌంతలీ తమిస్రా ॥ 31

ప్రతి :— హే వరద ! = ఓ వరదరాజస్వామీ !, తమిస్రా =చీఁకటిరాత్రి, రవేః = సూర్యునికి, పరభాగమ్ = పశ్చాద్భాగమును, ఇయాత్ = పొందును, (సూర్యుఁడ స్తమించిన తరువాతనే రాత్రి యారంభమగును గనుక) తత్ = ఆపరభాగ గమనమును, అద్య = ఇప్పుడు, త్వయి = నీయందు (నీదివ్య విగ్రహమునందు) నిశామయామః = చూచుచున్నాము, తవ = నీయొక్క, కౌంతలీ = కురులసంబంధిని యగు, తమిస్రా = రాత్రి (కుంతలాఖ్యయగు రాత్రి) వక్త్రచిత్రభానోః = ముఖసూర్యుని యొక్క, పరభాగమ్ = వర్ణోత్కర్షమును, (పశ్చాద్భాగమును) గమితా, నను = పొందింపఁ బడినదికదా !

విశేషములు :— తమిస్రా- తామసీ రాత్రిః చీకటిరేయి. పరభాగమ్- పశ్చాద్భాగమ్- వెనుక భాగమును- వర్ణోత్కర్షమును అని రెండవయర్థము. వర్ణాంతరసన్నిధానజన్య వర్ణోత్కర్షస్య పరభాగ ఇతి నామ=వర్ణాంతరసన్నిధానము వలనఁ గలుగు వర్ణోత్కర్షమునకు 'పరభాగ' మని పేరు. శ్లిష్టరూపకము. రాత్రికి సూర్యపరభాగప్రాప్తి లోకప్రసిద్ధము. ఈవాక్యమున 'పరభాగ' శబ్దమునకుఁ బశ్చాద్భాగ మని యర్థము. సూర్యాస్తమయము వెనుక రాత్రివచ్చునని లోకప్రసిద్ధి గదా!

అది నీ కల్యాణవిగ్రహమున గోచరించుచున్నది. ఎట్లన ? త్వదీయముఖచిత్రభానునికడ నీకుంతలావళి యనురేయి పరభాగమును (వర్ణోత్కర్షమును) పొందుచున్నదిగదా!

వరదరాజస్వామివారి ముఖము సూర్యునివలె వెలుఁగుచుండఁగా ఆ సూర్యుని వెలుతురు సన్నిధానమున స్వామివారి కేశపాశము మఱింత నల్లగాఁ బ్రకాశించుచున్నదని భావము.

తా॥ ఓవరదరాజస్వామీ! రాత్రి సూర్యునకు 'పరభాగమును (పశ్చాద్భాగమును) పొందును. దాని నిప్పుడు నీదివ్యమంగళవిగ్రహమునఁ జూచుచున్నాము. దేవరవారి కుంతలావళి యనురాత్రి వదనసూర్యుని పరభాగమును (వర్ణోత్కర్షమును) పొందింపఁ బడెనుగదా!

ఉ॥ భానునకుం దమిస్ర పర
భాగ మటందురు, హస్తిభూధరే
శాన! వరప్రదానసుయ
శా! యది తావక దివ్యమూర్తిలోఁ
గానఁగ వచ్చు నెట్టులనఁ
గా భవదీయకచాళిరాత్రి మీ
యానన చిత్రభానునెడ
నయ్యెఁ గదా! పరభాగభాక్కహో! 31

శ్లో॥ ఉభయో రపి పక్షయో స్తిథి ర్యా
విషమీభావ నిరాసదాఽష్టమీతి ।
ఉపమానజసంపదే హి సేందో
ర్వరదాభూ ద్భవతో లలాటలక్ష్మ్యాః॥ 32

ప్రతి :— హే వరద! = ఓ వరదరాజస్వామీ!, ఉభయోః = రెండు, పక్షయోః, అపి = పక్షములయందు సైతము (శుక్ల కృష్ణ పక్షములందుఁగూడ) ఇందోః = చంద్రునకు, విషమీభావ, నిరాస, దా = వైషమ్యముయొక్క (భేదముయొక్క) త్రోసివేత నొసఁగుచున్న, అష్టమీ, ఇతి, యా, తిథిః = అష్టమి యను ఏతిథి, (అస్తి = కలదో) సా = ఆతిథి, భవతః = తమయొక్క, లలాటలక్ష్మ్యాః = నొసటిసిరియొక్క, ఉపమాన, జ, సంపదే = ఉపమానవస్తువునందుఁ బొడము శోభాసమృద్ధికొఱకు, అభూత్ = ఆయెను.

విశేషములు :— విషమీభావ నిరాసదాఽష్టమీ— అష్టమి శుక్ల కృష్ణ పక్షముల రెండింటను చంద్రకళలందు వైషమ్యము లేకుండఁ జేయుచుండుట ఎందుకనఁగా— ఉపమానజసంపదే— దేవరవారి లలాటలక్ష్మిని బోల్చుటకు నర్ధచంద్రోపమానమును సంపాదించుకొనుట కని భావము. దీనిచే నుభయపక్షములందును, అష్టమీతిథి చంద్రునకుఁ గళాసామ్యప్రదమాత్రమే కాక వరదరాజస్వామి లలాట

సామ్యప్రదయు నని తేలినది. వరదరాజు లలాటము పక్షద్వయాష్టమీ చంద్రునివలె శోభాయమానముగా నున్నదని సారాంశము.

తా॥ ఓ వరదరాజస్వామీ ! శుక్లకృష్ణ పక్షములందు సైతము చంద్రునకుఁ గళావైషమ్యమును నిరసించుచున్న యష్టమీతిథి దేవరవారి లలాటలక్ష్మికి నుపమింపఁ జంద్రుని యందు శోభాసమృద్ధిని గూర్చుకొనుచున్నది.

గీ॥ ఉభయపక్షాల విధున కభ్యుదయహాను
లించుకయు నీనియష్టమి యీశ ! నీదు
నొసటిసిరి కుపమింప మేల్పసను గూర్ప
దిద్దు చున్నది శశి సరియుద్దిఁ జేయ. 32

శ్లో॥ అలకాలి చికీర్షయా కిలాత్తా
సుపరీక్షిషయా లలాటపట్టే ।
సుమషీ నికషీకృతా భ్రువౌ తే
వరద ! స్యా దకృతత్వత స్తు నైవమ్ ॥ 33

ప్రతి :— వరద ! = ఓ వరదరాజస్వామీ !, (విధాత్రా = బ్రహ్మదేవుని చేత) అలక, ఆళి, చికీర్షయా = ముంగురుల బంతిని నిర్మింపవలయునను నిచ్ఛచేత, ఆత్తా = గ్రహింపఁ బడినదియు, సుపరీక్షిషయా = చక్కఁగాఁ బరీక్షింపవలె నను కోరిక చేత, లలాటపట్టే = నొసలు అనెడు పలకయందు, నికషీకృతా = గీయఁబడిన, సుమషీ = మంచికాటుక (మసి) తే = నీకు, భ్రువౌ = కనుబొమలుగా, అభూత్, కిల = ఆయెనా యేమి ?

అకృతత్వాతః తు = (దేవరవారి దివ్యవిగ్రహము) నిత్యమగుట వలన, ఏవమ్ = ఇట్లు ఊహించుట, న, స్యాత్ = సంభవింపదు. (పొసఁగదు)

విశేషములు :— ఇందు 'విధాత్రా' అను పద మధ్యాహార్యము. అలకాళి— అలక + ఆళి = ముంగురులపంక్తి, అలక + అళి = తుమ్మెదలవంటి ముంగురులు, అకృతత్వాతస్తు— భగవానుని దివ్యదేహము కృతకము కాదు ఇందుకుఁ బ్రమాణములు— ఇచ్ఛాగృహీతాభిమతోరు దేహః— (ఇచ్ఛాస్వీకృతమును అభిమతము నగు దివ్యదేహము గలవాఁడు) 'ప్రకృతిం స్వా మధిష్ఠాయ సంభవా మ్యాత్మమాయయా' (నా యధీనములోనున్న ప్రకృతి నాధారము చేసికొని నా యిచ్ఛచేతనే నేనవతరించు చున్నాను.) 'న తస్య ప్రాకృతా మూర్తిః' (ఆ పరమాత్మకుఁ బ్రాకృతశరీరము లేదు) కనుక 'నైవమ్' నిత్యుఁడగు శ్రీ వరదరాజస్వామివారి యలకాళిని బ్రహ్మ సృజింపఁజేసి నట్లూహింపఁబడిన వ్యాపారము పొసఁగదని భావము.

తా॥ ఓ వరదరాజస్వామీ! బ్రహ్మదేవుఁడు తమ ముంగురుల సృజింపనెంచి దాని కుపాదానకారణమగు మషిని (నల్లని కాటుకను) దీసికొని యిది మేలురకమా? కాదా? అని పరీక్షింపఁ దలఁచి ఫాలపట్టిక యను గీటురాయిపై గీయ నేర్పడిన యా రేఖలే తమ కనుబొమ్మ లాయెనా? కాదు. పొరపాటూహ; నిత్యుఁడవగు నీకు నిర్మాణ మెక్కడిది?

చ॥ అలపరమేష్ఠి యుష్మదల
కాళి సృజింపఁ దలంచి దానికై
వలసిన మేల్మషీకణిక
వాసిఁ గనుంగొన ఫాలపట్టిపైఁ
బోలుపుగ గీయ రేఖ లవి
భ్రూలత లయ్యెనొకో! కరీశ! యీ
తలఁపు నిరాకరంబు వర
దా! జని యెట్లగు నీకు నిత్యుఁడా!

శ్లో॥ శ్రవస శ్చ దృశ శ్చ శబ్దరూప
గ్రహణే తే నహి జీవవ ద్వ్యవస్థా ।
ఉభయో రఖిలేక్షణక్షమత్వాత్
వరదాత శ్శ్రవణాశ్రయే దృశౌ తే ॥ 34

ప్రతి :— హే వరదాతః=ఓ వరదరాజస్వామీ! తే= నీయొక్క, శ్రవసః, చ=చెవికిని, దృశఃచ=కంటికిని, శబ్ద, రూప, గ్రహణే=(క్రమాలంకారము) శబ్దమును గ్రహించుట యందు రూపమును గ్రహించుటయందును, జీవవత్ =జీవునకు వలె, వ్యవస్థా=నియమము, న హి=లేదు, ఉభయోః= రెండును (చెవులు కన్నులును) అఖిల, ఈక్షణ, క్షమత్వాత్ = సకలేంద్రియ విషయములను దర్శించుటయందు సమర్థము లగుటవలన, తే = నీయొక్క, దృశౌ=కన్నులు, శ్రవ ణాశ్రయే= చెవులు ఆశ్రయముగాఁ గలవి (భవతః= అగు చున్నవి.

విశేషములు :— శ్రవస శ్చ.....గ్రహణే— చెవి శబ్దమును గ్రహించుటయందు, కన్ను రూపమును గ్రహించుట యందు అని యథాక్రమముగా నర్థము గ్రాహ్యము. శ్రవణాశ్రయే దృశౌ తే— స్వాయముగానే కర్ణాంతాయతములగు భగవల్లోచనముల నిట్లుత్ప్రేక్షించు చున్నారు. చేతనుల శ్రోత్రాదులు శబ్దాద్యేకైక విషయగ్రాహకము లైనట్లు భగవదింద్రియముల కట్టి నియమము లేదు గావునఁ గంటితో శబ్దమును వినుట, చెవితో రూపమును జూచుటయుఁ గలదు. గావున నీ రెండు ఇంద్రియములు కలసియున్న వని యుత్ప్రేక్ష.

తా॥ ఓ వరదరాజస్వామీ! జీవులకు వలె నీకుఁ జెవితోనే శబ్దమును గ్రహించుట కంటితోనే రూపమును గ్రహించుట యను నియమము లేదు. నీ చెవి కన్ను గూడ సకలేక్షణ దక్షములు గనుక (అనఁగా) నీ చెవులు చూచుటకు, నీ కన్నులు వినుటకుఁ గూడ, సమర్థములు గావున నీ కన్నులు చెవులతోఁ గలసియున్నవి. భగవంతుని కన్ను లాకర్ణాంత విశాలము లని భావము.

ఉ॥ జీవుల కట్ల నీకుఁ జెవి
చే వినఁగా వలెఁ గంటనే కనం
గా వలె నన్న శాసనము
కర్వచలేశ్వర! లేదు రెండు నో
దేవవరేణ్య! సర్వసము
దీక్షణదక్షము లందు చేతనే

కావరె నీదు నేత్రములు
కర్ణప్రతీతటిఁ జెల్మిఁ జేయుటల్. 34

శ్లో॥ కరుణారస వాహివీక్షణోర్మే
ర్వరద! ప్రేమమయప్రవాహభాజః।
తతతీరవనావళీ భ్రువౌ దృ
క్చలసింధోః స్తవ నాసికైవ సేతుః॥ 35

ప్రతి :— హే వరద! = ఓ వరదరాజస్వామీ! కరుణా, రస, వాహి, వీక్షణ, ఊర్మేః = కృపారసమును ప్రవహించు కటాక్షము లను తరంగములు గలదియు, ప్రేమమయ, ప్రవాహ, భాజః = ప్రణయమనెడు ప్రవాహమును బొందినదియు, (అగు) తే = నీయొక్క, దృక్, చల, సింధోః = దృష్టి యనెడు చంచలమగు సముద్రమునకు, భ్రువౌ = దేవరవారి కనుబొమలు, తత, తీర, వనావళీ = విశాలములగు చెలియలి కట్టకడ నున్న వనపంక్తులు (భవతః = అగుచున్నవి) నాసికా, ఏవ = ముక్కే, సేతుః = వంతెన, (భవతి = అగుచున్నది.)

విశేషములు :— 'దృక్, చలసింధోః'— శ్రీ కరిగిరి నాథుని దృష్టి నొక చలసముద్రముగా నారోపించుటచేత దాని కనుగుణముగా— కరుణయందు రసత్వము, కటాక్షము లందు నూర్మిత్వము, ప్రేమమునందుఁ బ్రవాహత్వము, భ్రూయుగమునందుఁ దీరవనావళిత్వము, నాసికయందు సేతుత్వము చక్కగా నారోపింపఁబడినవి. కరుణాసముద్రుఁడగు శ్రీ వరదరాజుల భ్రూయుగము నాసికయు నత్యంతభోగ్యము

లుగా నున్న వని భావము— నాసిక్తైవ— అనుచోట 'నాసికేవ' అని పాఠాంతరము గలదు.

తా॥ ఓ వరదరాజస్వామీ! కరుణారసముతోఁ గటాక్ష తరంగములతోఁ బ్రేమప్రవాహముతో నొప్పు నీ దృష్టి యను చలసముద్రమునకు నీ కనుబొమలు తీరవనావళులవలెను, నీ నాసిక సేతువు వలెను దర్శనీయములై యలరు చున్నవి.

చ॥ కరుణయె మేల్ రసంబు,
కడగన్నుల వెల్లడుమాపులే యలల్,
కరిపతి! ప్రేమనిర్ఝరము
గల్గు భవచ్చల దృక్పయోధికిన్
దరిని వనావళుల్ బొమలు,
దాపున నాసయె సేతువౌర! నీ
సురుచిర దివ్యవిగ్రహముఁ
జూడఁగఁ గన్నులు చాలవో ప్రభూ! 35

శ్లో॥ విభవం వివృణోతి విస్తృణీతే
రుచ మావిష్కురుతే కృపా మపారామ్।
అభివర్షతి హర్ష మార్ద్రభావం
తనుతే తే వర దైవ దృష్టిపాతః॥ 36

ప్రతి :— హే వరద! = ఓ వరదరాజస్వామీ! తే = నీయొక్క, ఏషః = ఈ, (మాకును సాక్షాత్కార యోగ్యమగు) దృష్టిపాతః = కటాక్షము, విభవమ్ = నీ యుభయవిభూతి సార్వభౌమత్వమును, వివృణోతి = వివరించుచున్నది, రుచమ్ =

శోభను, విస్తృణీతే=విస్తరింపఁజేయు చున్నది, అపారామ్= అంతులేని, కృపామ్ = దయను, ఆవిష్కురుతే = వెల్లడి చేయుచున్నది. హర్షమ్=ఆనందమును, అభివర్షతి=కురియు చున్నది, ఆర్ద్రిభావమ్ = ఆర్ద్రిత్వమును (భక్తిచేఁ గరఁగి పోవుటను) తనుతే=చేయుచున్నది.

విశేషములు :— విస్తృణీతే రుచమ్— 'తస్య యథా కప్యాసం పుండరీక మేవాక్షిణీ' అన్నట్లు, 'రామో రాజీవలోచనః' కృష్ణం కమలపత్రాక్షమ్— ఇత్యాదులఁ బేర్కొనఁబడిన యఖండోల్లాస పుండరీక సదృశలోచన వత్త్వాప్రదర్శిత శోభను విస్తరింపఁ జేయుచున్న దని యాశయము.

తా॥ ఓ వరదరాజస్వామీ ! మాదృశులకుఁ గూడ సాక్షాత్కార యోగ్యమగు నీయీ కటాక్షపాతము నీ యుభయలోక విభూతిని వివరించు చున్నది దివ్యమంగళ విగ్రహశోభను విస్తరింపఁ జేయుచున్నది. నీ యపారకృపా రసమును వెల్లడించు చున్నది. ఆనందమును వర్షించుచున్నది. ఆర్ద్రిత్వమును విస్తరింపఁజేయు చున్నది.

ఉ॥ తావకదృష్టిపాత మిది
దంతిగిరీంద్ర విభూషణా ! దయా
భూ ! వరదేశ ! నీ యుభయ
లోకవిభూతిని జాటుఁ, గాంతి నెం
తే వెలిఁబుచ్చు, నీ నిరవ
ధిన్ గృపఁదెల్పు నొసంగు హర్షమున్

భావము నార్ద్రిమున్ సలుపు,
భద్రములిచ్చు, నడంచు ఛిద్రముల్. 36

శ్లో॥ అరుణాధర పల్లవే లసంతీ
వరదాసౌ ద్విజచంద్రచంద్రికా తే।
అధివిద్రుమమస్త నిస్తలాలీ
రుచ మావిష్కురుతే హి పుష్కరాక్ష ! 37

ప్రతి :— పుష్కరాక్ష !=పద్మములవంటి కన్నులుగల, హే వరద !=ఓ వరదరాజస్వామీ !, అరుణ, అధర, పల్లవే= చిగురుటాకువంటి యెఱ్ఱని పెదవియందు, లసంతీ = ప్రకాశించుచున్న, అసౌ=ఈ, తే=నీయొక్క, ద్విజ, చంద్ర, చంద్రికా=దంతము లనెడు చంద్రులయొక్క వెన్నెల, అధి విద్రుమమ్=పొగడపుఁ దీవెయందు, అస్త, నిస్తల, ఆలీ, రుచమ్=ఉంచఁబడిన ముత్యముల బంతియొక్క శోభను, ఆవిష్కురుతే=ప్రకాశింపఁజేయు చున్నది. హి=నిజము.

విశేషములు :— ద్విజచంద్రచంద్రికా— ద్విః జాయంతే ఇతి ద్విజాః అను వ్యుత్పత్తిచేత రెండుమార్లు పుట్టునవి దంతములు. అవి యనుచంద్రులు— అనఁగా దంతములు చంద్రుల వలె శుభ్రములుగా నున్నవని భావము. వాని వెన్నెల ముప్పదియిద్దఱుచంద్రు లొక్కమా ఱుదయించిన నెంత వెన్నెల ప్రకాశించునో స్వామివారి దంతకాంతి యెఱ్ఱని యధరముపై నట్లు ప్రకాశించు చున్నదని భావము.

నిస్తలశబ్దము మౌక్తికవాచకము 'నిస్తలం వర్తులే ముక్తాఫలే చ చపలే పిచ' అని నిఘంటువు. భగవంతునకు సముద్ర సామ్యము, అధరమునకు విద్రుమలతాసామ్యము, తదుపరి ప్రకాశించుదంత పంక్తిశోభకు మౌక్తికాళీశోభాసామ్యము నిందుఁ దెలియు నగును.

తా॥ పద్మములఁబోలు కన్నులు గల యోవరదరాజ స్వామీ! చిగురుటాకువలె నెఱ్ఱని యధరమునందుఁ బ్రకాశించు వెన్నెలవంటి యీ నీ దంతకాంతి పొగడవుఁ దీవెయందుంచఁబడిన మౌక్తిక పంక్తిశోభను బ్రకాశింపఁ జేయుచున్నది నిజము.

మ॥ చిగురాకుం బురడించు వాతెఱపయిన్
జెన్నారి, జ్యోత్స్నంబలెన్
సొగసౌ తావక దంతపంక్తిరుచి యో
సుత్రామముఖ్యార్చితా!
పగడంపున్ నునుఁదీవె ముత్తెముల నిం
పన్ గల్గు నేకాంతి యౌ
జిగిఁ బ్రత్యక్షు మొనర్చు శక్తుఁడనె నీ
చె న్నెన్నఁ బద్మేక్షణా! 37

శ్లో॥ స్మితనిర్ఝరికా వినిస్సృతంతీ
తవ వక్షఃస్థలభూతలే విశీర్ణా ।
వరద! ప్రబిభర్తి హారలక్ష్మీ
మపి ముక్తావళికా నదీవ తజ్జా ॥ 38

ప్రతి :— హేవరద ! = ఓ వరదరాజస్వామీ ! వినిష్ప తంతీ=(పైనుండి క్రిందికి) పడుచున్న, తవ=నీయొక్క, స్మిత, నిర్ఝరికా=చిఱునవ్వనెడు ప్రవాహము, వక్షఃస్థల, భూతలే= అనెడు భూమియందు, విశీర్ణా = చీలికలైనదై, హార లక్ష్మీమ్ = నూఱుపేటలు వేయిపేటలు గల ముత్యాల పేరుయొక్క శోభను, ప్రబిభర్తి=మిక్కిలి ధరించుచున్నది, ముక్తావలికా, అపి = ఏకావళి కూడ (ఒంటిపేట ముత్యాల పేరు) తత్ + జా=తజ్జా=ఆప్రవాహమువలనఁ బుట్టిన, నదీ, ఇవ=నదివలె (అస్తి=ఉన్నది).

విశేషములు :—వినిష్పతంతీ— వక్షఃస్థలముకంటె ముఖము పైభాగ మగుటచేఁ జిర్నగవు అను ప్రవాహము వక్షమను భూమిపైఁబడు చున్నదని వర్ణింపఁబడినది. ప్రబిభర్తి హారలక్ష్మీ మపి— వక్షఃస్థలమునఁబడిన స్మితనిర్ఝరిక శతసహస్రములుగాఁ జీలి శతయష్టి, సహస్రయష్టి, హారశోభను గలిగించుచున్నదని భావము. హారములలో ననేక భేదములు గలవు. 'హారో ముక్తావళీ దేవచ్ఛందోఽసౌ శతయష్టికా। హారభేదా యష్టి భేదాత్ గుచ్ఛగుచ్ఛార్ధగోస్తనాః' శ్రీ వరదరాజుల చిఱునగవు క్రిందఁ బడుచుఁ గూడ నందమును జిందించుట గమనింపఁ దగినది. విశీర్ణా - అనుచోట 'ప్రకీర్ణా' అనుపాఠాంతరము గలదు. అర్థము సమానము.

తా॥ ఓవరదరాజస్వామీ ! నీచిఱునగవనెడు ప్రవాహము వక్షఃస్థలమనెడు భూమిపైఁబడి పలుచీలికలై శతయష్టి సహస్ర

యష్ట్యాదిహారములశోభ నెంతేని వహించు చున్నది. ఏకావళి యనుఒంటిపేటముత్యాలదండ గూడ నాచిర్న్నగ వను ప్రవాహామునుండి పుట్టినయొక నదియే.

చ॥ చిఱునగ వన్ననిర్ఝరిక
 శ్రీకరిగిర్యధినాథ ! నీముఖాం
బురుహామునుండి వక్ష మను
 భూమిపయిం బడి విప్రకీర్ణమై
తరళరుచుల్ దలిర్ప వర
 దా! శతయష్టి సహస్రయష్టిహా
రరుచి వహించుఁ దద్భవత
 రంగిణి యొంటిసరంబు హారముల్. 39

శ్లో॥ పరిమండితరాసమండలాభి
ర్వరదాఘ్రాత మభీష్టగోపికాభిః ।
అనువర్తితదాతన ప్రహర్షా
దివ ఫుల్లం హి కపోలయో ర్యుగమ్ ॥ 39

ప్రతి :— హే వరద !=ఓ వరదరాజస్వామీ ! పరిమండిత, రాస, మండలాభిః=అలంకరింపఁబడిన రాసగోష్ఠిగల, అభీష్ట, గోపికాభిః = మిక్కిలి యిష్టురాండ్రగు గోపకాంతలచేత, ఆఘ్రాతమ్=మూర్కొనఁబడిన, తే=నీయొక్క, కపోలయోః =గండస్థలములయొక్క (చెక్కిళ్ళయొక్క) యుగమ్=జంట, అనువర్తి, తదాతన, ప్రహర్షాత్, ఇవ=అనువర్తించుచున్న యప్పటి యానందాతిశయము వలననో యన్నట్లు, ఫుల్లమ్ = వికసించి యున్నది, హి = సత్యము.

విశేషములు :— అనువర్తితదాతన ప్రహర్షాదివ– రాస మనునది యొకక్రీడ పరస్పరసంశ్లిష్టబాహువులు కలవారై అనేకవిగ్రహములఁ దాల్చి కృష్ణుఁడు గోపాంగనలును మండలాకారముగాఁ దిరుగుచుఁ జేయు నీ నృత్యవిశేషమునందు నిరుప్రక్కల నుండు ప్రియగోపికలచేతఁ బ్రీత్యతిశయముచే మూర్కొనఁబడిన కృష్ణుని కపోలయుగమునఁ గలిగిన వికాసము శ్రీ వరదరాజులనాఁటికిఁ గూడ ననువర్తించినదా ? యన్నట్లు స్వామివారి చెక్కిళ్ళు వికసితములై యున్నవని భావము. 'హి' అనుటచే నిది యథార్థకథనము. ఉత్ప్రేక్ష గాదు. ఇందలి ఇవశబ్దము వాక్యాలంకారమునఁ బ్రయోగింపఁ బడినది యని యీ యర్థమునఁ దెలియవలెను.

తా॥ ఓ వరదరాజస్వామీ ! రాసగోష్ఠి నలంకరించిన ప్రియ గోపికలచే మూర్కొనఁబడిన (ముద్దాడఁబడిన) నీకపోలద్వయ మానాఁటి యానందాతిశయము నేఁడుగూడ ననువర్తించెనో! యన్నట్లు వికసితమై యున్నది.

చ॥ ప్రియ లగు గోపికాంగనలు
ప్రీతివశంబున రాసలీలలో
దయితుఁడ వైన నిన్ను నిరు
దండల మూర్కొనఁ బుల్కరించిన
ట్లయినత్వదీయ గండయుగ
మాసుఖ మిష్టనువృత్తి మయ్యెనో
కా ! యనఁ బ్రఫుల్లమై ముదముఁ
గూరుచు భక్తులకుం గరిప్రభూ ! 39

శ్లో॥ ముఖ మున్నస మాయతాక్ష ముద్యత్
స్మితదంతం రుచిరాధరం నతభ్రు ।
లసదంసవిలంబి కర్ణపాశం
మయి తే నిశ్చల మస్తు హస్తినాథ ॥ 40

ప్రతి :— హే హస్తినాథ != ఓ కరిగిరిప్రభూ !, ఉన్నసమ్ =ఎత్తైన ముక్కుగలదియు, ఆయత, అక్షమ్ = విశాలములగు కన్నులు గలదియు, ఉద్యత్, స్మిత, దంతమ్ = ఉదయించుచున్న చిఱునవ్వుగల దంతములు గలదియు, రుచిర + అధరమ్ = అందములగు పెదవులు గలదియు, నతభ్రు = సంకుచితములగు (వంకలుదిద్దిన) కనుబొమలు గలదియు, లసత్, అంస, విలంబి కర్ణపాశమ్ = ప్రకాశించుచున్న మూఁపులపై వ్రేలాడు ప్రశస్తములగు చెవులు గలదియునగు, తే = నీయొక్క, ముఖమ్ = ముఖము, మయి = నాయందు, నిశ్చలమ్ = చలించనిది, అస్తు = అగుఁగాక.

విశేషములు :— ఉన్నసమ్— 'ఉపసర్గాచ్చ' అను సూత్రముచేత నాసికాశబ్దమునకు నసాదేశము రాఁగా నేర్పడిన రూపము. మయి తే నిశ్చల మస్తు— నన్నుఁ జూచుటయందు దాసక్తమైనది. యగుఁగాక.

తా॥ ఓ కరిగిరినాథా! చక్కనిముక్కు, విశాలములగు కన్నులు, చిఱునగవులు వెల్లివిరియు దంతములు, ఎఱ్ఱని వాతెఱ, తీరైన కనుబొమలు, అందములగు నంసముల వ్రేలాడు శ్రేష్ఠములగు చెవులు గలిగి యంద ముట్టిపడు

దేవరవారిముఖము నన్నుఁ గనుఁగొన నిశ్చలమగుఁ గాక. (అనఁగా) నాకుఁ బ్రసన్నమగుఁ గాక.

ఉ॥ నాసిక యున్నతంబు, నయ
నమ్ములు చేరెఁడు, నవ్వువెన్నెలల్
భాసిలు దంతముల్, చిగురు
వాతెఱ, యందము లైన భ్రూలతల్
శ్రీసముదంచదంసతల
జృంభిసుకర్ణము లొప్పి దేవ! య
బ్జాసనవంద్యు మైనభవ
దాస్యము నాభవదాస్య మూడ్చుతన్. 40

వసన్తమాలికా వృత్తదశకము ముగిసినది.

శ్లో॥ పద్మాయాః ప్రణయరసాత్ సమాసజంత్యాః
స్వం బాహుం సుబహుమతో భుజేన తేన।
కాం నామాన్వభవ దహో! దశాం తదాత్వే
కంఠస్తే కరిగిరినాథ! కంబుకాంతః॥ 41

ప్రతి:— హే కరిగిరినాథ! = కరిగిరిప్రభువైన యో వరద రాజస్వామీ!, కంబుకాంతః = శంఖమువలె మనోహరమగు, తే = నీయొక్క, కంఠః = మెడ, ప్రణయరసాత్ = ప్రేమరసము వలన, తేన = ప్రసిద్ధమగు, భుజేన = (దేవరవారి) భుజముతో, స్వబాహుమ్ = తన బాహువును, సమాసజంత్యాః = చక్కఁగాఁ గలపఁబడినదిగాఁ జేయుచున్న, పద్మాయాః = లక్ష్మీదేవికి, సుబహుమతః = మిక్కిలి సత్కరింపఁబడిన దగుచు, తదాత్వే =

ఆ సమయమునందు, కామ్ = ఎటువంటి, దశామ్ = స్థితిని, అన్వభవత్, నామ = అనుభవించినదో, అహో! = ఆశ్చర్యము.

విశేషములు :— భుజేన తేన— సముద్రమథన సమర్థ మగు— లేదా— ఆశ్రితులకు విపక్షు లగువారిని శిక్షింప దక్ష మగు భుజముతో— అని తచ్ఛబ్దార్థము. కాం దశా మన్వభవ న్నామ— అనిర్వచనీ యభోగముగల యాదశ భగవంతుని కంఠమున కొక దానికే తెలియఁదగినది. యని రహస్యము. లక్ష్మీకృతమగు నీ యాలింగనము క్షీరాబ్ధిలోఁ బుట్టినప్పుడు జరిగిన దని గ్రాహ్యము. 'క్షీరోదాత్ శ్రీస్సముద్భూతా సర్వ భూషణభూషితా దివ్యమాల్యాంబరధరా మాధవం పరిషస్వజే' లేదా— 'తం దృష్ట్వా శత్రుహంతారం మహర్షీణాం సుఖావ హామ్ । బభూవ హృష్టా వైదేహీ భర్తారం పరిషస్వజే' అని రామాయణ వర్ణితమగు ఖరాదివధసమయానంతర కాలిక మైన సీతాకృతాలింగనము కాని కావచ్చును.

తా॥ ఓ కరిగిరినాథా! అత్యంత ప్రేమరసముచేఁ దన బాహువును సముద్రమథన క్షమంబును, ఆశ్రితవిపక్ష శిక్షణ దక్షంబు, నగు (నాథు) నీ భుజంబుతో లగ్న మొనర్చి లక్ష్మీదేవిచే మిక్కిలి సత్కృతంబయిన శంఖమనోహారంబగు నీ కంఠ మప్పు డెట్టి యనిర్వాచ్యసుఖదశ నందెనో! యది దానికే తెలియును.

ఉ॥ సంబర మొప్పగా నిజ భు
 జంబును నీ సుభుజంబుతోడ స
క్తం బొనరించి కౌఁగిలికిఁ
 దారిచి యిందిర గారవింప నీ
కంబు మనోహరంబు వర
 కంఠ మ ద త్తటి నెంత పారవ
శ్యంబును గాంచెనో! యెఱుఁగఁ
 జాలు న దే కరిగిర్యధీశ్వరా! 41

శ్లో॥ సాయామా ధృతపరిణద్ధయోఽబ్ధయో వా
 తాదృశ్యః స్ఫుట మథవా దిశ శ్చతస్రః।
 చత్వారో వరద! వరప్రదా స్త్వదీయా
 భాసంతే భుజపరిఘా స్తమాలనీలాః॥ 42

ప్రతి :— హే వరద!=ఓ వరదరాజస్వామీ!, తమాల నీలాః = చీఁకటి మ్రాఁకులవలె నల్లనివియు, వరప్రదాః = భక్తులకు వరములఁ బ్రసాదించునవియు, చత్వారః=నాలుగయిన, త్వదీయాః=నీ సంబంధములగు, భుజపరిఘాః=గడెమ్రాఁకులవంటి బాహువులు, సాయామాః = పొడవుతోఁగూడినవియు, ధృతి, పరిణద్ధయః=ధరింపఁబడిన వైశాల్యము (వెడల్పు) గలవియునగు, చత్వారః=నాల్గు, అబ్ధయః వా= సముద్రములవలె, భాసంతే = ప్రకాశించుచున్నవి, అథ = తరువాత, తాదృశ్యః=అట్టివేయగు, చతస్రః=నాల్గు, దిశః వా=దిక్కులవలె, భాసంతే =ప్రకాశించుచున్నవి, స్ఫుటమ్= స్పష్టము.

విశేషములు :— అబ్ధయోవా— ఇందలి 'వా' అను అవ్యయము ఇవార్థకము. ఇవ వ ద్వా యథా శబ్దాః— ఇవ,

వత్, వా, యథాశబ్దము లుపమావాచకములు సముద్రము నకు నైల్యము సుప్రసిద్ధము. దిక్కులు నభఃప్రదేశ విశేషములే గాన వానికిని నైల్య మవ్యాహతము. చతుస్సంఖ్యాత్వ నైల్య పీవరత్వములచేత సముద్రములకు దిక్కులకు భుజసామ్యము తెలియవలెను.

తా॥ ఓ వరదరాజస్వామీ! తమాలనీలములు వరప్రద ములు పరిఘాకారములగు నీ భుజములు నాలుగు దైర్ఘ్యము వైశాల్యము గల నాల్గు సముద్రములవలెను అట్టివే యగు నాలుగు దిక్కులవలెను ప్రకాశించుచున్నవి. స్పష్టము.

ఉ॥ నీలతలోఁ దమాలముల,
  నిద్దుర బల్గడె మ్రాఁకుమేల్సిరిన్,
బోలుచుఁ, బూరుషార్థములఁ
  బొల్పుగ నర్థుల కీయుఁ జాలు నీ
నాలుగు బాహువుల్ వరద!
  నాలుగువార్ధులో! నాల్గు దిక్కులో!
పోలిక లొప్పెడున్ వెడలు
  పున్ నిడుపున్ సమసంఖ్య మున్నుగా. 42

శ్లో॥ ఆశ్లేషే వరద! భుజా స్తవేందిరాయా
  గోపీనా మభిమతరాసబంధనే వా।
  బంధే వా ముద మధికాం యశోదయాఽఽహో!
  సంప్రాప్తా స్తవ నవనీతమోషదోషాత్ ॥ 43

ప్రతి :— హే వరద! = ఓ వరదరాజస్వామీ! తవ = నీయొక్క, భుజాః = భుజములు, ఇందిరాయాః = లక్ష్మీదేవి యొక్క, ఆశ్లేషే వా = ఆలింగనమందా? గోపీనామ్ = గోపాంగనలకు, అభిమత, రాస, బంధనే, వా = ఇష్టమగు

రాసక్రీడలయందలి కౌఁగిలింతయందా? ఆహో=అది కాని యెడల, యశోదయా=యశోదాదేవిచే నవనీత, మోష, దోషాత్=వెన్న దొంగతనమువలని దోషమువలన (కృతే= చేయఁబడిన) బంధే వా=(ఱోటికి) కట్టుపడుటయందా? అధికామ్=ఎక్కువ, ముదమ్=సంతోషమును, సంప్రాప్తాః= పొందినవి.

విశేషములు :— ఈ శ్లోకమున మూఁడు ప్రశ్నలు గలవు.

1. ఓ వరదరాజా! నీ బాహువులు లక్ష్మీదేవి కౌఁగిలించినప్పు డెక్కువ యానందమును బొందెనా? లేక
2. గోపాంగనలతోడి రాసక్రీడలో వారి భుజబంధనమున నెక్కువ యానందమందెనా? లేక
3. నవనీతచోరుఁడ వని యశోద ఱోటికి బంధించినప్పు డెక్కువ యానందమును జెందెనా? అని

ఇందు శ్లోకములో నిర్దేశించిన ప్రకారము ఉత్తరోత్తరము బలీయముగాఁ దోఁచుచున్నది. ఎట్లన? పరత్వదశను సూచించు నిందిరాలింగనము కంటె స్వేచ్ఛాసంగతలగు గోపాంగనల భుజబంధనమే యతిప్రీతికరము అంతకంటెను యశోదాకృత మగు నులూఖలబంధన మెంతేనియు నానంద ప్రదము. ప్రేమాంధయగు యశోద తన యంతరము కృష్ణు నంతరము తెలియక బంధించుట యతిసాహసము. ఐనను నిరంకుశ స్వతంత్రుఁడగు శ్రీకృష్ణుఁడు దాని కొదిగియుండుట శ్రీకృష్ణుని సౌశీల్యమును వేనోళ్లఁ జాటుచుఁ దల్లి కిట్లు విధేయుఁడుగా నుండవలె నను 'మాతృదేవోభవ' అను వాక్యమును ఆచరణపూర్వకముగాఁ జూపుచున్నది.

తా॥ ఓ వరదరాజస్వామీ! నీ భుజములు లక్ష్మీదేవి కౌఁగిలించుకొన్నప్పు డెక్కువ ముదమందెనా? లేక రాస క్రీడలో గోపాంగనలు బాహువులతో బంధించినపు డెక్కువ ముదమందెనా? లేక వెన్న దొంగిలించితి వని తల్లి యశోద ఱోటికి బంధించినప్పు డెక్కువ ముదమందెనా?

ఉ॥ ఇందిర కౌఁగిలింత బిగి
యించినయప్పుడో? గోపసుందరీ
బృందము రాసగోష్ఠి నిను
బిట్టుగఁ బట్టినయప్డొ? ఱోటికిన్
నందునిపత్ని దొంగ వని
నాఁ డటు బద్ధునొనర్చినప్పుడా?
అందె భవద్భుజంబులు ప్ర
హర్షము శ్రీ కరిశైలభూషణా! 43

శ్లో॥ సాలీయా ఇవ విటపా స్సపల్లవాగ్రాః
కల్లోలా ఇవ జలధే స్సవిద్రుమాగ్రాః।
భోగీంద్రా ఇవ చ ఫణామణీద్ధవక్త్రాః
భాసంతే వరద! భుజా స్త వారుణాగ్రాః॥ 44

ప్రతి :— హే వరద! = ఓ వరదరాజస్వామీ!, అరుణ = అగ్రాః = ఎఱ్ఱని యగ్రభాగములు (కొనలు) గల, తవ = నీ యొక్క, భుజాః = బాహువులు, సపల్లవాగ్రాః = చిగురు టాకులతోఁ గూడిన యగ్రభాగములు గల, సాలీయాః = సాలవృక్ష (మద్దిచెట్టు) సంబంధులగు, విటపాః ఇవ = కొమ్మల వలెను, సవిద్రుమాగ్రాః = పగడములతోఁ గూడిన చివర భాగములుగల, జలధేః = సముద్రముయొక్క, కల్లోలాః ఇవ = పెద్ద యలలవలెను, ఫణా, మణి, ఇద్ధ, వక్త్రాః = పడగల

యందలి మణులచేత, ప్రకాశించు ముఖములు గల, భోగి= ఇంద్రాః, ఇవ, చ=సర్పరాజులవలెను, భాసంతే=ప్రకాశించు చున్నవి.

విశేషములు:— అరుణాగ్రాః— అరుణవర్ణములగు కరతలములు అంగుళులు (వ్రేళ్లు) గల— ఇట్లుండుట మహాభాగ్య సూచకము. భోగీంద్రాః ఇవ— శేషవాసుకి ప్రభృతి సర్పరాజుల వలె. 1 పాదమున. ఉపమానము సాలవృక్షము— విటపములు— చిగుళ్లు. 2 పాదమున— జలధి— కల్లోలములు— పగడములు ఉపమేయములు— వరదరాజస్వామి— భుజములు— కరతలాంగుళులు. 3 పాదమున— స్వామికి ఉపమానము చూపఁబడలేదు. ఆయన నిరుపమానుఁడే గదా—

తా॥ ఓ వరదరాజస్వామీ! ఎఱ్ఱని చేతులు వ్రేళ్లును గల నీ భుజములు, చిగురుటాకులు కొనలఁగల సాలవృక్ష సంబంధులగు కొమ్మలవలెను, కొనలయందుఁ బగడములు గల సముద్రకల్లోలములవలెను, పడగలయందలి మణులచేతఁ బ్రకాశమానములగు ముఖములు గల శేషవాసుకి ప్రభృతి సర్పరాజులవలెను బ్రకాశించుచున్నవి.

మ॥ స్ఫురదగ్రస్థ కిసాలసాల విటపం
బుల్ వోలె, నగ్రస్థలిన్
గర మొప్పన్ బగడాలు గ్రాలుజలధిన్
గల్లోలముల్ భంగి, భా
సురమూర్ధస్థమణీ విరాజితఫణీ
శుల్ మాడ్కి భాసిల్లుఁ బో!
అరుణాగ్రంబులు నీదు దివ్యభుజముల్
హస్తిక్షమాభృత్ప్రభూ! 44

శ్లో॥ అంభోధేః స్వయ మభిమంథనం చకర్థ
క్షోణీధ్రం పున రభిభ శ్చ సప్తరాత్రమ్ ।
సప్తానాం వివలయసి స్మ కంఠ ముక్ష్ణా
మమ్లానా వరద ! తథాఽపి పాణయ స్తే ॥ 45

ప్రతి :— హే వరద! = ఓ వరదరాజస్వామీ ! స్వయమ్ = స్వయముగా, అంభోధేః = సముద్రముయొక్క, మంథనమ్ = చిలుకుటను చకర్థ = చేసితివి, పునః = మఱల, సప్తరాత్రమ్ = ఏడురాత్రులు, క్షోణీధ్రమ్ = కొండను (గోవర్ధనపర్వతమును) అభిభః చ = ఎత్తితివి కూడ, సప్తానామ్ = ఏడు, ఉక్ష్ణామ్ = ఎద్దులయొక్క, కంఠమ్ = మెడను, వివలయసి, స్మ = మెల వేసితివి, తథాఽపి = ఐనను (ఇన్నిపనులు చేసినను) తే = నీ యొక్క, పాణయః = చేతులు, అమ్లానాః = వాడవు (కందవు).

విశేషములు :— సప్తరాత్రమ్— సప్తానాం రాత్రీణాం సమాహారః— ఇది యేకవచనములో నుండును. కంఠమ్— ఇది జాత్యేకవచనము— కంఠములను అని యర్థము. 'సప్తానాం ఉక్ష్ణాం కంఠం వివలయసి స్మ' నీలాసుందరీ వివాహకాలమున నామె తండ్రి యట్టి కన్యాశుల్కమును బెట్టినట్లు ప్రసిద్ధి. తథాఽపి— అట్లైనను— జలధిమథనము, గోవర్ధనోద్ధరణము, వృషభభంజనము చేసినను నీ కరము లలయలేదు. ఇవి నీకు లీలలు. ఇట్టి నీకు మమ్ముల రక్షించుట యెంతపని యని యాశయము.

తా॥ ఓ వరదరాజస్వామీ ! స్వయముగాఁ బాలసంద్రమును జిలికితివి. గోవర్ధనపర్వతము నేడురాత్రులు ధరించితివి. వృషభసప్తకముయొక్క కంఠమును మెలవేసి కూల్చితివి, ఐనను నీ చేతులు కందవు.

ఉ॥ త్రాడుగ వాసుకిన్ సలిపి
త్రచ్చితి వంబుధి, రాళ్ళవానలో
నేడుదినంబు లొంటికయి
నెత్తి ధరించితివద్రిఁ, గూల్చితౌ
వేడుక మీఱఁగా మెలియ
వేసి మెడన్ వృషసప్తకం బహహా!
వాడవు నీదు చేతులు ల
వం బిటు చేసియు హస్తిభూషణా! 45

శ్లో॥ రింఖాతో వ్రజసదనాంగణేషు కిం తే
గోయష్టిగ్రహణవశా న్ను గోపగోష్ఠ్యామ్।
ఆలంబా ద్ధయనయసూత్రతోత్త్రయో ర్వా
పాణీనాం వరద! త వారుణత్వ మాసీత్॥ 46

ప్రతి :— హే వరద! = ఓ వరదరాజస్వామీ! వ్రజ, సదన, అంగణేషు = గోకులములోని యిండ్ల ముంగిళ్ళయందు, తే = నీకు, రింఖాతః, కిమ్ = దోఁగాడుటవలననా? గోప గోష్ఠ్యామ్ = గొల్లల కూటములో (గుంపులో) గోయష్టిగ్రహణ వశాత్, ను = గోరక్షణసాధన మగు దండమును గ్రహించుట వలననా?, హయ, నయ, సూత్ర, తోత్త్రయోః = (పార్థసారథివిగా నున్నప్పుడు) గుఱ్ఱములఁ దోలుటకుఁ గళ్ళెపుఁ ద్రాళ్ళను, ముల్లుకఱ్ఱను, ఆలంబాత్ వా = పట్టుకొనుట వలననా? తవ = నీయొక్క, పాణీనామ్ = చేతులకు, అరుణత్వమ్ = ఎఱ్ఱఁదనము, ఆసీత్ = ఆయెను?

విశేషములు :— రింఖాతః— పంచమ్యర్థమున 'తసిల్' ప్రత్యయము వచ్చినది. 'బాలానాం హస్తపాదగమనం రింఖా' పిల్లలు చేతులతోఁ గాళ్ళతోఁ బాకి వెళ్ళుట అనఁగా దోఁగాడుట

వలన నని భావము. 'ఆలంబా ద్ధయనయసూత్రతో త్రయో ర్వా' అర్జునునకు సారథ్య మొనర్చుకాలమునఁ దొందరగా వెళ్లుచున్న గుఱ్ఱముల లాగి నిలుపుటకు వాని మెడకుఁ గట్టిన త్రాళ్ళు సూత్రశబ్దమున కర్థము (కళ్లెము) త్వరగా వెళ్లుటకు గుఱ్ఱములఁ దోలు సాధనము వేత్రము (ముల్లుకఱ్ఱ) 'పాణీనాం వరద! తవారుణత్వ మాసీత్ ?' సుకుమారములగు భగవత్కరములందు సహజముగా నున్న యరుణిమకు హేతువులు గాని రింఖాదులను (దోఁగాడుట మున్నగువానిని) హేతువుల నుగా నూహించుటచే నిట హేతూత్ప్రేక్షాలంకారము. 'అహేతో హేతుభావే నోత్ప్రేక్షా హేతూత్ప్రేక్షా'— అని లక్షణము.

తా॥ ఓ వరదరాజస్వామీ! నీ చేతులయం దరుణిమ గోకులమునఁ బ్రతిగృహము ముంగిట దోఁగాడుటవలనఁ గలిగినదా? గోపగోష్ఠిలో నాలఁగాచుటకై గ్రహింపఁబడిన దండమును బట్టుకొనుటవలనఁ గలిగినదా? పార్థసారథివిగా నున్నతఱి గుఱ్ఱములఁ దోలు నిమిత్తము కొరడాను కళ్లెములను ధరించుటవలనఁ గలిగెనా?

ఉ॥ నాఁడు వ్రజంబులోని సద
నంబుల ముంగిళులందు నెల్ల దోఁ
గాడుటచేతనా? పశుచ
యంబును గావఁగ దండ మెప్పుడున్
పీడనిదాననా? రణ భు
విన్ గొరడా హయరశ్మ లూనుటన్
గూడిన యార్తినా? వరద!
కూడెను రక్తిమ నీదు చేతులన్. 46

శ్లో॥ సర్వజ్ఞా స్సముచితశ క్తయ స్స దైవ
త్వత్సేవాని యమజుష స్త్వదేకభోగాః ।
హేతీనా మధిపతయ స్సదా కి మేతాన్
శోభార్థం వరద ! బిభర్షి హర్షతో వా ॥ 47

ప్రతి :— హే వరద! = ఓ వరదరాజస్వామీ! హేతీనామ్ = ఆయుధములకు, అధిపతయః = అధీశ్వరులైన సుదర్శనాదులు, సర్వజ్ఞాః = సర్వవిదులును, సముచిత, శక్తయః = తగినశక్తి కలవారును, త్వ దేక భోగాః = నీ వొకఁడవే భోగ్యపదార్థముగాఁ గలవారును, (కనుకనే) సదా, ఏవ = ఎల్లప్పుడు, త్వత్, సేవా, నియమ, జుషః = నియమముతో నీ సేవను పొందినవారు నగు, ఏతాన్ = వీరిని, (సుదర్శన, పాంచజన్య. శార్ఙ్గకౌమోదకీ నందకములను, సదా = ఎల్లప్పుడు, శోభార్థమ్ = అలంకారముకొఱకు, బిభర్షి కిమ్ = ధరించుచున్నావా ? హర్షతః = సంతోషమువలన, బిభర్షి వా = ధరించుచున్నావా ?

విశేషములు :— సర్వజ్ఞాః— భగవంతుని భావము నెఱింగిన వారని యర్థము. సముచితశక్తయః— చేతితోఁ బట్టుకొని ప్రయోగింపకున్నను శత్రువిజయసమర్థు లని తాత్పర్యము. త్వదేకభోగాః— ఎడఁబాటు నోర్వనివారని భావము. శోభార్థం వరద! బిభర్షి హర్షతో వా— ఇవి యాయుధములైనను సర్వశక్తిసంపన్నుఁడగు భగవానున కివి యాయుధములుగా ధరించుట వృథయే గావున భూషణముల నుగా ధరించుచున్నావా ? లేదా— సర్వజ్ఞత్వాది వైశిష్ట్యజనిత హర్షాతిశయముచేత ధరించుచున్నావా ? అని ప్రశ్నించుట సముచితముగా నున్నది.

తా॥ ఓ వరదరాజస్వామీ! సర్వజ్ఞులు సముచిత శక్తి యుక్తులు నీ యెడఁబాటు నోర్వనివారు నియమముగా నీ సేవను జేయువారు నగు ఆయుధాధిపతులగు సుదర్శనాదులను శోభకై సదా ధరించుచున్నావా? వారి సర్వజ్ఞత్వాది గుణ జనిత హర్షమువలన ధరించుచున్నావా?

చ॥ సముచితశక్తి భాసురులు
సర్వవిదుల్ భవదేకభోగు లు
త్తములు త్వదేక సేవన స
దా నియమాఢ్యులు హేత్యధీశు లీ
యమలినులన్ ధరింతు వహ
హా! నిజదేహమునందు శోభకా?
ప్రమదముచేతనా? తెలుపు
పద్మనిభేక్షణ! హాస్తిభూషణా! 47

శ్లో॥ కిం ధాతు ర్గగనవిధానమాత్ర్యకాఽభూత్
వక్షస్తే వరదవరేణ్య! యత్ర నామ।
పద్మాయా ముఖ మథ కౌస్తుభ శ్చ జాతౌ
చంద్రార్కా వుడునికరాయతే తు హారః॥ 48

ప్రతి :— హే వరదవరేణ్య! = ఓ వరదరాజా! యత్ర, నామ=ఎచ్చట, పద్మాయాః=లక్ష్మీదేవియొక్క, ముఖమ్= ముఖము, అథ=అట్లపై, కౌస్తుభః, చ=కౌస్తుభమణియు, చంద్రార్కౌ=చంద్రుఁడు, సుర్యుఁడుగా, జాతౌ=ఆయిరో, హారః, తు=ముత్యాలపేరు, ఉడునికరాయతే=నక్షత్రముల గుంపువలె నగుచున్నదో, (తత్ = ఆ) తే = నీయొక్క,

వక్షః=వక్షఃస్థలము, ధాతుః=బ్రహ్మదేవునకు, గగన, విధాన' మాతృకా = ఆకాశమును నిర్మించుటయందుఁ బ్రతికృతి, అభూత్, కిమ్=ఆయెనాయేమి ?

విశేషములు :–కిం ధాతుః గగనవిధాన మాతృకాఽభూత్ వక్షస్తే– వరదరాజస్వామీ! బ్రహ్మ మీవక్షఃస్థలమును మాతృకగాఁ బెట్టుకొని యాకాశమును నిర్మించెను. కనుకనే రెండిటికిఁ బోలికలు గలవు.

| వక్షఃస్థలమున | ఆకాశమున |
|---|---|
| ఇందిరాముఖము–కౌస్తుభము | చంద్రుఁడు–సూర్యుఁడు |
| ముత్యాలపేర్లు | నక్షత్రసమూహము |
| నైల్యము | నైల్యము |
| నిత్యత | నిత్యత |

తా॥ ఓ వరదరాజప్రభూ! ఎందు లక్ష్మీదేవిముఖము చంద్రుఁడుగాను, కౌస్తుభమణి సూర్యుఁడుగాను, ముత్యాల సరము నక్షత్రజాలముగా నున్నవో యట్టి నీవక్షఃస్థలమును మాతృకగాఁ గొని బ్రహ్మదేవుఁడు గగనమును నిర్మించెనా యేమి ?

ఉ॥ ఇందిరయంద మావదన

మిందువు కౌస్తుభ మద్ది తమ్మిపూ

విందగు ముత్తెపున్సరు లి

వే యుడుజాలము, లెందు నట్టి నీ

సుందర మైనవక్షః మది
శోభనరూప ! కరీశ ! యాంశతా
నందునకుఁ సృజింప గగ
నంబును మాతృక యయ్యెనా ? ప్రభూ! 48

శ్లో॥ అండానాం త్వదుదర మామనంతి సంతః
స్థానం త ద్వరద ! కథం ను కార్శ్య మస్య ।
మాహాత్మ్యం స్వత ఇహ యేషు నూన మేషా
వృద్ధిః స్యా న్మహిమకరీ న హీతరేషామ్ ॥ 49

ప్రతి :— వరద! = ఓ వరదరాజస్వామీ!, సంతః = సజ్జనులు బ్రహ్మాదులు, త్వత్, ఉదరమ్ = నీయుదరమును (బొజ్జను) అండానామ్ = బ్రహ్మాండములకు, (ప్రళయకాలమున) స్థానమ్ = ఉనికిసిగా, ఆమనంతి = తలంచుచున్నారు, తత్ = కనుక, అస్య = ఈనీయుదరమునకు, కార్శ్యమ్ = కృశత్వము, కథంను = ఎట్లు పొసఁగును ? ఇహ = ఈలోకమున, యేషు = ఏవస్తువుల యందు, స్వతః = స్వతస్సిద్ధమగు, మాహాత్మ్యమ్ = గొప్పతనము, అస్తి = ఉన్నదో, ఏషామ్ = ఈ వస్తువులకు సంబంధించిన, బుద్ధిః = అభివృద్ధి, మహిమకరీ = మహిమను గలిగించునది, స్యాత్ = అగును, ఇతరేషామ్ = అన్యులయొక్క (స్వతస్సిద్ధ మాహాత్మ్యములేని వారియొక్క) బుద్ధిః — అభివృద్ధి, మహిమ కరీ = మహిమను గలిగించునది, న, స్యాత్ = కాదు, నూనమ్ = నిజము.

విశేషములు :— అండానాం త్వదుదర మామనంతి సంతః స్థానమ్— ప్రళయవిశేషమున బ్రహ్మాండము లన్నియు నీకు

క్షీయం దుండు నని పరాశరాదిబ్రహ్మవేత్తలు తలంచుచున్నా రని భావము. మహాత్మ్యం స్వతః— స్వత స్సిద్ధమాహాత్మ్య మనఁగా – గుణకృతమహత్త్వము.

తా॥ ఓ వరదరాజస్వామీ! బ్రహ్మవేత్తలగు పరాశరాది మునులు ప్రళయవిశేషమున సమస్త బ్రహ్మాండములు నీయుదరమున నుండునని తలంచుచున్నారు. అందువలన నీ యుదరమున కింత కార్శ్య మెట్లు పొసఁగును? అవును. ఈలోకమున మహాత్మ్యము స్వతస్సిద్ధమై యెవరి కుండునో! వారికి సంబంధించిన యభివృద్ధి మహిమ గలదియై యుండును ఇతరుల కట్లుండదు. సత్యము.

గీ॥ ఉండుఁ బ్రళయంబునన్ దావకోదరమున
నండము లటంద్రు ఋషులు, కార్శ్యం బి దెట్లు?
వరలును స్వతోమహత్త్వ మెవ్వారికి వీరి
బుద్ధి మహిమాన్వితంబ కా దితరుల కటు. 49

శ్లో॥ సౌందర్యామృత రసవాహవేగజ స్స్యాత్
ఆవర్తః కిల తవ పద్మనాభ! నాభిః।
తత్పద్మం వరద! విభాతి కాంతిమయ్యా
లక్ష్మ్యాస్తే సకలవపుర్జుషో ను సద్మ॥ 50

ప్రతి:— హే పద్మనాభ! = పద్మము నాభియందుఁ గల, వరద! = ఓ వరదరాజస్వామీ! తవ = నీయొక్క, నాభిః = బొడ్డు, సౌందర్య, అమృత, రస, వాహ, వేగ, జః = సౌందర్య మనెడు అమృతరస ప్రవాహమువలనఁ బుట్టిన, ఆవర్తః = సుడి,

స్యాత్, కిల=అగునా ? తత్పద్మమ్=అందున్న తామరపూవు, తే=నీయొక్క, సకల, వపుః, జుషః=సమస్త శరీరమును జెందియున్న, కాంతిమయ్యాః=కాంతిస్వరూపయగు,లక్ష్మ్యాః= శ్రీకి, సద్మను=గృహమువలె, విభాతి—ప్రకాశించుచున్నది.

విశేషములు :— ఆవర్తః 'స్యా దావర్తోం భసాం భ్రమః' నీటిసుడి, ఇది లోతుగా గుండ్రముగా నుండును గాన నాభి కుపమానముగాఁ గవులు వాడుదురు. సౌందర్యామృతరస— సౌందర్యము మిక్కిలి చర్వణీయముగా నుండుటవలన అమృత రసముగాఁ జెప్పఁబడినది. 'ను' అను అవ్యయము ఉపమా వాచకము.

తా॥ పద్మనాభా ! శ్రీ వరదరాజస్వామీ ! నీ నాభి సౌందర్య మనెడు అమృతరసముయొక్క ప్రవాహవేగము వలన నేర్పడిన నీటిసుడి యగునా? ఏలయన— అందలి పద్మము నీ శరీరమంతయు వ్యాపించియున్న కాంతి యను లక్ష్మికి మందిరమువలెఁ బ్రకాశించుచున్నది.

శా॥ బృందారార్చిత ! పద్మనాభ ! సుగుణా
బ్ధీ ! నీదుమేల్ నాభి త్వ
త్సౌందర్యామృతసార పూరజవజా
తం బైన యావర్తమా,
అందుం గ్రాలెడు తమ్మిపూవు భవదీ
యాంగ ప్రభాలక్ష్మికిన్
కందోయిన్ వలపించుమందిరము నాఁ
గాఁ గాంతిఁ జెన్నారెడున్. 50

శ్లో॥ యా దామోదర ఇతి నామదా తవాసీత్
సా దామా కిల కిణకారిణీ బభూవ ।
త న్నూనం వరద! వళిత్రయచ్ఛలేన
త్వన్మధ్య ప్రథమవిభూషణీ బభూవ ॥ 51

ప్రతి :— హే వరద != ఓ వరదరాజస్వామీ! యా = ఏ, దామా = రజ్జువు, తవ = నీకు, దామోదరః ఇతి = దామోదరుఁడను, నామదా = పేరి నిచ్చినది, ఆసీత్ = అయెనో, సా = ఆ, దామా = రజ్జువు (త్రాడు) కిణకారిణీ = కాయలను కలిగించినది, బభూవ. కిల = అయెనఁట. తత్ = అ కిరణము (కాయలు) వళిత్రయచ్ఛలేన = మూఁడు ముడుతలనెడు నెపముచేత, త్వత్, మధ్య, ప్రథమ, విభూషణీ బభూవ = నీ మధ్యప్రదేశమునకు మొదటి సొమ్ముగా నాయెను, నూనమ్ = నిజము.

విశేషములు :— దామోదర ఇతి నామదా— దామా, ఉదరే, యస్య సః— అను విగ్రహవాక్యముచేతఁ ద్రాడు పొట్టయందుఁ గలవాఁడని యర్థము— అల్లరి చేయఁగాఁ దల్లి యశోద త్రాటితోఁ గృష్ణుని ఱోటికిఁ గట్టుట ప్రసిద్ధమే గదా! ఈ శ్లోకమున నీ యర్థమే సమంజసము. మఱియు దామాని, (లోకాః) ఉదరే యస్యసః— అనియుఁ జెప్పఁబొన వచ్చును. కుక్షిస్థాఖిల భువనుఁడని యర్థము. దామశబ్దము లోకార్థక మనుటకుఁ బ్రమాణము. 'దామాని లోకనామాని భాంతి యస్యోదరాంతరే తేన దామోదరో దేవః' ఉత్తరార్థముయొక్క సారాంశమిది. 'దామ్నా చైవోదరే బద్ధ్వా ప్రత్యబధ్నా దులూఖలే' అన్నట్లు త్రాటితో మూఁడు చుట్లు వచ్చునట్లు పొట్టకుఁగట్టి ఱోటికి బంధించినప్పుడు సుకుమార

మగు కృష్ణు నుదరమునఁ ద్రాటి రెుత్తిడివలన మూఁడు కాయలు బయలువెడలి యవి చూచువారికిఁ గృష్ణుని యుదరము మీఁద మూఁడు ముడుతలవలె వొలిసారి యాభరణమువలె నందముఁ గూర్చినది. అంతే కాదు తమ సౌలభ్యసౌశీల్యాది గుణాభరణములను గూడఁ బ్రకటింపఁజేసి నవి. శుష్కములగు కాయలే యెంత యందమును గూర్చినవి! అను నాశ్చర్యమునకు 'కి మివ హి మధురాణాం మండనం నాకృతీనామ్' అను కాళిదాససూక్తియే దీనికి సమాధానము. ఊసతోఁ బ్రహర్షిణీ వృత్తదశకము ముగిసినది.

తా॥ ఓ వరదరాజస్వామీ! ఏదామము (త్రాడు) నీకు దామోదరుఁ డన్న పేరు తెచ్చిపెట్టెనో! ఆదామము మూఁడు పేటలతో బిగించి కట్టుటచే మూఁడుకాయలను మాత్రమే కలిగించెను. ఆకాయలు త్రివళిగాఁ దోఁచి నీమధ్యభాగమున కొక ప్రథమాభరణముగా శోభగలిగించెను.

ఉ॥ ఏది గుణాంబుధీ! కరిమ
హీధరభూషణ! నిన్నుఁ జేసె దా
మోదరనాము దామ మది
మూఁ డగుపేటలఁ జుట్టుటన్ గిణా
పాదియె యయ్యొ గుర్తు లవి
భాసిలెడున్ ద్రివళిచ్ఛలంబుతో
నీదు సుమధ్యభాగమున
నీ టగునాదిమ భూషణంబు గన్.

శ్లో॥ యాదృగ్బీజాధ్యుషితభువి య ద్వస్తు హ స్తీశ ! జాతం
త త్తాదృక్షం ఫలతి హి ఫలం త్వ య్యపీక్షామహే తత్ ।
యస్మా దండాధ్యుషిత ఉదరే తావకే జాయమానం
పద్మం పద్మానన ! కిల ఫల త్యండమండా నఖండాన్ ॥ 52

ప్రతి :— పద్మానన = పద్మమువంటి ముఖముగల, హే హ స్తీశ !=ఓ కరిగిరిప్రభువగు వరదరాజస్వామీ !, యాదృక్, బీజ, అధ్యుషిత, భువి=ఏజాతిగింజలచేత నాటఁబడిన నేల యందు, యత్, వస్తు=ఏ వస్తువు, (ఏసస్యాదికము) జాతమ్= పుట్టినదో, తత్ =ఆ వస్తువు, తాదృక్షమ్=అటువంటి, (దాని కనుగుణమగు) ఫలమ్=ఫలమును, ఫలతి=ఉద్భవింపఁజేయు చున్నది, హి=సత్యము, ఇతి యత్ =అనుట యేదిగలదో, తత్ =దానిని, త్వయి, అపి=నీయందుఁగూడ, ఈక్షామహే= చూచుచున్నాము, యస్మాత్ =ఎందువలన ననఁగా, అండ, అధ్యుషితే = అండములచే నధిష్ఠింపఁబడిన, తావకే= దేవర వారి సంబంధియగు, ఉదరే=బొజ్జయందు, జాయమానం= పుట్టుచున్న, పద్మమ్=తామరపూవు, అఖండాన్ =పూర్ణము లగు, అండమండాన్ = బ్రహ్మాండసమూహములను, ఫలతి, కిల=ఉద్భవింపఁజేయు చున్నది గదా !

విశేషములు :— తత్ తాదృక్షం ఫలతి హి ఫలమ్— మనము ఏ నేలలో నే వి త్తనముల నాటుదుమో ! యా

నేలలో ఆ విత్తనముల కనుగుణమగు సస్యమే ఆవిర్భవించును. 'హి' ఇది లోకప్రసిద్ధము. యవలను చల్లినచో యవధాన్యమే మొలచును గాని వరిధాన్యము మొలవదు గదా! 'యవాః కిలోప్తా న భవంతి శాలయః' లోకప్రసిద్ధమగు నీ న్యాయము లోకాతీతుఁడవగు నీయందును గనఁబడుచున్నది. ఇందులకు ఉత్తరార్థ ముదాహరణము.

తా॥ తామరలఁబోలు కన్నులు గల యో వరదరాజ స్వామీ! ఏ నేలయం దెటువంటి విత్తనములు నాటుదురో! యా నేలయం దటువంటి పంటయే పండును. యవలఁ జల్లిన వరి పండదు. అను లోకసిద్ధమగు న్యాయమును నీ యందు సైతము చూచుచున్నాము. ఎట్లన– బ్రహ్మాండముల కునికియైన నీ యుదరమునఁ బొడమిన నాభీపద్మ మఖండ బ్రహ్మాండ షండముల నుద్భవింపఁ జేయుచున్నది గదా!

శా॥ ఏ నేలన్ మఱి నాటఁగాఁ బడునో! యా
దృగ్జాతిబీజాళి తా
నా నేలన్ ఫలమట్టిదా నిదియు నీ
యందుం గనంగా నగున్
శ్రీనాథా! బహుళాండభాసి తమ కు
క్షిన్ నాభిసంభూతమా
ఆనాళీక మఖండలీలఁ గనుఁ గా
దా! యండషండంబులన్. 52

శ్లో॥ అజ్ఞే యజ్ఞేశ్వర ! కిల జనే క్వా ప్యదర్శం విమర్శం
విశ్వాధీశః కతమ ఇతి త న్నిర్ణయం వర్ణయామః ।
వ్యావక్రోశీ నృషు సముదితా యా నుపాశ్రిత్య తేఽపి
బ్రహ్మాద్యా స్తే వరద ! జనితా స్తుందకందారవిందే ॥ 53

ప్రతి :— హే యజ్ఞేశ్వర ! = సర్వకర్మారాధ్యుఁడవగు, వరద !=ఓ వరదరాజస్వామీ !, అజ్ఞే= తెలివిలేని, క్వాపి= ఒకానొక, జనే=జనునియందు (తనయందు) విశ్వాధీశః= సర్వేశ్వరుఁడు, కతమః=ఎవఁడు ?, ఇతి = అను, విమర్శమ్= చర్చను, అదర్శమ్=చూచితిని, తత్ , నిర్ణయమ్= విమర్శింపఁ బడిన యా తత్త్వముయొక్క నిశ్చయమును, వర్ణయామః= వర్ణించుచున్నాము, (ఉదాహరించు చున్నాము) యాన్ = ఏ బ్రహ్మాదులను, ఉపాశ్రిత్య= ఆధారము చేసికొని, నృషు= మానవులయందు, వ్యావక్రోశీ =పరస్పరవాద కోలాహలము, సముదితా= పుట్టినదో, తే, అపి=ఆ బ్రహ్మరుద్రాదులు కూడ, తే = నీయొక్క, తుంద, కంద, అరవిందే = ఉదరమే మూలముగాఁ గల పద్మమునందు, జనితాః= పుట్టిరి.

విశేషములు :— యజ్ఞేశ్వర— 'యే యజంతి పితౄన్ దేవాన్ బ్రాహ్మణాన్ సహుతాశనాన్ సర్వభూతాంత రాత్మానం విష్ణు మేవ యజంతి తే' అని చెప్పఁబడినట్లు సర్వ కర్మలచేత నారాధింపఁ దగినవాఁడా ! అని భావము. అజ్ఞే, క్వాఽపి జనే— అనభిజ్ఞుఁడనగు నేను సర్వేశ్వరుఁ డెవఁడా ? అని విమర్శించితి నని భావము. వ్యావక్రోశీ నృషు సముదితా—

వాదులయొక్క పరస్పరవాద కోలాహలమును వ్యావక్రోశి యందురు. కొందఱు వాదులు వేదవాక్యముల కాపాతతః తోఁచు నర్థమును పురస్కరించుకొని హిరణ్యగర్భ స్సమవర్తతాగ్రే భూతస్య జాతః పతి రేక ఆసీత్' బ్రహ్మయే విశ్వాధీశుఁ డనిరి. మఱికొందఱు వాదులు 'యదా తమ స్తన్నది వా న రాత్రి ర్న సన్ న చాస చ్ఛివ ఏవ కేవలః' అను వాక్యము లోని 'శివపదముచేత శివుఁడే సర్వేశ్వరుఁ డనిరి. మఱికొందఱు 'ఇంద్రో మాయాభిః పురురూప ఈయతే' అను వాక్యమున నింద్రపద ముండుటచేత దేవేంద్రుఁడే జగదీశ్వరుఁ డనిరి. అది నిర్దుష్టార్థము కాదు. ఆపాతతః తోఁచు నర్థము మాత్రమే అట్లని తత్త్వమేది? తన్నిర్ణయం వర్ణయామః— తేఽపి బ్రహ్మాద్యా స్తే వరద! జనితా స్తుందకందారవిందే— పరత్వ సంశయాస్పదుఁడైన హిరణ్యగర్భుఁడు, నీ నాభికమలమున నుద్భవించెను, శివుఁడో! 'బ్రహ్మణః పుత్రాయ జ్యేష్ఠాయ విరూపాక్షాయ' అను ఛాందోగ్యోక్తప్రకారము ఆ బ్రహ్మకు జ్యేష్ఠపుత్త్రుఁడు. ఇఁక నింద్రుఁడో! బ్రహ్మపుత్త్రుఁ డగు కశ్యపునికిఁ గుమారుఁడు. ఈ సంబంధమే అజ్ఞులమగు మాకుఁ గూడ శ్రీమన్నారాయణుఁడే సర్వేశ్వరుఁడు పరతత్త్వము అని చాటి చెప్పుచున్నది.

తా॥ యజ్ఞేశ్వరుఁడవగు ఓ వరదరాజస్వామీ! అజ్ఞుఁడ నగు నాకు సర్వేశ్వరుఁ డెవఁడా? యను విమర్శనము గలిగి నది. అప్పు డిట్లు నిర్ణయించుకొంటిని. ఎవరిని గొప్పవారుగా

(సర్వేశ్వరులని) భ్రమించి వాదులు పరస్పరవాద కోలాహల ములఁ జేయుచున్నారో! ఆ బ్రహ్మాదులు నీ నాభికమలము నందు జనించినవారే కనుక దీనిని బట్టి వారి జన్మమునకు హేతువైన దేవరవారే సర్వేశ్వర శబ్దవాచ్యు లని తేలు చున్నది.

శా॥ ఈయజ్ఞాంతు కరీశ! యజ్ఞఫలదా!
యెవ్వాఁడు సర్వేశ్వరుం
డా! యంచున్ సలిపెన్ విమర్శనము సా
రాంశంబు నాలింపుమా
ఏయే వేల్పుల వాడిముత్తకరు లెం
తేఁ బెద్దగాఁ బల్కురో
యాయబ్జప్రభవాదులున్ ద్వదుదరో
ద్యన్నాభి పద్మోద్భవుల్. 53

శ్లో॥ ముష్ణన్ కృష్ణ ప్రియనిజజనై ర్జయ్య హైయంగవీనం
దామ్నా భూమ్నా వరద! హి యయా త్వం యశోదాకరాభ్యామ్।
బద్ధో బంధక్షపణకరిణీం తాం కిలాఽద్యాఽపి మాతుః
ప్రేష్ఠా గాత్రాభరణ ముదరాబంధనాఖ్యాం బిభర్షి ?॥ 54

ప్రతి :— ప్రియ, నిజ, జనైః = ప్రియులైన స్వకీయ భక్తజనులచేత జయ్య!=జయింప శక్యమైనవాఁడా! (భక్త పరతంత్రా) కృష్ణ! = కృష్ణరూపా! వరద!= ఓ వరదరాజ స్వామీ! త్వమ్=నీవు, హైయంగవీఃమ్=నిన్నఁటి వెన్నను కాచిన నేతిని, ముష్ణన్ = దొంగిలించుచు, యశోదా కరాభ్యామ్=యశోదచేతులచేత యయా=ఏ, దామ్నా=

త్రాటితో, భూమ్నా=ఎక్కువగా (బిగించి) బద్ధః=బంధింపఁ బడినవాఁడవు, అభూః= అయితివో, బంధ, క్షపణ, కరిణీమ్= (ఈ కథను మననము చేయువారియొక్క) సంసారబంధమును నశింపఁజేయునట్టి, తామ్=ఆ త్రాటిని, అద్య, అపి= నేఁటికిఁ గూడ, (వరదరాజరూపమున సైతము) మాతుః =తల్లియొక్క, ప్రేమ్ణా=ప్రేమచేత, ఉదరబంధనాఖ్యామ్=ఉదరబంధన మను పేరుగల, గాత్ర, ఆభరణమ్ = శరీరమునకు సొమ్మునుగా, బిభర్షి =ధరించుచున్నావు.

విశేషములు :— ముష్ణన్ కృష్ణః— అనుపాఠాంతరము గలదు. అప్పుడు హే వరద !=ఓ వరదరాజా !, త్వమ్ =నీవు, కృష్ణః (సన్) కృష్ణుఁడవగుచు అని యన్వయించుకొనవలెను. జయ్యహైయంగవీనమ్— అని జయ్యశబ్దమును హైయంగ వీనమునకు విశేషణము చేసికొనవచ్చును. అప్పుడు జయించు కొన (సంపాదించుకొన) శక్యమగు హైయంగవీనమును, ప్రియనిజ జనైః (సహ) ప్రియులగు మిత్రులతోఁ గూడ నని యర్థము. హైయంగవీనమ్=నిన్నఁటి వెన్నను కాచిన నేయి, గుమగుమాయించుచు రుచిగా నుండును.

'తత్తు హైయంగవీనం యత్ హ్యోగోదోహోద్భవం ఘృతమ్'
(అమరము)

దామ్నా భూమ్నాబద్ధః— త్రాడుచే గట్టిగాఁ గట్టఁబడిన వాఁడు. ఇఁక నెక్కడికి వెళ్ళెదవో వెళ్లు అని సవాలుచేసి పొట్టకు ఱోటికిఁ గట్టఁబడె నని భావము.

'దామ్నా చైవోదరే బద్ధ్వా ప్రత్యబధ్నా దులూఖలే
యది శక్నోషి గచ్ఛ త్వ మతిచంచలచేష్టిత!' (సంస్కృతభాగవతము)

బంధక్షపణకరిణీమ్– ఆదామము నిన్ను బంధించినను నీయీ వృత్తమును ధ్యానించువారి భవబంధముల నూడ్చు నని తాత్పర్యము. అద్యాఽపి– ఎప్పుడో కృష్ణావతారమున జరిగిన చర్యను వరదరాజస్వామి దశలోఁ గూడ మాతృప్రీతిచేత నాదామము 'నుదరబంధ' మనెడు నాభరణముగా ధరించు చున్నావని భావము.

తా॥ ఓ వరదరాజస్వామీ! భక్తపరతంత్రా! నీవు కృష్ణుఁడ వైనతఱి ప్రియమిత్రులతోఁ గూడ నప్పుడు కాచిన నేతిని దొంగిలించుచుఁ దల్లి యగు యశోదచే నేత్రాటితో గట్టిగా బంధింపఁబడితివో! సంసారబంధము నూడ్చఁగల యా త్రాటినే మాతృప్రీతిచేత నీ వరదరాజదశయందును ఉదరబంధ మను నాభరణమునుగా ధరించుచున్నావు.

మ॥ వరదా! కృష్ణుఁడ వౌతఱిన్ బ్రియసుహృ
ద్వర్గంబుతో గోపికా
హారిణీనేత్రలయిండ్లలోఁ గలుగు మేల్
హైయంగవీనంబు దోఁ
చ రుచన్ బద్ధునిఁజేసె దేనఁ దలి పా
శచ్ఛేది యాపాశ మి
త్తఱిఁ దాల్తే? తల్లిప్రేమమ్మై నుదరబం
ధం బన్నసౌమ్యుం బలెన్. 54

శ్లో॥ సౌందర్యాఖ్యా సరి దురసి విస్తీర్య మధ్యావరుద్ధా
స్థానాల్పత్వా ద్విషమగతిజా వర్తగర్తాభనాభిః ।
ప్రాప్య ప్రాప్తప్రథిమ జఘనం విస్తృతా హస్తినాథ !
స్రోతోభేదం భజతి భవతః పాదదేశాపదేశాత్ ॥ 55

ప్రతి :— హే హస్తినాథ !=ఓ కరిగిరీశా !, ఉరసి=వక్షః స్థలమునందు, విస్తీర్య = విశాలమై, మధ్య, అవరుద్ధా= నడుముచేత నాఁపఁబడినదై, స్థాన, అల్పత్వాత్ =స్థానము (చోటు) కొంచెము గనుక, విషమ, గతి, జ, ఆవర్తగర్త ఆభ, నాభిః=సమానముగాని నడవలనఁ బుట్టిన గుంటవంటి సుడియొక్క కాంతివంటి కాంతి గల నాభి (బొడ్డు) గలదియై, ప్రాప్తప్రథిమ=పొందఁబడిన వైశాల్యముగల, జఘనమ్= కటిపురోభాగమును, ప్రాప్య = పొంది, విస్తృతా = విరివి యైనదియై, సౌందర్యాఖ్యా = సౌందర్య మను పేరుగల, సరిత్ =నది, భవతః=దేవరవారియొక్క, పాద దేశ, అప దేశాత్ = పాదప్రదేశము లనెడు నెపమువలన, స్రోతః భేదమ్=ప్రవాహభేదమును, భజతి=పొందుచున్నది, (రెండు పాయ లగుచున్నది).

విశేషములు :— సౌందర్యాఖ్యా సరిత్ – సౌందర్యమును నదిగా వర్ణించుటచే నది ప్రవహించునట్లు సౌందర్యము దేహమునం దంతట వ్యాప్తమై యున్నదని భావము. ఉరసి విస్తీర్య– అనుటచే అందమంతయు భగవంతుని వక్షఃస్థలము నందే యుట్టిపడు చున్నదని యాశయము. లక్ష్మీకిఁ గౌస్తుభ

మణికి నున్కపట్టుగుటయు నిందుల కుపష్టంభకము. మధ్యా౽వరుద్ధా— అనుటచేత నడుముయొక్క సౌందర్యము ప్రకటిత మగుచున్నది. సింహమధ్యమువలె స్వామివారి నడుము మనోహర మని భావము. విషమ......నాభిః— నదీజలముల విషమగతిచేత ఆవర్తము (సుడి) ఏర్పడును. అట్లే సౌందర్య నది సన్ననినడుముకడ స్థలము చాలకపోవుటచే నేర్పడిన విషమగతివలన సుడివలె నాభి యేర్పడి నట్లున్నదని నాభివర్తులత్వము నిమ్నత్వము వర్ణింపఁబడి నట్లయ్యెను.

తా॥ ఓ కరిగిరిప్రభువగు వరదరాజస్వామీ! నీ వక్షఃస్థలమున సౌందర్యనది విస్తృతిఁ గాంచి నడుముకడఁ జోటుచాలక వెనుకకు మరలి విషమగతిచే నేర్పడిన యావర్తమన నాభిక్రాల విశాలమగు జఘనంబున విరివియై నీ సౌందర్య శైవాలిని పాదము లను నెపముచేత రెండుపాయలుగా ప్రవహించినది.

శా॥ నీ వక్షఃస్థలి విస్తృతిన్ బరఁగుచున్,
 నీ మధ్యభాగంబునన్
దావుం జాలక వెన్కకున్ మఱలి వ్య
 త్యస్తాంబువై దాన నా
నావర్తంబన నాభిగ్రాల జఘనం
 బందున్ విజృంభించి నీ
లావణ్యాపగ యొప్పెఁబాదమిషచే
 లక్ష్మీశ ! యిర్పాయలై. 55

శ్లో॥ రంభా స్తంభాః కరివరకరాః కారభా స్సారభాజో
వేషాఽఽఽశ్లేషా అపి మరతక స్తంభముఖ్యా స్తులాఖ్యాః ।
సామ్యం సమ్య గ్వరద ! న దధుః సర్వ మూర్వో స్త్వదూర్వో
ర్న హ్యైశ్వర్యం దధతి న తథా యౌవనారంభజృంభాః॥ 56

ప్రతి :— హే వరద! = ఓ వరదరాజస్వామీ! సార భాజః=శ్రేష్ఠములగు, రంభా, స్తంభాః=అరఁటికంబములు, కరి, వర, కరాః=గజశ్రేష్ఠముల తొండములు, కారభాః= కరభసంబంధి ప్రదేశములు (మనికట్టు మొదలు చిటికెనవ్రేలి మొదలుదాఁకఁ గల చేతి వెలుపలిచోటు) మరకత, స్తంభ, ముఖ్యాః=మరకతస్తంభములు మొదలుగాఁ గలవి, వేష, ఆశ్లేషాఃఅపి = ఆకారసంశ్లేషము గలవియైనను, తులా, ఆఖ్యాఃఅపి=ఉపమానములను పేరు గలవియైనను, ఊర్వోః= గొప్పవియగు, త్వదూర్వోః=నీ తొడలయొక్క, సర్వమ్= సమస్తమగు, సామ్యమ్=పోలికను, సమ్యక్ = బాగుగా, న, దధుః=ధరించలేదు, హి=ఎందుకనఁగా, (తే=అవి) తథా= అట్లు, ఐశ్వర్యమ్=శక్తివిశేషమును, న, దధతి=ధరింపవు, తథా = అట్లు, యౌవన, ఆరంభ, జృంభాః = యౌవన ప్రాదుర్భావమునందలి వికాసములను, న, దధతి=ధరింపవు.

విశేషములు :— కారభాః— కరభసంబంధినః (కరభ ప్రదేశములు)

'మణిబంధా దాకనిష్ఠం కరస్య కరభో మతః' (అమరము)

తులాఖ్యాః—(తులేతి ఆఖ్యా యేషాం తే) ఉపమానము లనెడు పేరు (ప్రసిద్ధి) గలవి. రంభా స్తంభాదుల కట్టిప్రసిద్ధి యుండుట

రంభోరు, కరభోర్వి త్యాదులవలన నెల్లరకు విదిమే. 'సామ్యం సమ్య గ్వరద ! న దధుః సర్వ మురోర్వో స్త్వదూర్వోః'— అట్టి ప్రసిద్ధిగల రంభా స్తంభాదులు గూడ సర్వాత్మనా అనిర్వాచ నీయములగు నీ తొడలను బోలలేవు. చర్మమునఁ గర్కశత్వము గల కరివరకరములకు– ఏకాంత శైత్యము గల రంభా స్తంభము లకు జడములగు మారకత స్తంభముల కట్టి యోగ్యత యెట్లు పట్టును ? పట్టినను న హ్యైశ్వర్యం దధతి న తథా– భగ వానుని తొడలకుఁ గల శక్తివిశేషాదులు వానికి (రంభా స్తంభాదులకు) ఎట్లు లభ్యమగును ? 'పిష్టదుష్టమధుకైటభకీటౌ' భగవానుఁడు దుష్టులగు మధుకైటభకీటములను తొడలచేతనే కదా పిసికివేసెను. ఆశక్తి రంభా స్తంభాదులకు వేయిజన్మములు తపస్సుచేసినను రావని భావము.

తా॥ ఓ వరదరాజస్వామీ ! శ్రేష్ఠములగు కదళీకాండ ములు, నాగేంద్రహస్తములు, కరభములు, మరకత స్తంభములు, ఉపమానకోటిలోఁ బేరెన్నికఁగన్న వైనను, తత్తుల్యాకార మును బొందియున్నను, శ్రేష్ఠాతిశ్రేష్ఠములగు నీతొడలతో సర్వాత్మనా సామ్యమును బొందలేవు. ఎందుకనఁగా నీ తొడ లకుఁ గల యైశ్వర్యము (శక్తి) యౌవనవిలాసాదులు రంభా స్తంభాదుల కెట్లు వచ్చును.

మ॥ సరిపోలం గలవే త్వదూరువులతో
సాలోపమానంబు లౌ
కరభాకారములున్, మనోజ్ఞకదళీ
కాండంబు, లాశాంతభా

స్వైర నాగేంద్ర కరంబులుఁ, మరకత
స్తంభంబు, లిత్యాదు, లో
వరదా! నీవిభవంబు యౌవనకళా
వైదగ్ధి యెట్లొప్పెడిఁ. 56

శ్లో॥ యా తే గాత్రే వరద! జనితా కాంతిమ య్యాపగాఽభూత్
తస్యాః స్రోతోయుగళ మిహ య ద్యాతి పాదప్రవాహమ్ ॥
తజ్జాతోర్ధ్వభ్రమియుగ మి వోద్భానునీ జానునీ తే
స్యా దుక్ష్ణో ర్వా కకుదయుగళం యౌవనైశ్వర్యనామ్నః ॥ 57

ప్రతి :— హే వరద! = ఓ వరదరాజస్వామీ! తే = నీయొక్క, గాత్రే = శరీరమునందు, కాంతిమయీ = కాంతి స్వరూపిణి యగు, యా = ఏ, ఆపగా, నది, జనితా = పుట్టినదో, తస్యాః = ఆనదియొక్క, యత్ = ఏ, స్రోతోయుగళమ్ = ప్రవాహములజంట, ఇహ = ఈ శరీరమునందు, పాదప్రవాహామ్ = పాదముల నెపమును, యాతి = పొందు చున్నదో, ఉద్భానునీ = పైకిఁ బ్రసరించుచున్న (కాంతి) కిరణములు గల, తే = నీయొక్క, జానునీ = మోఁకాళ్లు, తత్, జాత, ఊర్ధ్వ, భ్రమి, యుగమ్, ఇవ = ఆప్రవాహముల జంటయందుఁ బుట్టిన పైకిఁ బ్రసరించు సుడుల (బుడకల) జంటవలె, (భాతః = ప్రకాశించుచున్నవి), వా = అదికానిచో, యౌవన, ఐశ్వర్య, నామ్నః = యౌవనసౌందర్య మనెడు పేరుగల, ఉక్ష్ణః = వృషభములయొక్క, కకుద, యుగళమ్ = మూఁపురములజంట, స్యాత్ = అగును.

విశేషములు :— ఇందు మొదటి రెండుపాదముల యందును 'సౌందర్యాఖ్యా' అను 55 శ్లోకములోని పూర్వార్ధమను వదింపఁబడినది. కకుదయుగళమ్— వృషాంగే కకుదోఽస్త్రి యామ్— అను నమరోక్తివలన 'కకుద' శబ్దమునకు ఎద్దుల మెడపైనుండు మాంసపుముద్ద యర్థము.

స్రోతోయుగళమ్— అనుచోట స్రోతోద్వితయమ్— అని పాఠాంతరము గలదు. అర్థము సమానము. నాల్గవపాదమున యుగళశబ్దమున్నది గనుక మొదటి పాదమున ద్వితయ ముండు టయే సమంజసముగా నుండును. పునరుక్తి యుండదు.

తా॥ ఓ వరదరాజస్వామీ! దేవరవారి దివ్యవిగ్రహమున జనించిన కాంతిరూపిణి యగు నదియొక్క, పాదప్రవాదమును బొందిన ప్రవాహయుగళమునుండి యూర్ధ్వమునకుఁ బ్రసరించు నావర్తయుగమువలె కాంతుల గ్రుమ్మరించుచు శ్రీవారి మోఁకాళ్లు ప్రకాశించు చున్నవి. లేదా యౌవనసౌందర్య వృషభముల మూఁపురములవలె నొప్పుచున్నవి.

ఉ॥ ఏనది కాంతిరూప ప్రవ
హించెను నీమెయి హస్తివల్లభా!
దేని ప్రవాహయుగ్మ మయి
దేవర పాదయుగంబు గ్రాలెనో!
దాన జనంచి పైకెగయు
తత్సలిలభ్రమ మొక్కొ! యౌవనా

స్థాన మహోత్సు రమ్యోత్సవకు
దంబులో ! నాఁ దగె నీదుజానువుల్. 57

శ్లో॥ ప్రేమ్ణాఽఽఘ్రాతుం కరిగిరి శిరోఽధోముఖీ భావభాజో
రంఘ్రిద్వంద్వాహ్వయకమలయో ర్దండకాండాయమానే।
అద్రిస్పర్శోద్భవసుఖత ఉత్కంటకే రోమహర్షాత్
ద్రష్టు ర్దృష్టి ర్వరద! కి మలం లంఘితుం జంఘికే తే॥ 58

ప్రతి :— హే వరద != ఓ వరదరాజస్వామీ!, ప్రేమ్ణా= ప్రీతిచేత, కరిగిరిశిరః = కరిగిరిశృంగమును, ఆఘ్రాతుమ్ = మూర్కొనుటకు, అధోముఖీభావభాజోః = క్రిందిముఖము గలిగియుండుటను బొందిన, అంఘ్రి, ద్వంద్వ, ఆహ్వయ, కమలయోః= పాదయుగ్మ మను పేరు గల కమలములయొక్క, దండ, కాండాయమానే = దండములఁబోలు కాడలవలె నున్న వియు, అద్రిస్పర్శ, ఉద్భవ, సుఖతః = కొండను దాఁకుటవలనఁ బొడమినసుఖమువలన, (జాతాత్ =పుట్టిన) రోమహర్షాత్ = గగుర్పాటువలన, ఉత్, కంటకే= ఉదయించిన ముళ్ళుగల, తే= నీయొక్క, జంఘికే=పిక్కలను, ద్రష్టుః = చూచువాని యొక్క (అందలి యందము ననుభవించు వానియొక్క) దృష్టిః= చూపు, లంఘితుమ్ =(జంఘలను) అతిక్రమించుటకు, అలం, కిమ్= సమర్థమగునా ? కాదని భావము.

విశేషములు :— ప్రేమ్ణా— భోగ్యతాతిశయప్రయుక్త మగు ప్రీతిచేత— ఉత్కంటకే— కమలనాళముల యందును ముండ్లున్నను గాన నిట్లు వర్ణింపఁ బడినది.

కి మలం లంఘితుమ్— కాలమంతయు జంఘాసౌందర్యము నే చూచుచుందు రని భావము.

తా॥ ఓ వరదరాజస్వామీ! కరిగిరి శిఖరమును ప్రేమచేత మూర్కొనుటకుఁ గ్రిందిమోముగా నున్న పాదయుగము పేరికమలములజంటకుఁ గాడలవలె నొప్పి పర్వతస్పర్శచేఁ గలిగినయానందమునఁ బులకితములో యన్నట్లున్న నీ జంఘల సౌందర్యము ననుభవించు వారి చూపు వానిని దాఁటి యావలకుఁ బోసమర్థమగునా? (కాదు)

మ॥ కరిశైలాగ్రముఁ బ్రేమ మూరుకొనఁ జ
క్కం గ్రిందుమో మైన మీ
చరణ ద్వంద్వము పేరి పద్మముల సం
సక్తంబు లౌ కాడలన్
సిరిచే మించి గిరిన్ స్పృశింప నగుతు
ష్టిం బుల్క లేపారు నీ
వరజంఘల్ కనువారిదృష్టి మఱలిం
పన్ రాదు హస్తీశ్వరా! 58

శ్లో॥ భక్తానాం య ద్వపుషి దహరం పండితం పుండరీకం
య చ్చాఽవ్లానం వరద! సతతాధ్యాసనా దాసనాబ్జమ్।
ఆమ్నాయానాం యదపి చ శిరో య చ్చ మూర్ధా శతాహేః
హ స్త్యద్రే ర్వా కి మతిసుఖదం తేషు పాదాబ్జయో స్తే॥ 59

ప్రతి :— హే వరద! = ఓ వరదరాజస్వామీ! భక్తానామ్ = భక్తులయొక్క, వపుషి = శరీరమునందు, పండితమ్ = జ్ఞానవికాసము గలదియు, దహరమ్ = దహర మనుపేరు

గలదియు, (అగు) యత్ = ఏ, పుండరీకమ్ = పద్మముగలదో, సతత, అధ్యాసనాత్, అపి = సదాఅధిష్ఠించియుండుటవలన సైతము, అమ్లానమ్ = వాడని, ఆసనాబ్జం, చ, యత్ = పద్మాసన మేదిగలదో, ఆమ్నాయానామ్ = వేదములయొక్క, శిరః, అపిచ = శిరస్సుకూడ (ఉపనిషత్తు) యత్ = ఏది కలదో, శఠారేః = శఠకోపమునియొక్క, మూర్ధా, చ = శిరస్సును, యః = ఏదికలదో, తేషు = వానియందు (ఆ ఐదింటి యందు) తే = నీయొక్క, పాదాబ్జయోః = పాదపద్మములకు, అతిసుఖదమ్ = ఎక్కువసుఖము నిచ్చునది, కింవా? = ఏది ?

విశేషములు :— పండితమ్— జ్ఞానవికాసవత్ = జ్ఞాన వికాసము గలది 'పడి = గతౌ' అనుధాతువునుండి యేర్పడిన శబ్దము– యే గత్యర్థాః తే జ్ఞానార్థకాః– అను నియమముచేత జ్ఞానార్థక మాయెను. దహరమ్— దహ్రం విపాప్మం పరవేశ్మ భూతం య త్పుండరీకం పురమధ్యసంస్థమ్ తత్రాఽపి దహ్రం గగనం విశోక స్తస్మిన్ య దంత స్తదుపాసితవ్యమ్— ఈ శ్రుతిలోఁ జెప్పఁబడిన– సకల కల్యాణగుణాకరదహరాకా శాఖ్య పరమపురుషనిత్య నివాసస్థానము.

ఆమ్నాయానాం య దపిచ శిరః— వేదాంతము 'సర్వే వేదా యత్పద మామనంతి' కి మతిసుఖదం తేషు ?— హాస్త్యద్రేః మూర్ధా— అని సమాధానము ఇచ్చుటనే కోరినట్లు సకల సమాశ్రయణ సౌకర్యము సకల ఫలప్రదత్వము సంభవించు చున్నది.

తా॥ ఓ వరదరాజస్వామీ! తమకుఁ బాదపీఠములుగాఁ బ్రసిద్ధికెక్కిన యీ యైదింటిలో దేవరవారి పాదముల కత్యంత సుఖప్రదమైన దేది? (1) జ్ఞానభాసురమై భక్తుల శరీరమున నున్న దహరాఖ్య మగు పుండరీకమా? (2) సర్వదా అధిష్ఠించి యున్నను వాడనిదియు విమలాద్యష్ట శక్త్యధిష్ఠితమై యష్టదళ శోభియై వికాసోన్ముఖమై యొప్పు నాసనాబ్జమా? (3) వేదశిరస్సగు నుపనిషత్తులా? (4) శఠారిమునిమూర్ధమా? (5) కరిగిరి శిఖరమా? అనుగ్రహింపుఁడు.

శా॥ దేవా! భక్తుల దహ్రనామము చిదు
ద్దీప్తంబు హృత్పద్మమో!
భావత్కానిశవాస మయ్యు శ్రమకుం
బాల్గాని తత్పీఠరా
జీవంబో! శ్రుతిశేఖరంబో! శిరమో!
శ్రీమచ్ఛఠారాతి కీ
గ్రావాగ్రంబో! త్వదంఘ్రి పద్మములకుం
గల్పించు మేల్ సౌఖ్యముం? 59

శ్లో॥ పద్యా స్వద్యాంగుళిషు వరద! ప్రాంతతః కాంతిసింధో
ర్వీచీవీథీవిభవ ముభయీమ్వంభసో లంభితాసు।
విందన్నిందుః ప్రతిఫలనజాం సంపదం కిం పదం తే
ఛాయాచ్ఛద్మా నఖవితతితాం లంభిత శ్శుంభిత స్సన్॥ 60

ప్రతి :— వరద!=ఓ వరదరాజస్వామీ! కాంతిసింధోః= కాంతి యనెడు సముద్రముయొక్క, అంభసః = నీటియొక్క, ప్రాంతతః=ప్రాంతప్రదేశమునందు, వీచీవీథీవిభవమ్ = తరంగ

పంక్తిసంపదను, లంభితాసు=పొందించఁబడిన, పద్యాసు = పాదములకు సంబంధించిన, ఉభయీషు = రెండువిధము లగు, అంగుళీషు=వ్రేళ్ళయందు, ప్రతిఫలనజామ్=ప్రతిబింబమువలనఁ బొడమిన, సంపదమ్=శోభను, అద్య=ఇప్పుడు, విందన్ = పొందుచు, ఛాయాచ్ఛద్మా=ప్రతిబింబవ్యాజముగల, ఇందుః =చంద్రుఁడు, నఖ, వితతితామ్=కాలిగోళ్ళవరుస యగుటను; లంభితః సన్ =పొందిపఁ బడినవాఁ డగుచు, తే=నీయొక్క, పదమ్=పాదమును, శుంభితః కిమ్ = ప్రకాశింపఁజేసెనా ?

విశేషములు :- పద్యాసు- పదయోః సంబంధిన్యః పద్యాః, తాసుపదములకు సంబంధించిన యని యర్థము. అంగుళీషు- అను దానికి విశేషణము. 'శరీరావయవాత్ యత్'- అను సూత్రముచేత శరీరావయవ మగు పదశబ్దమునకు 'యత్' ప్రత్యయము రాఁగా నీరూపము సిద్ధించినది. పదంతే...... ......శుంభితః కిమ్- దివ్యవిగ్రహలావణ్యార్ణవతరంగ మాలా సుందరంబులగు పాదాంగుళులందుఁ బ్రతిఫలించి నఖవితతిరూప మూని చంద్రుఁడు నీపాదపద్మయుగళము శోభిల్లఁ జేయు చున్నాఁ డని భావము.

తా॥ ఓ వరదరాజస్వామీ ! నీ లావణ్యార్ణవముయొక్క జలపర్యంతభాగములందు నలలపంక్తులవలె నొప్పు నీపాదాం గుళులందుఁ బ్రతిబింబమిషచే నలరుచుఁ జంద్రుఁడు పాదన ఖంబులుగా రూపొంది నీపాదములఁ బ్రకాశింపఁ జేయు చున్నాఁడా ?

మ॥ ద్యుతివారాశి జలాంచలస్థలిని యా
దోనాథకన్యాస్వయం
వృతకాంతా! శుభవీచికావళిసిరిన్
వెంటాడు పాదాంగుళీ
తతి ఛాయామిషచేతఁ గన్పడి సుధా
ధాముండు ప్రోద్యన్నఖా
కృతిఁ జెన్నారి వెలుంగఁ జేసెనె త్వదం
ఘ్రిన్ హస్తిశైలప్రభూ! 60

అవతారిక :— పూర్వోక్త విషయమునే వివరించు చున్నారు.

శ్లో॥ శంభో రంభోరుహముఖ! సఖా సన్ సహాంక శ్శశాంకః
కుర్వన్ సేవాం వరద! వికలోవృత్తిహీన స్సువక్రః ।
త్వత్పాదాబ్జే ప్రియముఖ! నఖ చ్ఛద్మనాఽఽశ్రిత్య నిత్యం
సద్వృత్తోఽభూత్ స తు దశగుణః పుష్కలో నిష్కళంకః ॥

ప్రతి :— అంభోరుహ, ముఖ = పద్మమువంటి ముఖము గలవాఁడా! ప్రియముఖ! = ఇష్టములగు యజ్ఞములు గలవాఁడా! హే వరద != ఓ వరదరాజస్వామీ!, శశాంకః = (కుందేలు గుర్తుగాఁగలవాఁడు) చంద్రుఁడు, శంభోః = శివునకు, సఖా, సన్ = మిత్రుఁడగుచు, సేవామ్ = సేవను, కుర్వన్ = చేయుచు, సహాంకః = కళంకముతోఁ గూడినవాఁడును, రెండవయర్థమున— పాపముతోఁ గూడిన వాఁడును) వికలః = పోయినకళలు గల వాఁడును, క్షయిష్ణువు అని భావము, (రెండవ- విద్యాహీనుఁ

డును) వృత్తహీనః=వర్తులత్వము(గుండ్రతనము) లేనివాఁడును, (రెండవ- ఆచారరహితుఁడును) సువక్రః = మిక్కిలి వంకర ఆకారము గలవాఁడును, (రెండవ- కుటిలచిత్తుఁడును) అభూత్ =ఆయెను. సః = ఆచంద్రుఁడే, నఖ, ఛద్మనా = గోళ్ళ నెపముతో, త్వత్, పాదాబ్జే = తామరలఁ బోలు నీరెండు పాదములను, ఆశ్రిత్య, తు=ఆశ్రయించియో, నిష్కళంకః= కళంకరహితుఁడు (పాపరహితుఁడు) నిత్యమ్ = ప్రతినిత్యము, పుష్కలః=పరిపూర్ణుఁడును, సత్ వృత్తః=మంచివర్తులత్వము గల వాఁడును, (మంచియాచారము గలవాఁడును) దశగుణః =పదిరెట్లధికమైన వాఁడును, అభూత్ =ఆయెను, నూనమ్= నిజము.

విశేషములు :— కుర్వన్ సేవామ్— శిరోభూషణముగా శివుని సేవించుచు, సహాంకః— వికలోవృత్తహీనస్సువక్రః— ఈపదములు రెండు రెండు అర్థములు గలిగియుండుటచేత శ్లేషాలంకారము. 'నానార్థసంశ్రయః శ్లేషః'— అని లక్షణము. అశ్లే— 'సద్వృత్తః' ఇత్యాదులందును శ్లేషాలంకారమని తెలియనగును. దశగుణః— శివునితలపై ఏకకళారూపమున నున్న చంద్రుఁడు శ్రీ వరదరాజస్వామి పాదాబ్జములను ఆశ్రయించి పాదాంగుళీ నఖములందుఁ బ్రతిఫలించి పదిమూర్తులను ధరించుటచేత దశగుణాధికుఁడుగా నుండె నని భావము. దీని చేత దేవతాంతరసేవ యపకర్షకరియు, భవదీయసేవ యుత్కర్ష కరియునని భావము.

తా॥ పద్మమునుబోలు ముఖముగలిగి జన్మములయెడఁ బ్రీతితో నొప్పు నోవరదరాజస్వామీ! చంద్రుఁడు శివునకు సఖుఁడై శిరోభూషణముగా నాశివునిఁ గొల్చుచు దేవతాంతర సేవ చేయుటచేత సకళంకుఁడు, విగతకళుఁడు, వృత్తహీనుఁడు వక్రుఁడు నాయెను. ఆచంద్రుఁడే యుత్తమదైవత మగు నీపాదాబ్జముల నఖమిషచే నాశ్రయించి అకళంకుఁడు నిత్య పుష్కలుఁడు (పూర్ణకలుఁడు) సద్వృత్తుఁడు, దశగుణుఁడునై ప్రకాశించు చున్నాఁడు- దీనితో మందాక్రాంతాదశకము ముగిసినది.

మ॥ వికచాబ్జాస్య! విధుండు శంభుసఖుఁ డా
వేల్పుఁ గడుం గొల్చుచున్
సకళంకుండు సువక్రుఁడున్ వికలుఁడున్
సంత్యక్త వృత్తుండుగా
నకటా! మాఱెఁ ద్వదంఘ్రిఁ గొల్చుచు నఖ
వ్యాజంబునం బొల్చెఁ బో
అకళంకుండు నవక్రుఁడున్ దశగుణుం
డాఢ్యుండు సద్వృత్తుఁడై.

శ్లో॥ త్వత్పాదాబ్జే ప్రజాతా సురసరి దభవత్ ప్రాక్ చతుర్ధా తత స్తా
స్వేకాం ధత్తే ధ్రువ స్స్నా త్రిభువన ముపునాత్ త్రీణ్ పథో భావయంతీ।
తత్రైకా ఖం వ్రజంతీ శివయతి తు శివంసా పున స్సప్తథాఽభూత్
తా స్వేకా గాం పునానా వరద! సగరజస్వర్గ మార్గం చకార॥ 62

ప్రతి :— హేవరద != ఓ వరదరాజస్వామీ !, ప్రాక్ = పూర్వము (త్రివిక్రమావతారమున) త్వత్, పాదాబ్జే=నీపాద

పద్మమునందు, ప్రజాతా = పుట్టిన, సురసరిత్ = గంగ, చతుర్ధా = నాలుగు విధములుగా, అభవత్ = ఆయెను, తతః = తరువాత, తాసు = వానిలో, ఏకామ్ = ఒకదానిని, ధ్రువః = ధ్రువుఁడు, ధత్తే, స్మ = ధరించెను, సా = ధ్రువునిచే ధరింపఁబడిన యాగంగ, త్రీన్ = మూఁడు, పథః = మార్గములను, భావయంతీ = పొందింపఁజేయుచు, త్రిభువనమ్ = మూఁడు లోకములను, అపునాత్ = పవిత్రము చేసెను, తత్ర = వానిలో, ఏకా = ఒకటి, (త్రిపథగ) ఖమ్ = ఆకాశమునుగూర్చి, వ్రజంతీ = వెళ్లుచు, శివమ్ = ఈశ్వరుని, శివయతి = మంగళకరుని జేయుచున్నది (పవిత్రుని జేయుచున్నది) సా, = శివునిచే ధరింపఁబడిన యాగంగ, పునః = తిరిగి, సప్తధా = ఏడువిధములుగా, అభూత్ = ఆయెను, తాసు = వానిలో, ఏకా = ఒకటి, గామ్ = భూలోకమును, పునానా = పవిత్ర మొనర్చుచు, సగరజ, స్వర్గ, సర్గమ్ = సగరపుత్త్రులకు స్వర్గసృష్టిని, చకార = చేసెను.

విశేషములు :— భావయంతీ = ప్రాపయంతీ, పొందింపఁజేయుచు, త్రిభువనమ్ — స్వర్గాంతరిక్ష పాతాళములను, 'తస్త్రైకా ఖం వ్రజంతీ శివయతి తు శివమ్ —' 'భేదం చాలకనందాఖ్యం యస్య శర్వోఽపిదక్షిణం దధార శిరసా భక్త్యా వర్షాణా మధికం శతమ్' 'య చ్చ్యాచనిస్సృతసరిత్ప్రవరోదకేన తీర్థేన మూర్ధ్ని విధృతేన శివ శ్శివోఽభూత్' ఇత్యాదులు పైవిషయమునఁ బ్రమాణములు. ఏకా గాం పునానా వరద! సగరజ స్వర్గసర్గం చకార — కపిలమునికోపాగ్ని దగ్ధులగు సగర

పుత్రులకు స్వర్గము లభించుటకు భగీరథుఁడు గంగను గొని వచ్చినకథ నిట ననుసంధించు కొనవలెను. 'జహ్నోః కన్యాం సగరతనయ స్వర్గసోపాన పంక్తిమ్' (కాళిదాసమహాకవి) ఈ శ్లోకముతో నానావృత్త దశకము ప్రారంభమైనది. ఇది స్రగ్ధరావృత్తము.

తా॥ ఓ వరదరాజస్వామీ! పూర్వము త్రివిక్రమావతారమున దేవరవారి పాదపద్మమున నుద్భవించిన గంగ నాల్గు పాయలైనది. అందొకదానిని ఉత్తానపాదచక్రవర్తి కుమారుఁడైన ధ్రువుఁడు ధరించెను. అది మూఁడుమార్గములఁ బ్రవహించి మూఁడు లోకములను బవిత్రమొనర్చెను. వానిలోఁ ద్రిపథగ యనునది యాకాశమునఁ బ్రవహించుచు శివుని బరిశుద్ధు నొనర్చినది. యది మఱల నేడుపాయలైనది. (హ్రాదిని, పద్మిని, నళిని, సుచక్షువు, సీత, సింధువు, భాగీరథి) అందులో నొకటి యగు భాగీరథి భూలోకమును బవిత్రము చేయుచు సగరపుత్త్రులకు స్వర్గభిక్షను బెట్టినది.

మ॥ మును నీపాదపయోజమందు జనన
మ్మొం గాంచె మిన్నేఱు, త
ద్ధుని నల్పాయలఁ జెందె నొండు ధ్రువుఁ డం
దుం దాల్ప ముత్త్రోవలన్
జని లోకత్రయి శుద్ధముగ్ సలిపె న
న్యం బీశుఁ బూతాత్ముఁ జే
సెను దజ్జాత మొకండు సాగరుల కి
చ్చెన్ స్వర్గసౌఖ్యంబులన్ 62

అవతారిక :— ఇట్లు మంత్రరత్న పూర్వఖండస్థ నారాయణ శబ్దమున కర్థముగా విగ్రహవైశిష్ట్యమును విస్తరించి నుడివి విభవావతారములను స్తుతింపఁ దలఁచి యిదివఱకుఁ బ్రతిపాదించినవియు ముందు ప్రతిపాదింపఁ బడఁబోవునవియు నగు సకలావతారములకుఁ బ్రయోజన మాశ్రితానుగ్రహమే యని సాయించు చున్నారు.

> శ్లో॥ పరిజనపరిబర్హా భూషణా న్యాయుధాని
> ప్రవరగుణగణా శ్చ జ్ఞానశక్త్యాదయ స్తే।
> పరమపద మథాండా న్యాత్మదేహ స్తథాఽఽత్మా
> వరద! సకల మేతత్ సంశ్రితార్థం చకర్థ ॥ 63

ప్రతి :— హే వరద! = ఓ వరదరాజస్వామీ! పరిజన, పరిబర్హాః = శేష, శేషాశనాది పరిజనులు, ఛత్రచామరాది పరిచ్ఛదములు, భూషణాని = కిరీటకుండలాద్యాభరణములు, ఆయుధాని = శార్ఙ్గచక్రాది దివ్యాయుధములు, తే = ఆ, జ్ఞాన, శక్తి, ఆదయః = జ్ఞానము శక్తి మొదలుగాఁ గల, ప్రవరగుణ గణాః చ = శ్రేష్ఠములగు గుణసమూహములును, పరమ పదమ్ = వైకుంఠలోకము, అథ = అటుపైని, అండాని = బ్రహ్మాండములు, ఆత్మదేహః = తన యసాధారణ మగు దేహము, తథా = అట్లే, ఆత్మా = ఆత్మస్వరూపము, ఏతత్ = ఈ, సకలమ్ సమస్తము, సంశ్రితార్థమ్ = ఆశ్రితులకొఱకు, చకర్థ = చేసితివి.

విశేషములు :— అండాని— చతుర్దశ భువనములతో ఆవరణసప్తకముతోను కూడిన బ్రహ్మాండములు. ఆత్మదేహః

స్వాసాధారణ దివ్యవిగ్రహః— తనకే తప్ప నితరులకులేని యప్రాకృతదివ్యశరీరము, తథా— ఆత్మా— సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ— ఆనందో బ్రహ్మ— ఏష సర్వభూతాంత రాత్మా అపహతపాప్మా— దివ్యో దేవ ఏకో నారాయణః— ఇత్యాద్యుక్తలక్షణ స్వరూపమైన ఆత్మయని భావము. ఈ శ్లోకము మాలినీవృత్తము.

తా॥ ఓ వరదరాజస్వామీ! శేష, శేషాశనాది పరిజనులు, ఛత్రచామరాది పరిచ్ఛదములు, కిరీటకుండలాది భూషణములు, సుదర్శన పాంచజన్యాది దివ్యాయుధములు, జ్ఞానశక్త్యాది కల్యాణగుణ గణములు, పరమపదము, బ్రహ్మాండములు, దివ్యదేహము, సత్యజ్ఞానాది లక్షణలక్షిత మగు ఆత్మ యీ సమస్తము సంశ్రితుల యనుభవము కొఱకే యుపయుక్త మొనర్చితివి గదా! ఏమి నీ యాశ్రిత వాత్సల్యము స్వామీ!

చ॥ పరిజనముల్ పరిచ్ఛదము
భవ్యవిభూషణకోటి యాయుధో
త్కరములు జ్ఞానశక్తిముఖ
కమ్రగుణంబులు పద్మజాండముల్
పరమపదంబు రూపగుణ
భాసుర దివ్యశరీర మాత్మయున్
వరద! శ్రితార్థమే కద! భ
వద్విభవం బొనరించి తంతయున్. 63

అవతారిక :— ఇట్లు సామాన్యముగా భగవంతుని పరిజనాది పరిగ్రహమంతయు సమాశ్రితుల యుపయోగార్థమనియే చెప్పి విభవావతారమునందలి విశిష్టతను ఎనిమిది శ్లోకములతోఁ జెప్పుచున్నారు.

శ్లో॥ అనాప్తం హ్యాప్తవ్యం న తవ కిల కించిద్వరద ! తే
జగజ్జన్మస్థేయ ప్రలయవిధయో ధీవిలసితమ్ ।
తథాఽపిక్షోదీయస్సురనరకులేష్వాశ్రితజనాన్
సమాశ్లేష్టుం పేష్టుం తదసుఖకృతాం చావతరసి ॥ 64

ప్రతి :— హే వరద ! = ఓ వరదరాజస్వామీ !, తవ = నీకు, అనాప్తమ్ = పొందఁబడనిదియు, ఆప్తవ్యమ్ = పొందఁబడవలసినదియు కించిత్ = ఒకటియు, న హి, కిల = లేదు గదా ! జగత్, జన్మ, స్థేమ, ప్రళయ, విధయః = లోకములయొక్క సృష్టి స్థితి సంహార కార్యములు, తే = నీయొక్క, ధీ, విలసితమ్ = బుద్ధివిలాసము, తథాఽపి = ఐనప్పటికి, ఆశ్రితజనాన్ = భక్తజనులను, సమాశ్లేష్టుమ్ = కౌఁగిలించుకొనుటకు, తత్, అసుఖ, కృతామ్ = వారికి (సంశ్రితులకు) దుఃఖమును గలిగించువారిని, పేష్టుమ్ చ = హింసించుటకును, క్షోదీయః, సుర, నర, కులేషు = మిక్కిలి క్షుద్రములగు దేవమానవ సమూహము లందు, అవతరసి = అవతరించుచున్నావు.

విశేషములు :— ధీవిలసితమ్— 'బహు స్యాం ప్రజాయేయేతి' అను సంకల్పమాత్రముననే సృష్ట్యాదులు జరుగు నని భావము. అథాఽపి— అవాప్తసమస్త కాముఁడ వైనప్పటికి—

సమాశ్లేషమ్ = ఆలింగన మొనర్చుకొనుటకు, స్వదర్శన, స్పర్శన, సపర్యాదులు లభింపకపోవుటవలన శరీరధారణమునకే యశక్తులుగానున్న భక్తులకు దర్శనాదు లొసంగుట కొఱకని భావము. 'ప్రేష్ఠుం తదసుఖకృతాం చావతరసి— సాధు రక్షణము దుష్కృద్వినాశము ఈరెండే యవతారప్రయోజనము లని రహస్యము. 'పరిత్రాణాయ సాధూనామ్' అను శ్లోకమున 'ధర్మసంస్థాపనార్థాయ' అని ధర్మసంస్థాపనము గూడఁ బ్రయోజనముగాఁ జెప్పఁబడెను. గాని యది సాధు రక్షణములోనే యంతర్భూత మగుచున్నది. ఇంకను విమర్శించి చెప్పినచో సాధురక్షణమే యవతారమునకు ముఖ్యప్రయోజనము. దుష్టశిక్షణము ధర్మసంస్థాపనము ఆనుషంగికఫలములు. కనుకనే శ్లోకమున 'పరిత్రాణాయ సాధూనామ్' అను ముఖ్య ఫలమే మొదట నిర్దేశింపఁబడినది. విభవావతారము భక్తుల కత్యంతోపయుక్త మని సారాంశము.

తా॥ ఓ వరదరాజస్వామీ ! సంకల్పమాత్రముచేతనే సృష్టి స్థితి సంహారముల నొనర్పఁగల దేవరవారికిఁ బొందఁబడనిది గాని, పొందఁబడవలసినది గాని యేదియు లేదు. అవాప్త సమస్తకాముఁడ వైనను నీ వతిక్షుద్రంబులగు సురనరకులముల నవతరించుట యాశ్రితుల నాలింగనాదుల సంతోషపెట్టుటకును, ఆశ్రితులకు దుఃఖమును గలిగించువారిని దండించుటకును మాత్రమే యగుచున్నది.

శా॥ దేవా ! నీకు ననాప్త మాప్యము రవం
తేన్ లేదు, నీ యిచ్ఛచే
ఆవిర్భూతము గాను సృష్టిభవన సం
హారంబు లగ్గైనఁ ద్వ
త్సేవాసక్తులఁ బ్రోవఁ దద్రిపుల మ
ర్దింపంగ జన్మింతు వా
నీ విచ్ఛోటు లభీష్ట దేవమనుజా
నీకంబునన్ శ్రీపతీ ! 64

అవతారిక :— క్రోధీయుస్సురనరకులే ష్వవతరసి— అను దానిచేఁ జెప్పఁబడిన సౌశీల్యమునే యనుసంధించు కొను చున్నారు.

శ్లో॥ వివేకధియ మేకతో హ్యభినివేశలేశో హరే !
న్మహత్త్వభినివేశనం కిముత తన్మహిమ్న స్తవ ।
అహో ! విసదృశే జగ త్యవతరద్ధ పార్థాదికం
నిజం జన ముదంచయన్ వరద ! తం సమాశ్లేషకః ॥ 65

ప్రతి :— హే వరద !=ఓ వరదరాజస్వామీ ! ఏకతః= ఒకవస్తువునందు, అభినివేశలేశః=అనురాగలేశము సైతము, వివేకధియమ్ = యుక్తాయుక్తజ్ఞానమును, హరేత్ = హరించును, హి=సత్యము, మహాత్ =అధికమగు, అభినివేశనమ్, తు=అనురాగమన్ననో !, కిముత=ఏమిచెప్పవలెను, తత్ = కనుక, తవ=నీయొక్క. మహిమ్నః=మహిమకు, విసదృశే= అను రూపముకాని, జగతి=లోకమునందు, పార్థాదికమ్=

అర్జునుఁడు మొదలుగాఁగల, జనమ్ = జనమును, నిజమ్= సొంతజనమునుగా, ఉదంచయన్ =సంభావించుచు, తమ్=ఆ జనమును, సమాశ్లేషకః=కౌఁగిలించుకొనువాఁడవై, అవత తర్థ=అవతరించితివి, అహో!=ఆశ్చర్యము.

విశేషములు :— ఏకతః=సార్వవిభక్తిక 'తసిల్' ప్రత్యయము— ఇచ్చట సప్తమ్యర్థమున వచ్చినది. అభినివేశః— ఇద మవశ్యం మయా లబ్ధం భూయా దితి అభిలాషప్రయుక్త ప్రవృత్త్యేకదేశః— అనఁగా ఇది తప్పక నాచేఁ బొందఁబడుఁగాక యను నభిలాషతోఁ బ్రవర్తించుట లేదా— ప్రేమాంధత్వము— వివేకధియమ్— ఇది కూడును ఇది కూడదు అని గమనించుబుద్ధిని. తవ మహిమ్నః విసదృశే జగతి— 'త ద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః దివీవ చక్షు రాతతం తద్విప్రాసో విపన్యవో జాగృవాంస స్సమింధతే విష్ణో ర్య త్పరమం పదమ్'— తే హ నాకం మహిమాన స్సచంతే యత్ర పూర్వే సాధ్యా స్సంతి దేవాః—

శ్లో॥ వైకుంఠే తు పరే లోకే శ్రియా సార్ధం జగత్పతిః ।
ఆస్తే విష్ణు రచింత్యాత్మా భక్తై ర్భాగవతై స్సహ ॥

ఇత్యాదులందుఁ జెప్పఁబడిన నిత్యముక్తులచేత నిత్యసేవనీయ మగు శ్రీవైకుంఠముద్రష్టితో నెంతయో నికృష్టమగు నీ లోకము స్వామికి అననురూప మని నిశ్చితార్థము. పార్థాదికమ్— ఆదిపదగ్రాహ్యులు— అక్రూరుఁడు, మాలాకరుఁడు, విదురుఁడు మున్నగువారు, అహో! విభవావతారములు

సౌశీల్యము నెట్లు సూచించుచున్న వని యాశ్చర్యము. (ఇది. పృథివీవృత్తము).

తా॥ ఓ వరదరాజస్వామీ! ఒక వస్తువునందుఁగల యను రాగ లేశము గూడ యుక్తాయుక్తవివేకమును హరించును, అట్టి విషయములో నధికాశానురాగము విషయము వేఱే చెప్పవలెనా? కనుక నీ మహిమకు అనురూపము గాని యీ లోకమున నర్జునాదులను ఆప్తబంధువులనుగా భావించుచు వారిని గౌఁగిలించుకొన నవతరించితివి. ఏమి నీ సౌశీల్యము? ఆశ్చర్య మాశ్చర్యము.

శా॥ స్వల్పంబేయగు రాగబంధ మిది స
ల్పన్ వచ్చు నికార్యమో!
సల్పన్ రా దనుజ్ఞానమున్ జెఱచునాన్
స్వాత్వేతరం బైనచోఁ
దెల్పంగా వలెనే? జనించి యిటఁ గౌం
తేయాదులన్ భోగిరాట్
తల్పా! బంధులఁ గాఁ దలంచి యిడవే!
త్వద్బాహుసంశ్లేషముల్. 65

అవతారిక :— పైనిఁ జేర్కొనఁబడిన సౌశీల్య మనాశ్రితుల యెడఁ గూడఁ దుల్యమే అని నుడువుచున్నారు.

శ్లో॥ సంశ్లేషే భజతాం త్వరాపరవశః కాలేన సంశోధ్య తా
నానీయ స్వపదే స్వసంగ మకృతం సోఢుం విలంబం బత!।
అజ్ఞామ్యన్ క్షమిణాం వరో వరద! సన్నత్రాఽవతీర్ణో భవేః
కిం న్వాను త్వ మసంశ్రితేషు వితరన్ వేషం వృణీషే తు తాన్॥ 66

ప్రతి :— హే వరద ! = ఓ వరదరాజస్వామీ !, క్షమిణామ్=ఓర్పుగలవారిలో, వరః=శ్రేష్ఠుఁడవగు, త్వమ్=నీవు, భజతామ్=భక్తులయొక్క, సంశ్లేషే = కలిసికొను విషయమున, త్వరా, పరవశః = మిక్కిలి తొందరగలవాఁడవై, తాన్ =ఆ భక్తులను, కాలేన=కాలక్రమమున, సంశోధ్య= దిద్ది (భక్తిజ్ఞాన వైరాగ్యములు గలిగించి) స్వపదే=తన స్థానమగు వైకుంఠమునందు, ఆనీయ = చేర్చుకొని స్వ, సంగమ, కృతమ్=తన కలయికకు జరిగిన, విలంబమ్=జాగును, సోఢుమ్ = సహించుటకు, అక్షామ్యన్ సన్ = ఓర్వనివాఁడవగుచు, అత్ర = ఈ కరిగిరియందు, అవతీర్ణః = అవతరించినవాఁడవు, భవేః=అగుదువుగాక, కింతు = కాని, అసంశ్రితేషు= ఆశ్రితులుకాని వారి విషయమున, వేషమ్=దివ్యవిగ్రహమును, వితరన్ =అనుభవింపఁదగిన దానినిగాఁ జేయుచు, వృణీషే= వరించుచున్నావు, ఇదమ్ = ఇది, కిం నామ = ఏమిటి ? ఈ సౌశీల్యమునకు మేర యున్నదా ? అని భావము.

విశేషములు :— క్షమిణాంవరః— అసహ్యాపరాధసహః= సహింపరాని యపరాధముల సైతము సహించువాఁడు. కాలేన సంశోధ్యతాన్— భగవంతుఁడే సద్గుణములను గలిగించి తన భక్తులను బాగుచేసికొనును— 'ఏష ఏవ సాధు కర్మ కారయతి తం య మేభ్యో లోకేభ్యోన్నినీషతి' (భగవంతుఁ డెవని నూర్ధ్వలోకములకుఁ గొనిపోవఁ దలఁచు చున్నాఁడో వాని చేత సత్కార్మమును జేయించును) 'తేషా మేవానుకంపార్థ

మహ మజ్ఞానజం తమః నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా' ఇట్లు చెప్పినప్రకారము కర్మజ్ఞానములచేత శుద్ధుల నొనర్చి యని భావము. తద్ద్వారా భక్తియుఁ దనంతట నదే సిద్ధించును. 'జన్మాంతరసహస్రేషు తపోజ్ఞానసమాధిభిః నరాణాం క్షీణపాపానాం కృష్ణే భక్తిః ప్రజాయతే' అనీయస్వపదే— 'వైకుంఠేతు పరే లోకే' అని చెప్పఁబడిన తన కసాధారణ మగు వైకుంఠమునకు రప్పించుకొని అత్ర— ఈ లీలావిభూతిలో లేదా— ఈ కరిగిరిశిఖరమున— అవతీర్ణోభవేః— భక్తజన సంశ్లేష త్వరాన్వితుఁడవగు నీకు స్వయముగా నవతరించుట యుచితమే యని భావము. భవేః— విసర్గలేని పాఠము కొన్నిటిలోఁ గలదు. అప్పుడు అత్ర భవే=ఈ సంసారమున (లీలావిభూతిలో) కిం నామత్వమ్— ఈ పాదమున కిది తాత్పర్యము. అసంశ్రితులను గూడ దివ్యవిగ్రహమును దర్శింపఁ జేసి యాకర్షించుచున్నా విది యత్యంతాశ్చర్యకరము. ఆశ్రితులు కాని శిశుపాలాదులయెడ దేవరవారు చూపిన సౌశీల్యమునకు మేర లేదు. (ఇది శార్దూల విక్రీడిత వృత్తము).

తా॥ ఓ వరదరాజస్వామీ ! ఓర్పు గలవారికిఁ దలమానిక మగు నీవు భక్తులఁ గలసికొను విషయమునఁ దొందర గలవాఁడవై కాలక్రమముగా భక్తిజ్ఞాన వైరాగ్యములచేత వారిని శోధించి స్వపదమునకు రప్పించుకొనుటలోని విళంబము సహింపక నీవీ లీలావిభూతిలో ఈ కరిగిరి క్షేత్రమున నవతరించుట నీ భక్తవాత్సల్యమును జాటుచున్నది. అనాశ్రితులను గూడ దివ్యవిగ్రహ దర్శనముచేత స్వీకరించుట నీ నిరవధిక మగు సౌశీల్యమునకు మెఱుఁగు పెట్టుచున్నది. ఈ సౌశీల్యమున కేమి పేరు ?

మ॥ క్షమిమూర్ధన్య! కరీశ! భక్తజన సం
గంబందు నుత్కంఠతోఁ
గ్రమమార్గంబున వారికిన్ సుగుణముల్
గల్గించి నీ దివ్యధా
మము రప్పించుకొనన్ విళంబ మని యి
మ్మైం వచ్చితే? యిందు భో
గ్యము నీరూప మభక్తులన్ సయిత మా
కర్షించుటల్ చిత్రమా. 66

అవతారిక :— భగవంతుఁ డవతారముల నెత్తని యెడల శ్రుతిప్రతిపాదితము లగు ఉపాసనాదులు నిర్విషయంబు లగు నని నుడువు చున్నారు.

శ్లో॥ వరద! యది న భువ్యవాతరిష్యః
శ్రుతివిహితా స్త్వదుపాసనార్చనాద్యాః
కరణ పథవిదూరగే సతి త్వ
య్యవిషయతానికృతాః కిలాభవిష్యన్. 67

ప్రతి :— హే వరద! = ఓవరదరాజస్వామీ!, భువి= భూలోకమునందు, న, అవాతరిష్యః యది=అవతరించనియెడల, త్వయి=(పరవ్యూహాకారుఁడ వగు) నీవు, కరణపథ, విదూరగే, సతి=ఇంద్రియమార్గమునకు మిక్కిలి దూరమందున్న వాఁడవు కాఁగా, శ్రుతివిహితాః= వేదమునందు విధింపఁబడిన, త్వత్,

ఉపాసనా, అర్చన, ఆద్యాః — నీయుపాసన, అర్చనము, మొదలుగాఁగలవి, అవిషయతా, నిర్కృతాః—నిర్విషయము లగుటచేఁ దిరస్కృతములు, అభవిష్యన్ కిల—అయ్యెడివిగదా! (నీవు అవతరించుటవలన నట్లు కాలేదని ఈల్రూజ్ లకారమునకు భావము.)

విశేషములు :— శ్రుతి.........ఆద్యాః— 'ఆత్మా వా రేద్రష్టవ్య శ్శ్రోతవ్యో నిదిధ్యాసితవ్యః— ఇత్యాది వేదవిహితములగు ఉపాసనాదులు, ఆద్యపదముచేతఁ బ్రదక్షిణ నమస్కారాదులు గ్రాహ్యములు కరణపథవిదూరగే- అతిదూరమున నుండుటచేత 'పరవ్యూహాకారము ఇంద్రియగోచరము కాదని భావము. ఇది పుష్పితాగ్రావృత్తము.

తా॥ ఓ వరదరాజస్వామీ ! నీవు భూలోకమున నవతరించని యెడలఁ బరవ్యూహాకారుఁడ వగు నీవు కడుదవ్వైన వైకుంఠ లోకములో నున్నందున నింద్రియ గోచరుఁడవు కావు కాన వేదవిహితములగు నుపాసనార్చనాదులు నిర్విషయములై యసత్యములు కావలసివచ్చును. నీ వవతరించుటచేత వేద విధులు సార్థకము లగుచున్నవి.

గీ॥ ఈవు భూతలి నవతార మెత్తవేని
వరద ! యెట్టులు కరణగోచరుఁడ వగుదు ?
కానిచో వేదవిహితంబులౌ నుపాస
నార్చనాదులు నిర్విషయములు గావె. 67

అవతారిక :— స్వవిషయకాపరాధముల నైనను సహిం తువు కాని స్వాశ్రితులయెడ నపరాధముల సహింపవు అందు చేతనే వారి నుద్ధరింప అవతరింతు వని నుడువు చున్నారు.

శ్లో॥ య దపరాధ సహస్ర మజస్రజం
త్వయి శరణ్య! హిరణ్య ఉపావహత్ ।
వరద! తేన చిరం త్వ మవిక్రియో
వికృతి మర్భకనిర్భజనా దగాః ॥ 68

ప్రతి :— శరణ్య!—శరణు చొచ్చఁదగిన, హేవరద!— ఓ వరదరాజస్వామీ!, హిరణ్యకః=హిరణ్యకశిపుఁడు, త్వయి =నీవిషయమున, అజస్రజమ్=సార్వకాలికమగు, యత్=ఏ, అపరాధసహస్రమ్=అపరాధముల వేయింటిని, (వేలకొలఁది నేరములను) ఉపావహత్=చేసెనో, తేన=దానిచేత, చిరమ్ =చాలకాలము, అవిక్రియః=వికారములేని, త్వమ్ = నీవు, అర్భక, నిర్భజనాత్=పిల్లవాఁడగు ప్రహ్లాదుని తిరస్కారము వలన, వికృతిమ్=వికారమును (చిత్తకాలుష్యమును) అగాః= పొందితివి.

విశేషములు :— అర్భకనిర్భజనాత్- ఐదేండ్ల పసివాఁ డగు ప్రహ్లాదుని స్వభక్తుని దిగ్గజములచేఁ ద్రొక్కించి కొండల నుండి త్రోయించి కష్టపెట్టుట మున్నగువానివలన నని భావము. వికృతిం అగాః=మనోవికారమును బొందితివి. భక్తులు తనకుఁ బ్రాణమువంటివారు 'మమప్రాణా హిపాండవాః' అంతేకాదు- ప్రాణే 'భ్యోఽపి గరీయాంసః' ప్రాణములకంటె నెక్కువవారు

కనుక వారికిఁ జేయు నపరాధముల భగవంతుఁడు సహింపఁడు. భగవంతుని భక్తవాత్సల్య మన న్యాదృశమని దీనిచేఁ దెలియు చున్నది.

తా॥ శరణ్యుఁడ వగు నోవరదరాజస్వామీ! హిరణ్యాకశిపుఁడు దేవరవారి విషయమున సర్వదా లెక్కలేని యపరాధములఁ జేసిననుఁ దాము ఆగ్రహింపలేదు— తమ భక్తుఁడగు బాలుఁడైన ప్రహ్లాదుని విషయమున నపరాధ మొనర్చినంతనే సహింపరైతిరి. మీకు భక్తులయం దెంత వాత్సల్యము!

సీ॥ దంతిగిరిపుణ్య! శ్రీవరదా! శరణ్య!
నీయెడ హిరణ్యకుఁ డొనర్చె వేయితప్పు,
లవి సహించితి వర్భకునంట నోర్వ,
వీశ! నీభక్తవాత్సల్య మెన్న వశమె? 68

అవతారిక :— ఇప్పుడు శ్రీరాముని నిర్హేతుక జాయమాన కృపననుభవించు చున్నారు.

శ్లో॥ త్వా మామనంతి కవయః కరుణామృతాబ్ధే!
జ్ఞానక్రియా భజనలభ్య మలభ్య మన్యైః।
ఏతేషు కేన వరదోత్తరకోసలస్థాః
పూర్వం సదూర్వ మభజంత హి జంతవ స్త్వామ్॥ 69

ప్రతి :— కరుణా, అమృత, అబ్ధే!=దయకుఁ బాలసముద్రమువంటి, వరద!=ఓ వరదరాజస్వామీ!, కవయః=పండితులు, త్వామ్ = నిన్ను, జ్ఞాన, క్రియా, భజన, లభ్యమ్ = జ్ఞాన, కర్మ, భక్తియోగములచేత నందుకొనఁ దగినవానిని

గాను, అన్యైః = ఇతరోపాయములచేత, అలభ్యమ్ = అందు కొనరానివానినిగాను, ఆమనంతి = తలఁచుచున్నారు, పూర్వమ్ = మునుపు (రామావతారములో) ఉత్తరకోసలస్థాః = ఉత్తర కోసల దేశమునందున్న, జంతవః = ప్రాణులు (జీవాత్మలు), ఏతేషు = వీనిలో, కేన = దేనిచేత, సపూర్వమ్ = గతికగడ్డితోఁ గూడ, త్వామ్ = నిన్ను, అభజంత, హి = పొందిరి ?

విశేషములు :— కరుణామృతాబ్ధే— ఈ సంబోధనము సాభిప్రాయకము— ఈ శ్లోకములోని ప్రశ్నకు సమాధాన మీపదమున నిమిడియున్నది. ఈ సంబుద్ధి ఉత్తరకోసల ప్రాణులు తృణములు ముక్తిఁ బొందుట నిర్హేతుక జాయమాన భగవత్కృతచేత నని చెప్పుచున్నది. కవయః— అప్రత్యక్షిత త్వార్థసాక్షాత్కారులగు పరాశరపారాశర్యాది మహా మహులు. జ్ఞాన, క్రియా భజన, లభ్యమ్— జ్ఞానయోగ, కర్మ యోగ, భక్తియోగ ప్రాప్యునిగా— ఇందుకుఁ బ్రమాణములు.

> "కర్మణైవ హి సంసిద్ధి మాస్థితా జనకాదయః"
> "వర్ణాశ్రమాచారవతా పురుషేణ పరః పుమాన్
> విష్ణురారాధ్యతే, పంథా నాన్య స్తత్తోషకారకః ॥
> భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరమ్ ।
> సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి॥
> తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ ।
> దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాంతి తే"

సపూర్వమ్— దూర్వాదులకు సైతము అంతస్సంజ్ఞ యుండును గాన జంతుశబ్ద ముపయోగింపఁ బడినది. అననుష్ఠిత జ్ఞాన

యోగాదులు గల తృణాది జీవులకుఁ గూడ భగవత్ప్రాప్తి నిర్హేతుక కృపవలన నని నిశ్చితార్థము. ఈ శ్లోకము వసంత తిలకవృత్తము.

తా॥ ఓవరదరాజస్వామీ! కరుణావారిధీ! అప్రత్యక్షవిషయములను గూడఁ బ్రత్యక్షముగాఁ జూచు ప్రాంతదర్శులగు పరాశరాదులు నిన్ను జ్ఞానకర్మ భక్తి యోగలభ్యునిగాఁ జెప్పిరి. నీ వితరోపాయ సాధ్యుఁడవుగావు. ఉత్తర కోసల దేశవాసులగు తృణాది జీవరాసులు సైతము నిన్నుఁబొందినవిగదా! యవి పై మూఁడు యోగములలో దేనిచేతఁ బొందినవి ?

ఉ॥ వాకొనుదుర్ కవీంద్రు లభ
వా! యిల జ్ఞానము కర్మభక్తులున్,
నీకడఁ జేర్చుదారు లని
నిక్కము పల్కుమ వీన దేనితో
నో కరుణాంబుధీ! వరద!
యుత్తర కోసల జీవరాశి నీ
లోకముఁ జేరె నాతృణము
లున్ దమవెంట నె మోక్ష మందఁగన్. 69

అవతారిక :— అందఱు నంగీకరించిన కృష్ణావతార సౌలభ్యము ననుసంధించుకొనుచున్నారు.

శ్లో॥ భజత్సు వాత్సల్యవశాత్ సముత్సుకః
ప్రకామ మ ప్రావతరే ర్వరప్రద!
భవే శ్చ తేషాం సులభోఽథ కి న్విదం
య దంగ! దామ్నా నియతః పురాఽరుదః॥ 70

ప్రతి :— అంగ! వరప్రద! = ఓ వరదరాజస్వామీ!, త్వమ్=నీవు, భజత్సు=భక్తుల విషయమున, వాత్సల్యవశాత్ = స్నేహ విశేషబలమువలన, ప్రకామమ్ = మిక్కిలి, సముత్సుకః సన్ = కలసికొనవలయు నను ఉత్సాహము గలవాఁడ వగుచు, అత్ర = ఈ జగత్తునందు, అవతరేః = అవతారము చేయుదువుగాక, తేషామ్=ఆభక్తులకు, సులభః =సులభుఁడవు, (చేతిలోని వాఁడవు) భవేః చ = అగుదువు గాక అథ = అయినచో (అయితే), పురా = పూర్వము (కృష్ణావతారమున) దామ్నా=త్రాటిచేత, నియతః=కట్టఁ బడినవాఁడవై, అరుదః, ఇతి, యత్ =ఏడ్చితి వనుట యేది కలిదో, ఇదమ్=ఇది, కిను=ఏమిటి ?

విశేషములు :—వాత్సల్యావిశేషాత్— వాత్సల్యమనఁగా— దోషేఽపి గుణత్వబుద్ధిః=దోషమందు సైతము గుణమనెడు బుద్ధియని కొందఱు. దోషాదర్శిత్వము— దోషములపై దృష్టి నుంచక పోవుట యని కొందఱును వక్కాణింతురు. భవేశ్చ తేషాం సులభః— వాత్సల్య మున్నందుకు ఫలము సౌలభ్యము గనుక భక్తులకు సులభుఁడవైతివి కనుకనే దామ్నా నియతః పురా— తల్లియగు యశోదచేఁ ద్రాటఁ గట్టఁబడితివి. సౌలభ్య గుణమును ప్రదర్శించుట కట్లు వశ్యుఁడ వైతివిగాని లేకున్న నిన్ను బంధింపఁ గలవారెవరు ? అరుదః— కిన్విదమ్— రోదనము కూడ సౌలభ్యగుణ పరాకాష్ఠయా ? అంగ— ఇది సంబోధ నార్థకమగు అవ్యయము. ఈ శ్లోకము వంశస్థవృత్తము.

తా॥ ఓ వరదరాజస్వామీ! భక్తులపైఁ గల వాత్సల్యాతిశయముచే వారినిఁ గలిసికొను నుత్సాహముతో నీ లీలా విభూతిలో అవతరించి భక్తసులభుఁడ వైతివి. కాని తల్లి త్రాటఁ గట్టఁగా నేడ్చితివి. ఇది యేమిటి? ఇదియు నీసౌలభ్య గుణమునకుఁ బరాకాష్ఠయా? (అవును. కర్తు మకర్తు మన్యథా కర్తుం సమర్థః— 'పరాస్యశక్తిర్వివిధైవ శ్రూయతే—' అన్నట్లు ఏమిచేయుట కైనను శక్తిగల శ్రీకృష్ణుఁడు తల్లి తన్నుఁ గట్టివేయుచుండఁగాఁ దప్పుకొనుటకుఁ గాని ప్రతిక్రియచేయుటకుఁ గాని పూనుకొనక యేడ్చుట యామెకు మిక్కిలి సులభుఁడగుటనే చాటునుగదా!)

చ॥ కరిగిరినాథ! భక్తజన

కాండముపైఁ గల వత్సలత్వ మీ
ధరణికిఁ దెచ్చె యుష్మదవ

తారము లత్తతి నందుపాటుగాఁ
బరఁగుట నీదు భక్తసుల

భత్వము వెల్లడి యయ్యె నన్నియున్
సరె నిను దామబద్ధునిఁగ

సల్ప యశోద యతేల యేడ్చితో? 70

అవతారిక :— 'నృసింహరామ కృష్ణేషు షాడ్గుణ్యాం పరిపూరితమ్' అని చెప్పిన ప్రకారము సర్వావతారశ్రేష్ఠములగు పై అవతారముల మూటియందుఁ గ్రమముగా వాత్సల్య, కృపా, సౌలభ్యాతిశయములఁ బ్రతిపాదించి తిరిగి సింహావలోక

న్యాయమున నృసింహావతారమునందుఁ బరత్వావిష్కరణము సైత మాశ్చర్యావహ మని వర్ణించుచున్నారు.

శ్లో॥ నరసింహతను రగౌణీ
సమసమయసముద్భవ శ్చ భక్తగిరః।
స్తంభేఽపి సంభవ స్తే
పిశునయతి పరేశతాం వరద! 71

ప్రతి :— హే వరద! = ఓవరదరాజస్వామీ! తే = నీయొక్క, అగౌణీ = అప్రాకృతమైన, నరసింహతనుః=నరుని యొక్క సింహముయొక్క మిశ్రమమగు శరీరము. భక్తగిరః= భక్తుఁడగు ప్రహ్లాదుని మాటయొక్క, సమ, సమయ, సము ద్భవఃచ=సమకాలమునందే పుట్టుటయు, స్తంభే= స్తంభము నందు, సంభవః అపి=పుట్టుటయు, పరేశతామ్ = పరాత్ప రత్వమును, పిశునయతి = సూచించుచున్నది.

విశేషములు :— నరసింహతనురగౌణీ—'న తస్య ప్రాకృతా మూర్తిః' అని చెప్పుట వలన శుద్ధసత్వమయ మగు నరసింహ మూర్తియని భావము. స్తంభేఽపి సంభవః— నిషేక పూర్వ కోదరవాసము లేకయే యధికరణమగు స్తంభమునఁ బుట్టుట— పిశునయతి పరేశతామ్— 'త మీశ్వరాణాం పరమం మహే శ్వరం తం దేవతానాం పరమం చ దైవతమ్' 'పతిం విశ్వ స్యాత్మేశ్వరమ్' ఇత్యాదులఁ జెప్పఁబడిన సర్వేశ్వరత్వమును బ్రకాశింపఁ జేయుచున్నదని భావము. సర్వేశ్వరుఁడే కాక కర్మవశ్యుఁడే యగుచో (1) అప్రాకృత విగ్రహపరిగ్రహము

(2) భక్తప్రతిజ్ఞాసమకాలప్రాదుర్భావము (3) స్తంభసముద్భవము. సంభవింపవని సారాంశము. సౌలభ్యములేని పరేశత్వము భక్తభోగ్యముకాదు గనుక 'పరః ఈశః యస్యసః' అను బహువ్రీహిచేతఁ బరతంత్రుఁడని యర్థముఁ జెప్పికొని ప్రహ్లాద పరతంత్రుఁడగుటచే స్వామియందు సౌలభ్యమును సంపాదింతురు. ఈ శ్లోకమార్యావృత్తము.

తా॥ ఓ వరదరాజస్వామీ ! శుద్ధసత్త్వమయ మగు నరసింహమిళిత దివ్యదేహము, భక్తుఁడగు ప్రహ్లాదుఁడు 'స్తంభే దృశ్యతే' అన్న వెంటనే స్తంభమున నావిర్భవించుట నీపరాత్పరత్వమును సూచించు చున్నవి.

గీ॥ శుద్ధసత్త్వమయము నరశోభిసింహ
విగ్రహము భక్తునుడి వెంట వెలయుటయును ॥
స్తంభసంభవమును గరిశైలనాథ !
చెప్పకయ చెప్పు నీపరేశితను వరద ! 71

అవతారిక :— ఈ రీతిగా శ్రియఃపతియు సమస్త కల్యాణ గుణ సంశోభియు, ఆశ్రయణ సౌకర్యావహ దివ్యవిగ్రహ విశిష్టుఁడును, పత్నీపరిజనాది పరివారితుఁడును స్వకీయకృప చేతనే సాధుపరిత్రాణమునకుఁ గృతావతారుఁడు నగు శ్రీ వరదరాజస్వామిని శ్రీమన్నారాయణశబ్ద ముఖ్యవాచ్యునిగా విస్తరించి చెప్పి తదీయచరణముల శరణుచొచ్చఁ దలఁచిన వాఁడై 'అనుజో రావణ స్యాహం తేన చాస్మ్యవమానితః

త్యక్త్వా పుత్త్రాంశ్చ దారాంశ్చ రాఘవం శరణం గతః' అని చెప్పిన ప్రకారము ప్రపత్తిచేయఁబోవు తాను దోషపూర్ణుఁడ నని 18 శ్లోకములతోఁ దెలుపుకొను చున్నారు.

శ్లో॥ తాపత్రయీ మయదవా నలదహ్యమానం
ముహ్యంత మంత మవయంత మనంత! నైవ।
స్థాతుం ప్రయాతు ముపయాతు మనీశ మీశ!
హస్తీశ! దృష్ట్యమృతవృష్టిభి రాభజేథాః॥ 72

ప్రతి :— ఈశ! = స్వామీ!, అనంత = అపరిచ్ఛిన్న స్వరూపా!, హే హస్తీశ = కరిగిరిప్రభూ!, తాపత్రయీ, మయ, దవానల, దహ్యమానమ్=తాపత్రయస్వరూపమగు కార్చిచ్చుచేతఁ గాల్చఁబడుచున్నట్టియు, (కనుకనే) ముహ్యంతమ్ = మూర్ఛను జెందుచున్నట్టియు, అంతమ్ = అవధిని, నైవ, అవయంతమ్ = ఎఱుఁగనట్టియు, స్థాతుమ్=నిలుచుటకు, ప్రయాతుమ్= ప్రయాణమగుటకు, ఉపయాతుమ్=సమీపించుటకును (మఱలుటకును) అనీశమ్=అసమర్థుఁడనగు (మామ్= నన్ను) దృష్టి, అమృత, వృష్టిభిః=కటాక్షామృత వర్షములచేత, ఆభజేథాః=పూర్తిగాఁ దడిపివేయుము.

విశేషములు :— అనంత! = అపరిచ్ఛిన్నమగు స్వరూపము, రూపము, గుణాదికము కలవాఁడా!, తాపత్రయీ...... దహ్యమానమ్'— తాపత్రయీ = ఆధ్యాత్మి, కాధిదైవికాధిభౌతిక తాపములత్రయము.

1. ఆధ్యాత్మికతాపము— ఆధులు- వ్యాధులు-

2. ఆధిదైవికతాపము— శీతవాతోష్ణ వర్షాంబు వైద్యుతాగ్నులవలనఁ గలుగు తాపము.

3 ఆధిభౌతికము— పశుపక్షి మనుష్యాదులవలనను పిశాచోరగ రాక్షసులవలనను సర్పాదులవలనను గలుగు తాపము. ఈ తాపములు దావాగ్నివలెఁ దగులఁ బెట్టుచున్న వని భావము.

దృష్ట్యామృతవృష్టిభిః— శ్రీ వరదరాజస్వామివగు నీవు నీల మేఘమువంటివాఁడవు కానఁ గరుణాకటాక్షామృత వర్షములచేఁ దాపతప్తుఁడనగు నా తాపమంతయుఁ దీఱునట్లు తడిపివేయు మని యాశయము. 'ఏవం సంసృతిచక్రస్థే భ్రామ్యమాణే స్వకర్మభిః జీవే దుఃఖాకులే విష్ణోః కృపా కాఽప్యుపజాయతే' అన్నట్లు స్వామీ! నీ నిర్హేతుక కృపచేత నన్నుఁ గటాక్షింపు మని శ్రీ కూరేశుల వేఁడుకోలు.

తా॥ స్వామీ! అనంతా! ఓ కరిగిరినాథుఁడవగు వరద రాజస్వామీ! తాపత్రయ మను దావాగ్నిచేత దహింపఁ బడుచు మూర్ఛఁ జెందుచు దీని కంతమెప్పుడో కానక నిలుచుటకుఁగాని, సాగుటకుఁగాని, మఱలుటకుఁగాని, యసమర్థుఁడనై యున్న నన్నుఁ దాపములన్నియుఁ దీఱిపోవ నీ కరుణా కటాక్షామృత వర్షముతో ముంచివేయుము.

చ॥ త్రివిధములైన తాపములు
దేహము దగ్ధమొనర్చుచుండెఁ బో!

దవదహనంబులట్ల వర
దా! పొడచూపెడు మూర్ఛ, కానరా
దవధియు, నిల్వ సాగ నుప
యాన మొనర్ప నశక్తునిన్ ననున్
నవజలదాభ! తద్భు కరు
ణారస వాహ సుదృష్టివృష్టులన్. 72

అవతారిక :— స్థాతుం ప్రయాతు ముపయాతు మనీశమ్— అని చెప్పఁబడిన దానినే వివరించుచున్నారు.

శ్లో॥ నానావిరుద్ధ విదిశాసు దిశాసు చాహో
వంధ్యై ర్మనోరథశతై ర్యుగప ద్వికృష్టః ।
త్వత్పాదయో రనుదితస్పృహ ఏష సోఽహం
న స్వస్తి హస్తిగిరినాథ ! నిశామయామి ॥ 73

ప్రతి :— హే హస్తిగిరినాథ!=ఓ కరిగిరిప్రభూ!, వంధ్యైః= వ్యర్థములైన, మనోరథ శతైః=వందలకొలఁది (అవధిలేని) కోరికలచేత, నానా, విరుద్ధ, విదిశాసు=అనేకములగు విరుద్ధములైన మార్గములందును, దిశాసు=వేదవిహిత మార్గములందు, యుగపత్=ఒకేమాఱు, వికృష్టః=దూరముగా లాగఁబడినవాఁడనై, త్వత్, పాదయోః=నీ పాదములందు, అనుదిత, స్పృహః=పుట్టనికోరిక గల, ఏషః, సః, అహమ్=ఈయా నేను (దాసుఁడను) స్వస్తి=శ్రేయస్సును, న, నిశామయామి= కనుఁగొన లేకున్నాను, అహో=ఔరా!

విశేషములు :— మనోరథశతైః— అవధిలేని కోరికల చేత— వంధ్యైః— నిష్ఫలములైన— 'ఉత్పద్యంతే విలీయంతే

దరిద్రాణాం మనోరథాః కుదిశాసు=విపరీత, దిశాసు విపరీత మార్గములందు. ఇచ్చట దిశాశబ్దము లక్షణచేత మార్గమను నర్థమును జెప్పుచున్నది. కునిచేతఁ బ్రాతికూల్యప్రాప్తి చెప్పఁ బడెను. ఆనుకూల్యము లేశమైనను లేదని చెప్పుచున్నారు. త్వత్పాదయో రనుచితస్పృహాః— అనుదానిచే— అద్వేషాభిముఖ్యములు గూడ లేవని భావము. ఇట్టి నాకు నీ దృష్ట్యమృత వృష్టియే గతియని హృద్గతాభిప్రాయము.

తా॥ ఓ కరిగిరీశా! అంతులేని, నిష్ఫలమగు మనోరథములచే నానావిరుద్ధ మార్గములందును విహితమార్గములందు నొకే సారి యిటునటు మారమి లాగఁబడి యుండనుక నీ పాదముల రుచి యెఱుఁగని యీతఁడు శ్రేయస్సు నెట్లు పొందవలెనో! యెఱుఁగకున్నాఁడు నీ నిర్హేతుక కృపయే యితనికి గతి.

ఉ॥ హాస్తిగిరీశ! నిష్ఫలము
లైన మనోరథముల్ కలంచఁగా,
నస్తిమితుండనై పథము
నం దపథంబున సంచరించుచున్
నిస్తులమైన నీ పదము
నే తలపోయను; గల్గు నా కెటుల్
స్వస్తి రమేశ! నీదుకృప
జంకకు మంచ భయంబు నీనిచో. 73

అవతారిక :— నీ పాదారవిందములందు స్పృహలేని నాకు 'హాస్తి! దృష్ట్యమృత వృష్టిభి రాభజేథాః' అని పలుకుటయు నపరాధ మని చెప్పుచున్నారు.

శ్లో॥ హైా నిర్భయోఽస్మ్యవినయోఽస్మి యత స్త్వదంఘ్రౌ
లిప్సా మలబ్ధవతి చేతసి దుర్వినీతే ।
దుష్కర్మవర్మ పరికర్మిత ఏష సోఽహ
మగ్రే వరప్రద ! తవ ప్రలపామి కించిత్ ॥ 74

ప్రతి :— హే వరప్రద ! = ఓ వరదరాజస్వామీ ! దుష్కర్మ, వర్మ, పరికర్మితః = దుష్కర్మ కవచాలంకృతుండ నగు, ఏషః = ఈ, సః = ఆ, అహమ్ = నేను, యతః = ఏ కారణమువలన, దుర్వినీతే = అశిక్షితమగు, చేతసి = మనస్సు, త్వత్, అంఘ్రౌ = నీ పాదమునందు, లిప్సామ్ = వాంఛను, అలబ్ధవతి సతి = పొందనిది కాఁగా, తవ = అంతర్యామి వగు నీయొక్క, అగ్రే = ఎదుట, కించిత్ = కొంచెము, ప్రలపామి = (యుక్తాయుక్త విచారణము లేకుండ) వాఁగుచున్నానో, తతః = అందువలన, నిర్భయః = భయము లేనివాఁడను, అస్మి = అగుచున్నాను, అవినయః అడఁకువ లేనివాఁడను, అస్మి = అగుచున్నాను, హైా = విచారమగుచున్నది.

విశేషములు :— దుష్కర్మవర్మ పరికర్మితః— దుష్కృత్యా చ్ఛాదిత స్వరూపము గలవాఁడ నని భావము. ఏష సోఽహమ్— వర్తమానకాలమునను భూతకాలమునను పాప కారి నగు నేను. దుర్వినీతే— ఆచార్యశిక్ష లేక స్వేచ్ఛగానున్న— హైా— ఇది ఖేదమును దెలుపు నొక యవ్యయము.

తా॥ ఓ వరదరాజస్వామీ ! అశిక్షితమగు నా మనస్సు నీ పాదమున స్పృహ లేనిది కాఁగా దుష్కర్మమను కవచముచే

నలంకృతుఁడనై వర్తమానకాలమున భూతకాలమునను కావలసినన్ని దుష్కృత్యముల నాచరించిన నేను ఇప్పుడు నీ యెదుట నేదో వాఁగుచున్నాను ఎంత నిర్భయుఁడను! ఎంత యవినీతుఁడను! అయ్యో!

ఉ॥ ఏ గురుశిక్ష లేమిఁ జెడి
యీ హృదయంబు భవత్పదాంబురు
డ్యోగము లేక దుష్కృతుల
కొగ్గి శిరంబు సదా యొనర్చుచున్
బ్రోఁగులు చేయుచుంటి నఘ
ముల్ వరదా! యవినీతి నిత్తఱిన్
వాఁగుచునుంటి నీకడ న
వాకు చవాకులు నిర్భయుండనై.

అవతారిక :— 'లిప్సా మలబ్ధవతి చేతసి' అన్నదాని నిట వివరించుచున్నారు.

శ్లో॥ సవ్యాధి రాధి రవితుష్టి రనిష్టభోగః
స్వాభీష్టభంజన మనిష్టకరో నికర్షః ।
కృంతంతి సంతత మిమాని మనో మదీయం
హస్తీశ! న త్వదభిలాషనిధి ప్రహాణిః ॥ 75

ప్రతి :— సవ్యాధిః=వ్యాధితోఁగూడిన, ఆధిః=మనోవ్యధ, అవితుష్టిః=భోగములయందు తృప్తి లేకుండుటయు, అనిష్ట యోగః = ఇష్టములుకానివి ప్రాప్తించుటయు, స్వాభీష్ట, భంజనమ్ ఇష్టప్రాప్తికి విఘాతము గలుగుట, అమర్షకరః=

అసహనమును గలిగించు, నికర్షః=న్యూనత, ఇమాని=ఇవి, సంతతమ్=ఎల్లప్పుడు, మదీయమ్=నా సంబంధమగు, మనః= మనస్సును, కృంతంతి = ఛేదించుచున్నవి, హ స్తీశ !=ఓ కరిగిరి నాథా! త్వత్, అభిలాష, నిధి, ప్రహాణిః=నీ విషయికమగు అభిలాష మనెడు నిధియొక్క వినాశము, న, (కృంతతి)= ఛేదింపదు.

విశేషములు :— సవ్యాధిః— వ్యాధియన శరీరపీడ— దానితోఁ గూడిన ఆధిః— మనోవ్యథ 'పుం స్యాధి ర్మానసీ వ్యథా' (అమరము) అవితుష్టిః— చిరకాల మనుభవింపఁ బడినను భోగములమీఁదఁ దనివి తీఱకుండుట అనిష్టయోగః— అభిమత విషయకవిశ్లేష రూపానిష్టప్రాప్తి. నికర్షః— ధనాదుల చేత వీరు నాకంటె నధికులుగా నున్నారే యను నసూయను గలిగించు తక్కువతనము. త్వ, దభిలాష, నిధి, ప్రహాణిః— భగవద్విషయమున నభిలాషయే యక్షయ ఫలప్రదము గాన అభిలాష నిధిగాఁ జేర్కొనఁబడినది.

తా॥ ఓ వరదరాజస్వామీ! ఆధివ్యాధులు, భోగములం దసంతృప్తి, అనిష్టప్రాప్తి, అభీష్టసిద్ధికి విఘాతము, ధనాదుల చేత వీరు నన్ను మించిరే యను నసూయను గలిగించు న్యూనత యను నియ్యవి నా మనస్సును ఛేదించుచున్నవి. నీ విషయకమగు అభిలాష నిధి పోయెనో యను విచార మెంతమాత్రమును లేదు.

(19)

ఉ॥ ఆధియు, వ్యాధి, భోగముల
యందు నతుష్టి, యనర్థయోగపున్
బాధ, స్వవాంఛితంబునకు
భంగము గల్గుట, సాటివారిలో
శ్రీ ధనకీర్తులన్ గొఱంతఁ
జెందుట, కోసినయట్లు కోయదో
మాధవ! నిన్నుఁ గోరుటను
మానికఫుంగని పోక నా మదిన్. 75

అవతారిక :— ఆనుకూల్యము లేకపోఁగాఁ ప్రాతి కూల్యము గూడ మెండుగా నున్నది. అని నుడువుచున్నారు.

శ్లో॥ విద్వేష, మాన, మద, రాగ, విలోభ, మోహా
ద్యాజానభూమి రహ మత్ర భవే నిమజ్జన్ ।
నిర్ద్వంద్వనిత్యనిరవద్య మహాగుణం త్వాం
హస్తీశ ! కః శ్రయితు మీక్షితు మీప్సితుం వా ॥ 76

ప్రతి :— హే హస్తీశ !=ఓ కరిగిరినాథా !, నిర్ద్వంద్వ != సాటిలేనివాఁడా ! (ద్వంద్వశబ్దము సమానవాచి) 'నిర్ద్వంద్వ' ఇది గుణవిశేషణముగా నైనను చెప్పఁకొనవచ్చును. అప్పుడు_ నిర్ద్వంద్వ, సాటిలేని విద్వేష......భూమిః— విద్వేష= వైరము. మాన = ఆభిజాత్యాది ప్రయుక్తమగు ఉన్నతి, మద = మదము, రాగ = విషయాభిలాషము, విలోభ = లోభిత్వము, మోహ=అజ్ఞానము, ఆది=మొదలుగాఁ గల వానికి, ఆజానభూమిః=పుట్టిల్లై అత్ర=ఇక్కడ, భవే=

సంసారమున, నిమజ్జన్ = మునిఁగిపోవుచున్న, అహమ్ = నేను, నిర్ద్వంద్వ, నిత్య, నిరవద్య, మహాగుణమ్ = సాటి లేనివియు, సదా దోషరహితము లైనవియునగు మహాగుణములు గల, త్వామ్ = నిన్ను, శ్రయితుమ్, వా = ఆశ్రయించుటకుఁగాని, ఈక్షితుం వా = చూచుటకుఁగాని, ఈప్సితుం వా = పొందఁ దలచుటకుఁగాని, కః = ఎవఁడను, (ఎంతవాఁడను- యోగ్యత లేనివాఁడ నని భావము).

విశేషములు :— విద్వేష......భూమిమ్— విద్వేషము = నిర్వ్యాజవైరము, మానము = ఆభిజాత్యప్రయుక్తౌన్నత్యము, మానశ్చిత్త సమున్నతిః— అమరము. మదము = విషయలాభ సంభూతమగు చిత్తవికారము. రాగము విషయప్రాప్త్యభిలాషము. లోభ = లభించినధనమును పాత్రుల కొసఁగుటకుఁ బ్రతిబంధకమగు ధనకాంక్ష. మోహము = కృత్యాకృత్యముల విషయమున మంచిజ్ఞానము లేమి. కః శ్రయితు మీక్షితు మీప్సితుం వా— విద్వేషాదిదోషములకు నిలయమైన నేను హేయప్రత్యనీకనిత్యకల్యాణ గుణాకరుఁడవగు నిన్నుఁ జేరుటకుఁ బొందుటకు దర్శించుటకుఁగాని యధికారిని కానని యాశయము.

తా॥ ఓ కరిగిరినాథా! వైరము, మానము, మదము, రాగము, లోభము, మోహము మున్నగు దుర్గుణములకుఁ బుట్టినిల్లై యీ సంసారమున మునిఁగిపోవుచున్న నేను సాటి లేనివియు నిరవద్యము లైనవియు నగు పెక్కు కల్యాణగుణ

ముల నొప్పు నిన్నుఁ జేరుటకుఁగాని, చూచుటకుఁగాని, పొందఁ దలఁచుటకుఁగాని, యధికారిని గాను.

శా॥ వైరంబున్ మదమానరాగములు లో
భస్ఫూర్తి మోహంబు నాఁ
గా రూపొందిన దుర్గుణాళులకు నే
కాంతస్థలం బౌచు సం
సారాంభోనిధిఁ గ్రుంగు నేను గుణభా
స్వద్రత్న రత్నాకరా
కారున్ నిన్నుఁ గరీశ ! చేరఁగఁ గనం
గాఁ బొందఁగా నెవ్వఁడన్ ? 76

అవతారిక :— అధికారము లేకుండుటనే వివరించు చున్నారు.

శ్లో॥ పుత్త్రాదయః కథ మమీ మయి సంస్థితే స్యు
రి త్యప్రతిక్రియ నిరర్థకచింతనేన ।
దూయే న తు స్వయ మహం భవితా చ కీదృ
గి త్యస్తి హస్తిగిరినాథ ! విమర్శలేశః ॥ 77

ప్రతి :— హే హస్తిగిరినాథ ! = ఓ కరిగిరిప్రభువా !, మయి = నేను, సంస్థితే సతి = మరణింపఁగా, అమీ = ఈ, పుత్త్రాదయః=కుమారులు మొదలుగాఁ గలవారు, కథమ్ = ఎట్లు, స్యుః= ఉందురు ? (జీవింతురు) ఇతి=అని, అప్రతిక్రియ, నిరర్థక, చింతనేన = ప్రతిక్రియలేని, వ్యర్థపుటాలోచనముచేత, దూయే=పరితపించు చున్నాను, తు=కాని, అహమ్=నేను,

స్వయమ్ = స్వయముగా, కీదృక్ = ఎటువంటివాఁడను' భవితాస్మి=కాఁగలనో, ఇతి=అను, విమర్శలేశః=విచార లేశము కూడ న, అస్తి=లేదు.

విశేషములు :— మయి సంస్థితే (సతి) ఇది సతి సప్తమి. నేను (కూరనాథుఁడు) మరణింపఁగా— సంస్థితశబ్దము మృత వాచకము. 'పరాసు, ప్రాప్తపంచత్వ, పరేత, ప్రేత, సంస్థితాః మృతప్రమీతౌ త్రిష్వేతే' అమరము. పుత్రాదయః కథ మమీ— నామరణానంతరము పుత్రాదులే మగుదురో ! యను విచారముచేతఁ బరితప్తుఁడనగు నాకుఁ ఇఁక నేను స్వర్గముఁ జేరుదునా ! నరమున కేఁగుదునా ! మోక్షమందుదునా ! అను విచార లేశ మేని లేదు. ఇట్టినాకు భగవల్లాభాభిలాషకు అధికార మెక్కడిది ? యని భావము.

తా॥ ఓ కరిగిరినాథా ! నేను మరణించినచో నీపుత్రాదు లేమగుదురో ! యెట్లు జీవింతురో ! యను నెన్నఁటికిని దేలని నిరర్థక శుష్కవిచారముతోఁ బరితపింతును గాని యీమీఁద నాకు స్వర్గమా ? నరకమా ? మోక్షమా ? యను విచారము లేశమును లేదు. ఇట్టి నాకు నిన్నభిలషించుట కధికార మెక్కడిది ?

ఉ॥ నే మరణించుమీఁద జన
నీజనకుల్ తనయాదు లక్కటా
ఏ మయిపోదురో ? యనుచు
నెన్నఁడుఁ దేలని వ్యర్థచింతతో

బాములఁ గాంతుఁ, గాంచ నను
భావ్య మింకన్ నిరయంబొ! స్వర్గమో!
యామురవైరిధామమొ! యు
టంచుఁ గరీశ! విమర్శ లేశముల్ 77

అవతారిక :— విషయములందు దోషసమూహమును స్పష్టముగా నవగతము చేసికొన్నవారికి వైరాగ్యమేల కలుగదు? అని శంకించుకొని సమాధానముఁ జెప్పుచున్నారు.

శ్లో॥ శంపాచలం బహుళదుఃఖ మనర్థహేతు
రల్పీయ ఇత్యపి విమృష్టిషు దృష్టదోషమ్ ।
దుర్వాసనాద్రఢిమతః సుఖ మింద్రియోత్థం
హాతుం న మే మతి రలం వరదాధిరాజ! ॥ 78

ప్రతి :— హే వరదాధిరాజ! = ఓ వరదరాజస్వామీ!, మే = నాయొక్క, మతిః = బుద్ధి, దుర్వాసనా, ద్రఢిమతః = విపరీతవాసనాదార్ఢ్యమువలన, శంపాచలం, ఇతి = మెఱుపుఁదీఁగవలెఁ జంచలమనియు బహుళదుఃఖం, ఇతి = ఎక్కువ దుఃఖము గలది యనియు, అనర్థహేతుః, ఇతి = అనర్థములకు మూలమనియు, అల్పీయః ఇతి, అపి = అతి స్వల్పమనియు, విమృష్టిషు = విమర్శలయందు, దృష్టదోషమ్ = కనుఁగొనఁబడిన దోషములు గల, ఇంద్రియోత్థమ్ = ఇంద్రియములవలనఁ గలిగిన, సుఖమ్ = సుఖమును, హాతుమ్ = విడిచిపెట్టుటకు, న, అలమ్ = సమర్థము కాదు.

విశేషములు :— దుర్వాసనాద్రఢిమతః— అనాదికాల పరిశీలనమువలనఁ గలిగిన విపరీతవాసనా బలమువలన నని

భావము. శంపాచలమ్— మెఱపుఁదీఁగెవలె క్షణిక మని యాశయము. 'సంగతాని మృగాక్షీణాం తటిద్విలసితా న్యపి క్షణద్వయం న తిష్ఠన్తి ఘనారబ్ధా న్యపి స్వయమ్॥' (ఘనా రబ్ధములైననుఁ వస్త్రాభరణాది ప్రదానమువలనఁ గూర్చుకొనఁ బడినను— మేఘములనుండి వెలువడినను) మృగాక్షుల చెలుములు, మెఱుపుల తళతళలు, రెండుక్షణములైన నుండవు) అని పూర్వోలసూక్తి. అనర్థహేతుః— ఆభిజాత్యాదులకు హాని, సజ్జనావమానము మున్నగు చెడుగులకు మూలమని తెలియవలెను, అన్యకాంతాసక్త మనస్కునిచేత నొకకవి యిట్లు పల్కించుచున్నాఁడు.

మ॥ 'ధనమా! పోవును, మానమా! చెడును, నిం
దా! నెత్తిపై కెక్కు, లో
కనుమానింతురు తల్లిదండ్రులు, కులం
బా! వన్నెకుందక్కు, నూ
తనమాంద్యమ్ము ఘటిల్లు బంధుగులు పం
తం బొప్ప నిందింతు, రో
మనమా! వద్దిఁక నాదుమాట వినుమా!
మర్యాదఁ గాపాడుమా!'

సుఖ మింద్రియోత్థమ్=విషయేంద్రియ జన్యమగు సుఖము (తుచ్ఛమని యభిప్రాయము) ఇన్ని దోషములకు మూలమని తెలిసియు విషయభోగాభిలాషను వీడకుండుట దుర్వాసనా దార్ఢ్యమును ధ్రువపఱుచు చున్నది.

తా॥ ఓ వరదరాజస్వామీ! ఇంద్రియజన్యమగు వైషయిక సుఖము మెఱుపుఁ దీఁగెవలె క్షణికమనియు, దుఃఖనిలయమనియు, అనర్థహేతు వనియు, నత్యల్పమనియు, ఎన్నో దోషములు దీనఁగలవని విమర్శలవలనఁ దెలిసియు నాబుద్ధి దుర్వాసనాబలముచేత వీడలేక యున్నది.

చ॥ నెల వగు దుఃఖసంతతికి,
నిత్యనివాస మనర్థకోటికిన్,
జలదములోని మెఱ్ఱువలెఁ
జంచల, మల్ప మటంచు దోషముల్
తెలిసియు వారణాచలప
తీ! విడ నాడదు దుష్టవాసనా
బలమున నాదుబుద్ధి నిర
పత్రప యింద్రియజన్య సౌఖ్యమున్.

అవతారికె :— విషయసుఖాభిలాషమాత్ర ప్రవృత్తుఁడనే కాను- మఱేమనఁగా- కరణత్రయముచేతను పరిచితపూర్వము లగు వివిధాపరాధముల నొనర్చుచున్నానని చెప్పుకొనుచున్నారు.

శ్లో॥ బుద్ధ్వా చ నో చ విహితా కరణై ర్నిషిద్ధ
సంసేవనై స్త్వదపచారశతై రసహ్యైః।
భక్తాగసా మపి శతై ర్భవతాఽప్యగణ్యై
ర్హస్తీశ! వాక్తనుమనోజనితై ర్హతోఽస్మి॥ 79

ప్రతి :— హే హస్తీశ! = ఓ కరిగిరినాథా!, బుద్ధ్వా, చ = తెలిసియు, నోబుద్ధ్వాచ = తెలియకయు, వాక్, తను,

మనః, జనితైః=వాక్కువలనను, శరీరమువలనను, మనస్సు వలనను, బుట్టినట్టియు, భవతా, అపి=(సర్వజ్ఞుఁడ వగు) నీచేతఁ గూడ, అగణ్యైః=లెక్కపెట్ట శక్యముగానట్టియు, విహిత, అకరణైః=వేదవిహితములగు వానిని చేయక పోవుటలచేతను, నిషిద్ధ, సంసేవనైః = నిషిద్ధకర్మలను చక్కఁగాఁ జేయుటల చేతను, త్వత్, అపచారశతైః=నీ విషయమునఁ జేయఁబడు వందలకొలఁది అపచారములచేతను (తప్పిదములు) అసహ్యైః =సహింపరాని, భక్త, ఆగసామ్ = భక్తుల విషయమునఁ జేయఁబడు అపరాధములయొక్క, శతైః అపి=వందలచేతను, హతః = స్వరూపనాశమును జెందినవాఁడను, అస్మి=అగు చున్నాను.

విశేషములు :— విహితాకరణైః = 'శ్రుతిస్మృతీ మమైవాజ్ఞే'అన్నట్లు తమ యాజ్ఞారూపములగు వేదవిహితములైన 'సత్యంవద, ధర్మంచర, అహరహ స్సంధ్యా ముపాసీత ఇత్యాది విధులను మానుటచేత, భగవదాజ్ఞోల్లంఘన మొనర్చి నట్లగు నని భావము. నిషిద్ధసంసేవనైః— 'న కలంజం భక్షయేత్,— న సురాం పిబేత్,— నానృతం వదేత్,— న పరదారాన్ గచ్ఛేత్'— ఇత్యాది వేదనిషిద్ధముల నాచరించుటలచేత— మహాపాప ముదయించునని యాశయము. త్వ దపచారశతైః— కంసశిశుపాలాదులవలె భగవద్వైభవాదుల నోర్వలేమి మున్నుగాఁగల భగవదపచార శతములచేత— 'భక్తాగసా మపి శతైః'— ప్రహ్లాదునియెడ హిరణ్యకశిపుఁడు, జానకియెడల

రావణుఁడు, చేసిన యపచారములవంటి అసహ్యములు (సహింపరానివి) అగు భాగవతాపచారములచేత నని యాశయము. హతోఽస్మి— నా స్వరూపసత్తయు నష్టప్రాయ మైనది యని భావము.

తా॥ ఓ వరదరాజస్వామీ! తెలిసియో! తెలికయో! మనోవాక్కాయములచేఁ జేయఁబడు విహిత కర్మలను మానుటల చేతను, నిషిద్ధకర్మల నాచరించుటలచేత నీయెడలఁ జేయు నపచారశతంబులచేతను, సర్వజ్ఞుఁడ వగు నీకును లెక్కింపరానివియు, సహింపరానివియు నగు భాగవతాపచార శతముల చేతను నేను స్వరూపనాశనముఁ జెందితిని. ఇఁక నాకు గతి యేమి?

చ॥ కరిగిరినాథ! వాఙ్మనస
కాయము లూఁతగఁ గొం చెఱింగియో?
యెఱుఁగకొ! మానితిన్ విధుల
నెన్నొ! నిషిద్ధము లాచరించితిన్,
సరవి నొనర్చినాఁడ నప
చార శతంబుల నీయెడన్ భవ
చ్ఛరణ సమాశ్రితాళియెడ
సైపఁగ రానివి హా! వినష్టుఁడన్. 79

అవతారిక :— ఇట్లు తమ దోషసముదాయము ననుసంధించుకొని యట్టి నాకును భగవానుఁడు నిర్హేతుక కృపచేతనే 'దాసభూతాః స్వత స్సర్వే హ్యాత్మానః పరమాత్మనః నాన్యథా

లక్షణం తేషాం బంధే మోక్షే తథైవ చ' అని చెప్పఁబడిన స్వరూప రూపసత్తారూపదాస్య రసజ్ఞానము నొసంగె నని చెప్పకొను చున్నారు.

శ్లో॥ త్వద్దాస్య మస్య హి మమ స్వరసప్రసక్తం
త చ్చోరయ న్నయ మహం కిల చష్టలం ప్రాక్
త్వం మామకీన ఇతి మా మభిమన్యసే స్మ
హ స్తీశ ! సంశమయ న స్త మిమం వివాదమ్ ॥ 80

ప్రతి :— హే హస్తీశ !=ఓ కరిగిరినాథా !, అస్య = ఈ, మమ = నాకు, (పూర్వోక్తదోషరాశివిశిష్టుఁడ నగు నాకు) త్వాత్, దాస్యమ్= దేవరవారి దాస్యము, స్వరస ప్రసక్తమ్= స్వారసిక మైనది (స్వతస్సిద్ధ మైనది) హి=సత్యము. అయమ్= ఈ, అహమ్= నేను, ప్రాక్ =పూర్వము, తత్ = ఆదాస్యమును, చోరయన్ = అపహరించుచు, చష్టలం కిల = తొట్రుపడితిని (జాఱిపోయితిని) (నను = ఓయీ) త్వమ్=నీవు, మామకీనః ఇతి=నావాఁడవు (నాదాసుఁడవు) అని, అభిమన్యసే స్మ = అభిమానించితివి, నః=మనయొక్క, తమ్=ఆ, ఇమమ్=ఈ, వివాదమ్=తగాదాను, సంశమయ = మఱల మొలకెత్తకుండ శమింపఁజేయుము.

విశేషములు :— తత్ — చోరయన్ — ఆ భగవద్దాస్యమును అపహరించుచు- జీవస్వరూప నిరూపకమగు భగవద్దాస్యము నపహరించుట యాత్మాపహార మనఁబడుచౌర్యము. ఇది ధనకనకాద్యపహరణము కంటెను గొప్పది. దీనికిఁ బరిహారము లేదు.

'యోఽన్యథా సంత మాత్మాన మన్యథాప్రతిపద్యతే ।
కిం తేన న కృతం పాపం చోరే ణాత్మాపహారిణా ॥'
(మహాభారతము)

చస్థలం ప్రాక్— పూర్వము భగవద్దాసుఁడఁగా నను కొని స్వరూపజ్ఞానమునుండి యిప్పుడు జాఱిపోయితిని. సంశమయ న స్త మిమం వివాదమ్— మనకున్న 'త్వంమే హం మే'— అను నీ వివాదమును మఱల మొలకెత్తకుండ నిర్మూలింపుము.

తా॥ ఓ వరదరాజస్వామీ! పూర్వోక్తదోషరాశి విశిష్టుఁడ నగు నాకు దేవరవారి దాస్యము స్వతస్సిద్ధమైనది. ఈ నేను పూర్వ మాదాస్యమును చోరునివలె హరించి (కాదని) జాఱు కొంటిని దేవరవారు 'నీవు నావాఁడ వని మఱల నభిమానముఁ జూపితిరి. స్వామీ! మఱల మన యీ వివాదము తలయెత్త కుండ నిర్మూల మొనర్పఁ బ్రార్థన మొనర్తును.

ఉ॥ స్వారసికంబు నాకుఁ గరి
శైలవిహార వినోద! త్వత్పదాం
భోరుహదాస్య, మామణిని
మున్ను హరించి తొలంగిపోయితిన్,
జోరునటుల్, నను న్గరుణఁ
జూచి మదీయుఁడ వీవటంచు స్వీ
కార మొనర్చి తీతగ విఁ
కన్ మన కిద్దఱకున్ శమించుతన్.

అవతారిక :— దాస్యరసమును జ్ఞప్తి చేసిన తరువాత నాకు వేఱొకప్రయోజనము లేదని స్వామితో మనవి చేసికొను చున్నారు.

శ్లో॥ భోగా ఇమే విధిశివాదిపదం చ కించ
స్వాత్మానుభూతి రితి యా కిల ముక్తి రుక్తా ।
సర్వం త దూషజలజోష మహం జుషేయ
హస్త్యద్రినాథ ! తవ దాస్య మహారసజ్ఞః ॥ 81

ప్రతి :— హే హస్త్యద్రినాథ != ఓకరిగిరి మహాప్రభూ !, తవ=నీయొక్క, దాస్య, మహారసజ్ఞః = దాస్యములోని మహారుచి నెఱింగిన, అహమ్= నేను, (యే) ఇమేభోగాః = పరిదృశ్యమానము లగు శబ్దాదివిషయానుభవము లేవిగలవో, యత్ = ఏ, విధి, శివ, ఆది, పదంచ=బ్రహ్మరుద్రాదులపదవి కలదో, కించ = మఱియు, స్వాత్మ, అను భూతిః ఇతి = స్వాత్మానుభవ మనెడు, యా=ఏ, ముక్తిః= మోక్షము, (కైవల్యమోక్షము) ఉక్తా, కిల= చెప్పఁబడెనో, తత్, సర్వమ్ =దాని నంతయు, ఊషజలజోషమ్ = ఊషరక్షేత్రములోని నీటితో సమానమునుగా, (నిస్సారమునుగా) జుషేయ = సేవింతునుగాక.

విశేషములు :— దాస్యమహారసజ్ఞ—దాస్యమహారసమును జవిచూచిన వాఁడను. భోగా ఇమే— ఐహికాముష్మిక భోగములు. విధిశివాదిపదమ్— ఆదిపదముచేత నింద్రాదులు గ్రహింపఁబడుదురు. బ్రహ్మరుద్రేంద్ర పదవులని తాత్పర్యము.

ఊషజలజోషమ్— ఊషరజలతుల్యమ్— చవుటి నేలలోని నీటిని బోలె- ఉప్పునిదానినిగా— నిస్సారమైన దానినిగానని భావము. నీ దాస్యమహారసముముందు ఐహికాముష్మిక భోగములుగాని, బ్రహ్మరుద్రాదిపదవులుగాని, కైవల్యముక్తిగాని, యత్యల్పములు. చప్పనివని సారము. వసంతతిలక వృత్తదశకము ముగిసినది.

తా॥ ఓ వరదరాజస్వామీ! దేవర వారి దాస్యమహారసమును చవిచూచిన నేను ఐహికాముష్మిక భోగములను బ్రహ్మరుద్రేంద్రాది పదవులను కైవల్యముక్తిని చవుటినేల లోని నీటినివలె ననుభవింతును. (నిస్సారములనుగాఁ జూతును)

చ॥ ధనకనకాది వస్తుసము
దాయము నందనభూమి నప్సరోం
గనలను గూడు, టబ్జభవ
కంతువిరోధి సురేంద్రపట్టముల్
గొనుటలు, స్వాత్మభోగ మను
కొంచెపుముక్తిఁ గరీశ! యూషరా
వనిజల మట్లు యెంతును భ
వత్పదదాస్య మహారసజ్ఞతన్. 81

అవతారిక :— ఇట్లు భగవద్దాస్య మహారసజ్ఞులగు శ్రీ వత్సాంకమిశ్రులు భగవత్ప్రాప్తికై మంత్రరత్నోక్త ప్రకారముగా శ్లోకద్వయముచే శరణు చొచ్చుచున్నారు.

శ్లో॥ విషయ విషధరవ్రజవ్యాకులే
జననమరణ నక్రచక్రాస్పదే ।
అగతి రశరణో భవాబ్ధా లుఠన్
వరద! శరణ మి త్యహం త్వాం వృణే ॥ 82

ప్రతి :— వరద!=ఓ వరదరాజస్వామీ! విషయ, విష ధర, వ్రజ, వ్యాకులే=శబ్దాది విషయములనెడు సర్పముల గుంపులతోఁ గ్రిక్కిఱిసినట్టియు, జనన, మరణ, నక్ర, చక్ర, ఆస్పదే = పుట్టుకచావు లనెడు మొసళ్ళగుంపులకు నెలవై నట్టియు, భవాబ్ధా=సంసారసాగరమున, లుఠన్ = పొర్లుచు, (తిరుగుచు) అశరణః=ఉపాయాంతరశూన్యుఁడను, అగతిః= గత్యంతర శూన్యుఁడను (అగు) అహమ్ = నేను, త్వామ్ = నిన్ను, శరణమ్, ఇతి = రక్షకుఁడ వని, వృణే=వరించు చున్నాను.

విశేషములు :— విషయవిషధర...— విషయములందును విషధరము లందును ( పాములందును ) రెండిటియందును విషము కలదు- పాములలోని విషము సేవించిననే ప్రాణములఁ దీయును, విషయములలోని విషము స్మరించినవానికిఁ గూడఁ బ్రమాదము గలిగించును. ఒక బాటసారి దూరమున నున్న భార్యను స్మరించుకొని బాధపడి పాణిని మునిని దూఱెను యీ శ్లోకము నారయుఁడు.

‘నపుంసక మితి జ్ఞాత్వా ప్రియాయై ప్రేషితం మనః
త త్తు తత్రైవ రమతే హతాః పాణినినా వయమ్ ॥’

(మనశ్శబ్దము నపుంసకలింగ మని తెలియవలెను) భవాబ్ధౌ— సంసార మగాధ మపరిచ్ఛిన్నము గాన సముద్రముగాఁ జెప్పఁబడినది. అంతేకాదు. సముద్రమున— సర్పములు నక్రములు గలవు సంసారమున— విషయభోగములు జననమరణములు గలవు. త్వామ్— ఆశ్రయణమునకుఁ సౌకర్యాపాదకములగు శ్రియఃపతిత్వము, సౌశీల్యము, సౌలభ్యము, వాత్సల్యము, మున్నగు గుణములతోను, ఆశ్రితుల కార్యములను నెఱవేర్చుటకుఁ గావలసిన కాంతి, జ్ఞాన, శక్తి, స్వామిత్వాదులతోను గూడిన దేవరవారి నని తాత్పర్యము. శరణ మితి వృణే— శరణ మని ప్రేమతో స్వీకరించుచున్నాను. శరణం (భవ) ఇతి వృణే=రక్షకుఁడవు కమ్మని అనురక్తితోఁ గోరుచున్నాను.

తా॥ ఓ వరదరాజస్వామీ! విషయము లనెడు సర్ప సమూహములతో నిండినదియు, జననమరణము లనెడు మొసళ్ళ గుంపులకు నెలవైనదియు, నగు సంసారసముద్రములోఁ బరిభ్రమించుచు నుపాయాంతర శూన్యుఁడను గత్యంతర శూన్యుఁడనగు నేను నిన్ను శరణమునుగా వరించుచున్నాను.

గీ॥ విషయ విషధరగణ సమన్వితము జనన
మరణ నక్రాకులమ్ము సంసరణవార్ధి
దొరలుచున్ వేఱే గతియును శరణు లేని
నేను శరణంబుఁ గోరితి నిన్ను వరద! 82

అవతారిక :— పూర్వశ్లోకమున శ్రియఃపతిత్వాది సకల కల్యాణగుణ విశిష్టునకే సిద్ధోపాయతాఽధ్యవసాయమును బ్రతిపాదించి యిప్పుడు నిర్హేతుక కృపామాత్ర విశిష్టునకే సిద్ధోపాయత్వమును నిశ్చయించుచున్నారు.

శ్లో॥ అకృతసుకృతకః సుదుష్కృతకృత్తరః
శుభగుణ లవలేశ దేశాతిగః ।
అశుభగుణ పరస్సహస్రావృతో
వరద మురుదయం గతిం త్వాం వృణే ॥ 83

ప్రతి :— అకృతసుకృతకః = చేయఁబడని పుణ్యము కలవాఁడను, సుదుష్కృత్తరః = బాగుగాఁ బాపము లొనర్చినవారిలో మిక్కిలి గొప్పవాఁడను, (కనుకనే) శుభగుణ, లవలేశ, దేశ, అతిగః = మంగళగుణములగు సాత్వికత్వము, ఆస్తికత్వము మున్నగు గుణములయొక్క లవలేశము (స్వల్ప భాగము) కల దేశము నతిక్రమించినవాఁడను, అశుభగుణ, పరస్సహస్ర, ఆవృతః = వేలసంఖ్యను మించిన యమంగళకరము లగు గుణములతో నావరింపఁబడినవాఁడను, అగు, (అహమ్= నేను) ఉరుదయమ్ = గొప్ప దయగలవాఁడవు గనుకనే, వరదమ్=వరదుఁడవను సార్థకనామము గల, త్వామ్=నిన్ను, గతిమ్=శరణమునుగా, వృణే=వరించుచున్నాను.

విశేషములు :— అకృత సుకృతకః— అల్పం సుకృతం సుకృతకమ్— అల్పార్థమున 'క' ప్రత్యయము. అకృతం,

సుకృతకం యేనసః— అను విగ్రహముచేత కొంచెము పుణ్య మైనను జేయనివాఁ డనెడి యర్థము వచ్చును. శుభగుణ లవలేశ దేశాతిగః— సాత్వికత, ఆస్తిక్యము మున్నగు గుణ ములు స్వల్పముగా నున్న దేశమున నివసించినను కొన్ని మంచిగుణములు కలుగును. అట్టి దేశమునకుఁ గూడ దూర మున నుంటినని విచారము. శుభగుణయుత దేశవాసులకుఁ గలుగు ఫలము లేవనఁగా— 'య త్రాష్టాక్షరసంసిద్ధో మహా భాగో మహీయతే । న తత్ర సంచరిష్యంతి వ్యాధిదుర్భిక్షత స్కరాః' ఉరుదయమ్— నిరవధిక, కృపానిధివి గనుకనే- వరదమ్— సకలజనులకు సకలవరప్రదుఁడవై కరిగిరిశిఖరమున వేంచేసియున్న గతిం త్వాం వృణే— అనిష్టములను నివర్తింపఁ జేయుచు ఇష్టములను జేకూర్చు నుపాయమునుగా నిన్ను నిశ్చయించుకొంటిని. 'వధార్హ మపి కాకుత్స్థః కృపయా పర్యపాలయత్' ప్రబలతరాపరాధ మొనర్చిన కాకాసుర రక్షా విషయమునఁ గేవల కృపయే హేతు వయ్యెను. అట్లే కామక్రోధాద్య శుభగుణసహస్ర యుతుఁడనగు నా యందును గృపఁజూపుఁడని కవి యాశయము. అందుచేతనే ఉరుదయమ్— అను విశేషణము శ్రీ వరదరాజస్వామివారికి వేసిరి. విషయవిషధర శ్లో-82, అకృత సుకృతకః శ్లో-83 ఈ శ్లోకద్వయమున 'ఆనుకూల్యస్య సంకల్పః ప్రాతికూల్యస్య వర్జనమ్ । రక్షిష్యతీతి విశ్వాసో గోప్తృత్వవరణం తథా ఆత్మనిక్షేప కార్పణ్యే షడ్విధా శరణాగతిః' అని చెప్పఁబడిన

యాఱింటిలోను గోప్తృత్వవరణమే శరణాగతి యని చెప్పఁబడినట్లయ్యెను. కొందఱు ఆత్మనిక్షేపమే శరణాగతి యందురు. కాని యది ప్రవాదమాత్రమే. ఏలయన ? భగవద్భాష్యకారుల సన్నిధానమున సకల రహస్యతత్త్వార్థముల నవగత మొనర్చుకొన్న శ్రీ శ్రీవత్సాంక మిశ్రులు స్తవములో ద్విరుక్తముగా గోప్తృత్వవరణమునే ముఖ్య శరణాగతిగాఁ బేర్కొనిరిగదా !

తా॥ సుకృతము నొక్కింతయుఁ జేయక, దుష్కృతముల నొనర్చు వారి కగ్రగణ్యుఁడనై సాత్త్వికతాస్తిక్యాది శుభగుణములు కొలఁదిగాఁ గల దేశమందైనను నివసింపక కామ క్రోధాది దుర్గుణముల కనేకసహస్రముల కాటపట్టైన నేను మహాపరాధి యగు కాకాసురునిసైతము కాచిన కరుణానిధి యగు శ్రీ వరదరాజస్వామిని అనిష్టముల నివారించి, యిష్టములఁ గూర్పు నుపాయమునుగా వరించు చున్నాను.

శా॥ కొంచెంబేనియుఁ బుణ్యమున్ సలుప, న
  గ్ర్యుండన్ మహాపాప కృ
త్ప్రంచాస్యంబులయందు, మేల్గొనము ల
  ల్పంబున్న దేశాన నేన్
గాంచన్ వాసము వైరిమట్కమున కా
  గారమ్మ నా నేన్, గృపో
దంచన్మూర్తిని నిన్ను శ్రీ వరదు ది
  క్కంచున్ వరింతున్ బ్రభూ ! 83

అవతారిక :— వరద మురుదయమ్— అను దానిచే దయాళువే ఫలప్రదుఁడని చెప్పఁబడినది. 'భవాబ్ధా లుఠన్' అను దానిచేతఁ దాను దయనీయుఁడననియుఁ బ్రతిపాదింపఁ బడినది. దయావరణము సైతము బుద్ధిపూర్వకము గాదు గనుక నితఁడు కేవలము దయఁ జూపఁ దగినవాఁడే అని చెప్పినచోఁ దన కార్యము సుకర మగునని యీ శ్లోకమునఁ జెప్పుచున్నారు.

శ్లో॥ శరణవరణవా గియం మోదితా
న భవతి బత! సాఽపి ధీపూర్వికా ।
ఇతి యది దయనీయతా మయ్యహో!
వరద! తవ భవేత్ తతః ప్రాణిమి ॥ 84

ప్రతి:— హే వరద! = ఓ వరదరాజస్వామీ!, ఇయమ్ = ఈ, శరణవరణవాక్ = శరణమును వరించువాక్కు, యా = ఏది, ఉదితా = పలుకఁబడినదో, సా, అపి = అదియు, ధీ పూర్వికా = బుద్ధిపూర్వకమైనది, న, భవతి = కాదు, బత ! = అయ్యో !, ఇతి = అని, తవ = దేవరవారికి, మయి = నా విషయమున, దయనీయతా = దయనీయుఁడను బుద్ధి, భవేత్, యది = అగునేని, తతః = తరువాత, ప్రాణిమి = జీవించుచున్నాను, అహో ! = ఆహా ! నీ దయ ఆశ్చర్యకరమైనది.

విశేషములు :— శరణవరణవా గియం— న భవతి బత! సాఽపి ధీ పూర్వికా— బుద్ధిపూర్వకముగాఁ జేయఁబడిన శరణాగతి యదియే యుపాయమగును గాన భగవన్నిర్హేతుక

కృపకుఁ దానుపాత్రము కానేమో! యని యందు కొఱకు శరణవరణవాక్కు హృదయపూర్వకము కాదనుచున్నారు. ఇఁక నీ దాసునకు గతి దేవరవారి నిర్హేతుక కృపయే యని భావము. ఇతి– బుద్ధిపూర్వకము గాని శరణవరణవాక్కు నా విషయమున విఫలమైనది కనుక తతః– తరువాత (లేదా– అందువలన) ప్రాణిమి = జీవింపఁగలను, భవిష్యదర్థమున వచ్చిన వర్తమానకాలము.

తా॥ ఓ వరదరాజస్వామీ! నానోట వెలువడిన శరణాగతి వాక్కు బుద్ధిపూర్వకము గాదు. కనుక నిది యితని కుపాయము కాఁజాలదని నన్ను దయనీయునిగా భావించితివేని నీ నిర్హేతుక కృప నాకు రక్షకమగును గాన నేను జీవింపఁగలను.

గీ॥ వరదరాజప్రభూ! నిన్ను శర ణటన్న
వాక్కు హృదయోక్తి కాదుపో! పాపమనుచుఁ
దలఁచి నీ కృపకుం బాత్రతను ఘటింతు
వేని జీవింతుఁ గరిగిరిసానులోల! 84

అవతారిక :— 'కృతే పాపేఽనుతాపో వై యస్య పుంసః ప్రజాయతే । ప్రాయశ్చిత్తం తు తస్యైకం హరిసంస్మరణం పరమ్' అని చెప్పినప్రకారము పశ్చాత్తాపము కూడ భగవద్దయ కున్మేషకము గాన నట్టి పశ్చాత్తాపము సైతము నాకు లేనందున దయనీయుఁడఁగా నని విచారపడుచున్నారు.

శ్లో॥ నిరవధిషు కృతేషు చాగ స్స్వహో !
మతి రనుశయనీ యది స్యా త్తతః ।
వరద ! హి దయసే న సంశేమహే
నిరనుశయధియో హతా హై వయమ్ ॥ 85

ప్రతి :— హే వరద !=ఓ వరదరాజస్వామీ ! కృతేషు= చేయఁబడిన, నిరవధిషు = ఎల్లలులేని (అసంఖ్యాతములగు) ఆగస్సు, చ = అపరాధముల విషయమున, అనుశయినీ= పశ్చాత్తాపముగల, మతిః=బుద్ధి, స్యాత్ యది=అగునేని, తతః=అందువలన, దయసే=దయదలఁచు చున్నావు, హి= సత్యము, న సంశేమహే=సందేహింపము, నిరనుశయధియః= అనుతాపము లేని బుద్ధిగల, వయమ్=మేము, హతాః= చెడిపోతిమి, హై !=అయ్యో !

విశేషములు :— ఆగస్సు— అకార్యకరణాది అపరాధ ముల విషయమున, న సంశేమహే— దుష్కృతము లొనర్పఁ బడినను పశ్చాత్తాపమును జెందినచో అనుతప్తులు 'పాపే కృతే యది భవంతి భయానుతాప లజ్జాః పునః కరణ మస్య కథం ఘటేత' అన్నట్లు మఱల నట్టి యపరాధ మొనర్పరు. ఇది భగవత్కృప కున్మేషక మగు ననుటలో మాకు సంశయము లేదని భావము. కాని నిరనుశయధియః— ఆయను తాపమే మా బుద్ధిలో లేదు. అందుచేత హతాః— పాప హతుల మగుచున్నాము.

తా॥ ఓ వరదరాజస్వామీ ! కృత్యాకరణా కృత్యకరణా ద్యపరాధముల నిరవధికముగాఁ జేసినను బశ్చాత్తప్తుఁ

తైనచో వానిని నీవు దయదలఁచెదవు. ఈ విషయమున సందేహము లేదు. మా బుద్ధి యనుతప్తము కాలేదు కనుక మేము పాపహతుల మగుచున్నాము.

గీ॥ ఎన్నితప్పులు సేసిన నెదఁ దపించు
నేని దయఁ దలఁచెదవుపో ! వాని నీవు
సంశయము లేదు మతి ననుశయము లేమి
హతుల మైతిమి శ్రీకరిక్షితిధరేశ ! 85

అవతారిక :— ఎడతెగకుండ నపరాధముల నొనర్చియు ననుతాప మే మాత్రములేని నా నోట వెలువడిన శరణాగత వాణిని సాకు చేసికొని నన్ను దయదలఁచు మని నుడువు చున్నారు.

శ్లో॥ శరణవరణవా గియం యాఽద్య మే
వరద ! తదధికం న కించి న్మమ ।
సులభ మభిమతార్థదం సాధనం
త దయ మవసరో దయాయా స్తవ ॥ 86

ప్రతి :— హే వరద ! = ఓ వరదరాజస్వామీ ! అద్య= ఇప్పుడు, మే=నాకు, యా=ఏ, ఇయమ్=ఈ, శరణవరణ వాక్=శరణాగతివాక్కు, (అభూత్=ఉండెనో) తదధికమ్= దానికంటె నుత్కృష్టమగు, సులభమ్=సుకరమగు, అభిమత, అర్థదమ్=ఇష్టమగు నీ దాస్యమును ప్రసాదించు, కించిత్= ఒకానొక, సాధనమ్=సాధనము, మమ=నాకు, న=లేదు,

తత్ = కనుక, అయమ్ = ఇది, తవ = నీయొక్క, దయాయాః = దయకు, అవసరః = సమయము.

విశేషములు :— త దయ మవసరో దయాయా స్తవ— ఇదియే నీ దయకు సమయము. నా శరణవరణ వాణీ ప్రాదుర్భవకాలమే దేవరవారి దయా ప్రాదుర్భావ సమయము. ఉపాయాంతర ప్రసక్తి యెంతమాత్రమును లేని నా శరణాగతి వాణిని వ్యాజ మొనర్చుకొని నీ నిర్హేతుక కృపను జూపుము. అని యాశయము.

తా॥ ఓ వరదరాజస్వామీ ! నా నోటవచ్చిన శరణాగతి వాక్కు కంటె నధికమును సులభమును వాంఛితార్థప్రదము నగు మఱియొకసాధన మేదియు నా యొద్ద లేదు. కనుక నీ దయ కిదియే సమయము.

గీ॥ శరణవరణోక్తి కంటె నో వరద ! యధిక
తరము సులభము వాంఛితార్థప్రదంబు
లేదు సాధన మన్యంబు నాదు చెంత
(ఇదియె సమయంబు నీదు నిర్హేతుకృపకు.)
(పాఠాంతరము)
అవసరం బిదె తావకావ్యాజదయకు. 86

అవతారిక :— ఇట్లు పలుసారులు దయకే యుపాయత్వ మును జెప్పి తరువాత మంత్రరత్నముయొక్క యుత్తరఖండము నకు అర్థమైన కైంకర్యమును బ్రార్థింపఁ దలఁచి మొదట

కైంకర్య ప్రతిసంబంధి యగు భగవత్పాదార విందమునందు రుచిని బుట్టించుటయు నీ యధీనమే యను చున్నారు.

శ్లో॥ విషయవిషయిణీ స్పృహా భూయసీ
తవ తు చరణయో ర్న సాఽల్పాఽపి మే।
వరద ! నను భర స్తవైవ త్వయం
య దుత తవ పదస్పృహాజన్మ మే ॥ 87

ప్రతి :— హే వరద! = ఓ వరదరాజస్వామీ ! మే= నాకు, విషయవిషయిణీ=శబ్దాది విషయములను గుఱించిన, స్పృహా=కోరిక, భూయసీ = మిక్కిలి గొప్పది, తవ = నీ యొక్క, చరణయోః, తు=పాదములం దన్ననో, సా=ఆ కోరిక, అల్పా, అపి=స్వల్పముకూడ, న=లేదు, ఉత= లేనిచో (మఱేమి యనఁగా), తవ=నీయొక్క; పద, స్పృహా, జన్మ=నీ పాదములందుఁ గోరికను బుట్టించుట, యత్ =ఏది కలదో, అయమ్=ఇది, తవ, ఏవ =నీయొక్కయే, భరః, నను ?=భారము గదా !

విశేషములు :— భూయసీ— మిక్కిలి గొప్పది. అపరిచ్ఛిన్న మైనది. విషయము లసంఖ్యాతములు గనుకఁ దద్విషయక వాంఛలు కూడ నసంఖ్యాతము లని భావము. 'తవ తు చరణయో ర్న సాఽల్పాఽపి మే—

ఉదీర్ణసంసారదవాశుశుక్షణిం
క్షణేన నిర్వాప్య పరాం చ నిర్వృతిమ్ ।
ప్రయచ్ఛతి త్వచ్చరణా రుణాంబుజ
ద్వయానురాగా మృతసింధు శీకరః ॥

అని స్తోత్రరత్నమునఁ జెప్పిన ప్రకారము భగవత్పాదము లందలి యల్పమగు స్పృహ సైత మనిష్టనివృత్తి పూర్వక ముగా నిష్టముల నొసంగుటకు శక్తి కలది కావున 'అల్పాఽపి' అని మూలమునఁ జెప్పఁబడినది. భర స్త్వైవ— నీ పాదము లందు రుచి గలిగించుటయు నీ భారమే. నిర్హేతుక పరమ కారుణికుఁడవగు నీవే రుచిని గూడఁ గలిగింతువు అని భావము.

తా॥ ఓ వరదరాజస్వామీ! నాకు విషయముల మీఁద నభిరుచి యెంతయో కలదు. నీ పాదములయందు మాత్ర మది నలుసంతయు లేదు. కావున దేవరవారి పాదములం దభిరుచిని బుట్టించు భారము కూడ దేవరవారిదే.

గీ॥ విషయముల నాకు నభిరుచి విస్తృతంబు
లే దది రవంతయును నీదు పాదములను।
హస్తిభూధర శృంగవిహార! వరద
రాజ! దానినిఁ గూర్చు భారమును నీదె. 87

అవతారిక :— ఇట్లు నిరంతరము విషయాంతర ప్రణయ ప్రవణుఁడనగు నాకు భవద్దాస్యరసమున మునిఁగిపోవుచున్న సజ్జనులనోట మాఁగిన శరణాగతి వాణీపరిణతి అతిదయాళుఁడ వును విశేషముల గమనింపకయే యశేషజన శరణ్యుఁడవు నగు నీయొక్క యనుగ్రహ సుముఖతను బ్రకాశింపఁజేయు చున్న దని మనవి చేసికొనుచున్నారు.

శ్లో॥ ఇయ మిహ మతి రస్మదుజ్జీవనీ
వరద! తవ ఖలు ప్రసాదా దృతే।
శరణ మితి వచోఽపి మే నోదియాత్
త్వ మసి మయి తతః ప్రసాదోన్ముఖః॥ 88

ప్రతి :— హే వరద! = ఓ వరదరాజస్వామీ!, మే= నాకు, తవ=నీయొక్క, ప్రసాదాత్, ఋతే=అనుగ్రహము లేకుండ; శరణమ్, ఇతి, వచః, అపి=శరణు అను వాక్కు సైతము; న, ఉదియాత్, ఖలు = ఉదయించదు గదా, తతః = అందువలన, త్వమ్=నీవు, మయి = నాయందు, ప్రసాద, ఉన్ముఖః=అనుగ్రహమునకు సుముఖుఁడవు, అసి= అగుచున్నావు, ఇయమ్=ఈ, మతిః=బుద్ధి, ఇహ =ఇప్పుడు, అస్మత్, ఉజ్జీవనీ=మమ్ముల నుజ్జీవింపఁ జేయుచున్నది.

విశేషములు :— మే— విషయాంతరములందుఁ గోరికలు మెండుగాఁ గల నాకు అని భావము. 'శరణ మితి వచోఽపి'— వరద! శరణ మి త్యహం త్వాం వృణే— అను వాక్కు సైతము. అస్మదుజ్జీవనీ— మమ్ముల నుజ్జీవింపఁ జేయు చున్నది. నీవు మా నోట శరణాగతివాక్కును రప్పించుటచేత నీకు మా యందు అనుగ్రహము కలదని తెలియుచున్నది. కనుక నీవే మాకు నీ పాదములందు రుచిని గలిగించుదు వనియు నీ భారమంతయు నీవే వహింతువనియు విశ్వాసము మమ్ముల జీవింపఁజేయు చున్నది.

తా॥ ఓ వరదరాజస్వామీ! విషయ లంపటుఁడనగు నాకు మీ యనుగ్రహము లేనిదే శరణాగతివాక్కు గూడ నోట

వెడలదు. కనుక నీవు నా యెడలఁ బ్రసాదోన్ముఖుఁడ వగు చున్నావు. అనెడు ఈ బుద్ధి యిప్పుడు మమ్ముల నుజ్జీవింపఁ జేయుచున్నది.

గీ॥ లేక నీదయ శరణన్న వాకు నాదు
నోట వెడలదు కరిగిరికూటవాస!
మాకు సుముఖుఁడ వీ వన్నమతియె యిపుడు
దేవతారత్నమా! సముజ్జీవకంబు. 88

అవతారిక :— విషయాంతరములందు వాంఛ యున్నను మీ పాదపద్మలాభమున కవిరుద్ధముగా దానిని సైతము ప్రసాదింపుమని నుడువు చున్నారు.

శ్లో॥ వరద! య దిహా వస్తు వాంఛా మ్యహం
తవ చరణలభావిరోధ స్తతః।
యది న భవతి త చ్చ దేహి ప్రభో!
ఝటితి వితరపాద మే వా న్యథా॥ 89

ప్రతి :— హేవరద! ప్రభో! = ఓవరదరాజస్వామీ!, అహమ్=నేను, ఇహ=ఈలోకమున, యత్ = ఏవస్తువును, వాంఛామి = కోరుచున్నానో, తతః = దానివలన, తవ = నీయొక్క, చరణ, లభా, విరోధః=పాదముయొక్క లాభము నకు విరోధము (ఆటంకము) న, భవతి, యది= లేనియెడల, తత్ = ఆ, వస్తు, చ = వస్తువునుకూడ, దేహి = ఇమ్ము, అన్యథా=అట్లుకానిచో (నీపాదలాభమునకుఁ బ్రతిబంధకమైన

యెడల) ఝటితి = త్వరగా, పాదం, ఏవ = తమపాదమునే వితర = ఇమ్ము.

విశేషములు :— 'తచ్చ దేహి ప్రభో!' నీ పాదపద్మలాభమే నాకు ముఖ్యము. దానికిఁ బ్రతిబంధకము కాదేని వాంఛితవస్తువును సైతము కటాక్షింపుము. అని చకారమునకు భావము. ఝటితి వితర పాద మే వాన్యథా— నావాంఛ నీపాదలాభమునకుఁ బ్రతిబంధక మేని నీపాదమునే త్వరగా నిమ్ము. ఝటితి పదము 'తొందరగాఁ బాదారవిందము ననుగ్రహింపనిచో విరుద్ధవస్తు వాంఛయు స్వరూపహానిని గలిగించు' ననుభావమును వ్యక్తపఱుచు చున్నది. ఈ శ్లోకము రెండవపాదమునకు 'తనచ రణలా భావిరో ధ స్తతః' అను పాఠాంతరము గలదు. ఈ పాఠమున అర్థముపొసగక పోగా వృత్తభంగము గూడఁ గలుగును. ఇది గౌరీవృత్తదశకము లోనిది. 'నయుగ రయుగయుక్చ గౌరీ మతా' అనులక్షణమును బట్టి రెండునగణములు రెండురగణము లుండవలెను. పాఠాంతరమున రెండవగణము నగణము కావలసియుండగా సగణమగుచున్నది. 'లభా' అను రూపము డులభష్ = ప్రాప్తౌ' అను ధాతువుమీఁద షిత్త్వప్రయుక్త మగు అఙ్ ప్రత్యయము టాప్పరాఁగా సిద్ధించు చున్నది. కనుక— పాఠాంతర మనాదరణీయము. తచ్చదేహి— అనుచోట 'తత్ర దేహి' అనియుఁ బాఠాంతరము కలదు.

తా॥ వరదరాజమహాప్రభూ! నీచరణ లాభమునకుఁ బ్రతిబంధకము కాదేని నావాంఛిత వస్తువును గూడ దయచేయుము. అది ప్రతిబంధక మేని నీపాదపద్మమునే త్వరగాఁ గటాక్షింపుము.

ఉ॥ హాస్తిగిరీశ! తావకప
దాంబుజలాభవిరోధి గానిచో,
నిస్తులదివ్యరూప! యిట
నే మదిఁ గోరెడుదాని నిమ్మ, యా
వస్తువు త్వత్పదాబ్జసమ
వాప్తికి భంజక మంచు నెంచుచోఁ
గస్తిని బెట్ట కుండఁ బద
కంజము నే దయచేయుమా వడిన్. 89

అవతారిక :— దుర్వాసనావంచనచేత వంచితుఁడ నగు నాకు భగవత్పదలాభమునకు విరుద్ధమగు వస్తువును గూడ ననుగ్రహించి తన్మూలమునఁ గలుగు నపచారములనుగూడ క్షమింపుమని యీ శ్లోకమునఁ జెప్పుచున్నారు.

శ్లో॥ తదపి కిమపి హంత దుర్వాసనా
శతవివశతయా య దభ్యర్థయే।
త దతులదయ! సార్వ! సర్వప్రద!
ప్రవితర వరద! క్షమాంభోనిధే!॥ 89

ప్రతి :— అతులదయ! = సాటిలేని దయగలవాఁడా!, క్షమా, అంభోనిధే! = ఓర్పునకు సముద్రము వంటివాఁడా!, సార్వ! = సర్వజనహితుఁడా!, సర్వప్రద! = సకల ఫలప్రదుఁడా!,

వరద ! = ఓ వరదరాజస్వామీ !, తదపి = ఐనను, (నీశరణాగతికి విరుద్ధమైనను) హంత = అయ్యో !, దుర్వాసనా, శత, వివశతయా = వందలకొలఁది దుర్వాసనలకు (దుష్టములగు సంస్కారములకు) పరవశుఁడ నగుటచేత, కిమపి = అతి క్షుద్రమైనను, యత్ = దేనిని, అభ్యర్థయే = కోరుచున్నానో, తత్ = దానిని, ప్రవితర = తెగువతో నిమ్ము.

విశేషములు :— ఇందు శ్రీ వరదరాజస్వామి వారికి వేసిన సంబుద్ధు లన్నియు సాభిప్రాయముగాఁ బ్రయుక్తము లగుట చేత 'అలంకారః పరికర స్సాభిప్రాయే విశేషణే' అను లక్షణము ప్రకారము పరికరాలంకారము దుర్వాసనాశత వివశతయా— అసంఖ్యాతములగు దుర్వాసనలచేత వంచితుఁడ నగుటచేత నని భావము. ప్రవితర— దయాళుఁడ వగుటచేత నడిగినవన్నియు నిచ్చినను హితపరుఁడ వగుటచే దానఁ బ్రసక్తములగు దోషములను గూడ క్షమింపవలయు నని సంబోధనల యభిప్రాయము.

తా॥ నిరుపమ దయగలిగి, క్షమాసముద్రుఁడవై, సర్వజన హితుఁడవై, సకల ఫలప్రదుఁడవై యొప్పు శ్రీ వరదరాజ స్వామీ నీ శరణాగతికి విరుద్ధమైనను నేను దుర్వాసనా శతములకుఁ బరవశుఁడనై యేదేని క్షుద్రమగు వస్తువును గోరినను కటాక్షింపుము క్షమాంబుధివి గనుక దాసివలనఁ గలుగు నపచారముల క్షమింపుము.

చ॥ అతులదయా ! క్షమాగుణ మ
హార్ణవ ! సర్వజనీన ! లోకవాం
ఛిత ఘటనాచణా ! వరద !
చెడ్డదియే యగుతన్ కువాసనా
శతముల నీడ్వఁగాఁ బడుచు
స్వామి ! యెదేన్ నినుఁ గోరుకొన్నచో !
వితరణ మీఁజగా నొసఁగ
వే ! యపచారములన్ క్షమించుచున్. 90

అవతారిక :— ఇది యనుగ్రహింపు మిది వలదని చెప్పు టయు దేవరవారి యందు భరన్యాస మొనర్చిన నాకు యుక్తము గాదను చున్నారు.

శ్లో॥ ప్రియ మితర దథాఽపి వా య ద్యథా
వితరసి వరదప్రభో ! త్వం హి మే ।
తదనుభవన మేవ యుక్తం తు మే
త్వయి నిహితభరోఽస్మి సోఽహం యతః ॥ 91

ప్రతి :— హే వరదప్రభో ! = ఓ వరదరాజస్వామీ !, అథాఽపి = ఐనను, త్వమ్ = (స్వతంత్రుఁడవగు) నీవు, ప్రియం వా = ఇష్టమగు దానిని గాని, ఇతరత్, వా = అనిష్టమగు దానిని గాని, యత్ = దేనిని, యథా = ఏ ప్రకారముగా, మే = నా కొఱకు, వితరసి, హి = ఇచ్చెదవో, మే, తు = పరతంత్రుఁడనైన నా కన్ననో, తత్, అనుభవనమ్, ఏవ = దాని ననుభవించుటయే, యుక్తమ్ = ఉచితము, యతః =

ఎందుకనఁగా, సః, అహమ్=ఆ నేను, త్వయి=నీయందు, నిహిత, భరః=ఉంచఁబడిన భారము గలవాఁడను, అస్మి= అగుచున్నాను.

విశేషములు :— ఇతరత్— వా=ప్రియాత్ ఇతరత్— ప్రియమనఁగా ఇష్టము=తత్కాలమున సుఖమును గలిగించునది. దానికంటె నితర మనఁగా— అనిష్టము=కీడు. లేదా— హితము— ఉత్తరకాలమున సుఖమును గలిగించునది. త్వయి నిహితభరోఽస్మి— 'వరద ముఱుదయం గతిం త్వాం వృణే' అని భరన్యాస మొనర్చితిని. అందువలనఁ బ్రియమును గాని హితమును గాని నీ వనుగ్రహించిన దాని ననుభవించుటే నా విధి యని భావము. దీనితో గారీవృత్తదశకము ముగిసినది.

తా॥ ఓ వరదరాజస్వామీ! స్వతంత్రుఁడవగు నీవు ప్రియమునుగాని, హితమునుగాని, లేదా ఇష్టమునుగాని, యనిష్టమునుగాని, దేని నెట్లనుగ్రహింతువో దాని నట్లనుభవించుటయే నా కుచితము. ఏలయన నేను నీయందు 'వరద ముఱుదయం గతిం త్వాం వృణే' అని భరన్యాస మొనర్చితిని గదా!

చ॥ వరద! మహాత్మ! దంతిగిరి
వల్లభ! నీవు నిరంకుశుండవౌ
దొరవు, ప్రియంబొ! యప్రియమొ!
తోఁచినయట్టులు దేని నెట్లుగాఁ

దఱి గమనించి యిచ్చెదవొ !
దాని నటుల్ గుడువంగఁ జెల్లదే ?
శరణని నాదు భారమును
సర్వము నీపయి మోపితిన్ గదా ! 91

అవతారిక :— ఈ రీతిగా మంత్రరత్నోత్తర ఖండస్థ నమశ్శబ్దార్థభూతమగు భగవత్ప్రాప్తికి విరోధియగు స్వప్రవృత్తి నివృత్తిని స్వరూపమును బ్రతిపాదించి 'శ్రీమన్నారాయణాయ' అనుచోటఁ జతుర్థీ విభక్తికి అర్థమగు కైంకర్యమును బ్రార్థించుచు స్తోత్రమును బరిసమాప్తి యొనర్చుచున్నారు.

శ్లో॥ యథాఽసి యావానసి యోఽసి యద్గుణం
కరీశ ! యాదృగ్విభవో యదింగితః ।
తథావిధం త్వాఽహ మభక్తదుర్గ్రహం
ప్రపత్తి వాచైవ నిరీక్షితుం వృణే ॥ 92

ప్రతి :— కరీశ ! = ఓ కరిగిరినాథా ! త్వమ్ = నీవు, యః అసి = ఏవఁడవగుదువో, యద్గుణః అసి = ఎట్టిగుణములు కలవాఁడవగుచున్నావో, యథాఽసి = ఎట్టివిధములు గలవాఁడవో, యావాన్ అసి = ఎట్టి పరిమాణము గలవాఁడవో, యాదృక్, విభవః అసి = ఎటువంటి యైశ్వర్యము గలవాఁడవో, యత్, ఇంగితః అసి = ఎటువంటి వ్యాపారము గలవాఁడవో, తథావిధమ్ = అటువంటివియును, అభక్త, దుర్గ్రహామ్ = భక్తిలేని వారిచే గ్రహింప శక్యము గానట్టియు, త్వా = నిన్ను, అహమ్ = నేను, ప్రపత్తివాచా, ఏవ = శరణాగతి వాక్కు

తోనే, నిరీక్షితుమ్=సాక్షాత్కరింపఁ జేసికొనుటకు, వృణే=కోరుచున్నాను.

విశేషములు :— యోఽసి– 'సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ, హ్రీ శ్చ తే లక్ష్మీ శ్చ పత్న్యౌ– ఇత్యాది శ్రుతులచేఁ బ్రతిపాదింపఁబడిన సత్యత్వజ్ఞానత్వానంతత్వానందత్వామలత్వ శ్రియఃపతిత్వాదియత్స్వరూప నిరూపకగుణ నిరూపితుఁడవో!, యద్గుణోఽసి– 'పరాఽస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ' ఇత్యాదుల వర్ణింపఁబడిన జ్ఞాన శక్త్యాది యద్గుణవిశిష్టుఁడవో! యథాఽసి– 'యతో వా ఇమాని భూతాని జాయంతే యేన జాతాని జీవంతి– ఇత్యాదులలోఁ జెప్పఁబడినట్లు జగజ్జన్మాది కారణత్వాది రూప యత్ప్రకారకుఁడవో! యావానసి– 'అణో రణీయాన్ మహతో మహీయాన్– అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః'– ఇత్యాదులలోఁ జెప్పఁబడిన యెట్టి పరిమాణము గలవాఁడవో యావృగ్విభవోఽసి– 'పతిం విశ్వ స్యాత్మేశ్వరం శాశ్వతం శివ మచ్యుతమ్– త మీశ్వరాణాం పరమం మహేశ్వరం, తం దేవతానాం పరమం చ దైవతమ్–' ఇత్యాదులఁ బేర్కొనఁబడిన యెటి యైశ్వర్యము గలవాఁడవో! యదింగితోఽసి– ఇంగ = చలనే– అను ధాతువునుండి 'ఇంగిత' శబ్ద మేర్పడినది. ఇంగిత మనఁగా వ్యాపారము– 'అంతః ప్రవిష్ట శ్శాస్తా జనానాం సర్వాత్మా' 'యః పృథివ్యాం తిష్ఠన్ పృథివీ మంతరో యమయతి' ఇత్యాదులఁ జెప్పఁబడిన

యెట్టి చేతనాచేతన నియమనాది వ్యాపారములు గలవాఁడవో! తథావిధమ్— పై విధముగాఁ జెప్పఁబడిన (1) స్వరూప (2) గుణ (3) ప్రకార (4) పరిమాణ (5) విభవ (6) చేష్టిత విశిష్టుఁడవును, అభక్తదుర్గ్రహమ్— భక్తిలేనివారిచే గ్రహింప శక్యము గానివాఁడవును, 'భక్త్యాత్వనన్యయా శక్యః అహ మేవం విధోఽర్జున!' అన్నట్లు భక్తియోగైక సాక్షా త్కారుఁడవును అగు త్వా=నిన్ను (త్వామ్— అనుదాని రెండవరూపము) ప్రపత్తివా చైవ— శరణాగతివాక్కు చేతనే— ఏవకారము సహకార్యంతర వ్యావృత్తికై వేయఁబడినది. 'వరద మురుదయం గతిం త్వా వృణే' అని కేవల దయా విశిష్టునే సాక్షాదుపాయముగాఁ జెప్పుటవలన శక్తిగలవారికి దేవరవారి సాక్షాత్కార మున్నను నీవే యుపాయముగాఁ జెప్పుకొన్న నాకు స్వరూపగుణాది పరిపూర్ణుఁడవగు నిన్నుఁ గృపామాత్రమువలననే సాక్షాత్కరింపఁ జేయుమని నిష్కృ ష్టార్థము.

తా॥ కరిగిరినాథుఁడవైన యో వరదరాజస్వామీ! నీవెట్టి స్వరూపము, ఎట్టి గుణములు, ఎట్టి విధము, ఎట్టి పరిమాణము, ఎట్టి నియమనాది వ్యాపారములు, ఎట్టి వైభవములు గల వాఁడవో, భక్తిలేనివారి కందనియట్టి నిన్ను నేనొక్క ప్రపత్తి వాక్కుచేతనే సాక్షాత్కార మొనర్పఁ గోరు చున్నాను.

ఉ॥ ఎట్టిస్వరూపమో! గుణము
లెట్టివొ! యెట్టి ప్రమాణమో! విధం
బెట్టిదొ! యెట్టి వ్యాపృతులొ!
యెట్టి మహావిభవంబొ! యున్న దు
న్నట్టుగ నిన్నుభక్తులకు
నందనివానిఁ బ్రపత్తివాణినే
గట్టిగఁ జూడఁగోరుదును
గన్నుల పండువుగాఁ గరీశ్వరా! 92

అవతారిక :— 'నిరీక్షితుం వృణే' అని చెప్పుటవలన సాక్షాత్కారమునే సాక్షాత్ఫల మనుకొందు రేమో యని శంకించుకొని సాక్షాత్కారానంతర భావి యగు దాస్యమే ముక్తిఫలమని నుడువు చున్నారు.

శ్లో॥ అయే! దయాళో! వరద! క్షమానిధే!
విశేషతో విశ్వజనీన! విశ్వద!
హితజ్ఞ! సర్వజ్ఞ! సమగ్రశక్తిక!
ప్రసహ్య మాం ప్రాపయ దాస్య మేవ తే॥ 93

ప్రతి :— దయాళో! = దయాస్వభావము గలట్టియు, క్షమానిధే! = ఓర్పునకు గనివంటియు, విశేషతః = మిక్కిలి, విశ్వజనీన! = అందఱకు హితాభిలాషి యైనట్టియు, విశ్వద! = సమస్తము నిచ్చునట్టియు, హితజ్ఞ! = హిత మేదో తెలిసినట్టియు, సర్వజ్ఞ! = సర్వము నెఱిఁగినట్టియు, సమగ్రశక్తిక! = పరిపూర్ణశక్తి గలిగినట్టియు, అయే వరద! = ఓ వరదరాజ

స్వామీ! మామ్=నన్ను, ప్రసహ్య=ఇతరములను మాం పించి, తే=నీయొక్క, దాస్యమ్, ఏవ=సేవనే, ప్రాపయ= పొందింపుము.

విశేషములు:— అయే— ఇది సంబోధనార్థకమగు అవ్యయము. దయాళో!— ఉపాయాంతర రహితమగు కేవల దయయే యుపాయమని సూచించుటకీ శబ్దము ప్రప్రథమమునఁ బ్రయోగింపఁబడినది. క్షమానిధే!— ఈ పదము వరదరాజ స్వామి సర్వాపరాధ సహిష్ణు వని చాటును. స్వామి ఎవని యందు దయ గలిగియుండునో వాని యశేషదోష రాశిని క్షమావిషయ మొనర్చునని భావము. విశ్వద!— సకల ఫలప్రదుఁడా! ప్రసహ్య— ఫలాంతరములఁ బొందవలె నను తలంపును నిగ్రహించి (పోఁగొట్టి) తే— శ్రీమన్నారాయణుఁడ వగు నీ యొక్క— ఈ శ్లోకమున— దయాళో, క్షమానిధే, అను పదద్వయముచేత మంత్రరత్నములోని శ్రీమ చ్ఛబ్దము వివరింపఁ బడినది. ఎట్లన? దయాశబ్దము శ్రీదేవిని జెప్పును. 'దేవ్యా కారుణ్యరూపయా'— క్షమాశబ్దము భూదేవిని జెప్పును. 'సాక్షాత్ క్షమామ్' అని అభియుక్తోక్తి. సర్వజ్ఞ, సమగ్ర శక్తి, కేత్యాది సంబుద్ధి పదములచే నారాయణ శబ్దార్థము, 'దాస్యం ప్రాపయ' అను దానిచేత 'చతు'ర్థ్యర్థము, 'ప్రసహ్య' అనుల్యాబంతా వ్యయముచేత 'నమ' శ్శబ్దార్థము వివరింపఁబడి నందువలన మంత్రరత్నోత్తర వాక్యము చక్కగా విశదీకరింపఁ బడిన దని సాంప్రదాయికుల మార్గము.

తా॥ దయాళూ! క్షమానిధీ! విశేషముగా సమస్త జనముల హితమును గోరు దేవా! సమస్తఫలప్రదా! హితజ్ఞా! సర్వజ్ఞా! సమగ్రశక్తియుక్తా! ఓ వరదరాజస్వామీ! నా మనస్సు నన్యముల మీఁదికిఁ బోనీక నిగ్రహించి నాకు నీ దాస్యము ననుగ్రహింపుము.

గీ॥ ఓ దయాళూ! క్షమానిధీ! ఓ సమగ్ర
శక్తియుత! విశ్వజనహిత! సర్వఫలద!
వరద! సర్వజ్ఞ! హితకర! వాంఛ లుడిపి
నన్ను నీ పదదాస్యంబునకు మరల్పు. 93

అవతారిక :— కేవల దయయే యుపాయమని పలు సారులు చెప్పిన విషయమునే ఉక్తలక్షణ దాస్యరూప ఫల ప్రార్థనా దశయందుఁ గూడ విశేషించి ప్రకాశింపఁ జేయు చున్నారు.

శ్లో॥ స్వకైః స్వకైః స్వైః శ్చరితైః స్వవేదనాత్
భజంతి యే త్వాం త్వయి భక్తితోఽభవా।
కరీశ! తేషా మపి తావకీ దయా
తథాత్వకృత్ సైవ తు మే బలం మతమ్॥ 94

ప్రతి :— హే కరీశ! = ఓ కరిగిరినాథా!, యే = ఏ చేతనుల, స్వకైః = స్వీయములగు, గుణైః = ప్రపత్తికి అంగభూతములగు గుణములచేతను, స్వైః = స్వకీయములగు, చరితైః = ప్రవర్తనల చేతను (సత్కర్మలచేతను— కర్మయోగముచేత నని భావము) స్వవేదనాత్ = స్వకీయమగు జ్ఞానముచేతను (జ్ఞానయోగము

చేతను) అథవా = మఱియు, త్వయి = దేవరవారియందు, భక్తితః=భక్తివలనను, (భక్తియోగముచేతను) త్వామ్= నిన్ను, భజంతి=సేవించుచున్నారో, తేషాం, అపి=వారికిఁ గూడ, తావకీ=నీసంబంధమగు, దయా= కృప, తథాత్వకృత్ = అటువంటి నిత్యకైంకర్యకారిణి, (భవతి=అగుచున్నది,) సైవ, తు=ఆ దయయే, మే=నాకు, బలమ్=బలముగా, మతమ్= తలఁచఁబడినది.

విశేషములు :— స్వకైర్గుణైః—

'మద్భక్తజనవాత్సల్యం పూజాయాం చానుమోదనమ్
మత్కథాశ్రవణే భక్తిః స్వరనేత్రాంగవిక్రియా ।
స్వయ మభ్యర్థనం చైవ మదర్థే డంబవర్జనమ్
మమానుస్మరణం నిత్యం యచ్చమాం నోపజీవతి ॥'

అని చెప్పఁబడిన వానిలోని అనుస్మరణ శబ్దమున కర్థములగు ప్రపత్త్యంగభూతములగు గుణములచేతను, లేదా— 'ఆనుకూల్యస్య సంకల్పః ప్రాతికూల్యస్య వర్జనమ్' ఇత్యాద్యాత్మవిశేషాంత గుణములచేతను, 'స్వై శ్చరితైః'— అని ముందు కర్మయోగాదులు చెప్పఁబడఁబోవుటవలన 'స్వకైర్గుణైః' అను చోటఁ బ్రపత్తిపరముగాఁ జెప్పుటయే యుచితము. స్వైశ్చరితైః— కర్మయోగముచేత స్వవేదనాత్— జ్ఞానయోగమువలన— త్వయి భక్తితః— భక్తియోగమువలన— భజంతి యే త్వామ్— ఎవరు ప్రపత్తి కర్మయోగజ్ఞాన యోగ

భక్తియోగరూపములగు సాధనలచేత నీ కైంకర్యమును జేయుదురో, 'తేషా మపి తావకీ దయా తథాత్వకృత్—' నిత్య కైంకర్యరూప మహాఫలమునకు సదృశముఖ్య హేతువు నీ దయయే యని నిశ్చితార్థము. 'ఏవ తు మే బలం మతమ్— 'ప్రపత్తివాచైవ నిరీక్షితుం వృణే' అను అనుసంధానము గల నాకును అదియే బలము.

తా॥ ఓ కరిగిరినాథా! ఎవరు ప్రపత్త్యంగములగు స్వీయ గుణములచేతను, కర్మజ్ఞానభక్తి యోగములచేతను, నిన్ను భజించెదరో, అట్టి చేతనులకును నీదయయే అట్టి నిత్య కైంకర్యమునకు నుపాయ మగుచున్నది అదియే నాకునుబలము.

చ॥ స్వగుణముల౯ స్వకీయ విల
సచ్చరితమ్ముల జ్ఞానయుక్తిచే
నగణిత భక్తియోగమున
హాస్తిగిరీశ! భజింతు రేరు ని౯
సుగుణుల కట్టి యాత్మపరి
శుద్ధుల కచ్చట నిత్యదాస్యదం
బగు భవదీయ సత్కృపయె
యయ్యది నాకు బలంబు శ్రీపతీ!

అవతారిక :— పై విషయమునే వివరించుచున్నారు.

శ్లో॥ యది త్వద్భక్తోఽప్యగుణోఽపి నిష్క్రియో
నిరుద్యమో నిష్కృతమవ్యకృతో న చ।
లభేయ పాదౌ వరద! స్ఫుటా స్తతః
క్షమాదయాద్యా స్తవ మంగళా గుణాః॥ 95

ప్రతి :— హే వరద!=ఓ వరదరాజస్వామీ! అభక్తః అపి=భక్తియోగము లేనివాఁడనైనను, అగుణః అపి=దాని కంగమగు జ్ఞానయోగము లేనివాఁడనైనను, నిష్క్రియః అపి=కర్మయోగము లేనివాఁడనైనను, నిరుద్యమః అపి= ఆనుకూల్యసంకల్పము ప్రాతికూల్యవర్జనము మొదలగు ప్రయత్నములు లేనివాఁడనైనను, న, నిష్కృతదుష్కృతః అపి, చ= ప్రాయశ్చిత్తము చేసికొనఁబడిన పాపములు కలవాఁడను కాక పోయినను, అహమ్= నేను, తవ=నీయొక్క, పాదౌ= పాదములను, లభేయ, యది=పొందుదు నేని, తతః=అందు వలన, క్షమా, దయా, ఆద్యాః=ఓర్పు, కృప, మొదలుగాఁ గల, తవ = నీయొక్క, మంగళాః = మంగళకరములగు, గుణాః=గుణములు, స్ఫుటాః=స్పష్టములైనవి, (భవేయుః= అగును.)

విశేషములు :— మంగళాః— అమంగళ వస్తువులకుఁ గూడ మంగళమును గలిగించునవి యని భావము. స్ఫుటాః= ప్రకటాః భవేయుః బాలురకుఁ గూడ స్పష్టములైన వగును. భక్త్యాదిరహితుఁడనగు నాకు భవదీయ పాదపరిచర్య ననుగ్రహింతువేని దయాదియుక్తుఁడవగు నీకు సిద్ధోపాయత్వము సిద్ధించునని భావము.

తా॥ ఓ వరదరాజస్వామీ! నేను భక్తియోగిని, జ్ఞాన యోగిని, కర్మయోగిని, గాకున్నను, ఆనుకూల్య సంకల్పము ప్రాతికూల్య వర్జనము మున్నగునవి లేనివాఁడనైనను పాప

ములఁ బ్రాయశ్చిత్తాదులచేతఁ బోఁగొట్టుకొననివాఁడ నైనను నాకు నీ పాదములు లభించినయెడల క్షమాదయాదులగు నీ కల్యాణగుణములు జగత్ప్రసిద్ధము లగును.

శా॥ లేకున్నన్ బదభక్తి, తద్గుణములున్
లేకున్న సత్కర్మముల్
లేకున్నన్, మఱి ప్రాతికూల్యమతియున్,
లేకున్న, పాపాదులన్
లేకుండన్ బొనరించు తత్ప్రతికృతుల్
లేకున్న, నీ పాదముల్
నాకుం గూర్చిన నీ దయాదిగుణ ర
త్నంబుల్ ప్రభూ! వెల్లడౌన్. 95

అవతారిక :— ఇట్లు కేవలము దయాదిసహితుఁడగు భగవానుఁడే యుపాయమని ప్రతిపాదించి స్వాభిలషిత కైంకర్యమునకు విళంబహేతువు లేదు కనుక వేగముగా దాని ననుగ్రహింప వేఁడుకొనుచున్నారు.

శ్లో॥ విలోకనై ర్విభ్రమణై రపి భ్రువోః
స్మితామృతై రింగితమంగళై రపి।
ప్రచోదిత స్తే వరద! ప్రహృష్టధీః
కదా విధాస్యే వరివస్యనం తవ॥ 99

ప్రతి :— హే వరద! = ఓ వరదరాజస్వామీ!, తే = నీయొక్క, విలోకనైః = చూపులచేతను, భ్రువోః = కనుబొమల యొక్క, విభ్రమణైః అపి = విలాసములచేతను, స్మిత,

అమృతైః = అమృతమువంటి చిఱునవ్వులచేతను, ఇంగిత, మంగళైః అపి= మంగళకరములగు హస్తచేష్టితాదులచేతను, ప్రచోదితః= ప్రేరితుఁడనై, ప్రహృష్టధీః=సంతోషించిన బుద్ధి గలవాఁడనగుచు, అహమ్= నేను, తవ= నీయొక్క, వరివస్యనమ్= శుశ్రూషను (దాస్యమును) కదా= ఎప్పుడు, విధాస్యే= చేయఁగలను ?

విశేషములు :— స్మితామృతైః- అమృతమువలె రస్యములగు మందహాసములచే విలోకనాదులే యత్యంతభోగ్యములుగా నుండుటచేత వానిచేతఁ బ్రేరణ మతిప్రీతిని గలిగించును. ప్రీతితోఁ జేయఁబడు కైంకర్యమే ప్రార్థనీయ మని భావము.

తా॥ ఓ వరద! రాజస్వామీ! దేవరవారి క్రేగంటి చూపులచేతను, భ్రూవిలాసముల చేతను, అమృతమువలె రస్యములగు మందహాసములచేతను, హస్తాది చేష్టల చేతను, ప్రేరితుఁడనై సంతోషముతో నీనిత్య దాస్యము నెన్నఁడు చేయఁగలనో గదా!

ఉ॥ చూపుల భ్రూవిలాసముల
సొంపులఁ గెంజిగురాకు మోవికిఁ
దాపునఁ జిందులాడెడు సు
ధాస్మితరోచుల నింగితమ్ములఁ
బ్రాపితదాసభావరుచి
భాగ్యుఁడనై భవదీయసన్నిధిఁ
నీపదసేవఁ జేయుటది
శ్రీగజనాథ! యదెన్నినాళ్ళకో! 96

అవతారిక :— దాస్య మొనర్చు మని నా కానతి యొసఁగుఁ డని వాక్కుతో సైతము ప్రేరణమును ప్రార్థించు చున్నారు.

శ్లో॥ విపశ్య విశ్వేంద్రియ తర్షకర్షిణీ
ర్మనస్థలే నిత్యనిఖాత నిశ్చలాః ।
సుధాసఖీ ర్హ స్తిప తే ! సుశీతలాః
గిరః శ్రవస్యాః శృణుయామ తావకీః ॥ 97

ప్రతి :— హే హ స్తిప తే ! = ఓ కరిగిరినాథా !, విపశ్య = (లోనికి) చొచ్చి, విశ్వ, ఇంద్రియ, తర్ష, కర్షిణీః = సమ స్తేంద్రియములకు అభిలాషను లిఖించు (ఉత్పాదించు) నట్టియు, మనఃస్థలే = హృదయమధ్యమునందు, నిత్య, నిఖాత, నిశ్చలాః = నిత్యము నాటఁబడినవి కనుకనే చలనము లేనట్టియు, సుధాసఖీః = అమృతమునకుఁ జెలికత్తె లైనట్టియు, సుశీతలాః = మిక్కిలి చల్లని వైనట్టియు, శ్రవస్యాః = చెవులకు హితము లైనట్టియు, తావకీః = నీసంబంధములగు, గిరః = వాక్కులను, శృణుయామ = విందుముగాక.

విశేషములు :— విశ్వేంద్రియతర్షకర్షిణీః— మిక్కిలి భోగ్యములగుటచే సర్వేంద్రియములను జొచ్చి యభిలాషను (ఇంకను వినవలయునను కోరికను) పుట్టించునవి. రూపాదులను గ్రహించు చక్షురాదులకు సైతము చెవుల మైనచో బాగుం డును గదా యనిపించునవి యని భావము. లేదా— ముక్తి దశయందు నొక్కొక్క యింద్రియమునకుఁ గూడ సర్వ

విషయగ్రహణ నైపుణ్యము సంభవించును గాన సర్వేంద్రియములకుఁ గూడ శ్రవణాకాంక్షను బుట్టించునవి యని తాత్పర్యము.

లేదా— సమస్తేంద్రియములఁదప్పిని దీర్చునవి యనియు నర్థముఁ జెప్పికొన వచ్చును. గిరః శ్రవస్యాః శ్రుణుయామ తావకీః— అత్యంతరస్యము లగు దేవరవారి కుశలప్రశ్న, కైంకర్యనిదేశరూపము లగు వచనములను ఎన్నఁడు వీనుల విందుగా విందు నను నుత్కంఠ యిందు గోచరించు చున్నది. అవతారదశలో సైతము అంతరంగపరిజనులగు సుమంత్రాక్రూరులచే 'ఆశయా యది వా రామః పునశ్శబ్దాపయే దితి' 'మా మక్రూ రేతి వక్ష్యతి' అను రఘునందన యదునందనుల వాక్యశ్రవణము గూడ నిచ్చట దృష్టాంతకోటికిఁ జేరును.

తా॥ ఓ వరదరాజస్వామీ! అతిభోగ్యము లగుటచే లోనఁ బ్రవేశించి సమస్తేంద్రియములకు నభిలాష నుత్పాదింపఁ జేయునట్టియు హృదయమున గట్టిగా నాటుకొను నట్టియు, అమృతమును బోలునట్టియు, సుశీతలము లైనట్టియు, వీనుల విందుగా నుండు దేవరవారి దాస్యాదేశము ననుగ్రహించు వాక్కుల విందుము గాక.

ఉ॥ మానుగఁ జొచ్చి యింద్రియ స
మాజమునం దభిలాషఁ బెంచి బల్
మానసమందు నాటుకొని
మాధురిలో నమృతంబు మించి యెం

తేనియు శీతలంబు లయి
యీావరివస్యను జేయు మన్న మా
వీనులవిందు నీనుడులు
విందును గాక కరీశ! వేగమే. 97

అవతారిక :— 'అహం సర్వం కరిష్యామి జాగ్రతః స్వపత శ్చ తే'- అన్నట్లు సదా సర్వకాల సర్వావస్థోచిత సర్వవిధ కైంకర్యాధికాసక్తిగల నీ పరిచారకుఁడను గావలయు నని యభిలషించు చున్నారు.

శ్లో॥ అశేషదేశాఖిలకాలయోగినీ
ష్వహం త్వవస్థా స్వఖిలా స్వనన్యధీః ।
అశేషదాస్యైకరతి స్తవాచరన్
కరీశ! వర్తేయ సదా త్వదంతికే ॥ 98

ప్రతి :— హే కరీశ! = ఓ వరదరాజస్వామీ! అశేష, దాస్య, ఏక, రతిః=సమస్తకైంకర్యములే ముఖ్యభోగముగాఁ గలవాఁడను కనుక నే, అనన్యధీః = ఇతరములందు భోగ్యతా బుద్ధిలేని, అహంతు = నే నన్ననో, అశేష దేశ, అఖిలకాల, యోగినీషు = సమస్త దేశములందు సమస్తకాలములందును సంబంధముగల, అఖిలాసు = సమస్తములగు అవస్థాసు = జాగరణ స్వప్నాద్యవస్థలయందు, తవ=నీయొక్క, కైంకర్యమ్ =సేవను) ఆచరన్ = చేయుచు, సదా=ఎల్లప్పుడు, త్వత్, అంతికే=నీ సన్నిధానమున, వర్తేయ=ఉందును గాక.

విశేషములు :— తవాచరన్— మూఁడవపాదము చివర గల దీనికి 'తదాచరన్' అని పాఠాంతరము గలదు. అప్పుడు తత్ = ఆ కైంకర్యమును, ఆచరన్ = చేయుచు అని యర్థము. యథాస్థిత పాఠమున ఆచరన్ అనుదానికి కర్మపదాధ్యాహారము చేయవలెను. పాఠాంతరమున ఆ శ్రమ లేదు.

తా॥ ఓ కరిగిరినాథా! సర్వవిధ కైంకర్యములే ముఖ్య భోగములుగాఁ గలవాఁడనై యనన్యబుద్ధినై సర్వదేశ సర్వకాలసర్వావస్థల యందు నీ కైంకర్యమునే చేయుచు నెల్లప్పుడు నీ సన్నిధిలోనే యుందును గాక.

మ॥ సకలంబుల్ భవదీయదివ్య వరివ
స్యల్ భోగ్యముల్ గాఁగ, నిం
చుకయున్ బుద్ధిని బోవ నీక విషయ
స్తోమంబుపై లోకనా
యక! సర్వత్ర సమస్తకాలముల స
ర్వావస్థలందున్ భవ
న్నికటంబందుఁ గరీశ! దాస్యరతినై
నే నుందుఁగా కెప్పుడున్. 98

అవతారిక :— 'యశ్చ రామం నపశ్యేత్తు యం చ రామో న పశ్యతి। నిందిత స్స వసే ల్లోకే స్వాత్మాప్యేవం విగర్హతే' ఇట్లు చెప్పఁబడిన ద్వయమునందును స్వామివారి యంగీకారసూచకమగు యవలోకనమునే మొదటఁ బ్రార్థించు చున్నారు.

శ్లో॥ ఇమం జనం హంత! కదాఽభిషేక్ష్యతే
త్వదక్షినద్యో ర్వరద! శ్రమాపహా।
అకృత్రిమ ప్రేమరస ప్రవాహజా
విసృత్వరీ వీక్షణవీచి సంతతిః ॥ 99

ప్రతి :— హే వరద! = ఓ వరదరాజస్వామీ! త్వత్, అక్షి, నద్యోః = తమ కన్నులనెడు నదులకు సంబంధించినట్టియు, అకృత్రిమ, ప్రేమ, రస, ప్రవాహ, జా = స్వాభావిక ప్రీతియనెడు రసప్రవాహమువలనఁ బుట్టినదియు (కనుకనే) శ్రమ, అపహా = సంసార తాపత్రయమును బోఁగొట్టునదియు, విసృత్వరీ = అంతటఁ బ్రసరించునదియు అగు, వీక్షణ, వీచి, సంతతిః = కటాక్షతరంగ పరంపర, ఇమమ్ = ఈ జనమ్ = జనుని (నన్ను) కదా = ఎప్పుడు, అభిషేక్ష్యతే = అభిషేకము చేయఁగలదో! హంత! = అయ్యో! (ఆకాల మింకను రాలేదు కాఁబోలు)

విశేషములు :— శ్రమాపహా— సంసారకాంతార సంచారమునఁ బొడమిన యలసటను బోఁగొట్టునది. విసృత్వరీ— నలువైపులఁ బ్రవహించునది. ఇమం జనమ్— తాపత్రయ సంతప్తుఁడ నగు నన్ను. కదాఽభిషేక్ష్యతే— కటాక్షామృత రససేకముచే నన్నుఁ గైంకర్యసామ్రాజ్యాధి పత్యమున నభిషిక్తుఁ జేయు మని భావము.

తా॥ ఓ వరదరాజస్వామీ! నీ కన్నులనెడు నదులకు సంబంధించినదియు, సహజప్రేమ యనెడు రసప్రవాహమున జనించినదియు, శ్రమలను దీర్చునదియు, నలువైపుల స్యందించు నదియు, నగు కటాక్షతరంగపరంపర సంసార తాపత్రయ తప్తుఁడ నగు న న్నెప్పుఁడు నీ దాస్యసామ్రాజ్యాధి పత్యమున నభిషేకించునో! అయ్యో! ఆ సమయము రాలేదా?

మ॥ సహజప్రేమరస ప్రవాహభవమై
 సంసారతాపత్రయా
పహమై యప్రహత ప్రసారరయ యా
 త్వన్నేత్రనద్యుత్థ దృ
గ్బహులోర్మిచ్ఛట దాస్యపీఠమున కో
 కర్యద్రి చూడామణీ!
ద్రుహిణస్తుత్య పదాబ్జ! నీవి నభిషి
 క్తుం జేయుంటి కెన్నఁడో! 99

శ్లో॥ సదాతనత్వేఽపి తదాతనత్వవ
 న్నవీభవత్ప్రేమ రసప్రవాహయా।
నిషేవితం త్వాం సతతోత్కయా శ్రియా
 కరీశ! పశ్యేమ పరశ్శతం సమాః॥ 100

ప్రతి :— హే కరీశ! = కరిగిరినాథుఁడవగు ఓ వరదరాజస్వామీ!, సదాతనత్వే అపి=నిత్యపరిచయ మున్నప్పటికిని, తదాతనత్వవత్ =క్రొత్తదానివలె, (ఎన్నఁడు పరిచయము లేని

దానివలె) నవీభవత్, ప్రేమ, రసప్రవాహాయా=క్రొత్తది అగుచున్న ప్రేమరసప్రవాహము గలది గనుకనే, సతత, ఉత్కాయా=ఎల్లప్పుడు ఉత్కంఠ (ఉత్సాహము) గల, శ్రియా=లక్ష్మీదేవిచేత, నిషేవితమ్=సేవింపఁబడిన, త్వామ్=నిన్ను, పరశ్శతమ్=వందలకుఁ బైఁబడిన, (వందలకొలఁది) సమాః=సంవత్సరములెల్ల, పశ్యేమ=చూతుము గాక.

విశేషములు :— తదాతనత్వవత్ — అపూర్వమువలె— సతతోత్కా— నిత్యానుభవ మున్నను ఉత్సుకచిత్త యగు నిషేవితమ్ = నిత్యము ననుభవింపఁబడిన (వరదరాజ విశేషణము) పశ్యేమ— లక్ష్మినిషేవితుఁడగు నారాయణ మూర్తిని నిరంతరము పరిచర్యచేయుట కొఱకు సాక్షాత్కారము చేసికొందు మని భావము.

తా॥ ఓ వరదరాజస్వామీ! నిత్యపరిచితులైనను పరిచయము లేనిదానివలె నపూర్వమై, ఎప్పటికప్పుడు నూతన మట్లు కనిపించు ప్రేమప్రవాహము గలదియై, సతతోత్సుకయైన లక్ష్మీదేవి భజింప నొప్పు నిన్ను నూఱేండ్లును గనుగొందుము గాక.

ఉ॥ ఎప్పుడుఁ జూడఁగాఁ బడున

దే యయినప్పటికిన్ స్వదీప్తిచే

నవ్వాడె చూడఁగాఁ బడిన
యట్టు లపూర్వగఁ దోఁచి నూత్నతన్
జెప్పిలఁ బ్రేమపూర మల
శ్రీ సతతోత్సుకతన్ భజింపఁగా
నొప్ప కరీశ! చూతుము ద
యోదధి! నిన్నుఁ బరశ్శతాబ్దముల్. 100

అవతారిక :— ఇట్లు మంత్రరత్నవివరణ భూతమును ప్రభూతవైభవోపేతము నగు వరదరాజస్తవమును బూర్తి చేయఁ దలఁచినవారై శ్రీ వైకుంఠ స్తవోపక్రమమందు 'యో నిత్య మచ్యుతపదాంబుజ యుగ్మ రుక్మవ్యామోహతః' అను శ్లోకమునందు 'రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే' ఇత్యాదికముచే భాష్యకార చరణ నళినయుగళ ప్రపత్తియే స్తోత్తారకముగా స్వీకరించి యుండుటవలననా ప్రపత్తినే శంకా పూర్వకముగా సర్వజ్ఞుఁడైనను భగవానునకు రెండుశ్లోకము లతో స్మరింపఁజేయు చున్నారు.

శ్లో॥ సమాహితైస్సాధు సనందనాదిభిః
సుదుర్లభం భక్తజనైరదుర్లభమ్ ।
అచింత్య మత్యద్భుత మప్రతర్క్యాణాం
వరప్రద! త్వత్పద మాప్నుయాం కథమ్ ॥ 101

ప్రతి— హే వరద! = ఓ వరదరాజస్వామీ!, సాధు= చక్కగా, సమాహితైః = సమాధినిష్ఠులగు, సనందనాదిభిః= సనందనుఁడు మొదలగు వారిచేత, సుదుర్లభమ్=బహుప్రయత్నలభ్యమును, భక్తజనైః = భక్తజనులచేత, అదుర్లభమ్= అతిసులభయత్నముచేఁ బొందఁదగినదియు, అచింత్యమ్ = చింతింప నలవికానిదియు, అప్రతర్క్యణమ్ = ఊహాలకందనిదియు, (కనుకనే) అత్యద్భుతమ్ = మిక్కిలి ఆశ్చర్యకరమగు త్వత్పదమ్ = వైకుంఠమనెడు నీస్థానమును, కథమ్ = ఎట్లు, ఆప్నుయామ్ = పొందుదును!

విశేషములు :— సనందనాదిభిః— ఆదిపదముచే సనకసనత్సుజాత ప్రభృతులు గ్రహింపఁబడుదురు. భక్తజనై రదుర్లభమ్— మహనీయవిషయకమగు ప్రీతిని భక్తి యందురు. (పూజ్యే ష్వనురాగో భక్తిః) 'అచ్యుతపదాంబుజయుగ్మరుక్మవ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే' అన్నట్లు భగవచ్చరణబద్ధప్రణయు లగు భావ్యకారాదులకు అతి సులభమును, అచింత్యమ్— ఇది యిట్టిదని చింతింప శక్యముకానిది. అప్రతర్క్యణమ్ = ఇటువంటిది గనుక— ఇట్లుండును అని యూహింప శక్యముకానిది. 'సహస్రశీర్షః పురుషః సహస్రాక్షస్సహస్రపాత్' భగవంతుఁడు సహస్రశిరములు గలవాఁడుగనుక ద్విసహస్రనేత్రములు ద్విసహస్రపాదములు కలిగియుండవలెను. అనుతర్కము లిచ్చటఁ జెల్లవని భావము. త్వత్పద

మాప్నుయాం కథమ్ ?— త్వత్పదప్రాప్తికి సాధనభూతములగు వానిలో నొకదానిని గూడ ననుష్ఠింపని నాకుఁ ద్వత్పదప్రాప్తి యెట్లు కలుగునని భావము. దీనితో వంశస్థదశకము ముగిసినది.

తా॥ ఓ వరదరాజస్వామీ! చక్కగా సమాధినిష్ఠులగు సనందనాదులకు సైతమత్యంతదుర్లభమును భక్తజనుల కతిసులభమును అచింత్యము నతర్క్యము నద్భుతమునైన నీ పరమపదము నెట్లు పొందుదును ?

ఉ॥ ధ్యానసమాధినిష్ఠు లగు
　　　తత్సనకాదులకుఁ సుదుర్లభం
బౌనెది, యేది భక్తులకు
　　　హస్తతలామలకాయమానమో!
దేని నచింత్య మూహాసమ
　　　తీతము నద్భుత మంచు నందురో!
దానిని ద్వత్పదంబు వర
　　　దా! యిఁక నే నెటు పొందువాఁడనో!

అవతారిక :— ఇప్పుడు శంకాపరిహారమునకు అనుష్ఠితాంశమును మనస్సునకుఁ దెచ్చుచు (జ్ఞప్తిచేయుచు) 'పితామహం నాథమునిం విలోక్య ప్రసీద మద్వృత్త మచింతయిత్వా' అని యామునాచార్యులవారు సెలవిచ్చినట్లు

రామానుజాంఘ్రిశరణోఽస్మి, తవేక్షణీయోఽస్మి, అని స్తోత్రమును ముగించుచున్నారు.

శ్లో॥ రామానుజాంఘ్రి శరణోఽస్మి కులప్రదీప
స్త్వాసీ త్స యామునమునే స్స చ నాథవంశ్యః ।
వంశ్యః పరాంకుశమునే స్స చ సోఽపి దేవ్యా
దాస స్తవేతి వరదాస్మి త వేక్షణీయః ॥ 102

ప్రతి :—హే వరద ! = ఓ వరదరాజస్వామీ !, రామానుజాంఘ్రిశరణః = శ్రీరామానుజాచార్యులవారి పాదములే రక్షకములుగాఁ గలవాఁడను, అస్మి = అగుచున్నాను, సః తు = ఆ రామానుజయతి యన్ననో, యామునమునేః = మునియగు యామునాచార్యునియొక్క, కులప్రదీపః = వంశప్రకాశకుఁడు, ఆసీత్ = ఆయెను. సః, చ = ఆయామునమునియు, నాథవంశ్యః = నాథమునియొక్క వంశములోనివాఁడు, సః, చ = ఆనాథమునియు, పరాంకుశమునేః = పరాంకుశమునియొక్క, వంశ్యః = విద్యావంశమునఁ బుట్టినవాఁడు, సః, అపి = ఆ పరాంకుశమునియు, తవ = నీయొక్క, దేవ్యాః = దేవియగు లక్ష్మీదేవికి, దాసః = దాసుఁడు, ఇతి = అని తవ = నీకు, ఈక్షణీయః = కటాక్షింపఁ దగినవాఁడను, అస్మి = అగుచున్నాను.

విశేషములు :— 'రామానుజాంఘ్రిశరణోఽస్మి' నతు రామాంఘ్రిచరణోఽస్మి—నేను శ్రీరామానుజాంఘ్రిశరణుఁడను గాని రామాంఘ్రిశరణుఁడను కానని యర్థము. భావమేమనఁగా— 'సిద్ధి ర్భవతి వా నేతి సంశయోఽచ్యుతసేవినామ్। న సంశయోఽత్ర తద్భక్తపరిచర్యారతాత్మనామ్॥' భగవంతుని సేవించువారికి సిద్ధి కలుఁగవచ్చును. కలుగక పోవచ్చును. భగవద్భక్తుల పరిచర్యయం దాసక్తమగు మనస్సు గలవారికి సిద్ధికలుగు విషయమున సంశయమే లేదు. సిద్ధి కలిగియేతీరును. అన్నట్లు భగవద్భక్తులగు శ్రీరామానుజుల పాదములే శరణముగాఁ గల నాకు సిద్ధి తప్పదని యాశయము. ఈ శ్లోకమున స్వాచార్యసంప్రదాయశుద్ధి వివరింపఁ బడినది. సోఽపి దేవ్యా దాస స్తవ— శ్రీ పరాంకుశమునియు సర్వజనజననియు 'దేవ్యా కారుణ్యరూపయా' అన్నట్లు దేవరవారి కరుణావతారమగు గృహిణియునైన శ్రీదేవికి దాసుఁడు. ఈ పరంపరకుఁ జేసిన మేలు భార్యాముఖోల్లాసహేతు వగు నని గూఢాభిప్రాయము. 'యస్యా వీక్ష్య ముఖం తదింగిత పరాధీనో విధత్తేఽఖిలమ్— శ్రీ స్తవము.

ఇతి— ఈ హేతువువలన తవ, ఈక్షణీయః అస్మి— నీకుఁ గటాక్షింపఁ దగినవాఁడ నగు చున్నాను.

శ్రీవత్సాంకమిశ్రుల విద్యావంశపరంపర

|

భగవపతుని కరుణావతారమగు శ్రీదేవి

|

పరాంకుశముని

|

నాథముని

|

యామునాచార్యులు

|

శ్రీమద్రామానుజులు

### రామానుజాంఘ్రిశరణుఁడగు శ్రీవత్సాంకమిశ్రుఁడు

'న సంశయోఽస్తి తద్భక్తపరిచర్యారతాత్మనామ్' అన్నట్లు నాకు సిద్ధి తప్పదు గనుక నీ నిర్హేతుకకృపను నాపైఁ బ్రసరింపఁ జేయుమని వేఁడుచు శ్రీవత్సాంకమిశ్రులు గ్రంథమును బూర్తి చేసిరి. రామానుజాంఘ్రిశరణోఽస్మి– అనుచోట రామానుజార్యచరణోఽస్మి– అని పాఠాంతరము గలదు. ఇచ్చట చరణశబ్దము వేదశాఖావాచకము. 'చరణే బ్రహ్మచారిణి 6–3–86 అష్టాధ్యాయీ సూత్రమున– చరణః శాఖా– అని కౌముది–వేదప్రసిద్ధి రేవాత్ర మూలమ్–అని బాలమనోరమ. కనుక శ్రీరామానుజార్యులశాఖ గలవాఁడను. అని యర్థము.

తరువాతఁగూడ వారి విద్యావంశమే చెప్పఁబడియుండుటచే నీ పాఠాంతరపాఠమే యుక్తమని తోఁచుచున్నది.

చరణశబ్దము వేదశాఖాధ్యేతృపరముగా వ్యాకరణప్రసిద్ధము. 'గోత్రం చ చరణైః సహ' అనుచోట సిద్ధాంతకౌముది నారయుఁడు.

తా॥ ఓ వరదరాజస్వామీ! నేను రామానుజాచార్య చరణశరణాగతుఁడను. వారి విద్యావంశమునకుఁ జేరినవాఁడను. శ్రీమద్రామానుచార్యులు యామునమునివంశ ప్రదీపకులు. యామునాచార్యులవారు నాథమునివంశస్థులు. శ్రీనాథమునులు పరాంకుశుల సంబంధులు పరాంకుశులు కరుణావతార మగు దేవరవారి యర్ధాంగియైన శ్రీదేవికి దాసులు గాన దేవరవారికి నేను కటాక్షింపఁ దగినవాఁడను.

శా॥ శ్రీరామానుజ దేశికేంద్రపదరా
జీవావలంబుండ నేఁ,
ధీరుం డాయతి యామునాన్వయమణీ
దీపంబు, శ్రీయామునా
పారప్రజ్ఞుఁడు నాథవంశ్యుఁ, డతఁడో
పారాంకుశుం, డాతఁడున్
నీరామామణి కాశ్రితుం డని దయ
న్వీక్షింపు హస్తీశ్వరా!

క॥ పూర్ణప్రజ్ఞుండ సము
త్తీర్ణవ్యాకరణవారిధిని భక్తిరసో
దీర్ణ మగుదీనిఁ దెనుఁగునఁ
బూర్ణముఁ గావించినాఁడ బుధవరులారా!

ఉ॥ వైష్ణవ సంప్రదాయి కవి
వర్ణిత మీ కృతి విష్ణుభక్తివ
రిష్ణువు దాసశేషులు సు
ధీమణు లానతి యీయ దీనిపైఁ
దృష్ణను దీర్చుకొంటి నిటు,
తెల్గొనరించుచు, నేను మాధ్వుఁడన్
వైష్ణవులార! నాదు పొర
పాటులు గల్గినచో క్షమింపుఁడీ!

మ॥ తనకున్ ముక్తి కరస్థ మంచు భగవ
ద్రామానుజాచార్యుఁ డె
వ్వని సంబంధము మెచ్చి శాటి నెగురన్
వైచెన్ నభస్సీమ, కా
ఘనకూరేశులవాక్కుతోడఁ జిరసం
గం బబ్బె ధన్యుండ నై
తిని నీవే కృతిభర్త వౌటఁ గృతి నెం
తే రామచంద్రప్రభూ!

క॥ ఇది దాసశేషకృపచే
నొదవిన భాగ్యంబు నాకు నుపకారికినీ
సదయునకు నేమి గావిం
చెదఁ బ్రత్యుపకృతిని బ్రణతిఁ జేసెద భక్తిన్.

# గద్యము

ఇది సూర్యాంధ్రకాదంబరీ శతలక్షణీత్యాది బహుగ్రంథ రచనా
ధురీణ పాణినీయ పాథోనిధి విహరణపారీణ, కాశ్యపసగోత్ర
శ్రీకావేరీజగన్నాథాచార్యపుత్త్ర, నిజాంతేవాసి హృత్ప
ద్మరవి శ్రీదాసకుటీ కోదండరామ సంస్థానకవి, కవి
శేఖర, మహోపాధ్యాయ విద్యాలంకారసాహిత్య
రత్నేత్యాది బహుబిరుదాభిరామ పల్లెవంశాబ్ధి
సోమ బుధజనవిధేయ పూర్ణప్రజ్ఞనామధేయ
ప్రణీతభావాదర్శనామకాంధ్ర వివరణోపేత
శ్రీ శ్రీవత్సాంకవిరచిత పంచస్తవీ గ్రంథ
రత్నమునందు సుందరబాహు వరద
రాజ స్తవాత్మకమగు ద్వితీయ
సంపుటము సమాప్తము.

శ్రీ శ్రీ శ్రీ



సూర్యా ప్రెస్, తెనాలి.

శ్రీ హయగ్రీవాయనమః

# క్షే మ ము

పూజ్యులగు శ్రీదాస శేషస్వామివారి పాదపద్మముల సన్నిధికి నమస్కారోభయకుశలోపరి తాము పంపిన తిరుక్కోవలూరు మహాస్వామి శ్రీమాన్ ఆదివరాహాచార్యులవారి యుత్తర మును సాదరముగా బహుశ్రద్ధతోఁ బలుసార్లు పఠించితిని. కాని వారి యాక్షేపములు నాకు నచ్చలేదు. భావాదర్శ టిప్పణిలో నేను వ్రాసినదే ప్రమాణబద్ధమై యుచితముగా నున్నది. కావున వారి యుత్తరములోని ఆక్షేపముల కన్నిటి కిని నేను సమాధానమును వ్రాసి తమకుఁ బంపుకొనుచున్నాను. దీనిని తమరుగూడఁ జిత్తగించి తమ యిష్టానుసార మొనర్పుఁడు తమయాశీర్వాదము వలన నందఱము క్షేమముగా నున్నాము. నమస్కారములు.

భవదీయుఁడు

పశ్యపూర్ణ ప్రజ్ఞాచార్యులు.

# ఉత్తరమునకు - సమాధానము

సుందరబాహుస్తవము శ్లో - 8 పేజి 13 సహృదయు లీ శ్లోకమును నిష్పక్షపాతబుద్ధితోఁ దిలకింపఁ బ్రార్థన. ఈ శ్లోకమునకు నా భావాదర్శటిప్పణములోని యన్వయక్రమము తన కిష్టపడలేదని శ్రీమాన్ తిరుక్కోవలూరు మహాస్వామి ఆదివరాహాచార్యులవారు శ్రీ దాసశేషస్వామివారి కొక యుత్తరము వ్రాసియున్నారు. వారి కిష్టముగాని విషయము లివి యని తెలిపిరి.

1. సంగమాభిలాషి యగు మగయేనుగునకు చిక్కక పరుగెత్తు నట్టి యాడయేనుగునకు భగవంతుఁడు నిలువుమని యాజ్ఞ యిచ్చుట వాటికి సంగమము జరుగుట యనుచితము.
2. పవిత్రమగు క్షేత్రమాహాత్మ్యమును వర్ణించుట కసంగత మని తోచినది.
3. కూరనాథునివంటి వానప్రస్థుఁడు అట్లు వర్ణింపఁడని స్పష్టము ఇవి శ్రీ యాచార్యులవారి యాక్షేపములు.

1వ దానికి సమాధానము- సందేహము కలిగినప్పుడు వ్యాఖ్యానమును జూచుట ప్రాజ్ఞలక్షణము 'వ్యాఖ్యానతో విశేషప్రతిపత్తిర్న హి సందేహా దలక్షణమ్' అని శాస్త్ర మర్యాద.

ఆచార్యులవారు వ్యాఖ్యానము తటస్థింపకపోవుటచే నాకుఁ దోచినయన్వయమును వ్రాయుచున్నానని యుత్తరములోఁ

దెలిపిరి. తనకుఁ దోఁచినట్లు వ్రాయుట యంతసమంజసము కాదనుకొందును. నే నేవ్యాఖ్యానము ననుసరించితినో ప్రశ్నించిన సంతసించెడు వాఁడను. అట్లును జేయలేదు. పైఁగా నా తెలుఁగు టీకలో నే నెచ్చటను వాడని 'సంగమ' పదము నొకదానినిఁ దానే ప్రయోగించుచు 'ఏనుగులకు లోతగు నీటి యందే సంగమము సుప్రసిద్ధము' ఇత్యాదు లేవియో వ్రాసిరి. దానితో నాకవసరము లేదు. నేను పంచస్తవికి సంస్కృత వ్యాఖ్యాత లగు శ్రీ శ్రీనివాసాచార్య విద్వన్మణుల వ్యాఖ్యానము ననుసరించితిని. 'వశాకరిణోః ప్రణయకలహే కరిణ్యా ద్రుతగమనే ప్రస్తుతేసతి కరిణా (ణిం) న గచ్ఛేతి సుందరదోర్ద్వ్యాజ్ఞాయాం కృతాయాంకరిణీ కాతరా సతీ మందం గచ్ఛతి తతః కరీ తదనుసారీ భవ తీతి భావః' విస్తరము వ్యాఖ్యలోఁ జూచునది. దీనిభావము నే నిట్లు వివరించితిని. ఆ వనాద్రియందు గజమిథునమునకుఁ బ్రణయకలహము కలిగి యాడేనుఁగు కోపముతోఁ బరుగెత్తిపోవుచుండ మగయేనుఁగు వెంటనంట లేనితటి శ్రీ సుందరబాహు దేవుఁడు మగయేనుఁగును గనికరించి యాడేనుఁగును బాఱిపోవలదని శాసించును. అప్పుడది భయపడి మెల్లగాఁ బోవును. అది గమనించి మగయేనుఁగు దాని ననుసరించి స్వమనోరథమును తీర్చుకొనును. ఇట్లు గజదంపతులకుఁ బ్రణయకలహశాంతి కలుగును.' ఇందు నేను సంగమపద మెచ్చటను బ్రయోగింపలేదు. 'స్వమనోరథమును దీర్చుకొనును' అనుదానికి శ్రీ ఆచార్యుల వారభిప్రాయ

పడిరేమో ! ఆమనోరథ మేమనినఁ బ్రణయకలహశాంతి యని యనుపదమే యున్నది గదా ! ఈ ప్రణయకలహము లోతు నీటిలో సంగమించుటవలననే శాంతింప వలెనా ? మార్గాంతరములు లేవా ? చూడుఁడు

శ్లో॥ కేళిం కురుష్వ పరిభుంక్ష్వ సరోరుహాణి
గాహస్వ శైలతట నిర్ఝరిణీ పయాంసి ।
భావానురక్తకరిణీ కరలాలితాంగ !
మాతంగ ముంచ మృగరాజ రణాభిలాషమ్ ॥

అనురక్తభావ యగు కరిణి కరలాలనము గావించినచోఁ బ్రణయకోపము పటాపంచలై పోదా ? కరలాలనాదుల చేతనే స్వమనోరథమును దీర్చుకొనె నన్న ననుచితమేమున్నది ? భగవానుఁడు కరిణిని నిలువు మని శాసించుటయు నుచితము కాదని శ్రీ ఆచార్యులవారు సెలవిచ్చిరి. వనాద్రికిఁ బ్రభువై సర్వచరాచర వర్గమును శాసించు నాశ్రితవత్సలుఁడగు సుందర బాహుస్వామి భర్తతో జగడమాడి పాఱిపోవుచున్న కరిణిని ఆగుము భర్త ననుసరింపుము. అనుట ప్రభుధర్మము కాదా ? 'ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే, అన్న పరమాత్మ యిట్టి వ్యతిక్రమమును సహించునా ? కరివరదుఁడు కరిని గనికరింపఁడా ? భర్త ననుసరించుట భార్యకుఁ బరమ ధర్మమై యుండఁ దద్భిన్నముగాఁ బ్రవర్తించుకరిణిని సుందర బాహుస్వామి యట్లు శాసించుట ప్రతీపగామినులగు కామినుల కెల్ల నొకహెచ్చరికయై ఉత్తమధర్మము నుపదేశించుచు నెంతయు సముచితముగా నున్నది. దూరదృష్టి గలకవు లిట్లే

ధర్మబోధ మొనరింతురు. తనతో వనవాసమునకు సిద్ధపడిన సీతను మందలింపుమని రాముఁడు తమ్మునిఁ గోర భాసకవి లక్ష్మణుముఖమున నేమనిపించుచున్నాఁడో! యరయుఁడు.

శ్లో॥ అనుసరతి శశాంకం రాహుదోషేఽపి తారా,
పతతి చ వనవృక్షే యాతి భూమిం లతాచ।
త్యజతి న చ కరేణుః పంకలగ్నం గజేంద్రం
వ్రజతు చరతు ధర్మం భర్తృనాథా హి నార్యః॥
(ప్రతిమానాటకే)

గ్రహణకాలమున సైతము తార చంద్రు ననుసరించును, వన తరువు పడిపోఁగా దాని నాశ్రయించిన తీఁగెయుఁ బడిపోవును. బురదలోఁ గూరుకొని పోయినను గరీంద్రునిఁ గరేణువు విడనాడలేదు. అట్లే యీ సుశీలయు వనికివెళ్లి స్వీయధర్మము ననువర్తించుఁ గాక నారీమణులకు దిక్కు నాథుఁడేగదా ఈ ధర్మబోధ మెంత మనోహరముగా నున్నది? సమయము దొరకి నపుడెల్ల సత్కవులు నీతి నుపదేశింపక మానరు. అసలు కావ్యము నీతిబోధకే గదా 'కాంతా సమ్మితతయోపదేశయుజే' అని ఆలంకారికుల సూక్తి. ఇట్టి యవకాశమునే పుచ్చుకొని కవికులగురువు శ్రీ కాళిదాసు

శ్లో॥ శశినా సహ యాతి కౌముదీ
సహ మేఘేన తటి న్నిలీయతే।
ప్రమదాః పతివర్త్మగా ఇతి
ప్రతిపన్నం హి విచేతనైరపి॥ (కుమారసంభవే)

సతులు పతిమార్గ మనుసరింపవలె ననుట యచేతనములకు సైతమవగతమన్న నిఁకఁ జేతనులమాట చెప్పవలెనా!

యని సూచించుచు మఱొక్కఁడుగు ముందు వేయుట గమనింపఁ దగిన విషయము కనుకనే దూరదృష్టిగలిగి కవితాహృదయము నెఱింగిన కూరేశులు సుందరబాహు దివ్యాజ్ఞచేతఁ గరేణుఁపు నాపించి పడఁతులకు భర్తల ననువర్తించుట పరమధర్మ మను నీతిని బోధించుట సముచితమనియే నేను విశ్వసించుచున్నాను.

'చతుర్ణాం పురుషార్థానాం దాతా దేవ శ్చతుర్భుజః' అన్నట్లు వనాద్రియందు నాశ్రితులకుఁ జతుర్విధ పురుషార్థముల నొసఁగుటకుఁ జతుర్భుజములతో వెలసిన శ్రీసుందరబాహు మూర్తి ప్రణయకుపిత యగు భార్యవలనఁ దృతీయ పురుషార్థార్థి యగు నీయాశ్రితునకు నద్దాని ననుగ్రహించెనన్న నిం దనౌచిత్య మావంతయుఁ గానరాదు. వనగిరియందు వసించు ప్రాణివర్గమంతయు సనకాదిసదృశము కాదు గదా!

2 'పవిత్రమగు క్షేత్రమాహాత్మ్యమున నిట్టి వర్ణన మసంగతము' అను రెండవదానికి సమాధానము. కరిగిరి పవిత్ర క్షేత్రమే కదా! తన్మాహాత్మ్య మొక్కింత తిలకింపుఁడు. సర్వ విద్యాధిష్ఠానదేవత యగు సరస్వతి తనభర్త పరమేష్ఠి తన సపత్నియగు సావిత్రిని బ్రక్కనిడుకొని యజ్ఞ మొనర్చుచున్నాఁడని విని కుపితయై సహ్యాద్రినాశ్రయించి యజ్ఞస్థలమును ముంచివేయ వేగవతీనదియై ప్రవహింప భగవానుఁడగు నారాయణుఁ డా నదికి సేతువవలె నడ్డుపడి భక్తుఁడగు పరమేష్ఠి యజ్ఞమును గాచుట చదివియున్నాము. దీనిచేఁ గరిగిరిమహిమ తగ్గునా? అసంగతము మాత్ర మేమి కలదు?

అసంగతముల సంగత మొనర్చు దైవమట వెలయుటచేతనే కదా యది యొక క్షేత్రముగా గణనకెక్కుట– ఇట్టివి పై పెచ్చు మహాత్మ్యాపాదకములే యగును. కనుకనే వేదాంత దేశికులు ఈ పవిత్రవిషయమును తన హంససందేశమున 'పత్యౌ రోషాత్ సలిలవపుషో యత్ర వాగ్దేవతాయాః సేతు ర్జజ్ఞే సకలజగతా మేకసేతు స్స దేవః' అని ఉద్ఘాటించి యున్నారు. ఇట్టి వెన్నియో క్షేత్రమాహాత్మ్యముల నుండి చూపవచ్చును.

3 కూరనాథునివంటి వానప్రస్థుఁ డట్లు వర్ణింపఁడని స్పష్టము. అనెడు మూఁడవదానికి సమాధానము. శ్రీ కూరనాథుఁడు వానప్రస్థుఁ డనుటకు మా కెట్టి విప్రతిపత్తియు లేదు. అంతేకాదు. మహాభక్తుఁడు మహావిరక్తుఁడును. గురువులు పోరినను శ్రీ వరదరాజస్వాములను గన్నుల వేఁడని మహా విరాగులు. కాని వారి వర్ణనలకు వారి వృత్తమునకు సంబంధ మే మాత్రము లేదని నా యభిప్రాయము. పెద్దలయభిప్రాయము గూడ నదియే చూడుఁడు.

> 'నహి కవినా పరదారా ఏష్టవ్యా నాపిచోపదేష్టవ్యాః
> కర్తవ్యతయాఽన్యేషాం నచ తదుపాయోఽభిధాతవ్యః।
> కింతు తదీయం వృత్తం కావ్యాంగతయా స కేవలం వక్తి
> ఆరాధయితుం విదుషః తేన న దోషః కవే రత్ర ॥'
>
> (రుద్రటప్రణీతే – కావ్యాలంకారే)

అని రుద్రటుఁడు చెప్పిన విషయము సత్యము. ముమ్మాటికి సత్యము. కానిచో–

'అభిమతబహుబాహూః కాంతాభిరంభణ సంభ్రమే'

సుందర – 54

భార్యను కౌఁగిలించుకొనుటకు నాల్గు బాహువు లేమి చాలును. ఇంకను పెక్కు బాహువులుండిన బాగుండునని స్వామివా రభిలాషపడి రఁట. ఇది వానప్రస్థునినోట వచ్చు మాటయేనా ?

శ్లో॥ ఆశ్లేషే వరద! భుజా స్తవేందిరాయా
గోపీనా మభిమత రాసబంధనే వా ।
బంధే వా ముద మధికాం యశోదయాహో!
సంప్రాప్తా స్తవ నవనీతమోషదోషాత్ ॥ వరద – 43

ఉ॥ ఇందిర కౌఁగిలింత బిగియించిన యప్పుడొ! గోపసుందరీ
బృందము రాసగోష్ఠి నిను బిట్టుగఁ బట్టినయప్డొ, ఱోటికిన్
నందునిపత్ని దొంగవని నాఁడటు బద్ధు నొనర్చినప్పుడో!
అందె భవద్భుజంబులు ప్రహర్షము శ్రీకరిశైలభూషణా!

ఇది పరమవిరక్తుని పలుకేనా ?

'స్వాం ప్రేయసీం రమయితా వనశైలనాథః' సుం – 71

'సిరి నాత్మాంగనఁ జొక్కఁజేయు హరియా శ్రీసుందరుం డెప్పుడున్'

'వరదాఘ్రాత మభీష్టగోపికాభిః' వరద – 39

శ్లో॥ 'పద్మాయాః ప్రణయరసాత్ సమాసజంత్యాః' వరద – 41

ఇట్టివి పరమభక్తుని భాషితములా ? కావున వైరాగ్యాదులకు వర్ణనలకు సంబంధము లేదని నేను మొదటనే మనవి చేసికొంటిని. 'తేన న దోషః కవే రత్ర' అన్న రుద్రటుని సూక్తియే యథార్థము. కానిచో

శ్లో॥ ఆతోద్యాని విచిత్రాణి పరిష్వజ్య వరస్త్రియః
నిపీడ్య చ కుచై స్సుప్తాః కామిన్యః కాముకా నివ ॥

సుందర–సర్గ 10 – శ్లో–49

ఇత్యాది శ్లోకముల వ్రాసిన కవితాస్వాయంవర పతియగు ఆదికవి కాముకుఁడు కావలసినదేనా ?

కం॥ ఈ హేమంతము రాకకు
శ్రీహరి యొక్కింత వడఁకి చింతింపంగా
నోహో! వెఱవకు మని తా
మా హారికిని శ్రీకుచంబు లభయం బిచ్చెన్

భాగవతము 10 స్కం – 808

కం॥ కొడుకులు లేరని యొకసతి
కడు వగవఁగఁ దన్ను మగనిఁగాఁ గైకొని నం
గొడుకులు గలిగెద రని పైఁ
బడినాఁ డది రవ్వ శిశువ్రపను లే తల్లీ !

భాగవతము 10 స్కం – 319

పై పద్యముల వ్రాసిన భక్తపోతన బండబూతులకవి కావలసినదేనా ? అట్లనుటకు నెవరును సాహసింపఁ జాలరు.

దీనిచే మూఁడవ యాక్షేపమును సమాహితము. కాన శ్రీ శ్రీనివాస విద్వన్మణి వ్యాఖ్యానుసారి యగు మదీయ భావాదర్శ టిప్పణీప్రదర్శిత మగు నన్వయ క్రమమే ప్రమాణ బద్ధము సమంజసమునై యున్నదని మనవి. మఱియు శ్రీ యాచార్యులవారు తమ యుత్తరములో నిట్లు వ్రాసిరి. ‘ఈ స్తోత్రములో ఆరవశ్లోకము మొదలుపెట్టి 13 వ శ్లోకమువఱకు పర్వతమును వర్ణించుటలో వైష్ణవ నిష్ఠను, తల్లక్షణములను

ప్రధానముగ వర్ణించియున్నారు. కాబట్టి యీ శ్లోకమునకుఁ గూడ నట్టి యన్వయమునే సాధింపవలెను. ఈ నియమము నెవరు పెట్టిరి? 12 వ శ్లోకమువఱకే యేల కాకూడదు. శ్లోకమునకు సరళముగానగు నన్వయమును జెప్పుట సమంజసము గాని లేని యర్థమును బలవంతముగా సాధింపఁబూనుట సముచితము కాకపోఁగా 'బల్మిఁగోలు గావించిన విరసంబగు నటంచుఁ జెప్పిరి విబుధుల్' అన్నట్లు విరసమే యగును. శ్రీ ఆచార్యుల వారు సెలవిచ్చిన యర్థములో ఆజ్ఞాశబ్దమునకుఁ దమ యిష్టము వచ్చినట్లు బ్రహ్మచర్య కామవిజయాది రూపమగు ఆజ్ఞ యొక్క, అని యర్థము చెప్పుటయు, ప్రణయకలహాశబ్దము రూఢిచ్యుత మగుటయు, సుందరబాహుస్వామివారి యాజ్ఞ అభావముచే విరక్తమగు కిరీటుండు విఫలమగుటయు మున్నగు విషయములు నా మనస్సుకు నచ్చలేదు. నేను వ్రాసిన యర్థమునందే సుందరబాహుస్వామి దివ్యాజ్ఞ నిరాఘాటముగా సాగినది. దేవరవారి యాజ్ఞచేఁ బ్రణయకలహము చల్లారి ద్రుతగతి యగు కరిణి మందగమనయై పతి తన్నుఁ గలసికొన నవకాశమిచ్చి సతులు పతుల ననుసరింపవలయునను నుత్తమ ధర్మము నుపదేశించుచు విష్ణునాజ్ఞకు విధేయయై వైష్ణవ నిష్ఠను జాటినది.

శ్రీ ఆచార్యులవారి పరిచయము నాకు లేదు. వారియొద్దఁ బంచస్తవీ వ్యాఖ్యానము లేవేని ఉన్నచోఁ బ్రసాదించిన యెడల నందలి విశేషములను అనుబంధ పంచస్తవిలోఁ బ్రకటించి కృతజ్ఞతను దెలుపుకొందును.

ఇట్లు,
బుధజన విధేయుఁడు

11—11—1961

పళ్లెపూర్ణ ప్రజ్ఞాచార్యులు.

# పంచస్తవీ ద్వితీయ సంపుటము

## తప్పొప్పుల పట్టిక

### ప్రార్థనాదికము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 19 | 6 | ద్గ్రింథ-న్ | ద్గ్రింథ-న్ |

### సుందరబాహు స్తవము

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 9 | 22 | తదామ | తద్ధామ |
| 11 | 6 | వనిగిరి | వనగిరి |
| 15 | 8 | తగఖండ | తరుషండ |
| ,, | 13 | యత | యాత్ర |
| 16 | 21 | స్వామతత్ | స్వామతమ్ |
| 25 | 14 | ప్రకాశ్యసే | ప్రకాశసే |
| 33 | 11 | ఏవ | ఏవ |
| 34 | 6 | బ్రహ్మణము | బ్రాహ్మణము |
| ,, | 19 | ర్వామిత్వము | ర్వామిత్వము |
| 38 | 11 | కాశఇతితే | కాశతేఇతి |

34 35 38 39 రెండవతడవ ఈ అంకెలుగల పేజీలను
42 43 46 47 అని సరిచేసికొనవలెను.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 43 (35) | 7 | విదాదులకును | విందాదులకును |
| 57 | 3 | వెక్క | లెక్క |
| 59 | 3 | యాచరము | యాదరము |
| 61 | 6 | స్వరిత్రైః | స్వచరిత్రైః |
| 62 | 8 | జన్త్రైః | జనైః |
| 63 | 22 | శ్రుతుర్శైః | శ్రుతిర్శైః |
| 67 | 2 | సుందర | సుంద |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 79 | 20 | స్వాత్ | స్యాత్ |
| 81 | 14 | విలసర్వి | విలసద్వి |
| 83 | 11 | బాంగి | బాంది |
| 86 | 14 | ప్రశ్నోత్యతత్ | ప్రశ్నోచ్యతత్ |
| 102 | 15 | మూండింటి | మూఁడింటి |
| 105 | 3 | పోరుం | పోరుఁ |
| ,, | 12 | ప్రియాఽఉర్క | ప్రియోఽఉర్క |
| 123 | 2 | విక్రమద్వయే | ద్వయే |
| 130 | 15 | ఛ | చ |
| 142 | 14 | మాత్ర | మాత్రము |
| 149 | 2 | చున్నట్టిము | చున్నట్టియు |
| 151 | 16 | దీపించు | దీపింత్రు |
| 152 | 5 | పఠే | పదే |
| 154 | 6 | ఇత్యాద్యములఁ | ఇత్యాదులఁ |
| 161 | 18 | సరేశ్వరత్వ | సర్వేశ్వరత్వ |
| 166 | 19 | నీటెగల | నీటుగల |
| 171 | 12 | పురాఽభూత్ | పురాఽభూః |
| 176 | 19 | వింభిదానే | విభిందానే |
| 199 | 9 | వవాన్ | భవాన్ |
| 212 | 8 | భూమణముల్ | భామణముల్ |
| ,, | 15 | భస్మ | భ |
| 214 | 18 | కించమ్ | కించిత్ |
| 222 | 25 | తటి | ధవ |

# వరదరాజ స్తవము

## తప్పొప్పుల పట్టిక

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 3 | నిర్విఘ్న | నిర్విఘ్న |
| ,, | 13 | అభ్యదత్త | అభ్యధత్త |
| 15 | 12 | నిరుణమా | నిర్గుణమా |
| 15 | 18 | నివారించునున్నది | నివారించుచున్నది |
| 24 | 11 | యొక్లింగితిరి | యొక్లైటింగితిరి |
| 38 | 6 | సజీతీయుఁడు | సజాతీయుఁడు |
| 57 | 15 | కర్ణికా | కర్ణికా |
| ,, | ,, | కర్ణి | కర్ణ |
| 60 | 2 | భాహులక్ | బాహులక్ |
| 63 | 19 | శ్లిష | శ్లిష్ట |
| 64 | 5 | స్వామవారి | స్వామివారి |
| 77 | 2 | సంశ్లిష | సంశ్లిష్ట |
| 85 | 18 | విటవంబుల్ | విటపంబుల్ |
| 86 | 2 | రఖిభక్ష్చ | రబిభక్ష్చ |
| 86 | 3 | ముక్తా | ముక్తా |
| 93 | 2 | మహాత్మ్యం | మాహాత్మ్యం |
| 95 | 9 | ఆకిరణము | ఆకీర్ణము |
| 108 | 13 | పాదప్రవాహమ్ | పాదప్రవాదమ్ |
| 114 | 5 | ఇందు | ఇందుః |

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 117 | 21 | మార్గం | సర్గం |
| 124 | 3 | సృష్టివన | సృష్ట్యవన |
| 125 | 16 | పతే | పశే |
| 126 | 13 | స్వాత్వేతరం | స్వాత్వేతరం |
| 127 | 18 | భగరంతుఁడే | భగవంతుఁడే |
| 149 | 10 | నరమున | నరకమున |
| 159 | 22 | పౌణినినా | పాణినినా |
| 178 | 10 | యద్గుణం | యద్గుణః |
| 179 | 18 | రెుటి | రెుట్టి |
| 181 | 13 | క్షమానిభే | క్షమానిభే |
| 182 | 21 | మంత్రతరతోన్నర | మంత్రతరతోన్నత్తర |
| 194 | 14 | జేయుంటి | జేయుటిం |
| 201 | 7 | మిత్రుఁడు | మిత్రుఁడు |

